# శ్రీరామాయణాయోధ్యాకాణ్డఫలశ్రుతిః

పట్టాభిషేకసంభారా న్వసిష్ఠేన ప్రచోదితాన్,
శృణ్వ న్మహీపతి ర్భూత్వా స్థిరం రాజ్య మవాప్నుయాత్.
తురీయసర్గక మిదం బ్రహ్మావిష్ణుశివాత్మకం,
శృణ్వతాం సర్వపాపఘ్నం సంసారభయనాశనమ్.
వనవాసస్య సంఖ్యాయే త్వత్ర పంచమసర్గకం,
గాయత్ర్యా మానవ శ్రుత్వా సూర్యద్వారా త్పరం వ్రజేత్.
రాజా సత్యం చ ధర్మశ్చ త్వత్ర షష్ఠాక్షరం బుధః,
శ్రుత్వా దేవా న్సమాప్నోతి రాఘవస్య సరూపతామ్.
నిరీక్ష్య స ముహూర్తం త్విత్యత్ర దేవ్యా స్తు సప్తమం,
వర్ణం శ్రుత్వా ధూతపాపో రామసాయుజ్యమాప్నుయాత్.
రామః కృతార్థం భవతం సమాశ్వాస ముదాత్తవాన్,
ఇత్యాదిశ్రవణా త్పుంసాం వైరాగ్యం జాయతే భృశమ్.
[illegible]స్య మాతు శ్చ భరతస్య సుభాషితం,
[illegible]కార్యాణి సిద్ధ్యంత్యేవ న సంశయః.
రఘునాథ[illegible]దేన రామసాయుజ్యమాప్నుయాత్,
అత్రే శ్చ దర్శనం పశ్చా దనసూయాభిదర్శనమ్.
అనసూయా ప్రణామం చ పాతివ్రత్యస్తుతిం తథా,
సీతాకల్యాణసంప్రశ్నమంగరాగస్య చార్పణమ్.
శ్రుత్వా కన్యా సదా భర్త్రా రమతేఽరుంధతీ యథా
సాకేతకాణ్డస్య ఫలం వక్తుం [illegible]రపి.
న శక్యతే మహాదేవి! క్వచి త్కించి త్ప్రవచ్మ్యహం,
అయోధ్యాకాణ్డ మఖిలం యే శృణ్వన్తి నరోత్తమ
తే సర్వే హరిసాయుజ్యం ప్రాప్నువన్తి న సంశయః.

## స్మార్తాదీనాం సర్వేషాం శ్రీరామాయణపారాయణాపా కర్తవ్యపూజావిధానమ్.

ఆచమ్య, ప్రాణానాయమ్య, మమోపాత్త...శుభశోభనే ముహూర్తే అస్యాం శుభతిథౌ శ్రీసీతాలక్ష్మణభరతశత్రుఘ్నహనుమత్సమేత శ్రీరామచంద్రదేవతా ప్రీత్యర్థం యావచ్ఛక్తిధ్యానావాహనాదిషోడశోపచారపూజాం కరిష్యే. ఆదౌ నిర్విఘ్నేన పరిసమాప్త్యర్థం గణాధిపతిపూజాం కరిష్యే. తదంగత్వేన కలశపూజాం కరిష్యే. కలశపూజాం గణపతిపూజాంచ కృత్వా, వైదేహీసహితం సురద్రుమతలే హైమే మహామంటపే మధ్యేపుష్పకమాసనే మణిమయే వీరాసనే సుస్థితమ్, అగ్రే వాచయతి ప్రభంజనసుతే తత్త్వం మునిభ్యః పరం వ్యాఖ్యాంతం భరతాదిభిః పరివృతం రామం భజే శ్యామలమ్. తత శ్రీ[illegible]శోపరి శ్రీరామధ్యానావాహనాదిన[illegible]వేద్యాంతపూజావిధేయా. శ్రీరామచంద్రదేవతాయై నమః. ధ్యా[illegible] హనాదిషోడశోపచారపూజాం చ కృత్వా.

---

## శ్రీమద్రామాయణపారాయణారంభక్రమః.

సద్గురుసకాశాల్లబ్ధోపదేశో వక్ష్యమాణరీత్యా శ్రీరామాయణపారాయణం కుర్యాత్ - దేశకాలౌ సంకీర్త్య:—

అస్య శ్రీరామాయణమహామంత్రస్య వాల్మీకిర్భగవాన్ ఋషిః - అనుష్టుప్ఛందః - శ్రీసీతాలక్ష్మణభరతశత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచంద్రో దేవతా - రాం బీజం - శ్రీం శక్తిః మం కీలకం - మమ శ్రీసీతాలక్ష్మణభరతశత్రుఘ్నహనుమత్సమేత శ్రీరామచంద్రప్రసాదసిద్ధ్యర్థే పారాయణజపే వినియోగః

రాం అంగుష్ఠాభ్యాన్నమః - రీం తర్జనీభ్యాం స్వాహా - రూం మధ్యమాభ్యాం వషట్ - రైం అనామికాభ్యాం హుం - రౌం కనిష్ఠికాభ్యాం వౌషట్ - రః కరతలకరపృష్ఠాభ్యాంఫట్ - రాం హృదయాయ నమః-రీం శిరసే స్వాహా - రూం శిఖాయై వషట్-రైం కవచాయ హుం - రౌం నేత్రత్రయాయవౌషట్ - రః అస్త్రాయ ఫట్. లోకత్రయేణ దిగ్బంధః. ధ్యానం.—

కాలాంభోధరకాంతికాంత మనిశం వీరాసనాధ్యాసినం
ముద్రాం జ్ఞానమయీం దధాన మపరం హస్తాంబుజంజానుని,
సీతాంపార్శ్వగతాం సరోరుహకరాం విద్యున్నిభాం రాఘవం
పశ్యంతం మకుటాంగదాదివివిధాకల్పోజ్జ్వలాంగం భజే.

---

అథ మానసికపూజా.

లం పృథివ్యాత్మనే శ్రీరామచంద్రపరబ్రహ్మణే గంధం సమర్పయామి-హాం ఆకాశాత్మనే శ్రీరామచంద్ర పరబ్రహ్మణే పుష్పం సమర్పయామి - యం వాయ్వాత్మనే శ్రీరామచంద్ర పరబ్రహ్మణే ధూపమాఘ్రాపయామి - రం అగ్న్యాత్మనే శ్రీరామచంద్రపరబ్రహ్మణే దీపం దర్శయామి - వం అమృతాత్మనే శ్రీరామచంద్రపరబ్రహ్మణే అమృతోపహారం సమర్పయామి - సం సర్వాత్మనే శ్రీరామచంద్రపరబ్రహ్మణేసర్వోపచారపూజా సమర్పయామి - ఇతి మానసికపూజా.

మూలమంత్రః.—ధర్మాత్మా సత్యసంధశ్చ రామో దాశరథిర్యది, పౌరుషేచాప్రతిద్వంద్వశ్శరైనంజహి రావణిమ్.

ఇతి యథాశక్తి జపిత్వా శ్రీరామాయణపారాయణం కుర్యాత్. అనంతరం పునః ధ్యానం మానసికపూజాం హృదయాదిన్యాసం చ కుర్యాత్ - లోకత్రయేణ దిగ్విమోకః.

గుహ్యాతిగుహ్యగోప్తా త్వం గృహాణాస్మత్కృతం జపం,
సిద్ధిర్భవతు మే దేవ! త్వత్ప్రసాదా ద్రఘూద్వహ !.

## శ్రీ వైష్ణవానాం
## శ్రీమద్రామాయణపఠనోపక్రమానుసంధేయక్రమః.

ప్రథమతః 'శ్రీశైలేశ, శ్రీమాన్వేంకటే'త్యాది స్వస్వ సంప్రదాయనిర్వాహకాచార్యానుసంధానం, తతః 'లక్ష్మీనాథే' త్యారభ్య 'ప్రణతోఽస్మినిత్య'మిత్యన్తం, అనంతరం శ్రీశైల పూర్ణవిషయం, 'పితామహ'స్యేతి శ్లోకమారభ్య శ్రీభాష్యకార ప్రభృతిస్వాచార్యపర్యంతవిషయాః స్వసంప్రదాయికశ్లోకా అను సంధేయాః. యద్వా శ్రీధరాదిస్వాచార్యపర్యంతాః ప్రతిన్యస్తాః శ్లోకా అనుసంధేయాః. తతః—

కూజంతం రామ రామేతి మధురం మధురాక్షరమ్,
ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకికోకిలమ్.
వాల్మీకే ర్మునిసింహస్య కవితావనచారిణః,
శృణ్వన్ రామకథానాదం కో న యాతి పరాం గతిమ్.
యః పిబన్ సతతం రామచరితామృతసాగరమ్,
అతృప్త స్తం మునిం వందే ప్రాచేతస మకల్మషమ్.
గోష్పదీకృతవారాశిం మశకీకృతరాక్షసమ్,
రామాయణమహామాలారత్నం వందేఽనిలాత్మజమ్.
అంజనానందనం వీరం జానకీశోకనాశనమ్,
కపీశ మక్షహంతారం వందే లంకాభయంకరమ్.
మనోజవం మారుతతుల్యవేగం జితేంద్రియం బుద్ధిమతాం వరి ష్ఠమ్, వాతాత్మజం వానరయూథముఖ్యం శ్రీరామదూతం శిరసా నమామి.

ఉల్లంఘ్యసింధోః స్సలిలం సలీలం యశ్శోకవహ్నిం జనకాత్మజా యాః, ఆదాయ తేనైవ దదాహ లంకాం నమామి తం ప్రాంజలి రాంజనేయమ్.

ఆంజనేయ మతిపాటలాననం కాంచనాద్రికమనీయవిగ్రహమ్,
పారిజాతతరుమూలవాసినం భావయామి పవమాననందనమ్.
యత్రయత్ర రఘునాథకీర్తనం తత్రతత్ర కృతమస్తకాంజలిమ్,
బాష్పవారిపరిపూర్ణలోచనం మారుతిం నమత రాక్షసాంతకమ్.
వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే,
వేదః ప్రాచేతసా దాసీ త్సాక్షా ద్రామాయణాత్మనా.
తదుపగతసమాససంధియోగం సమమధురోపనతార్థవాక్య బద్ధమ్, రఘువరచరితం మునిప్రణీతం దశశిరసశ్చ వధం నిశామ యధ్వమ్. శ్రీరాఘవం దశరథాత్మజ మప్రమేయం సీతాపతిం రఘుకులాన్వయరత్నదీపమ్, ఆజానుబాహు మరవిందదళాయ తాక్షం రామం నిశాచరవినాశకరం నమామి.
వైదేహీసహితం సురద్రుమతలే హైమే మహామంటపే
మధ్యేపుష్పకమాసనే మణిమయే వీరాసనే సుస్థితమ్,
అగ్రే వాచయతి ప్రభంజనసుతే తత్త్వం మునిభ్యః పరం
వ్యాఖ్యాంతం భరతాదిభిః పరివృతం రామంభజే శ్యామలమ్.
తతో యథాశక్తి శ్రీకోశోపరి భగవదారాధనం కర్తవ్యమ్.

---

## పారాయణసమాపనక్రమః.

ఏవ మేతత్పురావృత్త మాఖ్యానం భద్ర మస్తు వః,
ప్రవ్యాహరత విస్రబ్ధం బలం విష్ణోః ప్రవర్ధతామ్.
లాభ స్తేషాం జయ స్తేషాం కుత స్తేషాం పరాభవః,
యేషా మిందీవరశ్యామో హృదయే సుప్రతిష్ఠితః.

కాలే వర్షతు పర్జన్యః పృథివీ సస్యశాలినీ,
దేశోఽయం క్షోభరహితో బ్రాహ్మణా స్సంతు నిర్భయాః.
కావేరీ వర్ధతాం కాలేఽకాలే వర్షతు వాసవః,
శ్రీరంగనాథో జయతు శ్రీరంగశ్రీశ్చ వర్ధతామ్.
స్వస్తిప్రజాభ్యః పరిపాలయంతాం న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః, గో బ్రాహ్మణేభ్య శ్శుభ మస్తు నిత్యం లోకాస్సమస్తా స్సుఖినో భవంతు.
మంగళం కోసలేంద్రాయ మహనీయగుణాబ్ధయే,
చక్రవర్తితనూజాయ సార్వభౌమాయ మంగళమ్.
వేదవేదాంతవేద్యాయ మేఘశ్యామలమూర్తయే,
పుంసాం మోహనరూపాయ పుణ్యశ్లోకాయ మంగళమ్.
విశ్వామిత్రాంతరంగాయ మిథిలానగరీపతేః,
భాగ్యానాం పరిపాకాయ భవ్యరూపాయ మంగళమ్.
పితృభక్తాయ సతతం భ్రాతృభి స్సహ సీతయా,
నందితాఖిలలోకాయ రామభద్రాయ మంగళమ్.
త్యక్తసాకేతవాసాయ చిత్రకూటవిహారిణే,
సేవ్యాయ సర్వయమినాం ధీరోదారాయ మంగళమ్.
సౌమిత్రిణా చ జానక్యా చాపబాణాసిధారిణే,
సంసేవ్యాయ సదా భక్త్యా స్వామినే మమ మంగళమ్.
దండకారణ్యవాసాయ ఖండితామరశత్రవే,
గృధ్రరాజాయ భక్తాయ ముక్తిదాయాస్తు మంగళమ్.
సాదరం శబరీదత్తఫలమూలాభిలాషిణే,
సౌలభ్యపరిపూర్ణాయ సత్త్వోద్రిక్తాయ మంగళమ్.
హనుమత్సమవేతాయ హరీశాభీష్టదాయినే,
వాలిప్రమథనాయాస్తు మహాధీరాయ మంగళమ్.

శ్రీమతే రఘువీరాయ సేతూల్లంఘితసిన్ధవే,
జితరాక్షసరాజాయ రణధీరాయ మంగళమ్.
ఆసాద్య నగరీం దివ్యా మభిషిక్తాయ సీతయా,
రాజాధిరాజరాజాయ రామభద్రాయ మంగళమ్.
మంగళాశాసనపరై ర్మదాచార్యపురోగమైః,
సర్వైశ్చ పూర్వై రాచార్యై స్సత్కృతాయాస్తు మంగళమ్
తతః పితామహాస్యేత్యాదయ స్స్వాచార్యాంతాశ్శ్లోకా అనుసంధేయాః.

---

## శ్రీస్తోత్రమఘ్యాదీనాం శ్రీరామాయణ పఠనోపక్రమానుసంధేయక్రమః.

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్,
ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వవిఘ్నోపశాంతయే.
వాగీశాద్యా స్సుమనస స్సర్వార్థానా ముపక్రమే,
యం నత్వా కృతకృత్యా స్స్యు స్తం నమామి గజాననమ్.
తతః శ్రీమచ్ఛంకరాచార్యాది గురుపరంపరాఽనుసంధేయా.
దోర్భిర్యుక్తా చతుర్భిస్స్ఫటికమణిమయీమక్షమాలాందధానా
హస్తేనైకేన పద్మం సిత మపి చ శుకం పుస్తకం చాపరేణ,
భాసాకుందేందుశంఖస్ఫటికమణినిభా భాసమానాఽసమానా
సా మే వాగ్దేవతేయం నివసతు వదనే సర్వదా సుప్రసన్నా.
కూజంతం రామరామేతి మధురం మధురాక్షరమ్,
ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకికోకిలమ్,
వాల్మీకే ర్మునిసింహస్య కవితావనచారిణః,
శృణ్వన్ రామకథానాదం కో నయాతి పరాం గతిమ్.
యః పిబన్ సతతం రామచరితామృతసాగరమ్,

అతృప్తస్తం మునిం వందే ప్రాచేతస మకల్మషమ్.
గోష్పదీకృతవారాశిం మశకీకృత రాక్షసమ్,
రామాయణమహామాలారత్నం వందేఽనిలాత్మజమ్.
అంజనానందనం వీరం జానకీశోకనాశనమ్,
కపీశ మక్షహంతారం వందే లంకాభయంకరమ్.
ఉల్లంఘ్య సింధో స్సలిలం సలీలం య శ్శోకవహ్నిం జనకాత్మజాయాః, ఆదాయ తేనైవ దదాహ లంకాం నమామి తం ప్రాంజలి రాంజనేయమ్.
ఆంజనేయ మతిపాటలాననం కాంచనాద్రికమనీయవిగ్రహమ్,
పారిజాతతరుమూలవాసినం భావయామి పవమాననందనమ్.
యత్ర యత్ర రఘునాథకీర్తనం తత్ర తత్ర కృతమస్తకాంజలిమ్,
బాష్పవారిపరిపూర్ణలోచనం మారుతిం నమత రాక్షసాంతకమ్.
మనోజవం మారుతతుల్యవేగం జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠమ్, వాతాత్మజం వానరయూథముఖ్యం శ్రీరామదూతం శిరసా నమామి.
యః కర్ణాంజలిసంపుటై రహరహ స్సమ్య క్పిబ త్యాదరా
ద్వాల్మీకే ర్వదనారవిందగలితం రామాయణాఖ్యం మధు,
జన్మవ్యాధిజరావిపత్తిమరణై రత్యంతసోపద్రవం
సంసారం స విహాయ గచ్ఛతి పుమాన్ విష్ణోః పదం శాశ్వతమ్.
తదుపగతసమాససంధియోగం సమమధురోపనతార్థవాక్యబద్ధమ్,
రఘువరచరితం మునిప్రణీతం దశశిరసశ్చ వధం నిశామయధ్వమ్.
వాల్మీకిగిరిసంభూతా రామసాగరగామినీ,
పునాతి భువనం పుణ్యా రామాయణమహానదీ.
శ్లోకసారసమాకీర్ణం సర్గకల్లోలసంకులమ్,

కాండగ్రాహమహామీనం వందే రామాయణార్ణవమ్.
వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే,
వేదః ప్రాచేతసా దాసీత్ సాక్షా ద్రామాయణాత్మనా.
వైదేహీసహితం సురద్రుమతలే హైమే మహామండపే
మధ్యేపుష్పక మాసనే మణిమయే వీరాసనే సుస్థితమ్,
అగ్రే వాచయతి ప్రభంజనసుతే తత్త్వం మునిభ్యః పరం
వ్యాఖ్యాంతం భరతాదిభిః పరివృతం రామంభజే శ్యామలమ్.
వామే భూమిసుతా పురశ్చ హనుమాన్పశ్చా త్సుమిత్రాసుత
శ్శత్రుఘ్నో భరతశ్చ పార్శ్వదళయో ర్వాయ్వాదికోణేషుచ,
సుగ్రీవశ్చ విభీషణశ్చ యువరాట్ తారాసుతో జాంబవా
న్మధ్యే నీలసరోజకోమలరుచిం రామం భజే శ్యామలమ్.
నమోఽస్తు రామాయ సలక్ష్మణాయ దేవ్యై చ తస్యై జనకా
త్మజాయై, నమోఽస్తు రుద్రేంద్రయమానిలేభ్యో నమోఽస్తు
చంద్రార్కమరుద్గణేభ్యః.
తతః శ్రీకోశోపరి శ్రీరామావాహనాది నైవేద్యాంతపూజా
విధేయా. పారాయణావసానే చ పునః పూజా కర్తవ్యా.

---

## పారాయణసమాపనసమయానుసంధేయక్రమః

స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం న్యాయ్యేన మార్గేణ
మహీం మహీశాః, గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం లోకా
స్సమస్తా స్సుఖినో భవంతు.
కాలే వర్షతు పర్జన్యః పృథివీ సస్యశాలినీ,
దేశోఽయం క్షోభరహితో బ్రాహ్మణాస్సంతు నిర్భయాః.
అపుత్రాః పుత్రిణ స్సంతు పుత్రిణ స్సంతు పౌత్రిణః.
అధనా స్సధనా స్సంతు జీవంతు శరదాం శతమ్.

చరితం రఘునాథస్య శతకోటిప్రవిస్తరమ్,
ఏకైక మక్షరం ప్రోక్తం మహాపాతకనాశనమ్.
శృణ్వ న్రామాయణం భక్త్యా యః పాదం పదమేవ వా,
స యాతి బ్రహ్మణ స్థానం బ్రహ్మణా పూజ్యతే సదా.
రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే,
రఘునాథాయ నాథాయ సీతాయాః పతయే నమః.
య న్మంగళం సహస్రాక్షే సర్వదేవనమస్కృతే,
వృత్రనాశే సమభవ త్తత్తే భవతు మంగళమ్.
య న్మంగళం సుపర్ణస్య వినతాఽకల్పయ త్పురా,
అమృతం ప్రార్థయానస్య త త్తే భవతు మంగళమ్.
మంగళం కోసలేంద్రాయ మహనీయగుణాత్మనే,
చక్రవర్తితనూజాయ సార్వభౌమాయ మంగళమ్.
అమృతోత్పాదనే దైత్యా న్ఘ్నతో వజ్రధరస్య యత్,
అదితి ర్మంగళం ప్రాదా త్తత్తే భవతు మంగళమ్.
త్రీ న్విక్రమాన్ ప్రక్రమతో విష్ణో రమితతేజసః,
య దాసీ న్మంగళం రామ! త త్తే భవతు మంగళమ్.
ఋతవ స్సాగరా ద్వీపా వేదా లోకా దిశ శ్చ తే,
మంగళాని మహాబాహో! దిశంతు తవ సర్వదా.
కాయేన వాచా మనసేంద్రియైర్వా బుద్ధ్యాఽఽత్మనా వా ప్రకృతే స్స్వభావాత్, కరోమి యద్య త్సకలం పరస్మై నారాయణాయేతి సమర్పయామి.

---

## శ్రీగాయత్రీరామాయణమ్

తపస్స్వాధ్యాయనిరతం తపస్వీ వాగ్విదాం వరమ్,
నారదం పరిపప్రచ్ఛ వాల్మీకి ర్మునిపుంగవమ్. ౧

స హత్వా రాక్షసాన్ సర్వాన్ యజ్ఞఘ్నాన్ రఘునందనః,
ఋషిభిః పూజిత స్సమ్య గ్యథేంద్రో విజయీ పురా. ౨.
విశ్వామిత్ర స్స ధర్మాత్మా శ్రుత్వా జనకభాషితమ్,
వత్స రామ ధనుః పశ్య ఇతి రాఘవ మబ్రవీత్. ౩
తుష్టావాస్య తదా వంశం ప్రవిశ్య స విశాంపతేః,
శయనీయం నరేంద్రస్య తదాసాద్య వ్యతిష్ఠత. ౪
వనవాసం హి సంఖ్యాయ వాసాంస్యాభరణాని చ,
భర్తార మనుగచ్ఛంత్యై సీతాయై శ్వశురో దదౌ. ౫
రాజా సత్యం చ ధర్మం చ రాజా కులవతాం కులమ్,
రాజా మాతా పితా చైవ రాజా హితకరో నృణామ్. ౬
నిరీక్ష్య స ముహూర్తం తు దదర్శ భరతో గురుమ్,
ఉటజే రామ మాసీనం జటావల్కలధారిణమ్. ౭
యది బుద్ధిః కృతా ద్రష్టు మగస్త్యం తం మహామునిమ్,
అద్యైవ గమనే బుద్ధిం రోచయస్వ మహాయశాః. ౮
భరతస్యార్యపుత్రస్య శ్వశ్రూణాం మమ చ ప్రభో,
మృగరూప మిదం వ్యక్తం విస్మయం జనయిష్యతి. ౯
గచ్ఛ శీఘ్ర మితో రామ సుగ్రీవం తం మహాబలమ్,
వయస్యం తం కురు క్షిప్ర మితో గత్వాఽద్య రాఘవ. ౧౦.
దేశకాలౌ ప్రతీక్షస్వ క్షమమాణః ప్రియాప్రియే,
సుఖదుఃఖసహః కాలే సుగ్రీవవశగో భవ. ౧౧
వంద్యాస్తే తు తపస్సిద్ధా స్తపసా వీతకల్మషాః,
ప్రష్టవ్యా శ్చాపి సీతాయాః ప్రవృత్తిం వినయాన్వితైః. ౧౨.
స నిర్జిత్య పురీం శ్రేష్ఠాం లంకాం తాం కామరూపిణీమ్,
విక్రమేణ మహాతేజా హనుమాన్ మారుతాత్మజః. ౧౩.

ధన్యా దేవాః సగంధర్వాః సిద్ధాశ్చ పరమర్షయః,
మమ పశ్యంతి యే నాథం రామం రాజీవలోచనమ్. ౧౪
మంగళాభిముఖీ తస్య సా తదాసీన్మహాకపేః,
ఉపతస్థే విశాలాక్షీ ప్రయతా హవ్యవాహనమ్. ౧౫
హితం మహార్థం మృదుపూర్వసంహితం వ్యతీతకాలాయతి
సంప్రతిక్షమమ్, నిశమ్య తద్వాక్య ముపస్థితజ్వరః ప్రసంగవా
నుత్తర మేత దబ్రవీత్. ౧౬
ధర్మాత్మా రక్షసాం శ్రేష్ఠః సంప్రాప్తోఽయం విభీషణః,
లంకైశ్వర్యం ధ్రువం శ్రీమా నయం ప్రాప్నోత్యకంటకమ్,
యో వజ్రపాతాశనిసన్నిపాతాన్న చుక్షుభే నాపి చచాల రాజా,
స రామబాణాభిహతో భృశార్తశ్చచాల చాపంచ ముమోచ వీరః
యస్య విక్రమ మాసాద్య రాక్షసా నిధనం గతాః,
తం మన్యే రాఘవం వీరం నారాయణ మనామయమ్. ౧౯
న తే దదృశిరే రామం దహంత మరివాహినీమ్,
మోహితాః పరమాస్త్రేణ గాంధర్వేణ మహాత్మనా, ౨౦
ప్రణమ్య దేవతాభ్యశ్చ బ్రాహ్మణేభ్యశ్చ మైథిలీ,
బద్ధాంజలిపుటా చేద ముచాచాగ్నిసమీపతః. ౨౦
చలనాత్పర్వతేంద్రస్య గణా దేవాశ్చ కంపితాః,
చచాల పార్వతీ చాపి తదాశ్లిష్టా మహేశ్వరమ్. ౨౨
దారాః పుత్రాః పురం రాష్ట్రం భోగాచ్ఛాదనభాజనమ్,
సర్వమేవావిభక్తం నో భవిష్యతి హరీశ్వర. ౨౩
యామేవ రాత్రిం శత్రుఘ్నః పర్ణశాలాం సమావిశత్,
తామేవ రాత్రిం సీతాఽపి ప్రసూతా దారకద్వయమ్. ౨౪
ఇదం రామాయణం కృత్స్నం గాయత్రీబీజసంయుతమ్,
త్రిసంధ్యం యః పఠేన్నిత్యం సర్వపాపైః ప్రముచ్యతే. ౨౫

## దేవతాప్రార్థనా

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్,
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే.
రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే,
రఘునాథాయ నాథాయ సీతాయాః పతయే నమః.

---

## వాల్మీకిప్రార్థనా

కూజంతం రామరామేతి మధురం మధురాక్షరమ్,
ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకికోకిలం.
వాల్మీకే ర్మునిసింహస్య కవితావనచారిణః,
శృణ్వన్ రామకథానాదం కో న యాతి పరాం గతిమ్.

---

## ఆంజనేయప్రార్థనా

అంజనానందనం వీరం జానకీశోకనాశనమ్,
కపీశ మక్షహంతారం వందే లంకాభయంకరం.
గోష్పదీకృతవారాశిం మశకీకృతరాక్షసం,
రామాయణమహామాలారత్నం వందేఽనిలాత్మజమ్.
మనోజవం మారుతతుల్యవేగం
జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠమ్,
వాతాత్మజం వానరయూథముఖ్యం
శ్రీరామదూతం శిరసా నమామి.

---

## శ్రీరామాయణప్రశంసా

శ్రీమద్బ్రహ్మ తదేవ బీజ మమలం యస్యాఙ్కుర శ్చిన్మయః
కాణ్డై స్సప్తభి రన్వితోఽతివితతో బుధ్యాలవాలోదితః,

పత్రై స్తత్త్వసహస్రకై స్సువిలసచ్ఛాఖాశతైః షడ్భి
శ్ఛాత్మప్రాప్తిఫల ప్రదో విజయతే రామాయణ స్స్వస్తరుః.
యః కర్ణాంజలిసంపుటై రహరహ స్సమ్య క్పిబ త్యాదరా
ద్వాల్మీకే ర్వదనారవిందగళితం రామాయణాఖ్యం మధు,
జన్మవ్యాధిజరావిపత్తిమరణై రత్యన్తసోపద్రవం
సంసారం స విహాయ గచ్ఛతి పుమా న్విష్ణోః పదంశాశ్వతమ్.
వాల్మీకిగిరిసంభూతా రామాంభోనిధిసంగతా,
శ్రీమద్రామాయణీగంగా పునాతు భువనత్రయం. 3

ఉమాసంహితాయాం ధర్మరాజం ప్రతి బ్రహ్మోక్తిః.

శ్రీరామప్రాతిపదిక మవశేనాపి సంగృణన్,
ముక్తిం ప్రాప్నోతి మనుజః కింపున ర్బుద్ధిపూర్వకమ్. ౪
రాశబ్దో చ్చారణా దేవ పాతకా దేహపఞ్జరాత్,
నిర్యా న్త్యాయా న్తి పాపాని మవర్ణాదర్శనాత్పునః. ౫
రాశబ్దో చ్చారణే జాతే వక్త్రా త్పాపం విగచ్ఛతి,
మకారశ్రవణే జాతే భస్మీభావం గమిష్యతి. ౬

తత్రైవ తృతీయాధ్యాయే ఉమాం ప్రతిశివోక్తిః.

రామేతి రామచంద్రేతి రామభద్రేతి వా మనుం,
యావజ్జీవం జపన్మర్త్యో జీవన్ముక్తో న సంశయః. ౭
రామాయణస్య మాహాత్మ్యం వక్తుం వర్షశతైరపి,
అశక్యం విస్తరా ద్వక్తుం సంక్షేపా ద్వచ్మి సాంప్రతమ్. ౮
రామాయణస్య వాక్యంవా పాదంవా పదమేవవా,
భక్త్యా న్తేతు ప్రయుంజానో బ్రహ్మభూయాయ కల్పతే. ౯
రామాయణకథామేవ యే శృణ్వంతి నరోత్తమాః,
విధూతపాపా స్తే యాన్తి బ్రహ్మలోక మనామయమ్. ౧౦

శ్రీః.

# శ్రీమద్రామాయణే - అయోధ్యాకాణ్డే

## ప్రథమస్సర్గః

గచ్ఛతా మాతులకులం భరతేన తదాఽనఘః,
శత్రుఘ్నో నిత్యశత్రుఘ్నో నీతః ప్రీతిపురస్కృతః. ౧

స తత్ర న్యవసద్భ్రాత్రా సహ సత్కారసత్కృతః,
మాతులేనాశ్వపతినా పుత్రస్నేహేన లాలితః. ౨

తత్రాపి నివసన్తౌ తౌ తర్ప్యమాణౌ చ కామతః,
భ్రాతరౌ స్మరతాం వీరౌ వృద్ధం దశరథం నృపమ్. ౩

రాజాఽపి తౌ మహాతేజాః సస్మార ప్రోషితౌ సుతౌ,
ఉభౌ భరతశత్రుఘ్నౌ మహేన్ద్రవరుణోపమౌ. ౪

సర్వ ఏవ తు తస్యేష్టా శ్చత్వారః పురుషర్షభాః,

శ్రీరస్తు

# అయోధ్యాకాండ తాత్పర్యము

## ప్రథమసర్గము

భరతుఁడు మాతులగృహంబునకుఁ బోవుచు నపుడు నిష్పాపుండును ఎల్లప్పుడుం బగతురఁ జంపువాఁడునగు శత్రుఘ్నునిం బిలువఁగా నతఁడు స్నేహంబుగలవాఁడు కావున నతని వెంబడించిపోయెను. ౧

అభరతుండు మాతులగృహంబున అశ్వపతియుం మాతులుండునగు యుంధాజిత్తుచే నానావిధసమ్మానంబుల సమ్మానింపఁబడుచుఁ బుత్రుండుంబోలె లాలింపఁబడుచుఁ దమ్ముండగు శత్రుఘ్నునితోఁగూడ సుఖంబుగానుండెను. ౨

అభరతశత్రుఘ్నులు సమస్తసౌఖ్యంబుల కిరవయిన మాతులగృహంబునందుండియుం నచ్చట మాతులుండు దాము కోరిన పదార్థంబులన్నియుం దమకొసంగి సంతోషంబు సేయుచున్నను, చాలఁ బితృభక్తి గలవారగుటం జేసి "మనతండ్రి దశరథమహారాజు వృద్ధుండు రాచకార్యంబులనేమి మఱి యితరకార్యంబులనేమి యెట్లు నెఱవేర్చుకొనుచుండునో మన కతని సేవించుట యిట్టికాలంబునందు లభింపదయ్యె" అని తలంచుచుండిరి. 3

లోకోత్తరులగుపుత్రుల నొందుటవలనం గలిగిన యధికమయిన కాంతి గల దశరథమహారాజును కొడుకులయం దతిప్రీతిగలవాఁ డగుటం జేసి రామలక్ష్మణులతోఁ గూడియున్నను దేశాంతరమునందున్న దేవేంద్రువరుణులకు సరివచ్చుకొడుకుల భరతశత్రుఘ్నుల నిద్దఱను ఏకరీతిగా స్మరించుచుండెను. ౪

ఆదశరథుఁడు పురుషోత్తములగు రామలక్ష్మణభరతశత్రుఘ్నులయందు నల్వురియందును లోకంబులయందు నాలుగుచేతులుగలవాఁడు దనకున్న

స్వశరీరాద్వినిర్వృత్తా శ్చత్వార ఇవ బాహవః. ౫

తేషా మపి మహాతేజా రామో రతికరః పితుః,
స్వయమ్భూరివ భూతానాం బభూవ గుణవత్తరః. ౬

స హి దేవై రుదీర్ణస్య రావణస్య వధార్థిభిః,
అర్థితో మానుషే లోకే జజ్ఞే విష్ణు స్సనాతనః. ౭

కౌసల్యా శుశుభే తేన పుత్త్రేణామితతేజసా,
యథా వరేణ దేవానా మదితి ర్వజ్రపాణినా. ౮

సహి రూపోపపన్నశ్చ వీర్యవాననసూయకః,
భూమా వనుపమ స్సూను ర్గుణై ర్దశరథోపమః. ౯

సచ నిత్యం ప్రశాన్తాత్మా మృదుపూర్వం తు భాషతే,
ఉచ్యమానోఽపి పరుషం నోత్తరం ప్రతిపద్యతే. ౧౦

కథంచి దుపకారేణ కృతే నైకేన తుష్యతి,
నస్మర త్యపకారాణాం శతమ ప్యాత్మవత్తయా. ౧౧

శీలవృద్ధై ర్జ్ఞానవృద్ధై ర్వయోవృద్ధైశ్చ సజ్జనైః,
కథయ న్నాస్త వైనిత్య మస్త్రయోగ్యాన్తరే ష్వపి. ౧౨

యన్ని చేతులయందు నేకరీతిగాఁ బ్రీతియుంచునట్లు ఏకరీతిగాఁ బ్రీతిగలిగియుండెను. ౫

భూతంబులలోపల బ్రహ్మదేవుం డధికగుణవంతుం డగునట్లు రాముం డానల్వురిలోపలను మిక్కిలియుం గుణవంతుండు మహాతేజుండుఁ గావునఁ దండ్రియగు దశరథునకు నతనియందె యధికంబుగాఁ బ్రీతిగలిగియుండెను. ౬

శాశ్వతుండగు విష్ణుదేవుండు వరబలంబున గర్వించియున్న రావణునిం జంపుటకొఱకు దేవతలచేఁ బ్రార్థింపఁబడి మనుష్యలోకంబున రాముండుగాఁ బుట్టెనుగదా !. ౭

అందఱికొడుకులలోపలను శ్రేష్ఠుండును నప్రమేయంబగు పరాక్రమంబు గలవాఁడునగు రామునిం బుత్త్రుఁగాఁ బడసి కౌసల్య దేవతాశ్రేష్ఠుం డగు నింద్రునిం గన్న యదితివోలెఁ బ్రకాశించెను. ౮

ఆరాముండు సౌందర్యముఁ గలిగి పరాక్రమశాలియయి అసూయలేనివాఁడై గుణంబుల దశరథునిం బోలుచు నిట్లు సమస్తగుణంబులు గలిగియుండుటంజేసి "ఇట్టికొడు కెవ్వరికిని లేఁ" డని యనం దగియుండెను. ౯

ఆరాముండు తనుఁ జూచి యెవ్వరేని పరుషముగా మాటలాడినను అతండు దానికి బదులు పరుషంబుగా నెంతమాత్రమును జెప్పఁడు. మఱియు నెల్లప్పుడును గోపంబులేని మనంబుగలవాఁ డగుటంజేసి తిన్నగానే యతనికిం జెప్పును. ౧౦

రాముండు తన కెవ్వండైన నేవిధముగానైనను ఒక్కమాఱుపకారంబు చేసెనేని దాని నెల్లప్పుడును సంతోషించియుండును. ఎవ్వఁడుగాని యెన్నియపకారములు చేసినను మంచిమనసుగలవాఁడు గావున వాని నెప్పుడును స్మరింపఁడు. ౧౧

ఆరాముండు ఎల్లప్పుడును అస్త్రాభ్యాసము సేయుకాలమువంటి యకాలమునందును సజ్జనులగు సదాచారసంపన్నులు మోక్షముఁగోరువారలుం ముదుసలులు వీరలతోఁగూడ సదాచారములను గుఱించియుం వేదాంతరహస్యంబులను గుఱించియుం సత్సంప్రదాయములను గుఱించియుం మాటలాడుచుండును.

బుద్ధిమా న్మధురాభాషీ పూర్వభాషీ ప్రియంవదః,
వీర్యవా న్నచ వీర్యేణ మహతా స్వేన విస్మితః. ౧౩

న చానృతకథో విద్వా న్వృద్ధానాం ప్రతిపూజకః,
అనురక్తః ప్రజాభిశ్చ ప్రజాశ్చాప్యనురజ్యతే. ౧౪

సానుక్రోశో జితక్రోధో బ్రాహ్మణప్రతిపూజకః,
దీనానుకమ్పీ ధర్మజ్ఞో నిత్యం ప్రగ్రహవాం శ్శుచిః. ౧౫

కులోచితమతిః క్షాత్రం ధర్మం స్వం బహుమన్యతే,
మన్యతే పరయా కీర్త్యా మహత్స్వర్గఫలం తతః. ౧౬

నాఽశ్రేయసి రతో విద్వా న్నవిరుద్ధకథారుచిః,
ఉత్తరోత్తరయుక్తౌ చ వక్తా వాచస్పతి ర్యథా. ౧౭

అరోగ స్తరుణో వాగ్మీ వపుష్మా న్దేశకాలవిత్,
లోకే పురుషసారజ్ఞ స్సాధు రేకో వినిర్మితః. ౧౮

రాముఁడు మంచిబుద్ధిగలిగి మధురంబుగా మాటలాడువాఁడై ఎట్టి నీచునితోనైనను దానె మున్ను మాటలాడుచుఁ బరుల కత్యాశ్చర్యంబు గలిగించు పరాక్రమంబు గలవాఁడైనను ఎంతమాత్రమును దనపరాక్రమంబునకు గర్వింపక యుండెను. ౧౩

రాముఁడు దబ్బఱలాడఁడు; పండితుఁడు; వృద్ధులకుఁ (బ్రాహ్మణులకు) బూజసేయువాఁడు; ప్రజలతనియందుఁ బ్రేమగల్గియుండిరి; అతండును బ్రజలయం దనురాగంబు గల్గియుండెను. ౧౪

రాముఁడు దయగలవాఁడు; కోపంబు జయించినవాఁడు; బ్రాహ్మణులం గన్నమాత్రమున నెదురొక్కని పూజించువాఁడు; దరిద్రులను జూచి నప్పుడె వారల దానమానాదుల నాదరించువాఁడు; ధర్మంబుల నెఱింగిన వాఁడు; ఎప్పుడును జలనంబులేని నియమంబు గలవాఁడు; పరధనంబు గోరఁడు. ౧౫

రాముండు తనకులంబునకుఁ దగినట్లు దయ, దాక్షిణ్యము, శరణాగత సంరక్షణము మొదలగువానియం దాసక్తంబగు బుద్ధిగలవాఁడు; తనక్షత్రియ ధర్మముకే యధికముగా నెంచును. తనక్షత్రధర్మము చక్కఁగా ననుష్ఠింపఁబడునేని దానివలననే, మహాకీర్తియు, స్వర్గంబును గల్గునని తలంచును. ౧౬

రాముఁడు పండితుండు కావున మంచిది కానివానియం దాసక్తుండు కాఁడు; ధర్మవిరుద్ధములయినమాటలు చెప్పఁడు; బృహస్పతివలె బదులుకు బదులు యుక్తులు చెప్పును. ౧౭

రాముండు వ్యాధియేమియు లేనివాఁడు; మంచియౌవనంబు గలవాఁడు; చక్కఁగా మాటలాడువాఁడు; దృఢంబగు దేహంబు గలవాఁడు; దేశకాలంబులకుఁ దగినట్లు నడువనేర్చినవాఁడు; చూచినమాత్రమున నె పురుషుని హృదయంబు గనుంగొనువాఁడు. లోకంబునందంతయు అపకారులపైఁ గోపంబులేని సాధు వితం డొకండె యని నిశ్చయింపఁబడెను. ౧౮

స తు శ్రేష్ఠైర్గుణై ర్యుక్తః ప్రజానాం పార్థివాత్మజః,
బహిశ్చర ఇవ ప్రాణో బభూవ గుణతః ప్రియః. ౧౯
సమ్యగ్విద్యావ్రతస్నాతో యథావ త్సాఙ్గవేదవిత్,
ఇష్వస్త్రే చ పితు శ్శ్రేష్ఠో బభూవ భరతాగ్రజః. ౨౦

కల్యాణాభిజన స్సాధు రదీన స్సత్యవా గృజుః,
వృద్ధై రభివినీతశ్చ ద్విజై ర్ధర్మార్థదర్శిభిః. ౨౧

ధర్మకామార్థత త్త్వజ్ఞః స్మృతిమా న్ప్రతిభానవాన్,
లౌకికే సమయాచారే కృతకల్పో విశారదః. ౨౨

నిభృత స్సంవృతాకారో గుప్తమన్త్ర స్సహాయవాన్,
అమోఘక్రోధహర్షశ్చ త్యాగసంయమకాలవిత్. ౨౩

దృఢభక్తి స్స్థిరప్రజ్ఞో నాసద్గ్రాహీ న దుర్వచాః,
నిస్తన్ద్రి రప్రమత్తశ్చ స్వదోషపరదోషవిత్. ౨౪

ఇట్లుత్తమంబులగు గుణంబులు గలిగియున్న రాముండు, తన గుణంబులచేఁ బ్రజలకు బైటనుండు ప్రాణంబుంబోలెఁ బ్రియుండుగా నుండెను.

ధరణిన తన్నయగు రాముండు చక్కఁగా వేదంబుల నధ్యయనించి వ్రతంబు లాచరించి స్నాతకమును జేసికొని శిక్షావ్యాకరణాది వేదాంగంబులను, వేదములను అర్థంబులతో తెలిసినవాఁడై విలువిద్యయందు నస్త్రంబులందుఁ దండ్రికన్న మెచ్చినవాఁడై యుండెను. ౨౦

రాముండు ఎప్పుడును మంగళంబులు గలవాఁడు (మంగళములుగల తలిదండ్రులకులంబులు గలవాఁడు); నిర్దోషుండు; ఎట్టియాపదలందును దైన్యంబు నొందనివాఁడు; ఎట్టికష్టమునందైనను సత్యమునే మాటలాడువాఁడు; వక్రబుద్ధిలేనివాఁడు, ధర్మార్థంబుల నెఱింగిన పెద్దలగు బ్రాహ్మణులచే శిక్షింపఁబడినవాఁడు. ౨౧

రాముండు ధర్మము గామము, నర్థము వీనిఁగాఁ జేదేది యెప్పు డెప్పుడు సేయవలయునో ఆచారనిర్ణయంబుల నెఱింగినవాఁడు; మఱపు లేనివాఁడు; వివాదమునందు క్రొత్తక్రొత్తగా వికాసము నొందుచుండు ప్రతిభ యనెడు బుద్ధివిశేషము గలవాఁడు; లౌకికంబగు సాంకేతికాచారంబువిషయమై యా న్యాయంబులఁ దెలిసినవాఁడు, పండితుడు. ౨౨

రాముండు వినయముగలవాఁడు; తనమనసునందుండు నభిప్రాయం బెవ్వరికిని దెలియనట్లు బొమముడి మొదలగు వికారంబుల నొందఁడు; అతండు సేయు నాలోచనంబు ఫలపర్యంతం బెవ్వరికిని దెలియదు; సహాయవంతుండు; అతనికోపముగాని సంతోషముగాని వ్యర్థముకాదు; ఎప్పుడు దాను దానము సేయవలయునో దాఁ బార్జించునది యెప్పుడో యట్టి కాలవిశేషంబులఁ దెలిసినవాఁడు. ౨౩

రాముండు పెద్దలయందు నిశ్చలంబగు భక్తిగలవాఁడు; మఱపులేని బుద్ధిగలవాఁడు; మంచిదికానివానిఁగాని దుష్టులఁగాని గ్రహింపఁడు; ఒకరి కప్రియంబగుమాటఁ జెప్పఁడు; ఆలస్యంబును నేమఱుపాటు లేనివాఁడు;

శాస్త్రజ్ఞశ్చ కృతజ్ఞశ్చ పురుషాన్తరకోవిదః,
యః ప్రగ్రహానుగ్రహయో ర్యథాన్యాయం విచక్షణః. ౧౭

సత్సఙ్గ్రహప్రగ్రహణే స్థానవి న్నిగ్రహస్య చ,
ఆయకర్మణ్యుపాయజ్ఞ స్సన్దృష్టవ్యయకర్మవిత్. ౧౮

శ్రైష్ఠ్యం శాస్త్రసమూహేషు ప్రాప్తో వ్యామిశ్రకేషు చ,
అర్థధర్మౌ చ సఙ్గృహ్య సుఖతన్త్రో న చాలసః. ౧౯

వైహారికాణాం శిల్పానాం విజ్ఞాతాఽర్థవిభాగవిత్,
ఆరోహే వినయే చైవ యుక్తో వారణవాజినామ్. ౨౦

లోకంబులో నందఱును వేఱువారిదోషంబులఁ జక్కఁగా నెఱుంగుదురు; ఎవ్వనికిని దనదోషంబు దెలియదు; ఇతం డట్లు కాఁడు; తనదోషంబు నెదుటివారిదోషంబు నెఱుంగును. ౨౪

రాముండు శాస్త్రముల నెఱింగినవాఁడు; ఎవ్వఁడేని తనకు స్వల్పోపకారము చేసినను దాని నధికముగాఁ దలంచువాఁడు (సిద్ధాంతముల నెఱింగినవాఁడు); పురుషుల తారతమ్యము దెలిసినవాఁడు (పురుషుల హృదయంబు నెఱుంగువాఁడు), శాస్త్రంబుతప్పక మిత్రులు మున్నగువారల స్వీకరించుటకును వారి ననుగ్రహించుటయందును బండితుఁడు. ౨౫

రాముండు పెద్దల స్వీకరించి పాలింప సమర్థుండు; దుష్టుల శిక్షింపను దగినకాలము దెలిసినవాఁడు; పుష్పంబులనుండి మధుకరంబుంబోలె ప్రజలనుండి వారలకుఁ గష్టంబు లేనట్లుగాఁ ద్రవ్యంబుగొన సమర్థుండు; "వచ్చుబడిలో సగముపాలుగాని నాలవపాలుగాని మూఁడుపాళ్లుగాని సెలవుసేయవచ్చును" అని శాస్త్రమునందుఁ జెప్పఁబడినరీతిగా సెలవుసేయును. ౨౬

రాముండు న్యాయవైశేషిక వేదాంత వ్యాకరణ మీమాంసాది శాస్త్రంబులందును, కావ్యనాటకాది సంస్కృతప్రాకృతగ్రంథములందును బండితులగువారలలో శ్రేష్ఠుండని మతికెక్కినవాఁడు; అర్థమును ధర్మంబును సంపాదించియే సుఖంబు సేవించును; సోమరితనమును లేనివాఁడు. ౨౭

రాముండు విహారార్థంబులగు సంగీతాదిశిల్పంబులఁ జక్కఁగా నెఱుంగును; "ధర్మాయ యశసేఽర్థాయ ఆత్మనే స్వజనాయ చ, పంచధా విభజన్ విత్తమిహాముత్ర చ శోభతే" (ధర్మముకొఱకును కీర్తికొఱకును లౌకిక కార్యముకొఱకుఁ, దనకొఱకు, బంధుస్నేహితులకొఱకు ఇట్లు అయిదుభాగంబులుగా ధనంబు విభజించువాఁ డీలోకంబునను బరలోకంబునను బ్రకాశించును) అని చెప్పఁబడిన రీతిని ధనము విభజించు ప్రకారంబు దెలిసినవాఁడు; ఏనుఁగులను గుఱ్ఱంబులను ఎక్కి నానావిధంబులుగా నడుపుటయందును శిక్షించుటయందును సమర్థుండు.

ధనుర్వేదవిదాం శ్రేష్ఠో లోకేఽతిరథసమ్మతః,
అభియాతా ప్రహర్తా చ సేనానయవిశారదః. ౨౯

(అప్రధృష్యశ్చ సఙ్గ్రామే క్రుద్ధైరపి సురాసురైః,)

అనసూయో జితక్రోధో న దృప్తో నచ మత్సరీ,
న చావమన్తా భూతానాం నచ కాలవశానుగః. ౩౦

ఏవం శ్రేష్ఠగుణైర్యుక్తః ప్రజానాం పార్థివాత్మజః,
సమ్మతస్త్రిషు లోకేషు
వసుధాయాః క్షమాగుణైః. ౩౧
బుద్ధ్యా బృహస్పతేస్తుల్యో వీర్యేణాపి శచీపతేః,
తథా సర్వప్రజాకాన్తైః ప్రీతిసఞ్జననైః పితుః. ౩౨
గుణైర్విరురుచే రామో దీప్తస్సూర్య ఇవాంశుభిః,

తమేవం వ్రతసమ్పన్న మప్రధృష్యపరాక్రమమ్. ౩౩
లోకపాలోపమం నాథ మకామయత మేదినీ,

రాముండు ధనుర్వేదంబు దెలిసినవారిలో శ్రేష్ఠుండు, లోకంబునం దంతటను దెక్కువిలుకాండ్రతోఁ బోరఁగలయట్టివారిచేతనుం బూజింపఁబడినవాఁడు; లోకంబున నెరాజేని శత్రువులు తనమీఁది కెత్తివచ్చినప్పుడు వానితో యుద్ధము సేయును. అప్పుడు సేనాముఖంబున నుండఁడు. ఇతం డట్టు కాఁడు. శత్రువులయొద్దకుఁ దానె పోయి సేనాముఖంబున నిలిచి యుద్ధము సేసి శత్రువులం జంపువాఁడు; శత్రుసేన తనసేనలోనికిఁ జొర నవకాశంబు గలుగకుండునట్లు తనసేనను వ్యూహంబులం దీర్ప సమర్థుఁడు. ౨౯

(సురాసురులు విరోధంబు విడిచి కోపంబున వచ్చిరేని వారును యుద్ధమునందు రాము నెదిరింపలేరు.)

రాముండు మంచియందు దోషము నారోపింపఁడు, కోపమును దన యధీనము చేసికొనినవాఁడు, గర్వితుండు కాఁడు; మచ్చరములేనివాఁడు; ప్రాణుల నవమానింపఁడు; అయోగ్యకాలములం గల్గుకోప రాజసములకు లొంగఁడు. ౩౦

రాముండు జనులలో నెవ్వరియందును దొరకని యిట్టిలోకోత్తర గుణంబులు గలవాఁడు; ముల్లోకంబులందును బూజ నొందెను. ౩౦౪

రాముండు ఓర్పు మొదలగువానిచే భూమికి సరియగును; బుద్ధియందు బృహస్పతికి సరివచ్చును; పరాక్రమంబున దేవేంద్రసమానుండు. ౩౧౪

అట్లు స్త్రీలకును బాలురకును యౌవనవంతులకును వృద్ధులకును బామరులకును బండితులకును సంతోషంబు గలిగించునవియుం దండ్రియగు దశరథునకుఁ బ్రీతిఁ బుట్టించునవియునగు గుణంబులచే స్వతస్సుందరుండైన యా రాముండు స్వతఃప్రకాశవంతుండగుసూర్యుండు తనకిరణంబులచేతం బోలెఁ బ్రకాశించెను. ౩౨౪

భూమి యిట్లు ఆశ్రితసంరక్షణమందు బద్ధవ్రతుండై ఎదురులేని పరాక్రమంబు గల్గి దిక్పాలురకు సరివచ్చుచున్న రాముని దనకుఁ బ్రభువుగాఁ గోరెను. ౩౩౪

ఏతైస్తు బహుభి ర్యుక్తం గుణై రనుపమై స్సుతమ్. 34
దృష్ట్వా దశరథో రాజా చక్రే చిన్తాం పరన్తపః,

అథ రాజ్ఞో బభూ వైవం వృద్ధస్య చిరజీవినః. 35
ప్రీతి రేషా కథం రామో రాజా స్యా న్మయి జీవతి,

ఏషా హ్యస్య పరా ప్రీతి ర్హృది సంపరివర్తతే. 36
కదా నామ సుతం ద్రక్ష్యా మ్యభిషిక్త మహం ప్రియమ్,

వృద్ధికామో హి లోకస్య సర్వభూతానుకమ్పనః. 37
మత్తః ప్రియతరో లోకే పర్జన్య ఇవ వృష్టిమాన్,

యమశక్రసమో వీర్యే బృహస్పతిసమో మతౌ. 38
మహీంధరసమో ధృత్యాం మత్త శ్చ గుణవత్తరః,

మహీ మహ మిమాం కృత్స్నా మధితిష్ఠన్త మాత్మజం. 39
అనేన వయసా దృష్ట్వా యథాస్వర్గ మవాప్నుయామ్,

ఇత్యేతై ర్వివిధై స్తై స్తై రన్యపార్థివదుర్లభైః. 40
శిష్టై రపరిమేయైశ్చ లోకే లోకోత్తరై ర్గుణైః,
తం సమీక్ష్య మహారాజో యుక్తం సముదితై శ్శుభైః. 41
నిశ్చిత్య సచివై స్సార్ధం యువరాజ మమన్యత,
దివ్యన్తరిక్షే భూమౌచ ఘోర ముత్పాతజం భయమ్. 42
సంచచక్షేఽథ మేధావీ శరీరే చాత్మనో జరాం,

ఇతరులయందు నగపడని లెక్కలేని గుణంబులతోఁ గూడియున్న తనకుమారుండగు రామునిఁజూచి, శత్రుబలసంహారించువాఁడైన దశరథమహారాజు ఆలోచించెను. 3౮4

అంత బహుకాలము బ్రతికి వృద్ధుండగుటం జేసి దశరథమహారాజు ఈప్రకారము "నేను బ్రతికియుండఁగా రాముం డెట్లు రాజు కాఁగలఁ" డని యిట్లు చింతించెను. 3౫4

"ఎప్పుడు నేను రాజ్యమునం బరిపాలించుచుండఁగ నాప్రియకుమారుం డయిన రాముం జూడఁగలను." ఇట్లు దశరథుండు ఎల్లప్పుడును మనంబునఁ గోరుచుండును. 3౬4

నా కుమారుండగు రాముండు జనుల వృద్ధిని గోరును; సమస్తప్రాణులందును దయగలవాఁడు; వానగురియుచుండు మేఘముఁబోలె జనులసంతాపమును హరించువాఁడు; నాకన్నను జనుల కతండు చాలఁ బ్రియుండు. 3౭4

రాముండు పరాక్రమంబున యమదేవేంద్రులవంటివాఁడు; బృహస్పతివలెఁ జాలబుద్ధిశాలి; స్థైర్యంబునఁ బర్వతమునను సరివచ్చును; నాకన్నను అధికగుణవంతుఁడు. 3౭4

నా కీవయసునందే రాముండు ఈభూమండలము నంతయుఁ బాలింపఁగా నతనిం జూచి, స్వర్గంబునొందునట్లు ఘటిల్లునాయేమి? అని దశరథుండు చింతించెను. 3౯4

ఇట్లు నానావిధంబులును ఇతరరాజదుర్లభంబులునగు నీగుణంబులును మఱి లెక్కపెట్టరాని లోకోత్తరంబులును మంగళకరములు నగు నితరగుణంబులను గలిగియున్న యీరాముం జూచి దశరథమహారాజు మంత్రులతో నాలోచించి "రాముండు యువరాజు కాఁగలండు" అని నిశ్చయించెను.

అంత బుద్ధిమంతుండగు దశరథుండు "స్వర్గమునందును ఆకాశమునందును భూమియందును నానావిధంబులగు నుత్పాతంబులు భయంకరంబులయినవి జనించుచున్నవి; ఇవి రాజునకుఁ గీడుదెల్పునవి; మఱియు నా

పూర్ణచన్ద్రాననస్యాథ శోకాపనుద మాత్మనః. ౪౩
లోకే రామస్య బుబుధే సమ్ప్రియత్వం మహాత్మనః,

ఆత్మనశ్చ ప్రజానాం చ శ్రేయసే చ ప్రియేణ చ. ౪౪
ప్రాప్తకాలేన ధర్మాత్మా భక్త్యా త్వరితవా న్నృపః,

నానానగరవాస్తవ్యా న్పృథగ్జానపదా నపి. ౪౫
సమానినాయ మేదిన్యాః ప్రధానా న్పృథివీపతీన్,

నతు కేకయరాజానం జనకం వా నరాధిపః. ౪౬
త్వరయా చానయామాస పశ్చాత్తౌ శ్రోష్యతః ప్రియమ్,

తా న్వేశ్మనానాభరణై ర్యథార్హం ప్రతిపూజితాన్. ౪౭
దదర్శాలఙ్కృతో రాజా ప్రజాపతి రివ ప్రజాః,

అథోపవిష్టే నృపతౌ తస్మి న్పరబలార్దనే. ౪౮
తతః ప్రవివిశు శ్శేషా రాజానో లోకసమ్మతాః,

అథ రాజవితీర్ణేషు వివిధేష్వాసనేషు చ. ౪౯
రాజానమేవాభిముఖా నిషేదు ర్నియతా నృపాః,

దేహమందు వార్ధక మధికమగుచున్నది, కావున శీఘ్రముగా రామునకుఁ బట్టంబుఁ గట్టవలయును" అని మంత్రులకుఁ జెప్పెను. ౪౨

అంత "మిక్కిలి బుద్ధిశాలియును చందురునిఁబోలు ముఖముగల వాఁడునగు రాముఁడు జనులకుఁ జాల బ్రియుండు; దానంజేసి అతనికిఁ బట్టము గట్టుటకు జను లొప్పరేమో యని తనకు దుఃఖములేదు" అని యెంచెను. ౪౩

ధర్మాత్ముండగు దశరథమహారాజు తనకును జనులకును మంచియును సంతోషంబును గలుగుటకై యుక్తకాలంబునఁ బ్రీతియుక్తుండై రామాభిషేకంబునకై త్వరపడెను. ౪౪

దశరథుండు నానాపట్టణంబులనుండు జనంబులను, గ్రామంబులనుండు జనంబులను, ముఖ్యులగు రాజులను, సాధారణులగు రాజులను వేర్వేఱుగాఁ బిలిపించెను. ౪౫

దశరథమహారాజు అవకాశము లేకుండుటంజేసియును దూరస్థులగుటం జేసియును కేకయరాజును గాని జనకమహారాజును గాని "వారలు కార్యమయిన వెనుక నీప్రియవార్త వినగలరు" అని తలంచి పిలిపింపఁడయ్యె. ౪౬

దశరథమహారాజు అట్లు తనయాజ్ఞచే వచ్చినవారలకు విడుదులు చూపించి నానావిధంబులగు భూషణంబుల నొసంగి సత్కారంబుచేసి యా పిమ్మట బ్రహ్మదేవుఁడు ప్రజలం జూచునట్లు వారలం జూచెను. ౪౭

అంత శత్రుసైన్యంబులంజక్కాడునట్టి యాదశరథమహారాజు కూర్చుండిన వెనుక జనకుండుఁ గేకయరాజునుం దక్కఁ దక్కినజనసమ్మతులగు రాజులు రాజసభం బ్రవేశించిరి. ౪౮

అంత నారాజులు దశరథునిచే నిర్దిష్టంబులగు నానావిధంబులయిన యాసనంబులందు అతనికెదురుగా, రాజునొద్దఁ గూర్చుండు తెఱంగున వినయంబుగలిగి కూర్చుండిరి. ౪౯

స లబ్ధమానై ర్వినయాన్వితై ర్నృపైః
పురాలయై ర్జానపదై శ్చ మానవైః. ౫౦
ఉపోపవిష్టై ర్నృపతి ర్వృతో బభౌ
సహస్రచక్షు ర్భగవా నివామరైః.

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే ప్రథమస్సర్గః.

## ద్వితీయస్సర్గః

తతః పరిషదం సర్వా మామన్త్ర్య వసుధాధిపః,
హిత ముద్ధర్షణం చైవ మువాచ ప్రథితం వచః. ౧
దున్దుభిస్వనకల్పేన గమ్భీరేణానునాదినా,
స్వరేణ మహతా రాజా జీమూత ఇవ నాదయన్. ౨
రాజలక్షణయుక్తేన కాన్తేనానుపమేన చ,
ఉవాచ రసయుక్తేన స్వరేణ నృపతి ర్నృపాన్. 3
విదితం భవతా మేత ద్యథా మే రాజ్య ముత్తమమ్,
పూర్వకై ర్మమ రాజేంద్రై స్సుతవ త్పరిపాలితమ్. ౪

సోఽహ మిక్ష్వాకుభి స్సర్వై ర్నరేంద్రైః పరిపాలితమ్,
శ్రేయసా యోక్తుకామోఽస్మి సుఖార్హ మఖిలం జగత్. ౫

మయాప్యాచరితం పూర్వైః పన్థాన మనుగచ్ఛతా,
ప్రజా నిత్య మనిద్రేణ యథాశక్త్యభిరక్షితాః. ౬
ఇదం శరీరం కృత్స్నస్య లోకస్య చరతా హితమ్,
పాణ్డురస్యాఽతపత్రస్య ఛాయాయాం జరితం మయా. ౭

దశరథుండు పట్టణంబులనుండియు గ్రామంబులనుండియు వచ్చిన రాజులును బ్రజలును సనపలనఁ బూజనొంది తనవచనంబు వినఁగా వలయునని వినయంబున దగ్గఱదగ్గఱగావచ్చి తనచుట్టుగుం గూర్చుండఁగా, వారల నడుమనుండునప్పుడు దేవతలనడుమనుండు భగవంతుండగు దేవేంద్రుండుం బోలెఁ బ్రకాశించెను. ౫౦

ఇది మొదటిసర్గము.

---

## రెండవసర్గము

అంత దశరథమహారాజు సభలోని వారల నందఱఁజూచి, మేలుచేయం బడియును సంతోషము గల్గించునదియు స్పష్టార్థము నగుమాటఁ జెప్పెను. ౧

మనుష్యులకుఁ బ్రభుండగు దశరథమహారాజు భేరీధ్వనికిని మేఘగర్జనమునకు సరివచ్చుచు గంభీరంబై దిక్కులం బ్రతిధ్వని గలిగించుచు రాజార్హంబగు లక్షణంబు గలిగి మృదువై మనోహరంబయిన స్వరంబున సాసభలోనిరాజులం జూచి చెప్పెను. ౨,౩

ఇప్పుడు నావైన యీరాజ్యమును నాకు మునుపటినరఘుమహారాజు మున్నగువారలు పుత్రునింబోలె రక్షింపుచుండిరనుట మీకుఁ దెలిసియే యున్నది. ౪

ఇక్ష్వాకువంశంబునం బుట్టినరాజులందఱును సుఖంబుగా రక్షింపుచుండిన సుఖార్హంబగు నీరాజ్యంబునకు నే నిపుడు శ్రేయం బొనగూర్పఁ గోరెదను. ౫

నేనును మునుపటిరాజు లాచరించినపద్ధతిని ననుసరింపుచు నెప్పుడు నేమఱక జాగరూకుండనై నాశక్తికొలది జనుల రక్షించినాఁడను. ౬

నేను సమస్తలోకంబునకును మేలుసేయుచు సమస్తశత్రువులం జయించుచు నెదురులేక ప్రజలఁ బాలింపుచు శ్వేతచ్ఛత్రపు నీడయందే సంచరింపుచు నిట్లు వార్ధక్యము నొందితి. ౭

ప్రాప్య వర్షసహస్రాణి బహూన్యాయూంషి జీవతః,
జీర్ణస్యాస్య శరీరస్య విశ్రాన్తి మభిరోచయే. ౭
రాజప్రభావజుష్టాం హి దుర్వహా మజితేన్ద్రియైః,
పరిశ్రాన్తోఽస్మి లోకస్య గుర్వీం ధర్మధురం వహన్. ౯

సోఽహం విశ్రమ మిచ్ఛామి పుత్రం కృత్వా ప్రజాహితే,
సన్నికృష్టా నిమా న్సర్వా ననుమాన్య ద్విజర్షభాన్. ౧౦

అనుజాతో హి మాం సర్వై ర్గుణై ర్జ్యేష్ఠో మమాత్మజః,
పురందరసమో వీర్యే రామః పరపురఞ్జయః. ౧౧

తం చన్ద్ర మివ పుష్యేణ యుక్తం ధర్మభృతాం వరం,
యౌవరాజ్యే నియోక్తాఽస్మి ప్రీతః పురుషపుఙ్గవమ్. ౧౨

అనురూప స్సవై నాథో లక్ష్మీవా న్లక్ష్మణాగ్రజః,
త్రైలోక్యమపి నాథేనయేన స్యాన్నాథవ త్తరమ్. ౧౩

అనేన శ్రేయసా సద్య స్సంయోజ్యైవ మిమాం మహీమ్,
గతక్లేశో భవిష్యామి సుతే తస్మి న్నివేశ్య వై. ౧౪
య దిదం మేఽనురూపార్థం మయా సాధు సుమన్త్రితం,
భవన్తో మేఽనుమన్యన్తాం కథం వా కరవా ణ్యహమ్. ౧౫

యద్య ప్యేషా మమ ప్రీతి ర్హిత మన్య ద్విచిన్త్యతాం,

నేను అఱువదివేల సంవత్సరములవఱకు జీవించి యిప్పుడు వృద్ధుండనైతి కావున నింక శ్రమపడలేను విశ్రాంతిం గోరుచున్నాను. ౮

శౌర్యాదులు గలవారికి మాత్రమే చేయ సాధ్యమును జితేంద్రియులు కానివారలకుఁ జేయ నలవిగానిదియు మిగులఁ గష్టంబు నగు నీధర్మపరిపాలనంబు సేయుచు నలసియున్నాఁడను. ౯

ఇట్లు పరిశ్రాంతుఁడను వృద్ధుండనగు నేను ప్రజారక్షణమందు నాపుత్రు నియమించి యంతరంగభూతులయిన బ్రాహ్మణశ్రేష్ఠులగు వసిష్ఠాదుల నందఱ సమ్మతిపడునట్లు చేసి విశ్రాంతి నొందఁ గోరుచున్నాను. ౧౦

నా పెద్దకొడుకు రాముఁడు పరాక్రమంబున దేవేంద్రునకు సరివచ్చువాఁడు. శత్రుపురపట్టణంబుల జయించువాఁడు. అన్నిగుణంబులను నన్నుఁ బోలి పుట్టినాఁడు. ౧౧

ధార్మికులలో శ్రేష్ఠుఁడును బుద్ధిశ్రేష్ఠుఁడును బుష్యనక్షత్రముతోఁ గూడిన చంద్రుఁడుంబోలె నతిప్రకాశముగలవాఁడునగు నారాముని, సంతోషంబున యువరాజుగాఁ జేయఁగోరెదను. ౧౨

ఎవ్వఁడు ప్రభువైన ముల్లోకంబులును అధికముగా సనాథము లగునో అట్టి లక్ష్మీవంతుఁడును తమ్ముఁడగు లక్ష్మణునియం దధికప్రీతిగలవాఁడగుటం జేసి యాశ్రితులం దంతటను అట్లె యధికప్రీతి సేయువాఁడునగు రాముఁడు మీకుఁ దగిననాథుఁడు. ౧౩

నేను ఈరాజ్యభారమును నా జ్యేష్ఠపుత్రుఁడగు రామున కప్పగించి దీనివలన నిప్పుడే రాజ్యంబునకు మేలొనఁగూర్చి విశ్రాంతుఁడ నయ్యెదను. రాము నభిషేకింపవలయునని తలఁపుగొనుట వృద్ధుఁడనగు నా కుచితమగునేని దీని నిర్దోషంబుగాఁ జక్కఁగా నాలోచించితిరని మీరుతలంతు రేని మీర లొప్పుకొనుఁడు నేను మాత్రమెట్లు చేయఁగలను. ౧౪

రాము నభిషేకింపవలయు ననునది నేను గోరినదైనను వేఱు హితము మీకుఁ దోఁచునేని దానిం జెప్పుఁడు నిష్పక్షపాతులగు మధ్యస్థు లాలో

అన్యా మత్యర్థచిన్తా హి విమర్దాభ్యధికోదయా. ౧౬

ఇతి బ్రువన్తం ముదితాః ప్రత్యనన్దన్నృపా నృపం,
వృష్టిమన్తం మహామేఘం నర్దన్త ఇవ బర్హిణః. ౧౭

స్నిగ్ధోఽనునాదీ సంజజ్ఞే తత్ర హర్షసమీరితః,
జనౌఘోద్ఘుష్టసంనాదో విమానం కమ్పయన్నివ. ౧౮

తస్య ధర్మార్థవిదుషో భావ మాజ్ఞాయ సర్వశః,
బ్రాహ్మణా జనముఖ్యాశ్చ పౌరజానపదైస్సహ. ౧౯
సమేత్య మన్త్రయిత్వా తు సమతాగతబుద్ధయః,
ఊచుశ్చ మనసా జ్ఞాత్వా వృద్ధం దశరథం నృపమ్. ౨౦
అనేకవర్షసాహస్రో వృద్ధస్త్వమసి పార్థివ,
స రామం యువరాజాన మభిషిఞ్చస్వ ధార్మికమ్. ౨౧
ఇచ్ఛామో హి మహాబాహుం రఘువీరం మహాబలం,
గజేన మహతా యాన్తం రామం ఛత్రావృతాననమ్. ౨౨

ఇతి తద్వచనం శ్రుత్వా రాజా తేషాం మనఃప్రియం,
అజానన్నివ జిజ్ఞాసు రిదం వచన మబ్రవీత్. ౨౩

శ్రుత్వైవ వచనం యన్మే రాఘవం పతి మిచ్ఛథ,
రాజానస్సంశయోఽయం మే కి మిదం బ్రూత తత్త్వతః. ౨౪

చించుట దోషాలోచించుటకన్న హెచ్చైనది. యుక్తిప్రతియుక్తులచే మఱియుం మేలుగూర్చునది. అని దశరథుఁడు సభలో నుండువారలతోఁ జెప్పెను. ౧౬

దశరథుఁ డిట్లు చెప్పుట విని యాసభలోనిరాజు లందఱు వర్షించుచున్న మేఘముఁ జూచి మయూరంబులు సంతోషంబునం గూయుచుఁ బ్రశంసించుచున్నట్లు దశరథునిఁ బ్రశంసించిరి. ౧౭

సంతోషంబువలన నాసభనుండు జనులు "మంచిది!" "మంచిది!" అని గట్టిగా నఱవఁగా నాధ్వని స్నిగ్ధంబయి ప్రతిధ్వని గలుగఁజేయుచు నచ్చటి విమానమును గదలించునో యనునట్లు పెల్లురేఁగినది. ౧౮

దశరథుఁడు ధర్మార్థంబుల నెఱిఁగి చెప్పినమాట తాత్పర్యంబు సన్నివిధంబులఁ దెలిసికొని వసిష్ఠాది బ్రాహ్మణులును రాజులును బ్రజలతోఁ జేరి యాలోచించి యైకమత్యంబు నొంది తమతమమనంబులోఁ జక్కఁగా విచారించి వృద్ధుఁడగు దశరథమహారాజుం జూచి యిట్లని చెప్పిరి. ౧౯,౨౦

దశరథమహారాజా! నీవు పెక్కువేలసంవత్సరంబులు జీవించివృద్ధుఁడవైతివి కావున, నీవు రాముని యౌవరాజ్యమునం దభిషేకింపుము. ౨౧

మేము మహాబాహుండును మహాబలుండును రఘువంశంబునఁ బుట్టిన వారిలో ముఖ్యుండునగు రాముఁడు గొప్పయేనుఁగు నెక్కి శ్వేతచ్ఛత్రంబు నీడను వచ్చుచుండఁగాఁ జూడఁగోరుచున్నాము. అని సభలోనివారలు దశరథునితోఁ జెప్పిరి. ౨౨

ఇట్లు సభలోనివారలు చెప్పినమాటవిని దశరథమహారాజు వారలమనస్సంతోషం బెఱిఁగిన వాఁడయ్యును, ఎఱుఁగనివాఁడువోలె నభినయించి వారలనోటి మూలముగనె యెఱుఁగఁగోరి వారలఁ జూచి యిట్లని చెప్పెను.

రాజులారా! నేను రామాభిషేకము చేసెదనని చెప్పినంతనె మీరు ముందువెనుక నాలోచింపక "రాముఁడు ప్రభువు కావలయు" నని కోరుచున్నారలు కావున నాకు సంశయము గలుగుచున్నది. మీరలెందుకు రామాభిషేకముఁ గోరితిరి? యథార్థముగాఁ జెప్పుఁడు. ౨౩

కథం ను మయి ధర్మేణ పృథివీ మనుశాసతి,
భవన్తో ద్రష్టు మిచ్ఛన్తి యువరాజం మమాత్మజమ్. ౨౪

తే త మూచు ర్మహాత్మానం పౌరజానపదై స్సహ,

"బహవో నృప కల్యాణా గుణాః పుత్రస్య సన్తి తే. ౨౬

గుణాన్ గుణవతో దేవ దేవకల్పస్య ధీమతః,
ప్రియానానన్దనాన్కృత్స్నా న్ప్రవక్ష్యామోఽద్య తాన్ శృణు.

దివ్యైర్గుణై శ్శక్రసమో రామ స్సత్య పరాక్రమః,
ఇక్ష్వాకుభ్యోఽపి సర్వేభ్యో హ్యతిరిక్తో విశాంపతే. ౨౮

రామ స్సత్పురుషో లోకే సత్యధర్మపరాయణః,
సాక్షా ద్రామా ద్వినిర్వృత్తో ధర్మ శ్చాపి శ్రియా సహ. ౨౯

ప్రజాసుఖత్వే చన్ద్రస్య వసుధాయాః క్షమాగుణైః,
బుద్ధ్యా బృహస్పతే స్తుల్యో వీర్యే సాక్షాచ్ఛచీపతేః. ౩౦

ధర్మజ్ఞ స్సత్యసన్ధ శ్చ శీలవా ననసూ యః,
క్షాన్త స్సాంత్వయితా శ్లక్ష్ణః కృతజ్ఞో విజితేన్ద్రియః. ౩౧

నేను ధర్మంబు దప్పక భూమిని బాలింపుచుండఁగా మీరలు నాకొడుకు యువరాజు గాఁగాఁ జూడవలయునని యెట్లు కోరుచున్నారలు? మీరట్లుకోరునట్లుగా నే నేమితప్పు గావించితిని. అని దశరథుఁడు సభలోని వారలతోఁ జెప్పెను. ౨౪

ఆ సభలోనిరాజులును బట్టణంబుల గ్రామంబులనుండు జనులును మహాత్ముఁడగు దశరథునితో నిట్లని చెప్పిరి. ౨౫

దశరథమహారాజా! నీకొడుకైన రామునియందు పెక్కుగుణంబులు మంగళకరంబులయిన వున్నవి. ౨౬

దశరథమహారాజా! గుణవంతుఁడును దేవతుల్యుఁడును బుద్ధిమంతుఁడు నగురాముని ప్రియంబులు సంతోషజనకంబులు నగుగుణంబుల సన్నిటిని జెప్పెదము వినుము. ౨౭

మనుష్యులకుఁ బ్రభుఁడవయిన దశరథుఁడా! రాముఁ డమానుషంబులగు శౌర్యాదిగుణంబులచే దేవేంద్రునకు సరివచ్చును. అమోఘంబగు పరాక్రమంబుగలవాఁడు. ఇక్ష్వాకువంశమునం బుట్టినవారలలో నందఱికన్నను నధికుఁడు. ౨౮

లోకంబున రాముఁడె సత్పురుషుఁ డనఁదగువాఁడు. సత్యంబునందును ధర్మంబునందును జాల నాసక్తిగలవాఁడు. రామునివలన ధర్మంబును సంపదయును ఎంతమాత్రము నెడబాయ కేక కలిగినవి. ౨౯

రాముఁడు ప్రజలకుసుఖంబుచేయుటయందుఁ జంద్రునివంటివాఁడు. ఓర్పున భూమికి సరివచ్చును. బుద్ధియందు బృహస్పతికి సమానుఁడు. దేవేంద్రునంతటి పరాక్రమంబు గలవాఁడు. 30

రాముఁడు ధర్మముల నెఱుఁగును. సత్యసంధుఁడు. మంచిస్వభావము గలవాఁడు. అసూయలేనివాఁడు. ఎంతటియపరాధంబులనైన క్షమించువాఁడు. మఱియుఁ గుపితులదుఃఖితులఁ దిన్నని మాటల నూఱటనొందించువాఁడు. ప్రియంవదుఁడు. తన కితరులు కొంచె ముపకారముచేసినను దాని నెచ్చుగాఁ దలఁచువాఁడు. జితేంద్రియుఁడు.

మృదుశ్చ స్థిరచిత్తశ్చ సదా భవ్యోఽనసూయకః,
ప్రియవాదీ చ భూతానాం సత్యవాదీ చ రాఘవః. 3౨
బహుశ్రుతానాం వృద్ధానాం బ్రాహ్మణానా ముపాసితా,
తేనాస్యేహాఽతులా కీర్తి ర్యశ స్తేజశ్చ వర్ధతే. 33

దేవాసురమనుష్యాణాం సర్వాస్త్రేషు విశారదః,
సమ్యగ్విద్యావ్రతస్నాతో యథావ త్సాంగవేదవిత్. 3౪

గాన్ధర్వే చ భువి శ్రేష్ఠో బభూవ భరతాగ్రజః,
కల్యాణాభిజన స్సాధు రదీనాత్మా మహామతిః. 3౫

ద్విజై రభివినీతశ్చ శ్రేష్ఠైర్ధర్మార్థనైపుణైః,
యదా వ్రజతి సఙ్గ్రామం గ్రామార్థే నగరస్య వా. 3౬
గత్వా సౌమిత్రిసహితో నాఽవిజిత్య నివర్తతే,
సఙ్గ్రామా త్పున రాగమ్య కుఞ్జరేణ రథేన వా. 3౭
పౌరాన్ స్వజనవ న్నిత్యం కుశలం పరిపృచ్ఛతి,

పుత్రే ష్వగ్నిషు దారేషు ప్రేష్యశిష్యగణేషు చ. 3౮
నిఖిలేనానుపూర్వ్యాచ్చ పితా పుత్రా నివౌరసాన్,

రాముఁడు తిన్ననివాఁడు. ఎట్టిసంకటంబులందైనను చాంచల్యంబు నొందనిమనంబుగలవాఁడు. ఎప్పుడును మంగళకరాచారము సేయువాఁడు. అసూయలేనివాఁడు. ౩౧

రాముఁడు ప్రాణములకుఁ బ్రియంబును సత్యంబు నగుమాటనె చెప్పును. చాలవిద్యాపరిశ్రమముఁగలిగి వృద్ధులయిన బ్రాహ్మణుల సేవించును. ౩౨

అట్లు పెద్దలసేవించుటంజేసి రామునకు వీర్యశౌర్యౌదార్యాదులవలనఁ గలిగిన కీర్తియును దేజంబును వృద్ధిఁబొందుచున్నవి. ౩౩

రాముఁడు దేవతలును అసురులును మనుష్యులును ఉపయోగపఱచుకొను నస్త్రంబులనన్నిఁటిని జక్కఁగాఁ దెలిసినవాఁడు. చక్కఁగా వేదాధ్యయనముచేసి సమావర్తనముచేసికొనినవాఁడు. సంప్రదాయపద్ధతిని వేదంబులను వేదాంగంబులను ఎఱుఁగును. ౩౪

భరతున కన్న యగురాముఁడు సంగీతమునందు అందఱికన్న నధికుఁడు మంచివంశంబునందుఁ బుట్టినవాఁడు మంచివాఁడు. ఎట్టికష్టములందును దైన్యములేనివాఁడు. మహాబుద్ధిశాలి. ౩౫

ధర్మార్థంబులందు సమర్థులు నుత్తములునగు బ్రాహ్మణు లన్నివిషయంబులందునుం జక్కఁగా రామునకు బోధించియున్నారు ౩౬

రాముఁడు గ్రామార్థముఁగాని పట్టణార్థముగాని యుద్ధము సంభవించినప్పుడు లక్ష్మణునిం గూడిపోయి జయంబునొందక మఱలినది లేదు. ౩౭

రాముం డట్లు యుద్ధంబున జయంబునొంది మఱల ఏనుఁగుమీఁద రథంబునగాని కూర్చుండి వచ్చి పట్టణంబునందలిజనంబులను దనబాంధవులనుం బోలె క్షేమం బడుగును. ౩౮

యుద్ధంబున జయంబునొంది వచ్చునపుడు పట్టణమునందుండు జనుల నందఱను తండ్రి తనధర్మపత్నిఁ బుట్టినకొడుకులక్షేమం బడుగునట్లు "మీకొడుకులు క్షేమముగా నున్నారా? మీయగ్నిహోత్రములు తప్పక జరుగుచున్నవా? మీభార్యలు భృత్యులు శిష్యులు క్షేమముగా నున్నారా" అని క్రమంబుగా నడుగును. ౩౯

శుశ్రూషన్తే చ వః శిష్యాః కచ్చిత్కర్మసు దంశితాః. ౩౯
ఇతి నః పురుషవ్యాఘ్రః సదా రామోఽభిభాషతే,

వ్యసనేషు మనుష్యాణాం భృశం భవతి దుఃఖితః. ౪౦
ఉత్సవేషు చ సర్వేషు పితేవ పరితుష్యతి,

సత్యవాదీ మహేష్వాసో వృద్ధసేవీ జితేన్ద్రియః. ౪౧
స్మితపూర్వాభిభాషీచ ధర్మం సర్వాత్మనా శ్రితః,

సమ్యగ్యోక్తా శ్రేయసాం చ న విగృహ్య కథారుచిః. ౪౨
ఉత్తరోత్తరయుక్తౌ చ వక్తా వాచస్పతిర్యథా,
సుభ్రూరాయతతామ్రాక్షః సాక్షాద్విష్ణురివ స్వయమ్. ౪౩
రామో లోకాభిరామోఽయం శౌర్యవీర్యపరాక్రమైః,

ప్రజాపాలనతత్త్వజ్ఞో న రాగోపహతేన్ద్రియః. ౪౪
శక్తస్త్రైలోక్యమప్యేకో భోక్తుం కిన్ను మహీమిమామ్,

నాస్య క్రోధః ప్రసాదశ్చ నిరర్థోఽస్తి కదాచన. ౪౫
హన్త్యేవ నియమాద్వధ్యాన్ అవధ్యే నచ కుప్యతి,

"మీశిష్యులందఱు కార్యములయం దెచ్చరికగల్గి మీకు సేవచేయుచున్నారా యేమి" చక్కఁగా నధ్యయనము సేయుచున్నారా యేమి?" అని పురుషశ్రేష్ఠుఁడగురాముఁడు మనుజుల నెల్లప్పుడును అడుగుచుండును. ౩౯

రాముఁడు బంధువులు మిత్రులు ధనికులు దరిద్రులు మొదలగు భేదమాత్రము లేక, మనుష్యసామాన్యమునకుఁ గష్టము సంభవించెనేనియుఁ జాల దుఃఖము నొందును. అట్టి మనుష్యసామాన్యమున కెంతమాత్రం బుత్సవంబు గలిగినను: దండ్రి తనకొడుకుల కుత్సవము గలిగినప్పుడు సంతోషించునట్లు చాలసంతోషించును. ౪౦

రాముఁడు ఎట్టికష్టములందును అబద్ధంబాడఁడు విలుకాండ్రలో శ్రేష్ఠుఁడు పెద్దలసేవించువాఁడు ఇంద్రియనిగ్రహంబుగలవాఁడు చిఱునగవుగలిగి మాటలాడును. ఎంతటికష్టంబునను ధర్మంబు విడువఁడు. ౪౧

రాముఁడు ఆశ్రితులకుఁ జక్కఁగా మేలుగలిగించువాఁడు. కలహప్రియుఁడు కాఁడు. బృహస్పతియుఁబోలె బదులుకుబదులుయుక్తి చెప్పువాఁడు.

మంచికనుబొమలు దీర్ఘంబులు నెఱ్ఱని మొనలుగలవియు నగుకండ్లును గలిగి లోకాభిరాముండై యుండు. నీరాముఁడు శౌర్యవీర్యపరాక్రమంబుల మనుష్యత్వంబు నొందిన విష్ణుఁ డనఁదగియున్నాఁడు. ౪౩

రాముఁడు జనులఁ బాలింప జక్కఁగాఁ దెలిసినవాఁడు. రాగద్వేషముల జయించినవాఁడు. ఇతఁ డొకఁడె ముల్లోకంబులనుగూడఁ బాలింపఁ గలఁడు. ఈభూమినిమాత్రము పాలింపఁ జాలునని చెప్పనేల. ౪౪

ఈరామునికోపముగాని యనుగ్రహముగాని యొకప్పుడును నిష్ప్రయోజనంబగుట లేదు. కోపించెనేని యెవ్వనిమీఁదఁ గోపించెనో యతఁ డప్పుడె యవశ్యంబు దానిఫలం బనుభవించును. అనుగ్రహంబు నొందినచో ననుగ్రహింపఁబడినవాఁడు తక్షణంబే మహాభాగ్యశాలియగును. వధ్యుల నవశ్యము చంపును. అవధ్యునిపైఁ గోపంబుగూడఁ జేయఁడు. ౪౫

యున క్త్యశ్రైః ప్రహృష్ట శ్చ త మసౌ యత్ర తుష్యతి. ౪౬

కాన్తైస్సర్వప్రజాకాన్తైః ప్రీతిసఞ్జననై ర్నృణామ్,
గుణై ర్విరురుచే రామో దీ ప్త స్సూర్య ఇ వాంశుభిః. ౪౭

త మేవం గుణసమ్పన్నం రామం సత్యపరాక్రమమ్,
లోకపాలోపమం నాథ మకామయత మేదినీ. ౪౮
వత్స శ్రేయసి జాత స్తే దిష్ట్యాఽసౌ తవ రాఘవ,
దిష్ట్యా పుత్రగుణై ర్యుక్తో మారీచ ఇవ కాశ్యపః. ౪౯

బల మారోగ్య మాయు శ్చ రామస్య విదితాత్మనః,
దేవాసురమనుష్యేషు సగన్ధర్వోరగేషు చ. ౫౦
ఆశంసతే జన స్సర్వో రాష్ట్రే పురవరే తథా,
అభ్యన్తరశ్చ బాహ్యశ్చ పౌరజానపదో జనః. ౫౧

స్త్రియో వృద్ధా స్తరుణ్య శ్చ సాయం ప్రాత స్సమాహితాః,
సర్వా న్దేవా న్నమస్యన్తి రామ స్యార్థే యశస్వినః. ౫౨

తేషా మాయాచితం దేవ త్వత్ప్రసాదా త్సమృద్ధ్యతామ్,

రామ మిన్దీవరశ్యామం సర్వశత్రునిబర్హణమ్. ౫3
పశ్యామో యౌవరాజ్యస్థం తవ రాజోత్తమాత్మజమ్,

తం దేవదేవోపమ మాత్మజం తే
సర్వస్య లోకస్య హితే నివిష్టమ్,

ఈరాముఁ డెవ్వనిపై సంతోషంబు నొందునో అతఁడు కోరినవాని నంతయు నతని కొసఁగును. ౪౬

రాముఁడు శాంతిప్రధానములును సమస్తప్రజలకుఁ గోరఁదగినవియును మనుష్యులకందఱకును సంతోషంబుగలిగించునవియు నగుగుణంబులు గలిగి కిరణంబులుగలిగిన సూర్యుఁడుంబోలెఁ బ్రకాశించుచున్నాఁడు. ౪౭

ఇట్టి గుణంబులుగలిగి సత్యపరాక్రముఁడై దిక్పాలురకు సాటిసేయఁ దగి యొప్పుచుండురాముని జనులందఱుఁ బ్రభువుగాఁ గోరుచున్నారు. ౪౮

దశరథుఁడా! నీభాగ్యమునంజేసి జనులకు మేలుగలుగుటకై నీ కీకొడుకుపుట్టెను. నీభాగ్యముననే మరీచికొడుకయిన కాశ్యపుఁడుంబోలెఁ బుత్రునకుండవలసినగుణంబులు గలిగియున్నాఁడు. ౪౯

దేవతలు నసురులును ఋషులును గంధర్వులును సర్పంబులును ఇతర దేశములనుండువారును ఇతరపట్టణము లందుండువారును అంతఃపురమునందేమి వెలుపల నేమియుండువారును, మన దేశంబున మనపట్టణంబుల నుండువారు నందఱును బ్రసిద్ధంబగు స్వభావంబుగలరామునకు "బలంబు నారోగ్యంబు నాయువుఁ గలుగవలెను" అని ప్రార్థించుచున్నారు. ౫౧

స్త్రీలు ముదుసలివారును యౌవనముగలవారును సాయంకాలమందును ప్రాతఃకాలంబునందును సావధానలై రామునికై వరంబుల నొసంగుటవలనం గలిగినకీర్తిగల దేవతలనందఱను నమస్కరించెదరు. ౫౨

దశరథమహారాజా! వారలయభీష్టము నీయనుగ్రహంబున నిప్పుడు సఫలంబగుఁగాక. ౫౩

రాజశ్రేష్ఠుఁడ వగుదశరథుఁడా! నల్లకలువయుం బోలె నల్లనిరమణీయమూర్తి సమస్తశత్రువులం జంపువాఁడు నీకుమారుఁడు రాముఁడు యువరాజుగా నుండఁగాఁ జూడఁగలము అని సంతస మగుచున్నది. ౫౩

దశరథుఁడా! నీవు కోరినవాని నిచ్చువాఁడవు విష్ణుదేవునకు సరివచ్చువాఁడు సమస్తజనంబునకు మేలుసేయువాఁడునగు నీపుత్రుని రాముని మాకు

హితాయ నః క్షిప్ర ముదారజుష్టం
ముదాఽభిషేక్తుం వరద త్వ మర్హసి. ౫౪

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే ద్వితీయ స్సర్గః

## తృ తీ య స్స ర్గః

తేషా మఞ్జలిపద్మాని ప్రగృహీతాని సర్వశః,
ప్రతిగృహ్య బ్రవీ ద్రాజా తేభ్యః ప్రియహితం వచః. ౧

అహోఽస్మి పరమప్రీతః ప్రభావ శ్చాతులో మమ,
యన్మే జ్యేష్ఠం ప్రియం పుత్రం యౌవరాజ్యస్థ మిచ్ఛథ. ౨

ఇతి ప్రత్యర్చ్య తా న్రాజా బ్రాహ్మణా నిద మబ్రవీత్,
వసిష్ఠం వామదేవం చ తేషామే వోపశృణ్వతామ్. ౩

చైత్ర శ్శ్రీమా నయం మాసః పుణ్యః పుష్పితకాననః,
యౌవరాజ్యాయ రామస్య సర్వమేవోపకల్ప్యతామ్. ౪

రాజ్ఞ స్తూపరతే వాక్యే జనఘోషో మహా నభూత్,

శనై స్తస్మి న్ప్రశా న్తే చ జనఘోషే జనాధిపః. ౫

మేలుంగల్గుటకై సంతోషంబున శీఘ్రంబుగా యౌవరాజ్యంబునం దభిషేకింపుము. అని సభికులగువారు దశరథునితోఁ జెప్పిరి. ౫౪

ఇది రెండవసర్గము.

---

## మూఁడవ సర్గము

ఆసభికులు శిరంబునఁ దామరమొగ్గలవంటి చేమోడ్పులంగీలించి చేయు నమస్కారంబులం బ్రతిగ్రహించి దశరథమహారాజు వారలకు సంతోషంబును మేలునుం గల్గునట్టు లిట్లని చెప్పెను. ౧

మీరలు నాకుఁ బ్రియుండును జ్యేష్ఠపుత్త్రుఁడు నగురాముఁడు యువరాజు కావలెనని కోరుచున్నారలు కావున ఆశ్చర్యము! నాకుఁ జాల సంతోషమగుచున్నది. ఇట్టిభాగ్యము మఱియెవ్వని కున్నది? అని దశరథుఁడు సభికులతోఁ జెప్పెను. ౨

దశరథమహారాజు సభికులగు బ్రాహ్మణుల నిట్లు మధురవచనంబుల గౌరవించి వారలు వినుచుండఁగానే వసిష్ఠుని వామదేవునిం జూచి యిట్లని చెప్పెను. ౩

ఇప్పుడు వచ్చియుండు చైత్రమాసము అన్నిమాసములలో నుత్తమమయినది. ఇది రమణీయంబును ఇట్టికార్యములకు దగినపుణ్యమాసంబుగాను ఉన్నది. అడవులలో వృక్షంబులన్నియుఁ బుష్పితంబులయి యున్నవి. ఇప్పుడే, రామునకు యౌవరాజ్యాభిషేకము సేయుటకై కావలయువానినన్నిఁటిని సంపాదింపుఁడు. అని దశరథుఁడు వసిష్ఠవామదేవులతోఁ జెప్పెను. ౪

దశరథమహారాజు మాటచెప్పి ముగింపఁగానే జనులందఱు "మేము బహుకాలముంగాఁ గోరుచుండిన రామాభిషేకమును గండ్లారఁ జూచెదము గదా" యని సంతోషంబునం జాలధ్వని గావించిరి.

ఆధ్వనియంతయుం మెల్లమెల్లఁగా శాంతిఁబొందఁగానే మనుష్యుల కధిపుండగు దశరథుండు వసిష్ఠుని వామదేవునిం జూచి యిట్లని చెప్పెను. ౫

వసిష్ఠం మునిశార్దూలం రాజా వచన మబ్రవీత్,
అభిషేకాయ రామస్య య త్కర్మ సపరిచ్ఛదమ్. ౬
త దద్య భగవ౯ సర్వ మాజ్ఞాపయితు మర్హసి,

తచ్ఛ్రుత్వా భూమిపాలస్య వసిష్ఠో ద్విజసత్తమః. ౭
ఆదిదేశాగ్రతో రాజ్ఞ స్స్థితా న్యుక్తా న్కృతాఞ్జలీ౯,

సువర్ణాదీని రత్నాని బలీ౯ సర్వౌషధీ రపి. ౮
శుక్లమాల్యాంశ్చ లాజాంశ్చ పృథక్చ మధుసర్పిషీ,
అహతాని చ వాసాంసి రథం సర్వాయుధాన్యపి. ౯
చతురఙ్గబలం చైవ గజం చ శుభలక్షణమ్,
చామరవ్యజనే శ్వేతే ధ్వజం ఛత్రం చ పాణ్డురమ్. ౧౦
శతంచ శాతకుమ్భానాం కుమ్భానా మగ్నివర్చసామ్,
హిరణ్యశృఙ్గ మృషభం సమగ్రం వ్యాఘ్రచర్మ చ. ౧౧
ఉపస్థాపయత ప్రాత రగ్న్యగారం మహీపతేః,
యచ్చాన్య త్కించి దేష్టవ్యం త త్సర్వ ముపకల్ప్యతామ్. ౧౨

అన్తఃపురస్య ద్వారాణి సర్వస్య నగరస్య చ,
చన్దనస్రగ్భి రర్చ్యన్తాం ధూపై శ్చ ఘ్రాణహారిభిః. ౧౩
ప్రశస్త మన్నం గుణవ ద్దధిక్షీరోపసేచనమ్,
ద్విజానాం శతసాహస్రే య త్ప్రకామ మలం భవేత్. ౧౪

సత్కృత్య ద్విజముఖ్యానాం శ్వః ప్రభాతే ప్రదీయతామ్,
ఘృతం దధి చ లాజాశ్చ దక్షిణా శ్చాపి పుష్కలాః. ౧౫

భగవంతులగు వసిష్ఠవామదేవులారా! రామునియభిషేకంబునకు ఏ కర్మము చేయవలయునో ఏయుపకరణములు కావలయునో దాని నంతయు నిప్పుడానతీవలయును. అని దశరథుండు వసిష్ఠవామదేవులతోఁ జెప్పెను. ౮

దశరథమహారాజుమాట విని బ్రాహ్మణశ్రేష్ఠులు వసిష్ఠుండును వామదేవుండును దశరథమహారాజుముందటఁ జేతులు మొగిడ్చి నిలుచుండియున్న సుమంత్రాదులం జూచి యిట్లు ఆజ్ఞాపించెను. ౯

మీరు బంగారు మొదలయినవానిని మణులను గానుకలను సమస్తౌషధులను తెల్లనిపుష్పమాలికలను పేలాలను వేర్వేఱుగఁ గిన్నెలయందుంచఁబడిన తేనె నేతులను నూతనవస్త్రంబులను రథంబును సమస్తాయుధంబులను చతురంగసేనను, మంచిలక్షణంబులుగల యేనుఁగును రెండు తెల్లని చామరంబులను ధ్వజంబును శ్వేతచ్ఛత్త్రంబును నిప్పుఁబోలి ప్రకాశించు నూఱుబంగారు పాత్రములను బంగారుకప్పు వేసినకొమ్ములుగలవృషభంబును సమగ్రంబగు పులితోలును ప్రాతఃకాలమునకు దశరథుని యగ్నిహోత్రగృహమునం జేర్పుఁడు. ౧౧

మఱియు నితరపదార్థములగు గంధము మొదలయినవి యేవేవి యపేక్షితములో వాని నన్నిటిని గూడ సంపాదింపుఁడు. ౧౨

రాజగృహద్వారములయందుఁ బట్టణద్వారంబులం దంతటను శ్రీగంధము చల్లి పుష్పమాలికలు గట్టి మంచివాసనగల ధూపంబులు వేయుఁడు. ౧౩

లెక్కలేని బ్రాహ్మణులకైనను ఎంతమాత్రమును కొఱఁతలేక చాలునంతటి ప్రశస్తాన్నంబు వ్యంజనంబులుకలదియై పెరుఁగుతో సంస్కరింపఁబడి యుండునది సంపాదింపఁబడవలయును. ౧౪

రేపు ప్రాతఃకాలంబున నాయన్నంబును బ్రాహ్మణశ్రేష్ఠులకుఁ బూజ చేసి యొసఁగుఁడు. మఱియు వారలకు నేయి పెరుఁగుఁ జేలాలుఁ బుష్కలంబగుదక్షిణయు నొసంగుఁడు. ౧౫

సూర్యేఽభ్యుదితమాత్రే శ్వో భవితా స్వస్తివాచనమ్,
బ్రాహ్మణాశ్చ నిమన్త్ర్యన్తాం కల్ప్యన్తా మాసనాని చ. ౧౬
ఆబధ్యన్తాం పతాకాశ్చ రాజమార్గశ్చ సిచ్యతామ్,

సర్వే చ తాళావచరా గణికాశ్చ స్వలఙ్కృతాః. ౧౭
కక్ష్యాం ద్వితీయా మాసాద్య తిష్ఠన్తు నృపవేశ్మనః,
దేవాయతనచైత్యేషు సాన్నభక్ష్యాస్సదక్షిణాః. ౧౮
ఉపస్థాపయితవ్యాస్స్యు ర్మాల్యయోగ్యాః పృథక్పృథక్,

దీర్ఘాసిబద్ధా యోధాశ్చ సన్నద్ధా మృష్టవాససః. ౧౯
మహారాజాఙ్గణం సర్వే ప్రవిశన్తు మహోదయమ్,

ఏవం వ్యాదిశ్య విప్రౌ తౌ క్రియా స్తత్ర సునిష్ఠితౌ. ౨౦
చక్రతు శ్చైవ యచ్ఛేషం పార్థివాయ నివేద్య చ,

కృత మిత్యేవ చాబ్రూతా మభిగమ్య జగత్పతిమ్. ౨౧
యథోక్తం వచనం ప్రీతౌ హర్షయుక్తౌ ద్విజర్షభౌ,

తత స్సుమన్త్రం ద్యుతిమా న్రాజా వచన మబ్రవీత్. ౨౨
రామః కృతాత్మా భవతా శీఘ్ర మానీయతా మితి,

స తథేతి ప్రతిజ్ఞాయ సుమన్త్రో రాజశాసనాత్. ౨౩
రామం తత్రానయాఞ్చక్రే రథేన రథినాం వరమ్,

రేపు సూర్యోదయముకాఁగానే స్వస్తివాచనము కాఁగలదు. కావున బ్రాహ్మణులఁ బిలువుఁడు. వారల కాసనంబుల నిర్మింపుఁడు. ౧౬

అచ్చటచ్చట ధ్వజములఁ గట్టింపుఁడు. రాజమార్గంబునందు నీళ్లు చల్లించి తడుపునట్లు చేయుండు.

నటులును భోగమువాండ్రును జక్కఁగా నలంకరించుకొని రాజగృహంబు రెండవ తొట్టికట్టు చేరియుండునట్లు చేయుండు. ౧౭

దేవాలయములందును జతుష్పథములందును గొంద అన్నము పిండివంటలను గొందఱు దక్షిణలను బుష్పమాలికలను సంగ్రహించుకొని యుండి దేవతలను బ్రాహ్మణులను నొసంగునట్లు చేయుండు. ౧౮

భటులందఱును నిడుపయిన కత్తి మొలనుబిగించికొని కవచముఁ దొడిగికొని పరిశుద్ధములగు వస్త్రము గట్టుకొని మహోదయముగు రాజగృహము ముంగిట నుండునట్లు చేయుండు. అని వసిష్ఠవామదేవులు సుమంత్రాదుల కాజ్ఞాపించిరి. ౧౯

స్థైర్యసంపన్నులగు నావసిష్ఠవామదేవు లిట్లు అచ్చటఁ దాము చేయవలసిన కార్యములను, మంత్రుల కాజ్ఞాపించి మిగిలినవానినిఁగూడ దశరథునకును దెల్పి కొఱవేర్చిరి. ౨౦

బ్రాహ్మణశ్రేష్ఠులగు వసిష్ఠవామదేవులు సంతోషించి గురుర్పాటుతోఁ గూడినవారలై దశరథుని దగ్గఱి "నీవు చెప్పినమాటప్రకారము, అంతయుఁ జేయఁబడినది" అని చెప్పిరి. ౨౧

అంత రామాభిషేకనిశ్చయంబునం జేసి ప్రశస్తంబయిన కాంతిగల దశరథమహారాజు సుమంత్రునింజూచి "నీవుపోయి విద్యాభ్యాసంబునం బరిశుద్ధంబయిన బుద్ధిగల రాముని వేగ దోడ్కొని రమ్ము" అని చెప్పెను. ౨౨

ఆసుమంత్రుఁడు అలాగే యని చెప్పి రాజాజ్ఞప్రకారము రథికులలో శ్రేష్ఠుఁడయిన రాముని రథముపై నెక్కించుకొని యచ్చటికి దోడ్కొని వచ్చెను. ౨౩

అథ తత్ర సమాసీనా స్తదా దశరథం నృపమ్. ౨౪
ప్రాచ్యోదీచ్యాః ప్రతీచ్యాశ్చ దాక్షిణాత్యాశ్చ భూమిపాః,
మ్లేచ్ఛాశ్చార్యాశ్చ యేచాన్యే వన శైలా న్తవాసినః. ౨౫
ఉపాసాఞ్చక్రిరే సర్వే తం దేవా ఇవ వాసవమ్,

తేషాం మధ్యే స రాజర్షి ర్మరుతా మివ వాసవః. ౨౬
ప్రాసాదస్థో రథగతం దదర్శాయా న్త మాత్మజమ్,

గన్ధర్వరాజప్రతిమం లోకే విఖ్యాతపౌరుషమ్. ౨౭
దీర్ఘబాహుం మహాసత్త్వం మత్తమాతఙ్గగామినమ్,
చన్ద్రకాన్తాననం రామ మతీవ ప్రియదర్శనమ్. ౨౮
రూపౌదార్యగుణైః పుంసాం దృష్టిచిత్తాపహారిణమ్,
ఘర్మాభితప్తాః పర్జన్యం హ్లాదయ న్త మివ ప్రజాః. ౨౯
న తతర్ప సమాయా న్తం పశ్యమానో నరాధిపః,

అవతార్య సుమన్త్ర స్తం రాఘవం స్యన్దనో త్తమాత్. ౩౦
పితు స్సమీపం గచ్ఛ న్తం ప్రాఞ్జలిః పృష్ఠతోఽన్వగాత్,

స తం కైలాసశృఙ్గాభం ప్రాసాదం నరపుఙ్గవః. ౩౧
ఆరురోహ నృపం ద్రష్టుం సహ సూతేన రాఘవః,

స ప్రాఞ్జలి రభిప్రేత్య ప్రణతః పితు ర న్తికే. ౩౨

ఆసుమంత్రుఁడు రామునిఁ దోడ్తేఁబోయినపిమ్మట నప్పుడు సభయం దున్న తూర్పుదేశపురాజులు నుత్తరదేశపురాజులుఁ బడమటిదేశపురాజులు దక్షిణదేశపురాజులు మ్లేచ్ఛరాజులు మఱియు నడవియందుఁ బర్వతప్రదేశము నందుండు నాటవికు లనంబడువారలు వీర లందఱును దేవతలు దేవేంద్రుని సేవించునట్లు దశరథమహారాజును సేవించిరి. ౨౭

ఇంద్రుఁడు దేవతలనడుమనుండునట్లు ఆరాజులనడుమనుండి తేజరిల్లుచున్నదశరథుఁడు మేడపైనుండి దారిలో రథంబుపై వచ్చుచున్న రామునిఁ జూచెను. ౨౮

దశరథుఁడు భోగానుకూలంబులగు రూపవేషంబుల గంధర్వరాజుం బోలువాఁడును లోకంబునం బ్రసిద్ధివహించిన పరాక్రమంబుగలవాఁడును మోకాలివఱకు వ్రేలాఁడు బాహువులుఁగలవాఁడును మహాబలుండును మదపుటేనుఁగుఁబోలె మదాలసంబుగ నడుచువాఁడును, చంద్రబింబమువలె సుందరంబగు ముఖంబుగలవాఁడును దనుఁజూచువారల కత్యంతానందంబు గలిగియుండువాఁడును, సౌందర్యంబున నౌదార్యంబున సౌశీల్యంబునఁ బురుషులనుఁగూడ మోహింపఁజేయువాఁడును ఎండవ్రేటునం గ్రాఁగియుండు జనులకు మేఘంబువలెఁ జల్లఁదనంబుఁ బొరయించువాఁడును దనయొద్దకు వచ్చుచున్నవాఁడు నగురాముని మేడపై నుండి యెడతెగక చూచుచున్నను బ్రేమరసంబు క్షణక్షణంబును బెరుఁగుచుండుటం జేసి తృప్తి నొందఁడయ్యె. ౨౯

సుమంత్రుఁ డంతనారాముని రథంబునుండి హస్తప్రదానాదిగౌరవంబులచే దించి యారాముఁడు దశరథునియొద్దకుఁ బోవుచుండఁగాఁ జేతులు మొగిడ్చికొని యతని వెనుకను వెంబడించిపోయెను. ౩౦

పురుషశ్రేష్ఠుఁడగు నారాముఁడు దశరథుంజూచుటకై సుమంత్రుఁడు వెంబడింపఁగాఁ గైలాసశిఖరంబువలె నత్యున్నతంబై తెల్లఁగానుండు నారాజగృహంబుపైకి నారోహించెను. ౩౧

ఆరాముఁడు చేతులుమొగిడ్చికొని తండ్రిసమీపంబునకుఁ బోయి

నామ స్వం శ్రావయ న్రామో వవన్దే చరణౌ పితుః,

తందృష్ట్వా ప్రణతం పార్శ్వే కృతాఞ్జలిపుటం నృపః. 33
గృహ్యాఞ్జలౌ సమాకృష్య సస్వజే ప్రియ మాత్మజమ్,

తస్మై చాభ్యుదితం దివ్యం మణికాఞ్చనభూషితమ్. 3౪
దిదేశ రాజా రుచిరం రామాయ పరమాసనమ్,

త దాసనవరం ప్రాప్య వ్యదీపయత రాఘవః. 3౫
స్వ యైవ ప్రభయా మేరు ముద యే విమలో రవిః,

తేన విభ్రాజితా తత్ర సా సభాఽభివ్యరోచత. 3౬
విమలగ్రహనక్షత్రా శారదీ ద్యౌరివేన్దునా,

తం పశ్యమానో నృపతి స్తుతోష ప్రియ మాత్మజమ్. 3౭
అలఙ్కృత మి వాత్మాన మాదర్శతలసంస్థితమ్,

స తం సస్మిత మాభాష్య పుత్రం పుత్రవతాం వరః. 3౮
ఉవాచేదం వచో రాజా దేవేన్ద్ర మివ కాశ్యపః,

జ్యేష్ఠాయామసి మే పత్న్యాం సదృశ్యాం సదృశ స్సుతః. 3౯
ఉత్పన్న స్త్వం గుణశ్రేష్ఠో మమ రామాత్మజః ప్రియః!,

నమ్రుఁడై "రామవఽర్హాహ మస్మిభో" అని తనపేరు వినిపించుచుఁ దండ్రి పాదములకు నమస్కారంబు చేసెను. ౩౨

దశరథమహారాజు అట్లు తనకు నమస్కరించి చేతులు మొగిడ్చికొని తన ప్రక్కనున్న ప్రియపుత్రుఁడగు రామునిం జూచి యతని చే మోడ్పుపట్టి యాకర్షించుకొని కౌఁగిలించెను. ౩౩

దశరథమహారాజు ఆరామునకు నున్నతంబై దివ్యంబై మణులచేతను బంగారముచేతను అలంకరింపఁబడి మనోహరంబైయుండు మేలయిన యాసనం బొసఁగెను. ౩౪

రాముఁ డాయాసనంబునఁ గూర్చుండి ఉదయకాలంబున సూర్యుఁడు మేరుపర్వతంబునొంది యప్పర్వతంబును దన కాంతిచేఁ బ్రకాశింపఁజేయు నట్లు యయ్యాసనంబును దన కాంతిచేఁ బ్రకాశింపఁజేసెను. ౩౫

స్వచ్ఛములగు గ్రహంబులును నక్షత్రములును గలిగిన శరదృతువు నందలి యాకాశమును జంద్రుఁడు ప్రకాశింపఁజేయునట్లు ఆప్రాసాదంబు వసిష్ఠాదులతోఁగూడిన యాసభను రాముఁడు ప్రకాశింపఁజేసెను. ౩౬

దశరథమహారాజు చక్కఁగా నలంకరించికొని తన్ను అద్దంబునఁ జూచుకొని సంతోషించునట్లు తన ప్రతిబింబ మనదగు ప్రియపుత్రుఁడైన రామునిఁ జూచి సంతోషించెను. ౩౭

రామునివంటి యుత్తమపుత్రుఁడు గలిగినవాఁ డగుటచేఁ బుత్రవంతు లలో నుత్తముఁ డనఁదగిన దశరథమహారాజు చిఱునగవుతో "రామా!" యని పిలిచి కాశ్యపుండు తనపుత్రుండగు దేవేంద్రునితోఁ జెప్పినట్లు తన పుత్రుండగు రామునితో నిట్లని చెప్పెను. ౩౮

రాముఁడా! నీవు యోగ్యురాలయిన నాజ్యేష్ఠపత్నియందుఁ బుట్టిన యోగ్యుఁడ వగుపుత్రుఁడవు. గుణంబుల శ్రేష్ఠుఁడవు. అట్లు నాకుఁ బ్రియ కుమారుఁడవు. ౩౯

యత స్త్వయా ప్రజా శ్చేమా స్స్వగుణై రనురఞ్జితాః. ౪౦
తస్మా త్త్వం పుష్యయోగేన యౌవరాజ్య మవాప్నుహి,

కామత స్త్వం ప్రకృత్యైవ వినీతో గుణవానసి. ౪౧
గుణవత్యపి తు స్నేహా త్పుత్ర వక్ష్యామి తే హితమ్,

భూయో వినయ మాస్థాయ భవ నిత్యం జితేన్ద్రియః. ౪౨
కామక్రోధసముత్థాని త్యజేథా వ్యసనాని చ,

పరోక్షయా వర్తమానో వృత్త్యా ప్రత్యక్షయా తథా. ౪౩
అమాత్యప్రభృతీ స్సర్వాః ప్రకృతీ శ్చానురఞ్జయ,

కోష్ఠాగారాయుధాగారైః కృత్వా సన్నిచయాన్బహూన్. ౪౪
తుష్టానురక్తప్రకృతి ర్యః పాలయతి మేదినీమ్,
తస్య నన్దన్తి మిత్రాణి లబ్ధ్వాఽమృత మివామరాః. ౪౫

తస్మా త్త్వమపి చాత్మానం నియమ్యైవం సమాచర,
తచ్ఛ్రుత్వా సుహృద స్తస్య రామస్య ప్రియకారిణః. ౪౬
త్వరితా శ్శీఘ్ర మభ్యేత్య కౌసల్యాయై న్యవేదయన్,

నీవు గుణంబులచేత మమ్ముల నేమి యీజనంబుల నేమి చాల సంతోష పఱచినావు. కావున నీజనులందఱు నీకు యౌవరాజ్యము కావలెనని చెప్పుచున్నారు. అందువలన నీవు పుష్యనక్షత్రంబునాఁడు యౌవరాజ్యంబు నొందుము. ౪౦

రాముఁడా! నీవు స్వభావంబుగనే మిక్కిలియు వినయంబుగలవాఁడవు. గుణవంతుఁడవు. అట్లు నీవు గుణవంతుఁడవయి యుండుటంజేసి నేను నీకుపదేశింపవలసిన దేమియు లేదు. అయినను స్నేహంబున నీకు హితంబు చెప్పెదను వినుము. ౪౧

నీ వింకను అధికంబుగా వినయంబు నొంది యెప్పుడును ఇంద్రియ నిగ్రహంబుగలిగి ప్రవర్తింపుము "స్త్రీ, జూదము, వేట, మద్యము" ఇవి మొదలగు కామజంబులయిన వ్యసనంబులను, పరుషముగా మాటలాడుట, క్రూరముగా దండించుట, బొక్కసము నెలవు చేయుట" మొదలగు క్రోధజంబులయిన వ్యసనంబులను విడువుము. ౪౨

నీవు చిల్లరపనివాండ్ర దర్శనం బివ్వక వారికిఁ బరోక్షంబుగానే యుండి యాజ్ఞల నొసంగుచు మంత్రులు మొదలగువారలతో నెల్లప్పుడును గూడియుండి వారలకుఁ బ్రత్యక్షముగనే కార్యముల జరిగించుచుండుము. మఱియు, మంత్రులు సేనాధిపతులు మొదలగువారలను ప్రజలను అందఱను సంతోషపఱచుచుండుము. ౪౩

ధాన్యంబులను ఆయుధంబులను అగారగృహంబుల నింపి ధనంబులు మొదలగువాని మెండుగాఁగూర్చి జనులందఱు సంతసించి తనమీఁద నను రాగంబుగలిగియుండునట్లు ఎవ్వఁడు భూమి నేలునో అతనిఁ జూచి యతని స్నేహితులు అమృతంబుఁబొందిన దేవతలఁబోలె సంతసింతురు. ౪౪

అట్లగుటంజేసి నీవును మనంబుఁజాపలంబు నొందనీక యట్లు సేయుము.

ఆరాముని స్నేహితులు అతనికిఁ బ్రియంబు సేయువారలు అట్లు దశరథుఁడు "రాముని యౌవరాజ్యం బొసఁగెద" ననుటను విని త్వరితంబుగాఁ

సా హిరణ్యం చ గా శ్చైవ రత్నాని వివిధాని చ. ౪౭
వ్యాదిదేశ ప్రియాఖ్యేభ్యః కౌసల్యా ప్రమదోత్తమా,

అథాఽభివాద్య రాజానం రథ మారుహ్య రాఘవః. ౪౮
యయౌ స్వం ద్యుతిమ ద్వేశ్మ జనౌఘైః ప్రతిపూజితః,

తే చాపి పౌరా నృపతే ర్వచ స్త
చ్ఛ్రుత్వా తథా లాభ మి వేష్ట మాశు,
నరేన్ద్ర మామన్త్ర్య గృహాణి గత్వా
దేవా న్సమానర్చు రతిప్రహృష్టాః. ౪౯
ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే తృతీయస్సర్గః

---

## చతుర్థస్సర్గః

గతే ష్వథ నృపో భూయః పౌరేషు సహ మన్త్రిభిః,
మన్త్రయిత్వా తత శ్చక్రే నిశ్చయజ్ఞ స్స నిశ్చయమ్. ౧
శ్వ ఏవ పుష్యో భవితా శ్వోఽభిషేచ్య స్తు మే సుతః,
రామో రాజీవతామ్రాక్షో యౌవరాజ్య ఇతి ప్రభుః. ౨

అథాఽ న్తర్గృహ మావిశ్య రాజా దశరథ స్తదా,
సూత మామన్త్రయామాస రామం పున రిహానయ. 3
ప్రతిగృహ్య స తద్వాక్యం సూతః పున రుపాయయౌ,
రామస్య భవనం శీఘ్రం రామ మానయితుం పునః. ౪

గౌసల్యకడకుం జని యాదేవితో "రాముఁడు యువరాజు గాఁగలఁడు" అని దశరథప్రయత్నమును దెలియఁజేప్పిరి ౪౬

స్త్రీలలో నుత్తమురాలయిన యాకౌసల్య అట్లు తనకు రామాభిషేక రూపంబగు ప్రియవార్త దెలిపిన యారామమిత్రులకు బంగారమును గోవులను నానావిధమణులను ఒసంగెను. ౪౭

అంత రాముఁడు తండ్రియగు దశరథమహారాజునకు నమస్కారము జేసి రథంబెక్కి జనులు గుంపులుగుంపులుగాఁ దన్నెదుర్కొని పూజింపఁగాఁ గాంతిమంతంబగు తనయింటికిం బోయెను. ౪౮

అంతఁ బట్టణవాసిజనులును తమకు నిష్టలాభం బనందగియున్న దశరథుఁడు చెప్పిన రామాభిషేకవార్తను విని యంత దశరథునియొద్ద సెలవుఁ బొంది శీఘ్రంబుగాఁ దమయిండ్లు చేరి సంతోషంబున శ్రీరామాభిషేకము నిర్విఘ్నం బగుటకై తమతమయిష్టదేవతలం బూజించిరి. ౪౯

ఇది మూఁడవ సర్గము.

---

## నాల్గవ సర్గము

అంతఁ బౌరులందఱుఁ బోయినపిమ్మటఁ గార్యంబుల నిశ్చయించు పద్ధతుల నెఱింగినవాఁడును ప్రభుఁడునగు దశరథమహారాజు మఱల మంత్రులతో నాలోచించి "రేపే పుష్యనక్షత్రంబు వచ్చును గావున ఎఱ్ఱదామర పువ్వులంబోలు రక్తాంతంబులగు నేత్రంబులు గలవాని నాకుమారుని రాముని రేపే యౌవరాజ్యంబున నభిషేకించునది యని నిశ్చయించెను. ౧,౨.

అంత దశరథమహారా జంతఃపురంబునకుఁ బోయి సుమంత్రునిఁ జూచి "నీవు రాముని మఱల నిచ్చటికిఁ దోడ్కొని రమ్ము" అని యాజ్ఞాపించెను. 3

సుమంత్రుఁడు దశరథాజ్ఞను శిరసావహించి మఱల రామునిఁ దోడ్కొనివచ్చుటకై శీఘ్రంబుగా రాముని గృహంబునకుఁ బోయెను. ౪.

దూ్వాస్థైరావేదితం తస్య రామాయాఽఽగమనం పునః,
శ్రుత్వైవ చాపి రామ స్తం ప్రాప్తం శఙ్కాన్వితోఽభవత్. ౫

ప్రవేశ్య చైనం త్వరితం రామో వచన మబ్రవీత్,
యదాగమనకృత్యం తే భూయ స్త ద్బ్రూహ్య శేషతః. ౬

త మువాచ తత స్సూతో రాజా త్వాం ద్రష్టు మిచ్ఛతి,
శ్రుత్వా ప్రమాణ మత్ర త్వం గమనాయేతరాయ వా. ౭

ఇతి సూతవచ శ్శ్రుత్వా రామోఽథ త్వరయాఽన్వితః,
ప్రయయౌ రాజభవనం పున ర్ద్రష్టుం నరేశ్వరమ్. ౮
తం శ్రుత్వా సమనుప్రాప్తం రామం దశరథో నృపః,
ప్రవేశయామాస గృహం వివక్షుః ప్రియ ముత్తమమ్. ౯

ప్రవిశన్నేవ చ శ్రీమా న్రాఘవో భవనం పితుః,
దదర్శ పితరం దూరా త్ప్రణిపత్య కృతాఞ్జలిః. ౧౦

ప్రణమన్తం సముత్థాప్య తం పరిష్వజ్య భూమిపః,
ప్రదిశ్య చాస్మై రుచిర మాసనం పున రబ్రవీత్. ౧౧

రామ వృద్ధోఽస్మి దీర్ఘాయు ర్భుక్తా భోగా మయేప్సితాః,
అన్నవద్భిః క్రతుశతై స్తథేష్టం భూరిదక్షిణైః. ౧౨

అంత ద్వారపాలకు "లూసుమంత్రుఁడు వాకిట వచ్చియున్నాఁ డని రామునకుఁ జెప్పిరి. రాముఁడును సుమంత్రుఁడు మఱల వచ్చుటకుఁ గారణం బేమొకో" యని సందేహంబు నొందెను. ౫

రాముఁడు సుమంత్రుని శీఘ్రముగా లోనికి వచ్చునట్లుచేసి యతనిఁ జూచి యిట్లని చెప్పెను. ౫

నీవు మఱల నిచ్చటి కేమికార్యముగా వచ్చితివో దాని నంతయుం సవిస్తరంబుగాఁ జెప్పుము. అని రాముఁడు సుమంత్రునితోఁ జెప్పెను. ౬

అంత సూతుఁడు రామునిఁజూచి "దశరథమహారాజు నిన్నుఁ జూడఁ గోరుచున్నాఁడు. ఈమాటను విన్నపైని దశరథునియొద్దకుఁ బోవుటకుఁ గాని యూరకుండుటకుఁగాని నీవ ప్రభుండవు" అని చెప్పెను. ౭

రాముఁ డిట్లు సుమంత్రునిమాటవిని మఱల దశరథమహారాజుఁ జూచుటకై వేగంబుగా రాజగృహంబునకుఁ బోయెను. ౮

దశరథమహారాజు రాముఁడు వాకిట వచ్చియుండుటను ద్వారపాలకుల వలన నెఱింగి ఉత్తమంబగు ప్రియవార్తఁ జెప్పఁదలఁచి గృహంబులోనికి వచ్చునట్లు చేసెను. ౯

శ్రీమంతుఁడగు రాముఁడు తండ్రిగృహంబు ప్రవేశించుచునే దూరంబుననుండి నమస్కారంబుఁజేసి చేతులు మొగిడ్చికొని సవినయంబుగఁ దండ్రియగు దశరథమహారాజును సందర్శించెను. ౧౦

దశరథమహారాజు అట్లు నమస్కరించుచున్న రాముని యెత్తి కౌఁగిలించికొని యతని మనోహరంబగు ఆసనంబునం గూర్చుండఁజేసి యిట్లని చెప్పెను. ౧౧

రాముఁడా; నేను దీర్ఘకాలము బ్రతికి వృద్ధుఁడనైతి. నేను గోరిన భోగంబుల నన్నిఁటి ననుభవించినాఁడను. అట్లు ప్రశస్తంబులయిన యన్న ప్రదానంబులు నధికదక్షిణలుఁ గల పెక్కునూఱులు యాగంబులు చేసినాఁడను. ౧౨

జాత మిష్ట మపత్యం మే త్వ మద్యానుపమం భువి,
ద త్త మిష్ట మధీతం చ మయా పురుషస త్తమ. ౧౩

అనుభూతాని చేష్టాని మయా వీర సుఖాన్యపి,

దేవర్షిపితృవిప్రాణా మనృణోఽస్మి తథాఽఽత్మనః. ౧౪

న కిఞ్చి న్మమ క ర్తవ్యం తవాన్యత్రాభిషేచనాత్,
అతో య త్త్వా మహం బ్రూయాం త న్మే త్వం క ర్తు మర్హసి.

అద్య ప్రకృతయ స్సర్వా స్త్వా మిచ్ఛ న్తి నరాధిపమ్,
అత స్త్వాం యువరాజాన మభిషేక్ష్యామి పుత్రక. ౧౬
అపిచాద్యాఽశుభా న్రామ స్వప్నే పశ్యామి దారుణాన్,
సనిర్ఘాతాదివోల్కా చ పతతీహ మహాస్వనా. ౧౭

అవష్టబ్ధం చ మే రామ నక్షత్రం దారుణై ర్గ్రహైః,
ఆవేదయ న్తి దైవజ్ఞా స్సూర్యాఙ్గారకరాహుభిః. ౧౮

ప్రాయేణ హి నిమిత్తానా మీదృశానాం సముద్భవే,
రాజాహి మృత్యు మాప్నోతి ఘోరాం వాఽఽపద మృచ్ఛతి.

పురుషశ్రేష్ఠుఁడవగు రాముఁడా ! ఇప్పుడు నీవు నాకుఁ బ్రియుఁడవు భూమియందు సాటిలేనివాఁడవు నగు కుమారుండవై యున్నావు. నేను బహు దానములు చేసినాఁడను. యాగములు చేసినాఁడను అట్లధ్యయనంబును చే సినాను. ౧౨

పరాక్రమశాలివగు రాముఁడా! "అనిషిద్ధసుఖత్యాగీ పశురేవ న సంశయః" (శాస్త్రంబునందు నిషిద్ధంబు కాని సుఖంబును విడుచువాఁడు పశుప్రాయుఁడే సందియములేదు) అని చెప్పఁబడియుండునట్లు శాస్త్రంబున నిషిద్ధములు కాని సుఖంబులను యథేష్టంబుగా ననుభవించినాఁడను. ౧౩

అట్లు యాగములు చేయుటంజేసి నాకు దేవతలఋణంబు తీఱినది. అధ్యయనము చేయుటవలన ఋషులఋణము దీఱినది. నిన్నుఁ గనుటవలనఁ బితరుల ఋణము దీఱినది. నానావిధంబులుగా దానంబులు సేయుటచే బ్రాహ్మణుల ఋణంబుఁ దీఱినది అట్లు సమస్తసుఖంబుల ననుభవించినాను గావున శరీర ఋణంబునుం దీర్చుకొన్నవాఁడ నైతిని. ౧౪

నీకు రాజ్యాభిషేకము సేయుటకన్న నేను మఱేమియుఁ జేయవలసినది లేదు కావున నేను నీ కేమి చెప్పెదనో దాని నీ విప్పుడు నాకొఱకుఁ జేయవలెను. ౧౫

చిన్నకొమరుఁడవగు రాముఁడా ! ఇప్పుడు ప్రజలందఱు "నీవు రాజు కావలె" నని కోరుచున్నారు కావున నీకు యౌవరాజ్యం బొసఁగెదను.

రాముఁడా ! ఇదిగాక నాకు స్వప్నంబున భయంకరంబులును అమంగళకరంబులు నగు నుత్పాతంబులు కనుపడుచున్నవి. ఆకాశంబునుండి పిడుగులతోఁగూడ మంటలేనియగ్నులు గొప్పధ్వనితోఁ బడుచున్నవి. ౧౬

రాముఁడా ! "నాజన్మనక్షత్రమును భయంకరులగు సూర్యుఁడు నంగారకుఁడు రాహువు నాక్రమించియున్నా" రని జ్యోతిషికులు చెప్పుచున్నారు. ౧౭

ఇట్టి దుర్నిమిత్తంబులు గలిగినప్పుడు ప్రాయికముగా రాజునకు మరణంబు గలుగును. అట్లుగాదేని గొప్పయాపదయైనను సంభవించును. ౧౮

త ద్యావ దేవ మే చేతో న విముహ్యతి రాఘవ,
తావదేవాభిషిఞ్చస్వ చలా హి ప్రాణినాం మతిః. ౨౦

అద్య చన్ద్రోఽభ్యుపగతః పుష్యా త్పూర్వం పునర్వసూ,
శ్వః పుష్యయోగం నియతం వక్ష్య న్తే దైవచి న్తకాః. ౨౧

తతః పుష్యేఽభిషిఞ్చస్వ మన స్త్వరయతీవ మామ్,
శ్వస్త్వాఽహ మభిషేక్ష్యామి యౌవరాజ్యే పర న్తప. ౨౨

తస్మా త్త్వయాఽద్యప్రభృతి నిశేయం నియతాత్మనా,
సహ వధ్వోపవ స్తవ్యా దర్భప్ర స్తరశాయినా. ౨౩

సుహృదశ్చాప్రమత్తా స్త్వాం రక్ష న్త్వద్య సమ న్తతః,
భవ న్తి బహువిఘ్నాని కార్యాణ్యేవంవిధాని హి. ౨౪

విప్రోషిత శ్చ భరతో యావదేవ పురాదితః,
తావ దేవాభిషేక స్తే ప్రా ప్తకాలో మతో మమ. ౨౫

కామం ఖలు సతాం వృ త్తే భ్రాతా తే భరత స్స్థితః,
జ్యేష్ఠానువ ర్తీ ధర్మాత్మా సానుక్రోశో జితేన్ద్రియః. ౨౬

కింతు చి త్తం మనుష్యాణా మనిత్య మితి మే మతిః,
సతాం తు ధర్మనిత్యానాం కృతశోభి చ రాఘవ. ౨౭

రాముఁడా! అందువలననే నా కిప్పుడు గలిగిన "నిన్ను యౌవరాజ్యమునం దభిషేకింపవలె" నని యెడుతలంపు మాఱుటకు మునుపే నీ వభిషిక్తుండ వగుము. అట్లుగాదేని ప్రాణులబుద్ధి చంచలంబు కావున భేదంబు కలుగును. ౨౦

నేఁడు చంద్రుఁడు పుష్యమునకుముందు నక్షత్రంబయిన పునర్వసువుఁ బొందియున్నాఁడు. మన మభిషేకమునకు నిర్ణయించుకొనిన పుష్యయోగము రేపు వచ్చునని జ్యోతిషికులు చెప్పుచున్నారు. ౨౧

కావున నీవు పుష్యనక్షత్రంబున నభిషిక్తుండవగుము. నామనసే నన్ను వేగిరపఱచుచున్నట్లున్నది. శత్రువులఁ జంపు రాముఁడా! రేపు నీకు యౌవరాజ్యాభిషేకంబు చేసెదను. ౨౨

అట్లగుటంజేసి యిదిమొదలు నీవు. మనంబు నిశ్చలంబుఁ జేసికొని దర్భలపైఁ బరుండియుండి భార్యతోఁగూడ నీరాత్రి యంతయు నుపవాసం బుండవలయును. ౨౩

ఇట్టిగొప్పకార్యములకు నధికముగా విఘ్నములు గలుగును గావున నీస్నేహితు లందఱును ఎచ్చరికగల్గి నిన్నిప్పుడు సర్వవిధంబులను రక్షింపవలయును. ౨౪

దూరదేశమునకుఁ బోయియున్న భరతుఁడు ఈపట్టణంబున కెంతవఱకు రాకుండునో అంతవఱకే నీయభిషేకమునకుఁ దగినకాలమని నాకుఁ దోఁచుచున్నది. ౨౫

నీతమ్ముఁడగు భరతుఁడు మిక్కిలియు సజ్జనుల యాచారమునందున్నవాఁడే, అన్నయగు నిన్ననుసరించి యుండువాఁడే, ధర్మబుద్ధిగలవాఁడే, దయగలవాఁడే, జితేంద్రియుఁడే, ఇందేమియు సందియంబు లేదు. ౨౬

అట్లయినను మనుష్యులమనస్సు చంచలంబని నాసిద్ధాంతము. కొంచెమైనను ధర్మము తప్పని పెద్దలుమాత్రము తనకుఁ జేసినయుపకారమును దలఁతురే కాని యెంతమాత్రము భేదము నొందరు. ౨౭

ఇత్యుక్తస్సోఽభ్యనుజ్ఞాతశ్శ్వో భావిన్యభిషేచనే,
వ్రజేతి రామః పితర మభివాద్యాభ్యయా ద్గృహమ్. 28

ప్రవిశ్య చాత్మనో వేశ్మ రాజ్ఞోద్దిష్టేఽభిషేచనే,
తస్మిన్ క్షణేన వినిర్గమ్య మాతు రన్తఃపురం యయౌ. 29
తత్ర తాం ప్రవణా మేవ మాతరం క్షౌమవాసినీమ్,
వాగ్యతాం దేవతాగారే దదర్శాఽఽయాచతీం శ్రియమ్. 30

ప్రాగేవ చాగతా తత్ర సుమిత్రా లక్ష్మణ స్తదా,
సీతా చానయితా శ్రుత్వా ప్రియం రామాభిషేచనమ్. 31

తస్మిన్ కాలే హి కౌసల్యా తస్థా వామీలితేక్షణా,
సుమిత్రయా ఽన్వాస్యమానా సీతయా లక్ష్మణేన చ. 32
శ్రుత్వా పుష్యేణ పుత్రస్య యౌవరాజ్యేఽభిషేచనమ్,
ప్రాణాయామేన పురుషం ధ్యాయమానా జనార్దనమ్. 33

తథా సన్నియమా మేవ సోఽభిగమ్యాభివాద్య చ,
ఉవాచ వచనం రామో హర్షయంస్తా మనిన్దితామ్. 34

అమ్బ పిత్రా నియుక్తోఽస్మి ప్రజాపాలనకర్మణి,
భవితా శ్వోఽభిషేకో మే యథా మే శాసనం పితుః. 35

సీతయా ప్యుపవస్తవ్యా రజనీయం మయా సహ,

రేపు అభిషేకము జరుగఁగలదనుచుండఁగా నిట్లు దశరథుఁడు చెప్పి యనుమతి యివ్వఁగానే యా రాముఁడు తండ్రికి నమస్కారముచేసి తన యింటికిం బోయెను. ౨౮

రాముఁడు తనయిల్లు ప్రవేశించి రాజు తనకభిషేకంబు సేయం దలంచుటం జెప్పుటకై తల్లియగు కౌసల్య యింటికిఁబోయెను. ౨౯

రాముఁ డచ్చట దేవతాగృహంబునందు పట్టువస్త్రంబు ధరించి మౌనంబు నొంది పుత్రార్థంబుగా రాజ్యలక్ష్మిం బ్రార్థించుచున్న తల్లియైన కౌసల్యం జూచెను. ౩౦

రాముఁడు వచ్చుటకుమున్నే "ప్రియంబగు రామాభిషేకంబు జరుగం గలదని విని సుమిత్రయు నా కౌసల్యయొద్దకువచ్చి యుండినది. అప్పుడే లక్ష్మణుఁడును వచ్చెను. అంతవారలు దాసీజనంబులం బంపి సీతనుఁగూడ నచ్చటకు రప్పించిరి. ౩౧

అప్పుడు కౌసల్యాదేవి తన్ను సుమిత్రయుం సీతయుం లక్ష్మణుఁడును సేవించుచుండఁగా గన్నులుమూసికొని ధ్యానపరయై యుండెను. ౩౨

పుష్యనక్షత్రమునందుఁ గొడుకునకు యౌవరాజ్యమునందుఁ బట్టాభిషేకంబు జరుగునని విని యా కౌసల్యాదేవి కొడుకునకు మంగళాభివృద్ధిగలుగుటకై పురుషోత్తమునందుఁ బ్రతిపాదితుండగు నారాయణుని ధ్యానించుచుండెను. ౩౩

ఆ రాముం డట్టుత్తమంబగు నియమం బవలంబించియున్న తల్లియొద్దకుఁ బోయి నమస్కరించి యప్పు డావిడకుఁ సంతోషంబు గొలుపుచు నిట్లని చెప్పెను. ౩౪

అమ్మా! ప్రజలం బాలింపుమని నన్నుఁ దండ్రియగు దశరథమహారాజాజ్ఞాపించెను. రేపు నాకుఁ బట్టాభిషేకంబు జరుగవలయునని దశరథమహారాజానతిచ్చియున్నాఁడు. ౩౫

సీతయును నాతోఁగూడ నేటిరాత్రి యుపవాసం బుండవలయును అని

ఏవ మృత్విగుపాధ్యాయై స్సహ మా ముక్తవా న్నృపః. ౩౬
యాని యాన్యత్ర యోగ్యాని శ్వో భావిన్యభిషేచనే,
తాని మే మఙ్గళాన్యద్య వైదేహ్యాశ్చాపి కారయ. ౩౭

ఏత చ్ఛ్రుత్వా తు కౌసల్యా చిరకాలాభికాంక్షితమ్,
హర్ష బాష్పకలం వాక్యమిదం రామ మభాషత. ౩౮

వత్స రామ చిరంజీవ హతా స్తే పరిపన్థినః,
జ్ఞాతీ న్మే త్వం శ్రియా యుక్త స్సుమిత్రాయాశ్చ నన్దయ. ౩౯

కల్యాణే బత నక్షత్రే మయి జాతోఽసి పుత్రక,
యేన త్వయా దశరథో గుణై రారాధితః పితా. ౪౦

అమోఘం బత మే క్షాన్తం పురుషే పుష్కరేక్షణే,
యేయ మిక్ష్వాకురాజ్యశ్రీః పుత్ర త్వాం సంశ్రయిష్యతి. ౪౧

ఇత్యేవ ముక్తో మాత్రేదం రామో భ్రాతర మబ్రవీత్,
ప్రాఞ్జలిం ప్రహ్వ మాసీన మభివీక్ష్య స్మయ న్నివ. ౪౨

లక్ష్మణేమాం మయా సార్ధం ప్రశాధి త్వం వసున్ధరామ్,
ద్వితీయం మేఽన్తరాత్మానం త్వా మియం శ్రీ రుపస్థితా. ౪౩

సౌమిత్రే భుఙ్క్ష్వ భోగాం స్త్వమిష్టా న్రాజ్యఫలాని చ,

దశరథమహారాజును ఋత్విజులును నుపాధ్యాయులును నాతోఁ జెప్పిరి. ౩౬

రేపు పట్టాభిషేకము జరుగఁగల దనుచుండఁగా నేఁడే మంగళకార్యములు సేయవలయునో ఆమంగళకార్యములనన్నింటిని నాకును సీతకును ఇప్పుడు చేయింపుము. అని రాముఁడు కౌసల్యతోఁ జెప్పెను. ౩౭

బహుకాలముగాఁ గోరఁబడుచుండు నీపట్టాభిషేకవార్తను వినినంతనే కౌసల్యాదేవి యానందబాష్పంబులఁ జేసి తడఁబడుచు మధురంబుగా నిట్లని చెప్పెను. ౩౮

బిడ్డఁడ వగు రాముఁడా! నీవు బహుకాలము జీవించుదువుగాక. నీ శత్రువులందఱు హతులగుదురుగాక. నీవు రాజ్యలక్ష్మిం గూడి నాబంధువులను సుమిత్రబంధువులను సంతోషంబు సేయుము. ౩౯

చిన్నికొమరుఁడవగు రాముఁడా! సంతోషము! నీవు మంచినక్షత్రమందు నాయందుఁ బుట్టినాఁడవు. కావుననే, నీవు వినయాదిసద్గుణంబులఁ దండ్రి యగు దశరథుని సంతోషపఱచితివి. ౪౦

కుమారుఁడ వగురాముఁడా! ఇక్ష్వాకువంశపురాజులకైన యీ రాజ్యలక్ష్మి నిన్నిప్పుడు పొందఁగలదు కావున నేం బుండరీకాక్షుఁడగు నారాయణుని వ్రతోపవాసాదులచే నారాధించిన దంతయు నిప్పుడు సఫలంబయినది. సంతోషము! అని కౌసల్య రామునితోఁ జెప్పెను. ౪౧

రాముఁ డిట్లు తల్లిచెప్పినమాట విని తనప్రక్కను చేతులు మొగిడ్చికొని నమ్రుఁడై కూర్చుండియున్న తమ్ముని లక్ష్మణునిం జూచి చిఱునగవుతో నిట్లని చెప్పెను. ౪౨

లక్ష్మణుఁడా! నీవు నాతోఁగూడ నీభూమిం బరిపాలింపుము. నీవు నాకు రెండవప్రాణంబ వగుటంజేసి నిన్నును నీరాజ్యలక్ష్మి యాశ్రయించి యున్నది.

లక్ష్మణుఁడా! నీవు కోరినభోగంబులను మఱియుం రాజ్యఫలంబులగు నమూల్యకౌశ్యాభరణాదులను అనుభవింపుము. ప్రాణంబునుగాని రాజ్యం

జీవితం చ హి రాజ్యం చ త్వదర్థ మభికామయే. ౪౪

ఇత్యుక్త్వా లక్ష్మణం రామో మాతరావభివాద్య చ,
అభ్యనుజ్ఞాప్య సీతాం చ జగామ స్వం నివేశనమ్. ౪౫

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే చతుర్థస్సర్గః

---

పఞ్చమస్సర్గః

సందిశ్య రామం నృపతి శ్శ్వోభావిన్యభిషేచనే,
పురోహితం సమాహూయ వసిష్ఠ మిద మబ్రవీత్.

గచ్ఛోపవాసం కాకుత్స్థం కారయాద్య తపోధన,
శ్రీయశో రాజ్యలాభాయ వధ్వా సహ యతవ్రతమ్. ౨

తథేతి చ స రాజాన ముక్త్వా వేదవిదాం వరః,
స్వయం వసిష్ఠో భగవా న్యయౌ రామనివేశనమ్. 3
ఉపవాసయితుం రామం మన్త్రవ న్మన్త్రకోవిదః,
బ్రాహ్మం రథవరం యుక్త మాస్థాయ సుదృఢవ్రతః. ౪

స రామభవనం ప్రాప్య పాణ్డురాభ్రఘనప్రభమ్,
తిస్రః కక్ష్యా రథే నైవ వివేశ మునిసత్తమః. ౫

బునుగాని నీకొఱకే నాకుఁ గావలసినది. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౪౪

రాముఁ డిట్లు లక్ష్మణునితోఁ జెప్పి తల్లులగు కౌసల్యాసుమిత్రలకు నమస్కరించి వారలచే సీత కనుజ్ఞ యిప్పించి సీతంగూడి తనయింటికిఁ బోయెను. ౪౫

ఇది నాల్గవ సర్గము

---

## ఐదవ సర్గము

పట్టాభిషేకము మఱునాఁడు జరుగఁగలదిగానుండఁగా దశరథమహా రాజు రాముని "నీవు రాత్రియంతయు నియమముతో భార్యాసహితంబుగ నుపవాసం బుండుము" అని యాజ్ఞాపించి పురోహితుఁడగు వసిష్ఠునిఁ బిలిచి యిట్లని చెప్పెను. ౧

తపోధనుఁడవగు వసిష్ఠుఁడా! నీవు పోయి యిప్పుడు దృఢవ్రతుఁడగు రాముఁడు భార్యతోఁగూడ సంపదయు యశంబును రాజ్యంబును లభించుటకై యుపవాసం బుండునట్లు చేయుము, అని దశరథుఁడు వసిష్ఠునితోఁ జెప్పెను. ౨

వేదవేత్తలలో శ్రేష్ఠుఁడు భగవంతుఁడు మంత్రంబులఁ జక్కఁగా నెఱింగినవాఁడు దృఢవ్రతుఁడునగు వసిష్ఠుఁడు దశరథమహారాజుతో "అలాగే" యని చెప్పి గుఱ్ఱములంగట్టి సిద్ధము చేయఁబడిన బ్రాహ్మణులారోహింప యోగ్యం బగు రథంబుపై నెక్కి రామునిచే సమంత్రకంబుగా నుపవాసంబు సేయించుటకై మఱి యెవ్వరినిఁ బంపక తానే రామునియింటికిఁ బోయెను. ౩,౪

మునిశ్రేష్ఠుఁడగు నవ్వసిష్ఠుఁడు తెల్లనిమేఘంబుఁబోలె దట్టముగా నుండు తెల్లనికాంతిగలిగి యొప్పుచుండు రామగృహంబుఁజేరి రథంబుమీఁద నుండియే మూఁడులోట్టికట్లు దాఁటెను. ౫

త మాగత మృషిం రామ స్త్వరన్నివ ససమ్భ్రమః,
మానయిష్య న్స మానార్హం నిశ్చక్రామ నివేశనాత్. ౬
అభ్యేత్య త్వరమాణ శ్చ రథాభ్యాశం మనీషిణః,
తతో ఽవతారయామాస పరిగృహ్య రథా త్స్వయమ్. ౭
స చైనం ప్రశ్రితం దృష్ట్వా సమ్భాష్యాభిప్రసాద్య చ,
ప్రియార్హం హర్షయ న్రామ మి త్యువాచ పురోహితః. ౮

ప్రసన్న స్తే పితా రామ యౌవరాజ్య మవాప్స్యసి,
ఉపవాసం భవానద్య కరోతు సహ సీతయా. ౯

ప్రాత స్త్వా మభిషేక్తా హి యౌవరాజ్యే నరాధిపః,
పితా దశరథః ప్రీత్యా యయాతిం నహుషో యథా. ౧౦

ఇత్యుక్త్వా స తదా రామ ముపవాసం యతవ్రతమ్,
మన్త్రవిత్కారయామాస వైదేహ్యా సహితం మునిః. ౧౧
తతో యథావ ద్రామేణ స రాజ్ఞో గురు రర్చితః,
అభ్యనుజ్ఞాప్య కాకుత్స్థం యయౌ రామనివేశనాత్. ౧౨
సుహృద్భి స్తత్ర రామోఽపి సహాసీనః ప్రియంవదైః,
సభాజితో వివేశాఽథ తా ననుజ్ఞాప్య సర్వశః. ౧౩

హృష్టనారీనరయుతం రామవేశ్మ తదా బభౌ,
యథా మత్తద్విజగణం ప్రఫుల్లనలినం సరః. ౧౪

స రాజభవనప్రఖ్యా త్తస్మా ద్రామనివేశనాత్,

ఆరాముఁడును బూజార్హుఁడగు వసిష్ఠుఁడు వచ్చుటఁ జూచి యతనిఁ బూజించుటకై. వేగమునఁ దడఁబడుచు గృహంబునుండి బయలువెడలెను. ౬

రాముఁడు వేగమున వసిష్ఠుని రథంబునొద్దకుఁబోయి యంతఁ దానే యతనిచేయిఁ బట్టుకొని రథంబునుండి దించెను. ౭

పురోహితుఁడగు నావసిష్ఠుఁడు వినయసంపన్నుఁడును బ్రియవార్తఁ జెప్పుటకుఁ దగినవాఁడు నగు నారాముం జూచి కుశలం బడిగి ప్రసన్నునిం జేసి యతనికి సంతోషంబు నెఱపుచు నిట్లని చెప్పెను. ౮

రాముఁడా! నీతండ్రికి నీయం దనుగ్రహంబు గల్గెను. నీవు యౌవరాజ్యంబునం దభిషిక్తుఁడవయ్యెదవు నీ విప్పుడు సీతతోఁగూడ నుపవాసం బుండుము. ౯

నీతండ్రియగు దశరథమహారాజు ప్రాతఃకాలమున నహుషుండు యయాతికింబోలె నీకుఁ బ్రేమంబున యౌవరాజ్యంబున నభిషేకంబుసేయ సమకట్టియున్నాఁడు అని వసిష్ఠుఁడు రామునకుఁ జెప్పెను. ౧౦

ఆవసిష్ఠుఁ డిట్లు చెప్పి యప్పుడు సీతచేతను దృఢవ్రతుఁడగు రాముని చేతను సమంత్రకంబుగా నుపవాసంబు చేయించెను. ౧౧

అంత రాజగురుఁడగు నవ్వసిష్ఠుఁడు రామునిచే యథాశాస్త్రంబుగఁ బూజింపఁబడి రాముని సమ్మతిపఱచి రామునియిల్లు వదలిపోయెను. ౧౨

అప్పుడు రాముఁడును ప్రియంవదులగు స్నేహితులతోఁగూడఁ గూర్చుండియుండి వారలచే సంతోషపఱుపఁబడినవాఁడై వారల నందఱను అన్నివిధంబులను ఒప్పించి యంతఃపురంబుఁ బ్రవేశించెను. ౧౩

అప్పుడు రామగృహమునందుండు స్త్రీలును బురుషులును సంతోషంబున ధ్వనులు సేయుచు, వికాసము నొందిన ముఖంబులు గలిగియుండుటఁ జేసి ఆయ్యది మదంబున మధురంబుగాఁ గూయుచుండు పక్షులును వికసించిన కమలంబులు గలిగి యొప్పుచుండు కొలఁకుఁబోలి ప్రకాశించినది. ౧౪

ఆవసిష్ఠుఁడు రాజగృహంబుఁబోలె నతివిశాలసుందరంబయియున్న

నిర్గత్య దదృశే మార్గం వసిష్ఠో జనసంవృతమ్. ౧౫
బృన్దబృన్దై రయోధ్యాయాం రాజమార్గా స్సమన్తతః,
బభూవు రభిసమ్బాధాః కుతూహలజనై ర్వృతాః ౧౬
జనబృందోర్మి సంఘర్ష హర్ష స్వనవత స్తదా,
బభూవ రాజమార్గస్య సాగరస్యేవ నిస్వనః. ౧౭

సిక్తసంమృష్టరథ్యా హి తథా చ వనమాలినీ,
ఆసీ దయోధ్యా నగరీ సముచ్ఛ్రితగృహధ్వజా. ౧౮

తదా హ్యయోధ్యానిలయ స్సస్త్రీబాలాబలో జనః,
రామాభిషేక మాకాంక్ష న్నాకాంక్ష దుదయం రవేః. ౧౯

ప్రజాలంకారభూతం చ జనస్యానందవర్ధనమ్,
ఉత్సుకోఽభూ జ్జనో ద్రష్టుం తమయోధ్యామహోత్సవమ్.

ఏవం తం జనసమ్బాధం రాజమార్గం పురోహితః,
వ్యూహన్నివ జనౌఘం తం శనై రాజకులం యయౌ. ౨౧

సితాభ్రశిఖరప్రఖ్యం ప్రాసాద మధిరుహ్య సః,
సమీయాయ నరేన్ద్రేణ శక్రేణేవ బృహస్పతిః. ౨౨

తమాగత మభిప్రేక్ష్య హిత్వా రాజాసనం నృపః,

రాముని గృహము వెలువడి మార్గంబంతయు జనసమ్మర్దంబు గలిగియుంటం జూచెను.

అయోధ్యయందలి రాజమార్గంబులందు రామాభిషేకముం జూడ వచ్చిన జనులు గుంపులుగుంపులుగాఁ జేరియుండుటం జేసి యామార్గంబులు ఇఱుకటము గల్గి యుండినవి. ౧౬

అప్పుడు రాజమార్గంబునందు గొప్పతరంగంబులంబోలు జనసమూహంబుల యొరయికవలనను వారల సంతోషంబులవలనను గలిగినధ్వని సముద్రంబునకుం గల్గుధ్వనింబోలి యుండినది. ౧౭

అప్పటియందు నయోధ్యాపట్టణమునందలి రాజమార్గంబులన్నియుం దుడుపఁబడి యలంకరింపఁబడినవి. అచ్చటచ్చట నరఁటిచెట్లును బోఁకచెట్లును అలంకారార్థంబుగాఁ గట్టఁబడినవి. ప్రతిగృహంబునను ధ్వజంబు లెత్తఁబడినవి. ౧౮

ఆయోధ్యయందుండు స్త్రీలు బాలురు వృద్ధులు మొదలగు జనులందఱును రామాభిషేకంబుం జూడఁగోరి "సూర్యోదయం బెప్పుడెప్పుడగునో" యని యితరవ్యాపారంబులు లేక కోరుచుండిరి. ౧౯

ప్రజల కలంకారము గల్గించువదియును జనుల కధికసంతోషముం జేయునదియు నగు నాయోధ్యయందు జరుగఁబోవు శ్రీరామాభిషేకముం జూడ జను లందఱు నిచ్చఁగొనిరి. ౨౦

వసిష్ఠుఁడు డిల్లొజనులచే నిండియుండు రాజమార్గముఁ జూచుచు నాజనసమూహములను అచ్చటచ్చట వ్యూహములుగాఁ బన్నువాఁడుఁబోలె మెల్లఁగా రాజగృహంబునకుఁ బోయెను. ౨౧

ఆవసిష్ఠుఁడు తెల్లని మేఘంబును దెల్లని పర్వతశిఖరంబునుంబోలియున్న యారాజగృహంబుపైకిఁ బోయి దేవగురుఁ డగు బృహస్పతి దేవేంద్రునొద్దకుఁ బోవునటుల దశరథమహారాజునొద్దకు బోయెను. ౨౨

దశరథమహారాజు తనయొద్దకువచ్చిన వసిష్ఠుఁ జూచి సింహాసనంబునుండి లేచి "రామునిచే నుపవాసము చేయించినావా" యని యడిగెను. అందుకు ఆ

పప్రచ్ఛ సచ తస్మై తత్కృత మిత్యభ్యవేదయత్. ౨౩

తేన చైవ తదా తుల్యం సహాసీనా స్సభాసదః,
ఆసనేభ్య స్సముత్తస్థుః పూజయన్తః పురోహితమ్. ౨౪

గురుణా త్వభ్యనుజ్ఞాతో మనుజౌఘం విసృజ్య తమ్,
వివేశాన్తఃపురం రాజా సింహో గిరిగుహామివ. ౨౫

తదగ్ర్యవేషప్రమదాజనాకులం
మహేన్ద్రవేశ్మప్రతిమం నివేశనమ్,
విదీపయంశ్చారు వివేశ పార్థివ
శ్శశీవ తారాగణసఙ్కులం నభః. ౨౬

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే పఞ్చమస్సర్గః.

---

## షష్ఠస్సర్గః

గతే పురోహితే రామ స్స్నాతో నియతమానసః,
సహ పత్న్యా విశాలాక్ష్యా నారాయణ ముపాగమత్. ౧

ప్రగృహ్య శిరసా పాత్రీం హవిషో విధివత్తదా,
మహతే దైవతాయాజ్యం జుహావ జ్వలితేఽనలే. ౨

శేషం చ హవిష స్తస్య ప్రాశ్యాశాస్యాత్మనః ప్రియమ్,

వసిష్ఠుఁడును "రామునిచే నుపవాసము చేయించినాను". అని దశరథునకు బదులుఁ చెప్పెను. ౨౩

అప్పుడు దశరథునితోఁ గూడఁ గూర్చుండియుండిన సభికులును బురోహితుఁడగు వసిష్ఠునిఁ బూజించుటకై దశరథుఁడు లేచినపుడే యాసనంబుల నుండి లేచిరి. ౨౪

దశరథమహారాజు వసిష్ఠుననుమతి నొంది సభికుల నందఱ వీడ్కొని సింహంబు పర్వతంబునందలి గుహం బ్రవేశించునట్లు అంతఃపురంబుఁ బ్రవేశించెను. ౨౫

దశరథమహారాజు చక్కఁగా నలంకరించికొనియుండు స్త్రీలచేనిండి దేవేంద్రునిగృహంబుతో సాటియగుచుండుతనగృహంబును జంద్రుఁడు నక్షత్రములచే నిండియున్న యాకాశంబునుం బోలెఁ బ్రకాశించునట్లు సేయుచుఁ బ్రవేశించెను. ౨౬

ఇది ఐదవ సర్గము

---

## ఆఱవ సర్గము

పురోహితుఁడగు వసిష్ఠుఁడు పోఁగానే రాముఁడు స్నానంబు చేసి మనసు నిశ్చలము చేసికొని విశాలంబులగు నేత్రంబులుగల భార్యతోఁ గూడ నారాయణు నుపాసించెను. ౧

రాముఁ డప్పుడు యథాశాస్త్రంబుగా హవిఃపాత్రంబును శిరసా గ్రహించి మండినయగ్నిహోత్రమునందు దేవతలలో నుత్తముఁడగు నారాయణునికొఱకు ఆజ్యహోమము చేసెను. ౨

రాజకుమారుఁడగు రాముఁడు హోమము సేయఁగా మిగిలిన హవిస్సును భుజించి తనకుం బ్రియము గోరుకొని నారాయణుని ధ్యానించుచు శ్రీమంతంబగు నా నారాయణదేవాలయంబునందు దానే దర్భలఁ బఱచుకొని

ధ్యాయ న్నారాయణం దేవం స్వాస్తీర్ణే కుశసంస్తరే. 3
వాగ్యత స్సహ వైదేహ్యా భూత్వా నియతమానసః,
శ్రీమత్యాయతనే విష్ణో శ్శిశ్యే నరవరాత్మజః. ౪
ఏకయామావశిష్టాయాం రాత్ర్యాం ప్రతివిబుధ్య సః,
అలఙ్కారవిధిం కృత్స్నం కారయామాస వేశ్మనః. ౫
తత్ర శృణ్వ న్సుఖా వాచ స్సూతమాగధవన్దినామ్,
పూర్వాం సన్ధ్యా ముపాసీనో జజాప యతమానసః. ౬

తుష్టావ ప్రణత శ్చైవ శిరసా మధుసూదనమ్,
విమలక్షౌమసంవీతో వాచయామాస చ ద్విజాన్. ౭

తేషాం పుణ్యాహఘోషోఽథ గమ్భీరమధుర స్తదా,
అయోధ్యాం పూరయామాస తూర్యఘోషానునాదితః. ౮
కృతోపవాసం తు తదా వైదేహ్యా సహ రాఘవమ్,
అయోధ్యానిలయ శ్శ్రుత్వా సర్వః ప్రముదితో జనః. ౯
తతః పౌరజన స్సర్వ శ్శ్రుత్వా రామాభిషేచనమ్,
ప్రభాతాం రజనీం దృష్ట్వా చక్రే శోభయితుం పురీమ్. ౧౦

సితాభ్రశిఖరాభేషు దేవతాయతనేషు చ,
చతుష్పథేషు రథ్యాసు చైత్యేష్వట్టాలకేషు చ. ౧౧
నానాపణ్యసమృద్ధేషు వణిజా మాపణేషు చ,
కుటుమ్బినాం సమృద్ధేషు శ్రీమత్సు భవనేషు చ. ౧౨
సభాసుచైవ సర్వాసు వృక్షేష్వాలక్షితేషు చ,
ధ్వజా స్సముచ్ఛ్రితా శ్చిత్రాః పతాకా శ్చాభవం స్తదా. ౧3

యందు సీతతోఁగూడ మౌనంబునొంది మనసు నిశ్చలంబుఁ జేసికొని శయ
నించెను. 3-४

రాముఁడు ఒకజాము రాత్రి యుండఁగానే నిద్ర లేచి గృహంబున
కంతయు నలంకారంబు చేయించెను. ౫

రాముఁ డచ్చట సూతమాగధవందిజనంబుల సుఖకరంబులగు మాటల
వినుచుఁ బ్రాతస్సంధ్య నుపాసించి మనోనిగ్రహంబు గలిగి గాయత్రీ జపము
చేసెను. ౬

రాముఁడు విష్ణుదేవుని బ్రస్తుతించి సాష్టాంగంబుగ నమస్కరించెను.
అంత మఱల స్నానంబుచేసి తెల్లనిపట్టుబట్ట గట్టుకొని బ్రాహ్మణులచేఁ
బుణ్యాహవాచనంబు చేయించెను. ౭

అంత నప్పుడు ఆ బ్రాహ్మణులు పుణ్యాహంబు చెప్పఁగా మధురంబగు
శంఖధ్వని వాద్యధ్వనింగూడి యయోధ్యయంతయును నిండినది. ౮

అప్పుడు అయోధ్యయందు జను లందఱు రాముఁడును సీతయుం యథా
విధిగ నుపవాసంబు సల్పిన వృత్తాంతము విని చాల సంతసించిరి. ౯

అంతఁ బట్టణమునందుండు జను లందఱును, రామాభిషేకంబు జర
గుటను విన్నవారు గావునఁ దెల్లవాఱుటఁజూచి, పట్టణము నలంకరించు
టకై, యరఁటిచెట్లుగట్టుట మొదలగు కార్యంబులఁ జేసిరి. ౧౦

అప్పుడు తెల్లనిమేఘంబును దెల్లని పర్వతశిఖరంబునుంబోలి యొప్పు
చుండు దేవాలయములందును జదుకంబులందును రాజమార్గములందును
చైత్యాలయములందును అట్టాలక మందిరములందును నానావిధంబులగు వస్తు
వులచే సమృద్ధంబులయియుండు వైశ్యుల యంగళ్లయందును శ్రీమంతం
బులు సమృద్ధంబులు నగు గృహములందును సమస్తసభాస్థలంబులందును,
ఉన్నతములగు వృక్షంబులందును రాజచిహ్నంబులు గల టెక్కెంబులను
మఱియుఁ బలు తెఱంగులగు రంగులుగల పట్టిటెక్కెంబులను ఎత్తిరి. ౧౧-౧౩

నటనర్తకసఙ్ఘానాం గాయకానాం చ గాయతామ్,
మనఃకర్ణసుఖా వాచ శ్శుశ్రువుశ్చ తత స్తతః. ౧౪

రామాభిషేకయుక్తాశ్చ కథా శ్చక్రు ర్మిథో జనాః,
రామాభిషేకే సమ్ప్రాప్తే చత్వరేషు గృహేషు చ. ౧౫

బాలా అపి క్రీడమానా గృహద్వారేషు సంఘశః,
రామాభిషవసంయుక్తా శ్చక్రు రేవం మిథః కథాః. ౧౬
కృతపుష్పోపహార శ్చ ధూపగన్ధాధివాసితః,
రాజమార్గః కృత శ్శ్రీమా న్పౌరై రామాభిషేచనే. ౧౭

ప్రకాశకరణార్థం చ నిశాగమనశఙ్కయా,
దీపవృక్షాం స్తథా చక్రు రనురథ్యాసు సర్వశః. ౧౮

అలఙ్కారం పుర స్యైవం కృత్వా తత్పురవాసినః,
ఆకాంక్షమాణా రామస్య యౌవరాజ్యాభిషేచనమ్. ౧౯

సమేత్య సంఘశస్సర్వే చత్వరేషు సభాసు చ,
కథయన్తో మిథ స్తత్ర ప్రశశంసు ర్జనాధిపమ్. ౨౦

అహో మహాత్మా రాజాఽయ మిక్ష్వాకుకులనన్దనః,
జ్ఞాత్వా యో వృద్ధ మాత్మానం రామం రాజ్యేఽభిషేక్ష్యతి. ౨౧

సర్వేప్యనుగృహీతా స్స్మో యన్నో రామో మహీపతిః,

అంతంతకు, నటులు నర్తకులును మనోహరముగాఁ బాడుచు నభినయంబులు నాట్యంబులుఁ జేసిరి. గాయకులు మనోహరంబుగాఁ బాడిరి. ఆధ్వని చెవులకు శ్రవణమాత్రంబున సంతోషంబుసేయుచు నంత మనసునకు నాహ్లాదంబు నెఱపుచు జనులకు వినవచ్చెను. ౧౪

రామునిపట్టాభిషేకము సమీపింపఁగానే జనులు ముంగిళ్లయందును గృహంబులోపలనుం జేరి రామునిపట్టాభిషేకమును గుఱించినమాటలనే పరస్పరము చెప్పుకొనుచుండిరి. ౧౫

గృహంబులవాకిళ్లయం దాడుకొనుచుండు పిల్లవాండ్రును గూడ రాముని పట్టాభిషేకమును గుఱించినమాటలనే పరస్పరము చెప్పుకొనుచుండిరి.

రామునిపట్టాభిషేకము నిమిత్తమై యయోధ్యనుండుజనులు, రాజమార్గంబుల నంతటను బుష్పంబులఁజల్లి సుగంధిధూపంబులు వేసి యలంకరించి శ్రీమంతంబులగునట్లు చేసిరి. ౧౭

అయోధ్యనుండుజనులు రామాభిషేకము ముగియుంటకు మున్నె రాత్రి వచ్చునని సంశయించి వెల్తురు గల్గుటకై ప్రతిరాజమార్గంబునందును నానావిధంబులగు దీపస్తంభంబులను వృక్షాకారంబుగా నిర్మించిరి. ౧౮

అయోధ్యనుండువారలు అపట్టణమునకిట్లలంకారంబు గావించి రాముని యౌవరాజ్యపట్టాభిషేకమునకు నిశ్చితంబగు ముహూర్తంబు నెదురు చూచుచుండిరి. ౧౯

పట్టణవాసు లందఱును ముంగిళ్లయందుఁ గొలువుకూటంబులందు గుంపులుగుంపులుగాఁ జేరి యచ్చట నొకరితో నొకరు మాటలాడుకొనుచు దశరథు నిట్లని ప్రశంసించిరి. ౨౦

ఇక్ష్వాకువంశంబును సంతోషింపఁజేయుంనట్టి యీదశరథమహారాజు తాను వృద్ధుఁ డగుట నెఱిఁగి రాజ్యంబునందు రాము నభిషేకింపఁ దలంచినాఁడు కావున నితఁడు మిక్కిలియుం బుద్ధిశాలి. ఆశ్చర్యము! ౨౧

మనము బహుకాలముగాఁ గోరునట్లు మనకు లోకంబునందలి యెచ్చు

చిరాయ భవితా గోప్తా దృష్టలోకపరావరః. ౨౨

అనుద్ధతమనా విద్వాన్ ధర్మాత్మా భ్రాతృవత్సలః,
యథా చ భ్రాతృషు స్నిగ్ధ స్తథాఽస్మా స్వపి రాఘవః. ౨౩

చిరం జీవతు ధర్మాత్మా రాజా దశరథోఽనఘః,
యత్ప్రసాదేనాభిషిక్తం రామం ద్రక్ష్యామహే వయమ్. ౨౪

ఏవంవిధం కథయతాం పౌరాణాం శుశ్రువు స్తదా,
దిగ్భ్యోపి శ్రుతవృత్తాన్తాః ప్రాప్తా జానపదా జనాః. ౨౫

తే తు దిగ్భ్యః పురీం ప్రాప్తా ద్రష్టుం రామాభిషేచనమ్,
రామస్య పూరయామాసుః పురీం జానపదా జనాః. ౨౬

జనౌఘై స్తై ర్విసర్పద్భి శ్శుశ్రువే తత్ర నిస్వనః,
పర్వసూదీర్ణ వేగస్య సాగరస్యేవ నిస్వనః. ౨౭

తత స్తదిన్ద్రక్షయసన్నిభం పురం
దిదృక్షుభి ర్జానపదై రుపాగతైః,
సమ న్తత స్సస్వన మాకులం బభౌ
సముద్రయాదోభిరివార్ణవోదకమ్. ౨౮

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే షష్ఠస్సర్గః.

శత్రువుల నన్నిటి నెఱింగినరాముఁడు రాజునకు రక్షకుండుగాఁ గలఁడు. కావున మనము పరమేశ్వరునిచే ననుగ్రహింపఁబడినవార మగుచున్నాము.

రాముఁడు గర్వములేనివాఁడు పండితుఁడు ధర్మబుద్ధిగలవాఁడు తమ్ములందుఁ జాలఁబ్రేమగలవాఁడు తమ్ములం దెట్టిప్రేమయుంచునో అట్టిప్రేమయె మనయందును గల్గియున్నాఁడు. ౧౩

మన మెవ్వనియనుగ్రహంబునం జేసి పట్టాభిషిక్తుఁడగు రాముం జూడఁ బోవుచున్నామో ధర్మాత్ముఁడుఁ బాపరహితుఁడు నగు నాదశరథుఁడు బహుకాలము జీవించియుండుఁగాక. ౧౪

అప్పుడు రామాభిషేకవృత్తాంతము విని నానాప్రదేశములనుండి వచ్చినజానపదులగుజనులను ఈప్రకారముగా నాపౌరులు మాటలాడుకొనుచుండఁగా నామాటల నాలకించిరి. ౧౫

అట్లు రామాభిషేకవృత్తాంతము విని రాముని యభిషేకంబుఁ జూచుటకై నానాప్రదేశంబులనుండి యయోధ్యకువచ్చియున్న యాగ్రామవాసిజనులు రామునిపట్టణంబగు నయోధ్యయంతయు నిండియుండిరి. ౧౬

ఆ యయోధ్యయందు అట్లు నానాప్రదేశములందుండి వచ్చుచుండు జనసమూహములవలనఁ గలిగినధ్వని శ్రోత్రములయందు అధికవేగము నొంది యుండు సముద్రమందలి ధ్వనినిబోలె నుండినది. ౧౭

అంత దేవేంద్రునిభవనంబులో సాటియగు నాయయోధ్యాపట్టణము రామాభిషేకముఁజూడ గోరివచ్చియున్న గ్రామవాసులగు జనులు సేయుంధ్వనులచేతను వారలు గుంపుగుంపుగాఁ దిఱుగులాడుటంగల్గిన కలఁతచేతను జలజంతువులచే రొదగల్గి కలఁతపడియుండు సముద్రజలంబుంబోలి ప్రకాశించినది. ౧౮

ఇది ఆఱవసర్గము.

---

## సప్తమస్సర్గః

జ్ఞాతిదాసీ యతో జాతా కైకేయ్యాస్తు సహోషితా,
ప్రాసాదం చన్ద్రసంకాశ మారురోహ యదృచ్ఛయా. ౧

సిక్తరాజపథాం కృత్స్నాం ప్రకీర్ణకుసుమోత్కరామ్,
అయోధ్యాం మన్థరా తస్మా త్ప్రాసాదా దన్వవైక్షత. ౨

పతాకాభి ర్వరార్హాభి ర్ధ్వజై శ్చ సమలఙ్కృతామ్,
వృతాం ఛన్దపథై శ్చాపి శిరస్స్నాతజనై ర్వృతామ్. ౩

మాల్యమోదకహస్తైశ్చ ద్విజేన్ద్రై రభినాదితామ్,
శుక్లదేవగృహద్వారాం సర్వవాదిత్రనిస్వనామ్. ౪

సమ్ప్రహృష్టజనాకీర్ణాం బ్రహ్మఘోషాభినాదితామ్,
ప్రహృష్టవరహస్త్యశ్వాం సమ్ప్రణర్దితగోవృషామ్. ౫

ప్రహృష్టముదితైః పౌరై రుచ్ఛ్రితధ్వజమాలినీమ్,
అయోధ్యాం మన్థరా దృష్ట్వా పరం విస్మయ మాగతా. ౬

## ఏడవ సర్గము

ఎచ్చటనో పుట్టి కైకేయి పుట్టింటివారు కైకేయికి హారణం బివ్వఁగా వచ్చి కైకేయితోఁగూడ నున్న మంథర యనుదాసి సున్నము పూయఁబడి యుంటఁ జేసి చంద్రుఁడుఁ బోలెఁ దెల్లఁగానున్న మేడపై స్వేచ్ఛచే నెక్కెను. ౧

మంథర యామేడపై నిలుచుండి తడుపఁబడిన రాజమార్గంబులతో నొప్పుచు అంతటఁ జల్లఁబడిన పూలచేఁ దావులు గుబాళించుచుండు నయోధ్యాపట్టణంబు నంతయుఁ జూచెను. ౨

రాజచిహ్నంబులు వ్రాసిన టెక్కెములచేతను సాధారణధ్వజంబుల చేతను అలంకరింపఁబడి జనులు యథేచ్ఛంబుగా సంచరించుటకై నిర్మింపఁ బడినయడ్డత్రోవలతో నొప్పుచుఁ దలకు స్నానముచేసి పరిశుద్ధులయియుండు జనులతోఁగూడి రామునకుఁ గానుకలు సమర్పించుటకై పుష్పమాలికలుఁ గుడుములుఁ జేతులం బట్టుకొని తిరుగుచుండు బ్రాహ్మణశ్రేష్ఠుల సంతోషధ్వనులచే నిండినదై సున్నము పూయఁబడియుంటఁ జేసి తెల్లఁగానుండు దేవాలయద్వారంబులుగలదై యెల్లవాద్యంబులు వాయింపఁబడుటవలన వాని ధ్వనులచే నాదితంబై మిక్కిలియుం సంతోషంబు నొందియున్న జనులు గలిగి యచ్చటచ్చట బ్రాహ్మణులు సేయు వేదపారాయణంబులం గలిగినధ్వనులచే వ్యాపింపఁబడి రాముని యభిషేకంబు గుఱించి మృగాదులునుకూడ సంతోషంబు నొందుటంజేసి గగుర్పాటునొందిన మేలయినయేనుఁగులును గుఱ్ఱంబులును సంతోషాతిశయంబున అంకెలువేయుచుండు నాఁబోతులునుం గలిగి సంతోషవిశేషంబున గగుర్పాటునొందిన పౌరజనులచే నెత్తికట్టఁబడిన ధ్వజంబుల నలరారుచున్న యయోధ్యాపట్టణంబు నంతయును మంథరచూచి మిక్కిలి యాశ్చర్యపడెను. ౩-౬

ప్రహర్షోత్ఫుల్లనయనాం పాణ్డురక్షౌమవాసినీమ్,
అవిదూరే స్థితాం దృష్ట్వా ధాత్రీం పప్రచ్ఛ మన్థరా. ౭

ఉత్తమేనాభిసంయుక్తా హర్షేణార్థపరా సతీ,
రామమాతా ధనం కిన్ను జనేభ్యస్సమ్ప్రయచ్ఛతి. ౮

అతిమాత్రప్రహర్షోఽయం కిం జనస్య చ శంస మే,
కారయిష్యతి కిం వాపి సమ్ప్రహృష్టో మహీపతిః. ౯

విదీర్యమాణా హర్షేణ ధాత్రీ తు పరయా ముదా,
ఆచచక్షేఽథ కుబ్జాయై భూయసీం రాఘవశ్రియమ్. ౧౦

శ్వః పుష్యేణ జితక్రోధం యౌవరాజ్యేన రాఘవమ్,
రాజా దశరథో రామ మభిషేచయితాఽనఘమ్. ౧౧

ధాత్ర్యాస్తు వచనం శ్రుత్వా కుబ్జా క్షిప్రమమర్షితా,
కైలాసశిఖరాకారా త్ప్రాసాదా దవరోహత. ౧౨

సా దహ్యమానా కోపేన మన్థరా పాపదర్శినీ,
శయానా మేత్య కైకేయీ మిదం వచన మబ్రవీత్. ౧౩

సంతోషవిశేషంబున వికాసంబు నొందియున్న కండ్లుగలిగి తెల్లనిపట్టు చీరకట్టుకొని తనకు సమీపంబుననే యున్నదాదిని జూచి మంథర యిట్లని యడిగెను ౭

రామునితల్లియగు కౌసల్య స్వభావంబున ధనసంగ్రహంబు సేయునది కావున నెవ్వరికి నేమియు నివ్వనిదియైనను ఇప్పుడు అధికముగా సంతోషము నొంది జనులకు ధనము నిచ్చుచున్నది. ఇందు కేమి కారణము. ౮

జనుల కింత యాధికమయిన సంతోషం బెందువలనఁ గలిగినది? నాకుఁ జెప్పుము.

లేక భూమికిఁ బ్రభువయిన దశరథమహారాజు సంతోషంబు నొంది యే కార్యమునైనఁ జేయఁబోవుచున్నాఁడా? దీని సవిస్తరంబుగా నాకుఁ జెప్పుము అని యడిగెను. ౯

అంత నాదాది లోపల సంతోషం బతిశయించియుండుటవలన నవయవంబులుబ్బుటం జేసి పగుల్పఁబడుచున్నదో యని యెన్నఁ దగి యొప్పుచు గూనిదైనమంథర కైకేయిపక్షమునం దుండునది యగుటవలన దానికి రామాభిషేకవార్త చెప్పఁదగనిదైనను, సంతోషాతిశయంబున మనంబెఱుఁగక యట్టి రామాభిషేకవార్తను ఇట్లని చెప్పెను. ౧౦

దశరథమహారాజు రేపు పుష్యనక్షత్రంబునఁ గోపంబును స్వాధీనపఱచుకొనినవాఁడును పాపము సేయనివాఁడు నగు రాముని యువరాజు దొరతనమునందు అభిషేకింపఁబోవుచున్నాఁడు అని దాది మంథరకుఁ జెప్పెను. ౧౧

గూనిదైన మంథర దాదిచెప్పినమాట విని యాక్షణమే యధికమయిన కోపంబు నొంది తెల్లఁగా నత్యున్నతంబై యుంటం జేసి కైలాసపర్వతశిఖరంబుం బోలెఁ జూపట్టుచున్న యా మేడపైనుండి వేగంబుగా దిగెను. ౧౨

పాపముగలిగించుకార్యములనే చేయఁగోరు స్వభావముగల యామంథర కోపంబున నెఱ్ఱగానుండు ముఖంబు మొదలగు నవయవంబులుగల్గుటం జేసి దహింపఁబడుచున్నదో యని యెన్నఁ దగి యొప్పుచుఁ బరుండియున్న కైకేయికడకుఁ బోయి యాకైకేయిం జూచి యిట్లని చెప్పెను. ౧౩

ఉత్తిష్ఠ మూఢే కిం శేషే భయం త్వా మభివర్తతే,
ఉపప్లుత మఘౌఘేన కి మాత్మానం న బుధ్యసే. ౧౪

అనిష్టే సుభగాకారే సౌభాగ్యేన వికత్థసే,
చలం హి తవ సౌభాగ్యం నద్యా స్స్రోత ఇవోష్ణగే. ౧౫

ఏవ ముక్తా తు కైకేయీ రుష్టయా పరుషం వచః,
కుబ్జయా పాపదర్శిన్యా విషాద మగమ త్పరమ్. ౧౬

కైకేయీ త్వబ్రవీ త్కుబ్జాం కచ్చి త్క్షేమం న మన్థరే,
విషణ్ణవదనాం హి త్వాం లక్షయే భృశదుఃఖితామ్. ౧౭

మన్థరా తు వచ శ్శ్రుత్వా కైకేయ్యా మధురాక్షరమ్,
ఉవాచ క్రోధసంయుక్తా వాక్యం వాక్యవిశారదా. ౧౮

సా విషణ్ణతరా భూత్వా కుబ్జా తస్యా హితైషిణీ,
విషాదయన్తీ ప్రోవాచ భేదయన్తీ చ రాఘవమ్. ౧౯

అక్షయ్యం సుమహ ద్దేవి ప్రవృత్తం త్వద్వినాశనమ్,

రామం దశరథో రాజా యౌవరాజ్యేఽభిషేక్ష్యతి. ౨౦

సాఽస్మ్యగాధే భయే మగ్నా దుఃఖశోకసమన్వితా,

తెలివిలేనిదానా! లెమ్ము. ఏల పరుండియున్నావు? నీకిప్పుడు గొప్ప
భయంబు రాఁబోవుచున్నది. నీ కింకఁ బెక్కుదుఃఖంబులు కలుగఁబోవుటను
దెలిసికొనక యేల యూరకున్నావు? ౧౪

నీవు యథార్థంబుగా నీపెనిమిటికప్రియవు. పైకి భాగ్యంబుగలదాని
భంగి సగపడుచున్నావు. మఱియు "నాకే భాగ్యంబుగలదు" అని నిన్నునీవె
పొగడుకొనుచుంటివి. ఇప్పుడు ఎండకాలమునందు ఏటిప్రవాహమువలె
నీభాగ్యం బంతయుం నాశమునొందఁబోవుచున్నది. అని మంథర కైకేయితోఁ
జెప్పినది. ౧౫

కైకేయి యిట్లు కోపంబు నొందినదియుఁ బాపంబులనే చేయఁగోరు
స్వభావంబు గలదియు నగు మంథరచెప్పిన పరుషంబగుమాటను విని యధిక
మయిన దుఃఖము నొందెను. ౧౬

"మంథరా! నాకు క్షేమంబు లేదా యేమి? నీమొగంబున దుఃఖ
చిహ్నంబులగపడుటచే నీవుమిగుల దుఃఖమునొందినావని తలంచుచున్నాను"
అని కైకేయి కూర్చున్న మంథరతోఁ జెప్పెను. ౧౭

ఎప్పటికిఁ దగున ట్లప్పటికి మాటలు చెప్ప సమర్థురాలగు మంథర
కోపంబునొందినదై మధురంబగు కైకేయిమాటను విని యాకైకేయిం జూచి
యిట్లని చెప్పెను. ౧౮

అట్లు కైకేయిమేలుఁ గోరునట్టి యీమంథర మునుపటికన్నను అధిక
ముగా దుఃఖమునొంది కైకేయికి దుఃఖము గలిగించి రామునిపై విరోధము గలి
గించుటకును ఇట్లని చెప్పెను. ౧౯

రాణివగు కైకేయీ! ప్రతిక్రియ లేనట్లుగా సమూలముగా నిన్నుఁ
జెఱచుటకై యత్నముచేయఁబడినది.

దశరథమహారాజు రామునికి యౌవరాజ్యంబునఁ బట్టాభిషేకము
సేయఁబోవుచున్నాఁడు. ౨౦

నే నెల్లప్పుడును నీమేలుఁగోరుదానను గావున నిట్లు జరగఁబోవుటను

దహ్యమానాఽనలేనేవ త్వద్ధితార్థ మిహాఽఽగతా. ౨౧

తవ దుఃఖేన కైకేయి మమ దుఃఖం మహా న్భవేత్,
త్వద్వృద్ధౌ మమ వృద్ధిశ్చ భవే దత్ర న సంశయః. ౨౨

నరాధిపకులే జాతా మహిషీ త్వం మహీపతేః,
ఉగ్రత్వం రాజధర్మాణాం కథం దేవి న బుధ్యసే. ౨౩

ధర్మవాదీ శఠో భర్తా శ్లక్ష్ణవాదీ చ దారుణః,
శుద్ధభావేన జానీషే తే నైవ మతిసన్ధితా. ౨౪

ఉపస్థితం ప్రయుంజాన స్త్వయి సాన్త్వ మనర్థకమ్,
అర్థే నైవాద్య తే భర్తా కౌసల్యాం యోజయిష్యతి. ౨౫

అపవాహ్య స దుష్టాత్మా భరతం తవ బన్ధుషు,
కాల్యే స్థాపయితా రామం రాజ్యే నిహతకణ్టకే. ౨౬

శత్రుః పతిప్రవాదేన మాత్రేవ హితకామ్యయా,

నిన్నుం జేసి మహాభయంబు నొంది యతిదుఃఖంబునం జేసి రోదనంబు సేయుచు నిప్పుచే దహింపఁబడుచున్నట్లు బాధపడుచు నీకిప్పుడు రాఁబోవు కీడుం బోఁగొట్టుటకై యిచ్చటికి వచ్చితిని. ౨౧

కైకేయీ! నీకు దుఃఖము గలిగినచో నాకును దుఃఖము గలుగును. నీకు మేలు కలుగునేని నాకును మేలు కలుగును. యీ విషయమునందు సందేహము లేదు. ౨౨

రాణివగు కైకేయీ! నీవు రాజులగు వారివంశమునం బుట్టితివి. మహారాజగు దశరథున కుత్తమభార్యవుగా నున్నావు. అయినను రాజులనడతలు క్రూరంబు లనుట నీ కేల తెలియదు? ఇది చిత్రముగా నున్నది. ౨౩

నీ పెనిమిటి యగుదశరథుఁడు నోట ధర్మములం జెప్పుచుండును. స్వభావంబున రహస్యముగాఁ గీడుసేయువాఁడు. పైకి బహుప్రియంబుగా మాటలాడును; స్వభావమున బహుక్రూరుఁడు; నీవు కపటము లేనిదానవు. కావున నతఁ డభినయించువానిని సత్యంబుగా నమ్ముచున్నావు. నిన్నతఁడిట్లు మోసపుచ్చుచున్నాఁడు. ౨౪

నీ పెనిమిటి యగు దశరథుఁడు ఆయాకాలమునకుఁ దగిన మంచిమాటలు చెప్పి నిన్నుబ్బించుచుండి యిప్పుడు కౌసల్యకే గొప్పఫలంబు సమకూరునట్లు చేయఁ బోవుచున్నాఁడు. ౨౫

దుష్టాత్ముఁడగు నాదశరథుఁడు నీపుట్టింటికి భరతునిఁ బాఱఁదోలి యతఁడు లేనిసమయము చూచి రేపుప్రాతఃకాలంబున నింతమాత్రంబును శత్రువులు లేకుండుటం జేసి బహుసుఖప్రదంబైన రాజ్యంబునందు రామునకుఁ బట్టాభిషేకము సేయఁబోవుచున్నాఁడు.

ఎట్లు సర్పమును బోషించునట్టి చిన్నది తెలివి లేక సర్పములోపల విషము గలదని యెఱుఁగక తనకు మేలు గల్గుటకయి యాసర్పమును దొడపయినుంచుకొని బుజ్జగించునో అట్లు నీవు నీ పెనిమిటియగు దశరథుఁడు నీకు యథార్థంబుగా శత్రుఁడని యెఱుంగక ప్రియుఁడని తలంచి తొడపై

ఆశీవిష ఇవాజ్ఞేన బాలే పరిహృత స్త్వయా. ౨౭

యథా హి కుర్యా త్సర్పో వా శత్రు ర్వా ప్రత్యుపేక్షితః,
రాజ్ఞా దశరథేనాద్య సపుత్రా త్వం తథా కృతా. ౨౮
పాపేనానృతసా న్త్వేన బాలే! నిత్యం సుఖోచితే,
రామం స్థాపయతా రాజ్యే సానుబన్ధా హతా హ్యసి. ౨౯

సా ప్రాప్తకాలం కైకేయి క్షిప్రం కురు హితం తవ,
త్రాయస్వ పుత్ర మాత్మానం మాం చ విస్మయదర్శనే. ౩౦

మన్థరాయా వచ శ్శ్రుత్వా శయానా సా శుభాననా,
ఉత్తస్థౌ హర్షసంపూర్ణా చన్ద్రలేఖేవ శారదీ. ౩౧

అతీవ సా తు సంహృష్టా కైకేయీ విస్మయాన్వితా,
ఏక మాభరణం తస్యై కుబ్జాయై ప్రదదౌ శుభమ్. ౩౨

దత్త్వా త్వాభరణం తస్యై కుబ్జాయై ప్రమదోత్తమా,
కైకేయీ మన్థరాం దృష్ట్వా పున రేవాబ్రవీ దిదమ్. ౩౩
ఇదం తు మన్థరే మహ్య మాఖ్యాసి పరమం ప్రియమ్,
ఏత న్మే ప్రియ మాఖ్యాతుః కింవా భూయః కరోమి తే. ౩౪

నుపలాలించుచున్నావు; ఎట్లు తోడపై నానావిధంబుల నుపలాలింపఁబడు చున్న సర్పంబు తనను మేలుకోరుచుఁ దన్నుఁబోషించుచున్న దాని గఱచునో అవిధంబున నీపెనిమిటి నీకును దన్ను నమ్మి యుంపలాలించుచున్న నీకుఁ గీడు సేయును. కావున సర్పంబును విడుచునట్లు అతని విడువవలయును. ౨౭

పాముగాని శత్రువుగాని చంకఁబడక యుపేక్షింపఁబడునేని యెట్లు సేయునో అట్లనే యిపుడు దశరథుఁడు నిన్ను నీకొడుకునను జేసినాఁడు. ౨౮

కైకేయీ! నీ వెల్లప్పుడును సుఖం బనుభవింపఁదగినదానవు. ఏమి యుం దెలియని చిన్నదానవు. నాపుఁడగు నీదశరథుఁడు, ఇన్ని నాళ్లు దబ్బఱల యిన ప్రియవచనంబులచే నిన్ను మోసపుచ్చుచుండి యిపుడు రాముని రాజ్యంబున నభిషేకించి నిన్నును నీకొడుకును నీజనంబులను జెఱపఁదలం చినాఁడు. ౨౯

చూపరుల కాశ్చర్యము గలిగించునట్టి సుందరములయిన కండ్లుగల కైకేయీ! అట్టిదుఃఖమునకుఁ బాత్రురాలవు గాఁబోయెదవు. కావున నీ విప్పుడే యిప్పటికిఁ దగినట్లు నీకు మేలుగావించుకొనుము. నిన్నును నీకొడుకును నన్నును రక్షించుకొనుము. అని మంథర కైకేయికిఁ జెప్పెను. ౩౦

మంథర చెప్పినమాట విని పరుండియున్న సుందరముఖముగల యా కైక యధికముగా సంతోషమునొంది శరత్కాలమునందలి చంద్రరేఖయుం బోలె వెలుఁగుచు శయనమునుండి లేచెను. ౩౧

ఆకైకేయి మిగుల సంతోషము నొంది యట్టిసంతోషం బాకస్మికం బుగాఁదనకుఁ గల్గుటనుగుఱించి యాశ్చర్యపడుచు నామంథరకు నొకమంచి యాభరణము నిచ్చెను. ౩౨

స్త్రీలలో నుత్తమురాలయిన యాకైక అట్లామంథరకు నాభరణంబిచ్చి యంత నామంథరం జూచి యిట్లని చెప్పెను. ౩౩

మంథరా! నీవు నా కిట్టిపరమసంతోషము గలిగించువార్త చెప్పుచున్నావు. ఇట్టి సంతోషవార్తను జెప్పిన నీకు దీనికన్న నింకనేమి చేయుదును?

రామే వా భరతే వాహం విశేషం నోపలక్షయే,
తస్మా త్తుష్టాఽస్మి యద్రాజా రామం రాజ్యేఽభిషేక్ష్యతి. ౩౫

న మే వరం కించి దిత స్త్వయా పునః
ప్రియం ప్రియార్హే సువచం వచః పరమ్,
తథా హ్యవోచ స్త్వమతః ప్రియోత్తరం
పరం వరం తే ప్రదదామి తం వృణు. ౩౬

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే సప్తమస్సర్గః

---

## అష్టమస్సర్గః

మన్థరా త్వభ్యసూయైనా ముత్సృజ్యాభరణం చ తత్,
ఉవాచేదం తతో వాక్యం కోపదుఃఖసమన్వితా. ౧

హర్షం కి మిద మస్థానే కృతవత్యసి బాలిశే,
శోకసాగరమధ్యస్థ మాత్మానం నావబుధ్యసే. ౨

మనసా ప్రహసామి త్వాం దేవి దుఃఖార్దితా సతీ,
యచ్ఛోచితవ్యే హృష్టాఽసి ప్రాప్యేదం వ్యసనం మహత్. ౩

శోచామి దుర్మతిత్వం తే కా హి ప్రాజ్ఞా ప్రహర్షయేత్,
అరే స్సపత్నీపుత్రస్య వృద్ధిం మృత్యో రివాగతామ్. ౪

రాముఁడుగాని భరతుఁడుగాని నాకిరువురు నొకటియే; నా కే భేదమును లేదు. దశరథుఁడు రాజ్యమునందు రామునకుఁ బట్టాభిషేకంబు సేయింపఁ బోవుచున్నాఁడని వినుటంజేసి మిగుల సంతోషించితిని. ౩౫

మంథరా! నీవు సంతోషమునకుఁ దగినదానవు. ఈ రామాభిషేక వార్తకన్నను ఇతరమయిన యింతటి ప్రియవార్తను నాకింక నీవు చెప్పలేవు. అట్టి ప్రియవార్తను నీవిప్పుడు చెప్పితివిగావున నీకు అన్నిటికన్న నెచ్చుగా సంతోషంబు గలిగించువస్తువు నిచ్చెదను దానిఁ గోరుకొనుము. అని కైకేయి మంథరకుఁ జెప్పెను. ౩౬

ఇది యేడవ సర్గము.

---

## ఎనిమిదవ సర్గము

ఇట్లుచెప్పిన కైకేయిమీఁద మంథర యెంత మేలుబోధించినను వినలేదని యసూయనొంది యది యిచ్చిన యాభరణమును విసర్జించి తాను హితముచెప్పఁగా వినదని కోపమును అనర్థము రాఁబోవుచున్నదని దుఃఖమునుం బొంది కైకేయింజూచి యిట్లని చెప్పెను. ౧

మూఢురాలా! దుఃఖముఁ బొందవలసినకాలమునందు సంతోషము నొందుచున్నావేమి? నీ కిప్పుడు సముద్రమువంటి దుఃఖమువచ్చుటకు సిద్ధముగా నుండఁగా దాని నెఱుంగకున్నావు. ౨

రాణివగు కైకేయీ! ఇట్టి గొప్పదుఃఖమునుబొందియుండు దుఃఖింప వలసియుండఁగా నీవు సంతోషించుచున్నావు కావున నిట్టి నిన్నుఁజూడఁగా నాకు మనంబున నవ్వు వచ్చుచున్నది. ౩

నీ కిట్టిదుర్బుద్ధిగలుగుటఁ జూడఁగా నాకు దుఃఖముగలుగుచున్నది. మృత్యువువంటి శత్రువయిన సవతికొడుకునకు వృద్ధిగలుఁగుటవలనఁ దెలివి గలిగినస్త్రీ యెవ్వతె సంతోషించును? ౪

భరత 'దేవ రామస్య రాజ్యసాధారణా ద్భయం,
త ద్విచిన్త్య విషణ్ణాఽస్మి భయం భీతాఽద్ధి జాయతే. ౫

లక్ష్మణో హి మహేష్వాసో రామం సర్వాత్మనా గతః,
శత్రుఘ్న శ్చాపి భరతం కాకుత్స్థం లక్ష్మణో యథా. ౬

ప్రత్యాసన్నక్రమే ణాపి భరత స్యైవ భామిని,
రాజ్యక్రమో విప్రకృష్ట స్తయో స్తావ త్కనీయసోః. ౭

విదుషః క్షత్రచారిత్రే ప్రాజ్ఞస్య ప్రాప్తకారిణః,
భయా త్ప్రవేపే రామస్య చిన్తయన్తీ తవాత్మజమ్. ౮

సుభగా ఖలు కౌసల్యా యస్యాః పుత్త్రోఽభిషేక్ష్యతే,

భరతునకుమాత్రమే రామునితో సమానముగా రాజ్యముఁ బొందుటకుఁ దగినయధికారమున్నది. కావున రామునకు భరతునివలన మాత్రమె భయంబుగలుగును. ఎవ్వం డెవ్వనివలన భయపడునో అతనికి వానివలన భయ మవశ్యము మనుష్యులవలన భయపశు సర్పాదులవలన మనష్యులకుఁ గల్గునట్లు సంభవించును. కాఁబట్టి భరతునివలని రామునకు భయంబుగల్గుటను గురించి యాలోచింపఁగా నాకు మిక్కిలియుం దుఃఖంబగుచున్నది. ౫

లక్ష్మణశత్రుఘ్నులును రాజ్యముఁబొందుట కధికారము గలవారలయ్యును మహాపరాక్రమశాలియగు లక్ష్మణుండు మనోవాక్కాయ కర్మంబుల రాముని నాశ్రయించియున్నాఁడు. అట్లు శత్రుఘ్నుఁడు లక్ష్మణుఁడు రాము నాశ్రయించినట్లు భరతు నాశ్రయించినాఁడు. కావున వారలు రామభరతుల ప్రాపున నుందురే కాని స్వతంత్రముగా రాజ్యంబు నపేక్షింపరు. అందువలన రామునకు లక్ష్మణునివలనను భరతునకు శత్రుఘ్నునివలనను భయంబు గలుగదు. ౬

కైకేయీ! జన్మక్రమముచేతను గూడ భరతుఁడు లక్ష్మణశత్రుఘ్నుల కన్నను ముందు పుట్టినవాఁడు కావున భరతునికే రాజ్యప్రాప్తియం దధికారము సన్నిహితము గానున్నది. లక్ష్మణశత్రుఘ్నులు భరతునికన్నను వెనుకఁ బుట్టినవాండ్రు కావున వారలకు రాజ్యప్రాప్తియం దధికారము సన్నిహితము గాదు. అట్లగుటఁ జేసి రామునికి వెనుక భరతుఁడే రాజ్యాధికారి కావున రామువలన భరతునకే భయముంగలుగును. ౭

రాముండు బుద్ధిశాలి; రాజనీతి చక్కఁగాఁ దెలిసినవాఁడు; ఏకాలంబున దేనిఁజేయవలయునో దాని దప్పక యప్పుడే చేయనేర్చినవాఁడు. నీకొడుకు భరతుఁ డట్టి సమర్థుఁడు కాఁడు కావున రామునివలన నీకొడుకునకు భయంబుగలుగునని కొడుకుఁదలంచుకొనునప్పుడెల్ల మిక్కిలియుం భయము నొందుచున్నాను. ౮

కౌసల్యకొడుకునకు పుష్యనక్షత్రంబున బ్రాహ్మణోత్తములు యౌవరాజ్యం

యౌవరాజ్యేన మహతా శ్వః పుష్యేణ ద్విజోత్తమైః. ౯

ప్రాప్తాం సుమహతీం ప్రీతిం ప్రతీతాం తాం హతద్విషమ్,
ఉపసాస్యసి కౌసల్యాం దాసీవ త్త్వం కృతాఞ్జలిః. ౧౦

ఏవం చే త్త్వం సహాఽస్మాభి స్తస్యాః ప్రేష్యా భవిష్యసి,
పుత్త్ర శ్చ తవ రామస్య ప్రేష్యభావం గమిష్యతి. ౧౧
హృష్టాః ఖలు భవిష్యన్తి రామస్య పరమా స్స్త్రియః,
అప్రహృష్టా భవిష్యన్తి స్నుషా స్తే భరతక్షయే. ౧౨

తాం దృష్ట్వా పరమప్రీతాం బ్రువన్తీం మన్థరాం తతః,
రామ స్యైవ గుణా న్దేవీ కైకేయీ ప్రశశంస హ. ౧౩

ధర్మజ్ఞో గురుభి ర్దాన్తః కృతజ్ఞ స్సత్యవా ఞ్ఛుచిః,
రామో రాజ్ఞ స్సుతో జ్యేష్ఠో యౌవరాజ్య మతోఽర్హతి.

భ్రాతౄ న్భృత్యాంశ్చ దీర్ఘాయుః పితృవ త్పాలయిష్యతి,
సంతప్యసే కథం కుబ్జే శ్రుత్వా రామాభిషేచనమ్. ౧౫

భరతశ్చాపి రామస్య ధ్రువం వర్షశతాత్పరమ్,
పితృపైతామహం రాజ్య మవాప్తా పురుషర్షభః. ౧౬

బగు యౌవరాజ్యంబునఁ బట్టాభిషేకము సేయఁబోవుచున్నారు. కావున సా కౌసల్య మహాభాగ్యముగలదిగదా ! ౯

అట్లు తనకొడుకు రాముండు పట్టాభిషిక్తుండగుటఁజేసి మహాసంతోషంబునొంది లోకంబునందుఁ బ్రసిద్ధయై చవతులు మొదలగుశత్రువుల నడఁగఁద్రొక్కి వైభవంబునఁ జెలఁగుచుండు కౌసల్యకు నీవు దాసియట్లు చేతులుమొగిడ్చికొని సేవసేయవలసియున్నది. ౧౦

ఇట్లు రాముఁడు పట్టాభిషిక్తుం డగునేని నీవును, మేమును ఆకౌసల్యకు భృత్యుల మగుదుము. నీకొడుకు భరతుండును రామునకు భృత్యుండగును.

అట్లు రాముండు పట్టాభిషిక్తుండగు నేని యుత్తములగు రాముని స్త్రీలందఱు సానందంబునొంది యుందురు. భరతుఁడు దరిద్రుఁడగును గావున భరతునిభార్యలందఱు సంతోషములేక యుందురు. అని మంథర చెప్పినది. ౧౨

అంత నట్లు మిగులదుఃఖంబుఁబొంది నీతులుచెప్పుచున్న మంథరఁ జూచి రాణియగు కైకేయి దానిమాటలఁ జెవులనిడక రామునిగుణంబులనే కొనియాడ నారంభించెను. ౧౩

రాముఁడు ధర్మజ్ఞుఁడు. గురువులచే నింద్రియనిగ్రహము గలుగునట్లు శిక్షింపఁబడినవాఁడు. తన కితరులు కొంచె ముపకారముచేసినను దాని నెచ్చుగాఁ దలంచువాఁడు. దబ్బఱల నొతమాత్ర మాడఁడు. పరిశుద్ధుఁడు. మఱియుం దశరథమహారాజునకు జ్యేష్ఠకుమారుఁడు కావున నతఁడే యౌవరాజ్యంబునకుఁ దగినవాఁడు. ౧౪

మంథరా! దీర్ఘాయుఁ డగురాముఁడు తమ్ములను భృత్యులను దండ్రిఁ బోలె శ్రద్ధతోఁ గాపాడును. అట్టి రామునకుఁ బట్టాభిషేకమగునని విన్నందున సంతోషంబుగలుగక నీ కెట్లు దుఃఖంబుగలిగినది? ౧౫

రాముఁడు నూఱేండ్లు రాజ్యముఁ బాలించిన వెనుక పురుషశ్రేష్ఠుఁడగు భరతుఁడును పితృపైతామహం బగురాజ్యం బు నొందఁగలఁడు. ఇది నిశ్చయము. ౧౬

సా త్వ మభ్యుదయే ప్రాప్తే వర్తమానే చ మన్థరే,
భవిష్యతి చ కల్యాణే కిమర్థం పరితప్యసే. ౧౭

యథా మే భరతో మాన్య స్తథా భూయోఽపి రాఘవః,
కౌసల్యాతోఽతిరిక్తం చ సోఽను శుశ్రూషతే హి మామ్. ౧౮

రాజ్యం యదిహి రామస్య భరతస్యాపి తత్తదా,
మన్యతే హి యథాత్మానం తథా భ్రాతౄంస్తు రాఘవః. ౧౯

కైకేయీవచనం శ్రుత్వా మన్థరా భృశదుఃఖితా,
దీర్ఘ ముష్ణం వినిశ్వస్య కైకేయీ మిద మబ్రవీత్. ౨౦

అనర్థదర్శినీ మౌర్ఖ్యా న్నాత్మాన మవబుధ్యసే,
శోకవ్యసనవి స్తీర్ణే మజ్జన్తీ దుఃఖసాగరే. ౨౧

భవితా రాఘవో రాజా రాఘవస్య చ య స్సుతః,
రాజవంశా త్తు కైకేయి భరతః పరిహాస్యతే. ౨౨

నహి రాజ్ఞ స్సుతా స్సర్వే రాజ్యే తిష్ఠన్తి భామిని,
స్థాప్యమానేషు సర్వేషు సుమహా నసయో భవేత్. ౨౩

మంథరా! ఇప్పుడు రామాభిషేకరూపంబగు మంగళంబు సమీపించి యున్నది. ఇంక భరతాభిషేకరూపమంగళము రాఁగలదు. అట్లు మంగళపరంపరగల్గుచుండ నీవేల దుఃఖించెదవు? ౧౭

రాముఁడు కౌసల్యకుఁ జేయుశుశ్రూషకన్న నెచ్చుగా నాకుశుశ్రూష సేయుచున్నాఁడు కావున నేను భరతునియందెంత బహుమానం బుంచవలయునో అంతకన్న నెచ్చుగా రామునిపై నేను బహుమానం బుంచవలయును. ౧౮

రాముఁడు తన్నెట్లు చూచుకొనునో యట్లే భేదంబులేక తమ్ములనుఁ జూచుకొనువాఁడు. కావున రామునకు రాజ్యంబువచ్చునేని యప్పుడు భరతునకును రాజ్యంబువచ్చినట్లే యగుచున్నది. అని కైకేయి మంథరకుఁ జెప్పెను. మంథర కైకేయిచెప్పినమాటను విని యినుమడిగా దుఃఖంబునొంది యధికముగా వేఁడినిట్టూర్పులు నిగుడించుచుఁ గైకేయిఁ జూచి యిట్లని చెప్పెను. ౨౦

నీకు మంచిచెడ్డలు తెలియవు. భరతునకు రాజ్యములేకుండుటఁ గల్గు దుఃఖము, చవలికొడుకునకు రాజ్యంబు వచ్చుటఁ గల్గునాపద, చవతికి సేవ సేయుట యనెడుదుఃఖము ఇవియన్నియు నీకు సంభవించుటకు సిద్ధములుగా నుండఁగా నీ వజ్ఞానంబున దీనిం దెలిసికొనకుండుటయేగాక నిన్ను నీవే తెలిసికొనలేకున్నావు. ౨౧

కైకేయీ! ఇప్పుడు రాముఁడు రాజగునేని రామునియనంతరము అతనికొడుకైనవాఁడే రాజగును. భరతుఁడుగాని యతనికొడుకులుగాని యింకెప్పటికిని రాజులుగాఁజాలరు. కావున రాజవంశంబున భరతునిపేరే యుండదు. ౨౨

కైకేయీ! రాజుకొడుకుల కందఱకును రాజ్యంబురాదు. అట్లందఱను రాజ్యంబున రాజులుగాఁ జేయఁబడుదురేని నీతిచెడి రాజ్యంబున నుపద్రవంబుగల్గును. ౨౩

తస్మాజ్జ్యేష్ఠే హి కైకేయి రాజ్యతన్త్రాణి పార్థివాః,
స్థాపయ న్త్యనవద్యాఙ్గి గుణవత్స్వితరేష్వపి. ౨౪

అసా వత్య న్తనిర్భగ్న స్తవ పుత్రో భవిష్యతి,
అనాథవ త్సుఖేభ్య శ్చ రాజవంశా చ్చ వత్సలే. ౨౫

సాఽహం త్వదర్థే సమ్ప్రాప్తా త్వం తు మాం నావబుధ్యసే,
సపత్నివృద్ధౌ యా మే త్వం ప్రదేయం దాతు మిచ్ఛసి. ౨౬

ధ్రువం తు భరతం రామః ప్రాప్య రాజ్య మకణ్టకమ్,
దేశా న్తరం వా నయితా లోకా న్తర మథాఽపి వా. ౨౭

బాలఏవ హి మాతుల్యం భరతో నాయిత స్త్వయా,
సన్నికరా చ్చ సౌహార్దం జాయతే స్థావరేష్వపి. ౨౮

భరతస్యాప్యనువశ శ్శత్రుఘ్నోఽపి సమం గతః,
లక్ష్మణో హి యథా రామం తథాఽసౌ భరతం గతః. ౨౯

శ్రూయతే హి ద్రుమః కశ్చి చ్ఛేత్తవ్యో వనజీవిభిః,

సుందరములయిన యవయవములుగల కైకేయీ ! అట్లు కొడుకులంద ఱును రాజులొదురేని రాజ్యంబున నుపద్రవంబు సంభవించును గావున రాజు లందఱును దమకు గుణవంతులగు వేఱుకొడుకులున్నను జ్యేష్ఠునికే రాచ కార్యంబుల నప్పగించుచున్నారు. ౨౪

కైకేయీ ! నీవు సాధారణులపైనే దయగలదానవు. నీ కొడుకునకు రాఁబోవు ననర్థంబుం బర్యాలోచించి దయయుంచుము. నీకొడుకునకు అనా థునకుంబోలె నెంతమాత్రమును సుఖంబులేక రాజవంశానుక్రమణికయందును గణనంబులేక దురవస్థ కలుగఁబోవుచున్నది. ౨౫

అట్లు నీపై నెనరుంచి నేను నీకు హితంబుగలుగఁజేయుటకై నీయొద్దకు వచ్చితిని. సవతి కభ్యుదయంబు గలుగునప్పుడు నాకు బహుమానం బొసంగు సంతతి తెలివిలేనిదానవగు నీవు మాత్రము నన్నుఁ దెలిసికొనలేదు. ౨౬

రాముఁడు శత్రువు లెంతమాత్రమునులేని రాజ్యంబునొంది భరతుని దేశాంతరమునకైనను వెడలఁగొట్టును. లేక చంపివేయును. ఇది మాత్రము నిశ్చయము. ౨౭

భరతుఁడు చిన్నవాఁడుగా నుండునప్పుడే నీ వతని మేనమామయిం టికిఁ బంపితివి. ఎల్లప్పుడును దగ్గఱనుండుటవలన వృక్షాదులయందునుగూడఁ జెలిమి హెచ్చుగాఁ గలుగుచున్నది. అట్టుండ భరతునియందు దశరథునికిఁ ప్రేమగలుగునని చెప్పనేల? అట్టియుపాయంబును నీవ చెఱిచితివి. ౨౮

భరతునకు విధేయుఁడుగా నుండుశత్రుఘ్నుఁడును భరతునితోఁగూడఁ బోయినాఁడు. లక్ష్మణుఁడు రాము నాశ్రయించియున్నట్లతఁడు భరతు నాశ్రయించినవాఁడు కావున నతండున్నను ఇప్పుడు భరతున కనుకూలమయిన ప్రయత్నము సేయును. ౨౯

“అడవిలోఁ గట్టెలునఱుకుకొని జీవించువారలు ఒకచెట్టును నఱుక రాఁగా దానిచుట్టునుండు ముండ్లు తీఁగెలు పొదలుమొదలగునవి సహా సంబునం జేసి దానికిఁ గలిగినభయంబుఁ బోఁగొట్టి దానిరక్షించినవి” అని

సన్నికర్షాదీషీకాభి ర్లోచితః పరమా ద్భయాత్. ౩౦

గోప్తాహి రామం సౌమిత్రి ర్లక్ష్మణం చాపి రాఘవః,
అశ్వినో రివ సౌభ్రాత్రం తయో ర్లోకేషు విశ్రుతమ్. ౩౧

తస్మా న్న లక్ష్మణే రామగ పాపం కించి త్కరిష్యతి,
రామ స్తు భరతే పాపం కుర్యా దితి న సంశయః. ౩౨

తస్మా ద్రాజగృహా దేవ వనం గచ్ఛతు తే సుతః,
ఏత ద్ధి రోచతే మహ్యం భృశం చాపి హితం తవ. ౩౩

ఏవం తే జ్ఞాతిపక్షస్య శ్రేయ శ్చైవ భవిష్యతి,
యది చే ద్భరతో ధర్మా త్పిత్ర్యం రాజ్య మవాప్స్యతి. ౩౪

స తే సుఖోచితో బాలో రామస్య సహజో రిపుః,
సమృద్ధార్థస్య నష్టార్థో జీవిష్యతి కథం వశే. ౩౫

అభిద్రుతమివారణ్యే సింహేన గజయూథపమ్,
ప్రచ్ఛాద్యమానం రామేణ భరతం త్రాతు మర్హసి. ౩౬

వినియున్నావుగదా. అట్లు భరతుఁ డచ్చటనుండు నేని సహవాసంబున నతని
యందును దశరథునకును బ్రేమకలిగియుండును. ౩౦

లక్ష్మణుఁడు రాముని రక్షించును; అట్లు రాముఁడు లక్ష్మణుని రక్షించును.
అశ్వినీదేవతల కిర్వురకును గలుగునట్లు వారల కిర్వురకుఁ దోఁబుట్టువులగుటచేఁ
గలిగిన స్నేహము అధికముగా నుండుట లోకమందంతయుఁ బ్రసిద్ధంబై
యున్నది. ౩౧

అట్లగుటంజేసి రాముఁడు లక్ష్మణునకేమియుఁ గీడు సేయఁడు; రాముఁడు
భరతునకుమాత్రము గీడుసేయును. ఈవిషయంబునందు సందేహములేదు. ౩౨

నీకొడుకు భరతుఁ డిచ్చటికి వచ్చెనేని పట్టాభిషిక్తుఁడగు రాముఁడు
అతనిఁ జంపును కావున భరతుఁడు కేకయరాజుగృహంబునుండియె యడవికిఁ
బోవునట్లు సేయుము. అట్లయినచోఁ బ్రాణహానిగలుగదు. ఇది నాకు సరిగాఁ
దోఁచుచున్నది. అట్లు సేయుదువేని నీకొడుకు బ్రతికియుండును గావున
నీకును మేలుగలుగును. ౩౩

భరతుఁడు ధర్మంబునఁ బిత్ర్యంబగు రాజ్యంబునకుఁ బట్టాభిషిక్తుఁడగునేని
నీబంధువులకును మేలుగలుగును. ౩౪

సుఖంబనుభవింపఁదగిన నీకొడుకు భరతుఁడు రామునకుఁ జవతితల్లికొడుకు
గావున సహజశత్రువు. అట్లుండఁగా భరతుఁడు రాజ్యంబులేకుండుటవలన
సొంతమాత్రము సహాయసంపత్తిలేకుండి పట్టాభిషిక్తుఁడై సర్వాధికారంబులఁ
బొల్పుచుండు రాముని వశమునఁ జిక్కి యెట్లు జీవింపఁగలఁడు? ఎన్నివిధముల
నాలోచించినను రాముఁడు భరతు నెట్లయినఁ జంపివేయుననుట సిద్ధము. ౩౫

అడవియందు సింహముచే దఱుమఁబడి చావనకు సిద్ధమైయుండు
గజంబునుబోలె రాముని వశంబునఁ జిక్కి దిక్కులేక చావఁబోవు నీకొడుకు
భరతుని రక్షించుకొనుము. ౩౬

దర్పాన్నిరాకృతా పూర్వం త్వయా సౌభాగ్యవత్తయా,
రామమాతా సపత్నీ తే కథం వైరం న యాతయేత్. 38

యదా హి రామః పృథివీ మవాప్స్యతి
ప్రభూతరత్నాకరశైలపత్తనామ్,
తదా గమిష్యస్యశుభం పరాభవం
సహైవ దీనా భరతేన భామిని!. 39
యదా హి రామః పృథివీ మవాప్స్యతి
ధ్రువం ప్రణష్టో భరతో భవిష్యతి,
అతో హి సంచిన్తయ రాజ్య మాత్మజే
పరస్య చైవాద్య వివాసకారణమ్. 3౯

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే ఒష్టమస్సర్గః.

---

## నవమస్సర్గః

ఏవ ముక్తా తు కైకేయీ క్రోధేన జ్వలితాననా,
దీర్ఘ ముష్ణం వినిశ్వస్య మన్థరా మిద మబ్రవీత్. ౧

అద్య రామ మితః క్షిప్రం వనం ప్రస్థాపయామ్యహమ్,
యౌవరాజ్యే చ భరతం క్షిప్ర మేవాభిషేచయే. ౨

ఇదం త్విదానీం సంపశ్య కేనోపాయేన మన్థరే!,
భరతః ప్రాప్నుయాద్రాజ్యం నతు రామః కథం చన. ౩

పూర్వము నీవు పెనిమిటికి నేనందఱికన్నను బ్రియురాలనుగా నున్నానని గర్వించి నీసవతియగు కౌసల్యను నానావిధంబుల నవమానించి యున్నావు. ఇప్పుడు తనకొడుకు రాజు కాఁగానే కౌసల్య యీపగను దీర్చుకొనకుండునా? అవశ్యము నిన్నుఁ దనకుఁ బనికత్తెనుగాఁ జేసికొని నానావిధములఁ గాఱియపెట్టును. ౩౭

కైకేయీ! రాముఁ డెప్పుడు విస్తారముగా మణులగనులుఁగల పర్వతములతోను బట్టణములతోను గూడినభూమికి రాజగునో అప్పుడే నీకొడుకును నీవును దారిద్ర్యంబునొంది యమంగళకరంబగుటఁజేసి నోటంజెప్పరాని యవమానము నొందెదరు. ౩౮

రాముఁ డెప్పుడు భూమికి రాజగునో అప్పుడే భరతుఁడు నాశంబు నొందును. కావున నీకొడుకు భరతునకు రాజ్యంబువచ్చునట్లును రాముని బట్టణంబు వెడలఁగొట్టించునట్లును దగినయుక్తుల నిప్పుడే యాలోచించుకొనుము. అని మంథర కైకేయికిఁ జెప్పినది. ౩౯

ఇది యెనిమిదవ సర్గము.

---

## తొమ్మిదవ సర్గము.

కైకేయి మంథరచెప్పినమాట విని కోపంబున నెఱ్ఱగానుండుటఁజేసి మండుచున్నట్టు దోఁచుచుండుముఖంబుగలదై అధికముగా వేఁడినిట్టూర్పులు నిగుడించి మంథరఁజూచి యిట్లనిచెప్పెను. ౧

నే నీక్షణంబుననే రాము నిచ్చటనుండి యడవికిఁ బోవునట్లు చేసెదను. శీఘ్రముగానే భరతుని యువరాజుదొరతనంబునఁ బట్టాభిషిక్తునిఁగాఁ జేసెదను. ౨

మంథరా! యేయుపాయంబున భరతుఁడు రాజ్యంబునొందును. రామునకు రాజ్యంబులేకుండును? దీనినిమాత్ర మిప్పుడు నీవు చక్కఁగా నాలోచింపుము. అని కైకేయి మంథరతోఁ జెప్పెను. ౩

ఏవ ముక్తా తయా దేవ్యా మన్థరా పాపదర్శినీ,
రామార్థ ముపహింస న్తీ కైకేయీ మిద మబ్రవీత్. ౪
తా న్తేదానీం ప్రవక్ష్యామి కైకేయి! శ్రూయతాం చ మే,
యథా తే భరతో రాజ్యం పుత్రః ప్రాప్స్యతి కేవలమ్. ౫
కిం న స్మరసి కైకేయి! స్మర న్తీ వా నిగూహసే,
య దుచ్యమాన మాత్మార్థం మ త్త స్త్వం శ్రోతు మిచ్ఛసి. ౬

మయోచ్యమానం యది తే శ్రోతుం ఛన్దో విలాసిని!,
శ్రూయతా మభిధాస్యామి శ్రుత్వా చాపి విమృశ్యతామ్. ౭

శ్రుత్వై వం వచనం తస్యా మన్థరాయా స్తు కైకయీ,
కించి దుత్థాయ శయనా త్స్వ స్తీర్ణా దిద మబ్రవీత్. ౮

కథయ త్వం మమోపాయం కేనోపాయేన మన్థరే!,
భరతః ప్రాప్నుయా ద్రాజ్యం న తు రామః కథంచన. ౯

ఏవ ముక్తా తయా దేవ్యా మన్థరా పాపదర్శినీ,
రామార్థ ముపహింస న్తీ కుబ్జా వచన మబ్రవీత్. ౧౦

తవ దైవాసురే యుద్ధే సహ రాజర్షిభిః పతిః,
అగచ్ఛ త్త్వా ముపాదాయ దేవరాజస్య సాహ్యకృత్. ౧౧
దిశ మాస్థాయ వై దేవి! దక్షిణాం దణ్డకా న్ప్రతి,
వైజయ న్త మితి ఖ్యాతం పురం యత్ర తిమిధ్వజః. ౧౨

పాపములనే చేయఁదలంచునట్టిమంథర రాణియగు కైకేయిచెప్పినమాటను విని రామునిపట్టాభిషేకముఁ జెఱుపుటకై కైకేయింజూచి యిట్లని చెప్పెను. ౪

కైకేయీ! సంతోషము. నీకొడుకు భరతుఁడు మాత్రము రాజ్యంబు నొందున ట్లుపాయము నిప్పుడు చెప్పెదను. నామాట వినుము. ౫

కైకేయీ! నీకుఁ బ్రయోజనముఁగలుగు నుపాయమును నేనేచెప్పఁగా వినవలయునని కోరుచున్నావు. ఇందుకేమికారణము? నీ వా యుపాయమును మఱచితివాయేమి? లేక జ్ఞప్తియుండినను నేఁజెప్పఁగా వినవలెనని చెప్పక దాఁచియున్నావా? ౬

సౌందర్యశాలినివగు కైకేయీ! నేను జెప్పఁగా నాయుపాయమును వినవలయునని నీకుఁ గోర్కెయుండు నేని యిప్పుడే చెప్పెదను వినుము. అట్లు విని నేఁజెప్పునది యుక్తమో కాదో చక్కఁగా నాలోచింపుము. అని మంథర కైకేయితోఁ జెప్పెను. ౭

ఈప్రకారము ఆమంథర చెప్పఁగా నామాటవిని కైకేయి సుఖంబుగా నుండునట్లు చక్కఁగాఁ గల్పింపఁబడిన పాన్పునుండి యాదరాతిశయంబునఁ గొంచెము లేచి మంథరఁ జూచి యిట్లని చెప్పెను. ౮

మంథరా ! ఏమిచేసిన భరతుఁడు రాజ్యమునొందును? రాముఁ డెట్లు రాజ్యము రాకుండును? నీవు నాకాయుపాయముఁ జెప్పుము. అని కైక మంథరతోఁ జెప్పెను. ౯

ఎల్లప్పుడును బాపంబులనే చేయఁదలంచునదియైయుండు నామంథర యిట్లు రాణి యగుకైకేయి చెప్పినమాట విని రామునకుఁ బట్టాభిషేకంబు జరగకుండునట్లు సేయుటకై యాకైకేయింజూచి యిట్లని చెప్పెను. ౧౦

రాణివగు కైకేయీ! పూర్వము దేవాసురయుద్ధమునందు నీపెనిమిటి దశరథుఁడు దేవేంద్రునకు సాహాయ్యము సేయుటకై తన క్రిందిరాజులతోఁ గూడ నిన్నుఁ బిలుచుకొని దక్షిణపుదిక్కునందు దండకారణ్యంబుఁ జేరి యచ్చట తిమిధ్వజుండగు శంబరాసురుని రాజధానియగు వైజయంతంబను పట్టణంబునకుఁ బోయెను. ౧౧-౧౨

స శమ్బర ఇతి ఖ్యాత శ్శతమాయో మహాసురః,
దదౌ శక్రస్య సఙ్గ్రామం దేవసంఘై రనిర్జితః. ౧౩
తస్మి న్మహతి సఙ్గ్రామే పురుషా న్క్షతవిక్షతాన్,
రాత్రౌ ప్రసుప్తా న్ఘ్నన్తి స్మ తరసాఽఽసాద్య రాక్షసాః. ౧౪

తత్రాకరో న్మహ ద్యుద్ధం రాజా దశరథ స్తదా,
అసురై శ్చ మహాబాహు శ్శస్త్రై శ్చ శకలీకృతః. ౧౫

అపవాహ్య త్వయా దేవి! సఙ్గ్రామా న్నష్టచేతనః,
తత్రాపి విక్షత శ్శస్త్రైః పతి స్తే రక్షిత స్త్వయా. ౧౬

తుష్టేన తేన దత్తౌ తే ద్వౌ వరౌ శుభదర్శనే!,

స త్వయోక్తః పతి ర్దేవి! య దేచ్ఛేయం తదా వరౌ. ౧౭
గృహ్ణీయా మితి త త్తేన తథే త్యుక్తం మహాత్మనా,

అనభిజ్ఞా హ్యహం దేవి! త్వయైవ కథితా పురా. ౧౮
కథైషా తవ తు స్నేహా న్మనసా ధార్యతే మయా,

నానావిధంబులగు మాయలు చేయఁజాలిన శంబరుఁ డను మహాసు రుఁడు దేవతల నందఱను జయించి దేవేంద్రునితో యుద్ధముఁ జేసెను. ౧౩

అమ్మహాయుద్ధంబున మధ్యాహ్నకాలమున యుద్ధముఁ జేసి దేహ మంతయు నానావిధంబులగు గాయంబులు దగిలి పరుండి నిద్రించుచున్న పురుషులకడకు రాత్రికాలంబునఁ బోయి యసురులు బలంబున వారలఁ జంపిరి. ౧౪

అచ్చట నారాత్రికాలమునందు దశరథమహారాజు ఆయసురులతో మహాయుద్ధము చేసి తుదకు వారలచే నానావిధాయుధంబుల దేహమంతయుఁ దునకలగునట్లు గొట్టఁబడెను. ౧౫

రాణివగు కైకేయీ! అప్పుడు సారథ్యము సేయుచున్న నీ వట్లు యుద్ధమున మూర్ఛిలియున్న నీ పెనిమిటి దశరథుని యుద్ధభూమి విడిచి యవ్వలకుఁ గొనిపోయి శీతోపచారంబులఁ జనిపి కాపాడితివి. నీవు గొనిపోయియున్న యారహస్యస్థలంబునకుఁ గూడ నాయసురులువచ్చి దశరథుని నానా విధాయుధంబులఁ బ్రహరింపఁగా నీ వప్పుడు గూడ మఱియొక్క చోటికిఁ గొనిపోయి మఱలఁ గాపాడితివి. ౧౬

మంగళకరములగు కండ్లుగల కైకేయీ! ఆదశరథుఁడు నీవు రెండు మార్లును జేసిన యుపకారంబునకు సాహసంబునకు సంతసించి నీకు రెండు వరంబు లిచ్చెను.

రాణివగు కైకేయీ! "నేను గోరునప్పు డడిగెదను. అప్పుడు నా కీవరంబుల నిమ్ము" అని నీ వప్పుడు దశరథునితోఁ జెప్పితివి. సత్యవాదియగు నాదశరథుఁడును నీవుచెప్పిన ట్లొప్పుకొనెను.

రాణివగు కైకేయీ! నే నీవృత్తాంతము జరిగినది చూడలేదు. మున్నొ కప్పుడు నీవే నా కీవృత్తాంతమును జెప్పితివి. నీయందు స్నేహంబువలన "ఇది నీకుఁ జాల నుపయోగపడు" నని తలంచి మఱవక మనంబున నుంచు కొనియున్నాను. ౧౭

రామాభిషేకసమ్భారాన్నిగృహ్య వినివర్తయ. ౧౯

తౌ వరౌ యాచ భర్తారం భరతస్యాభిషేచనమ్,
ప్రవ్రాజనం చ రామస్య త్వం వర్షాణి చతుర్దశ. ౨౦

చతుర్దశ హి వర్షాణి రామే ప్రవ్రాజితే వనమ్,
ప్రజాభావగతస్నేహః స్థిరః పుత్రో భవిష్యతి. ౨౧

క్రోధాగారం ప్రవిశ్యాఽద్య క్రుద్ధే వాశ్వపతేస్సుతే!,
శేష్వాఽనన్తర్హితాయాం త్వం భూమౌ మలినవాసినీ. ౨౨

మాస్మైనం ప్రత్యుదీక్షేథా మాచైన మభిభాషథాః,
రుదంతీ చాపి తం దృష్ట్వా జగత్యాం శోకలాలసా. ౨౩

దయితా త్వం సదా భర్తురత్ర మే నాస్తి సంశయః,
త్వత్కృతే చ మహారాజో విశేదపి హుతాశనమ్. ౨౪

న త్వాం క్రోధయితుం శక్తో న క్రుద్ధాం ప్రత్యుదీక్షితుమ్,
తవ ప్రియార్థం రాజా హి ప్రాణానపి పరిత్యజేత్. ౨౫

న హ్యతిక్రమితుం శక్తస్తవ వాక్యం మహీపతిః,
మన్దస్వభావే బుధ్యస్వ సౌభాగ్యబలమాత్మనః. ౨౬

నీవు నీపెనిమిటి దశరథుని బలాత్కరించి రామునిఁ బట్టాభిషిక్తునిఁ జేయుటకై యిప్పుడు జరగుచుండు ప్రయత్నములను నిలుపునట్లు చేయుము. ౧౯

నీ వా రెండువరంబులకును భరతునకుఁ బట్టాభిషేకము సేయుటయుఁ బదునాలుగుసంవత్సరంబులు రాము నడవినుండునట్లు సేయుటయుఁ గావలెనని నీపెనిమిటి దశరథు నడుగుము. ౨౦

రాముఁడు పదునాలుగుసంవత్సరంబు లడవిలో నుండునట్లు చేయుదు వేని యాకాలంబులో నీకొడుకు భరతునిపైఁ బ్రజలకు దృఢానురాగము కలిగి యాపై రాముఁడు వచ్చి రాజ్యమునకై యెంతప్రయత్నము చేసినను అతని ప్రయత్నము సాగక భరతునకు రాజ్యము స్థిరముగా నుండును. ౨౧

అశ్వపతియగు కేకయరాజుకొమార్తె యయినకైకేయీ! నీ విప్పుడు కోపము వచ్చినప్పు డుండు గృహంబునకుఁ బోయి కోపము నొందినట్లు మాసికబట్టలఁ గట్టుకొని యాస్తరణములేని నేలపైఁ బరుండియుండుము. ౨౨

దశరథుఁడు నీయొద్దకు వచ్చినపుడు నీ వతనిం దలయెత్తిచూడకుము. అతనితో మాటలాడకుము. నేలపైఁ బడి యతనింజూచి యతిదుఃఖంబున నేడ్చుచుండుము. ౨౩

నీపెనిమిటియగు దశరథునకు నీమీఁద నెప్పుడును బ్రీతి యెచ్చుగాఁ గలదు. ఈవిషయమునందు నాకు సందేహములేదు. నీవు కోరుదువేని యతఁడు నిప్పులలోఁగూడ దుముకును. ౨౪

దశరథమహారాజు నీకుఁ గోపముగలుగునట్లుఁ జేయ భయపడును. నీవు కోపించియున్నప్పుడు నిన్నుఁ దలయెత్తిచూడఁజాలఁడు. నీవు కోరుదువేని నీకు సంతోషముగలుగుటకై ప్రాణంబులనుఁగూడ విడుచును. ౨౫

భూమికిఁ బ్రభువయినదశరథుఁడు నీమాటనతిక్రమింపఁజాలఁడు నీవు తెలివిలేనిదానవు. ఇప్పుడు నీసౌందర్యబలం బెంతటిదో తెలిసికొనుము.

మణిముక్తం సువర్ణాని రత్నాని వివిధాని చ,
దద్యా ద్దశరథో రాజా మాస్మ తేషు మనః కృథాః. ౨౭
యౌ తౌ దైవాసురే యుద్ధే వరౌ దశరథోఽదదాత్,
తౌ స్మారయ మహాభాగే!సోఽర్థో మాం త్వా మతిక్రమేత్. ౨౮

యదా తు తే వరం దద్యా త్స్వయ ముత్థాప్య రాఘవః,
వ్యవస్థాప్య మహారాజం త్వ మిమం వృణుయా వరమ్. ౨౯
రామం ప్రవ్రాజయారణ్యే నవవర్షాణి పఞ్చచ,
భరతః క్రియతాం రాజా పృథివ్యాః పార్థివర్షభః, ౩౦

చతుర్దశ హి వర్షాణి రామే ప్రవ్రాజితే వనమ్,
రూఢశ్చ కృతమూలశ్చ శేషం స్థాస్యతి తే సుతః. ౩౧

రామప్రవ్రాజనంచైవ దేవి! యాచస్వ తం వరమ్,

ఏవం సిధ్యన్తి పుత్రస్య సర్వార్థా స్తవ భామిని!. ౩౨

ఏవం ప్రవ్రాజిత శ్చైవ రామోఽరామో భవిష్యతి,
భరత శ్చ హతామిత్ర స్తవ రాజా భవిష్యతి. ౩౩

దశరథమహారాజు రత్నములను ముత్తెములను బంగారుసామానులను నీ కిచ్చును. నీవు వానియందుమాత్రము కొంచెమైనను మనసుంచకుము. ౨౭

పూజ్యంబగు సదృష్టముఁగల కైకేయీ! దేవాసురులు చేయుయుద్ధంబున దశరథుఁడు నీ కేవరంబుల నిచ్చెనో నీ వావరంబు లతనికి జ్ఞప్తికివచ్చునట్లు చేయుము. నీప్రయోజనము చెడకుండునట్లు ప్రయత్నింపుము. ౨౮

దశరథుఁ డెప్పుడు తానే నిన్ను లేపి కూర్చుండఁబెట్టి వరంబిచ్చెదనని చెప్పునో అప్పుడు అతని సత్యంబున నిలువఁద్రొక్కి యీవరంబడుగుము. ౨౯

రాముఁడు పదునాలుగు వత్సరంబు లూరు విడిచి యరణ్యమున నుండునట్లు చేయుము. భరతుఁడు భూమికి రాజుగా రాజులలో మేటిగా నుండునట్లు చేయుము అని యీవరము నడుగుము. ౩౦

రాముఁడు పదునాలుగువత్సరంబులు అడవి నుండునట్లు చేయుదువేని యింతలో నీకొడుకు భరతుఁడు ప్రజల యనురాగంబు నొంది మూలబలము తనయధీనముగాఁ జేసికొనియుండును. కావున రాముఁడు మరల వచ్చినను రాజ్య మతనికిఁ దక్కఁడు. అట్లు మిగత కాలమును నీకొడుకే రాజుగా నుండఁగలఁడు. ౩౧

రాణివగు కైకేయీ! అట్లగుటఁ జేసి నీవు భరతాభిషేకముఁ గోరుకొను నప్పుడు దానితోఁగూడ విడువక రాము నడవికిఁ బంపవలె ననియుంచు దశరథు నడుగుకొనుము.

కైకేయీ! నీ విప్పుడు నేను జెప్పినప్రకారము చేయుదువేని నీకొడుకు భరతునకు నెల్లప్రయోజనంబులును సమకూరును. ౩౨

ఈప్రకారముగా రాముఁడు పదునాలుగుసంవత్సరంబు లడవి నుండిన పిమ్మట బహుకాలము చాలదూరమున నుండుటవలనను భరతుఁడును జనులందఱిఁ జక్కఁగా సంతోషపఱచుచుండుటవలనను జనులకు రామునిపై ననురాగ మెంతమాత్రము నుండదు. (పక్షాంతరమందు ఈప్రకారముగా రాముఁడు

యేన కాలేన రామశ్చ వనాత్ప్రత్యాగమిష్యతి,
తేన కాలేన పుత్ర స్తే కృతమూలో భవిష్యతి. 3౪
సంగృహీతమనుష్యశ్చ సుహృద్భి స్సార్థ మాత్మవాన్,
ప్రాప్తకాలం తు తే మన్యే రాజానం వీతసాధ్వసా. 3౫
రామాభిషేకసంభారా న్నిగృహ్య వినివర్తయ,

అనర్థ మర్థరూపేణ గ్రాహితా సా తత స్తయా. 3౬
హృష్టా ప్రతీతా కైకేయీ మన్థరా మిద మబ్రవీత్,

సా హి వాక్యేన కుబ్జాయాః కిశోరీ వోత్పథం గతా. 3౭
కైకేయీ విస్మయం ప్రాప్తా పరం పరమదర్శనా,

కుబ్జే! త్వాం నాభిజానామి శ్రేష్ఠాం శ్రేష్ఠాభిధాయినీమ్. 3౮
పృథివ్యా మసి కుబ్జానా ముత్తమా బుద్ధినిశ్చయే,

త్వ మేవ తు మమార్థేషు నిత్యయుక్తా హితైషిణీ. 3౯

పదునాలుగుసంవత్సరంబు లడవి నుండి యీవిమ్మట నిచ్చటికి వచ్చినప్పటికిని రాజైనభరతుని భయంబున నతని కెవ్వరును సాహాయ్యము సేయుంవార లుండరు. కావున నతఁ డేకాకిగా నేయుండును.) నీకొడుకు భరతుఁడు శత్రువుల జయించి యెప్పటికిని రాజుగా నుండఁగలఁడు. ౩౩

రాముఁ డిచ్చటికి వచ్చునంతకు ఈపదునాలుగేండ్లలోపల నీకొడుకు భరతుఁడు బుద్ధిమంతుఁడు కావున జనులఁ దనకు వశ్యులఁగాఁ జేసికొని స్నేహితుల సంపాదించి యెంతమాత్రము గదలింపఁగూడనివాఁడై స్థిరుఁడై యుండును. ౩౪

నీవు భయము విడిచి దశరథమహారాజును నిర్బంధించి రామునకుఁ బట్టాభిషేకము సేయుంటకై సేయుం ప్రయత్నములు నిలిచిపోవునట్లు చేయుము. దాని కిది సరియయినకాలమని నాకుఁ దోఁచుచున్నది. అని మంథర కైకేయికిఁ జెప్పినది. ౩౫

కైకేయి తనకే ప్రతికూలముగా నుండుదాని ననుకూలముగాఁ దోఁచునట్లు మంథరచే బోధింపఁబడినదై మోహమున నట్లే తనకుఁ బ్రతికూలములగు రామవివాసన భరతాభిషేకములను దన కనుకూలంబులుగాఁ దలంచి సంతోషంబు నొంది మంథరం జూచి యిట్లని చెప్పెను. ౩౬

ఆకైకేయ యథార్థస్థితిని జక్కఁగా నెఱుఁగఁ జాలినదయ్యు నామంథరమాటలకు నాశ్చర్యము నొంది బెదరువలన దారి తప్పిన యాఁడుగుఱ్ఱము వలెఁ బట్ట శక్యము గా కుండినది. ౩౭

గూనిదాన వగుమంథరా ! నీవింత చక్కఁగా మాటలుచెప్పుదాన వనియును మేలుబోధింపఁగలదాన వనియును బూజ్యురాలవనియును నే నిదివఱ కెఱుంగనైతి. గూనివారలే యితరులకన్నను బుద్ధిగలవారలు. నీవు ఆలోచన యందు భూమినున్నయాగూనివార లందఱికన్నను సమర్థురాలవు. ౩౮

గూనిదానవగు మంథరా ! నీవొకతెవె నాకార్యములయందుఁ జాల నాసక్తిగలదానవు. నాకు మేలుఁగలఁగవలెననికోరుదానవు. నీవులేక నేనుమాత్రమే

నాహం సమవబుద్ధ్యేయం కుబ్జే! రాజ్ఞశ్చికీర్షితమ్,

సన్తి దుస్సంస్థితాః కుబ్జా వక్రాః పరమదారుణాః. ౪౦
త్వం పద్మమివ వాతేన సన్నతా ప్రియదర్శనా.

ఉర స్తేఽభినివిష్టం వై యావ త్స్కన్ధా త్సమున్నతమ్. ౪౧
అధస్తా చ్చోదరం శాతం సునాభ మివ లజ్జితమ్,

పరిపూర్ణం చ జఘనం సుపీనౌచ పయోధరౌ. ౪.౨
విమలేన్దుసమం వక్త్ర మహో రాజసి మన్థరే!,

జఘనం తవ నిర్ఘుష్టం రశనాదామశోభితమ్. ౪౩
జఙ్ఘే భృశ ముపన్యస్తే పాదౌ చాప్యాయతా వుభౌ.

త్వ మాయతాభ్యాం సక్థిభ్యాం మన్థరే! క్షౌమవాసినీ. ౪౪
అగ్రతో మమ గచ్ఛన్తీ రాజహంసీవ రాజసే,
ఆసన్యా శ్శమ్బరే మాయాః సహస్ర మసురాధిపే. ౪౫
సర్వా స్త్వయి నివిష్టాస్తా భూయ శ్చాన్యా స్సహస్రశః,

యయినచో నిప్పుడు దశరథమహారాజు రామాభిషేకము చేసి నన్నుఁ జెఱుపఁ దలంచుటను దెలిసికొనలేను. ౩౯

లోకంబునందు విశ్రుతంబుగా గూనుకొనిన యవయవములుగలిగి వంకరలయినవారై చూపరులకు భయంబుఁబుట్టించుచుండు గూనివార లనేకు లున్నారు. నీవుమాత్ర మట్లు కాదు. నీవు చూపరులకుఁ జాలసంతోషము గలిగించునట్టి సుందరరూపంబుగలదానవు. వాతంబునఁ గమలంబువలె వంగియున్నావు. గాలిచేవంగినదయ్యును గమలం బెట్లు సుందరంబుగానేయుండునో నీవునట్లు సహజసుందరవగుటంజేసి వాతోద్రేకంబునవంగిన దానవయ్యునలి సుందరివిగానే యగపడుచున్నావు. ౪౦

నీఱొమ్ము మూఁపు లున్నతములుగా నున్నవని యనూయచేఁ బట్టుగల్గి మూఁపులవఱకుఁ బొడవైనది. దానిక్రింద సుందరమగు బొడ్డుగలకడుపు "నాతోఁ గూడ నుండుఱొమ్ము అంత పొడవుగా నున్నది. నా కంత పొడవగుటకాలేదు" అని సిగ్గునొందినదో యనునట్లు సన్నముగానున్నది. ౪౧

నీ జఘనము విశాలమయియున్నది. నీ స్తనములు బలిసినవిగా నున్నవి. నీ ముఖంబు కళంకములేనిచంద్రునకు సాటివచ్చుచున్నది. నీవు చూపరుల కాశ్చర్యంబుగలుగునట్లు ప్రకాశించుచున్నావు. ౪౨

నీజఘనంబు మొలనూలిచే నలంకరింపఁబడి ధ్వనించుచున్నది. నీపిక్కలు సుందరముగా నున్నవి. నీపాదములు రెండును నిడుపుగా సుందరములై యున్నవి. ౪౩

మంథరా! నీవు నిడుపులయిన తొడలుగలిగి తెల్లపట్టుబట్ట గట్టుకొని నాముందటఁ దిరుగుచు రాజహంసియుఁబోలెఁ జూపట్టుచున్నావు. ౪౪

అసురుల కధిపుఁడగు శంబరాసురునియం దేమాయలు వేయిసంఖ్యగలవి యుండినవో ఆమాయలన్నియును మఱియు నితరమాయలును వేనవేలుగా నీయందున్నవి. ౪౫

తవేదం స్థగు యద్దీర్ఘం రథఘోణ మి వాయతమ్. ౪౬
మతయః క్షత్రవిద్యాశ్చ మాయా శ్చాత్ర వసన్తి తే,

అత్ర తే ప్రతిమోక్ష్యామి మాలాం కుబ్జే హిరణ్మయీమ్. ౪౭
అభిషిక్తే చ భరతే రాఘవే చ వనం గతే,
జాత్యేన చ సువర్ణేన సునిష్టప్తేన మన్థరే!. ౪౮
లబ్ధార్థా చ ప్రతీతా చ లేపయిష్యామి తే స్థగు,

ముఖే చ తిలకం చిత్రం జాతరూపమయం శుభమ్. ౪౯
కారయిష్యామి తే కుబ్జే! శుభాన్యాభరణాని చ,

పరిధాయ శుభే వస్త్రే దేవ తేవ చరిష్యసి. ౫౦

చన్ద్ర మాహ్వాయమానేన ముఖేనా ప్రతిమాననా,
గమిష్యసి గతిం ముఖ్యాం గర్వయన్తీ ద్విషజ్జనమ్. ౫౧

తవాపి కుబ్జాః కుబ్జాయాః సర్వాభరణభూషితాః,
పాదౌ పరిచరిష్యన్తి యథైవ త్వం సదా మమ. ౫౨

ఇతి ప్రశస్యమానా సా కైకేయీ మిద మబ్రవీత్,
శయానాం శయనే శుభ్రే వేద్యా మగ్నిశిఖా మివ. ౫౩

గతోదకే సేతుబంధో న కల్యాణి! విధీయతే,

రథచక్రముసమీపమునసుండు నున్నతప్రదేశంబువలె దీర్ఘంబై యుండు నీగూనులో, నీబుద్ధులు నీవు నేర్చియుండురాజనీతులును మాయలును వసించుచున్నవి. ౪౬

గూనిదాన వగుమంథరా! భరతునకుఁ బట్టాభిషేకముకాఁగానే నీగూను నందు బంగారుగొలుసువేసెదను. ౪౭

మంథరా! నేను కార్యసిద్ధినొందినపిమ్మట సంతోషించి మంచిజాతిలో నిదియును చక్కఁగాఁ గరఁగింపఁబడినదగుటచే నుత్తమంబునగు బంగారుతోఁ జేయఁబడినకవచము వేసి నీగూను నలంకరించెదను. ౪౮

గూనిదాన వగుమంథరా! నీముఖంబునకు బంగారుతోఁ జేయఁబడి నానావిధమణులు పొదుగఁబడియుండుటచే నానావిధవర్ణంబులుగల సుందర మగుతిలకముఁ జేయించెదను. మఱియు నితరములయిన మంచిసొమ్ములఁ జేయించియిచ్చెదను. ౪౯

నీవు చాల విలువగలయుత్తమంబులగు బట్టలఁగట్టుకొని దేవతయుఁ బోలె వెలుంగుచుఁ దిరుగుచుండఁగలవు. ౫౦

సరిలేనిముఖంబుగలదాన వగునీవు చంద్రునితోఁ బోటిసేయునంతటి సుందరమయిన ముఖముతో నాశత్రువులఁ జూచి గర్వించుచు సుందరముగాఁ దిరుగుచుండఁ గలవు. ౫౧

నీవు నాపాదముల నెల్లప్పుడు సేవించు చుండునట్లు సమస్తములయిన సొమ్ములచే నలంకరింపఁబడిన కుబ్జలు నీపాదములకును నానావిధంబుగా సేవ సేయఁగలరు. అని కైకేయి మంథరతోఁ జెప్పెను. ౫౨

ఆమంథర కైకేయిచే నీప్రకారముగాఁ గొనియాడఁబడినదై తెల్లగా నుండు పాన్పునఁబరుండి వేదియందున్న యగ్నిజ్వాలయుఁబోలె వెలుఁగుచున్న కైకేయింజూచి యిట్లని చెప్పెను. ౫౩

మంగళకరి వగుకైకేయీ! నీళ్ళంతయుఁ బాఱిపోయినపిమ్మట గట్టుకట్టి నేమిప్రయోజనము? అట్లు రామాభిషేకం బయినపిమ్మట నీవు వరంబుఁగోరిన

ఉత్తిష్ఠ కురు కల్యాణి! రాజాన మనువశ్యయ. ౫౪

తథా ప్రోత్సాహితా దేవీ గత్వా మన్థరయా సహ,
క్రోధాగారం విశాలాక్షీ సౌభాగ్యమదగర్వితా. ౫౫
అనేకశతసాహస్రం ముక్తాహారం వరాఙ్గనా,
అవముచ్య వరార్హాణి శుభాన్యాభరణాని చ. ౫౬
తతో హేమోపమా తత్ర కుబ్జా వాక్యవశంగతా,
సంవిశ్య భూమౌ కైకేయీ మన్థరా మిద మబ్రవీత్. ౫౭

ఇహ వా మాం మృతాం కుబ్జే! నృపాయావేదయిష్యసి,

వనం తు రాఘవే ప్రాప్తే భరతః ప్రాప్స్యతి క్షితిమ్. ౫౮

న సువర్ణేన మే హ్యర్థో న రత్నై ర్న చ భూషణైః,
ఏష మే జీవిత స్యాన్తో రామో య ద్యభిషిచ్యతే. ౫౯

అథో పున స్తాం మహిషీం మహీక్షితో
వచోభి రత్యర్థమహాపరాక్రమైః,
ఉవాచ కుబ్జా భరతస్య మాతరం
హితం వచో రామ ముపేత్య చాహితమ్. ౬౦

యుం బ్రయోజనము లేదు. కావున నిప్పు డీయుపయోగములేనిమాటలఁ బ్రొద్దుపుచ్చవలదు. లెమ్ము. నేఁజెప్పినట్లు సేయుము. కోపగృహంబు నొంది రాజువచ్చుట కెదురుచూచు చుండుము. ౫౪

విశాలంబులగు నేత్రంబులుగలిగి సౌందర్యమదంబున గర్వించి యుత్తమస్త్రీయయియుండు రాణియగు కైకేయి అట్లు మంథరచేఁ బురికొల్పఁబడినదై గూనిదగు మంథరమాటకు లోఁబడి మంథరతోఁగూడ నాకోపగృహంబునకుఁ బోయి పెక్కులక్షలు వెలగలముక్తాహారమును మంగళకరంబులు నుత్తమంబులు నైన యితరభూషణంబులను దీసివేసి రత్నఖచితభూషణంబులు లేకుండుటఁజేసి యచ్చపుబంగారువలె వెలుఁగుచుండుమేనుగల దై యచ్చట నేలపైఁ బరుండి మంథరంజూచి యిట్లని చెప్పెను. ౫౭

గూనిదాన వగుమంథరా! ఒకవేళ దశరథుఁడు నాకు వరంబుల నొసంగకపోవునేని యిచ్చటనే నేను బ్రాణంబులు విడుతునుకాని కార్యసిద్ధినొందక జీవింపను. అప్పుడు "కైకేయి కోపగృహంబునం జచ్చినది" అని నీవు దశరథునకుఁ జెప్పఁగలవు. (లేక నాతండ్రియగు కేకయరాజునకుం జెప్పఁగలవు.

అట్లు గాదేని రాముఁ డడవికిఁ బోఁగా భరతుఁడు భూమికి రాజు కావలయును. ఈరెంటిలో నొకటి యేదైనను జరుగుట నిశ్చయము. ౫౮

దశరథుఁడు నాకు బంగార మొసంగినను బ్రయోజనము లేదు. మణుల నిచ్చినను నుపయోగంబు లేదు. సొమ్ములనిచ్చినను నేనొప్పను. రామునకుమాత్రము పట్టాభిషేకముజరగునేని నేనుబ్రాణంబులవిడుతును. ఇది నిశ్చయము. ౫౯

అంత నతిక్రూరంబులగు మాటలంజెప్పు గూనిదగు నామంథర దశరథుని యుత్తమభార్యయుం భరతునితల్లియు నగు నాకైకంజూచి యాకైకకు మేలును రామునకుఁ గీడును గలుగుటకై ఇట్లని చెప్పెను. ౬౦

ప్రపత్స్యతే రాజ్య మిదం హి రాఘవో
యది ధ్రువం త్వం ససుతా చ తప్స్యసే,
అతో హి కల్యాణి! యతస్వ త త్తథా
యథా సుత స్తే భరతోఽభిషేక్ష్యతే. ౬౧
తథాఽతివిద్ధా మహిషీ తు కుబ్జయా
సమాహతా వాగిషుభి ర్ముహు ర్ముహుః,
నిధాయ హస్తౌ హృదయేఽతివిస్మితా
శశంస కుబ్జాం కుపితా పునః పునః. ౬౨

యమస్య వా మాం విషయం గతా మితో
నిశామ్య కుబ్జే! ప్రతివేదయిష్యసి,
వనం గతే వా సుచిరాయ రాఘవే
సమృద్ధకామో భరతో భవిష్యతి. ౬౩

అహం హి నై వా స్తరణాని న స్రజో
న చన్దనం నాఞ్జనపానభోజనమ్,
న కించి దిచ్ఛామి న చేహ జీవితం
న చే దితో గచ్ఛతి రాఘవో వనమ్. ౬౪
అ థైత దుక్త్వా వచనం సుదారుణం
నిధాయ సర్వాభరణాని భామినీ,
అసంవృతా మా స్తరణేన మేదినీం
తదాఽధిశిశ్యే పతితేవ కిన్నరీ. ౬౫
ఉదీర్ణసంరమ్భతమోవృతాననా
తథాఽవముక్తో త్తమమాల్యభూషణా,

కల్యాణివగు కైకేయీ! రాముఁ డీరాజ్యము నొందునేని నీకొడుకు భరతుఁడును నీవును దుఃఖించెదరు. ఇది నిశ్చయము. కావున రామునకుఁ బట్టాభిషేకముగాక నీకొడుకు భరతునకుఁ బట్టాభిషేకం బగునట్లు ప్రయత్నింపుము. ౬౧

అట్లు బాణంబులఁ బోలెఁ గ్రూరంబులయిన మాటమాటికి మంథర చెప్పినమాటలకు లోఁబడి కైకేయి మిగుల దుఃఖించి రామునకుఁ బట్టాభిషేకము సేయం బూనిన దశరథునిపైఁ గోపంబుఁ బూని "నాకు బహుప్రియుని వలె నుండి దశరథుఁడిట్లు నన్నుఁ జెఱుపఁ దలంచెనుగదా!" యని యాశ్చర్యంబు నొంది ఱొమ్మునం జేతు లిడికొని మంథరం జూచి యిట్లని చెప్పెను. ౬౨

గూనిదానవగు మంథరా! నే నీకోపగృహంబునుండియె మృతినొందఁగా నీవు దానిం జూచి దశరథునకుఁ దెలుపుటయయినను గాఁగలదు. లేక రాముఁడు బహుకాలం బడవిలో నుండఁగా భరతుఁడు శాశ్వతంబుగా రాజ్యసుఖంబులం బొంది పూర్ణకాముఁడుగానైనను గాఁగలఁడు. ఈ రెంటిలో నొక్కటి యేదైనను జరుగుట సిద్ధము. వేఱులేదు. ౬౩

రాముఁ డిచ్చటనుండి యడవికిఁబోఁడేని నేను బఱుపులపైఁ బరుండను. పుష్పమాలికల ధరింపను. చందనముఁ బూసికొనను. అభ్యంజనముఁ జేసికొనను. త్రాగను, భోజనంబుఁ జేయను. నాకేవియుం నక్కఱలేదు. ప్రాణములను గూడ విడిచెదను. అని కైకేయి మంథరతోఁ జెప్పెను. ౬౪

కైకేయి, యిట్లు భయంకరంబుగా మంథరయెదుటఁ బ్రతిజ్ఞఁ జేసి యంత తనసొమ్ము లన్నియుం నేలపైఁ దీసివేసి యాస్తరణములేని భూమిపైఁ బుణ్యంబు తఱిగినపిమ్మట నాకాశంబునుండి నేలపైఁబడు కిన్నరియుం బోలెఁ బరుండెను. ౬౫

అప్పుడు అతిశయించినకోపం బనెడు చీఁకటిచేఁ గప్పఁబడినముఖంబను చంద్రుఁడు గలిగి పుష్పమాలికలు సొమ్ములు ననునక్షత్రంబులఁ దీసివేసి

నరేన్ద్రపత్నీ విమనా బభూవ సా
తమోవృతా ద్యౌ రివ మగ్న తారకా. ౬౬

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే నవమస్సర్గః.

---

## ద శ మ స్సర్గః.

విదర్శితా యథా దేవీ కుబ్జయా పాపయా భృశమ్,
తథా శేతే స్మ సా భూమౌ దిగ్ధవిద్ధేవ కిన్నరీ. ౧

నిశ్చిత్య మనసా కృత్యం సా సమ్యగితి భామినీ,
మన్థరాయై శనై స్సర్వ మాచచక్షే విచక్షణా. ౨

సా దీనా నిశ్చయం కృత్వా మన్థరావాక్యమోహితా,
నాగకన్యేవ నిశ్వస్య దీర్ఘ ముష్ణం చ భామినీ. 3
ముహూర్తం చిన్తయామాస మార్గమాత్మసుఖావహమ్,
సా సుహృ చ్చార్థకామా చ తం నిశమ్య సునిశ్చయమ్. ౪
బభూవ పరమప్రీతా సిద్ధిం ప్రాప్యేవ మన్థరా,

అథ సా రుషితా దేవీ సమ్య క్కృత్వా వినిశ్చయమ్. ౫
సంవివేశాబలా భూమౌ నివేశ్య భ్రుకుటీం ముఖే,
తత శ్చిత్రాణి మాల్యాని దివ్యా న్యాభరణాని చ. ౬
అపవిద్ధాని కైకేయ్యా తాని భూమిం ప్రపేదిరే,

తయా తాన్యపవిద్ధాని మాల్యాన్యాభరణాని చ. ౭
అశోభయన్త వసుధాం నక్షత్రాణి యథా నభః,

యుండ్న యాకైకేయి యట్లు నక్షత్రంబు లన్నియు న స్తమింపఁగాఁ జీఁకటిచే వ్యాపింపఁబడియుండు నాకాశంబుఁబోలెఁ జూపట్టుచుండెను. ౬౬

ఇది తొమ్మిదవ సర్గము.

---

## పదియవ సర్గము.

రాణియైన కైకేయి పాపిష్ఠురాలగుమంథరచేసిన కుత్సితబోధనకులోఁబడి కిన్నరివిషము పూసినబాణముచేఁ గొట్టఁబడి నేలఁబడినట్లు నేలపైఁ బరుండెను. ౧

పండితురాలగు నాకైకేయి తనమనంబునఁ జేయవలసినకార్యంబును జక్కఁగా నాలోచించి నిశ్చయించి మంథరనుజూచి మెల్లగా "నీవుచెప్పిన దంతయుఁ జక్కఁగానున్నది" అని చెప్పినది. ౨

ఆకైకేయి యట్లు దుఃఖాతురాలై మంథరమాటకు లోఁబడి నిశ్చయించి నాగకన్యయుఁబోలె నధికముగా వేఁడి నిట్టూర్పులు నిగుడించి మఱలఁదనకు సుఖంబు గలిగించుదానిని గుఱించి యాలోచించెను. 3

కైకేయికి స్నేహితురాలును కైకేయికార్యమం దాసక్తురాలునగు నామంథర కైకేయిచెప్పిన నిశ్చయప్రకారంబు విని కార్యసిద్ధినొందినప్పుడు పొందఁదగిన సంతోషమంతటి సంతోషమును బొందెను. ౪

అంత నాకైక కోపంబునొంది యీప్రకారముగా దృఢమైననిశ్చయంబుఁజేసి ముఖంబున బొమముడిధరించి నేలపైఁ బరుండెను. ౫

అంత నాకైకేయి తీసివేసిన నానావర్ణంబులగు పుష్పమాలికలును శ్రేష్ఠంబులగు నాభరణంబులును గోపంబుచే దాఁచిపెట్టనందున నేలపైఁ బడియుండినవి. ౬

ఆకైకేయి నేలఁదీసివేసిన పుష్పమాలికలును సొమ్ములును నక్షత్రంబులాకాశంబును బ్రకాశింపఁజేయుఁనట్లు నేలను బ్రకాశింపఁజేయుచుండినవి. ౭

క్రోధాగారే నిపతితా సా బభౌ మలినామ్బరా. ౮
ఏకవేణీం దృఢం బద్ధ్వా గతసత్త్వేవ కిన్నరీ,

ఆజ్ఞాప్య చ మహారాజో రాఘవస్యాభిషేచనమ్. ౯
ఉపస్థాన మనుజ్ఞాప్య ప్రవివేశ నివేశనమ్,
అద్య రామాభిషేకోవై ప్రసిద్ధ ఇతి జజ్ఞివాన్. ౧౦
ప్రియార్హాం ప్రియ మాఖ్యాతుం వివేశాన్తఃపురం వశీ,

స కైకేయ్యా గృహం శ్రేష్ఠం ప్రవివేశ మహాయశాః. ౧౧
పాణ్డురాభ్రమి వాకాశం రాహుయుక్తం నిశాకరః,

శుకబర్హిణసంఘుష్టం క్రౌఞ్చహంసరుతాయుతమ్. ౧౨
వాదిత్రరవసంఘుష్టం కుబ్జావామనికాయుతమ్,
లతాగృహైశ్చిత్రగృహై శ్చమ్పకాశోకశోభితైః. ౧౩
దాన్తరాజతసౌవర్ణ వేదికాభి స్సమాయుతమ్,
నిత్యపుష్పఫలై ర్వృక్షై ర్వాపీభి శ్చోపశోభితమ్. ౧౪
దాన్త రాజత సౌవర్ణై స్సంవృతం పరమాసనైః,
వివిధై రన్నపానైశ్చ భక్ష్యైశ్చ వివిధై రపి. ౧౫
ఉపపన్నం మహార్హైశ్చ భూషితై స్త్రిదివోపమమ్,
త త్ప్రవిశ్య మహారాజ స్స్వ మన్తఃపుర మృద్ధిమత్. ౧౬
న దదర్శ ప్రియాం రాజా కైకేయీం శయనోత్తమే,

తలఁ జక్కఁగా దువ్వుకొనక వెండ్రుకలంతయుం నొక్కటిగాఁగట్టి ముడివేసికొని ముఱికిబట్టలఁ గట్టుకొని కోపగృహంబునఁ బడియున్న యాకైకేయి మృతినొందిపడియుండు కిన్నరస్త్రీవలెఁ బ్రకాశించుచుండినది. ౮

అంత దశరథమహారాజు రామునకుఁ బట్టాభిషేకము సేయునట్టు లాజ్ఞాపించి సభికుల ననుమతినొంది యంతఃపురము బ్రవేశించెను. ౯

స్వతంత్రుఁడగు నాదశరథమహారాజు "ఇప్పుడే రామునకుఁ బట్టాభిషేకము కాఁబోవుచున్నది అని వెల్లడియైనది. కావున నిదివఱకే ఈసంతోషవార్త కైకేయికిఁ దెలిసియుండదు" అని తలంచి యిట్టి సంతోషవార్తఁ జెప్పుటకుఁ గైకేయితగినది కాఁబట్టి యీసంతోషవార్తను కైకేయికి దానే చెప్పుటకై యంతఃపురంబునకుఁ బోయెను. ౧౦

అధికమయిన కీర్తిగల యీదశరథమహారాజు తనకు మరణంబు గలిగింపఁబోవు నాకైకేయియుండు తెల్లనిమేడమీఁదికిఁ బోవుట చంద్రుఁడు తన్ను మ్రింగునట్టి రాహువుతోఁగూడిన తెల్లమబ్బులుగల యాకాశంబునకు వచ్చునట్టుండెను.

మధురంబుగాఁ గూయుచుండు చిలుకలు నెమళ్లుఁ గ్రౌంచంబులు హంసలు మొదలగుపక్షులుగల్గి మంచినేర్పుతో వాయింపఁబడుచుండు చతుర్విధవాద్యంబులధ్వనులచే వ్యాపింపఁబడి స్త్రీలకును బురుషులకును బొంగుగలుగఁ జేయుచు నంతఃపురంబునఁ బరిచారికలయియున్న గూనుగలస్త్రీలు వామనస్త్రీలు మొదలగువారలతోఁగూడి సంపెఁగచెట్లు అశోకవృక్షంబులు మొదలగు వానిచే నలంకరింపఁబడిన లతాగృహంబులుఁ జిత్రగృహంబులుఁ జుట్టునుఁ గలిగి దంతముతోను వెండితోను బంగారముతోను జేయఁబడినతిన్నెలచే నలంకరింపఁబడి దోహదములచే నకాలంబునందున బూలుఁ బండ్లు మున్నగు నవి గలిగియుండుచెట్లును నడబావులును గలిగి దంతములతోను వెండితోను బంగారముతోను జేయఁబడి శ్రేష్ఠంబులయిన యాసనంబులతో నొప్పుచు నానావిధంబులగు నన్నంబులు మద్యంబులుఁ బలుతెఱంగులైన రుచ్యంబు

స కామబలసంయుక్తో రత్యర్థం మనుజాధిపః, ౧౭
అపశ్య న్దయితాం భార్యాం పప్రచ్ఛ విషసాద చ,

న హి తస్య పురా దేవీ తాం వేళా మత్యవర్తత, ౧౮
న చ రాజా గృహం శూన్యం ప్రవివేశ కదాచన,

తతో గృహగతో రాజా కైకేయీం పర్యపృచ్ఛత, ౧౯
యథాపూర్వ మవిజ్ఞాయ స్వార్థలిప్సు మపణ్డితామ్,

ప్రతిహారీ త్వథోవాచ సంత్రస్తా సుకృతాఞ్జలిః, ౨౦
దేవ దేవీ భృశం క్రుద్ధా క్రోధాగార మభిద్రుతా,

లగు భక్ష్యంబులునుఁగల్గి చక్కఁగా సొమ్ములచే నలంకరింపఁ బడియుండు నుత్తమస్త్రీలు గల్గుటఁ జేసి యప్సరసలతోఁ గూడియుండు స్వర్గంబుతో సాటి యగుచు నిట్లు సంపూర్ణంబగు మన్మథోద్దీపనసామగ్రితో నొప్పుచుండు తనయంతఃపురంబుఁ బ్రవేశించి దశరథమహారాజు మన్మథపీడితుఁడై అచ్చట మేలైనపాన్పునందుఁ జూడఁగా నతనికిఁ బ్రియభార్యయగు కైకేయి యగపడదయ్యె. ౧౬

మనుష్యులకుఁ బ్రభుండైన యాదశరథుండు అచ్చటనుండు మన్మథోద్దీపనపదార్థములవలన మన్మథోద్రేకంబునొంది శయనంబునందుఁ దనభార్య లేకుండుటఁ జూచి రతికొఱకు అచ్చటనుండి "కైకేయీ ! యెచ్చట నున్నావు" అని యడిగి బదులు పలుకకుండుటఁ జేసి, మిక్కిలియుం దుఃఖంబు నొందెను. ౧౭

ఇదివఱకెప్పుడును ఆదశరథునిభార్య యగుకైకేయి అతఁడు తనయొద్దకు వచ్చునప్పుడు చక్కఁగా నలంకారముచేసికొని సంతోషముతో నతని నెదుర్కొనకుండినదిలేదు. ఆదశరథుఁడు కైకేయి లేకుండుటఁ జేసి శూన్యంబుగానుండు నాగృహం బిదివఱకెప్పుడును బ్రవేశించినదిలేదు కావున నిప్పుడు విపరీతముగా నుండుటఁ జూడఁగా నతనికి మిగుల దుఃఖంబు గలిగినది.

అంత దశరథమహారాజు ఇంటిలోనికిఁబోయి యిప్పుడు కైకేయి స్వప్రయోజనమును గోరునదిగాను రాఁగలదుఃఖము తెలిసికొనలేనిదిగాను ఉన్నసంగతిఁ దెలియనివాఁడు కావున మునుపు కైకేయి లేకున్నప్పుడడుగు నట్లే అక్కడనున్న ప్రతీహారిం జూచి "కైకేయి యెచ్చటనున్నది" అని యడిగెను. ౧౯

అంత ద్వారపాలకురాలు భయంబుతోఁ జేతులు మొగిడ్చికొని దశరథునితో నిట్లనిచెప్పెను. ౨౦

దశరథమహారాజా ! రాణియగుకైకేయి మిగులఁ గోపంబువహించి కోపంబు వచ్చునప్పుడుండు గృహంబునకుఁ బోయియున్నది.

ప్రతీహార్యా వచ శ్శ్రుత్వా రాజా పరమదుర్మనాః. ౨౧
విషసాద పున ర్భూయో లుళితవ్యాకులేన్ద్రియః,

తత్ర తాం పతితాం భూమౌ శయానా మతథోచితామ్. ౨౨
ప్రతప్త ఇవ దుఃఖేన సోఽపశ్య జ్జగతీపతిః,

స వృద్ధ స్తరుణీం భార్యాం ప్రాణేభ్యోఽపి గరీయసీమ్. ౨౩
అపాపః పాపసఙ్కల్పాం దదర్శ ధరణీతలే,
లతా మివ వినిష్కృత్తాం పతితాం దేవతా మివ. ౨౪
కిన్నరీ మివ నిర్ధూతాం చ్యుతా మప్సరసం యథా,
మాయా మివ పరిభ్రష్టాం హరిణీమివ సంయతామ్. ౨౫
('వామా మివ పరిభ్రష్టాం' అని పాఠాంతరము.)
కరేణు మివ దిగ్ధేన విద్ధాం మృగయునా వనే,

మహాగజఇవారణ్యే స్నేహా త్పరిమమర్శ తామ్. ౨౬

పరిమృశ్య చ పాణిభ్యా మభిసన్త్రస్తచేతనః,
కామీ కమలపత్త్రాక్షీ మువాచ వనితా మిదమ్. ౨౭

న తేఽహ మభిజానామి క్రోధ మాత్మని సంశ్రితమ్,

కైకేయి యచ్చట నగపడకుండుట మాత్రముచేతనే మిగుల దుఃఖము నొందియుండు నాదశరథమహారాజు "కైకేయి కోపంబునొంది కోపగృహంబున నున్నది" అని ద్వారపాలకురాలిమాట వినఁగానే చలించి కలంతనొందిన యింద్రియములుగలిగి యింకను అధికముగా దుఃఖంబునొందెను. ౨౧

ఆదశరథమహారాజు ఆకోపగృహంబునకుఁబోయి యచ్చట నేలమీఁదఁ బరుండియున్న, యట్లు నేలమీఁద బరుండఁదగని సుకుమారశరీరయగు నాకైకేయిని మహాదుఃఖంబుతోఁ జూచెను. ౨౨

వృద్ధుండును బాపం బెఱుఁగనివాఁడునగు నాదశరథుఁడు యౌవనవతియై పాపంబగు రామునడవికిఁ బంపుటయం దాసగొని ఛేదింపఁబడిన తీఁగెయుంబోలెఁ బుణ్యంబంతయు ననుభవించి యయినపిమ్మట నేలంబడిన దేవతభంగిఁ బడఁద్రోయఁబడిన కిన్నరికైవడి నాకాశంబునుండి నేలఁ జారిన యప్సరసగతి నితరుల మోహింపఁజేయుటకై చేయఁబడిన మాయరీతి (పాఠాంతరపక్షమందు నేలంబడియుండు నాఁడుగుఱ్ఱంబురీతి) బంధింపఁబడిన లేడి చాడ్పున నరణ్యంబున వేఁటకాఁడు విషంబు పూసిన బాణంబుచేఁ గొట్టఁగా నేలంగూలిన యేఁనుంగు విధంబున భూమింబడియున్న తనభార్యయగు కైకేయిఁ జూచెను. ౨౩

గొప్పదగు పురుషగజంబువచ్చి యరణ్యంబున వేఁటకానిచే విషము పూసినబాణంబునం గొట్టఁబడి పడియున్న యేఁనుఁగుఁ దడవునట్లు ఆదశరథుఁడు కైకేయిని స్నేహంబునఁ దడవెను. ౨౪

స్వభావంబుననే కామియగుదశరథుఁడు దామరపూఱేకులుఁబోలె విశాలంబులును సుందరంబులు నగునేత్రంబులు గలకైకేయిఁ జూచినంతనే, యినుమడించిన మన్మథోద్రేకంబునొంది కైకేయిని రెండుచేతులతోనుఁ దడవి "యేమిచెప్పునో" యని భయపడుచు నాకైకేయిం జూచి యిట్లని చెప్పెను. ౨౫

నీకు నాపైఁ గోపమువచ్చుటకుఁ దగినకారణమేమియు నాకు జ్ఞప్తికి రాలేదు.

దేవి! కేనాభిశప్తాఽసి కేన వాఽసి విమానితా. ౨౭

య దిదం మమ దుఃఖాయ శేషే కల్యాణి! పాంసుషు,

భూమౌ శేషే కిమర్థం త్వం మయి కల్యాణి జీవతి. ౨౮
భూతోపహతచిత్తేవ మమ చిత్తప్రమాథినీ,

స న్తి మే కుశలా వైద్యా స్త్వభితుష్టాశ్చ సర్వశః. 30
సుఖితాం త్వాం కరిష్య న్తి వ్యాధి మాచక్ష్వ భామిని,

కస్య వా తే ప్రియం కార్యం కేనవా విప్రియం కృతమ్. ౩౧
కః ప్రియం లభతా మద్య కో వా సుమహా దప్రియమ్,

మారోదీ స్మాచ కార్షీ స్త్వం దేవి! సంపరిశోషణమ్. ౩౨

అవధ్యో వధ్యతాం కో వా కో వా వధ్యో విముచ్యతామ్,
దరిద్రః కో భవత్వాఢ్యో ద్రవ్యవా న్వాఽప్యకించనః. ౩౩

రాణివగు కైకేయీ! ని న్నెవ్వరైనఁ దిట్టినారా యేమి? లేక యెవ్వరైన నవమానించినారా యేమి? నాకు జరిగినదంతయుఁ సవిస్తరముగాఁ జెప్పుము. ౨౮

నీవు నాకన్నిమంగళంబులఁ గలిగించుదానవు, మంగళస్వరూపిణివి, నీ వీనేలపై పట్టియుండఁ బరుండియుండుటఁ జూడఁగా నాకుమిగుల దుఃఖం బగుచున్నది.

నీ కెంతమాత్ర మపకారము రానట్లు చూచుచు మంగళంబుఁ గలిగించునట్టి నేనుండఁగా నీవిట్లు నామనసునకు దుఃఖంబుగలుగునట్లు పిశాచము పట్టినదివలె నేలం బరుండియున్నావేమి? ౨౯

కైకేయీ! నీకేదైన వ్యాధియున్నట్టైన దానిం జెప్పుము. నాయొద్ద నుండువైద్యులు ఎట్టివ్యాధినైనఁ బోఁగొట్టఁ జాలుదురు; నావలన నానావిధ సత్కారంబులఁ బొందినవారు కావున నాయందుఁ జాల మెనరుగల్గియున్న వారు; నీ వ్యాధిని బోఁగొట్టి నీకు సుఖంబుఁగలుగునట్లు సేయుదురు. ౩౦

నీ కెవ్వఁడు సంతోషంబుచేసెను? నీ కెవ్వఁడు దుఃఖంబుగలిగించెను?

ఇప్పుడు నీ వెవ్వనికి సంతోషముసేయవలెనని కోరుచున్నావు? ఎవ్వనికిఁజాలదుఃఖముఁగలుగఁజేయవలెనని కోరుచున్నావు? వారల పేర్లం జెప్పుము. ఇప్పుడే నీయిష్టప్రకారము వారల నిట్లు గావించెదను.

కైకేయీ! నీవు నాదురాణివి; నీకిట్లేడ్వవలదు; దేహంబును గృశించునట్లు చేసికొనవలదు; నీయిష్టమును జెప్పుము; నేను దప్పక దాని నెఱవేర్చెదను. ౩౧

నీ కిప్పు డెవ్వఁడు చావవలయు ననియున్నది? వానిం బేర్కొనుము; వాఁడు చంపఁదగనివాఁడైనను వాని నీక్షణంబే చంపించెదను; నీ కెవ్వని నిప్పుడు కాపాడవలయునని యున్నది? వానిం జెప్పుము; వాఁడు చంపవలసిన వాఁడైనను వాని విడిచి పుచ్చెదను. దరిద్రుఁడుగా నుండువాఁ డెవ్వఁడైన భాగ్యవంతుఁడు గావలయునని నీకుఁ దలంపున్నయెడ వానిం దెల్పుము; వాని

అహం చైవ మదీయాశ్చ సర్వే తవ వశానుగాః,
న తే కించి దభిప్రాయం వ్యాహన్తు మహా ముత్సహే. ౩౪
ఆత్మనో జీవితే నాపి బ్రూహి య న్మన సేచ్ఛసి,

బల మాత్మని జాన న్తీ న మాం శఙ్కితు మర్హసి. ౩౫

కరిష్యామి తవ ప్రీతిం సుకృతేనాపి తే శపే,

యావ దావర్తతే చక్రం తావతీ మే వసున్ధరా. ౩౬
ప్రాచీనా స్సిన్ధుసౌవీరా స్సౌరాష్ట్రా దక్షిణాపథాః,
వంగాంగమగధా మత్స్యా స్సమృద్ధాః కాశికోసలాః. ౩౭

తత్ర జాతం బహు ద్రవ్యం ధనధాన్య మజావికమ్,

తతో వృణీష్వ! కైకేయి యద్య త్త్వం మనసేచ్ఛసి. ౩౮

కి మాయాసేన తే భీరు! ఉత్తిష్ఠోత్తిష్ఠ శోభనే,

తత్త్వం మే బ్రూహి కైకేయి! యత స్తే భయ మాగతమ్. ౩౯
తత్తే వ్యపనయిష్యామి నీహార మివ రశ్మివాన్,

ధనవంతునింగాఁజేసెదను; భాగ్యవంతుఁడెవ్వఁడేని దరిద్రుఁడు గావలయునని నీవుకోరుచెడ వానిపేరుసెప్పుము; వాని ధనమంతయుఁ గొల్లపెట్టించి వాని దరిద్రుని గావించెదను. 33

నేనును నావారును మేమందఱమును నీవు చెప్పినట్టు వినువారము; నీకుఁగల కోరికను జెలుపుటకు నాకెంతమాత్రము ఇష్టములేదు. 34

నీవు నాప్రాణనాశంబునఁ గాఁదగినకార్యమును గోరినను దానిం జెప్పుము; నాప్రాణములఁ బోఁగొట్టుకొని యైనను నీకోరికె నీడే ర్చెదను.

నీయందు నాప్రేమ యెచ్చుగానున్నదని నీకుఁదెలియును కావున నీవు నాయందు సందేహం బుంచుట సరికాదు. 35

నేను దప్పక నీకోర్కె నెఱవేర్చి నీకు సంతోషంబుచేసెదను, నీవు సందేహింపవలదు. పుణ్యంబుపై నొట్టుపెట్టెదను.

సూర్యునికాంతి యెంతవఱకున్నదో అభూమియంతయుంనాది. 36

అందు దూర్పుదేశములు సింధుదేశము సౌవీరదేశము సౌరాష్ట్రదేశము దాక్షిణాత్యదేశములు వంగదేశము నంగదేశము మగధదేశము మత్స్యదేశముఁ గోసలదేశము మొదలగుదేశములన్నియుం నన్నిటను నిండియున్నవి. 37

అదేశములందు ధనము ధాన్యము సాలువులు మొదలగు సమస్తద్రవ్యంబులును గలుగుచున్నవి.

కైకేయీ! అద్రవ్యములందు నీకేదేదిగావలయునో వానినన్నిఁటి నడుగుము; ఇచ్చెదను. 38

కైకేయీ! నీకుఁ జాలభయపడు స్వభావంబున్నది; ఇట్లు నేలఁబరుండి శ్రమపడుటవలన నేమియుఁ బ్రయోజనంబులేదు. నీవు మంగళస్వరూపిణివి. ఇట్లు నేలం బరుండి యుండందగదు లెమ్ములెమ్ము.

కైకేయీ! నీ కిప్పుడు దేనివలన భయంబుగల్గినదో దాని నాకుం జెప్పుము; సూర్యుఁడు మంచును బోఁగొట్టునట్లు దాని నేఁ బోఁగొట్టెదను. అని దశరథుఁడు కైకేయితోఁ జెప్పెను. 39

తథోక్తా సా సమాశ్వస్తా వక్తుకామా త దప్రియమ్. ౪౦
పరిపీడయితుం భూయో భర్తార ముపచక్రమే.

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే దశమస్సర్గః.

---

## ఏ కా ద శ స్స ర్గః

తం మన్మథశరై ర్విద్ధం కామవేగవశానుగమ్,
ఉవాచ పృథివీపాలం కైకేయీ దారుణం వచః. ౧

నాస్మి విప్రకృతా దేవ! కేనచి న్నావమానితా,
అభిప్రాయస్తు మే కశ్చి త్త మిచ్ఛామి త్వయా కృతమ్. ౨
ప్రతిజ్ఞాం ప్రతిజానీష్వ యది త్వం కర్తు మిచ్ఛసి,

అథ త ద్వ్యాహరిష్యామి య దభిప్రార్థితం మయా. ౩

తా మువాచ మహాతేజాః కైకేయీ మీష దుత్స్మితః,
కామీ హస్తేన సంగృహ్య మూర్ధజేషు శుచిస్మితామ్. ౪

అవలిప్తే! న జానాసి త్వత్తః ప్రియతమా మమ,
మనుజో మనుజవ్యాఘ్రా ద్రామా దన్యో న విద్యతే. ౫

కైకేయి దశరథునిచే నట్టు లాశ్వాసింపఁబడి అప్రియంబగురాముని వనమునకుఁ బంపు మనువార్తం జెప్పఁ దలఁచి శపథములఁ జేయించి యింకను దశరథుని దుఃఖపఱుప నారంభించెను. ౪౦

ఇది పదియవసర్గము.

---

## పదునొకండవ సర్గము

మన్మథబాణంబులఁ గొట్టఁబడి మన్మథాధీనుఁడైయుండు నాదశరథమహారాజుఁజూచి కైకేయి రామునివనమునకుఁ బంపుటకై ప్రతిజ్ఞచేయించుట కుఁగాఁ జెప్పఁబడునది గావున నతిభయంకరంబయిన మాటఁజెప్పెను. ౧

పెనిమిటి వగుదశరథుఁడా! నాకేరోగమును లేదు. నన్నెవ్వఁడు నవమానింపలేదు. నాకొకకోర్కెయున్నది. దాని నీవు నెఱవేఱుపవలయును. ౨

నీవు దాని నెఱవేర్పఁ గోరుదువేని "నేను నీకోరికను నెఱవేర్చెదను" అని దృఢముగా శపథముసేయుము.

నీవట్లు ప్రతిజ్ఞచేసినపిమ్మట నేను గోరినదానిం జెప్పెదను. అని కైకేయి దశరథునితోఁ జెప్పెను. 3

మహాతేజుఁడును గాముకుఁడు నగుదశరథుఁడు "తనకోరిక నెఱవేర్చుటకే యీకైక తనయందు బహుప్రేమగలనన్ను శపథముసేయు మనుచున్నది" అని చిఱునగవునొంది తెల్లగా సుందరంబుగానుండు చిఱునగవుగల యాకైకను దనకభిముఖయగుటకై తలవెండ్రుకలయందుఁ జేతఁబట్టుకొని యిట్లనిచెప్పెను. ౪

"నాకు స్త్రీలలో నీకన్నఁ బ్రియురాలయినది మఱియెవ్వతెయును లేదు; పురుషులలోఁ బురుషశ్రేష్ఠుఁడగు రామునికన్నఁ బ్రియుఁడగు పురుషుండు మఱియెవ్వఁడునులేఁడు." అని మూఢురాలవు కావున నీకుఁ దెలియలేదు. ౫

తేనాజయ్యేన ముఖ్యేన రాఘవేణ మహాత్మనా,
శపే తే జీవనార్హేణ బ్రూహి యన్మనసేచ్ఛసి. ౬

యం ముహూర్త మపశ్యం స్తు న జీవేయ మహం ధ్రువమ్,
తేన రామేణ కైకేయి! శపే తే వచనక్రియామ్. ౭
ఆత్మనా వాత్మజై శ్చాన్యై ర్వృణేయం మనుజర్షభమ్,
తేన రామేణ కైకేయి! శపే తే వచనక్రియామ్. ౮

భద్రే! హృదయమప్యేతదనుమృశ్యోద్ధరస్వ మే,

ఏతత్సమీక్ష్య కైకేయి! బ్రూహి యత్సాధు మన్యసే. ౯

బల మాత్మని జానన్తీ న మాం శఙ్కితు మర్హసి,

కరిష్యామి తవ ప్రీతిం సుకృతేనాపి తే శపే. ౧౦

సా తదర్థమనా దేవీ త మభిప్రాయ మాగతమ్,
నిర్మాధ్యస్థ్యాచ్చ హర్షాచ్చ బభాషే దుర్వచం వచః. ౧౧

శత్రువులకు జయింపఁగూడనివాఁడై శ్రేష్ఠుఁడై మహాత్ముఁడై నాప్రాణములకన్న నధికుఁడైయుండు నారాముఁడుసాక్షిగా బాసఁ జేసెదను; నీవు కోరినదానిఁ జెప్పుము. ౬

కైకేయీ! ఎవ్వని గొంచెముసేపు చూడకున్నను నేను బ్రతుకఁజాలనో అట్టిరాముఁడుసాక్షిగా నీవు చెప్పినట్లు చేసెదనని ప్రతిజ్ఞఁ జేసెదను. ౭

కైకేయీ, నన్నుఁ జెఱుపుకొనినైనను భరతుఁడు మొదలగు కొడుకులఁ బోఁగొట్టుకొనియయినను మఱియితరులగు బంధువులు మున్నగువారల విడిచియయినను ఎవ్వని నేగోరుచుందునో అట్టిరాముఁడు సాక్షిగా నీకార్యము చేసెదనని ప్రతిజ్ఞఁజేసెదను. ౮

మంగళస్వరూపిణివగు కైకేయీ ! నీవు దేనినోకోరి యిట్లు నేలఁబడియుండుటఁ జూడఁజాలక యిట్లు పరితపించుచు దుఃఖితంబై "నాప్రాణంబులకన్న నధికుఁడగు రాముఁడుసాక్షిగా నీకార్యంబుచేసెదను" అని ప్రతిజ్ఞ జేయునంత నీమీఁదఁ బ్రేమమోహంబులు గల్గియుండు నామనమునుజూచి యయినను నీకోరికనుజెప్పి నన్నిపుడు గాపాడుము.

నే నిప్పుడు చేసిన బాసలం బర్యాలోచించి నీవుదేనిఁగోరుచున్నావో దాని సందేహంబువిడిచి చక్కఁగా నాకుఁ జెప్పుము. ౯

నీయందు నాకెచ్చుగాఁ బ్రేమయున్నదని నీకుఁదెలియును; నీవు నాయందు సందేహించుట సరికాదు.

నేను దప్పక నీవుకోరినకార్యంబు నెఱవేర్చినీకు సంతోషంబుగావించెదను; నాపుణ్యంబు సాక్షిగా బాసచేసెదను. అని దశరథుఁడు కైకేయితోఁ జెప్పెను. ౧౦

ఆకైకేయి యెట్లయిన రాము నడవికిఁ బంపి భరతునకు రాజ్యంబు వచ్చునట్లు గావలయునను కోర్కెగలదిగావున భరతునియందుఁ బక్షపాతంబున దశరథుఁడు తనకనుకూలుఁడయ్యెనని సంతసించి యట్లు బాసచేసి తనకార్యంబు నెఱవేర్చుట కొప్పుకొన్న దశరథునిఁజూచి శత్రువుతోనైనను జెప్పఁగూడనట్టి కఠినంబైనయీమాటఁ జెప్పెను. ౧౧

తేన వాక్యేన సంహృష్టా త మభిప్రాయ మాగతమ్,
వ్యాజహార మహాఘోర మభ్యాగత మివాన్తకమ్.

యథాక్రమేణ శపసి వరం మమ దదాసిచ,
తచ్ఛృణ్వన్తు త్రయస్త్రింశద్దేవా స్సాగ్నిపురోగమాః.

చన్ద్రాదిత్యౌ నభ శ్చైవ గ్రహా రాత్ర్యహనీ దిశః,
జగ చ్చ పృథివీ చేయం సగన్ధర్వా సరాక్షసా.
నిశాచరాణి భూతాని గృహేషు గృహదేవతాః,
యాని చాన్యాని భూతాని జానీయు ర్భాషితం తవ.

సత్యసన్ధో మహాతేజా ధర్మజ్ఞ స్సుసమాహితః,
వరం మమ దదాత్యేష తన్మే శృణ్వన్తు దేవతాః.

ఇతి దేవీ మహేష్వాసం పరిగృహ్యాభిశస్య చ,
తతః పరమువాచేదం వరదం కామమోహితమ్.

స్మర రాజ! న్పురా వృత్తం తస్మిన్ దైవాసురే రణే,

తత్ర చాచ్యావయ చ్ఛత్రు స్తవ జీవిత మన్తరా.

తత్రచాపి మయా దేవ! య త్త్వం సమభిరక్షితః,
జాగ్రత్యా యతమానాయా స్తతో మే ప్రాదదా వరౌ

కైకేయి దశరథుఁడు చెప్పినమాటవిని సంతోషించి తనకనుకూలంబుగా నభిప్రాయమువడిన దశరథునిఁజూచి మరణాంతంబగు భయంబు గలిగించునది గావున నెదుటనుండు మృత్యువనం దగియుండుమాటను జెప్పెను. ౧౨

నీవు నీప్రియపుత్రుఁడును బుణ్యంబునుసాక్షిగాఁ గ్రమంబున శపథంబుచేసి నాకు వరంబొసంగుటను అగ్నిహోత్రుఁడు మున్నగాఁగల ముప్పది మూఁడుకోట్ల దేవతలును వినుదురుగాక. ౧౩

చంద్రసూర్యులును ఇతరగ్రహంబులును ఆకాశంబును రేయింబవలును దిక్కులును స్వర్గలోకము మొదలగులోకంబులును, ప్రత్యక్షదేవతయగు భూమియును గంధర్వులును రాక్షసులును రాత్రియందు సంచరించుభూతంబులును గృహంబులందున్న యిలువేల్పులును మఱియు నితరభూతంబులును నీవిప్పుడు చెప్పినదానికి సాక్షులుగా నుందురుగాక. ౧౪

ఎప్పుడు ననృతం బాడనివాఁడు మహాపరాక్రమశాలి ధర్మంబుల నెఱింగినవాఁడు నెచ్చరికగలవాఁడు నగు నీదశరథమహారాజు నాకిప్పుడు వరం బిచ్చుచున్నాఁడు; దీనికి దేవతలందఱు సాక్షులుగా నుందురుగాక. ౧౫

ఇట్లు కైకేయి మహాధనుర్ధరుఁడగు దశరథునిఁ దనమతమునందు నిలిపి తన కార్యము నెఱవేఱుటకై యుబ్బించి మన్మథమోహితుఁడై వరంబిచ్చుటకు నిశ్చయించియున్న యాదశరథుంజూచి యిట్లని చెప్పెను. ౧౬

దశరథమహారాజా! పూర్వము దేవతలకు నసురులకు జరిగినయుద్ధము నందు నడచిన వృత్తాంతమును జ్ఞప్తికిఁ దెచ్చుకొనుము.

ఆయుద్ధమునందు శంబరాసురుఁడు నీప్రాణములనుఁ బోఁగొట్టుటదక్కఁ దక్కినయన్నికష్టములను నీకుఁ గలుగఁజేసెను. ౧౮

భర్తవగు దశరథుఁడా! శంబరాసురుఁడు నిన్ను మూర్ఛపోవునట్లు చేసి నప్పుడు నేను రాత్రియంతయుం మేల్కొనియుండి బహుప్రయత్నంబున నిన్నుఁజావకుండఁ గాపాడినాను. అందువలన నీవు నాకప్పుడు రెండువరంబు లిచ్చినావు. ౧౯

తౌ తు దత్తౌ వరౌ దేవ! నిక్షేపౌ మృగయామ్యహమ్,
తవైవ పృథివీపాల! సకాశే సత్యసఙ్గర!. ౨౦

తత్ప్రతిశ్రుత్య ధర్మేణ న చేద్దాస్యసి మే వరమ్,
అద్యైవ హి ప్రహాస్యామి జీవితం త్వద్విమానితా. ౨౧

వాఙ్మాత్రేణ తదా రాజా కైకేయ్యా స్వవశే కృతః,
ప్రచస్కన్ద వినాశాయ పాశం మృగ ఇవాత్మనః. ౨౨

తతఃపర ముఖాచేదం వరదం కామమోహితమ్,

వరౌ యౌ మే త్వయా దేవ! తదా దత్తౌ మహీపతే!. ౨౩
తౌ తావ దహ మద్యైవ వక్ష్యామి శృణు మే వచః,

అభిషేకసమారమ్భో రాఘవస్యోపకల్పితః. ౨౪
అనే నైవాభిషేకేణ భరతో మేఽభిషిచ్యతామ్,

నీవు నా కప్పుడిచ్చినవరంబులను రెంటిని నీయొద్దనే యుల్లదిగా నుంచి యుంటిని; సాధారణంబుగానే రాజునొద్దఁ బ్రజలు నిక్షేపంబుంచుకొన్నట్టయిన రాజు దాని జాగ్రతతోఁ గాపాడియిచ్చును; అందును నీవు వబ్బుఅమాటాడని వాఁడవు; మఱి నాకు భర్తవు; అట్టి నీవు నేను నీయొద్దదాచిన నిక్షేపమును నాకక్కఱకు వచ్చినప్పుడు సిద్ధముగ నిత్తువనినమ్మి నీయొద్ద నుంచితిని; నే నిప్పు డావరంబులనే కోరుచున్నాను గాని నాకేమియుఁ గ్రొత్తగా నీ వీనక్కఱలేదు. ౨౦

అట్లు మునుపు నేను నీకు మహోపకారము చేసినప్పుడు నీవు నాకిచ్చిన వరంబులనే నే నడుగుచున్నాను గావున నిట్లు "వరంబుల నిచ్చెద" నని ప్రతిజ్ఞచేసి ధర్మబుద్ధిచే నా వరంబుల నాకీయకుందువేని నీచే నిట్లు లవమానంబునొంది నేను జీవింపఁజాలను. ఇప్పుడే నీయెదుటనే ప్రాణంబులనువిడిచెదను. అని కైకేయి దశరథునితోఁ జెప్పెను. ౨౧

బోయవాఁడు గానంబు సేయఁగానే దానికి లోఁబడి జింక దనచెఱపు కొఱకుఁ దానే వలకుఁ జిక్కుకొనునట్లు అప్పుడు కైకేయి ముందు దనకిచ్చి యుండినవరంబు లిమ్మని యడిగినమాటకే దశరథుఁడు "అట్లె యిచ్చెద"నని యొప్పుకొని తనకువినాశంబుగల్గునని యాలోచింపక ధర్మపాశంబున జిక్కుకొనెను. ౨౨

అటుపిమ్మటఁ గైకేయి మన్మథమోహితుండై తనకు వరంబులీయ నిశ్చయించి యున్నదశరథుం జూచి యిట్లని చెప్పెను.

నా పెనిమిటి వగుదశరథమహారాజా! ఆరాత్రియందంబున నీవు నాకిచ్చినవరంబులను రెంటిని విభజించి నాకీయవలసినరీతిని జెప్పెదను; నామాట వినుము. ౨౩

ఇప్పుడు రామునకుం బట్టాభిషేకము సేయుటకై యేయేసామగ్రులు సంపాదింపఁబడియున్నవో ఆసామగ్రులతోనే నాకుఁగా భరతునకుఁ బట్టాభిషేకము సేయవలయును. ఇది యొకవరము. ౨౪

యో ద్వితీయో వరో దేవ! దత్తః ప్రీతేన మే త్వయా । ౨౫
తదా దైవాసురే యుద్ధే తస్య కాలోఽయ మాగతః,

నవ పఞ్చచ వర్షాణి దణ్డకారణ్యమాశ్రితః. ౨౬
చీరాజినజటాధారీ రామో భవతు తాపసః,

భరతో భజతా మద్య యౌవరాజ్య మకంటకమ్. ౨౭

ఏష మే పరమః కామో దత్త మేవ వరం వృణే,

అద్య చైవ హి పశ్యేయం ప్రయాన్తం రాఘవం వనమ్. ౨౮
స రాజరాజో భవ సత్యసఙ్గరః
కులం చ శీలం చ హి రక్ష జన్మ చ,
పరత్రవాసే హి వద న్త్యనుత్తమం
తపోధనా స్సత్యవచో హితం నృణామ్. ౨౯

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే ఏకాదశస్సర్గః.

---

వెలిమిటివగు దశరథమహారాజా! ఆదేవాసురయుద్ధంబునందు నా యందు సంతోషంబునొంది నాకిచ్చిన రెండవవరంబునకును ఇప్పుడే సమ యంబు వచ్చియున్నది. ౨౫

రాముఁడు పదునాలుగుసంవత్సరంబులు దండకారణ్యంబున నార చీరెలుఁ గృష్ణాజినంబును జటలను ధరించుకొని తాపసుఁడుగా నుండవలయును. ఇది రెండవవరము. ౨౬

ఇప్పుడు భరతుఁడు శత్రువులెంతమాత్రము లేకుండుటంజేసి కష్టము లేక బహుసుఖంబుగా నుండు యౌవరాజ్యంబు నొందవలయును. ౨౭

“భరతుఁడు యువరాజు కావలయును. రాముఁడుపదునాలుగుసంవత్స రంబు లరణ్యంబునఁ దాపసుఁడుగా నుండవలయును” ఇది నాదు ముఖ్యమయిన కోరిక. నీకు మున్ను నేను జేసిన మహోపకారంబునకు బదులుగా నీవిచ్చిన వరంబులనే యడుగుచున్నాను గాని నీ విప్పు డన్యాయంబుగా నిర్బం ధింపలేదు.

ఇప్పుడే రాముఁ డడవికిఁబోవుచుండఁగా నేను జూడవలయును. ౨౮

నీవు రాజులకును రాజవు; మఱి సత్యసంధుండవని కీర్తి నొందినవాఁ డవు; నీవు దబ్బఱలాడరాదు; ఇప్పుడును నీప్రతిజ్ఞను సత్యముఁ జేసికొనుము; అట్లు నీప్రతిజ్ఞను సత్యముఁ గావించుకొని నీకులమును నీయాచారసంపత్తిని నీజన్మమును రక్షించుకొనుము. స్వర్గలోక ప్రాప్తివిషయమయి మనుష్యులకు సత్యవచనముకన్న నధికముగా మేలుగల్గించునది మఱేమియు లేదని తపోధనులగు పెద్దలు చెప్పుట నీకును దెలియును. అని కైకేయి దశరథునితోఁ జెప్పెను. ౨౯

ఇది పదునొకండవసర్గము.

## ద్వాదశస్సర్గః

తత శ్శ్రుత్వా మహారాజః కైకేయ్యా దారుణం వచః,
చిన్తా మభిసమాపేదే ముహూర్తం ప్రతతాప చ. ౧
కింను మే యది వా స్వప్న శ్చిత్తమోహోఽపి వా మమ,
అనుభూతోపసర్గో వా మనసో వా ప్యుపద్రవః. ౨

ఇతి సంచిన్త్య తద్రాజా నాధ్యగచ్ఛత్తదా సుఖమ్,
ప్రతిలభ్య చిరా త్సంజ్ఞాం కైకేయీ వాక్యతాడితః. ౩
వ్యథితో విక్లబ శ్చైవ వ్యాఘ్రీం దృష్ట్వా యథా మృగః,
అసంవృతాయా మాసీనో జగత్యాం దీర్ఘ ముచ్ఛ్వసన్. ౪
మణ్డలే పన్నగో రుద్ధో మన్త్రై రివ మహావిషః,
అహో ధిగితి సామర్షో వాచ ముక్త్వా నరాధిపః. ౫
మోహ మాపేదివా న్భూయ శ్శోకోపహతచేతనః,

చిరేణ తు నృప స్సంజ్ఞాం ప్రతిలభ్య సుదుఃఖితః. ౬
కైకేయీ మబ్రవీ త్క్రుద్ధః ప్రదహన్నివ చక్షుషా,

నృశంసే! దుష్టచారిత్రే! కులస్యాస్య వినాశిని!. ౭
కిం కృతం తవ రామేణ పాపం పాపే! మయాఽపి వా,

## పంద్రెండవ సర్గము

దశరథమహారాజు కైకేయి చెప్పిన భయంకరం బగుమాటనువిని యంత మిగుల దుఃఖంబునొంది కొంతసేపు మూర్ఛనొందెను. ౧

ఇట్టిమాటలు కైకేయిరాడుట పారమార్థికముగాఁ దోఁచలేదు. ఇప్పుడునాకు స్వప్నముగల్గినదా? చిత్తభ్రాంతి యేమైనం గలిగెనా? పూర్వ జన్మంబున ననుభవించినది స్మృతికివచ్చుచున్నదా? లేక మానసునకు రోగ మేమైన వచ్చెనా? నాకిపుడు వీనిలో నేమిసంభవించెను? అని దశరథుఁడు చింతించెను. ౨

దశరథమహారా జీప్రకారము చింతింపుచు ధ్యానంజేసి యెంతమాత్రం బును సుఖంబు నొందఁ డయ్యె.

అట్లు కైకేయిమాటలంగలిగిన దుఃఖాతిశయంబున మూర్ఛపోయిన దశరథమహారాజు అంత బహుకాలంబునకు మూర్ఛఁదేఱి కట్టెదుటఁ బెద్ద పులింగనిన జింకయుంబోలె దుఃఖితుఁడై వెలవెలంబోవుచు నాస్తరణంబులేని నేలపైని గూర్చుండి దీర్ఘంబుగా నిట్టూర్పులువుచ్చుచు నట్లు మాంత్రి కునిచే యంత్రమండలంబునఁ గట్టువడి కదలలేక నిట్టూర్పులువుచ్చుచుండు మహావిషంబగు సర్పంబుకైవడిఁ జూపట్టుచుఁ గోపంబున "ఇట్లు చెప్పుట యాశ్చర్యముగా నున్నది! ఈకైకేయి మండిపోవుఁగాక" అనిచెప్పి దుఃఖంబున మఱల మూర్ఛనొందెను. 3-౫

దశరథమహారా జంత బహుకాలంబునకు మూర్ఛదేఱి మిక్కిలియుం దుఃఖితుఁడై కోపంబున నెత్తిపై నిప్పుం బోలియున్నకంటిం "గైకేయిని గాల్చునో" యని యొస్నఁదగి యొప్పుచుఁ గైకేయితో నిట్లని చెప్పెను. ౬

కైకేయీ! నీవు బహుక్రూరురాలవు; చెడునడతలుగలదానవు; మాకులం బును నశింపఁజేయుంటకుఁ బుట్టినదానవు; పాపిష్ఠురాలవు; నీకు రాముఁడుగాని నేనుగాని యేమి యపరాధంబు గావించితిమి? ౭

యదా తే జననీతుల్యాం వృత్తిం వహతి రాఘవః. ౮
తస్యైవ త్వ మనర్థాయ కిం నిమిత్త మి హోద్యతా,

త్వం మయాఽఽత్మవినాశార్థం భవనం స్వం ప్రవేశితా. ౯
అవిజ్ఞానా న్నృపసుతా వ్యాళీ తీక్ష్ణవిషా యథా,

జీవలోకో యదా సర్వో రామస్యాహ గుణా స్తవమ్. ౧౦
అపరాధం కముద్దిశ్య త్యక్ష్యామీష్ట మహం సుతమ్,

కౌసల్యాం వా సుమిత్రాం వా త్యజేయ మప వా శ్రియమ్.
జీవితం వాఽఽత్మనో రామం నత్వేవ పితృవత్సలమ్,

పరా భవతి మే ప్రీతి ర్దృష్ట్వా తనయ మగ్రజమ్. ౧౨
అపశ్యత స్తు మే రామం నష్టా భవతి చేతనా,
తిష్ఠే ల్లోకో వినా సూర్యం సస్యం వా సలిలం వినా. ౧౩
న తు రామం వినా దేహే తిష్ఠే త్తు మమ జీవితమ్,

తదలం త్యజ్యతా మేష నిశ్చయః పాపనిశ్చయే!. ౧౪

అపి తే చరణౌ మూర్ధ్నా స్పృశామ్యేష ప్రసీద మే,

కి మిదం చిన్తితం పాపే! త్వయా పరమదారుణమ్. ౧౫

అథ జిజ్ఞాససే మాం త్వం భరతస్య ప్రియాప్రియే,

రాముఁడు నీకు దల్లికింబోలె శుశ్రూషలు సేయుచున్నాఁడు. అట్లుండి నప్పుడే ఆరామునకే అనర్థంబు గలుగుటకై నీవేల యిట్లు ప్రయత్నపడుచున్నావు. ౮

నేను నిన్నజ్ఞానంబున రాచకొమార్తెవనితలఁచి అతివేగమైన విషము గలదుష్టసర్పము నింటికి దెచ్చుకొనునట్లు నేను నశించిపోవుటకైయే నా యింటికిఁ దెచ్చుకొంటిని. ౯

పశువులు పక్షులు మొదలుకొని ప్రాణముగల జంతుజాలంబంతయును రాముగుణంబులఁ గొనియాడుచుండఁగా నే నతఁ డేమితప్పు చేసినాఁడని నాకుఁ బ్రియపుత్త్రుఁడగు నారాముని విడువవచ్చును. ౧౦

నేను గౌసల్యనైనను సుమిత్త్రనైనను రాజ్యమునైనను నాప్రాణము నైనను విడువఁగలను గాని తండ్రినగునాయందతిప్రీతిభక్తులుగల రాముని మాత్త్రము నేను విడుచుటయే లేదు. ౧౧

నాకు నాజ్యేష్ఠపుత్త్రుఁడగు రామునిజూడఁగానే బహుసంతోషము గలుగుచున్నది. నే నతని జూడకుందునేని నాప్రాణము పోవును. ౧౨

ఒకవేళ లోకంబైనను సూర్యునివిడిచియుండును. పైరైనను నీళ్లవిడిచి యుండును. నేను రాముని విడుతునేని నాప్రాణంబుమాత్త్రం బొకక్షణంబైనను నాదేహంబున నుండదు. ౧౩

కైకేయీ! నీకిప్పుడు పాపబుద్ధిగలిగియున్నది. ఇదినాకుఁ బ్రాణహాని గల్గించునది కావున నింతవఱకుఁజాలును. దీని విడువుము. ౧౪

నీ పాదంబులకైనను దలసోఁకునట్లు నమస్కారముఁ జేసెదను. నామీఁదఁ గోపింపవలదు.

పాపిష్ఠురాలగు కైకేయీ! అతిభయంకరంబగు నీయాలోచనను నీవేల చేసినావు? ౧౫

భరతునియందు నాకు బ్రీతిగలదో లేదో అని యేమైనఁ దెలిసికొనఁ గోరి యిట్లు చెప్పినావా యేమి?

అస్తు యత్తత్త్వయా పూర్వం వ్యాహృతం రాఘవం ప్రతి.
స మే జ్యేష్ఠస్సుత శ్శ్రీమా న్ధర్మజ్యేష్ఠ ఇతీవ మే,
తత్త్వయా ప్రియవాదిన్యా సేవార్థం కథితం భవేత్. ౧౭

తచ్ఛ్రుత్వా శోకసంతప్తా సన్తాపయసి మాం భృశమ్,
ఆవిష్టాఽసి గృహం శూన్యం సా త్వం పరవశంగతా. ౧౮

ఇక్ష్వాకూణాం కులే దేవి! సమ్ప్రాప్త స్సుమహా నయమ్,
అనయో నయసమ్పన్నే యత్ర తే వికృతా మతిః. ౧౯

నహి కించి దయుక్తం వా విప్రియం వా పురా మమ,
అకరో స్త్వం విశాలాక్షి! తేన న శ్రద్ధధామ్యహమ్. ౨౦

నను తే రాఘవ స్తుల్యో భరతేన మహాత్మనా,
బహుశో హి సుబాలే త్వం కథాః కథయసే మమ. ౨౧

తస్య ధర్మాత్మనో దేవి! వనే వాసం యశస్వినః,
కథం రోచయసే భీరు! నవ వర్షాణి పఞ్చ చ. ౨౨

నాకు భరతునియందుఁ బ్రీతియున్నదా లేదా? యని తెలియఁగోరినట్టి యగుఁగాక. అట్లయిన రామునియందు నీకుం బ్రీతి విరళితయై యుండుటకుఁ గారణంబు లేదు. కావున నీవు భరతునకుఁ రాజ్యంబిమ్మని యడుగుదువుగాని యిట్లు రాముని వనంబున కంపుమని యడుగఁజాలవు. అయితే మున్ను నీవు నాతో రాముఁడు నాకు జ్యేష్ఠపుత్రుఁడు. అతఁ డందఱికన్న నధికుఁడు. ధర్మజ్యేష్ఠుఁడు అని రాముని గూర్చి చెప్పియున్నావే యామాటలన్నియుఁ నీవు ప్రియవాదినివి కావున నామనసునకు సంతోషంబుఁ గలిగించుటకుఁ గాని నేఁ డు నీయం దెప్పటి కిని ప్రీతి గలిగియుండునట్లు లేక గావించుకొనుటకుఁగాని రామునిచే శుశ్రూషలు సేయించుకొనుటకుఁగాని చెప్పియుందువు గాని పరమార్థంబుగాఁ జెప్పలేదు. ౧౬

అందువలననే నీవు రామాభిషేకవార్త చెవిసోఁకినంతనే దుఃఖంబు నొంది యతినిర్బంధంబున నన్నును దుఃఖించునట్లు సేయుచున్నావు. మఱియు నితరుల బోధనకు లోఁబడి శూన్యంబగు కోపగృహంబున నున్నావు. ౧౭

నీవు పూర్వము మిగుల ధర్మబుద్ధిగలదానవు. అట్టి నీకిప్పుడు ఇట్టి విపరీత బుద్ధి గలిగినది గావున నీ యిక్ష్వాకువంశమునకు గొప్ప యనర్థము సంభవించినది. ౧౮

విశాలములగు కండ్లుగల కైకేయీ! నీవింతకుమున్ను నాయందుఁ జాల భక్తి ప్రీతులు గలిగియుంటివి; నాకుఁ గొంచెమయినను అయుక్తమయినదానిఁ గాని ప్రియము కానిదానిఁ గాని చేసియుండలేదు; కావున నీవిట్లు నాకు బహు దుఃఖముఁ గలిగించు మాటలఁ జెప్పుట సత్యం బని నేను నమ్మఁజాలను. ౨౦

నీకు రాముఁడు మహాత్ముఁడగు భరతునితో సమానుఁడేగదా! చిన్నదానవు కావున నీకుఁ గుటిలబుద్ధి లేకయుండునప్పుడు నీవు పలుమాఱులు నాతో "నాకు రాముఁడు భరతుఁడును సమానులే" యని చెప్పుచుంటివిగదా! ౨౧

రాణివగు కైకేయీ! నీకున్న ధర్మభీతి యిప్పు డెక్కడికిఁ బోయినది? ధర్మాత్ముఁడై జగంబుల గొప్పకీర్తి గల్గినవాఁడై యిదివఱకును బ్రీతిపాత్రుఁ

అత్య న్తసుకుమారస్య తస్య ధర్మే ధృతాత్మనః,
కథం రోచయసే వాస మరణ్యే భృశదారుణే. ౨౩

రోచయ స్యభిరామస్య రామస్య శుభలోచనే!,
తవ శుశ్రూషమాణస్య కిమర్థం విప్రవాసనమ్. ౨౪

రామో హి భరతా ద్భూయ స్తవ శుశ్రూషతే సదా,
విశేషం త్వయి తస్మా త్తు భరతస్య న లక్షయే. ౨౫

శుశ్రూషాం గౌరవం చైవ ప్రమాణం వచనక్రియామ్,
క స్తే భూయ స్తరం కుర్యా దన్యత్ర మనుజర్షభాత్. ౨౬

బహూనాం స్త్రీసహస్రాణాం బహూనాం చోపజీవినామ్,
పరివాదోఽపవాదో వా రాఘవే నోపపద్యతే, ౨౭

సా న్త్వయ న్సర్వభూతాని రామ శ్శుద్ధేన చేతసా,
గృహ్ణాతి మనుజవ్యాఘ్రః ప్రియై ర్విషయవాసినః. ౨౮

సత్యేన లోకా ఞ్జయతి దీనా న్దానేన రాఘవః,
గురూ ఞ్ఛుశ్రూషయా వీరో ధనుషా యుధి శాత్రవా న్. ౨౯

డై యుండు నారాముఁడు పదునాలుగు సంవత్సరంబులు అరణ్యంబుననుండ వలయు నని నీకెట్లు కోరికపుట్టినది? ౨౨

అతిసుకుమారదేహంబుగలవాఁడును ఒక తప్పైనను జేయక ధర్మంబు నందే బుద్ధిని దృఢంబుగా జేర్చియున్నవాఁడు నగునట్టి రాముఁడు అతిభయంకరంబగు నరణ్యంబున వాసంబు సేయవలయు నని నీవెట్లు కోరినావు? ౨౩

మంగళకరంబులగుకండ్లుగల కైకేయీ! రాముఁడు నీకెల్లప్పుడును శుశ్రూష సేయుచున్నాఁడు. అట్టి సర్వాంగసుందరుఁడగురాము నడవికిఁ బంప వలెనని యెందుకుఁ గోరుచున్నావు? ౨౪

నీకు భరతునకన్న నెచ్చుగా రాముఁడు శుశ్రూష సేయుచున్నాఁడు. గదా! అందువలన నీవిషయమై రామునికన్నభరతునియందేమియు నతిశయము నా కగపడ లేదు. ౨౫

నీకు సేవచేయుచు నీయందు బహుమానంబుంచి నిన్నుఁబూజించుచు నీవు చెప్పినకార్యంబులు సేయుచుండువాఁడు రాముఁడుదక్క మఱియొక్కఁ డెవ్వఁడున్నాఁడు? ౨౬

పెక్కు వేలమంది స్త్రీలున్నారు. అనేకులు భృత్యులున్నారు. వీరల నడుమ నొక్కస్త్రీయయినను ఒకభృత్యుఁడైనను రామునిపైనున్నతప్పు చెప్పుటను గాని లేక యసూయచే లేనితప్పు మోపుటనుగాని యిదివఱకు నేను విన లేదు. ౨౭

పురుషశ్రేష్ఠుఁడగు రాముఁడు కపటము మొదలగుదోషంబులు లేనిదగుటచేఁ బరిశుద్ధమగుహృదయంబుగలిగి సమస్తప్రాణులను తిన్ననిమాటల నోదార్చుచు దేశంబుననుండు జనులకందఱకు కోరినవాని నిచ్చుట మొదలగుకార్యంబులచే సంతోషంబు గల్గించుచున్నాఁడు కావున జనులందఱు రామునియందు బహుప్రీతి గలిగియున్నారు. ౨౮

రాముఁడు "దయావీరుఁడు దానవీరుఁడు ధర్మవీరుఁడు పరాక్రమ వీరుఁ" డని చతుర్విధంబగు వీరత్వంబుగలవాఁడుకావున సత్యవ్రతముచే

సత్యం దానం తప స్త్యాగో మిత్రతా శౌచ మార్జవమ్,
విద్యా చ గురుశుశ్రూషా ధ్రువాణ్యేతాని రాఘవే. 3౦

తస్మి న్నార్జవసమ్పన్నే దేవి! దేవోపమే కథమ్,
పాప మాశంససే రామే మహర్షిసమతేజసి. 3౧

న స్మరామ్యప్రియం వాక్యం లోకస్య ప్రియవాదినః,
స కథం త్వత్కృతే రామం వక్ష్యామి ప్రియ మప్రియమ్. 3౨

క్షమా యస్మి న్దమ స్త్యాగ స్సత్యం ధర్మః కృతజ్ఞతా,
అవిహింసా చ భూతానాం తమృతే కా గతి ర్మమ. 33

మమ వృద్ధస్య కైకేయి గతాన్తస్య తపస్వినః,
దీనం లాలప్యమానస్య కారుణ్యం కర్తు మర్హసి. 3౪

పృథివ్యాం సాగరాన్తాయాం యత్కించి దధిగమ్యతే,
తత్సర్వం తవ దాస్యామి మా చ త్వాం మన్యురావిశేత్. 3౫

స్వర్గాదిలోకంబులనన్నియుం స్వాధీనములుగాఁ జేసికొనుచున్నాఁడు; ధనం బొసంగి దరిద్రులను వశీకరించుకొనుచున్నాఁడు; శుశ్రూషచేసి గురువులను దనకు రహస్యార్థముల నుపదేశించువారలఁగాఁ జేసికొనుచున్నాఁడు; ధనుర్ధరుఁడై యుద్ధంబునందు శత్రువుల జయించుచున్నాఁడు. ౨౯

సత్యవ్రతమును పరలోకముగల్గుటకై సేయుఁ గోదానాది దానములును దపంబును బరప్రీత్యర్థముగాఁ జేయుఁ నీవియును అందఱకును స్నేహితుఁడుగా నుండుటయుం బాహ్యాభ్యంతరశుద్ధియును గపటము లేకుండుటయు విద్యయుం గురువులకుఁ బరిచర్యలు సేయుటయుం నీగుణంబులు రామునియం దొకప్పుడును దప్పక వర్తించుచున్నవి. ౩౦

రాణివగు కైకేయీ! కపటము లేకుండుట యనుగుణం బెట్టివారియందు నుండుటరుదు. అట్టి యుత్తమగుణంబుగల్గి దేవతతో సాటియగుచు మహర్షి యుంబోలెఁ దపస్వియయియున్న రామునిఁగూడ నడవికిఁబంపుమని యెట్లు కోరెదవు? ౩౧

ప్రపంచంబునకంతయుఁ బ్రియవార్తలాడునట్టి రాముని విషయమయి యప్రియంబును నేను మనసునంగూడఁ దలంపను. అట్టి నేను బ్రియుఁడగు రామునితో "నీవు వనంబునకుఁ బొమ్ము" అని యతిక్రూరురాలవగు నీకుఁగా నెట్లు చెప్పఁగలను? ౩౨

ఎవ్వనియందు ఓర్పును ఇంద్రియనిగ్రహంబును ఈవియును సత్యంబును ధర్మంబును కృతజ్ఞతయుఁ బ్రాణిమాత్రంబునకు * హింససేయకుండుటయుం నీగుణంబు లెల్లప్పుడును వర్తించుచున్నవో అట్టి రాముఁడుదక్క నాకు మఱేమిగలదియున్నది? ౩౩

కైకేయీ! నేను ముసలివాఁడను. అందును నేఁడో రేపో చావఁబోవు వాఁడను. కరుణింపఁదగినవాఁడను. దిక్కులేక బహుభయంబున మాటిమాటికి రోదనంబుసేయుచున్నవాఁడను. నాపై దయయుంచుము. ౩౪

సమస్తభూమండలంబునను ఎంతమాత్రంబు నాకు వచ్చుచున్నదో దానినంతయుం నీకిచ్చెదను. రామునిపైఁ గోపంబు విడువుము. ౩౫

అఞ్జలిం కుర్మి కైకేయి! పాదౌ చాపి స్పృశామి తే,
శరణం భవ రామస్య మాఽధర్మో మా మిహ స్పృశేత్. ౩౬

ఇతి దుఃఖాభిసన్తప్తం విలపన్త మచేతనమ్,
ఘూర్ణమానం మహారాజం శోకేన సముపప్లుతమ్. ౩౭
పారం శోకార్ణవస్యాశు ప్రార్థయన్తం పునఃపునః,
ప్రత్యువాచాథ కైకేయీ రౌద్రా రౌద్రతరం వచః. ౩౮

యది దత్త్వా వరౌ రాజ! న్పునః ప్రత్యనుతప్యసే,
ధార్మికత్వం కథం వీర! పృథివ్యాం కథయిష్యసి. ౩౯

యదా సమేతా బహవ స్త్వయా రాజర్షయ స్సహ,
కథయిష్యన్తి ధర్మజ్ఞ! తత్ర కిం ప్రతివక్ష్యసి. ౪౦

యస్యాః ప్రసాదే జీవామి యా చ మా మభ్యపాలయత్,
తస్యాః కృతం మయా మిథ్యా కైకేయ్యా ఇతి వక్ష్యసి. ౪౧

కిల్బిషత్వం నరేన్ద్రాణాం కరిష్యసి నరాధిప!,
యో దత్త్వా వర మద్యైవ పున రన్యాని భాషసే. ౪౨

శైబ్య శ్శ్యేనకపోతీయే స్వమాంసం పక్షిణే దదౌ,

అలర్క శ్చక్షుషీ దత్త్వా జగామ గతి ముత్తమామ్. ౪౩

కైకేయీ! నాచేతులుమొగిడ్చెదను; నీపాదములనుగూడఁ బట్టుకొని యెదను; నీవు రామునిరక్షింపుము; రామాభిషేకవిషయమందు నాకధర్మము గలుగకుండునట్లు సేయుము. అని దశరథుఁడు కైకేయితోఁ జెప్పెను. 3౭.

అంత నిట్లు విలపించుచు దుఃఖమునమూర్ఛపోయి నేలంబొరలుచు రామవివాసంబునఁ గలుగఁబోవు దుఃఖంబున మునిఁగి "నాదుఃఖంబుఁ బోఁ గొట్టుము" అని పలుమాఱులు ప్రార్థించుచున్న యాదశరథమహారాజును జూచి భయంకరాకార యగుకైకేయి దయలేక భయంకరంబుగా నిట్లని చెప్పెను. 3౮

పరాక్రమశాలివగు దశరథమహారాజా! నాకు వరంబులిచ్చి యటు వెనుక "ఇచ్చితినే" యని యనుతాపంబు నొందుదువేని యింక నీభూమి యందు "నేను ధార్మికుఁడను" అని యెట్లు చెప్పుకొనఁగలవు. 3౯

అనేకులగురాజర్షులు నీతోఁ జేరినప్పుడు "నీవు మున్ను కైకేయికి రెండు వరంబులిచ్చితివే వానికిఁగా నాబిడయేమిగోరినది? నీవేమి యిచ్చినావు?" అని యడుగఁగా నీవేమని బదులుచెప్పెదవు? ౪౦

"ఎవ్వతె నాయం దనుగ్రహంబుంచి నేను బ్రతుకుటకై ప్రయత్నంబు చేసి నన్ను గాపాడఁగా నే నిప్పుడు జీవించియున్నానో, అట్టికైకేయి 'కిచ్చెద' నని నేను జెప్పియుండినవరంబులను నే నివ్వలేదు' అని వారలకు బదులు చెప్పెదువాయేమి? ౪౧.

నరాధిపుఁడవగు నీవిప్పుడే వరంబులనిచ్చెదననిచెప్పి యిప్పుడు మఱల వేఱువేఱుమాటలఁ జెప్పుచున్నావు కావున నీవంటిరాజులకంతయు నీవలన నపకీర్తిగల్గును. ౪౨.

శైబ్యుండనురాజు డేగకును బావురంబునకును విరోధంబుగలిగి యందుఁ బావురము దన్ను శరణువేఁడఁగాఁ దనదేహంబునందలి మాంసంబుఁ గోసి డేగ కిచ్చి పావురంబును రక్షించెను;

అలర్కుఁ డనురాజర్షి తన్నొక గ్రుడ్డిబ్రాహ్మణుఁడు వరంబడుగఁగా

సాగర స్సమయం కృత్వా న వేలా మతివర్తతే,
సమయం మాఽనృతం కార్షీః పూర్వవృత్త మనుస్మరన్. ४४

స త్వం ధర్మం పరిత్యజ్య రామం రాజ్యేఽభిషిచ్య చ,
సహ కౌసల్యయా నిత్యం రన్తు మిచ్ఛసి దుర్మతే!. ४५

భవత్వధర్మో ధర్మో వా సత్యం వా యదివాఽనృతమ్,
య త్త్వయా సంశ్రుతం మహ్యం తస్య నాస్తి వ్యతిక్రమః.

అహం హి విష మద్యైవ పీత్వా బహు తవాగ్రతః,
పశ్యత స్తే మరిష్యామి రామో యద్యభిషిచ్యతే. ४६
ఏకాహ మపి పశ్యేయం య ద్యహం రామమాతరమ్,
అఞ్జలిం ప్రతిగృహ్ణన్తీం శ్రేయో నను మృతి ర్మమ. ४७

భరతేనాత్మనా చాహం శపే తే మనుజాధిప!,
యథా నాన్యేన తుష్యేయ మృతే రామవివాసనాత్. ४८

ఏతావదుక్త్వా వచనం కైకేయీ విరరామ హ,

విచ్చెదనని చెప్పి యంత నాబ్రాహ్మణుండు "నీకండ్లను నాకిమ్ము" అని యడుగఁగానే సంతోషంబునఁ దనకండ్లఁ బెఱికి యాబ్రాహ్మణున కిచ్చి యుత్తమగతి నొందెను. ౪౩

సముద్రుఁడు మునుపుదన్ను దేవతలు "నీవు చెలియలికట్టను దాఁటకుము" అని ప్రార్థింపఁగా "అలాగే" యని ప్రతిజ్ఞ చేసి యిప్పటికిని జెలియలి కట్టను దాఁటకున్నాఁడు.

నీవు నట్టు మునుపటిరాజు లాచరించినవిధము జ్ఞప్తికిఁ దెచ్చుకొని ప్రతిజ్ఞను అనృతముఁ జేసుకొనక నిర్వహించుకొనుము. ౪౪

దుష్టబుద్ధిగలదశరథుఁడా! నీవు ధర్మంబువిడిచి రామునిరాజ్యంబున నభిషేకించి యెల్లప్పుడును సుఖంబుగాఁ గౌసల్యంగూడి క్రీడింపుచుండఁ గోరియున్నావు. ౪౫

నేను నిన్ను "రాము నడవికిఁ బంపి భరతునకు రాజ్యంబిమ్ము" అని యడుగుట ధర్మంబుగాని యధర్మంబుగాని మంచిదిగాని చెడ్డదిగాని 'నీవడిగిన దిచ్చెద" నని ప్రతిజ్ఞ చేసి యిచ్చియున్నావుగదా దానికిమాత్రము తిరుగుపాటులేదు. ౪౬

రామునకుఁ బట్టాభిషేకంబుసేయుదువేని నేనిప్పుడె నీయెదుట నీవు చూచుచుండఁగానే యధికముగా విషముఁద్రావి ప్రాణంబులు విడిచెదను. ౪౭

రామునితల్లియగు కౌసల్యకు రాముఁడు రాజగుటవలన జనులం నమస్కరించుచుండుటను ఒక్కదినమైనను జూచుచు బ్రతికియుండుటకన్నను నాకుఁ జచ్చుటయే మంచిది. ౪౮

దశరథమహారాజా! రాము నడవికిఁ బంపుటదక్క మఱేమిచేసినను నాకుసంతోషంబు గలుగదని భరతుఁడును నాప్రాణంబును సాక్షిగాఁ బ్రమాణముసేయుచున్నాను. అని కైకేయి దశరథునితోఁ జెప్పెను. ౪౯

కైకేయి దశరథునితో నింతవఱకు మాటలుచెప్పి యంత నూరకుండెను.

విలపన్తం చ రాజానం న ప్రతివ్యాజహార సా. ౫౦

శ్రుత్వా తు రాజా కైకేయ్యా వృతం వర మశోభనమ్,
రామస్య చ వనే వాస మైశ్వర్యం భరతస్య చ. ౫౧
నాభ్యభాషత కైకేయీం ముహూర్తం వ్యాకులేన్ద్రియః,

ప్రైక్షతానిమిషో దేవీం ప్రియా మప్రియవాదినీమ్. ౫౨

తాం హి వజ్రసమాం వాచ మాకర్ణ్య హృదయాప్రియామ్,
దుఃఖశోకమయీం ఘోరాం రాజా న సుఖితోఽభవత్. ౫౩

స దేవ్యా వ్యవసాయం చ ఘోరం చ శపథం కృతమ్,
ధ్యాత్వా రామేతి నిశ్వస్య ఛిన్న స్తరురివాపతత్. ౫౪
నష్టచిత్తో యథోన్మత్తో విపరీతో యథాఽఽతురః,
హృతతేజా యథా సర్పో బభూవ జగతీపతిః. ౫౫

దీనయా తు గిరా రాజా ఇతి హోవాచ కైకయీమ్,
అనర్థ మిమ మర్థాభం కేన త్వ ముపదర్శితా. ౫౬
భూతోపహతచిత్తేవ బ్రువన్తీ మాం న లజ్జసే,

శీలవ్యసనమేత త్తే నాభిజానామ్యహం పురా. ౫౭
బాలాయా స్త త్త్విదానీం తే లక్షయే విపరీతవత్,
కుతో వా తే భయం జాతం యా త్వమేవంవిధం వరమ్. ౫౮
రాష్ట్రే భరత మాసీనం వృణీషే రాఘవం వనే,

ఆక్కైకేయి దశరథమహారాజెంతవిలపించుచుండినను అందుకు బదులే చెప్పినదికాదు. ౧౦

దశరథమహారాజు కైకేయికోరిన యమంగళకరమయిన రాముఁ డడవి నుండుటయుం భరతుఁడు ప్రభుత్వంబునొందుటయును విని దుఃఖంబున నింద్రియంబుల స్వాధీనతదప్పి కొంచెముసేపు కైకేయితో నేమియుంబలుకక యూరకుండెను. ౧౧

ఆదశరథుఁడట్లేమియుం బలుకక తెప్పపాటులేక యప్రియంబులువలుకుచుండు తన ప్రియభార్యయగు కైకేయిఁ గోపంబునం జూచుచుండెను. ౧౨

దశరథమహారాజు వజ్రముంబోలెఁ గఠినంబై మనసున కప్రియంబై భరతునకు రాజ్యంబిమ్మనుటవలనను రాము నడవికిఁబంపుమనుటవలనను గలిగిన రెండువిధంబు లగుదుఃఖమునుగల్గించుచు భయంకరంబై యున్న కైకేయిచెప్పిన యామాటవిని యెంతమాత్రంబును సుఖంబు నొందఁడయ్యె. ౧౩

ఆదశరథుఁడు భయంకరంబగు కైకేయినిశ్చయంబును దాను జేసిన ప్రతిజ్ఞను దలఁచుకొని నఱుకఁబడినవృక్షముఁ బోలె నేలంబడెను. ౧౪

అప్పుడు దశరథమహారాజు మనసే నశించినవానిపోలికెఁ బిచ్చిపట్టినవానిభంగి, సన్నిపాతముచే భేదించిన ప్రకృతిగలవానికైవడి, వ్యాధితునియట్లు, మంత్రబలంబునంజేసి నిర్వీర్యంబయిన సర్పంబుంబోలెం జూపట్టుచుండెను.

దశరథమహారాజు కైకేయిఁ జూచి చాలదుఃఖంబుతో నిట్లనిచెప్పెను.

నీకెవ్వఁడు మంచిదివలె నగపడు నీయనర్థంబును బోధించినాఁడు? ౧౬

నీవు పిశాచముపట్టినదానియట్లు నిర్భయంబుగా నిట్లు నాయెదుటనుండి నాతో మాటలాడుచున్నావు; నీకుఁ గొంచెమైనను సిగ్గులేదు.

మునుపు నీవు చిన్నదానవుగా నున్నప్పుడు నీకిట్టి దుస్స్వభావంబుండ లేదు. ఇప్పుడేమో నీకిట్టి దుర్వృత్తులు గల్గియున్నది. ౧౭

“భరతునకు రాజ్యం బివ్వవలయును; రామునివనంబున కంపుము” అని యిట్టికఠినంబయిన వరంబడుగుచున్నావే! నీకు దేనివలన నింతభయంబు గల్గినది? ౧౮

విరమైతేన భావేన త్వమేతేనాన్నృతేన వా. ౨౯
యది భర్తుః ప్రియం కార్యం లోకస్య భరతస్య చ,

నృశంసే! పాపసఙ్కల్పే! క్షుద్రే! దుష్కృతకారిణి!. ౩౦
కిం ను దుఃఖ మలీకం వా మయి రామే చ పశ్యసి,

న కథంచి దృతే రామా ద్భరతో రాజ్యమావసేత్. ౩౧
రామా దపి హితం మన్యే ధర్మతో బలవత్తరమ్,
కథం ద్రక్ష్యామి రామస్య వనం గచ్ఛేతి భాషితే. ౩౨
ముఖవర్ణం వివర్ణం తం యథైవేన్దు ముపప్లుతమ్,
తాం హి మే సుకృతాం బుద్ధిం సుహృద్భి స్సహ నిశ్చితామ్.
కథం ద్రక్ష్యామ్యపావృత్తాం పరై రివ హతాం చమూమ్,

కిం మాం వక్ష్యన్తి రాజానో నానాదిగ్భ్య స్సమాగతాః. ౩౪

బాలో బతాయ మైక్ష్వాక శ్చిరం రాజ్య మకారయత్,

యదా తు బహవో వృద్ధా గుణవన్తో బహుశ్రుతాః. ౩౫
పరిప్రక్ష్యన్తి కాకుత్థ్సం వక్ష్యామి కి మహం తదా,

కైకేయ్యా క్లిశ్యమానేన రామః ప్రవ్రాజితో మయా. ౩౬
యది సత్యం బ్రవీమ్యేత త్తదసత్యం భవిష్యతి,

భర్తనగు నాకును బ్రపంచమునకును భరతునకును బ్రియంబు సేయఁ గోరుదువేని భరతునకు రాజ్యంబుగావలెనను నభిప్రాయంబును గాని పాపజనకంబగు రాము నడవికిఁ బంపవలెనను నభిప్రాయంబును గాని యీ రెంటిని వదలుము. ౫౯

దయలేనిదానా! పాపము సేయవలెనను కోర్కెగలదానా! కుటిలబుద్ధి గలదానా! పాపిష్ఠురాలా! నావలనను రామునివలనను నీకేమి దుఃఖము వచ్చునని తలఁచినావు? రాముఁడును నేనును నీకేమి యపరాధంబు గావించినాము? ౬౦

భరతుఁడు రామునకన్న నెచ్చుగా ధార్మికుఁడు కావున నీవేమి చేసినను అతఁడు రామునివిడిచి రాజ్యంబు నంగీకరింపఁడు. ౬౧

"నీ వడవికిఁ బొ"మ్మని నేను జెప్పఁగానే వెలవెలంబాఱి రాహుగ్రస్తుఁడగు చంద్రుఁబోలియుండు రామునిముఖంబును నే నెట్లు చూడఁగలను? ౬౨

స్నేహితులును మంత్రులును జేరి చక్కఁగా నాలోచించి నిశ్చయించిన రామాభిషేకము సేయవలయునను నాయభిప్రాయంబు, ఇప్పుడు తలక్రిందగుచుండఁగా శత్రువులచేఁ దనసేన కొట్టఁబడుచుండఁగాఁ జూచుచుండునట్లు నే నెట్లు జూచుచుండఁగలను? ౬౩

రామాభిషేకమునకై పలు దిక్కులనుండి నాచే రావింపఁబడియుండు రాజులు నన్నుఁజూచి యేమిచెప్పుదురు? ౬౪

"ఇక్ష్వాకువంశంబునఁ బుట్టినబాలుఁడగు నీరాముఁడు బహుకాలంబు రాజ్యమును బాలింపుచుండెనే" యని పరిహాసింతురుగదా!

ఇంక వృద్ధులును గుణవంతులును విద్యావంతులునగు వార లనేకులు వచ్చి "రాముఁడెక్కడ?" అని నన్నడుగఁగా నేనేమి వారలకుఁ జెప్పఁగలను? ౬౫

"నేను మున్ను కైకేయికి రెండువరంబు లిచ్చియుంటిని. ఆ రెంటికిని గా భరతున కభిషేకము సేయుట, రాము నడవికిఁ బంపుట ఈ రెంటిని జేయవల

కిం మాం వక్ష్యతి కౌసల్యా రాఘవే వనమాస్థితే. ౧౭

కిం చైనాం ప్రతివక్ష్యామి కృత్వా విప్రియ మీదృశమ్,
యదా యదా హి కౌసల్యా దాసీవచ్చ సఖీవ చ. ౧౮
భార్యావ ద్భగినీవ చ్చ మాతృవ చ్చోపతిష్ఠతి,
సతతం ప్రియకామా మే ప్రియపుత్రా ప్రియంవదా. ౧౯
న మయా సత్కృతా దేవి సత్కారార్హా కృతే తవ,

ఇదానీం త త్తపతి మాం యన్మయా సుకృతం త్వయి. ౨౦
అపథ్యవ్యఞ్జనోపేతం భుక్త మన్న మివాతురమ్,

విప్రకారం చ రామస్య సమ్ప్రయాణం వనస్య చ. ౨౧
సుమిత్రా ప్రేక్ష్య వై భీతా కథం మే విశ్వసిష్యతి,

కృపణం బత వైదేహీ శ్రోష్యతి ద్వయ మప్రియమ్. ౨౨
మాం చ పఞ్చత్వ మాపన్నం రామం చ వన మాశ్రితమ్,

యనని యిప్పుడు కైకేయి నన్నుఁ బీడింపఁగా రామున డవికిఁ బంపినాను” అని సత్యంబుగా నడచినసంగతిని జెప్పుదునేని యింతకు మున్ను వసిష్ఠ వామదేవాదిమహర్షులయెదుట సభలో “రామునకు రేపు పట్టాభిషేకము చేసెదను” అని నేను జేసిన ప్రతిజ్ఞ యసత్యంబగును. ౧౬

నేను రాము నడవికిఁ బంపఁగానే కౌసల్య నన్నుఁజూచి యేమి చెప్పును? ౧౭

కౌసల్య కిట్టి యపకారముచేసి నేను దాని కేమని చెప్పుదును?

రాణివగు కైకేయీ! ఎల్లప్పుడును నాకుఁ బ్రియంబుఁగోరుచుఁ బుత్రుఁడగు రామునియందును జాలఁ బ్రీతిఁగలిగి ప్రియవార్తలుమాత్రమే పలుకుచు నావలన సత్కారంబు నొందుటకుఁ దగి నాకు దాసియుంబోలెఁ బరిచర్యసేయుచుఁ జెలికత్తెయుంబోలె ద్యూతాదివినోదంబులు సలుపుచు భార్యయుంబోలె ధర్మకార్యంబులఁ దోడ్పడుచు భగినియుంబోలె నేను మఱియొకభార్యను వివాహంబాడునప్పుడు ఉపలాలనంబుసేయుచుఁ దల్లియుంబోలెఁ బోషణంబుగావింపుచు నన్ను సేవింపుచున్న కౌసల్యకు నీకుఁగోపంబు వచ్చునని నీకుఁగానే, నేనెంతమాత్రంబును సత్కారంబు గావింపనైతిని. ౧౯

నేను ముందు నీకుఁజేసిన మేలంతయు నిప్పుడు నీదుర్గుణంబులఁగ పడఁగానే వ్యాధిగలవాఁ డపథ్యాన్నము దినఁగా నది వెనుక నతనిబాధించునట్లు నన్ను బాధించుచున్నది. ౨౦

నేను నట్టిప్రియపుత్రుఁడగు రామునకై నిర్ణయింపఁబడిన యభిషేకమును నిలిపి మఱి రాము నడవికిఁ బంపుటఁ జూచి సుమిత్ర “ఈదశరథుఁ డతిక్రూరుఁ డవ్యవస్థితచిత్తుఁడు, అట్టి రామునే యిట్లు చేసినాఁడే నాకొడుకు నేమిసేయునో” యని భయపడి నన్నెంతమాత్రంబును నమ్మఁజాలదు.

సీత యేకకాలంబుననే నేను జచ్చుట రాముఁ డడవికిఁబోవుట యీరెండప్రియంబులును బహుదుఃఖంబున వినఁగలదు. ఇది నాకుఁ జాల దుఃఖముగా నున్నది. ౨౧

వైదేహీ బత మే ప్రాణా న్శోచన్తీ క్షపయిష్యతి. ౭౩
హీనా హిమవతః పార్శ్వే కిన్నరేణేవ కిన్నరీ,
నహి రామ మహం దృష్ట్వా ప్రవసన్తం మహావనే. ౭౪
చిరం జీవితు మాశంసే రుదన్తీం చాపి మైథిలీమ్,
సా నూనం విధవా రాజ్యం సపుత్రా కారయిష్యసి. ౭౫

న హి ప్రవ్రాజితే రామే దేవి! జీవితు ముత్సహే,

సతీం త్వా మహ మత్యన్తం వ్యవస్యామ్యసతీం సతీమ్. ౭౬
రూపిణీం విషసంయుక్తాం పీత్వేవ మదిరాం నరః,

అనృతై ర్బహు మాం సాన్త్వై స్సాన్త్వయన్తీ స్మ భాషసే. ౭౭
గీతశబ్దేన సంరుధ్య లుబ్ధో మృగమివావధీః,

అనార్య ఇతి మా మార్యాః పుత్రవిక్రాయికం ధ్రువమ్. ౭౮
ధిక్కరిష్యన్తి రథ్యాసు సురాపం బ్రాహ్మణం యథా,
అహో! దుఃఖ మహో! కృచ్ఛ్రం యత్ర వాచః క్షమే తవ.
దుఃఖ మేవం విధం ప్రాప్తం పురాకృత మివాశుభమ్,

చిరం ఖలు మయా పాపే! త్వం పాపేనాభిరక్షితా. ౮౦
అజ్ఞానా దుపసమ్పన్నా రజ్జు రుద్బన్ధినీ యథా,

అయ్యో! హిమవత్పర్వతసమీపంబునఁ గిన్నరునిం బాసిన కిన్నరియుం బోలె సీత నానిమిత్తమై దుఃఖించుచుఁ బ్రాణంబులను విడుచును. 23

రాముఁ డడవినుండుటను సీత యచ్చట రోదనంబు సేయుచుండు టనుఁ జూచుచు నేను బహుకాలంబు జీవింపనోల్లను. 24

నీవు నేను జచ్చిపోయినవెనుక ముండమోపివై నీకొడుకు భరతుఁగూడి రాజ్యంబు సేయుదువు. 25

రాణివగు కైకేయీ! రాముఁ డడవికిఁబోఁగానే నేను నిమిషంబయినను జీవింపనోల్లను.

నీవు మంచిరూపంబుగలిగి పైకి మిగుల యోగ్యురాలవులాగున నగపడు చుంటివి. పైకిఁజూచుటకు రమ్యంబై విషంబుగలిపియుండు సారాయిఁ ద్రాగిన వెనుకఁ బురుషుఁడు దానియందున్నదోషం బెఱుంగునట్లు నీయందున్నదోషం బిప్పటి కనుభవంబునఁ దెలిసికొంటిని. 26

నీవు ఇదివఱకు కపటంబుగా నన్ను సాంత్వవచనంబుల ననునయించు చుంటివి. ఇప్పుడు బోయవాఁడు గానధ్వనిచే జింకను స్వాధీనపఱచుకొని చంపునట్లు నన్నుఁ జంపినావు. 27

స్త్రీసుఖంబునకై కొడుకు నడవికిఁబంపిన నన్నుఁజూచి రాజవీధులందుఁ బెద్దలందఱు దుష్టుఁడని మద్యపానంబు సేయు బ్రాహ్మణునిఁ బోలె దూషింతురు.

అహా! ఇదియేమిదుఃఖము? ఇదియేమికష్టము? ఇట్టిది నే నెప్పుడు ననుభవింపలేదు; దీనివిషయమై యిప్పుడు నీవుచెప్పు "రాము నడవికిఁబంపు" మను కఠినవచనంబునుగూడ సహించియున్నాను; ఇది పూర్వజన్మమునందుఁ జేసిన పాపంబున ఫలంబుఁబోలె నెంతమాత్రంబును బ్రతీకారంబులేక నాకు సంభవించినది. 28

పాపిష్ఠురాలవగుకైకేయీ! నే నజ్ఞానంబున నిన్ను మెడకుఁ దగులుకొని యున్న యురిచేసికొను ద్రాటినిఁబోలె బహుకాలంబు కాపాడితిని; ఆత్రాడెట్లు అమనుష్యునిఁజంపునో అట్లు నీవును నన్నుఁ జంపఁ జూచితివి. 30

రమమాణ స్త్వయా సార్ధం మృత్యుం త్వాం నాభిలక్షయే. ౮౧
బాలో రహసి హస్తేన కృష్ణసర్ప మి వాస్పృశమ్,

మయా హ్యపితృకః పుత్ర స్స మహాత్మా దురాత్మనా. ౮౨
తం తు మాం జీవలోకోఽయం నూన మాక్రోష్టు మర్హతి,
బాలిశో బత కామాత్మా రాజా దశరథో భృశమ్. ౮౩
యః స్త్రీకృతే ప్రియం పుత్రం వనం ప్రస్థాపయిష్యతి,

వ్రతైశ్చ బ్రహ్మచర్యైశ్చ గురుభిశ్చోపకర్శితః. ౮౪
భోగకాలే మహత్కృచ్ఛ్రం పునరేవ ప్రపత్స్యతే,

నాలం ద్వితీయం వచనం పుత్రో మాం ప్రతిభాషితుమ్. ౮౫
స వనం ప్రవ్రజే త్యుక్తో బాఢమిత్యేవ వక్ష్యతి,

యది మే రాఘవః కుర్యా ద్వనం గచ్ఛేతి చోదితః. ౮౬
ప్రతికూలం ప్రియం మే స్యా న్న తు వత్సః కరిష్యతి,

శుద్ధభావో హి భావం మే న తు జ్ఞాస్యతి రాఘవః. ౮౭

నే నిన్నిదినములు నీతోఁ గ్రీడించుచుండియుఁ నీవు నాకు మృత్యువని యెఱుఁగఁజాలనైతిని. ౧౧

బాలుఁ డజ్ఞానంబున నెవ్వరు లేనప్పుడు కృష్ణసర్పంబును జేతంబట్టుకొనునట్లు నేను నీహస్తంబుఁబట్టి నిన్నుఁ బెండ్లాడితిని. అకృష్ణసర్పంబు బాలుని మరణంబునకుఁ గారణం బగునట్లు నీవు నా చావునకుఁ గారణంబవైతివి.

మహాత్ముఁడగు నాకుమారుండు రాముఁనకు దురాత్ముఁడనగు నేను దండ్రినిగానుండియుఁ దండ్రియున్నందువలనఁగలుగు సుఖంబులేకపోయినది.

జనులందఱు అట్టి దుర్మార్గుండనైననన్ను నిశ్చయముగా దూషింతురు.

ఈదశరథుఁ డొకస్త్రీకిఁగాను, బ్రియుండగు తనకొడుకును రాముని నడవికిఁ బంపుచున్నాఁడు; ఇతఁడు మిగుల మూర్ఖుఁడు; కేవల కాముకుఁడు. అని జనులు నన్ను దూషింతురు. ౧౩

రాముఁడు ఇంతవఱకు వ్రతంబులను బ్రహ్మచర్యంబునను గురువులు సేయుఁ శిక్షలవలనను మిగుల శ్రమపడి యెంతమాత్రము సుఖింపలేదు. ఇంక సుఖం బనుభవించుకాలంబునందును, ఆతనికి మఱల నంతకన్న మహాకష్టంబు వచ్చినది. ౧౪

నాకొడుకు రాముఁడు నామాటకు రెండవమాటను జెప్పనేరఁడు: "నీ వడవికిఁ బొమ్ము" అని నేనతనితోఁ జెప్పఁగానే అందుకతఁడు "మంచి" దని చెప్పనేగాని యెంతమాత్రము మాఱువలుకఁడు. ౧౫

నేను "వనంబునకుఁబొమ్ము" అని రాము నాజ్ఞాపింపఁగానే యతఁడు "నేను బోఁజాలను" అని చెప్పి నాయాజ్ఞ నతిక్రమించునేని నాకది ప్రియముగా నుండు; రాముఁడు మాత్రము అట్లు ఎన్నటికిని నాయాజ్ఞ నతిక్రమింపఁడు. ౧౬

రాముఁ డెంతమాత్రము కపటములేని పరిశుద్ధంబగు హృదయంబు గలవాఁడు కావున నతఁడు, నేనతఁడు నాయాజ్ఞ నతిక్రమించుట నా-

స వనం ప్రవ్రజే త్యుక్తో బాఢ మి త్యేవ వక్ష్యతి,

రాఘవే హి వనం ప్రాప్తే సర్వలోకస్య ధిక్కృతమ్. ౧౮
మృత్యు రక్షమణీయం మాం నయిష్యతి యమక్షయమ్,

మృతే మయి గతే రామే వనం మనుజపుఙ్గవే. ౧౯
ఇష్టే మమ జనే శేషే కిం పాపం ప్రతిపత్స్యసే,
కౌసల్యాం మాం చ రామం చ పుత్రౌ చ యది హాస్యతి. ౨౦
దుఃఖాన్యసహతీ దేవీ మామే వానుమరిష్యతి,

కౌసల్యాం చ సుమిత్రాం చ మాం చ పుత్రైస్త్రిభి స్సహ. ౨౧
ప్రక్షిప్య నరకే సా త్వం కైకేయి! సుఖితా భవ,

మయా రామేణ చ త్యక్తం శాశ్వతం సత్కృతం గుణైః. ౨౨
ఇక్ష్వాకుకుల మక్షోభ్య మాకులం పాలయిష్యసి,

ప్రియం చే ద్భరత స్యైత ద్రామ ప్రవ్రాజనం భవేత్. ౨౩
మా స్మ మే భరతః కార్షీ త్ప్రేతకృత్యం గతాయుషః,
హ న్తానార్యే! మమామిత్రే! సకామా భవ కైకయి. ౨౪

కష్టమని తలఁచి యతనివనంబునకుఁ బొమ్మనిచెప్పుటను దెలిసికొనఁజాలఁడు.

కావున రామునిఁ జూచి నేను "నీవు అడవికిఁబొమ్ము" అని యాజ్ఞాపింపఁగానే అందు కతఁడు "మంచిది" అని చెప్పునే కాని వేఱుమాట పలుకఁడు.

రాముఁ డడవికిఁబోఁగానే మృత్యువు సమస్తజనులచేతను నిందింపఁబడుచున్న నన్ను మహాపాపిష్ఠుఁడ నగుటచే క్షమింపక యమలోకంబునకుం
గొనిపోవును. ౭౯

నేను మృతుఁడనయి రాముఁ డడవికిఁబోయినపిమ్మట శేషించియుండు కౌసల్యమొదలగు నాయిష్టజనులకు మఱేమికష్టమును జేయఁగోరుచున్నావు!

రాముఁ డడవికిఁ బోవునేని నేను బ్రాణంబులు విడుతును. నేను మృతుఁడనయి రాముఁ డడవికిఁ బోయినపిమ్మట గౌసల్యయుం మృతయగు, రామునియందతిస్నేహభక్తులుగల లక్ష్మణుండు జచ్చును; అట్లు శత్రుఘ్నుఁడు నీవృత్తాంతము విన్నంతనే ప్రాణంబులు విడుచును; ఇట్లు నీవు కౌసల్యను నన్నును రాముని లక్ష్మణశత్రుఘ్నులను విడుతువేని సుమిత్రయుం నీ దుఃఖం
బుల సహింపలేక నన్ననుగమించి ప్రాణంబులు విడువంగలదు. ౮౦

కైకేయీ! అతిక్రూరురాలవగు నీవు కౌసల్యను సుమిత్రను నన్నును నాకొడుకులు రామలక్ష్మణ శత్రుఘ్నుల మువ్వురను దుఃఖంబునొందునట్లు
చేసి నీవుమాత్రము సుఖంబుగానుందువు? ౮౧

శాశ్వతంబై గుణంబుల వినుతికెక్కినదియై యక్షోభ్యంబై నాచేతను రామునిచేతను విడువఁబడి యుండు నీయిక్ష్వాకురాజ్యంబు నిప్పుడు
నీవు ఆకులంబుగాఁ బాలించెదవు. ౮౨

రాము నడవికిఁ బంపుటను విని భరతుఁడు సంతోషమునొందునేని
నేను మృతుఁడగునప్పుడు నాకు భరతుఁడు చరమక్రియలు చేయఁదగఁడు. ౮౩

అయ్యో! దుష్టురాలా! నాకు శత్రువైనదానా! కైకేయీ! రాముని
యందు బ్రియంబుగలదానవగుము. ౮౪

మృతే మయి గతే రామే వనం పురుషపుఙ్గవే,
సేదానీం విధవా రాజ్యం సపుత్రా కారయిష్యసి. ౯౫
త్వం రాజపుత్రీవాదేన న్యవసో మమ వేశ్మని,
అకీర్తి శ్చాతులా లోకే ధ్రువః పరిభవశ్చ మే. ౯౬
సర్వభూతేషు చావజ్ఞా యథా పాపకృత స్తథా,
కథం రథై ర్విభు ర్యాత్వా గజాశ్వైశ్చ ముహు ర్ముహుః. ౯౭
పద్భ్యాం రామో మహారణ్యే వత్సో మే విచరిష్యతి,

యస్య త్వాహారసమయే సూదాః కుణ్డలధారిణః. ౯౮
అహంపూర్వాః పచన్తి స్మ ప్రశస్తం పానభోజనమ్,
స కథం ను కషాయాణి తిక్తాని కటుకాని చ. ౯౯
భక్షయన్వన్య మాహారం సుతో మే వర్తయిష్యతి,

మహార్హ వస్త్రసంవీతో భూత్వా చిరసుఖోషితః. ౧౦౦
కాషాయపరిధానస్తు కథం భూమౌ నివత్స్యతి,

క స్యైత ద్దారుణం వాక్య మేవంవిధ మచిన్తితమ్. ౧౦౧
రామస్యారణ్యగమనం భరతస్యాభిషేచనమ్,

ధిగస్తు యోషితో నామ శఠా స్స్వార్థపరా స్సదా. ౧౦౨
న బ్రవీమి స్త్రియ స్సర్వా భరత స్యైవ మాతరమ్,

నేను మృతుఁడయి పురుషశ్రేష్ఠుఁడగురాముఁడు వనంబునకుఁబోయిన పిమ్మట నీవు ముండమోపివై నీకొడుకు భరతుఁగూడి దొరతనముసేయుదువు.

నీ కోరికయనిష్టంబవు; రాచకొమార్తెయనెడురూపంబున నాయింట నుంటివి; అందువలనఁ బాపిష్ఠునకుఁబోలె నాకు నీలోకంబున సాటిలేని యపకీర్తియును ఎన్నటికిఁ దఱుఁగని తిరస్కారంబును సమస్తజంతువులయెదుట నల్పత్వంబును గలిగినవి. ౯౭

నా ప్రియపుత్రుఁడు ప్రభుఁడునగు రాముఁడు పలుమాఱు రథంబులు గజంబులు గుఱ్ఱంబులు మొదలగు దివ్యయానంబులం దిరుగుచుండి యిప్పుడు మహారణ్యంబునందుఁ బాదంబుల నెట్లు తిరుగఁగలఁడు? ౯౮

ఎవ్వఁడు భుజింపఁగోరఁగానే కుండలంబులచే నలంకృతులగు వంటవాండ్రు "నేను వంటచేసెదను. నేను వంటచేసెదను" అని పరువులిడుచుఁ బ్రశస్తంబులైన పానీయభోజనంబులను వండుచుండిరో అట్టి నాకొడుకు రాముఁడు అడవియందు ఒగరు చేఁదు కారము పీనితోఁగూడిన యాహారంబును భుజింపుచు నెట్లు జీవింపఁగలఁడు? ౯౯

రాముఁడు అతిశ్లాఘ్యంబులగు వస్త్రంబులనుధరించి యెంతకాలంబు గూర్చుండినను బహుసుఖంబుగా నుండు నాస్తరణంబులపైఁ బరుండియుండి యిఁక వనంబునఁ గాషాయవస్త్రంబులఁ గట్టుకొని నేలపైఁబరుండి యెట్లుండఁగలఁడు? ౧౦౦

"రాముఁ డడవికిఁబోవుట, భరతుఁడు పట్టాభిషిక్తుఁడగుట" యిట్టి దారుణమయిన యీమాటను ఎంతమాత్రము నాలోచింపక యెవ్వఁడు నీకుపదేశించినాఁడు? ౧౦౧

స్త్రీలందఱు తెలియకుండునట్లు కీడుసేయువారలు ఎల్లప్పుడును దమ కార్యమునందే యాసక్తలు. ఇతరులకార్యము నెంతైనను సరకుసేయరు; స్త్రీలందఱు మండిపోవుదురుగాక; అయితే పతివ్రతలగు స్త్రీలున్నారు; కావున ఈ స్త్రీలనందఱను నేను నిందింపనొల్లను; భరతునితల్లియయిన కైకేయినిమాత్రమే నిందించెదను. ౧౦౨

అనర్థభావేఽర్థపరే! నృశంసే
మమానుతాపాయ నివిష్టభావే!. ౧౦౩
కిమప్రియం పశ్యసి మన్నిమిత్తం
హితానుకారిణ్యథవాఽపి రామే,
పరిత్యజేయుః పితరో హి పుత్రా
న్భార్యాః పతీంశ్చాపి కృతానురాగాః. ౧౦౪
కృత్స్నం హి సర్వం కుపితం జగత్స్యా
ద్దృష్ట్వైవ రామం వ్యసనే నిమగ్నమ్,
అహం పున ర్దేవకుమారరూప
మలఙ్కృతం తం సుతమావ్రజన్తమ్. ౧౦౫
నన్దామి పశ్య న్నపి దర్శనేన
భవామి దృష్ట్వా చ పునర్యువేవ,

వినాఽపి సూర్యేణ భవే త్ప్రవృత్తి
రవర్షతా వజ్రధరేణ వాఽపి. ౧౦౬
రామం తు గచ్ఛన్త మితః సమీక్ష్య
జీవే న్న కశ్చి త్త్వితి చేతనా మే,
వినాశకామా మహితా మమిత్రా
మావాసయం మృత్యు మివాత్మన స్త్వామ్. ౧౦౭
చిరం బతాఽఙ్కేన ధృతాఽసి సర్పీ
మహావిషా తేన హతోఽస్మి మోహాత్,

మయా చ రామేణ చ లక్ష్మణేన

ఇతరుల కనర్థముగలిగించు నభిప్రాయముగలదానవు; స్వకార్యఘోరాలవు; దయలేనిదానవు; నన్ను దుఃఖింపఁజేయుటకై యే యిట్టి దురభిప్రాయంబు నవలంబించినదానవు; నేను నీ కేమికీడుచేసినాను? లేక లోకమున కంతయుం హితముసేయుం రాముఁడుగాని నీ కేమికీడు గావించినాఁడు?

ప్రేమగలవారయినను దండ్రులు కొడుకులను విడువవచ్చును; అట్లు పెనిమిటులను భార్యలు విడువవచ్చును; అయితే నేను రాముని విడువఁగా దుఃఖంబునఁ గుందుచుండు రామునిఁజూచినంతనే ప్రపంచమునందు జంగమంబులును స్థావరంబులుకుగూడ అన్నియుం గోపంబునొందును. ౧౦౪

లోకంబున నితరులకువలె నాకుమాత్రము పుత్రునియందు సాధారణప్రేమం బెకాదు. విలక్షణంబుగానున్నది. నాకు దేవకుమారుఁడుంబోలె సహజసుందరుఁడై భూషణంబుల నలంకరింపఁబడి మత్తగజేంద్రగమనంబున నాయొద్దకువచ్చుచున్న రాముని దవ్వుల జూడఁగానే బహుసంతోషముంగలుగుచున్నది. అంత నాసమీపమునవచ్చియున్న యతనిం జూచితినేని నే నతివృద్ధుఁడ నైనను నాకప్పుడు యౌవనంబు గలిగినవానికిఁబోలె దేహపుష్టివీర్యోత్సాహంబులు గలుగుచున్నవి. ౧౦౫

సూర్యుఁడు లేకున్నను ఇంద్రుఁడు వానగురియకున్నను లోకంబులు చక్కఁగానుండును గాని రాముఁడు ఇచ్చటనుండి వనంబునకుఁ బోవుటను జూచునేని యెక్కజంతువయినను జీవింపఁజాలదు అని నాయభిప్రాయము.

నాచేటుఁగోరుచు నాకుఁ గీడుసేయుందానవై శత్రువై మృత్యువుఁ బోలెనున్న నిన్ను నే నింతకాలం బజ్ఞానంబున నాయింట నుంచుకొంటిని. ఆలి పేరఁబరగువిషముగల సర్పంబవగు నిన్నుఁ దెలియక బహుకాలము అంకంబునఁ జేర్చుకొనియుంటఁజేసి యిప్పుడు నీచేత నేను జంపఁబడినాను. ౧౦౬

నాచేతను లక్ష్మణునిచేతను రామునిచేతను విడువఁబడి భరతుఁడు నిన్నుఁగూడి పట్టణంబుననుండుజనులను రాజ్యంబుననున్నజనులను బంధు

ప్రశాన్తు హీనో భరత స్త్వయా సహ. ౧౦౮
పురం చ రాష్ట్రం చ నిహత్య బాన్ధవా
న్మమాహితానాం చ భవాభిహర్షిణీ,
నృశంసవృత్తే! వ్యసనప్రహారిణి!
ప్రసహ్య వాక్యం య దిహాద్య భాషసే. ౧౦౯
న నామ తే కేన ముఖా త్పత స్త్యధో
విశీర్యమాణా దశనా స్సహస్రధా,
న కించి దాహాహిత మప్రియం వచో
న వేత్తి రామః పరుషాణి భాషితుమ్. ౧౧౦
కథం ను రామే హ్యభిరామవాదిని!
బ్రవీషి దోషా న్గుణనిత్యసమ్మతే,

ప్రతామ్య వా ప్రజ్వల వా ప్రణశ్య వా
సహస్రశో వా స్ఫుటితా మహీం వ్రజ. ౧౧౧
న తే కరిష్యామి వచ స్సుదారుణం
మ మాహితం కేకయరాజపాంసని,

క్షురోపమాం నిత్య మసత్ప్రియంవదాం
ప్రదుష్టభావాం స్వకులోపఘాతినీమ్. ౧౧౨
న జీవితుం త్వాం విషహేఽమనోరమాం
దిధక్షమాణాం హృదయం సబంధనమ్,
న జీవితం మేఽ స్తి పునః కుత స్సుఖం
వినాఽఽత్మజే నాఽఽత్మవతః కుతో రతిః. ౧౧౩
మ మాహితం దేవి! న కర్తు మర్హసి
స్పృశామి పాదా వపి తే ప్రసీద మే,

వుల సందఱం జంపి దొరతనము సేయుంగాక. నీవును నాశత్రువులపైఁ బ్రీతి సంతోషంబులు నెఱపుచుండుము. ౧౦౯

దయలేనివ్యాపారముగలదానా! ఆపత్కాలమునందుఁ బ్రవారించుదానా! నీ విప్పుడు నాయెదుట భార్యయుండవలసినక్రమంబు నతిక్రమించి స్వాతంత్ర్యంబున నిట్టి క్రూరవాక్యంబు లాడుచున్నావే; ఎందువలన నిప్పుడు నీనోటనుండి పండ్లన్నియుం వేయిపఱియలుగాఁ బగిలి నేలంబడవు?

రాముఁడు కొంచెమయినను హితంబు కానిమాటనుగాని ప్రియంబు గానిమాటనుగాని పలుకఁడు. పరుషంబుగా మాటలాడుటకే యతనికిఁ దెలియదు. అట్లు సర్వజనులకును బ్రియంబులయిన మాటలాడువాఁడును గుణవంతుఁడని యందఱిచేతను గొనియాడఁబడువాఁడునగు రామునియందు అరణ్యంబునకుఁ బంపవలసినదోషంబు లేమియున్నవని చెప్పఁగలవు? ౧౧౦

కేకయరాజకులంబున వారలను జెఱుపుటకై పుట్టినదానా! నీవు దుఃఖంబునొందుము; కోపంబున మండిపొమ్ము; పర్వతమునుండి వేయిపఱియలుగా విఱిగి నేలంబడుము; విషమైనను జేసికొనుము; నీ వేమి చేసినను బరమదారుణంబును నాకుఁ గీడుగావించునదియుం గావున నీవు కోరినదాని నేఁ జేయుంట లేదు. ౧౧౧

మంగలకత్తియుంబోలె నతిక్రూరురాలవై యెప్పుడును గపటప్రియవాక్యంబులు పలుకుచు దుష్టాభిప్రాయంబుగలిగి నాకులంబును నశింపఁజేయ నిశ్చయించి నామనంబునకు దుఃఖంబు సేయుచు నాప్రాణంబును నాహృదయంబును దహింపఁగోరుచున్న నీవు జీవించియుండుటఁ జూడనొల్లను. ౧౧౨

నేను జీవించియే యుండనేరను; నా కిఁక సుఖం బెక్కడిది? ఒకవేళ జీవించియున్నను నాకొడుకు రాముఁడు లేనప్పుడు నా కెక్కడిది సంతోషము? నీవు నాకు భార్యవు కావున నాకు నీవు కీడుసేయరాదు; నీ పాదంబులఁ బట్టుకొనెదను; నాకుఁ బ్రసన్నవగుము. అని దశరథుండు కైకేయితోఁ జెప్పెను. ౧౧౩

స భూమిపాలో విలప న్ననాథవత్
స్త్రియా గృహీతో హృదయేఽతిమాత్రయా. ౧౧౪
పపాత దేవ్యా శ్చరణౌ ప్రసారితా
వుభా వసంస్పృశ్య యథాఽఽతుర స్తథా.

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే ద్వాదశస్సర్గః.

---

## త్రయోదశస్సర్గః

అతదర్హం మహారాజం శయాన మతథోచితమ్,
యయాతి మివ పుణ్యాన్తే దేవలోకా త్పరిచ్యుతమ్, ౧
అనర్థరూపా సిద్ధార్థా హ్యభీతా భయదర్శినీ,
పున రాకారయామాస త మేవ వర మంగనా. ౨

త్వం కత్థసే మహారాజ! సత్యవాదీ దృఢవ్రతః,
మమ చేమం వరం కస్మా ద్విధారయితు మిచ్ఛసి. 3

ఏవ ముక్త స్తు కైకేయ్యా రాజా దశరథ స్తదా,
ప్రత్యువాచ తతః క్రుద్ధో ముహూర్తం విహ్వలన్నివ. ౪
మృతే మయి గతే రామే వనం మనుజపుఙ్గవే,
హ న్తానార్యే! మమామిత్రే! సకామా సుఖినీ భవ. ౫

భూమిని బాలించునట్టి దశరథుఁడు స్త్రీమర్యాదనతిక్రమించియుండు కైకేయి యధీనమయిన మనసుగలవాఁడు గావున దాని నిగ్రహింపలేక అనాథునియట్లు విలపించుచు "ఇతఁడు నమస్కరించునేమో దానిఁ గాకుండఁజేయవలె" నని కైకేయి తలఁచి మఱియొక్క ప్రక్కకుఁ బాదంబులఁ జాఁచుటవలన వానిస్పృశింపక వ్యాధిగ్రస్తుఁడు ఉన్నట్టుండి దౌర్బల్యంబున నేలంబడునట్లు నేలంబడెను. ౧౧౪

ఇది పండ్రెండవసర్గము.

---

## పదుమూఁడవ సర్గము

అట్టిదుఃఖం బనుభవింపఁదగనివాఁడును, అట్లు నేలంబడియుండఁ దగనివాఁడును, బుణ్యంబంతయుఁ దఱిఁగినపిమ్మటను భూమికివచ్చిన యయాతియుంబోలెఁ జూపట్టుచున్నవాఁడు నగు దశరథమహారాజుఁ జూచి పాపిష్ఠురాలై సిద్ధంబుగాని ప్రయోజనంబుగలదై బరాపవాదమునుండి భయపడక దశరథునకుఁ గల్గియుండుభయంబును గణింపక దశరథుని వేఁడించుచున్న కైకయి మఱల నావరంబు లివ్వవలయునని చెప్పుటకైయే సంబోధించెను. ౨

దశరథమహారాజా ! నీవు "నేను దబ్బఱలాడను; పట్టినవ్రతంబు విడువను" అని నన్నుఁ బొగడుకొనుచున్నావే; ఎందువలన నాకిచ్చెదనని చెప్పిన వరంబు నివ్వనొల్లక గట్టిగాఁ బట్టుకొనియున్నావు? అని కైకేయి దశరథునితోఁ జెప్పెను. 3

దశరథమహారా జప్పుడు కైకేయిచెప్పినమాటవిని కోపంబునొంది కొంచెము నీవు మూర్ఛవోయి యంతఁ దెలివొంది యిట్లని చెప్పెను. ౪

ఆశ్చర్యము ! ఇట్టికార్యము నే నెచ్చటను జూడలేదు ! దుష్టురాలా ! నాకు శత్రువైనదానా ! నేను మరణంబునొంది రాముఁడు వనంబునకుఁ బోయినపిమ్మట నీవు నీకోర్కె లీడేర్చుకొని సుఖంబుగానుండుము. ౫

స్వర్గేఽపి ఖలు రామస్య కుశలం దైవతై రహమ్,
ప్రత్యాదేశా దభిహితం ధారయిష్యే కథం బత. ౬

కైకేయ్యాః ప్రియకామేన రామః ప్రవ్రాజితో మయా,
యది సత్యం బ్రవీ మ్యేత త్త దసత్యం భవిష్యతి. ౭

అపుత్రేణ మయా పుత్ర శ్శ్రమేణ మహతా మహాన్,
రామో లబ్ధో మహాబాహు స్స కథం త్యజ్యతే మయా. ౮

శూరశ్చ కృతవిద్యశ్చ జితక్రోధః క్షమాపరః,
కథం కమలపత్రాక్షో మయా రామో వివాస్యతే. ౯

కథ మిన్దీవరశ్యామం దీర్ఘబాహుం మహాబలమ్,
అభిరామ మహం రామం ప్రేషయిష్యామి దణ్డకాన్. ౧౦

సుఖానా ముచిత స్యైవ దుఃఖై రనుచితస్య చ,
దుఃఖం నామానుపశ్యేయం కథం రామస్య ధీమతః. ౧౧

యది దుఃఖ మకృత్వాఽద్య మమ సంక్రమణం భవేత్,
అదుఃఖార్హస్య రామస్య తత స్సుఖ మవాప్నుయామ్. ౧౨

నృశంసే! పాపసఙ్కల్పే! రామం సత్యపరాక్రమమ్,
కిం విప్రియేణ కైకేయి! ప్రియం యోజయసే మమ. ౧3

నేను స్వర్గమునకుఁబోయినను అచ్చట దేవతలు రామునితేజంబును గూర్చి తిరస్కారపూర్వకంబుగాఁ జెప్పుమాటలను నేనెట్లు సహించుచుందును? అచ్చటను నాకు దుఃఖమే కలుగును. అయ్యో! ౬

“కైకేయికి మున్ను రెండువరంబు లిచ్చియుంటిని. ఆ వరంబులలో నొకటికిఁగా రాము నడవికిఁ బంపినాను” అని సత్యంబైన యీమాటను జెప్పుదునేని యింతకుమున్ను నేను రామునితో “నీకు రేపు రాజ్యం బిచ్చెదను” అని చెప్పినమాట యసత్యమగును. ౭

నేను మున్ను కొడుకులు లేకుండి బహుశ్రమంబులంపడి దుర్లభుండును మహాబాహుండునగు రామునిఁ గొడుకునుగాఁ బడసినాను. అట్టి రాముని నేనెట్లు విడువగలను? ౮

యుద్ధమునం దెంతమాత్రము భయంబులేనివాఁడై సమస్తవిద్యలు నేర్చి కోపంబును జయించి యోర్పుగలిగి తామరపూరేకులఁబోలు విశాలంబులగు నేత్రంబులతో వెలుంగుచుండు రాముని నే నెట్లడవికిఁ బంపుదును? ౯

నల్లకలువలుంబోలె శ్యామవర్ణంబుగలిగి దీర్ఘబాహుండై యధిక బలంబుగలవాఁడై సర్వాంగసుందరుఁడై యుండురాముని నేనెట్లు దండకారణ్యంబున కంపుదును? ౧౦

సుఖంబు లనుభవించుటకు మాత్రమె తగినవాఁడును దుఃఖం బనుభవింపఁదగనివాఁడును బుద్ధిమంతుఁడు నగురామునికి దుఃఖంబురాఁగా దాని నే నెట్లు చూడఁగలను? ౧౧

ఇప్పుడు దుఃఖ మనుభవించుట కెంతమాత్రము దగినవాఁడు గానట్టి రామునకు దుఃఖంబుసేయకయే నేను మరణంబునొందుదునేని యదియె నాకు సుఖంబు. ౧౨

దయలేనిదానా! పాపిష్ఠురాలా! కైకేయీ! నాకుఁ బ్రియుండును సత్యపరాక్రముఁడునగు రాము నరణ్యంబునకుఁ బోవలయునని యేలకోరుచున్నావు? ౧౩

అకీర్తి రతులా లోకే ధ్రువః పరిభవ శ్చ మే,

తథా విలపత స్తస్య పరిభ్రమితచేతసః. ౧౪
అస్త మభ్యగమ త్సూర్యో రజనీ చాభ్యవ ర్తత,
సా త్రియామా తథాఽఽ ర్తస్య చన్ద్రమణ్డలమణ్డితా. ౧౫
రాజ్ఞో విలపమానస్య న వ్యభాసత శర్వరీ,

తథైవోష్ణం వినిశ్వస్య వృద్ధో దశరథో నృపః. ౧౬
విలలాపా ర్తవ ద్దుఃఖం గగనాస క్తలోచనః,

న ప్రభాతం త్వయేచ్ఛామి నిశే! నక్షత్రభూషణే!. ౧౭
క్రియతాం మే దయా భద్రే! మయాఽయం రచితోఽఞ్జలిః,

అథవా గమ్యతాం శీఘ్రం నాహ మిచ్ఛామి నిర్ఘృణామ్. ౧౮
నృశంసాం కైకయీం ద్రష్టుం యత్కృతే వ్యసనం మహత్,

ఏవ ముక్త్వా తతో రాజా కైకేయీం సంయతాఞ్జలిః. ౧౯
ప్రసాదయామాస పునః కైకేయీం చేద మబ్రవీత్,
సాధువృత్తస్య దీనస్య త్వద్గతస్య గతాయుషః. ౨౦
ప్రసాదః క్రియతాం దేవి! భద్రే రాజ్ఞో విశేషతః,

శూన్యేన ఖలు సుశ్రోణి! మయేదం సముదాహృతమ్. ౨౧

ఇందువలన నాకు ఇంక నెచ్చటను సాటిలేని యపకీర్తియును ఇంక నెప్పటికిని దఱుఁగని యవమానంబును గలుగును. అని దశరథుఁడు కైకేయికిఁ జెప్పెను.

అట్లు దశరథుఁడు తిరుగుడువడినహృదయంబుతో విలపించుచుండఁగా సూర్యుఁ డస్తమించెను, రాత్రి వచ్చినది. ౧౪

ఆరాత్రి చంద్రమండలముచే నలంకరింపఁబడినదయ్యు నట్లు దుఃఖితుఁడయి విలపించుచున్న యాదశరథమహారాజునకు ఎంతమాత్రము సంతోషము గల్గింపలేదు. ౧౫

వృద్ధుఁడగు నాదశరథమహారాజు అలాగే వేఁడి నిట్టూర్పులు పుచ్చి, రోగాదులఁ బీడింపఁబడినవానిపోల్కి నాకాశంబుఁ జూచి వినువారికిని దుఃఖము గల్గునట్లుగా నిట్లని విలపించెను. ౧౬

నక్షత్రములచే నలంకరింపఁబడినరాత్రీ! నీవు తెల్లవాఱవలదు; నా యందు దయయుంచుము. ఇదిగో చేతులు మొగిడ్చి నీకు నమస్కరించుచున్నాను. ౧౭

అటుగాదేని యీరాత్రి శీఘ్రముగాఁ దెల్లవాఱుఁగాక. నా కిట్టి మహాదుఃఖమును గల్గించునట్టి నిర్దయురాలును క్రూరురాలునగు కైకేయిఁ జూడ నాకిష్టము లేదు. అని దశరథుఁడు విలపించెను. ౧౮

ఇట్లు విలపించి యంత దశరథమహారాజు చేతులు మొగిడ్చికొని మఱలఁ గైకేయి ననునయింపుచుఁ గైకేయితో నిట్లని చెప్పెను. ౧౯

కైకేయీ! నీవు మంగళస్వరూపిణివి; నాకు భార్యవు; ఇన్నిదినములు మంచియాచారములు గలిగియున్నవాఁడను; దుఃఖితుఁడను; నిన్నుశరణొంది యున్నవాఁడను; నేఁడో రేపో చావంబోవువాఁడను; విశేషించి నీకుఁ బ్రభుఁడను; అట్టినేను అసత్యంబునొందకుండ మహావ్యసనంబున మునుఁగకుండ నామీఁద ననుగ్రహంబు సేయుము. ౨౦

సుందరములయిన పిఱుఁదులుగలకైకేయీ! నే నీమాటను ఎవ్వరును లేనిచోటఁ జెప్పలేదు. రాజులు మున్నగువారు వినుచుండఁగాఁ జెప్పినాను.

కురు సాధు ప్రసాదం మే బాలే! సహృదయా హ్యసి,

ప్రసీద దేవి! రామో మే త్వద్దత్తం రాజ్య మవ్యయమ్. ౨౨
లభతా మసితాపాఙ్గే! యశః పరమవాప్నుహి,

మమ రామస్య లోకస్య గురూణాం భరతస్య చ. ౨౩
ప్రియ మేత ద్గురుశ్రోణి! కురు చారుముఖేక్షణే!,

విశుద్ధభావస్య సుదుష్టభావా
తాంమ్రేక్షణాస్యాశ్రుకలస్యరాజ్ఞః. ౨౪
శ్రుత్వా విచిత్రం కరుణం విలాపం
భర్తు ర్నృశంసా న చకార వాక్యమ్,
తత స్సరాజా పునరేవ మూర్ఛితః
ప్రియా మదుష్టాం ప్రతికూలభాషిణీమ్. ౨౫
సమీక్ష్య పుత్రస్య వివాసనం ప్రతి
క్షితౌ విసంజ్ఞో నిపపాత దుఃఖితః,
ఇతీవ రాజ్ఞో వ్యథితస్య సా నిశా
జగామ ఘోరం శ్వసతో మనస్వినః. ౨౬
విబోధ్యమానః ప్రతిబోధనం తదా
నివారయామాస స రాజసత్తమః.

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే త్రయోదశస్సర్గః.

కావున నీవు నన్ను బాధింపవలదు. నాయందుఁ జక్కఁగా ననుగ్రహం బుంచుము. నీవు మంచిమనసుగలదానవు. ౨౧

నల్లనికడకండ్లుగల కైకేయీ! కోపంబు విడువుము. నీవే వరబలంబున నావలన రాజ్యంబునుగ్రహించి మఱల నవ్యయంబగు నారాజ్యంబు రామున కిచ్చి ముల్లోకంబులను వినుతికెక్కినకీర్తిం బొందుము. ౨౨

పెద్దపిఱుఁదులు గలదానవు. సుందరముఖంబును సుందరములయిన కండ్లును గలదానవగు కైకేయీ! నీవు వరంబునకై నావలన రాజ్యంబు గ్రహించి మఱల నీవే రామున కిత్తువేని నాకు రామునకును బ్రపంచమునకును గురువులకును భరతునకునను సంతోషంబగును. ఇట్లు చేయుము. అని దశరథుఁడు కైకేయితోఁ జెప్పెను. ౨౩

మిక్కిలియు దుష్టమయిన హృదయముగలదియును క్రూరురాలునగు కైకేయి పరిశుద్ధహృదయుఁడును దుఃఖంబుచే నెఱ్ఱనైనకండ్లుగల్గి కన్నీళ్లతో నిండియుండువాఁడునగు దశరథమహారాజు నానావిధముగా వినువారికిని దయగల్గునట్లుగా నెంతవిలపించినను అతనిమాటప్రకారము చేయలేదు. ౨౪

అంత నాదశరథమహారాజు పూర్వము తనకు మిగుల ననుకూలరాలై పతివ్రతగానున్న యాకైకేయి యిప్పుడు రాము నడవికిఁ బంపుమని యంత ప్రతికూలముగా మాటలాడుటఁజూచి చేయునదిదోఁచక దుఃఖమునఁ మఱల మూర్ఛనొంది దేహంబు మఱచి నేలంబడెను. ౨౫

ఇట్లు మంచిమనసుగల దశరథమహారాజు దుఃఖితుఁడై చూపరులకు భయముగల్గునట్లు నిట్టూర్పులు పుచ్చుచుండఁగానే యారాత్రి గడచినది. అంతఁ బ్రాతఃకాలమునందు వైతాళికప్రభృతులు దశరథుని మేలుకొలుప నారంభింపఁగానే దశరథుఁ డట్లు మేలుకొలుప నక్కఱలేదని యాజ్ఞాపించెను. ౨౬

ఇది పదుమూఁడవసర్గము.

## చతుర్దశస్సర్గః

పుత్రశోకార్దితం పాపా విసంజ్ఞం పతితం భువి,
విచేష్టమాన ముదీక్ష్యైవ మైక్ష్వాక మిద మబ్రవీత్. ౧
పాపం కృత్వైవ కి మిదం మమ సంశ్రుత్య సంశ్రవమ్,
శేషే క్షితితలే సన్నః స్థిత్యాం త్వం స్థాతు మర్హసి. ౨

ఆహు స్సత్యం హి పరమం ధర్మం ధర్మవిదో జనాః,
సత్య మాశ్రిత్య హి మయా త్వం చ ధర్మం ప్రచోదితః. 3

సంశ్రుత్య శైబ్య శ్శ్యేనాయ స్వాం తనుం జగతీపతిః,
ప్రదాయ పక్షిణే రాజన్! జగామ గతి ముత్తమామ్. ౪

తథా హ్యలర్క స్తేజస్వీ బ్రాహ్మణే వేదపారగే,
యాచమానే స్వకే నేత్రే ఉద్ధృత్య సుమనా దదౌ. ౫

సరితాం తు పతి స్స్వల్పాం మర్యాదాం సత్యమన్వితః,
సత్యానురోధా త్సమయే స్వాం వేలాం నాతివర్తతే. ౬

సత్య మేకపదం బ్రహ్మ సత్యే ధర్మః ప్రతిష్ఠితః,
సత్యమేవాక్షయా వేదా స్సత్యేనైవాప్యతే పరమ్. ౭

సత్యం సమనువర్తస్వ యది ధర్మే ధృతా మతిః,
సఫల స్స వరో మేఽస్తు వరదో హ్యసి సత్తమ. ౮

## పదునాలవసర్గము

పాపిష్ఠురాలయిన యా కైకేయి పుత్రదుఃఖమునఁ బీడింపఁబడినవాఁడై మైమఱచి నేలఁబడిపొరలుచున్న దశరథమహారాజుఁజూచి యిట్లని చెప్పెను.

నీవు నాకు వరంబిచ్చెదనని ప్రతిజ్ఞచేసి ప్రతిజ్ఞతప్పుటచే నధర్మంబునే యాచరించి యిట్లు దుఃఖితుఁడవై నేలంబరుండియున్నావు. దీన నేమియుఁ బ్రయోజనంబు లేదు. నీవు సత్యంబు పరిపాలించుట యను మర్యాద నవలంబింపుము. 2

ధర్మము నెఱిఁగిన పెద్దలు "సత్యంబే పరమధర్మం" బని చెప్పుచుందురుగదా! నేను సత్యరూపంబగు పరమధర్మము నవలంబించియే వరం బిమ్మని నిన్నడిగినాను. 3

దశరథమహారాజా! మున్ను శైబ్యుఁడనురాజు ప్రతిజ్ఞచేసి దానిప్రకారము పక్షియైన డేగకొఱకుఁ దనదేహముఁ గోసియిచ్చి యుత్తమలోకంబుఁ బొందెను. 4

అట్లు మహాప్రభావుఁడగు నలర్కుఁడు తననేత్రంబుల వేదపారగుండగు నొకబ్రాహ్మణుఁడు యాచింపఁగా నెంతమాత్రమును మనంబునఁ దుఃఖంబునొందక దననేత్రంబులఁ బెఱికి ఆ బ్రాహ్మణున కిచ్చెను. 5

నదులకన్నిటికిని బ్రభువయిన సముద్రుఁడును సత్యంబు ననుసరించియే తనకు వృద్ధికలుగుకాలంబులందును మిక్కిలియుఁ జిన్నదైనచెలియలికట్టను దాఁటకున్నాఁడు. 6

సత్యమే పరమప్రాప్యంబును ఓంకారరూపంబునగు బ్రహ్మము; సత్యమునందే ధర్మమంతయుఁ బ్రతిష్ఠింపఁబడియున్నది; నిత్యములగు వేదములన్నియు సత్యమే ప్రధానమని చెప్పుచున్నవి. సత్యమున్నచో పరమపురుషార్థంబగు మోక్షము నొందవచ్చును. 7

నీవు అందఱిలోను శ్రేష్ఠుఁడవని విఖ్యాతికెక్కినవాఁడవు. నీకు ధర్మమునందు బుద్ధిస్థిరంబుననుండు నేని సత్యంబునకన్నసధికంబగు నొండుధర్మం

ధర్మ స్యై వాభికామార్థం మమ చైవాభిచోదనాత్,
ప్రవ్రాజయ సుతం రామం త్రిః ఖలు త్వాం బ్రవీ మ్యహమ్.
సమయం చ మమార్యేమం యది త్వం న కరిష్యసి,
అగ్రత స్తే పరిత్యక్తా పరిత్యక్ష్యామి జీవితమ్. ౧౦

ఏవం ప్రచోదితో రాజా కైకేయ్యా నిర్విశఙ్కయా,
నాశకత్పాశ మున్మోక్తుం బలి రిన్ద్రకృతం యథా. ౧౧

ఉద్భ్రాన్తహృదయ శ్చాపి వివర్ణవదనోఽభవత్,
స ధుర్యో వై పరిస్పన్ద న్యుగచక్రాన్తరం యథా. ౧౨

విహ్వలాభ్యాం చ నేత్రాభ్యా మపశ్యన్నివ భూమిపతిః,
కృచ్ఛ్రాద్ధైర్యేణ సంస్తభ్య కైకేయీ మిద మబ్రవీత్. ౧౩

య స్తే మన్త్రకృతః పాణి రగ్నౌ పాపే! మయా ధృతః,
తం త్యజామి స్వజం చైవ తవ పుత్రం సహ త్వయా. ౧౪

ప్రయాతా రజనీ దేవి సూర్యస్యోదయనం ప్రతి,

బులేదు కావున సత్యంబు ననుసరింపుము; నేను గోరినవరంబు సఫలముగాఁ జేయుము; నీవందఱికిని వరంబుల నిచ్చువాఁడవు గదా! ౮

ఇప్పుడు ధర్మంబు సిద్ధించుటకొఱకును నేను ప్రేరించుటవలనను నీ కొడుకును రాము నడవికిఁబంపుము: నేను నీకు ముమ్మాఱులు చెప్పుచున్నాను. ౯

పూజ్యుఁడవగుదశరథుఁడా! నీవు నేనుగోరినట్లు రామునడవికిఁ బంపకుండుకొని నేను నీచే నిట్లు విడువఁబడినదాననై జీవింపఁజాలను; నీయెదుటనే ప్రాణంబులు విడిచెదను. అని కైకేయి దశరథునితోఁ జెప్పెను. ౧౦

దశరథమహారా జిట్లు కైకేయి నిర్భయంబుగాఁ జెప్పినమాటలువిని బలిచక్రవర్తి వామనునకు మూఁడడుగులనేలయిచ్చెదనని మొదటజెప్పి యాపిమ్మట నది విపరీతమయినను సత్యపాశమును వదలించుకొనఁజాలనట్లు ముందు కైకేయి కిచ్చెదనని ప్రతిజ్ఞజేసినవాఁడు కావున సత్యపాశమును విడిపించుకొనఁజాలడయ్యె. ౧౧

ఆ దశరథుండు "కైకేయి కిచ్చెద" నని చెప్పినసత్యవాక్యంబు దప్పుటకును ప్రియకుమారుఁడగు రాముని వనంబునకుఁ బంపుటకునుఁ జాలక బండి కాఁడికిని చక్రంబునకును నడుమఁ గట్టబడియుండు వృషభముభంగి తిరుగుడు పడుచున్న హృదయంబుతోను దుఃఖంబున వెల్లఁబాఱినముఖంబుతోను మిన్నకుండెను. ౧౨

దుఃఖంబునఁ గలంకఁబాఱినకండ్లతో నంధుండుఁబోలె నున్నదశరథమహారాజును కష్టంబున దుఃఖంబు నడఁచుకొని కైకేయిఁజూచి యిట్లని చెప్పెను. ౧౩

పాపిష్ఠురాలవగు కైకేయీ! నే నగ్నిసమీపంబున మంత్రపురస్సరంబుగా గ్రహించిన నీహస్తంబు నిప్పుడు విడిచెదను. ఇంక నీవు నాకు భార్యవు కావు. నే నింక నీకు భర్తనుగాను. అట్లు నాకుఁ బుట్టిననీకొడుకునుగూడ నీతోఁగూడ విడిచెదను. ౧౪

కైకేయీ! రాత్రి పోయినది; ఇంక సూర్యోదయమయిన పిమ్మటనే

అభిషేకం గురుజన స్త్వరయిష్యతి మాం ధ్రువమ్. ౧౫
రామాభిషేకసమ్భారై స్తదర్థ ముపకల్పితైః,
రామః కారయితవ్యో మే మృతస్య సలిలక్రియామ్. ౧౬

త్వయా సపుత్రయా నైవ కర్తవ్యా సలిలక్రియా,
వ్యాహన్తాఽస్యశుభాచారే! యది రామాభిషేచనమ్. ౧౭

నచ శక్తోఽ స్మ్యహం ద్రష్టుం దృష్ట్వా పూర్వం తథా సుఖమ్,
హతహర్షం నిరానన్దం పున ర్జన మవాఙ్ముఖమ్. ౧౮

తాం తథా బ్రువత స్తస్య భూమిపస్య మహాత్మనః,
ప్రభాతా శర్వరీ పుణ్యా చన్ద్రనక్షత్రశాలినీ. ౧౯

తతః పాపసమాచారా కైకేయీ పార్థివం పునః,
ఉవాచ పరుషం వాక్యం వాక్యజ్ఞా రోషమూర్ఛితా. ౨౦

కి మిదం భాషసే రాజ! న్వాక్యం గరరుజోపమమ్,
ఆనాయయితు మక్లిష్టం పుత్రం రామ మి హార్హసి. ౨౧
స్థాప్య రాజ్యే మమ సుతం కృత్వా రామం వనేచరమ్,
నిస్సపత్నాం చ మాం కృత్వా కృతకృత్యో భవిష్యసి. ౨౨

స నున్న ఇవ తీక్ష్ణేన ప్రతోదేన హయోత్తమః,
రాజా ప్రచోదితోఽభీక్ష్ణం కైకేయీ మిద మబ్రవీత్. ౨౩

గురువులు రామాభిషేకద్రవ్యంబులతో వచ్చి రామాభిషేకము నుజేయుమని నన్ను దొందరపఱతురు; ఇది నిశ్చయము. ౧౫

రామాభిషేకము విఘ్నమెందునేని నాప్రాణంబుపోవును. కావున నప్పుడు నాకు రామునిచేతనే యుత్తరక్రియలు చేయింపవలయును. ౧౬

అమంగళములు సేయునట్టి కైకేయీ! నీవు రామునిపట్టాభిషేకమునకు విఘ్నముసేయుదువేని నీవుగాని నీకొడుకు గాని మృతుడవగు నాకు సలిల క్రియ యొంతమాత్రము చేయఁగూడదు. ౧౭

నేను మును పు "రామాభిషేకము చేసెద" నని చెప్పినప్పుడు అట్లు సంతోషము నొందియున్న జనులను జూచి యిప్పుడు రాముఁ డడవికిఁ బోవు నని వినినందున సంతోషంబులేక దుఃఖంబునఁ దలవంచియుండుజనులఁ జూడఁ జాలను అని దశరథుఁడు కైకేయితోఁ జెప్పెను. ౧౮

మహాత్ముఁడగు నాదశరథమహారాజు అట్లు కైకేయితోఁ జెప్పుచుండఁ గానే చంద్రునిచేతను నక్షత్రములచేతను శోభిల్లుచున్నరాత్రి గడచి తెల్ల వాఱినది. ౧౯

అంతఁ బాపిష్ఠురాలును మాటలు చెప్ప నేర్చినదియు నగుకైకేయి మిక్కి లియుఁ గోపంబునొంది మఱల దశరథమహారాజుం జూచి పరుషంబులగు మాటల నిట్లని చెప్పెను. ౨౦

దశరథమహారాజా! మహావ్యాధితో సరియయిన యీపరుషంపుమాట నేల పల్కెదవు? దుఃఖంబువిడిచి నీకొడుకు రాము నిచ్చటికి రావింపుము.

నాకొడుకైన భరతునకు రాజ్యంబొసంగి రాము నడవికిఁ బంపి నాకు శత్రువులు లేకుండునట్లుచేసి యిట్లు సత్యవ్రతంబు సాధించినవాఁడవు కావునఁ గృతకృత్యుఁడవు కాఁగలవు. ౨౨

ఆ దశరథమహారాజు చుఱుకైనమునికోలచే పోటులయినగుఱ్ఱము కొట్టఁ బడినట్లు కైకేయిచేఁ బలుమాఱు కఠినోక్తులఁ బలుకఁబడి కైకేయింజూచి యిట్లని చెప్పెను. ౨౩

ధర్మబన్ధేన బద్ధోఽస్మి నష్టాచ మమ చేతనా,
జ్యేష్ఠం పుత్రం ప్రియం రామం ద్రష్టు మిచ్ఛామి ధార్మికమ్.

తతః ప్రభాతాం రజనీ ముదితే చ దివాకరే,
పుణ్యే నక్షత్రయోగే చ ముహూర్తేచ సమాహితే. ౨౫
వసిష్ఠో గుణసమ్పన్న శ్శిష్యైః పరివృత స్తదా,
ఉపగృహ్యాశు సంభారా న్ప్రవివేశ పురోత్తమమ్. ౨౬

సిక్తసమ్మార్జితపథాం పతాకోత్తమభూషితామ్,
విచిత్రకుసుమాకీర్ణాం నానాస్రగ్భి ర్విరాజితామ్. ౨౭
సంహృష్టమనుజోపేతాం సమృద్ధవిపణాపణామ్,
మహోత్సవసమాకీర్ణాం రాఘవార్థే సముత్సుకామ్. ౨౮
చన్దనాగరుధూపైశ్చ సర్వతః ప్రతిధూపితామ్,
తాం పురీం సమతిక్రమ్య పురన్దరపురోపమామ్. ౨౯
దదర్శాన్తఃపురం శ్రేష్ఠం నానాద్విజగణాయుతమ్,
పౌరజానపదాకీర్ణం బ్రాహ్మణై రుపశోభితమ్. ౩౦
యజ్ఞవిద్భి స్సుసంపూర్ణం సదస్యైః పరమద్విజైః,
తదన్తఃపుర మాసాద్య వ్యతిచక్రామ తం జనమ్. ౩౧
వసిష్ఠః పరమప్రీతః పరమర్షి ర్వివేశ చ,
స త్వపశ్య ద్వినిష్క్రాన్తం సుమన్త్రం నామ సారథిమ్. ౩౨
ద్వారే మనుజసింహస్య సచివం ప్రియదర్శనమ్,

త మువాచ మహాతేజా స్సూతపుత్రం విశారదమ్. ౩౩
వసిష్ఠః క్షిప్ర మాచక్ష్వ నృపతే ర్మా మి హాగతమ్,

నేను ధర్మపాశంబుచే బద్ధుఁడనైతి; నాబుద్ధియును నశించినది; ధార్మికుఁడును బ్రియుఁడునగు నాజ్యేష్ఠపుత్రుఁడైన రామునిఁ జూడఁగోరుచున్నాను. అని దశరథుండు కైకేయితోఁ జెప్పెను. ౨౭

అంతఁ దెల్లవాఱఁగానే సూర్యుఁడుదయించిన పిమ్మట పట్టాభిషేకంబునకు నిశ్చయింపఁబడిన పుష్యయోగముహూర్తంబు సమీపింపఁగానే యప్పుడు గుణవంతుఁడగు వసిష్ఠుఁడు శిష్యులంగూడి సరయూనదియందుస్నానము చేసినవాఁడై శీఘ్రముగాఁ బట్టాభిషేకద్రవ్యములఁ దీసికొని యయోధ్యాపట్టణంబులోనికిం బోయెను. ౨౮

ఆ వసిష్ఠుఁడు తడుపఁబడి చిమ్మఁబడియుండు మార్గంబులు గలిగియుత్తమధ్వజంబుల నలంకరింపఁబడి నానావిధపుష్పంబులను నానావిధపుష్పమాలికలను దేజరిల్లుచు సంతోషంబు నొందియున్న మనుష్యులతోఁగూడి విక్రయపదార్థంబులనిండియున్న యంగళ్లతోఁగూడి మహోత్సవంబుల నొప్పుచు రాముని పట్టాభిషేకము విషయమై చాల నుత్సాహముగలజనులతోఁగూడి యంతటను చందనాగరుధూపంబుల గుబాళించుచు దేవేంద్రుని పట్టణంబుతో సాటియగుచున్న యాయయోధ్యాపట్టణం బతిక్రమించి నానావిధపక్షులతో నొప్పుచుఁ బురజనులతోను గ్రామ్యజనులతోను బ్రాహ్మణులతోను మఱియు యాగవేత్తలు సభికులు నైన యుత్తమబ్రాహ్మణులతోను గూడియున్న దశరథునియంతఃపురంబుఁ జూచెను. ౨౯-౩౦

మహర్షియగు వసిష్ఠుఁడు ఆ యంతఃపురంబునొద్దకుఁబోయి, అచ్చటనుండు పౌరులు మున్నగుజనుల నతిక్రమించి లోనికిఁ బ్రవేశించెను. ౩౧

ఆ వసిష్ఠుఁ డప్పుడే యింటినుండివచ్చి యచ్చట ద్వారంబుననున్న మనుష్యశ్రేష్ఠుఁడగు దశరథునిమంత్రియుఁ జూపరులకు సంతోషంబు గల్గించువాఁడునగు సుమంత్రుఁడనుసారథిం జూచెను. ౩౨

మహాప్రభావుఁడగు వసిష్ఠుఁడు సారథిపుత్రుఁడగు నాసుమంత్రుఁ జూచి నేనిచ్చటికి వచ్చియున్నాను. అని దశరథమహారాజునకు శీఘ్రంబుగాఁ జెప్పుము అని చెప్పెను. ౩౩

ఇమే గఙ్గోదకఘటాః సాగరేభ్యశ్చ కాఞ్చనాః. 34

ఔదుమ్బరం భద్రపీఠ మభిషేకార్థ మాహృతమ్,

సర్వబీజాని గన్ధాశ్చ రత్నాని వివిధాని చ. 35

క్షౌద్రం దధి ఘృతం లాజా దర్భాస్సుమనసః పయః,
అష్టౌ చ కన్యా రుచిరా మత్తశ్చ వరవారణః. 36

చతురశ్వో రథ శ్శ్రీమా న్నిస్త్రింశో ధను రుత్తమమ్,
వాహానం నరసంయుక్తం ఛత్రం చ శశిసన్నిభమ్. 37

శ్వేతేచ వాలవ్యజనే భృఙ్గారుశ్చ హిరణ్మయః,
హేమదామపినద్ధ శ్చ కకుద్మా న్పాణ్డురో వృషః. 38

కేసరీ చ చతుర్దంష్ట్రో హరిశ్రేష్ఠో మహాబలః,

సింహాసనం వ్యాఘ్రతను స్సమిద్ధశ్చ హుతాశనః. 39

సర్వవాదిత్రసఙ్ఘాశ్చ వేశ్యాశ్చాలఙ్కృతా స్త్రియః,

ఆచార్యా బ్రాహ్మణా గావః పుణ్యాశ్చ మృగపక్షిణః. 40

గంగానదియుదకంబుతో నిండియుండు నీకాంచనఘటంబులును, సముద్రజలంబుతో నిండిన యీబంగారుకలశములును రామునియభిషేకమునకై తేఁబడినవి. ౩౪

మేడికొయ్యతోఁ జేసిన రాజయోగ్యం బగుపీఠంబును రామునిపట్టాభిషేకంబునకై తేఁబడినది.

అట్లు సమస్తధాన్యంబులును నానావిధంబులయిన మణులును దేఁబడియున్నవి. ౩౫

తేనెయుఁ బెరుఁగును నేయియును పేలాలును దర్భలును బువ్వలును పాలును మఱియు మనోహరవేషలగు నెనిమిదిమందికన్నియలును శుభలక్షణంబులతోఁగూడిన మత్తగజంబును దెప్పించియున్నాను. ౩౬

మఱియుఁ గాంతిసంపన్నంబయిన నాలుగు గుఱ్ఱములరథంబును ఖడ్గంబును ఉత్తమంబగుధనుస్సును మోసెడువాండ్రతోఁగూడిన పల్లకియును చంద్రుండుంబోలెఁ దెల్లగానుండు ఛత్రంబును దేఁబడియున్నవి. ౩౭

తెల్లనిచామరంబులు రెండును బంగారుగిండిపాత్రయును బంగారుపగ్గములతోఁ గట్టఁబడినదియుఁ బెద్దమూఁపురము గలదియునగు తెల్లనివృషభమును దేఁబడియున్నవి. ౩౮

మెడయందు మేలయినవెండ్రుకలుగలదియు నాలుగుపండ్లు మెఱిచినదియు మహాబలంబు నుత్తమంబునగు గుఱ్ఱమును దేఁబడియున్నది.

సింహాసనంబును, పెద్దపులిచర్మంబును, అగ్నిహోత్రంబును సిద్ధములయియున్నవి. ౩౯

సమస్తవాద్యములును దేఁబడియున్నవి; వేశ్యలును అలంకృతలయిన యితరస్త్రీలును దేఁబడియున్నారు.

ఆచార్యులును బ్రాహ్మణులును వచ్చియున్నారు; ఆవులును మఱియు నితరములయిన పుణ్యములగుమృగములును బక్షులును దేఁబడియున్నవి. ౪౦

పౌరజానపదశ్రేష్ఠా నైగమా శ్చ గణై స్సహ,

ఏతే చాన్యే చ బహవః ప్రీయమాణాః ప్రియంవదాః. ౪౧
అభిషేకాయ రామస్య సహా తిష్ఠన్తి పార్థివైః,

త్వరయస్వ మహారాజం యథా సముదితేఽహని. ౪౨
పుణ్యే నక్షత్రయోగే చ రామో రాజ్య మవాప్నుయాత్,

ఇతి తస్య వచ శ్శ్రుత్వా సూతపుత్రో మహాత్మనః. ౪౩
స్తున న్నృపతిశార్దూలం ప్రవివేశ నివేశనమ్,
తంతు పూర్వోదితం వృద్ధం ద్వారస్థా రాజసమ్మతమ్. ౪౪
న శేకు రభిసంరోద్ధుం రాజ్ఞః ప్రియచికీర్షవః,

స సమీపస్థితో రాజ్ఞ స్తా మవస్థా మజజ్ఞివాన్. ౪౫
వాగ్భిః పరమతుష్టాభి రభిష్టోతుం ప్రచక్రమే,

తత స్సూతో యథాకాలంపార్థివస్య నివేశనే. ౪౬
సుమన్త్రః ప్రాఞ్జలి ర్భూత్వా తుష్టావ జగతీపతిమ్,

యథా నన్దతి తేజస్వీ సాగరో భాస్కరోదయే. ౪౭
ప్రీతః ప్రీతేన మనసా తథాఽఽనన్దఘున స్స్వతః,
ఇన్ద్ర మస్యాం తు వేళాయా మభితుష్టావ మాతలిః. ౪౮
సోఽజయ ద్దానవాన్సర్వాం స్తథా త్వాం బోధయామ్యహమ్,

పట్టణవాసులలో గ్రామంబుల నుండుజనులలోను మేటియగువారును వర్తకులును ఆయావీథిలోనుండు సమూహములవారును వచ్చియున్నారు

ఇప్పుడు చెప్పఁబడినవారును ఇంక ప్రియంబగుమాటనుమాత్రమే చెప్పువారనేకులువచ్చుచున్నవారు ఈ రాజులును రాముని యభిషేకంబు నిరీక్షించుచున్నారు. ౪౧

శ్రేయస్కరంబగు దినంబునందుఁ బుణ్యంబగు పుష్యనక్షత్రంబున రాముఁడు పట్టాభిషిక్తుఁడగునట్లు దశరథమహారాజును వేగిరపడునట్లు చేయుము. అని వసిష్ఠుఁడు సుమంత్రునితోఁ జెప్పెను. ౪౨

సుమంత్రుఁడు మహాత్ముఁడగు వసిష్ఠుఁడు చెప్పినమాటవిని రాజశ్రేష్ఠుఁడగుదశరథునిఁ బొగడుచు నంతఃపురంబుఁ బ్రవేశించెను. ౪౩

ద్వారపాలకులు దశరథునకుఁ బ్రియంబుసేయువారలు కావున మున్ను "ఈసుమంత్రుఁడు లోనికివచ్చునపుడు వీని నడ్డగింపవలదు. యథేచ్ఛముగా విడువుఁడు" అని దశరథుఁ డాజ్ఞాపించి యుండుటవలన రాజసమ్మతుఁడును వృద్ధుఁడునగు నాసుమంత్రుఁడు లోనికిం జొరఁబోవఁగా నతని నిరోధింపరైరి. ౪౪

ఆసుమంత్రుఁడు రాజసమీపంబునకుఁబోయి దశరథమహారాజట్టి దురవస్థం బొందియుండుట నెఱుంగఁడు. కావున మిక్కిలియుం సంతోషము గల్గించునట్టివాక్యంబుల దశరథుఁ బొగడెను. ౪౫

అంత సారథియగు సుమంత్రుఁడు దశరథమహారాజుగృహంబునఁ గాలంబు నతిక్రమింపక చేతులు మోడ్చికొని దశరథమహారాజు నిట్లని ప్రస్తుతించెను. ౪౬

తేజస్వియగు సముద్రుఁడు ఎట్లు చంద్రోదయంబున సంతోషంబు నొందునో అట్లు నీవు నిప్పుడు సంతోషంబునొందుము. ౪౭

ఈకాలమునందే మాతలి యింద్రునిఁ బొగడెను; ఆ యింద్రుఁడు సమస్తదానవులను జయించెను; అట్లు అట్టికాలంబుననే నేను నిన్నుఁబొగడి మేలుకొల్పెదను; నీవును అట్లు సమస్తశత్రువులను జయింపఁగలవు. ౪౮

వేదా స్సహాఙ్గవిద్యాశ్చ యథా హ్యాత్మభువం విభుమ్. ౪౯
బ్రహ్మాణం బోధయ న్త్యద్య తథా త్వాం బోధయా మ్యహమ్,
ఆదిత్య స్సహ చన్ద్రేణ యథా భూతధరాం శుభామ్. ౫౦
బోధయత్యద్య పృథివీం తథా త్వాం బోధ యా మ్యహమ్,

ఉ త్తిష్ఠాశు మహారాజ! కృతకౌతుక మఙ్గళః. ౫౧
విరాజమానో వపుషా మేరో రివ దివాకరః,

సోమసూర్యౌ చ కాకుత్స్థ! శివవైశ్రవణావపి. ౫౨
వరుణ శ్చాగ్ని రిన్ద్ర శ్చ విజయం ప్రదిశన్తు తే,

గతా భగవతీ రాత్రిః కృతం కృత్య మిదం తవ. ౫౩
బుధ్యస్వ నరశార్దూల! కురు కార్య మన న్తరమ్,

ఉదతిష్ఠత రామస్య సమగ్ర మభిషేచనమ్. ౫౪

పౌరజానపదై శ్చాపి నైగమై శ్చ కృతాఞ్జలిః,
స్వయం వసిష్ఠో భగవా న్బ్రాహ్మణై స్సహ తిష్ఠతి. ౫౫
క్షిప్ర మాజ్ఞాప్యతాం రాజ! న్రాఘవ స్యాభిషేచనమ్,

యథా హ్యపాలాః పశవో యథా సేనా హ్యనాయకా. ౫౬
యథా చన్ద్రం వినా రాత్రి ర్యథా గావో వినా వృషమ్,
ఏవం హి భవితా రాష్ట్రం యత్ర రాజా న దృశ్యతే. ౫౭

ఇతి తస్య వచ శ్శ్రుత్వా సా న్త్వపూర్వ మివార్థవత్,
అభ్యకీర్యత శోకేన భూయ ఏవ మహీపతిః. ౫౮

శిక్ష మొదలగు సంగవిద్యలతోఁ గూడిన వేదంబులును సర్వేశ్వరుఁడు నగు బ్రహ్మదేవుని బోధించునట్లు నేనిప్పుడు నిన్ను మేలుకొల్పుచున్నాను. ౯

సూర్యుఁడును చంద్రుఁడును సమస్తప్రాణుల ధరించుచున్నదియు మంగళస్వరూపిణియునగు భూమిని ఉదయాస్తమయంబుల మేలుకొల్పినట్లు నే నిప్పుడు నిన్ను మేలుకొలుపుచున్నాను. ౧౦

దశరథమహారాజా! నీవు ఉత్సవార్థము మంగళాలంకారంబులు చేసికొని సౌందర్యంబునఁ బ్రకాశించుచు, మేరుపర్వతమునుండి సూర్యుఁ డుదయించునట్లు శీఘ్రంబున లెమ్ము. ౧౧

దశరథమహారాజా! నీకుఁ జంద్రుఁడును సూర్యుఁడును శివుఁడును కుబేరుఁడును వరుణుఁడును అగ్నిదేవుఁడును దేవేంద్రుఁడును విజయంబు నొసంగుదురుగాక. ౧౨

భగవతియయిన రాత్రి గడచినది; ఈరాత్రి కాలంబునందుఁ జేయవలసినకార్యంబులు నెఱవేర్చినావు. రాజశ్రేష్ఠుఁడవగు దశరథుఁడా! మేలుకొని యవ్వలికార్యంబులం జేయుము. ౧౩

రామునియభిషేకంబునకుఁ గావలసినద్రవ్యములన్నియు సిద్ధములయియున్నవి. ౧౪

భగవంతుఁడగు వసిష్ఠుఁడును, పౌరజనులును గ్రామ్యజనులును వర్తకులునుఁ గొలువఁగా బ్రాహ్మణులతోఁ గూడఁ గాచుకొనియున్నాఁడు. ౧౫

దశరథమహారాజా! రామునకుఁ బట్టాభిషేకంబు సేయునట్లు శీఘ్రంబుగా నాజ్ఞాపింపుము.

గొల్లవాఁడులేనిపశువులును నాయకుఁడులేనిసేనయును చంద్రుఁడులేనిరాత్రియును ఆఁబోతులేనియావులును కాంతిచెడియుండునట్లు రాజు ఏరాజ్యంబున జనుల కగపడకుండునో ఆ రాజ్యంబును చెడిపోవును. కావున నీవు శీఘ్రంబుగా రమ్ము. అని సుమంత్రుఁడు దశరథునికిఁ బొగడెను. ౧౬,౧౭

దశరథమహారాజు ఆసుమంత్రుఁడు సానుపూర్వంబుగా సార్థకంబుగాఁ జెప్పినమాటలను విని మనఃకలికిన్న నధికమయిన దుఃఖము నొందెను.

తత స్స రాజా తం సూతం సన్నహర్ష స్సుతం ప్రతి,
శోక రక్తేక్షణ శ్శ్రీమా నుద్వీక్ష్యోవాచ ధార్మికః. ౫౯

వాక్యై స్తు ఖలు మర్మాణి మమ భూయో నికృన్తసి,

సుమన్త్రః కరుణం శ్రుత్వా దృష్ట్వా దీనం చ పార్థివమ్. ౬౦
ప్రగృహీతాఞ్జలిః కించి త్తస్మా ద్దేశా దపాక్రమత్,

యదా వక్తుం స్వయం దైన్యాన్న శశాక మహీపతిః. ౬౧
తదా సుమన్త్రం మన్త్రజ్ఞా కైకేయీ ప్రత్యువాచ హ,

సుమన్త్ర! రాజా రజనీం రామహర్షసముత్సుకః. ౬౨
ప్రజాగరపరిశ్రాన్తో నిద్రాయా వశ మేయివాన్,

త ద్గచ్ఛ త్వరితం సూత! రాజపుత్రం యశస్వినమ్. ౬౩
రామ మానయ భద్రం తే నాత్ర కార్యా విచారణా,

స మన్యమానః కల్యాణం హృదయేన ననన్ద చ. ౬౪

నిర్జగామ చ సంప్రీత్యా త్వరితో రాజశాసనాత్,

సుమన్త్ర శ్చిన్తయామాస త్వరితం చోదిత స్తయా. ౬౫

అంతఁ బుత్రదుఃఖంబున సంతోషంబులేకున్న శ్రీమంతుఁడు ధార్మికుండునగు దశరథమహారాజు రోదనంబున నెఱ్ఱనైన నేత్రంబులతో సారథియగు సుమంత్రునిఁజూచి యిట్లని చెప్పెను. ౫౯

నేను కైకేయిమాటలచేఁ జాలదుఃఖితుఁడనై యుండునపుడు దుఃఖకాలంబుల ననుచితంబులయి యీస్తుతివాక్యంబులు చెప్పుటచే నాకు ఇనుమడిదుఃఖంబు గలుగుచున్నది. అని దశరథుఁడు సుమంత్రునితోఁ జెప్పెను.

సుమంత్రుఁడు వినువారికిని దుఃఖముంగల్గించునట్టి యీదశరథునిమాటను విని దశరథుఁడు చాల దుఃఖితుఁడై యుండుటఁజూచి భయపడి చేతులు మొగిడ్చి కొంతదూరముగాఁ దొలంగిపోయెను. ౬౦

దశరథమహారాజు దుఃఖంబున "రామునిఁదోడ్కొనిరమ్ము" అనితాను జెప్పఁజాలక పోయినందున ఆలోచనలు నేర్చినకైకేయి సుమంత్రుఁజూచి బదులుచెప్పెను. ౬౧

సుమంత్రుఁడా! దశరథమహారాజు రామపట్టాభిషేకంబునుగుఱించిన సంతోషంబునఁజేసి రాత్రియంతయుం మేలుకొనియుండి యలసి యిప్పుడు నిద్రకు లోఁబడియున్నాఁడు. ౬౨

సుమంత్రుఁడా! అట్లుకావున నీవు శీఘ్రంబుగాఁబోయి రాజకుమారుఁడును ప్రశస్తంబగుకీర్తిగలవాఁడు నగురాముని నిటకుఁ దోడ్కొనిరమ్ము; నీకు మంగళమగుఁగాక; ఈవిషయమునం దాలోచింపవలదు. అని కైకేయి సుమంత్రునితోఁజెప్పెను. ౬౩

ఆ సుమంత్రుఁడు "ఇఁక మంగళంబగు" ననితలంచి మనంబున సంతోషంబునొందెను. ౬౪

ఆసుమంత్రుఁడు కైకేయి చెప్పినది దశరథునకు సమ్మతంబని తలఁచి సంతోషంబునొంది వేగంబుగా వెడలిపోయెను.

సుమంత్రుఁడు ఆకైకెయి వేగంబుగాఁజెప్పిన మాటనువిని యిట్లని మనంబునఁ జింతించెను. ౬౫

వ్యక్తం రామోఽభిషేకార్థ మిహాఽయాస్యతి ధర్మవిత్,

ఇతి సూతో మతిం కృత్వా హర్షేణ మహతాఽఽవృతః. ౬౬
నిర్జగామ మహాబాహో రాఘవస్య దిదృక్షయా,
సాగరహ్రదసఙ్కాశా త్సుమన్త్రోఽన్తఃపురా చ్ఛుభాత్. ౬౭
నిష్క్రమ్య జనసంబాధం దదర్శ ద్వార మగ్రతః,

తతః పురస్తా త్సహసా వినిర్గతో
మహీపతీ న్ద్వారగతో విలోకయన్. ౬౮
దదర్శ పౌరా న్వివిధా న్మహాధనా
నుపస్థితా న్ద్వార ముపేత్య విష్ఠితాన్.

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే చతుర్దశస్సర్గః

---

## పఞ్చదశస్సర్గః

తే తు తాం రజనీ ముష్య బ్రాహ్మణా వేదపారగాః,
ఉపతస్థు రుపస్థానం సహ రాజపురోహితాః. ౧
అమాత్యా బలముఖ్యాశ్చ ముఖ్యా యే నిగమస్య చ,
రాఘవస్యాభిషేకార్థే ప్రీయమాణా స్తు సంగతాః. ౨

ఉదితే విమలే సూర్యే పుష్యే చాభ్యాగతేఽహని,
లగ్నే కర్కటకే ప్రాప్తే జన్మ రామస్య చ స్థితే. 3
అభిషేకాయ రామస్య ద్విజేన్ద్రై రుపకల్పితమ్,

రాముఁడు పట్టాభిషేకంబునకై యే యిచ్చటికి రాఁబోవుచున్నాఁడు; ఇఁక రామునకుఁ బట్టాభిషేకంబగును; ఇది స్పష్టము. అని సుమంత్రుఁడు చింతించెను.

సుమంత్రుఁ డిట్లు చింతించి అధిక మయినసంతోషంబు నొంది మహాబాహుఁడగు రామునిఁ జూడఁగోరి వెడలిపోయెను. ౬౯

సుమంత్రుఁడు గొప్పపట్టణంబగునయోధ్యామధ్యమునను౦టఁ జేసి సముద్రమునడుమనుండు ప్రాదంబుచాడ్పున నొప్పుచుండు నంతఃపురంబునుంచి వెడలి ముందట ఎచ్చుజనులు చేరియుండుటవలన నిబిడముగానుండు నంతఃపుర ద్వారంబును చూచెను. ౭౨

అంత నాసుమంత్రుఁడు, శీఘ్రంబున నంతఃపురంబు వెడలి ద్వారంబుఁ జేరి అచ్చట నగరప్రదేశమునందున్న రాజులనుజూచి యంత కానుకలు దీసికొని గుంపులుచేరి ద్వారమునందున్న నానావిధులగు పట్టణవాసిజనులను జూచెను. ౭౦

ఇది పదునాలవసర్గము.

---

## ప దు నై ద వ స ర్గ ము

వేదవేత్తలగు నాబ్రాహ్మణులందఱును రాత్రి యంతయుం నచ్చటనుండి అంత వసిష్ఠునిఁగూడి సభఁగాఁ జేరిరి. ౧

మఱియుం మంత్రులును సేనలోముఖ్యాధికారులగువారును బట్టణంబున ముఖ్యులయియుండువారును రామునిపట్టాభిషేకంబుఁజూచుటకై సంతోషంబున నచ్చటికి వచ్చిరి. ౨

నిర్మలుఁడగు సూర్యుఁ డుదయించినపిమ్మటఁ బుష్యనక్షత్రంబునందు రామునిజన్మలగ్నంబయిన కర్కాటలగ్నంబురాఁగానే రామునకుఁ బట్టాభిషేకముసేయుటకై కావలసినద్రవ్యంబులన్నియుం బ్రాహ్మణోత్తములు సిద్ధములు చేసిరి. ౩

కాఞ్చనా జలకుంభా శ్చ భద్రపీఠం స్వలఙ్కృతమ్. ౪
రథ శ్చ సమ్య గా స్తీర్ణో భాస్వతా వ్యాఘ్రచర్మణా,

గఙ్గాయమునయోః పుణ్యా త్సంగమా దాహృతం జలమ్. ౫
యా శ్చాన్యా స్సరితః పుణ్యా హ్రదాః కూపా స్సరాంసి చ,

ప్రాగ్వాహా శ్చోర్ధ్వవాహాశ్చ తిర్యగ్వాహా స్సమాహితాః. ౬
తాభ్య శ్చై వాహృతం తోయం సముద్రేభ్య శ్చ సర్వశః,

సలాజాః క్షీరిభి శ్ఛన్నా ఘటాః కాఞ్చనరాజతాః. ౭
పద్మోత్పలయుతా భాన్తి పూర్ణాః పరమవారిణా,

క్షౌద్రం దధి ఘృతం లాజా దర్భా స్సుమనసః పయః. ౮

వేశ్యాశ్చైవ శుభాచారా స్సర్వాభరణభూషితాః,

చన్ద్రాంశువికచప్రఖ్యం కాఞ్చనం రత్నభూషితమ్. ౯
సజ్జం తిష్ఠతి రామస్య వాలవ్యజన ముత్తమమ్,

చన్ద్రమణ్డలసఙ్కాశ మాతపత్రంచ పాణ్డురమ్. ౧౦
సజ్జం ద్యుతికరం శ్రీమ దభిషేకపురస్కృతమ్,

నీళ్లతో నిండిన బంగారుకలశంబులును చక్కఁగా నలంకరింపఁబడిన రాజులుఁ గూర్చుండుపీఠంబును ప్రకాశించుచున్న పులితోలుతోఁ గప్పఁబడిన రథంబులును సిద్ధములయి ప్రకాశించుచుండినవి. ౪

గంగానదియుం యమునానదియుం సంగమము నొందు పుణ్యస్థలమునుండియుం, పవిత్రములయిన యితరనదులనుండియుం హ్రదంబులనుండియుఁ గూపంబులనుండియుం సరస్సులనుండియుఁ దేఁబడిన పుణ్యజలంబును సిద్ధమయి ప్రకాశించుచుండినది. ౫

తూర్పుతట్టుగాఁ బాఱునట్టి గంగాగోదావర్యాది నదులనుండియుం, ఊర్ధ్వముఖముగాఁ బ్రవహించునట్టి బ్రహ్మావర్తము రుద్రావర్తము మున్నగు వానినుండియును దక్షిణోత్తరముఖములుగాఁ బ్రవహించు గండకీశోణభద్ర మున్నగు నదులనుండియుం ఇట్టటు పాఱక నిలిచియుండు పుణ్యసరస్సులనుండియుం దేఁబడిన పుణ్యజలమును సిద్ధమయి ప్రకాశించుచుండినవి. ౬

పేలాలతోఁగూడి పాలుగలయశ్వత్థాదిపత్రములతోఁ గప్పఁబడి తామరపూలును గలువలునుఁగూడి పరమజలంబుతో నిండియున్న బంగారుకలశంబులును వెండికలశంబులును బ్రకాశించుచుండినవి. ౭

తేనెయును పెరుఁగును పేలాలును దర్భలును ఖుష్పంబులును పాలును అచ్చట సిద్ధములయి ప్రకాశించుచుండినవి. ౮

పుష్పములుఁ జందనము మొదలగువానిఁదాల్చి సమస్తాభరణంబులను ధరించియుండు భోగము వారును బ్రకాశించుచుండిరి.

చంద్రకిరణంబులుంబోలె మిక్కిలియుఁ దెల్లనైనదియుం బంగారముతోఁ జేయఁబడిరత్నములు పొదిగియుండు పిడిగలదియునగు నుత్తమమైన రామునిచామరమును సిద్ధమైయుండినవి. ౯

చంద్రమండలంబుఁబోలెఁ దెల్లనిదై యుత్తమంబై పట్టాభిషేకము కొఱకుఁ గల్పితంబైన శ్వేతచ్ఛత్రంబును సిద్ధముగనుండినది. ౧౦

పాణ్డుర శ్చ వృష స్సజ్జః పాణ్డురోఽశ్వ శ్చ సుస్థితః. ౧౧
ప్రసృతశ్చ గజ శ్శ్రీమా నౌపవాహ్యః ప్రతీక్షతే,
అష్టౌ చ కన్యా మాఙ్గళ్యా స్సర్వాభరణభూషితాః. ౧౨
వాదిత్రాణి చ సర్వాణి వన్దిన శ్చ తథా పరే,

ఇక్ష్వాకూణాం యథా రాజ్యే సమ్భ్రియేతాభిషేచనమ్. ౧౩
తథా జాతీయ మాదాయ రాజపుత్రాభిషేచనమ్,
తే రాజవచనా త్తత్ర సమవేతా మహీపతిమ్, ౧౪
అపశ్యన్తోఽబ్రువ న్కో౽ను రాజ్ఞో నః ప్రతిపాదయేత్,

న పశ్యామశ్చ రాజాన ముదిత శ్చ దివాకరః. ౧౫
యౌవరాజ్యాభిషేక శ్చ సజ్జో రామస్య ధీమతః,

ఇతి తేషు బ్రువాణేషు సార్వభౌమా న్మహీపతీన్. ౧౬
అబ్రవీత్తా నిదం సర్వా న్సుమన్త్రో రాజసత్కృతః,
రామం రాజ్ఞో నియోగేన త్వరయా ప్రస్థితోఽస్మ్యహమ్. ౧౭

పూజ్యా రాజ్ఞో భవన్త స్తు రామస్య చ విశేషతః,

అయం పృచ్ఛామి వచనా త్సుఖ మాయుష్మతా మహమ్. ౧౮
రాజ్ఞ స్సమ్ప్రతి బుద్ధస్య య చ్చాగమనకారణమ్,

తెల్లనియాఁబోతును మఱియు సుందరంబును దెల్లనిదియునగు గుఱ్ఱంబును సిద్ధములయియుండినవి. ౧౧

ఎల్లప్పుడును మదజలమును గార్చుచుండునదియు నుత్తమంబును రాజు లెక్కఁదగినదియునగు గజంబును సిద్ధమయియుండినది.

మంగళార్థులు సమస్తాభరణంబులను దాల్చియుండువారునగు కన్యకలెనిమిదిమంది రామునిపట్టాభిషేకంబునకై కనిపెట్టియున్నారు. ౧౨

వీణాదివాద్యములన్నియు సిద్ధములయియుండినవి; అట్లు స్తుతిపాఠకులును ఇఁక నితరులును సిద్ధులయియుండిరి.

ఇక్ష్వాకువంశపురాజులకుఁ బట్టాభిషేకమగునప్పుడు వారల యాచారముచొప్పునఁ గావలసియుండు రత్నాదిపదార్థములఁ గొని యారాజులు రాజాజ్ఞవలన రామునిపట్టాభిషేకంబునకై రాజద్వారంబునఁ జేరి దశరథమహారాజగపడకుండుటఁ జేసి "మేము వచ్చియున్నామని దశరథమహారాజున కెవ్వఁడు చెప్పును?" అని తమలోఁ దామనుకొనిరి. ౧౩, ౧౪

మన కిదివఱకు దశరథమహారాజగపడకున్నాఁడు. సూర్యోదయంబయినది; రామునిపట్టాభిషేకమునకు గావలసిన ద్రవ్యంబులన్నియు సిద్ధములయియున్నవి. అని యారాజులు తమలోఁ దా మనుకొనిరి. ౧౫

ఆరాజు లిట్లు చెప్పుకొనుచుండఁగా దశరథునిచే గౌరవింపఁబడుచుండు సుమంత్రుఁడు ఆరాజుల నందఱఁజూచి యిట్లని చెప్పెను. ౧౬

నేను రాజనియోగంబున రామునిఁ దోడ్కొనివచ్చుటకు వేగంబుగాఁ బోవుచున్నాను. ౧౭

మీరు దశరథమహారాజునకును విశేషించి రామునకును గౌరవింపఁదగినవారలు.

నేను మీయాజ్ఞవలన నిప్పుడు నిద్రమేల్కొనియుండు దశరథమహారాజునొద్దకుఁబోయి దశరథునిఁజూచి "నీకు సౌఖ్యమేనా? నీవేల బయటికి రాలేదు" అని యడిగెదను. అని సుమంత్రుఁడు ఆ రాజులతోఁ జెప్పెను. ౧౮

ఇత్యుక్త్వాన్తఃపురద్వార మాజగామ పురాణవిత్. ౧౯

సదాఽసక్తం చ తద్వేశ్మ సుమన్త్రః ప్రవివేశ హ,

తుష్టావాస్య తదా వంశం ప్రవిశ్య స విశాంపతేః. ౨౦

శయనీయం నరేన్ద్రస్య తదాఽఽసాద్య వ్యతిష్ఠత,

సోఽత్యాసాద్య తు తద్వేశ్మ తిరస్కరిణి మన్తరా. ౨౧
ఆశీర్భి ర్గుణయుక్తాభి రభితుష్టావ రాఘవమ్,

సోమసూర్యౌ చ కాకుత్స్థ! శివవైశ్రవణా వపి. ౨౨
వరుణశ్చాగ్ని రిన్ద్రశ్చ విజయం ప్రదిశన్తు తే,

గతా భగవతీ రాత్రిః కృతం కృత్య మిదం తవ. ౨౩
బుధ్యస్వ నృపశార్దూల! కురు కార్య మనన్తరమ్,

బ్రాహ్మణా బలముఖ్యాశ్చ నైగమాశ్చాఽగతా నృప!. ౨౪
దర్శనం తేఽభికాఙ్క్షన్తే ప్రతిబుధ్యస్వ రాఘవ!,

స్తువన్తం తం తదా సూతం సుమన్త్రం మన్త్రకోవిదమ్. ౨౫
ప్రతిబుధ్య తతో రాజా ఇదం వచన మబ్రవీత్,
రామ మానయ సూతేతి య దస్యభిహితోఽనయా. ౨౬
కి మిదం కారణం యేన మదాజ్ఞా ప్రతిహన్యతే,

రాజుల పురాతనవృత్తాంతంబుల నెఱిఁగియుండు నాసుమంత్రుండు, ఆ రాజుల కిట్లుచెప్పి మఱల నంతఃపురద్వారంబునకుఁ బోయెను. ౧౯

సుమంత్రుఁడు తా నెప్పుడు దలఁచినను అప్పుడు ప్రవేశింపఁగూడిన యంతఃపురంబును బ్రవేశించెను.

ఆసుమంత్రుఁ డట్లు ప్రవేశించి యాదశరథమహారాజువంశంబును బొగడెను. ౨౦

సుమంత్రుఁడప్పుడు దశరథమహారాజు శయనగృహంబుఁ జేరి యచ్చట నిలిచెను.

ఆ సుమంత్రుఁడు ఆగృహమున దశరథుఁడు పరుండియుండు స్థలము దగ్గఱకుఁబోయి తెరకుమాత్ర మీవల నిలిచి యాశీర్వచనములు చేయుచు దశరథునిఁ బొగడెను. ౨౧

దశరథుఁడా! చంద్రుఁడును సూర్యుఁడును శివుఁడును కుబేరుఁడును వరుణుఁడును అగ్నిహోత్రుఁడును దేవేంద్రుఁడును నీకు విజయంబు నొసంగుదురుగాక. ౨౨

రాజశ్రేష్ఠుఁడవగుదశరథుఁడా! భగవతియగు రాత్రి గడచినది; నీవు రాత్రి కాలంబునఁ జేయవలసినకార్యంబుల నెఱవేఱిచినావు; నిద్ర మేలుకొనుము; ఇంకఁ జేయవలసినకార్యంబులం జేయుము. ౨౩

దశరథమహారాజా! బ్రాహ్మణులును సేనలోముఖ్యులగువారలును బట్టణమునందు నివసించువారును వచ్చి నిన్నుఁ జూడఁగోరుచున్నారు; నిద్ర మేల్కొనుము. అని సుమంత్రుఁడు దశరథునిఁ బొగడెను. ౨౪

అంత దశరథుఁడు మేల్కొని అప్పుడు ప్రస్తుతించుచున్నవాని మంత్రంబులఁ బండితుఁడగువాని నాసుమంత్రుఁజూచి యిట్లని చెప్పెను. ౨౫

“సుమంత్రుఁడా! రామునితోడ్కొనిరమ్ము” అని యాజ్ఞ కైకేయి నీకుఁ జెప్పినదే దాని నేనొప్పుకొనియుండుటవలన నదియు నాయాజ్ఞయే. అట్టి యాజ్ఞను నీవి ట్లుల్లంఘించుటకుఁ గారణంబేమి? ౨౬

న చైవ సమ్ప్రసుప్తోఽహ మానయే హాశు రాఘవమ్. ౨౭

ఇతి రాజా దశరథ స్సూతం తత్రాన్వశా త్పునః,

స రాజవచనం శ్రుత్వా శిరసా ప్రతిపూజ్య తమ్. ౨౮
నిర్జగామ నృపావాసా న్మన్యమానః ప్రియం మహత్,

ప్రపన్నో రాజమార్గం చ పతాకాధ్వజశోభితమ్. ౨౯
హృష్టః ప్రముదిత స్సూతో జగామాశు విలోకయన్,

స సూత స్తత్ర శుశ్రావ రామాధికరణాః కథాః. ౩౦
అభిషేచనసంయుక్తా స్సర్వలోకస్య హృష్టవత్,
తతో దదర్శ రుచిరం కైలాసశిఖరప్రభమ్. ౩౧
రామవేశ్మ సుమన్త్ర స్తు శక్రవేశ్మ సమప్రభమ్,

మహాకవాటవిహితం వితర్దిశతశోభితమ్. ౩౨
కాఞ్చనప్రతిమైకాగ్రం మణివిద్రుమతోరణమ్,
శారదాభ్రఘనప్రఖ్యం దీప్తం మేరుగుహోపమమ్. ౩౩
మణిభి ర్వరమాల్యానాం సుమహద్భి రలఙ్కృతమ్,
ముక్తామణిభి రాకీర్ణం చన్దనాగరుధూపితమ్. ౩౪
గన్ధా న్మనోజ్ఞా న్విసృజ ద్దార్దరం శిఖరం యథా,
సారసై శ్చ మయూరై శ్చ వినదద్భి ర్విరాజితమ్. ౩౫
సుకృతేహామృగాకీర్ణం సుకీర్ణం భక్తిభి స్తథా,
మన శ్చక్షు శ్చ భూతానా మాదద త్తిగ్మతేజసా. ౩౬
చన్ద్రభాస్కరసఙ్కాశం కుబేరభవనోపమమ్,

మహేన్ద్రగృహప్రతిమం నానాపక్షిసమాకులమ్. ౩౭
మేరుశృఙ్గసమం సూతో రామవేశ్మ దదర్శ హ,
ఉపస్థితై స్సమాకీర్ణం జనై రఞ్జలికారిభిః. ౩౮
ఉపాదాయ సమాక్రాన్తై స్తథా జానపదై ర్జనైః,
రామాభిషేకసుముఖై రున్ముఖై స్సమలఙ్కృతమ్. ౩౯
మహామేఘసమప్రఖ్య ముదగ్రం సువిభూషితమ్,
నానారత్నసమాకీర్ణం కుబ్జకైరాతకావృతమ్. ౪౦

స వాజియుక్తేన రథేన సారథి
ర్నరాకులం రాజపథం విలోకయన్,
వరూథినా రామగృహాభిపాతినా
పురస్య సర్వస్య మనాంసి హర్షయన్. ౪౧
తత స్సమాసాద్య మహాధనం మహ
త్ప్రహృష్టరోమా స బభూవ సారథిః,
మృగై ర్మయూరై శ్చ సమాకులోల్బణం
గృహం వరార్హస్య శచీపతే రివ. ౪౨
స తత్ర కైలాసనిభా స్స్వలఙ్కృతాః
ప్రవిశ్య కక్ష్యా స్త్రిదశాలయోపమాః,
ప్రియా న్నరా న్రామమతే స్థితా న్బహూ
నపోహ్య శుద్ధాన్త ముపస్థితో రథీ. ౪౩
స తత్ర శుశ్రావ చ హర్షయుక్తా
రామాభిషేకార్థకృతా జనానామ్,
నరేన్ద్రసూనో రభిమఙ్గళార్థా

వడ్రంగివారలసూక్ష్మంబులగు చిత్రశిల్పంబులనొప్పుచు అధిక కాంతిగలిగి యుండుటంజేసి చూపరులమనంబుల నేత్రంబుల నాకర్షించుచుఁ జంద్రునితోను సూర్యునితోను సాటియగుచుఁ గుబేరునిగృహంబుతో సమానంబై దేవేంద్రునిగృహంబుతోఁ దుల్యంబై నానావిధపక్షులసంపూర్ణంబై మేరుపర్వతశిఖరసదృశంబై సమీపంబునకు వచ్చి చేతుల మొగిడ్చికొనియున్న జనులతోఁగూడి యట్లు గ్రామములనుండి కానుకలఁ దీసికొనివచ్చి రామునకుఁ బట్టాభిషేకంబు కాఁగలదని సంతోషంబునొంది పరమోత్సాహంబుతోనున్న జానపదజనులచే నలంకృతంబై మహామేఘంబుంబోలునదైయున్నతంబై, చక్కఁగా నలంకృతంబై నానారత్నంబుల నాకీర్ణంబై గూనివాండ్రును స్వల్పశరీరముగలవారలును మెండుగాఁగలిగి యొప్పుచున్న రామునిగృహంబుఁ జూచెను. ౩౭-౪౦

ఆసుమంత్రుఁడు మనుష్యులు నిండియుండు రామగృహంబును జూచుచు, మీఁదికప్పుతోఁగూడి గుఱ్ఱములు గట్టియుండురథంబును, రామగృహంబున కభిముఖంబుగాఁ దోలుకొని పోవుచు, నాపట్టణంబుననుండు సమస్తజనులకును సంతోషంబుగల్గునట్టుచేసెను. ౪౧

అంత నాసుమంత్రుఁడు గొప్పదియు మిగుల ధనంబుతోఁ గూడినదియు నెచ్చుగా మృగంబులును మయూరంబులును గలదియునగు నారామునిగృహంబుఁ జేరి దేవేంద్రునిగృహంబుఁ జేరినట్లు అధికసంతోషంబున దేహంబంతయుఁ గగుర్పాటునొందెను. ౪౨

అంత నాసుమంత్రుఁడు, కైలాసపర్వతంబుంబోలెఁ దెల్లఁగా నున్నతంబులయి దేవతలయుండ్లకు సాటివచ్చుచున్న తొట్టికట్లఁ బ్రవేశించి రామునకుఁ బ్రియులు రామునిమతంబు ననుసరించువారల ననేకపురుషుల నతిక్రమించి యంతఃపురంబునొద్దకుఁ బోయెను. ౪౩

అచ్చట నాసుమంత్రుఁడు పరమసంతోషంబునొంది జనులు సంతోషంబున రామాభిషేకంబుగుఱించియు, రామునకు సమస్తలోకంబులకు మంగళంబు గలుగుటనుగుఱించియుఁ జెప్పుకొనుచున్న మాటలను వినెను. ౪౪

స్సర్వస్య లోకస్య గిరః ప్రహృష్టః. ౪౪
మహేన్ద్రసద్మప్రతిమం తు వేశ్మ
రామస్య రమ్యం మృగపక్షిజుష్టమ్,
దదర్శ మేరో రివ శృఙ్గ ముచ్చం
విభ్రాజమానం ప్రభయా సుమన్త్రః. ౪౫
ఉపస్థితై రఞ్జలికారకై శ్చ
సోపాయనై ర్జానపదై శ్చ మర్త్యైః,
కోట్యాపరార్ధై శ్చ విముక్తయానై
స్సమాకులం ద్వారపథం దదర్శ. ౪౬
తతో మహామేఘమహీధరాభం
ప్రభిన్న మత్యంకుశ మప్రసహ్యమ్,
రామోపవాహ్యం రుచిరం దదర్శ
శత్రుఞ్జయం నాగ ముదగ్రకాయమ్. ౪౭
స్వలఙ్కృతా న్సాశ్వరథా న్సకుఞ్జరా
నమాత్యముఖ్యాన్ శతశ శ్చ వల్లభాన్,
వ్యపోహ్య సూత స్సహితా న్సమన్తత
స్సమృద్ధ మన్తఃపుర మావివేశ. ౪౮
తదద్రికూటాచల మేఘసన్నిభం
మహావిమానోత్తమవేశ్మ సంఘవత్,
అవార్యమాణః ప్రవివేశ సారథిః
ప్రభూతరత్నం మకరో యథాఽర్ణవమ్. ౪౯

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే పఞ్చదశస్సర్గః.

సుమంత్రుఁడు దేవేంద్రునిగృహంబుంబోలినదై రమణీయంబై మృగపక్షిసేవితంబై ఉన్నతంబగు మేరుశిఖరంబుభంగిఁజూడనొప్పుచుఁ గాంతిచేఁ బ్రకాశించుచున్న రాముఁడు నివసించుగృహంబుఁ జూచెను. ౪౫.

ఆ సుమంత్రుఁడు, అచ్చట చేమోడ్పులుధరించి కానుకలు దీసికొని వాహనంబులదిగి, నిల్చియుండు బహుకోటిపరార్థసంఖ్యాకులగు గ్రామ్యజనులచేనిండిన ద్వారంబుఁ జూచెను. ౪౬

అంత నాసుమంత్రుఁ డచ్చట, మహామేఘంబునకును బర్వతంబునకు సరివచ్చునదియై మదించి యంకుశము పరకుసేయనిదై యప్రసహ్యంబై రాముని కెక్కఁదగినదై మనోహరంబై యున్నతంబగు మేనుగలిగి యొప్పుచుండు శత్రుంజయంబను గజంబుఁ జూచెను. ౪౭.

సారథియగుసుమంత్రుఁడు అచ్చట సర్వాలంకారంబులఁ దేజరిల్లుచు గుఱ్ఱములతోను రథములతోను గజములతోనుఁ గూడినవారల నొకటిగాఁ జేరినవారల ననేకుల మంత్రిముఖ్యులను రాజవల్లభులను దాఁటి సర్వసంపదలం జెలంగుచుండు నంతఃపురంబుఁ బ్రవేశించెను. ౪౮

సుమంత్రుఁడు, పర్వతశిఖరంబులతోను నిశ్చలములగు మేఘంబులతోను సమానంబై ఏడంతస్తులమిద్దెలతోఁగూడిన గృహంబు లనేకములుగలదై యుండు నాయంతఃపురంబును మకరము రత్నాకరంబగు సముద్రంబు చొచ్చునట్లు ఎంతమాత్ర మడ్డిలేనివాఁడై ప్రవేశించెను. ౪౯

ఇది పదునైదవసర్గము.

---

షో డ శ స్స ర్గః

స తద న్తఃపురద్వారం సమతీత్య జనాకులమ్,
ప్రవివిక్తాం తతః కక్ష్యా మాససాద పురాణవిత్. ౧
ప్రాసకార్ముకబిభ్రద్భి ర్యువభి ర్మృష్టకుణ్డలైః,
అప్రమాదిభి రేకాగ్రై స్స్వనురక్తై రధిష్ఠితామ్. ౨

తత్ర కాషాయిణో వృద్ధా న్వేత్రపాణీ న్స్వలఙ్కృతాన్,
దదర్శ విష్ఠితా న్ద్వారి స్త్ర్యధ్యక్షా న్సుసమాహితాన్. ౩

తే సమీక్ష్య సమాయా న్తం రామప్రియచికీర్షవః,
సహ సోత్పతితా స్సర్వే స్వాసనేభ్య స్ససంభ్రమాః. ౪

తా నువాచ వినీతాత్మా సూతపుత్రః ప్రదక్షిణః,
క్షిప్ర మాఖ్యాత రామాయ సుమన్త్రో ద్వారి తిష్ఠతి. ౫

తే రామ ముపసంగమ్య భర్తుః ప్రియచికీర్షవః,
సహభార్యాయ రామాయ క్షిప్ర మేవాభిచక్షిరే. ౬

ప్రతివేదిత మాజ్ఞాయ సూత మభ్య న్తరం పితుః,
తత్రై వానాయయామాస రాఘవ ప్రియకామ్యయా. ౭

తం వైశ్రవణసంకాశ ముపవిష్టం స్వలఙ్కృతమ్,

## పదునాఱవ సర్గము

పురాతనరాజవృత్తాంతముల నెఱింగినసుమంత్రుఁడు జనులచే నిండియుండు నాయంతఃపురద్వారము నతిక్రమించి యంత నీఁటెలును ధనుస్సులును ధరించి తుడువఁబడిన వగుటఁజేసి కాంతియుక్తంబులైన కుండలంబులతో నొప్పుచు నేమఱుపాటులేక నిశ్చలబుద్ధులయి, రామునియం దనురాగంబు గల్గియుండు యౌవనపురుషులచే రక్షింపఁబడుచున్నదియు జనసమ్మర్దము లేనిదియునగు తొట్టికట్టుఁ జేరెను. ౧,౨

ఆసుమంత్రుఁ డచ్చటఁ గాషాయవస్త్రముధరించి వేత్రములు చేతులందాల్చి చక్కఁగా నలంకరించుకొని వాకిలియందుఁ గావలియున్నవారల నంతఃపురస్త్రీల కధ్యక్షులం జూచెను. ౩

ఆకావలివాండ్రందఱును రామునకుం బ్రియంబుసేయువారలు కావున సుమంత్రుని గౌరవించినచో రామునకుఁ బ్రియంబగునని తలంచి సుమంత్రుఁడు వచ్చుటంజూచి వేగంబున దమయాసనంబులనుండి లేచిరి. ౪

సుమంత్రుఁడు మిగుల సరళుఁడుగావున వినయంబున వారలఁజూచి “సుమంత్రుఁడు వాకిటవచ్చి కను పెట్టియున్నాఁడని శీఘ్రముగా రామునకుఁ జెప్పుఁడు” అని చెప్పెను. ౫

ఆకావలివాండ్రు తమకు నాథుఁడగు రామునకుఁ బ్రియంబుసేయఁ గోరువారలు కావున శీఘ్రముగా నే రామునియొద్దకుఁబోయి, భార్యాసహితుఁడై యున్నరామునితో సుమంత్రుఁడు వాకిటవచ్చియున్నాఁడని విన్నవించిరి. ౬

రాముఁడు కావలివాండ్రవలన దనతండ్రియగు దశరథునకు మిక్కిలి యాప్తుఁడైన సుమంత్రుఁడు వచ్చియుండుట నెఱింగి దశరథునకుఁ బ్రియంబగుటకై, భార్యాసహితుఁడై యున్నస్థలంబునకే యాసుమంత్రుని రప్పించెను. ౭

కుబేరునితో సమానుఁడై చక్కఁగా నలంకారంబులు ధరించిన

దదర్శ సూతః పర్యఙ్కే సౌవర్ణే సోత్తరచ్ఛదే. ౮
వరాహరుధిరాభేణ శుచినా చ సుగన్ధినా,
అనులిప్తం పరార్ధ్యేన చన్దనేన పరన్తపమ్. ౯
స్థితయా పార్శ్వత శ్చాపి వాలవ్యజనహస్తయా,
ఉపేతం సీతయా భూయ శ్చిత్రయా శశినం యథా. ౧౦

తం తపన్త మి వాదిత్య ముపపన్నం స్వతేజసా,
వవన్దే వరదం వన్దీ వినయజ్ఞో వినీతవత్. ౧౧

ప్రాఞ్జలి స్తు సుఖం పృష్ట్వా విహారశయనాసనే,
రాజపుత్ర మువాచేదం సుమన్త్రో రాజసత్కృతః. ౧౨

కౌసల్యా సుప్రజా రామ! పితా త్వాం ద్రష్టు మిచ్ఛతి,
మహిష్యా సహ కైకేయ్యా గమ్యతాం తత్ర మాచిరమ్. ౧3

ఏవము క్త స్తు సంహృష్టో నరసింహో మహాద్యుతిః,
తత స్సమ్మానయామాస సీతా మిద మువాచహ. ౧౪

దేవి! దేవశ్చ దేవీ చ సమాగమ్య మద న్తరే,
మన్త్రయేతే ధ్రువం కిఞ్చి దభిషేచనసంహితమ్. ౧౫
లక్షయిత్వా హ్యభిప్రాయం ప్రియకామా సుదక్షిణా,
సఞ్చోదయతి రాజానం మదర్థం మదిరేక్షణే!. ౧౬

సా ప్రహృష్టా మహారాజం హితకామానువర్తినీ,
జననీ చార్థకామా మే కేకయాధిపతే! స్సుతా. ౧౭

వాఁడై మేలయిన ప్రచ్ఛదపటము పఱచియుండుబంగారుపానుపునందుఁ గూర్చుండి వంది నెత్తురుఁ బోలె నెఱ్ఱఁగాఁ బరిశుద్ధంబై మంచివాసనగలిగి యుండు శ్రేష్ఠంబగుచందనంబుబూసికొని ప్రక్కను చామరంబు చేతఁదాల్చి వీచుచున్న సీతతోఁగూడి యుండుటంజేసి యనుమడిగాఁ బ్రకాశించుఁ జిత్రనక్షత్రంబుతోఁగూడిన చంద్రుఁడుఁబోలెఁ జూడనగుచున్నరాముని జూచెను. ౧-౧౦

వినయంబుగల యాసుమంత్రుఁడు సూర్యుఁడుఁబోలె దేహకాంతిచే వెలుంగుచున్నవాని నాశ్రితులకు వరంబులనిచ్చువాని నారాముని వినయంబున నమస్కరించెను. ౧౧

దశరథమహారాజుచే గౌరవింపఁబడుచున్నట్టి సుమంత్రుఁడు రాముని "ఏకాంతవిహారాదులందు నీకు సుఖమేనా?" అనియడిగి మఱల నిట్లని చెప్పెను. ౧౨

రాముఁడా! నిన్నుఁగనుటచేసి కౌసల్యసుపుత్రయయినది; దశరథుఁడును కైకేయియును నిన్నుఁజూడఁ గోరుచున్నారు. అచ్చటికి శీఘ్రము గా రమ్ము. అని సుమంత్రుఁడు రామునితోఁ జెప్పెను. ౧౩

అధికమయినకాంతిగలవాఁడును పురుషశ్రేష్ఠుఁడు నగు రాముఁడు సుమంత్రునిమాటవిని పరమసంతోషంబునొంది యతని గౌరవించి యంత సీతంజూచి యిట్లని చెప్పెను. ౧౪

సీతా! దశరథుఁడును కైకేయియును జేరి, నావిషయమయి పట్టాభిషేకమును గుఱించియేమో యాలోచించుచున్నారు; ఇది నిశ్చయము. ౧౫

మదముగప్పినకండ్లు గలసీతా! కైకేయి దశరథునిఁ బ్రియంబు గోరునదియు మిగుల సమర్థురాలును గావున దశరథుని యభిప్రాయం బెఱిఁగి నాకుఁ బట్టాభిషేకంబు సేయుటకై దశరథునిఁ బ్రేరేపించుచున్నది. ౧౬

కైకేయి నాకుఁదల్లియు లోకంబునకు మేలుగోరునదియును దశరథమహారాజు ననువర్తించునదియు నగుటఁ జేసి సంతోషంబున నాకుఁ బట్టా

దిష్ట్యా ఖలు మహారాజో మహిష్యా ప్రియయా సహ,
సుమన్త్రం ప్రాహిణో ద్దూత మర్థకామకరం మమ. ౧౭

యాదృశీ పరిష త్తత్ర తాదృశో దూత ఆగతః,

ధ్రువ మద్యైవ మాం రాజా యౌవరాజ్యేఽభిషేక్ష్యతి. ౧౮

హన్త! శీఘ్ర మితో గత్వా ద్రక్ష్యామి చ మహీపతిమ్,

సహ త్వం పరివారేణ సుఖ మాస్వ రమస్వ చ. ౨౦

పతిసమ్మానితా సీతా భర్తార మసితేక్షణా,
ఆద్వార మనువవ్రాజ మఙ్గళాన్యభిదధ్యుషీ. ౨౧

రాజ్యం ద్విజాతిభి ర్జుష్టం రాజసూయాభిషేచనమ్,
కర్తు మర్హతి తే రాజా వాసవస్యేవ లోకకృత్. ౨౨
దీక్షితం వ్రతసమ్పన్నం వరాజినధరం శుచిమ్,
కురఙ్గశృఙ్గపాణిం చ పశ్యన్తీ త్వాం భజామ్యహమ్. ౨౩

పూర్వాం దిశం వజ్రధరో దక్షిణాం పాతు తే యమః,
వరుణః పశ్చిమా మాశాం ధనేశస్తూత్తరాం దిశమ్. ౨౪

భిషేకంబు కావలెనని కోరును.

దశరథమహారాజు ప్రియభార్యయగు కైకేయింగూడి నాప్రయోజనమును గోరునట్టి సుమంత్రుని నాయొద్దకు దూతనుగా బంపెనే; ఇది భాగ్యము గదా!

అచ్చట ఎట్టిసభ చేరియున్నదో, అట్టిదూత వచ్చినాడు; నాకు దల్లియుం దండ్రియునగు వారచ్చటం జేరి యున్నారు కావున అట్లు నాకాప్తుఁడైన దూతను బంపినారు.

దశరథమహారాజు నాకిప్పుడే పట్టాభిషేకము సేయఁగలఁడు; ఇది నిశ్చయము. ౧౯

సంతోషము ఇప్పుడు శీఘ్రంబుగా నిచ్చటినుండిపోయి దశరథమహారాజును గైకేయినిం జూచెదను.

నీవు పరిజనములం గూడి సుఖంబుగాఁ గ్రీడింపుచుండుము. అని రాముఁడు సీతతోఁ జెప్పెను. ౨౦

నల్లనికన్నులుగలసీత యిట్లనుచయో క్తులఁ బెనిమిటిచే గౌరవింపఁబడినదై పెనిమిటికి మంగళంబులు గలుగవలెననికోరుచు వాకిలివఱకు పెనిమిటిని వెంబడించెను. ౨౧

బ్రహ్మదేవుఁ డింద్రునకుఁబోలె రాజసూయయాగమునందు యోగ్యతను గల్గించునట్టి రాజ్యంబును బ్రాహ్మణద్వారముగా దశరథమహారాజు నీకిచ్చును.

అటుపిమ్మట నీవు రాజసూయయాగ దీక్ష వహింపఁగా వ్రతవంతున్నుఁడవై కృష్ణాజినధరుఁడవై పరిశుద్ధుఁడవై జింకకొమ్ము చేతఁ బాల్చియున్న నిన్నుఁ జూచుచుండఁగోరెదను. ౨౩

నిన్నుఁ దూర్పుదిక్కునందు దేవేంద్రుఁడును, దక్షిణపుదిక్కునందు యముఁడును, పడమటిదిక్కునందు వరుణుఁడును, ఉత్తరపుదిక్కునందు కుబేరుఁడును రక్షింతురుగాక. ఇట్లు సీత రామునకు మంగళంబు గలుగవలెనని తలంచినది. ౨౪

అథ సీతా మనుజ్ఞాప్య కృతకౌతుకమఙ్గళః,
నిశ్చక్రామ సుమన్త్రేణ సహ రామో నివేశనాత్. ౨౫

పర్వతా దివ నిష్క్రమ్య సింహో గిరిగుహాశయః,
లక్ష్మణం ద్వారి సోఽపశ్య త్ప్రహ్వాఞ్జలిపుటం స్థితమ్. ౨౬

అథ మధ్యమకక్ష్యాయాం సమాగచ్ఛ త్సుహృజ్జనైః,
స సర్వా నర్థినో దృష్ట్వా సమేత్య ప్రతినన్ద్య చ. ౨౭
తతః పావకసంకాశ మారురోహ రథోత్తమమ్,
వైయాఘ్రం పురుషవ్యాఘ్రో రాజతం రాజనన్దనః. ౨౮

మేఘనాద మసంబాధం మణిహేమవిభూషితమ్,
ముష్ణన్త మివ చక్షూంషి ప్రభయా సూర్యవర్చసమ్. ౨౯
కరేణుశిశుకల్పైశ్చ యుక్తం పరమవాజిభిః,
హరియుక్తం సహస్రాక్షో రథమిన్ద్ర ఇవాశుగమ్. 3౦
ప్రయయౌ తూర్ణ మాస్థాయ రాఘవో జ్వలిత శ్రియా,
స పర్జన్య ఇవాకాశే స్వనవా నభినాదయన్. 3౧
నికేతా న్నిర్యయౌ శ్రీమా న్మహేన్ద్రా దివ చన్ద్రమాః,

ఛత్రచామరపాణిస్తు లక్ష్మణో రాఘవానుజః. 3౨
జుగోప భ్రాతరం భ్రాతా రథ మాస్థాయ పృష్ఠతః,

తతో హలహలాశబ్ద స్తుముల స్సమజాయత. 33
తస్య నిష్క్రమమాణస్య జనౌఘస్య సమన్తతః,

అంత పట్టాభిషేకమునకుఁ గావలసిన మంగళాలంకారములు వెలుంగు చుండు రాముఁడు సీత నొప్పించి సుమంత్రుఁగూడి తనగృహంబు వెడలెను.

పర్వతగుహాయందుండు సింహంబు పర్వతంబునుండి వెడలునట్లు రాముఁడు గృహంబునుండి వెడలి వాకిట నమ్రుఁడై చేతులు మొగిడ్చికొని యుంన్న లక్ష్మణుఁ జూచెను. ౨౮

అంతఁ బురుషశ్రేష్ఠుఁడును రాజకుమారుఁడు నగు రాముఁడు నడిమితొట్టి కట్టునఁ దనస్నేహితులఁజేరి తన పట్టాభిషేకముఁ జూడఁగోరివచ్చిన జనులందఱఁ జూచి వారియొద్దకుఁబోయి వారల మంచిమాటల నభినందించి యంత పులితోలుతోఁ గప్పఁబడియుండుటఁజేసి యగ్నిహోత్రునిఁబోలె వెలుంగు చున్నదియు వెండితోఁ జేయఁబడినదియుం నగుశ్రేష్ఠమయిన రథంబు నెక్కెను.

రాముఁడు, మేఘంబునకుఁ బోలె మహాధ్వనిగలదై విశాలంబై మణుల చేతను బంగారముచేతను అలంకృతంబై, కాంతిచేఁ జూపఱలనేత్రంబుల నాకర్షించుచు, సూర్యుండుఁబోలె వెలుంగుచు నేనుఁగుపిల్లలంబోలు శ్రేష్ఠా శ్వంబులతోఁ గూడినదియునగు రథంబును, ఇంద్రుఁ డెక్కునట్లు ఎక్కి కాంతిచే వెలుంగుచు శీఘ్రంబుగాఁ బోయెను. ౨౯, ౩౦

కాంతిసంపన్నుఁడగు నారాముఁడు ఆకాశంబున మహాధ్వనిగల మేఘంబుఁబోలె రథశబ్దంబున దిక్కుల ధ్వనింపజేయుచు, మహేంద్ర పర్వతంబునుండి చంద్రుఁడు వెడలునట్లు, గృహంబునుండి వెడలెను. ౩౧

రామునితమ్ముఁడగు లక్ష్మణుఁడు ఒకచేతను ఛత్రంబును మఱియొక చేతను జామరంబును దాల్చి రథంబు వెనుకటిభాగంబున నిల్చి, యన్నయగు రామునకు ఎండ మొదలగునవి తగులకుండునట్లు రక్షించుచుండెను. ౩౨

అంత రాముఁడు బయలుదేఱునప్పుడు, తుములంబుగా జనులు కలకల శబ్దంబుగావించిరి. ౩౩

తతో హయవరా ముఖ్యా నాగా శ్చ గిరిసన్నిభాః. 34
అనుజగ్ము స్తదా రామం శతశోఽథ సహస్రశః,
అగ్రత శ్చాస్య సన్నద్ధా శ్చన్దనాగరుభూషితాః. 35
ఖడ్గచాపధరా శ్శూరా జగ్ము రాశంసవో జనాః,

తతో వాదిత్రశబ్దా శ్చ స్తుతిశబ్దా శ్చ వన్దినామ్. 36
సింహనాదా శ్చ శూరాణాం తదా శుశ్రువిరే పథి,
హర్మ్యవాతాయనస్థాభి ర్భూషితాభి స్సమంతతః. 37
కీర్యమాణ స్సు పుష్పౌఘై ర్యయౌ స్త్రీభి రరిన్దమః,

రామం సర్వానవద్యాంగ్యో రామపిప్రీషయా తతః. 38
వచోభి రగ్ర్యై ర్హర్మ్యస్థాః క్షితిస్థా శ్చ వవన్దిరే,

నూనం నన్దతి తే మాతా కౌసల్యా మాతృనన్దన!. 39

పశ్యన్తీ సిద్ధయాత్రం త్వాం పిత్ర్యం రాజ్య మవస్థితమ్,

సర్వసీమన్తినీభ్య శ్చ సీతాం సీమన్తినీ వరామ్. 40
అమన్యన్త హి తా నార్యో రామస్య హృదయప్రియామ్,
తయా సుచరితం దేవ్యా పురా నూనం మహత్తపః. 41
రోహిణీవ శశాఙ్కేన రామసంయోగమాప యా,

ఇతి ప్రాసాదశృఙ్గేషు ప్రమదాభి ర్నరోత్తమః. 42
శుశ్రావ రాజమార్గస్థః ప్రియావాచ ఉదాహృతాః,
స రాఘవ స్తత్ర కథాప్రపఞ్చాన్ శుశ్రావలోకస్యసమాగతస్య.

అంత నప్పుడు కొందఱు గుఱ్ఱముల నెక్కియును, గొంద ఱేనుఁగుల
నెక్కియు నిట్లు వేనవేలుగా రాముని వెంట నేగిరి. ౩౪

ఆ రాముని ముందటను గవచంబులు దొడిగి చందనాగరువుల నలంది
కొని ఖడ్గంబులను ధనుస్సులను ధరించినవారలు శూరులు రాముని మంగళంబుం
గోరువారలు నడిచిరి. ౩౫

అంత నప్పుడు మార్గంబున వాద్యధ్వనులును స్తుతిపాఠకులు సేయు
స్తోత్ర శబ్దములును శూరులు సేయు సింహనాదంబులును వినంబడినవి. ౩౬

శత్రువుల నడఁగఁ ద్రొక్కంజాలిన యా రాముఁడును, అప్పుడు
దేహమంతయుఁ జక్కఁగా నలంకరించికొని, మేడలయందలి కిటికీలనుండు
స్త్రీలుచల్లు పూలవానలఁ బరిగ్రహించుచు వెళ్లెను. ౩౭

అంత నుత్తమస్త్రీలు కొందఱు మేడలపైనుండియుఁ, గొందఱు భూమిపై
నుండియు రామునకు సంతోషంబు సేయంగోరి రాముని ఇట్లని యుత్తమ
వాక్యంబులం బ్రస్తుతించిరి. ౩౮

నీవు తల్లికి సంతోషంబు గలుగఁజేయువాఁడవు; నిన్నుఁ జూచి నీతల్లి
కౌసల్య నిశ్చయముగా సంతోషించుచున్నది. ౩౯

నీ గమనము సఫలంబగును; అట్లు పిత్ర్యంబగు రాజ్యంబును బొందియున్న
నిన్ను జనులు జూడఁగలరు. అని రాముని బ్రస్తుతించిరి.

ఆస్త్రీలు రామునకు మనః ప్రియురాలగు సీతను సమస్తస్త్రీలకన్నను
ఉత్తమరాలనుగాఁ దలఁచియుండిరి. ౪౦

రోహిణీదేవి చంద్రునిఁ గూడినట్లు సీతాదేవి రామునిఁ గూడినది.
ఈసీత పూర్వజన్మంబున గొప్ప తపస్సుచేసి యుండును; ఇది నిశ్చయము!
అని ఆస్త్రీలు సీతను బొగడిరి. ౪౧

రాజమార్గంబున నున్న రాముఁడు ఇట్లు మేడలపైనుండి యా స్త్రీలు
చెప్పిన ప్రియవచనంబుల వినెను. ౪౨

ఆ రాముఁడు గ్రామంబులనుండి వచ్చియున్న జనులు చెప్పుకొను

ఆత్తాధికారా వివిధాశ్చ వాచః ప్రహృష్టరూపస్య పురో జనస్య,
ఏష శ్రియం గచ్ఛతి రాఘవోఽద్య
రాజప్రసాదా ద్విపులాం గమిష్యన్. ౪౪
ఏతే వయం సర్వ సమృద్ధకామా
యేషా మయం నో భవితా ప్రశాస్తా,
లాభో జనస్యాస్య యదేష సర్వం
ప్రపత్స్యతే రాష్ట్ర మిదం చిరాయ. ౪౫
న హ్యప్రియం కించ నజాతు కశ్చి
త్పశ్యే న్న దుఃఖం మనుజాధిపేఽస్మిన్,
సఘోషవద్భి శ్చ హయై ర్మతఙ్గజై ః
పురస్సరై స్స్వస్తికసూతమాగధైః. ౪౬
మహీయమానః ప్రవరై శ్చ వాదకై
రభిష్టుతో వైశ్రవణో యథా యయౌ,
కరేణుమాతఙ్గరథాశ్వసంకులం
మహాజనౌఘప్రతిపూర్ణచత్వరమ్. ౪౭
ప్రభూతరత్నం బహుపణ్యసంచయం
దదర్శ రామో రుచిరం మహాపథమ్,

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే షోడశస్సర్గః.

---

## సప్తదశస్సర్గః

స రామో రథ మాస్థాయ సమ్ప్రహృష్టసుహృజ్జనః,
పతాకాధ్వజసమ్పన్నం మహార్హాగరుధూపితమ్. ౧
అపశ్య న్నగరం శ్రీమా న్నానాజనసమాకులమ్,

మాటలను, ఆ పట్టణమందలిజనులు గగుర్పాటునొంది చెప్పుకొనుమాటలను వినెను.

ఈ రాముఁడు దశరథమహారాజానుగ్రహంబువలన నిప్పుడు భూమి కధిపతియయి రాజలక్ష్మిఁ బొందఁగలఁడు; మన కిట్టి రాముఁడు రక్షకుఁడు కాఁగలఁడు కావున మన కోర్కులన్నియుం నీడేఱఁగలవు. ౪౪

ఈ రాముఁడు బహుకాలమునకుఁగాం నీరాజ్యమునకంతయుం నధిపతి యగుట యీ జనులభాగ్యమే. ఇతఁడు రాజుగానుండఁగా నొకానొకఁడును, ఒకానొకప్పుడును కొంచెమైనను అప్రియంబునుగాని, దుఃఖంబునుగాని పొందఁడు. ౪౫

ఆ రాముఁడు, కేకలువేయుచుండు గుఱ్ఱములతోను గజంబులతోనుం గూడి స్తుతిపాఠకులును సూతులును మాగధులును బహుగౌరవంబునఁ బొగడుచు ముందు నడుచుచుండఁగాఁ గుబేరుఁడుంబోలె వెలుంగుచుఁ బోయెను. ౪౬

ఆఁబేనుఁగులతోను మగయేనుఁగులతోను రథంబులతోను గుఱ్ఱంబులతోను నిండి యచ్చటచ్చట గుంపులుగూడియుండు జనులతో నొప్పుచున్న మధ్యప్రదేశంబులు గలిగి యలంకారార్థంబు వెదచల్లఁబడిన మణిసమూహంబులచేఁ బ్రకాశించుచు విక్రయార్థంబై వర్తకు లుంచుకొనియుండు ననేక పదార్థంబుల నొప్పుచు మనోహరంబై యున్న రాజమార్గంబును. రాముఁడు చూచెను. ౪౭

ఇది పదునాఱవసర్గము

పదునేడవసర్గము

పట్టాభిషేకంబునకుఁ దగునట్టు లలంకారంబులు ధరించి వెలుఁగుచుండు రాముఁడు తనస్నేహితులు సంతోషంబునొందఁగా రథంబునందుండి నానావిధధ్వజంబులతో నొప్పుచు శ్రేష్ఠమయిన యగరు ధూపంబు వేయఁబడియుండుటంజేసి వాసనలు గుబాళించుచు నానాదేశముల

సగృహై రభ్రసఙ్కాశైః పాణ్డురై రుపశోభితమ్. ౨
రాజమార్గం యయౌ రామో మధ్యేనాగరుధూపితమ్,

చన్దనానాం చ ముఖ్యానా మగరూణాం చ సంచయైః. ౩
ఉత్తమానాం చ గన్ధానాం క్షౌమకోశామ్బరస్య చ,
అవిద్ధాభి శ్చ ముక్తాభి రుత్తమై స్స్ఫాటికై రపి. ౪
శోభమాన మసమ్బాధై స్తం రాజపథ ముత్తమమ్,
సంవృతం వివిధైః పణ్యై ర్భక్ష్యై రుచ్చావచై రపి. ౫

దదర్శ తం రాజపథం దివి దేవపథం యథా,

దధ్యక్షతహవిర్లాజై ర్ధూపై రగరుచన్దనైః. ౬
నానామాల్యోపగన్ధైశ్చ సదాఽభ్యర్చితచత్వరమ్,
ఆశీర్వాదా న్బహూ న్శృణ్వ న్సుహృద్భి స్సముదీరితాన్. ౭
యథార్హం చాపి సంపూజ్య సర్వానేవ నరాన్యయౌ,

పితామహై రాచరితం తథైవ ప్రపితామహైః. ౮
అద్యోపాదాయ తం మార్గ మభిషిక్తోఽనుపాలయ,
యథాస్మ లాలితాః పిత్రా యథాపూర్వైః పితామహైః. ౯
తత స్సుఖతరం రామే వత్స్యామ స్సతి రాజని,

అల మద్య హి భుక్తేన పరమార్థై రలం చ నః. ౧౦

నుండి పట్టాభిషేకోత్సవముఁ జూచుటకై వచ్చినజనులతో నిండియుండు నయోధ్యాపట్టణముఁ జూచెను.

ఆరాముఁడు మేఘంబులుంబోలెనుండు తెల్లనిగృహంబులతో నొప్పుచు నడుమ నగరుధూపంబు వేయఁబడుటంజేసి సువాసనగలిగియుండు రాజమార్గంబుఁ బ్రవేశించెను. ౨

ఉత్తమంబులగు చందనపుఁజెక్కలును అగరుచెక్కలును ఇతరగంధద్రవ్యంబులును తెల్లపట్టు మొదలగు పట్టుబట్టలును రంధ్రములు వేయక నూతనములుగనుండు ముత్తెములును నిర్దోషంబులును శ్రేష్ఠంబులు నగు స్ఫటికమణులును నానావిధంబులగు పిండివంటలును, అట్లు నానావిధంబులగు విక్రయపదార్థంబులు గలిగి యొప్పుచుండు నారాజమార్గంబును రాముఁడు ప్రవేశించెను. ౩-౫

ఆ రాముఁడు, స్వర్గంబునయుండు దేవమార్గముంబోలె నొప్పుచున్న యారాజమార్గంబుఁ జూచెను.

రాముఁడు, స్నేహితులు సేయు నాశీర్వాదవచనంబుల వినుచు జనుల నందఱను వారివారియోగ్యతకుఁ దగునట్లు గౌరవించుచు వెరుఁగుఁ బేలాలు నక్షతలు మావిస్సును జందనాగరుధూపంబులును నానావిధములగు సుగంధిపుష్పమాలికలును గల్గియుండుమధ్యప్రదేశములతో నొప్పి యెల్లప్పుడు రమణీయంబై యుండు రాజమార్గంబును బ్రవేశించెను. ౬,౭

రాముఁడా! నీవు ఇప్పుడు పట్టాభిషిక్తుఁడవై మున్న నీతాతలును ముత్తాతలును గాపాడినపద్ధతిని మమ్ములం గాపాడుము. ౮

మేము రామునితండ్రికాలంబునను అంతకుమున్న తాతలకాలంబులందును ఎంతసుఖంబు ననుభవించుచుంటిమో రాముఁడు రాజుగా నుండఁగా నంతకన్న నెచ్చుసుఖం బనుభవింపఁగలము. ౯

ఇప్పుడు మాకు భోజనంబేమి భోగాదులేమి యక్కఱలేదు; స్వర్గము మొదలగు పురుషార్థములు నక్కఱలేదు; రాముఁడు రాజ్యంబు నభిషిక్తుండై

యథా పశ్యామ నిర్యాంతం రామం రాజ్యే ప్రతిష్ఠితమ్,

అతో హి నః ప్రియతరం నాన్య త్కించి ద్భవిష్యతి. ౧౧
యదాఽభిషేకో రామస్య రాజ్యేనామితతేజసః,
ఏతా శ్చాన్యా శ్చ సుహృదా ముదాసీనః కథా శ్శుభాః. ౧౨
ఆత్మసంపూజనీ శ్శృణ్వ న్యయౌ రామో మహాపథమ్,

నహి తస్మా న్మనః కశ్చి చ్చక్షుషీ వానరోత్తమాత్. ౧౩
నర శ్శక్నో త్యపాక్రష్టు మతిక్రాన్తేఽపి రాఘవే,

యశ్చ రామం నపశ్యే త్తు యం చ రామో నపశ్యతి. ౧౪
నిన్దిత స్స వసే ల్లోకే స్వాత్మాఽప్యేనం విగర్హతే,

సర్వేషాం హి స ధర్మాత్మా వర్ణానాం కురుతే దయామ్. ౧౫
చతుర్ణాం హి వయస్థానాం తేన తే త మనువ్రతాః,

చతుష్పథాన్దేవపథాం శ్చైత్యా న్యాయతనాని చ. ౧౬
ప్రదక్షిణం పరిహర న్జగామ నృపతే స్సుతః,

మఱల గృహంబునకుఁ బోవుచుండునప్పుడు అతనిం జక్కఁగాఁ జూచినఁ జాలును. ౧౦

కొలఁదిలేని పరాక్రమంబుగల రాముఁడు రాజ్యంబునకుఁ బట్టాభిషిక్తుఁ డగుటకన్న నితరం బేదియును మాకంత ప్రియంబుకాదు. ౧౧

రాముఁడు స్నేహితులు దనకు మంగళంబుగల్గునట్లు పొగడుచుఁ జెప్పిన యామాటలను, మఱియు నితరములను వినుచు ధీరోదాత్తుండు కావున దన్నుఁ బొగడినప్పుడు గలుగవలసిన యుత్సాహంబునొందక నిర్వికారుఁడై రాజమార్గంబున బోయెను. ౧౨

పురుషులుసుగూడ నారాముఁ డెంతదూరంబు బోయినప్పటికిని మన స్సులో నతని ధ్యానింపకుండుటకుఁ గాని అతికష్టంబునకైనను గన్నులతో నతనినే చూడకుండుటకుఁగాని శక్తులు కాఁజాలరు; ఇఁక స్త్రీల కట్టితనియం దనురాగాతిశయంబుండుట యేమిచిత్రము! దగ్గఱగానున్నచో సమస్త మును విడిచి యతనినే చూచుచుందురని చెప్పనేల?

ఎవ్వఁడు దర్శనమాత్రంబుననే పరమానందంబు గలుగఁజేయునట్టి రామునింగూడఁ జూడకుండునో రాముఁడును తన్నుఁ జూడకుండుటఁజేసి ఎవ్వనిఁ జూడకుండునో, అప్పురుషు నెల్లప్పుడును ప్రపంచంబున నంద ఱును నిందించుచుందురు; ఇతరులుమాత్రమే కాదు. అతఁడు తానే తన్ను "రామునింజూడనైతి; నావంటిపాపిష్ఠుఁడు లేఁడు; నాజన్మంబేల?" యని నిందించుకొనును. ౧౪

ఆ రాముఁడు ధర్మాత్ముఁడు గావున నాలుగువర్ణంబులవారియందును వారివారివయసునకుఁ దగునట్లు దయయుంచియుండుటవలన వారలందఱు ఆ రామునియందే మిక్కిలియుఁ బ్రీతిగలిగియున్నవారు. ౧౫

దశరథమహారాజు కుమారుఁడగు రాముఁడు నాలుగుదారులు కలయు స్థానములకును దేవాలయంబులకును రచ్చచెట్లకును సభాస్థానంబులకును ప్రదక్షిణంబగునట్లుగాఁ బోయెను. ౧౬

స రాజకుల మాసాద్య మేఘసంఘోపమై శ్శుభైః. ౧౭
ప్రాసాదశృంగై ర్వివిధైః కైలాసశిఖరోపమైః,
ఆవారయద్భి ర్గగనం విమానై రివ పాణ్డురైః. ౧౮
వర్ధమానగృహై శ్చాపి రత్నజాలపరిష్కృతైః,
తత్పృథివ్యాం గృహావరం మహేన్ద్రభవనోపమమ్. ౧౯
రాజపుత్త్రః పితు ర్వేశ్మ ప్రవివేశ శ్రియా జ్వలన్,

సకక్ష్యా ధన్విభి ర్గుప్తా స్తిస్రోఽతిక్రమ్య వాజిభిః. ౨౦
పదాతి రపరే కక్ష్యే ద్వే జగామ నరోత్తమః,

స సర్వా స్సమతిక్రమ్య కక్ష్యా దశరథాత్మజః. ౨౧
సన్నివర్త్య జనం సర్వం శుద్ధాన్తం పున రభ్యగాత్,
తతః ప్రవిష్టే పితు రన్తికం తదా
జన స్స సర్వో ముదితో నృపాత్మజే. ౨౨
ప్రతీక్షతే తస్య పున శ్చ నిర్గమం
యథోదయం చన్ద్రమస స్సరిత్పతిః.

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే సప్తదశస్సర్గః.

---

## అష్టాదశస్సర్గః

స దదర్శాసనే రామో నిషణ్ణం పితరం శుభే,
కైకేయీసహితం దీనం ముఖేన పరిశుష్యతా. ౧

స పితు శ్చరణౌ పూర్వ మభివాద్య వినీతవత్,

రాచకొమరుఁడగు నారాముఁడు దశరథగృహంబుఁ జేరి కాంతిచేఁ వెలుంగుచు, మేఘసమూహంబులుఁబోలె నున్నవియును మంగళకరంబులును నానావిధంబులును కైలాసశిఖరంబులుంబోలె ధవళంబులు నున్నతంబులునై చాలదూరము ఆకాశము నడ్డగించి తెల్లనివిమానంబులుఁబోలెఁ జూపట్టుచున్న మేడలును మణిసమూహంబుల నలంకృతంబులై వర్ధమానలక్షణంబుతోఁ గట్టంబడిన యిండ్లును గలిగి భూలోకంబునందుండు సమస్తగృహంబుల లోను శ్రేష్ఠం బనఁదగి దేవేంద్రునిగృహంబునకు సాటియగుచున్న తన తండ్రి దశరథునిగృహంబుఁ బ్రవేశించెను. ౧౭-౧౯

పురుషశ్రేష్ఠుఁడగు నారాముఁడు ధనుర్ధరులచే నెవరు రాకుండునట్లు రక్షింపఁబడియుండు తొట్టికట్టులను మూఁడింటిని రథంబుపైనుండియే దాటి యంత రథంబు డిగ్గి యవ్వలితొట్టికట్టులను రెండింటిని పాదచారియై దాఁటెను. ౨౦

దశరథునికుమారుఁడగు నారాముఁడు అన్నితొట్టికట్లను దాఁటి తన వెంబడివచ్చిన జనులనందఱి మఱలించి అంతఃపురమునకుఁ బోయెను. ౨౧

అంత నప్పుడు రాచకొమరుఁడగు రాముఁడు తండ్రియొద్దకుఁబోఁగానే యతనివెంబడివచ్చిన జనంబంతయుం సముద్రంబు చంద్రోదయంబుగోరుమాడ్కి నారామునిరాకఁ గోరుచుండెను. ౨౨

ఇది పదునేడవసర్గము.

---

## పదునెనిమిదవ సర్గము

ఉత్తమంబగు నాసనంబునఁగూర్చుండి కైకేయిఁగూడి కాంతిదఱిగిన ముఖంబుతో దుఃఖితుఁడై యున్న దండ్రియగు దశరథుని రాముఁడు చూచెను. ౧

ఆరాముఁడు మిగుల నెచ్చరికగలవాఁడై వినయంబున మొదలు తండ్రి

తతో వవన్దే చరణౌ కైకేయ్యా స్సుసమాహితః. ౨

రామే త్యుక్త్వా చ వచనం బాష్పపర్యాకులేక్షణః,
శశాక నృపతి ర్దీనో నేక్షితుం నాభిభాషితుమ్. 3

తదపూర్వం నరపతే ర్దృష్ట్వా రూపం భయావహమ్,
రామోఽపి భయ మాపన్నః పదా స్పృష్ట్వేవ పన్నగమ్. ౪

ఇన్ద్రియై రప్రహృష్టై స్తం శోకసన్తాపకర్శితమ్,
నిశ్వస న్తం మహారాజం వ్యథితాకులచేతసమ్. ౫
ఊర్మిమాలిన మక్షోభ్యం క్షుభ్య న్త మివ సాగరమ్,
ఉపప్లుతమివాదిత్య ముక్తానృతమృషిం యథా. ౬

అచిన్త్యకల్పం హి పితు స్తం శోకముపధారయన్,
బభూవ సంరబ్ధతర స్సముద్ర ఇవ పర్వణి. ౭

చిన్తయామాస చ తదా రామః పితృహితే రతః,

కింస్వి దద్యైవ నృపతి ర్న మాం ప్రత్యభినన్దతి. ౮

అన్యదా మాం పితా దృష్ట్వా కుపితోఽపి ప్రసీదతి,
తస్య మామద్య సంప్రేక్ష్య కిమాయాసః ప్రవర్తతే. ౯

యగు దశరథునిపాదంబులకు మ్రొక్కి యటుపిమ్మటఁ గైకేయిపాదంబులకు నమస్కరించెను.

దశరథమహారాజు, "రాముఁడా!" అని మాత్రముచెప్పి యంతఁ గండ్లనిండఁ గన్నీరుపెట్టుకొని, పరమదుఃఖంబునొంది రామునిఁ జూచుటకుఁ గాని పైమాటలు వలుకుటకుఁగాని శక్తుఁడు కాఁడయ్యె. ౩

దశరథమహారాజునకు ఎప్పుడును గలుగనియట్టి భయంకరంబగు దుఃఖము గల్గుటఁ జూచి ఎట్టిదుఃఖంబులను సరకుసేయని రాముఁడునుఁ గూడఁ దన్నుఁ గుఱించి దశరథుఁడు దుఃఖము నొందియుండునని తలంచి పామును గాల ద్రొక్కినవాఁడుఁబోలె మిగుల భయంబునొందెను. ౪

దుఃఖితంబులగు నింద్రియంబులతోఁ గూడి దుఃఖంబునను సంతాపంబుననుఁ గుందుచు నిట్టూర్పులుపుచ్చుచు దుఃఖంబునం గలఁతఁజెందిన మనంబుగలిగి, యెంతమాత్రము క్షోభింపఁజేయరానిదయ్యు క్షోభంబు నొందిన సముద్రంబుఁబోలె నతిధీరుఁడయ్యు వ్యాకులితుఁడై రాహుగ్రస్తుఁడగు సూర్యుని భంగి దబ్బఱలాడినఋషియుఁబోలె నిస్తేజస్కుండై యున్నయాదశరథమహారాజుఁజూచి రాముఁడు భయంబునొందెను. ౫,౬

ఆ రాముఁడు తండ్రియగు దశరథునకు మనంబునఁగూడఁ దలంపఁ గూడనియట్టి దుఃఖము గల్గుటఁజూచి పూర్ణిమలయందు సముద్రుఁడుంబోలె మిక్కిలియుఁ గలఁతనొందెను. ౭

తండ్రికి హితముసేయుటయందే మిగుల యాసక్తిగలరాముఁ డప్పు డిట్లు యాలోచించెను.

ఏమో! కారణము తెలియలేదు; ఇప్పుడుమాత్రము దశరథమహారాజునకు నన్నుఁజూచినంత సంతోషముగలుగక దుఃఖంబు గలుగుచున్నది. ౮

ఇంతకుమునుపు దశరథుఁడు కోపమునొందియున్నను నన్నుఁజూడఁగానే కోపంబువిడిచి సంతోషంబునొందును; అట్టి దశరథునకిప్పుడు నను జూడఁగానే దుఃఖంబుగలుగుచున్నదే! ఏమికారణము? అని రాముఁ డాలోచించెను. ౯

స దీన ఇవ శోకార్తో విషణ్ణవదనద్యుతిః,
కైకేయీ మభివాద్యైవ రామో వచన మబ్రవీత్. ౧౦

కచ్చి న్మయా నాపరాద్ధ మజ్ఞానాద్యేన మే పితా,
కుపిత స్తన్మ మాచక్ష్వ త్వం చైవైనం ప్రసాదయ. ౧౧

అప్రసన్నమనాః కిన్ను సదా మాం ప్రతి వత్సలః,
వివర్ణవదనో దీనో నహి మామభిభాషతే. ౧౨

శారీరో మానసో వాపి కచ్చిదేనం న బాధతే,
సన్తాపో వాఽభితాపో వా దుర్లభం హి సదా సుఖమ్. ౧౩

కచ్చి న్న కించి ద్భరతే కుమారే ప్రియదర్శనే,
శత్రుఘ్నే వా మహాసత్త్వే మాతౄణాం వా మమా శుభమ్.

అతోషయ న్మహారాజ మకుర్వ న్వా పితు ర్వచః,
ముహూర్త మపి నేచ్ఛేయం జీవితుం కుపితే నృపే. ౧౫

యతో మూలం నరః పశ్యే త్ప్రాదుర్భావ మిహాత్మనః,
కథం తస్మి న్నవర్తేత ప్రత్యక్షే సతి దైవతే. ౧౬

కచ్చి త్తే పరుషం కించి దభిమానా త్పితా మమ,
ఉక్తో భవత్యా కోపేన యత్రాస్య లులితం మనః. ౧౭

ఏత దాచక్ష్వ మే దేవి! తత్త్వేన పరిపృచ్ఛతః,

ఆరాముఁడు; ధీరుఁడయ్యును ధైర్యంబులేనివాఁడుంబోలె దుఃఖంబు నొంది కాంతిలేనిముఖంబుతోఁ గైకేయికి నమస్కరించినంతనే ఆవిడంజూచి యిట్లని చెప్పెను. ౧౦

నే నజ్ఞానంబున నేమైన నపరాధంబుచేయలేదుగదా? నాతండ్రి దశరథుఁడేల యిట్లు కోపించియున్నాఁడు? నాకాకారణంబుఁ జెప్పుము, నీవే యితనికిఁ గోపంబు పోవునట్లుచేయుము. ౧౧

నాయందెల్లప్పుడును మిగులఁ బ్రేమగలిగియుండు నాతండ్రి దశరథుఁడు ఇప్పుడెందువలన నన్నుఁజూచి ప్రసన్నుఁడుగాక వెల్లఁబాఱిన మొగంబుతో దుఃఖితుఁడై నాతో నేమియుఁ బలుకకున్నాఁడు? ౧౨

ఈ దశరథమహారాజునకు శరీరవ్యాధిగాని మనోదుఃఖముగాని లేకున్నదిగదా? మనుష్యుల కెల్లప్పుడును సుఖంబె కలుగదు కావున సంశయించెదను. ౧౩

మాపరులకు సంతోషంబు గల్గించుబాలుఁడగు భరతునకుఁగాని మహాబలుఁడగు శత్రుఘ్నునకుఁగాని, నాతల్లులలో నెవ్వరికైనఁగాని యమంగళంబేమియుం లేదుగదా? ౧౪

నాతండ్రియగు దశరథమహారాజు కోపంబు నొందియుండఁగా నతనికి సంతోషంబుసేయకగాని యతఁడు చెప్పుకార్యంబు సేయకగాని కొంచెము సేపైనను జీవింపనొల్లను. ౧౫

మనుష్యుఁడు తా నీలోకంబునఁ బుట్టుట కెవ్వఁడు కారణమో అట్టి ప్రత్యక్షదైవమయిన తండ్రికి వశ్యుఁడై యెట్లుండఁడు? అవశ్యము వశ్యుండైయేయుండును. ౧౬

నాతండ్రియగుదశరథునిఁ గూర్చి నీ వేమైన స్నేహగర్వంబునఁ గోపించి కఠినవచనంబులం బలికితివాయేమి? దానిచేత నిట్లు మనసున కాయాసంబుఁగలిగినదా? ౧౭

తల్లివగుకైకేయీ! దశరథమహారాజునకు మును పెప్పుడును గలుగని

కిం నిమిత్త మపూర్వోఽయం వికారో మనుజాధిపే. ౧౮

ఏవ ముక్తా తు కైకేయీ రాఘవేణ మహాత్మనా,
ఉవాచేదం సునిర్లజ్జా ధృష్ట మాత్మహితం వచః. ౧౯

న రాజా కుపితో రామ! వ్యసనం నాస్య కించన,
కిఞ్చి న్మనోగతం త్వస్య త్వద్భయాన్నాభిభాషతే. ౨౦

ప్రియం త్వా మప్రియం వక్తుం వాణీ నాస్యోపవర్తతే,
తదవశ్యం త్వయా కార్యం యదనేనాశ్రుతం మమ. ౨౧

ఏష మహ్యం వరం దత్త్వా పురా మా మభిపూజ్య చ,
స పశ్చా త్తప్యతే రాజా యథాఽన్యః ప్రాకృత స్తథా. ౨౨

అతిసృజ్య దదానీతి వరం మమ విశాంపతిః,
స నిరర్థం గతజలే సేతుం బంధితు మిచ్ఛతి. ౨3

ధర్మమూల మిదం రామ! విదితం చ సతా మపి,
తత్సత్యం న త్యజే ద్రాజా కుపిత స్త్వత్కృతే యథా. ౨౪

యది త ద్వక్ష్యతే రాజా శుభం వా యది వాఽశుభమ్,

యిట్టివికారం బెందువలనఁ గల్గినది? నాకు దీని యథార్థముగాఁ జెప్పుము. అని రాముఁడు కైకేయితోఁ జెప్పెను. ౧౭

మహాత్ముఁడగు రాముఁడు చెప్పినమాటను విని, కైకేయి పెరిమిటికి దుఃఖంబు గలిగించితి నరి యెట్లు చెప్పవచ్చునని సిగ్గింతమాత్రమును లేనిదై ప్రత్యక్షంబుగా "నీకు బట్టాభిషేకంబువలదు, నీ వడవికిఁబొమ్ము" అని యెట్లు చెప్పవచ్చునని యెంతమాత్రము జంకులేక తనకు హితమగునట్లుగా రాముని తో నిట్లని చెప్పెను. ౧౯

రాముఁడా! దశరథుఁడు కోపంబునొందలేదు. ఇతని కేమియుదుఃఖంబులేదు. ఇతనిమనసున నొకకోర్కిమాత్ర మున్నది. నీ వేమిచెప్పుదువో అనుభయంబున దానిం జెప్పకున్నాఁడు. ౨౦

నీవు ప్రియుండవు కావున నీ కప్రియవార్తఁ జెప్పుటకు నితనికి నోరాడకున్నది.

నా కితఁ డేకార్యము చేసెదనని ప్రతిజ్ఞఁజేసియున్నాఁడో ఆ కార్యమును నీ వవశ్యముచేయవలెను. ౨౧

సత్యము నే మాటలాడుదు నని యెడువ్రతంబు పట్టియుండు నీదశరథమహారాజు మున్ను నన్ను గౌరవింపవలసిన కాలంబున నాకు వరంబొసఁగి నన్ను గౌరవించి యిప్పుడు దబ్బఱలాడునట్టి తెలివిలేనివాఁడుఁబోలె నేల యిచ్చితినని దుఃఖించుచున్నాఁడు. ౨౨

ఈ దశరథమహారాజు నాకు వరంబిచ్చెదనని ప్రతిజ్ఞచేసి చెఱువులోని నీళ్లుపోయినవెనుకఁ గట్టం గట్టఁగోరునట్లు, ఇప్పుడు ఏల ప్రతిజ్ఞచేసితి నని వ్యర్థముగాఁ జింతించుచున్నాఁడు. ౨౩

రాముఁడా! సత్యము ధర్మమునకంతయుఁ గారణ మయినది అట్లు పెద్దలు చెప్పుచున్నారు. కావున దశరథమహారాజు నీకుఁగా నామీఁదఁ గోపించి సత్యంబును విడువకుండునట్లు చేయుము. ౨౪

దశరథమహారాజు చెప్పుకార్యమును అది నీకు మేలుగాని కీడుగాని

కరిష్యసి తత స్సర్వ మాఖ్యాస్యామి పున స్త్వహమ్. ౨౫

యది త్వభిహితం రాజ్ఞా త్వయి త న్నవిపత్స్యతే,
తతో௨హ మభిధాస్యామి న హ్యేష త్వయి వక్ష్యతి. ౨౬

ఏతత్తు వచనం శ్రుత్వా కైకేయ్యా సముదాహృతమ్,
ఉవాచ వ్యథితో రామ స్తాం దేవీం నృపసన్నిధౌ. ౨౭

అహో! ధి ఙ్నార్హసే దేవి వక్తుం మా మీదృశం వచః,

అహం హి వచనా ద్రాజ్ఞః పతేయ మపి పావకే. ౨౮
భక్షయేయం విషం తీక్ష్ణ మ్మజ్జేయ మపి చార్ణవే,

నియుక్తో గురుణా పిత్రా నృపేణ చ హితేన చ. ౨౯

త ద్బ్రూహి వచనం దేవి రాజ్ఞో య దభికాంక్షితమ్,
కరిష్యే ప్రతిజానేచ రామో ద్విర్నాభి భాషతే. ౩౦

త మార్జవసమాయు క్త మనార్యా సత్యవాదినమ్,
ఉవాచ రామం కైకేయీ వచనం భృశదారుణమ్. ౩౧
పురా దైవాసురే యుద్ధే పిత్రా తే మమ రాఘవ,
రక్షితేన వరౌ దత్తౌ సశల్యేన మహారణే. ౩౨

చేసెదనని నీ వొప్పుకొందువేని నేనే యాకార్యము నంతయు నీకుఁ జెప్పెదను. ౨౫

దశరథమహారాజు చెప్పుమాటలను నీవు, "అవశ్యము సఫలముగాఁ జేసెదనని" ప్రతిజ్ఞచేయుదువేని యప్పుడు నేను దశరథమహారాజునకు బదులుగాఁ జెప్పెదను. ఆయనకు నీకట్టి యప్రియకార్యంబుఁ జెప్ప నోరాడదు. అని కైకేయి రామునితోఁ జెప్పెను. ౨౬

రాముఁడు కైకేయిచెప్పిన యీమాటను వినినంతనే "తండ్రి చేయు నాజ్ఞప్రకారము నడచుకొనునో నడచుకొనఁడో" అని నాయందు సంశయం బుంచఁదగినంతటిస్థితి నాకుఁ గలిగినదే యని దుఃఖంబు నొంది దశరథమహారాజుసమీపంబున నాకైకేయిని జూచి యిట్లని చెప్పెను. ౨౭

అయ్యో! నేను బ్రతికియుండి యేమిప్రయోజనము? తల్లి వగు కైకేయీ! నాయం దిట్టిసంశయం బుంచవలదు.

దశరథమహారా జాజ్ఞాపించునేని నేను అగ్నిహోత్రంబునందైనను బడుదును. తీక్ష్ణమగువిషంబునుఁ గూడఁ దినుదును. సముద్రమునందును గూడ దుముకుదును. ౨౮

ఆచార్యులలో ముఖ్యుఁడును దండ్రియును రాజును ఇందునందును మేలుసేయువాఁడునగు దశరథుఁ డాజ్ఞాపించినప్పుడు నే నేకార్యమునైనను చేయుదును. సంశయింపవలదు. ౨౯

కైకేయీ! అందువలన దశరథమహారాజుకోర్కె యేదో దానిం జెప్పుము. దానిఁ జేసెదను. తప్పను. ప్రతిజ్ఞయును గూడఁ జేయుచున్నాను. రాముఁ డెప్పుడును అబద్ధంబుపలుకఁడు అని రాముఁడు కైకేయితోఁ జెప్పెను.

దుష్టురాలయినకైకేయి యెంతమాత్రము కౌటిల్యములేనివాఁడై సత్యవాదియైయుండు రామునితో మిగుల భయంకరంబగు నీమాటం జెప్పెను. ౩౧

మును పు దేవతలకు నసురులకు యుద్ధముజరిగినప్పుడు మహాయుద్ధంబున నీతండ్రి దశరథుని దేహంబంతయు బాణంబులు గ్రుచ్చుకొనుటఁ జేసి యతఁడు

తత్ర మే యాచితో రాజా భరతస్యాభిషేచనమ్,
గమనం దణ్డకారణ్యే తవ చాద్యైవ రాఘవ. ౩౩

యది సత్యప్రతిజ్ఞం త్వం పితరం కర్తు మిచ్ఛసి,
ఆత్మానం చ నరశ్రేష్ఠ! మమ వాక్య మిదం శృణు. ౩౪
సన్నిదేశే పితుస్తిష్ఠ యథా తేన ప్రతిశ్రుతమ్,
త్వయాఽరణ్యం ప్రవేష్టవ్యం నవ వర్షాణి పఞ్చ చ. ౩౫

భరతశ్చాభిషిచ్యేత య దేత దభిషేచనమ్,
త్వదర్థే విహితం రాజ్ఞా తేన సర్వేణ రాఘవ!. ౩౬

సప్త సప్త చ వర్షాణి దణ్డకారణ్య మాశ్రితః,
అభిషేక మిమం త్యక్త్వా జటాజినధరో వస. ౩౭
భరతః కోసలపురే ప్రశాస్తు వసుధా మిమామ్,
నానారత్నసమాకీర్ణాం సవాజిరథకుఞ్జరామ్. ౩౮

ఏతేన త్వాం నరేన్ద్రోఽయం కారుణ్యేన సమాప్లుతః,
శోకసంక్లిష్టవదనో న శక్నోతి నిరీక్షితుమ్. ౩౯

ఏతత్కురు నరేన్ద్రస్య వచనం రఘునన్దన!,

సత్యేన మహతా రామ! తారయస్వ నరేశ్వరమ్. ౪౦

సోలఁగా నే నా బాణంబు లన్నియుఁ బెఱికి బాగుచేసినాను. కావున నాకు నీతండ్రి రెండువరంబు లిచ్చెను. ౩౨

రాముఁడా! నే నా రెండువరంబులకును భరతునకుఁ బట్టాభిషేకము గావలెననియుం నీ విపుడే దండకారణ్యంబునకుఁ బోవలయుననియుం, దశరథ మహారాజు నడిగినాను. ౩౩

పురుషశ్రేష్ఠుఁడవగు రాముఁడా! నీతండ్రియుం నీవును అబద్ధముచెప్పని వారమని యనిపించుకొనఁగోరితేని యిప్పుడు నేను చెప్పినట్లు వినుము. ౩౪

నీవు నీతండ్రియగు దశరథుఁ డాజ్ఞాపించునట్లు చేయుము. అతఁడు నాకు వాగ్దత్తము చేసియున్నట్లు నీవు పదునాలుగుసంవత్సరములు అరణ్యంబుననుండవలెను. ౩౫

రాముఁడా! ఇప్పుడు నీకుఁ బట్టాభిషేకము సేయవలయు నని దశరథ మహారాజు సిద్ధముచేసియుండు నభిషేకసామగ్రిచేత భరతునకే పట్టాభిషేకము సేయవలెను. ౩౬

నీ వీపట్టాభిషేకమును విడిచి, పదునాలుగుసంవత్సరములు దండకారణ్యమందు జడలుఁ గృష్ణాజినంబును దాల్చుచు వాసంబు సేయుము. ౩౭

భరతుఁడు అయోధ్యాపట్టణంబుననుండి నానావిధమణులతోను గుఱ్ఱములతోను రథములతోను ఏనుఁగులతోనుఁ గూడి, యీరాజ్యంబుఁ బాలింపుచుండుఁగాక. ౩౮

ఈకారణముచేత నే యీ దశరథమహారాజు మహాదయాశాలి కావునఁ బ్రియపుత్రుఁడవగు నిన్ను వనంబున కంపవలసివచ్చె నే యని దుఃఖంబున మొగంబు వంచి నిన్నుఁజూడ నేరకున్నాఁడు. ౩౯

రాముఁడా! ఈ దశరథమహారాజుమాటప్రకారము నీవు పట్టాభిషేకంబు విడిచి యరణ్యంబునఁ బదునాలుగుసంవత్సరంబు లుండుము.

రాముఁడా; నీ వీదశరథమహారాజుమాటను సత్యముంగాఁజేసి యితని కసత్యదోషము లేకుండునట్లు సేయుము. ౪౦

ఇతీవ తస్యాం పరుషం వదన్త్యాం
న చైవ రామః ప్రవివేశ శోకమ్,
ప్రవివ్యథే చాపి మహానుభావో
రాజా తు పుత్రవ్యసనాభితప్తః. ౪౧

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డేఽష్టాదశస్సర్గః.

## ఏకోనవింశస్సర్గః

తదప్రియ మమిత్రఘ్నో వచనం మరణోపమమ్,
శ్రుత్వా న వివ్యథే రామః కైకేయీం చేద మబ్రవీత్. ౧

ఏవ మస్తు గమిష్యామి వనం వస్తు మహం త్వితః,
జటాజినధరో రాజ్ఞః ప్రతిజ్ఞా మనుపాలయన్. ౨

ఇదం తు జ్ఞాతు మిచ్ఛామి కిమర్థం మాం మహీపతిః,
నాభినన్దతి దుర్ధర్షో యథాపుర మరిన్దమః. 3

మన్యు ర్నచ త్వయా కార్యో దేవి! బ్రూమి తవాగ్రతః,
యాస్యామి భవ సుప్రీతా వనం చీరజటాధరః. ౪

హితేన గురుణా పిత్రా కృతజ్ఞేన నృపేణ చ,
నియుజ్యమానో విస్రబ్ధః కిం న కుర్యా మహం ప్రియమ్. ౫

అలీకం మానసం త్వేకం హృదయం దహతీవ మే,
స్వయం యన్నాహ మాం రాజా భరతస్యాభిషేచనమ్. ౬

అకైకేయి యిట్లు పరుషవచనంబులఁ జెప్పఁగా రామున కెంతమాత్రము దుఃఖంబుగలుగదయ్యె. మహానుభావుఁడయినను దశరథమహారాజుమాత్రము పుత్రదుఃఖంబునకుఁ గుందుచు మిక్కిలియు మనోవ్యథంబొందెను. ౪౧

ఇది పదునెనిమిదవ సర్గము.

---

## పందొమ్మిదవ సర్గము

శత్రువులఁజంపునట్టిరాముఁడు అప్రియంబును మరణంబువంటిదియు నగు నామాటను విని యెంతమాత్రమును దుఃఖంబు నొందక కైకేయిం జూచి యిట్లని చెప్పెను. ౧

నీవు చెప్పినట్లు భరతుఁడు రాజగుఁగాక. నేను దశరథమహారాజు చేసిన ప్రతిజ్ఞఁ జొప్పున నడవికిఁ బోయి జడలను కృష్ణాజినంబును దాల్చి వాసంబుచేసెదను. ౨

శత్రువుల కెదిరింపఁగూడనివాఁడును శత్రువుల నడఁగఁ ద్రొక్కువాఁడు నగుదశరథమహారాజు మునుపటివలె నన్నేల యుంపలాలింపకున్నాఁడు? దీనినిమాత్రము తెలియఁగోరుచున్నాను. ౩

కైకేయి! నీవును గోపంబు సేయవలదు. నేను నీయెదుటనే నారచీరలును జడలునుఁ దాల్చి యడవికిఁ బోయెదను. మిగుల సంతోషంబు గలిగియుండుము. ౪

దశరథుఁడు నాకు హితుఁడు. ఆచార్యులలో ముఖ్యుఁడు. తండ్రి. కొంచెము మంచిచేసినను దాని నధికముగాఁ దలఁచి బహుమానించువాఁడు. మఱియు రాజు అట్టి దశరథుఁ డాజ్ఞాపింపఁగా నేను విశ్వాసంబు గలిగి నతనికిఁ బ్రియంబగుకార్యమును దేనిఁ జేయను? ఎద్దియైనఁ జేయుందును. ౫

దశరథమహారాజు భరతునకుఁ బట్టాభిషేకముసేయు వృత్తాంతమును తానె నాతోఁ జెప్పలేదే యనునది ఒక దుఃఖముమాత్రము నామనస్సును

అహం హి సీతాం రాజ్యం చ ప్రాణానిష్టా న్ధనాని చ,
హృష్టో భ్రాత్రే స్వయం దద్యాం భరతాయా ప్రచోదితః. ౭

కింపున ర్మనుజేన్ద్రేణ స్వయం పిత్రా ప్రచోదితః,
తవ చ ప్రియకామార్థం ప్రతిజ్ఞా మనుపాలయన్. ౮

తదాశ్వాసయ హీమం త్వం కి న్న్విదం య న్మహీపతిః,
వసుధాస క్తనయనో మన్ద మశ్రూణి ముఞ్చతి. ౯
గచ్ఛన్తు చై వానయితుం దూతా శ్శీఘ్రజవై ర్హయైః,
భరతం మాతులకులా దద్యైవ నృపశాసనాత్. ౧౦
దణ్డకారణ్య మేషోఽహా మితో గచ్ఛామి సత్వరః,
అవిచార్య పితు ర్వాక్యం సమా వస్తుం చతుర్దశ. ౧౧

సా హృష్టా తస్య త ద్వాక్యం శ్రుత్వా రామస్య కైకయీ,
ప్రస్థానం శ్రద్దధానా హి త్వరయామాస రాఘవమ్. ౧౨

ఏవం భవతు యాస్య న్తి దూతా శ్శీఘ్రజవై ర్హయైః,
భరతం మాతులకులా దుపావ ర్తయితుం నరాః. ౧౩
తవ త్వహం క్షమం మన్యే నోత్సుకస్య విలమ్బనమ్,

రామ! తస్మా దిత శ్శీఘ్రం వనం త్వం గన్తు మర్హసి. ౧౪

వ్రీడాన్వితస్స్వయం యచ్చ నృపస్త్వాం నాభిభాషతే,

దహించునట్లు బాధించుచున్నది. ౬

నేను ఎవ్వరును ప్రేరింపకున్నను నేనైయే నాతమ్ముఁడగు భరతునకు నాభార్యయగు సీతనుగాని రాజ్యంబునుగాని ప్రియంబులగు ప్రాణంబులను గాని ధనంబులనుగాని సంతోషంబున నిత్తును. ౭

అట్టినేను నాకుఁ దండ్రియును రాజునగు దశరథుఁడు తానైయాజ్ఞాపింపఁగా నీకును సంతోషంబు గల్గునట్లుండఁగా నేను "నీవు చెప్పినదిచేసెదను" అని ప్రతిజ్ఞ చేసియుండఁగా నిట్టిసమయంబున భరతునకు రాజ్యంబును మాత్రము నిత్తునని చెప్పనేల? ౮

అందువలన నీవీదశరథమహారాజు నాశ్వాసింపుము. ఇతఁడు నేలం జూచుచుఁ దిన్నగాఁ గన్నీళ్లు విడుచుచున్నాఁడే. ఇదియేమి? ౯

ఇప్పుడు రాజాజ్ఞవలన దూతలు వేగంబుగాఁ బోవు గుఱ్ఱంబుల నెక్కి మాతులగృహమునందుండి భరతునిఁదోడ్కొనివచ్చుటకై పోవలయును.

నేను తండ్రియాజ్ఞ నవలంబించి యుక్తాయుక్తంబులు విచారింపక పదునాలుగుసంవత్సరంబులు వాసంబుసేయుటకై శీఘ్రముగా దండకారణ్యమునకుఁ బోయెదను అని రాముఁడు కైకేయితోఁ జెప్పెను. ౧౧

అకైకేయి రాముని మాటను విని సంతోషంబునొంది రాముఁడు పయనంబగుటయందు శ్రద్ధగలవాఁడై శీఘ్రంబుగాఁ బయనంబగుటకై రాముని వేగిర పఱచెను. ౧౨

నీవు చెప్పిన ట్లగుఁగాక రాయబారులగువారు మాతులగృహంబునం దుండి భరతుం గొనివచ్చుటకై వేగంబుగాఁబోవు గుఱ్ఱంబుల నెక్కిపోవుదురు.

నీవు వనంబునకుఁ బోవుట కుత్సాహంబు గల్గియున్నావు. కావున నీవు జాగుసేయుట యుక్తముగాదని నాకుఁ దోఁచుచున్నది. ౧౩

రాముఁడా! అందువలన నీ విచ్చటనుండి జాగుసేయక శీఘ్రంబుగా వెడలిపోవలయును. ౪౧

పురుషశ్రేష్ఠుండవగురాముఁడా! దశరథమహారాజు రాముఁడు నా.

నైత త్కించి న్నరశ్రేష్ఠ! మన్యురేషోఽపనీయతామ్. ౧౫

యావ త్త్వం న వనం యాతః పురాదస్మాదభిత్వరన్,
పితా తావ న్న తే రామ! స్నాస్యతే భోక్ష్యతేఽపి వా. ౧౬

ధిక్కష్ట మితి నిశ్వస్య రాజా శోకపరిప్లుతః,
మూర్ఛితో న్యపత త్తస్మి న్పర్యఙ్కే హేమభూషితే. ౧౭

రామో ప్యుత్థాప్య రాజానం కైకేయ్యాభిప్రచోదితః,
కశయేవాహతో వాజీ వనం గన్తుం కృతత్వరః. ౧౮

త దప్రియ మనార్యాయా వచనం దారుణోదయమ్,
శ్రుత్వా గతవ్యథో రామః కైకేయీం వాక్య మబ్రవీత్. ౧౯

నాహ మర్థపరో దేవి! లోక మావస్తు ముత్సహే,

విద్ధి మా మృషిభి స్తుల్యం కేవలం ధర్మమాస్థితమ్. ౨౦

య దత్ర భవతః కిఞ్చి చ్ఛక్యం కర్తుం ప్రియం మయా,
ప్రాణానపి పరిత్యజ్య సర్వథా కృత మేవ తత్. ౨౧

న హ్యతో ధర్మచరణం కించి దస్తి మహత్తరమ్,
యథా పితరి శుశ్రూషా తస్య వా వచనక్రియా. ౨౨

మాటసత్యము సేయునో సేయఁడో అని సిగ్గుపడియుండుటంజేసి నీతో నేమియుం మాటలాడకున్నాఁడే కాని వేఱుగాదు. నీవు వనంబునకుఁ బోయి యీసిగ్గునుం బోవునట్లు సేయుము. ౧౫

రాముఁడా ; నీ వెంతవఱకు శీఘ్రంబుగా వనంబునకుం బోవక యీపట్టణంబునం దుండెదవో అంతవఱకు నీతండ్రి దశరథుఁడు స్నానమునుగాని భోజనమునుగాని చేయఁడు. అని కైకేయి రామునితోఁ జెప్పెను. ౧౬

దశరథమహారాజు కైకేయిచెప్పిన భయంకరవాక్యంబు విని నేను దహింపఁబడుదునుగాక. ఎంతకష్టము. అని చెప్పి దుఃఖంబున మూర్ఛనొంది బంగారముచే నలంకరింపఁబడియుండు నా శయనంబుపైఁ బడెను. ౧౭

రాముఁడును అట్లు మూర్ఛిల్లినదశరథుని నెత్తిపట్టి కైకేయి యట్లు వేగిర పఱచినది కావునఁ జబుకునం గొట్టంబడిన గుఱ్ఱంబుఁబోలె నప్పుడే యతి వేగంబున వనంబునకుఁ బోవ నిశ్చయించెను. ౧౮

రాముఁడు తనకుఁ జెరుపుదెచ్చుటకై త న్నరణ్యంబునకుఁ బొమ్మని చెప్పిన దుష్టురాలగు కైకేయిమాటను విని యెంతమాత్రము దుఃఖము నొందక కైకేయితో నిట్లని చెప్పెను. ౧౯

కైకేయీ! నాకు ధనమునం దాసక్తిలేదు. జనుల ననుసరించియుండవలయునను కోరికయు లేదు.

నేను ఋషివంటివాఁడను. ధర్మమునుమాత్రమే యవలంబించియున్న వాఁడను, ఇంక నేదియు నా కిష్టముగాదు. అని యెఱుంగుము. ౨౦

పూజ్యుఁడగుదశరథుఁడు చెప్పుకార్య మేదైనను అది నాచేఁ బ్రాణంబులు విడిచియయినను జేయఁగూడినదగునేని అట్టికార్యము సిద్ధముగాఁ జేయఁబడినదే యని యెఱుంగుము. ౨౧

“తండ్రికిఁ గాళ్లు పిసుకుట మొదలగు సేవలుచేయుట యతఁడు చెప్పినపనిని జేయుట” దీనికన్నను అధికమయిన ధర్మ మేదియుం లేదు. ౨౨

అనుక్తోఽప్యత్ర భవతా భవత్యా వచనా దహమ్,
వనే వత్స్యామి విజనే వర్షాణీహ చతుర్దశ. ౨౩

న నూనం మయి కైకేయి కిఞ్చి దాశంససే గుణమ్,
య ద్రాజాన మవోచ స్త్వం మమేశ్వరతరా సతీ. ౨౪

యావ న్మాతర మాపృచ్ఛే సీతాం చానునయా మ్యహమ్,
తతోఽద్యైవ గమిష్యామి దణ్డకానాం మహ ద్వనమ్. ౨౫

భరతః పాలయే ద్రాజ్యం శుశ్రూషే చ్చ పితు ర్యథా,
తథా భవత్యా క ర్తవ్యం స హి ధర్మ స్సనాతనః. ౨౬

స రామస్య వచ శ్శ్రుత్వా భృశం దుఃఖహతః పితా,
శోకా దశక్నువ న్బాష్పం ప్రరురోద మహాస్వనమ్. ౨౭

వన్దిత్వా చరణౌ రామో విసంజ్ఞస్య పితు స్తథా,
కైకేయ్యా శ్చా ప్యనార్యాయా నిష్పపాత మహాద్యుతిః. ౨౮

స రామః పితరం కృత్వా కైకేయీం చ ప్రదక్షిణమ్,
నిష్క్రమ్యా న్తఃపురా త్తస్మా త్స్వం దదర్శ సుహృజ్జనమ్. ౨౯
తం బాష్పపరిపూర్ణాక్షః పృష్ఠతోఽనుజగామ హ,
లక్ష్మణః పరమక్రుద్ధ స్సుమిత్రానన్దవర్ధనః. ౩౦

పూజ్యుఁడగు నీదశరథుఁడు తానై "అరణ్యంబునకుఁ బొమ్ము" అని నాకుఁ జెప్పకున్నను నీవు చెప్పినావు. కావున నే నిప్పుడే విజనంబగునరణ్యంబునకుఁబోయి పదునాలుగు సంవత్సరంబులు వాసంబుచేసెదను. ౨౩

కైకేయి! నీవాకరికన్న నెచ్చుగా న న్నాజ్ఞాపింపఁజాలినదానవై నీ మాటనే నే నవశ్యము విననలసినవాఁడనై నీవు చెప్పినట్లు సేయుటకు సిద్ధుఁడనై యుండఁగా నీవు భరతుఁడు పట్టాభిషిక్తుఁడు కావలెను నీ వరణ్యంబునకుఁ బోవలెను అని నాతోఁ జెప్పక దశరథమహారాజును వరరూపంబుగా యాచించితివే. కావున నీవు నాస్వభావంబును గొంచెమైనను విచారింపలేదు. ౨౪

నేను మాతల్లియగు కౌసల్యను వీడ్కొని సీత నూఱడించి యటుపిమ్మట నిమిషంబైనను నిలువక యీదినంబుననే దండకారణ్యంబునకుం బోయెదను. ౨౫

భరతుఁడు రాజ్యంబుఁ బాలించుచుఁ దండ్రికి శుశ్రూష సేయుచుండునట్లు నీవు సేయవలయును. అట్లు తండ్రికి శుశ్రూష సేయుటయే ముఖ్యధర్మము కావునఁ జెప్పినాను. అని రాముఁడు కైకేయితోఁ జెప్పెను. ౨౬

తండ్రియయిన యాదశరథుఁడు పరమధార్మికంబగు రామునిమాటను విని దుఃఖం బినుమడియగుటఁ జేసి కన్నీళ్ల నడంచుకొనఁజాలక గొప్పధ్వనిగా నేడ్చెను. ౨౭

రాముఁ డట్లు మూర్ఛఁబొంది తెలివితప్పియుండుదండ్రికిని దుష్టురాలగు కైకేయికిని నమస్కరించి అట్టి కష్టంబునందును నెంతమాత్రము దుఃఖంబు నొందక "పితృవాక్యపరిపాలనంబునం గల్లుధర్మంబబ్బినదిగాదా!" అని సంతోషంబున నినుమడించినకాంతితో నిల్లు వెడలెను. ౨౮

ఆ రాముఁ డట్లు తండ్రికిని గైకేయికిని బ్రదక్షిణంబుఁ జేసి యాయంతఃపురంబు వెడలి తనస్నేహితులఁ జూచెను. ౨౯

సుమిత్రకొడుకైన లక్ష్మణుఁడు కన్నీళ్లనిండియుండు కండ్లతోఁ బరమకోపంబు నొంది యారామునివెనుకఁ బోయెను. ౩౦

ఆభిషేచనికం భాణ్డం కృత్వా రామః ప్రదక్షిణమ్,
శనై ర్జగామ సాపేక్షో దృష్టిం త త్రావిచారయన్. ౩౧

న చాస్య మహతీం లక్ష్మీం రాజ్యనాశోఽపకర్షతి,
లోకకాన్తస్య కాన్తత్వా చ్ఛీతరశ్మే రివ క్షపా. ౩౨

న వనం గన్తుకామస్య త్యజత శ్చ వసున్ధరామ్,
సర్వలోకాతిగస్యేవ లక్ష్యతే చిత్తవిక్రియా. ౩౩

ప్రతిషిధ్య శుభం ఛత్రం వ్యజనే చ స్వలఙ్కృతే,
విసర్జయిత్వా స్వజనం రథం పౌరాం స్తథా జనాన్. ౩౪
ధారయ న్మనసా దుఃఖ మిన్ద్రియాణి నిగృహ్య చ,
ప్రవివే శాత్మవాన్ వేశ్మ మాతు రప్రియశంసివాన్. ౩౫

సర్వో హ్యభిజన శ్శ్రీమాన్ శ్రీమత స్సత్యవాదినః,
నాలక్షయత రామస్య కిఞ్చి దాకార మాననే. ౩౬

ఉచితం చ మహాబాహు ర్న జహౌ హర్ష మాత్మనః,
శారద స్సముదీర్ణాంశు శ్చన్ద్ర స్తేజ ఇవాత్మజమ్. ౩౭

వాచా మధురయా రామ స్సర్వం సమ్మానయ ఞ్జనమ్,
మాతు స్సమీపం ధీరాత్మా ప్రవివేశ మహాయశాః. ౩౮

తం గుణై స్సమతాం ప్రాప్తో భ్రాతా విపులవిక్రమః,

మంగళపదార్థములు మొదలగువానికిఁ బ్రదక్షిణము సేయుచుఁ బోవలయుఁనని శాస్త్రమునందు విధింపఁబడుటంజేసి రాముఁ డచ్చటనుండు నభిషేకజలసామగ్రికిఁ బ్రదక్షిణముమాత్రముచేసి దానిఁ గంటితోఁగూడఁ జూడక దశరథాజ్ఞ సత్యముకావలెనని ప్రార్థింపుచు మెల్లఁగాఁ బోయెను. ౩౧

లోకంబునకంతయుఁ సంతోషంబు గల్గించునట్టి యీరాముని ముఖకాంతి అధికకాంతిగల్గుటంజేసి రాజ్యంబుపోయినను రాత్రియందుఁ జంద్రుని కాంతి తగ్గకుండునట్లు ఎంతమాత్రమును దగ్గదయ్యె. ౩౨

అట్లు రాజ్యంబును విడిచి యడవికిఁ బోనిశ్చయించియుండు నారామునిమనస్సు సమస్తలోకంబుల విడిచియుండు పరమయోగీంద్రునిమనస్సుం బోలె నెంతమాత్రము వికారమునొందకుండినది. ౩౩

ధీరుఁడగు నారాముఁడు మంగళకరంబగుఛత్త్రంబును జక్కఁగా నలంకరింపఁబడిన చామరంబులనువదలి స్నేహితులను రథమును బట్టణవాసిజనులను విడిచి ధీరోదాత్తుఁడు కావున మనంబున దుఃఖంబు నడఁచుకొని యింద్రియంబుల నిగ్రహించుకొని తల్లి కీ యప్రియవార్తం జెప్పుటకై తల్లియింటికిం బోయెను. ౩౪, ౩౫

రామునకుఁ బట్టాభిషేకంబు జరుగునని యలంకరించుకొని రామునిఁ జుట్టుకొనియుండు జనులకు శ్రీమంతుఁడును సత్యవాదియునగు రాముని మొగంబున నెంతమాత్రమును వికారం బగపడలేదు. ౩౬

శరదృతువునం దధికకాంతితోఁగూడియుండు చంద్రుండు తన కాంతిని విడవకుండునట్లు మహాబాహుఁడగు రాముఁడు స్వాభావికంబగు తన సంతోషంబు నెంతమాత్రమును విడవఁడయ్యె. ౩౭

మహాయశుఁడగు రాముఁడు దుఃఖంబులకు లోఁబడనిమనసుగలవాఁడు గావునఁ, దా నెంతమాత్రమును దుఃఖింపక, జనులనందఱ మధురవాక్యంబుల గౌరవించుచుఁ దనతమ్ముఁడగులక్ష్మణునితోఁ జేరెను. ౩౮

సౌజన్యాదిగుణంబుల రామునకు సరియయి మహాపరాక్రమశాలి

సౌమిత్రి రనువవ్రాజ ధారయ న్దుఃఖ మాత్మజమ్. ౩౯

ప్రవిశ్య వేశ్మాతిభృశం ముదాఽన్వితం
సమీక్ష్య తాం చార్థవిపత్తి మాగతామ్,
నచైవ రామోఽత్ర జగామ విక్రియాం
సుహృజ్జన స్యాత్మవిపత్తిశఙ్కయా. ౪౦

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే ఏకోనవింశస్సర్గః.

## వింశస్సర్గః

తస్మిం స్తు పురుషవ్యాఘ్రే నిష్క్రామతి కృతాఞ్జలౌ,
ఆర్తశబ్దో మహాన్ జజ్ఞే స్త్రీణా మన్తఃపురే తదా. ౧

కృత్యే ష్వచోదితః పిత్రా సర్వస్యా న్తఃపురస్యచ.
గతి ర్య శ్శరణం చాపి స రామోఽద్య ప్రవత్స్యతి, ౨

కౌసల్యాయాం యథా యుక్తో జనన్యాం వర్తతే సదా,
తథైవ వర్తతేఽస్మాసు జన్మప్రభృతి రాఘవః. ౩
న క్రుధ్య త్యభిశప్తోఽపి క్రోధనీయాని వర్జయన్,
క్రుద్ధా న్ప్రసాదయ న్సర్వా న్స ఇతోఽద్య ప్రవత్స్యతి. ౪

అబుద్ధి ర్బత నో రాజా జీవలోకం చర త్యయమ్,

యయియుండు రామునితమ్ముఁడు లక్ష్మణుఁడు మనంబున దుఃఖంబు నడఁచు కొని రాముని వెంబడించిపోయెను. 3౯

రాముఁడు తనకుఁ బట్టాభిషేకంబుగలుగునని మిగుల సంతోషంబుతో నున్నజనులుగలిగియుండు గృహంబుఁజొచ్చి యిప్పుడు తనకు వాటిల్లిన రాజ్యభ్రంశంబును వనవాసంబునుఁ దలఁచుకొని యదియవశ్యము దుఃఖంబు గలిగించుసందర్భంబయ్యును దాను దుఃఖించినచోఁ దనస్నేహితులు ప్రాణంబులు విడుతురనుభయంబున దుఃఖంబునంతయుం మనంబుననే యణఁచుకొని యెంతమాత్రమును వెలిఁ గనబడకుండునట్లు వికారంబుఁజెందకుండెను. ౪౦

ఇది పందొమ్మిదవసర్గము.

---

## ఇరువదియవ సర్గము

పురుషశ్రేష్ఠుఁడగు రాముఁడు కైకేయీ దశరథులకు నమస్కరించి చేతులు మొగిడ్చుకొని బయలువెడలఁగానే యంతఃపురమునందలి స్త్రీలు గట్టిగా నేడ్వనారంభించిరి. ౧

ఎవఁడు తండ్రి చెప్పకున్నను అంతఃపురస్త్రీలమగు మాకందఱకును గావలసినకార్యములంజేసి మమ్ముల నందఱను గాపాడుచుండునో, అట్టి రాముఁ డిప్పుడూరువిడిచి యరణ్యంబున వసింపఁబోవుచున్నాఁడు. ౨

రాముఁడు తల్లియగు కౌసల్య కెట్లు శుశ్రూషలు సేయుచుండునో ఆలాగే పుట్టినది మొదలు మాకును శుశ్రూషలు సేయుచుండును. 3

ఎవ్వఁడు, తన్నుఁ బరు లెంతనిందించినను ఎంతమాత్రము కోపంబు నొందఁడో మఱియుం గోపంబుగల్గించు కార్యంబులవిడుచుచుఁ గోపంబునొంది యుండువారి కోపంబును మంచిమాటలచేఁ బోఁగొట్టుచుండునో అట్టి రాముఁ డిప్పుడు పట్టణంబువిడిచి యరణ్యంబునకుఁ బోవుచున్నాఁడే! ఏమిసేయ వచ్చును!. ౪

మాదశరథమహారాజు దుర్బుద్ధియగుటఁజేసి సమస్తప్రాణులకును రక్ష

యో గతిం సర్వభూతానాం పరిత్యజతి రాఘవమ్. ౫

ఇతి సర్వా మహిష్య స్తా వివత్సా ఇవ ధేనవః,
పతి మాచుక్రుశు శ్చైవ సస్వరం చాపి చుక్రుశుః. ౬
స హి చా న్తఃపురే ఘోర మార్తశబ్దం మహీపతిః,
పుత్రశోకాభిస న్తప్త శ్శ్రుత్వా వ్యాలీయతాఽసనే. ౭
రామ స్తు భృశ మాయస్తో నిశ్శ్వస న్నివ కుఞ్జరః,
జగామ సహితో భ్రాత్రా మాతు ర న్తఃపురం వశీ. ౮

సోఽపశ్య త్పురుషం తత్ర వృద్ధం పరమపూజితమ్,
ఉపవిష్టం గృహద్వారి తిష్ఠత శ్చాపరా న్బహూన్. ౯

దృష్ట్వైవ తు తదా రామం తే సర్వే సహ సోత్థితాః,
జయేన జయతాం శ్రేష్ఠం వర్ధయ న్తి స్మ రాఘవమ్. ౧౦

ప్రవిశ్య ప్రథమాం కక్ష్యాం ద్వితీయాయాం దదర్శ సః,
బ్రాహ్మణా న్వేదసమ్పన్నా న్వృద్ధా న్రాజ్ఞాఽభిసత్కృతాన్. ౧౧

ప్రణమ్య రామ స్తా న్విప్రాం స్తృతీయాయాం దదర్శ సః,
స్త్రియో వృద్ధా స్తథా బాలా ద్వారరక్షణతత్పరాః. ౧౨

వర్ధయిత్వా ప్రహృష్టా స్తాః ప్రవిశ్య చ గృహం స్త్రియః,
న్యవేదయ న్త త్వరితా రామమాతుః ప్రియం తదా. ౧౩

కుఁడగు రాముం నరణ్యంబున కంపి ప్రాణిసమూహంబునకంతయు నాశంబు కలుగఁజేయుచున్నాఁడు. అని అంతఃపురస్త్రీలంద ఱేడ్చిరి. ౫

ఇట్లు ఆ రాజభార్యలందఱు, దూడలం బాసిన యావులుంబోలె దుఃఖించుచుఁ బెనిమిటియగు దశరథుని నిందించుచు గట్టిగా నేడ్చిరి. ౬

పుత్రదుఃఖంబునఁ దపించుచుండు నాదశరథమహారాజు అంతఃపురస్త్రీలయేడ్పును వినినంతనె దుఃఖం బతిశయించుటంజేసి మూర్ఛనొందెను. ౭

రాముఁడును ఆ యంతఃపురస్త్రీల యేడ్పువిని మిగుల దుఃఖంబు నొంది యేనుఁగుంబోలె నిట్టూర్పులుపుచ్చుచు నింద్రియంబుల నిగ్రహించుకొని దుఃఖం బడఁచుకొని తమ్ముని లక్ష్మణునిఁగూడి తల్లి యంతఃపురంబునకుఁ బోయెను. ౮

ఆ రాముఁ డచ్చట ద్వారంబునఁ గూర్చుండియున్నవాని దశరథమహారాజుచే గౌరవింపఁబడువాని వృద్ధపురుషుని మఱియు నిలుచుండియున్నవారల ననేకులనుఁ జూచెను. ౯

అప్పుడు ఆద్వారపాలకులందఱు రామునిఁ జూచినంతనే దిగ్గనలేచి జయంబుగలవారలలో నుత్తముఁడగు నారాముని "నీకు జయంబుగలుగుఁ గాక" యని యాశీర్వదించిరి. ౧౦

ఆరాముఁడు ఇట్లు మొదటితొట్టికట్టుఁజొచ్చి యంత రెండవతొట్టి కట్టున నుండువారల వేదవేత్తల దశరథమహారాజుచేఁ బూజింపఁబడువారల వృద్ధబ్రాహ్మణులఁ జూచెను. ౧౧

ఆ రాముఁడు ఆబ్రాహ్మణులను నమస్కరించి యంత మూఁడవతొట్టి కట్టుఁ జొచ్చి యచ్చట వాకిలిగాచుచుండువారల వృద్ధస్త్రీలను బాలస్త్రీలనుఁ జూచెను. ౧౨

అప్పు డాస్త్రీలు సంతోషంబునొంది రాము నాశీర్వదించి లోనికిం బోయి వేగిరపాటుతో రాముని తల్లికి సంతోషకరంబగు రామాగమనవార్తఁ జెప్పిరి. ౧౩

కౌసల్యాపి తదా దేవీ రాత్రిం స్థిత్వా సమాహితా,
ప్రభాతే త్వకరో త్పూజాం విష్ణోః పుత్రహితైషిణీ. ౧౪
సా క్షౌమవసనా హృష్టా నిత్యవ్రతపరాయణా,
అగ్నిం జుహోతి స్మ తదా మన్త్రవ త్కృతమఙ్గళా. ౧౫

ప్రవిశ్య చ తదా రామో మాతు ర న్తఃపురం శుభమ్,
దదర్శ మాతరం తత్ర హావయ న్తీం హుతాశనమ్. ౧౬
దేవకార్యనిమి త్తం చ తత్రాపశ్య త్సముద్యతమ్,

దధ్యక్షతం ఘృతం చైవ మోదకా న్హవిష స్తథా. ౧౭
లాజా న్మాల్యాని శుక్లాని పాయసం కృసరం తథా,
సమిధః పూర్ణకుంభాం శ్చ దదర్శ రఘునన్దనః. ౧౮

తాం శుక్లక్షౌమసంవీతాం వ్రతయోగేన కర్శితామ్,
తర్పయ న్తీం దదర్శాద్భి ర్దేవతాం దేవవర్ణినీమ్. ౧౯

సా చిర స్యాత్మజం దృష్ట్వా మాతృనన్దన మాగతమ్,
అభిచక్రామ సంహృష్టా కిశోరం బడబా యథా. ౨౦

స మాతర మభిక్రాన్తా ముపసంగృహ్య రాఘవః,
పరిష్వ క్తశ్చ బాహుభ్యా ముపఘ్రాతశ్చ మూర్ధని. ౨౧
త ముపా చ దురాధర్షం రాఘవం సుత మాత్మనః,
కౌసల్యా పుత్రవాత్సల్యా దిదం ప్రియహితం వచః. ౨౨

అప్పుడు కౌసల్య రాత్రియంతయునియమంబుననిద్రమేల్కొనియుండి తెల్లవాఱఁగానే తనకొడుకురామునకు మేలుగలుగుటకై విష్ణుదేవునిఁబూజించెను.

ఎప్పుడును వ్రతంబులుసేయుచుండుటయందు మిగుల నాసక్తిగల యా కౌసల్య యప్పుడు తెల్లపట్టుబట్ట గట్టుకొని మంగళాలంకారంబులు ధరించి సంతోషంబున బ్రాహ్మణులచే హోమముచేయించుచుండెను. ౧౫

అప్పుడు రాముఁడు సుందరంబగు తల్లియంతఃపురంబులోనికిం బోయి యచ్చట బ్రాహ్మణులచే హోమము చేయించుచున్న తల్లిఁ జూచెను. ౧౬

ఆ రాముఁడు అచ్చట సిద్ధమయియుంచఁబడియుండు దేవపూజాసామగ్రినిఁ జూచెను.

రాముఁడు అచ్చట దేవపూజకై యుంచఁబడియుండు పెరుఁగు నక్షతలను నేతిని గుడుములను హవిస్సులను పేలాలను తెల్లపూలమాలికలను క్షీరాన్నమును నువ్వులు బెల్లమును సమిత్తులను జలముతో నిండినకలశంబులను జూచెను. ౧౭,౧౮

తెల్లనిపట్టుబట్ట గట్టికొని జలంబుల విష్ణుతర్పణంబు సేయుచున్నదాని వ్రతోపవాసంబునం గృశించియున్న దాని దేవతలకుం బోలెఁ గాంతిగల్గు దానిఁ గౌసల్యను రాముఁడు చూచెను. ౧౯

ఆ కౌసల్య ధ్యానంబు సేయుచున్నది కావునఁ జిరకాలంబునకుఁ దనకు సంతోషంబుగల్గించు కుమారుఁడు రాముఁడు వచ్చియుండుటఁజూచి పరమ సంతోషంబునొంది ఆఁడుగుఱ్ఱము గుఱ్ఱపుపిల్ల నెదుర్కొనునట్లు రాము నెదుర్కొనెను. ౨౦

ఆ రాముండు తనకెదురుగావచ్చిన కౌసల్యకు నమస్కరించె నంత నాకౌసల్య బాహువుల రామునిఁ గౌఁగిలించికొని శిరంబు మూర్కొనెను.

కౌసల్య కొడుకునం దతిప్రేమగలది కావున శత్రువుల కెదిరింపఁగూడనివానిఁ దనకొడుకును రామునిం జూచి యతనికి సంతోషంబును మేలును గల్గించునట్టి యీ మాటఁ జెప్పెను. ౨౨

వృద్ధానాం ధర్మశీలానాం రాజర్షీణాం మహాత్మనామ్,
ప్రాప్నుహ్యాయు శ్చ కీర్తిం చ ధర్మం చోపహితం కులే. ౨౩

సత్యప్రతిజ్ఞం పితరం రాజానం పశ్య రాఘవ!,
అద్యైవ హి త్వాం ధర్మాత్మా యౌవరాజ్యేఽభిషేక్ష్యతి. ౨౪

దత్త మాసన మాలభ్య భోజనేన నిమన్త్రితః,
మాతరం రాఘవః కిఞ్చి ద్వ్రీడా త్ప్రాఞ్జలి రబ్రవీత్. ౨౫

స స్వభావవినీత శ్చ గౌరవా చ్చ తదా నతః,
ప్రస్థితో దణ్డకారణ్య మాప్రష్టు ముపచక్రమే. ౨౬

దేవి! నూనం నజానీషే మహ ద్భయ ముపస్థితమ్,
ఇదం తవచ దుఃఖాయ వైదేహ్యా లక్ష్మణస్యచ. ౨౭
గమిష్యే దణ్డకారణ్యం కి మనే నాసనేన మే,
విష్టరాసనయోగ్యో హి కాలోఽయం మా ముపస్థితః, ౨౮
చతుర్దశ హి వర్షాణి వత్స్యామి విజనే వనే,
మధుమూలఫలై ర్జీవ న్హిత్వా మునివ దామిషమ్. ౨౯

భరతాయ మహారాజో యౌవరాజ్యం ప్రయచ్ఛతి,

వృద్ధులును ధార్మికులును మహాప్రభావులు నగు రాజర్షులకుంబోలె నీకు దీర్ఘాయుస్సును గొప్పకీర్తియును నీవంశంబునకుఁ దగినధర్మంబును గలుగుఁ గాక. ౨౩

రాముఁడా! నీతండ్రి దశరథమహారాజు ప్రతిజ్ఞ తప్పఁడు; ధర్మబుద్ధి గలవాఁడు; నీ కిప్పుడే యౌవరాజ్యపట్టాభిషేకము సేయును చూడుము. అని కౌసల్య రామునితోఁ జెప్పెను. ౨౪

రాముఁడు కౌసల్య "భోజనంబు సేయుము" మని చెప్పి యాసనంబివ్వఁగా "దన కితరులిచ్చిన యాసనంబునఁ గూర్చుండకున్నను జేతితోనైనను దాఁకవలె" నని శాస్త్రంబుండుటచే దానిం దాఁకి "ఇట్లుపచారంబులు సేయుచుఁ దనయం దతివాత్సల్యంబు గల్గియున్న తల్లితో వనవాసవృత్తాంతం బెట్లు చెప్పెదను!" అని కొంచెము లజ్జనొంది చేతులు మొగుడ్చుకొని కౌసల్యతో నిట్లని చెప్పెను. ౨౫

స్వభావంబుననే వినయంబుగల యా రాముఁడు మాతృగౌరవంబున నింకను వినయంబుతోఁ దాను దండకారణ్యంబునకుఁ బయనంబగుటకై తల్లి యనుజ్ఞ నొందుటకై యత్నింప నారంభించెను. ౨౬

తల్లీ! ఇప్పుడు మహాభయంబొకటి రాఁబోవుచున్నది; నీకుఁ దెలియ లేదు; ఇంక నీకును సీతకును లక్ష్మణునకును మహాదుఃఖంబు సంభవించును. ౨౭

నేను దండకారణ్యంబునకుఁ బోయెదనే నా కీమణిమయాసనం బేల? దర్భాసనంబు వేసికొనఁదగిన కాలముగదా నాకు వచ్చియున్నది!. ౨౮

నేను దేనెయుం గడ్డలును ఫలంబులుఁ దినుచు వంటవాండ్రచేఁ జక్కఁగా సంస్కరింపఁబడి మధురంబై యుండుమాంసమును విడిచి మునియుం బోలె విజనంబగు వనంబునఁ బదునాలుగు సంవత్సరంబులు నివసింపఁబోవుచున్నాను. ౨౯

దశరథమహారాజు భరతునకు యౌవరాజ్యం బొసంగును; నాకు

మాం పున ర్దణ్డకారణ్యే వివాసయతి తాపసమ్. ౩౦

స షట్చాష్టౌ చ వర్షాణి వత్స్యామి విజనే వనే,
ఆసేవమానో వన్యాని ఫలమూలై శ్చ వ_ర్తయన్. ౩౧

సా నికృ_త్తేవ సాలస్య యష్టిః పరశునా వనే,
పపాత సహసా దేవీ దేవ తేవ దివ శ్చ్యుతా. ౩౨

తా మదుఃఖోచితాం దృష్ట్వా పతితాం కదలీ మివ,
రామ స్తూత్థాపయామాస మాతరం గతచేతసమ్. ౩౩

ఉపావృ త్యోత్థితాం దీనాం బడబామివ వాహితామ్,
పాంసుకుణ్ఠితసర్వాఙ్గీం విమమర్శ చ పాణినా. ౩౪

సా రాఘవ ముపాసీన మసుఖార్తా సుఖోచితా,
ఉవాచ పురుషవ్యాఘ్రి ముపశృణ్వతి లక్ష్మణే. ౩౫

యది పుత్ర! న జాయేథా మమ శోకాయ రాఘవ,
న స్మ దుఃఖ మతో భూయః పశ్యేయ మహ మప్రజాః. ౩౬

ఏక ఏవ హి వన్ధ్యాయాః శ్శోకో భవతి మానసః,
అప్రజాऽస్మీతి సన్తాపో నహ్యన్యః పుత్ర! విద్యతే. ౩౭

మాత్రము తాపసుఁడై దండకారణ్యంబున నుండున ట్లాజ్ఞాపించినాఁడు. ౩౦

నే నట్లు దశరథుఁ డాజ్ఞాపించుటం జేసి వానప్రస్థకర్మంబుల నాచరించుకొనుచు ఫలంబులు మూలంబులుఁ దిని జీవించుచుఁ బదునాలుగేండ్లు విజనంబగు దండకారణ్యంబున నుండెదను. అని రాముఁడు కౌసల్యతోఁ జెప్పెను. ౩౧

పట్టపురాణియగు కౌసల్య రాముఁడు చెప్పినమాటలను విని పరమ దుఃఖంబునొంది వనంబున గొడ్డలిచే నఱుకఁబడిన చెట్టుకొమ్మయుంబోలె, స్వర్గంబుననుండి నేలంబడు దేవతాస్త్రీయుంబోలె మూర్ఛనొంది తటాలున నేలంబడెను. ౩౨

రాముఁడు ఎంతమాత్రమును దుఃఖం బనుభవింపఁదగనిదియును మూర్ఛనొంది నేలంబడియున్న యరటిచెట్టుంబోలె నున్నదియునగు తల్లిం జూచి యాబిడను లేవనెత్తెను. ౩౩

రాముఁడు తాను లేవనెత్తఁగా లేచి దుమ్ముకప్పినదేహంబుతోఁ గూడి అలపుదీర్చుకొనుటకై నేలంబొరలి లేచిన భారవహనంబున నలసియుండు నాఁడుగుఱ్ఱంబుంబోలెఁ జూపట్టుచున్న తల్లిదేహంబంతయుఁ దన చేతఁ దడవెను. ౩౪

ఇట్లు దుఃఖముచేఁ బీడింపఁబడినదియుం సుఖం బనుభవించుటకు మాత్రమే తగినదియునగు నాకౌసల్య తన్ను సేవింపుచున్నపురుషశ్రేష్ఠుఁడగు రామునిఁజూచి లక్ష్మణుఁడు వినుచుండఁగా నిట్లని చెప్పెను ౩౫

పుత్త్రుఁడా! నేను దుఃఖమనుభవించుటకై యే నీవు నాకుఁ బుట్టినావు; నీవు పుట్టక నేయుందువేని "నాకు సంతానములేదే" యను దుఃఖమునకన్న నధికమయినదుఃఖము నాకుఁ గలుగదు. ౩౬

రాముఁడా! గొడ్డురాలికి "నాకు సంతానములేదే"యను నొకదుఃఖము మాత్రమేకదా మనసులోనుండును; ఇట్లు నేలంబడిపొరలుచు నేడ్చునంతటిదుఃఖ మేదియుఁ గలుగదుగదా! ౩౭

న దృష్టపూర్వం కల్యాణం సుఖం వా పతిపౌరుషే,
అపి పుత్రేఽపి పశ్యేయ మితి రామాఽస్థితం మయా. ౩౭

సా బహూ న్యమనోజ్ఞాని వాక్యాని హృదయచ్ఛిదామ్,
అహం శ్రోష్యే సపత్నీనా మవరాణాం వరా సతీ. ౩౯

అతో దుఃఖతరం కిం ను ప్రమదానాం భవిష్యతి,
మమ శోకో విలాపశ్చ యాదృశోఽయ మనన్తకః. ౪౦

త్వయి సన్నిహితే ప్యేవ మహ మాసం నిరాకృతా,
కిం పునః ప్రోషితే తాత! ధ్రువం మరణ మేవ మే. ౪౧

అత్యన్తం నిగృహీతాఽస్మి భర్తు ర్నిత్య మతంత్రితా,
పరివారేణ కైకేయ్యాః సమా వాఽప్యథ వాఽవరా. ౪౨

యో హి మాం సేవతే కశ్చి దథవా ప్యనువర్తతే,
కైకేయ్యాః పుత్ర మన్వీక్ష్య స్వజనో నాభిభాషతే. ౪౩

నిత్యక్రోధతయా తస్యాః కథం ను ఖరవాది తత్,
కైకేయ్యా వదనం ద్రష్టుం పుత్ర! శక్ష్యామి దుర్గతా. ౪౪

దశ సప్త చ వర్షాణి తవ జాతస్య రాఘవ,
అసితాని ప్రకాఙ్క్షన్త్యా మయా దుఃఖపరిక్షయమ్. ౪౫

రాముఁడా! నాకుఁ బెనిమిటి దశరథుఁడు సుఖంబు సేయవలసిన కాలంబున నేనెంతమాత్రమును సుఖంబునుగాని యేవిధమంగళంబును అనుభవింపలేదు; కొడుకు పుట్టినపిమ్మటనైన నా కొడుకుమూలముగానైనను అనుభవింపనా! యని కోరుచుంటిని. ౩౮

ఇఁక చవతులలో నందఱికన్నఁ బూజ్యురాల నగు నన్నుఁ జూచి నాకన్నఁ దక్కువయిన చవతులు నామనసునకు దుఃఖంబు గలుగఁజేయుచుంటకై యవమానంబుగాఁ బెక్కుమాటలాడుదురు. ౩౯

స్త్రీలకుఁ జవతులచేత మాటపడుటకన్న నధికదుఃఖం బేమియున్నది? కావున నాదుఃఖమును ఏడ్పును ఇంతయని చెప్పనలవిగాదు. దాని కంతము లేదు. ౪౦

నీవు దగ్గఱనుండునప్పుడును నాకుఁ దిరస్కారంబుగలుగుటను నీవు చూచినావుగదా! నీవు దూరంబుపోఁగా నాకుఁ దిరస్కారంబు గలుగుటను గుఱించి చెప్పనేల? ఇఁక నాకు మరణంబేకాని వేఱులేదు; ఇది నిశ్చయము.

నా పెనిమిటి ఎల్లప్పుడును నన్నుఁ దిరస్కరించుచు నన్నెందుకును బనికిమాలినదానిఁగాఁ జేసినాఁడు; కైకేయి దాసీలతో సమానముగా లేక చక్కఁగా విచారించినచో వారలకన్నఁ దక్కువగా నేయున్నాను. ౪౨.

ఎవ్వఁడైన నొకఁడు నన్ను సేవించుచుండునేని లేక సేవింపఁబడు నంతటిభాగ్యము నాకెక్కడిది! నన్ననుసరించియుండునేని వాఁడును కైకేయి కొడుకు భరతుంజూచి భయంబున నాతోఁ బలుకఁడు. ౪౩

రాముఁడా! ఇట్లు గతిలేకుండు నేను నాపై నెప్పుడును గోపంబు వహించియుండు కైకేయి పరుషవాక్యంబులాడఁగా నేను వాని నెట్లు సహింపుచుందును? ౪౪

రాముఁడా! నీ కుపనయనం బయినది మొదలు ఇప్పటికిఁ బదునేడు సంవత్సరములుగా "నీకు యౌవరాజ్యంబు వచ్చును నాదుఃఖంబు నశించును" అని కోరుచు దినంబులు గడపినాను. ౪౫

తదక్షయం మహ ద్దుఃఖం నోత్సహే సహితుం చిరమ్,
విప్రకారం సపత్నీనా మేవం జీర్ణాఽపి రాఘవ. ౪౬
అపశ్యన్తీ తవ ముఖం పరిపూర్ణశశిప్రభమ్,
కృపణా వ ర్తయిష్యామి కథం కృపణజీవికామ్. ౪౭
ఉపవాసై శ్చ యోగై శ్చ బహుభి శ్చ పరిశ్రమైః,
దుఃఖం సంవర్ధితో మోఘం త్వం హి దుర్గతయా మయా. ౪౮

స్థిరంతు హృదయం మన్యే మ మేదం య న్నదీర్యతే,
ప్రావృషీవ మహానద్యా స్స్పృష్టం కూలం నవామ్భసా. ౪౯

మమైవ నూనం మరణం న విద్యతే
నచావకాశోఽస్తి యమక్షయేఽపివా,
య దన్తకోఽద్యైవ న మాం జిహీర్షతి
ప్రసహ్య సింహో రుదతీం మృగీ మివ. ౫౦
స్థిరం హి నూనం హృదయం మ మాయసం
న భిద్యతే య ద్భువి నావదీర్యతే,
అనేన దుఃఖేన చ దేహ మర్పితం
ధ్రువం హ్యకాలే మరణం న విద్యతే. ౫౧
ఇదం హి దుఃఖం య దనర్థకాని మే
వ్రతాని దానాని చ సంయమా శ్చ హి,
తప శ్చ తప్తం య దపత్యకారణా
త్సునిష్ఫలం బీజ మి వోప్త మూషరే. ౫౨
యది హ్యకాలే మరణం స్వయేచ్ఛయా
లభేత కశ్చి ద్గురుదుఃఖకర్శితః,

రాముఁడా! నెంతముసలిదాననైనను చవతులు చేయుఁ దిరస్కారమును అట్టితుదిలేని మహాదుఃఖమును ఓర్వఁజాలను. ౪౬

నేను నిండుచంద్రునిఁబోలు నీముఖంబుఁజూడక దైన్యంబునొంది దుఃఖజీవనంబుఁ జేయుచుండఁజాలను. ౪౭

నేను దరిద్రురాలనగుటచే నుపవాసంబులును దేవతాధ్యానంబులును అనేకములగు వ్రతములును జేసి యతికష్టంబున నిన్నుఁ బెంచినదంతయుం నిప్పుడు వ్యర్థమయినది. ౪౮

వర్షాకాలంబునఁ గ్రొత్తనీళ్లు రాఁగానే మహానదిగట్టు పగులునట్లు ఇట్టి దుఃఖవార్తను వినఁగానే నామనసు పగులకున్నది. కావున నామనసు ఱాయి వంటిదని తలంచెదను. ౪౯

సింహం బేద్చుచున్న లేడింజంపునట్లు నన్నీక్షణంబే యముఁడు చంప కుండుటంజేసి "నాకుమాత్రము చావులేదు; యమలోకంబున నన్నుంచుటకు స్థలంబులేదు." అని తోఁచుచున్నది. ౫౦

నా హృదయంబును దేహంబును ఇట్టి దుఃఖంబునొందియుంను పగిలి తున్కలై నేలంబడకున్నవి కావున ఇనుముతోఁ జేయఁబడినవియుం స్థిరంబులు నని తోఁచుచున్నది; ఈశ్వరుఁ డేర్పఱుపని కాలమునందు మరణంబు గలుగ దనుట నిశ్చయము. ౫౧

నేను చేసిన వ్రతములును దానములును ధ్యానములును వ్యర్థములయి నవి; మఱియుం సంతానముగలుగుటకై నేఁజేసినతపస్సంతయుఁ జవుటినేలలో నాటినబీజంబుంబోలె నిష్ప్రయోజనంబయినది; కావున నే నాకిట్టి దుఃఖంబు గల్గినది. ౫౨

ఎవ్వఁడైనను దాను మిగులదుఃఖమునొందియున్నప్పుడు కాలంబు రాకున్నను యథేచ్ఛగాఁ బ్రాణంబులు విడువంగలఁడేని నేను దూఁడంబాసిన

గతాహి మద్దైన్యవ పరేణసంసనం
వినా త్వయా ధేను గి వాత్సజేన వై. ౫౩
అథాపి కిం జీవిత మద్య మే వృథా
త్వయా వినా చన్ద్రనిభానన ప్రభ!,
అను ప్రజిష్యామి వనం త్వ గ్నైవ గా
స్సుదుర్బలా వత్స మి వానుకాంక్షయా. ౫౪
భృశ మసుఖ మమర్షితా తదా
బహువిలలాప సమీక్ష్య రాఘవమ్,
వ్యసన ముపనిశామ్య సా మహ
త్సుతమివ బద్ధ మవేక్ష్య కిన్నరీ. ౫౫
ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే వింశస్సర్గః.

---

ఏకవింశస్సర్గః

తథా తు విలపన్తీం తాం కౌసల్యాం రామమాతరమ్,
ఉవాచ లక్ష్మణో దీన స్తత్కాలసదృశం వచః. ౧
న రోచతే మమా ప్యేతదార్యే! యద్రాఘవో వనమ్,
త్యక్త్వా రాజ్యశ్రియం గచ్ఛేత్ స్త్రియా వాక్యవశం గతః. ౨
విపరీత శ్చ వృద్ధ శ్చ విషయై శ్చ ప్రధర్షితః,
నృపః కిమివ న బ్రూయా చ్చోద్యమాన స్సమన్మథః. 3

నాస్యాపరాధం పశ్యామి నాపి దోషం తథావిధమ్,
యేన నిర్వాస్యతే రాష్ట్రా ద్వనవాసాయ రాఘవః. ౪
న తం పశ్యా మ్యహం లోకే పరోక్షమపి యో నరః,
స్వమిత్రోఽపి నిరస్తోఽపి యోఽస్యదోష ముదాహరేత్. ౫

యావుపోల్కి నిన్ను విడిచి యుండఁజాలక యిప్పుడే ప్రాణంబులు విడుతును; అట్టు శక్తిలేదయ్యె. ౫౩

చంద్రునితోసాటియగు ముఖంబుగలరాముఁడా! నీవులేక నేను గుత్సితముగా బ్రతుకుటచే నేమియుఁ బ్రయోజనము లేదు; కావున ఆవు దూడను వెంబడించునట్లు నీతోఁగూడ వనంబునకు వచ్చెదను. ౫౪

అప్పుడాకౌసల్య దుఃఖముఁ బట్టఁజాలక యిఁక రాముఁడు వనంబునకుఁ బోయినవెనుకఁ దనకుఁ గల్గుదుఃఖంబు నాలోచించి రాముఁడు దశరథాజ్ఞాబద్ధుఁడై యుండుటంజూచి తనకొడుకును వేఁటకాండ్రు పట్టుకొని బంధించుటంజూచి కిన్నరి దుఃఖించునట్లు మిక్కిలియుం దుఃఖించెను. ౫౫

ఇది యిరువదియవసర్గము.

---

## ఇరువదొకటవ సర్గము

లక్ష్మణుఁడు దీనుండై యట్లు విలపించుచున్న రామమాతయగు కౌసల్యంజూచి యాసమయంబునకుఁ దగినట్టుగా నిట్లని చెప్పెను. ౧

పూజ్యురాలవగు కౌసల్యా! ఆఁడుదానిమాటకు లోఁబడి రాముఁడు రాజ్యంబువిడిచి యరణ్యంబునకుఁబోవుట నాకును సమ్మతముగానుండలేదు. ౨

వృద్ధుఁ డగుటవలనఁ జపలంబగుమనసుగలవాఁడును, విషయంబులకు లోఁబడినవాఁడును, మన్మథతాపంబుతోఁగూడినవాఁడు నగుదశరథమహారాజు కైకేయి ప్రేరేపించుచుండఁగా నేమాటం జెప్పఁడు? ఏమాటనైనం జెప్పును; అది యంగీకరింపఁదగినది కాదు. ౩

దేశంబువిడిచి యరణ్యంబుననుండుటకై వెడలఁగొట్టఁదగినంతటి రాజద్రోహంబుగాని పాతకంబుగాని రామునియందు నాకగపడలేదు. ౪

రామునకు మిక్కిలియుం శత్రువుగాని రామునివలన నవమానంబు నొందినవాఁడుగాని యెవ్వఁడైనను రామునిపై దోషంబుఁ జెప్పువాఁడు నాకగపడలేదు. ౫

దేవకల్ప మృజుం దాన్తం రిపూణా మపి వత్సలమ్,
అవేక్షమాణః కో ధర్మం త్యజే త్పుత్ర మకారణాత్. ౬

త దిదం వచనం రాజ్ఞః పున ర్బాల్య ముపేయుషః,
పుత్రః కో హృదయే కుర్యా ద్రాజవృత్త మనుస్మరన్. ౭

యావ దేవ న జానాతి కశ్చి దర్థ మిమం నరః,
తావ దేవ మయా సార్ధ మాత్మస్థం కురు శాసనమ్. ౮

మయా పార్శ్వే సధనుషా తవ గుప్తస్య రాఘవ!,
క స్సమర్థోఽధికం కర్తుం కృతాన్త స్యేవ తిష్ఠతః. ౯
నిర్మనుష్యా మిమాం కృత్స్నామయోధ్యాం మనుజర్షభ!,
కరిష్యామి శరై స్తీక్ష్ణై ర్యది స్థా స్యతి విప్రియే. ౧౦

భరత స్యాథ పక్ష్యో వా యో వాఽస్య హిత మిచ్ఛతి,
సర్వా నేతా న్వధిష్యామి మృదుర్హి పరిభూయతే. ౧౧

ప్రోత్సాహితోఽయం కైకేయ్యా స దుష్టో యది నః పితా,
అమిత్రభూతో నిస్సఙ్గం వధ్యతాం బధ్యతా మపి. ౧౨

గురో ర ప్యవలి ప్తస్య కార్యాకార్య మజానతః,

దేవతంబోలిన వాఁడును, కౌటిల్యము లేనివాఁడు, నిద్రియనిగ్రహంబు గలవాఁడును, శత్రువులయందును ప్రేమగలవాఁడునగు కొడుకును, ధార్మికుండగువాఁ డెవ్వఁడు విడుచును? అట్టిగుణంబులు గలరాముని దశరథుండు విడిచినాఁడు కావున, దశరథుండు ధార్మికుండు కాఁడు. పరమ దుష్టుండు. ఇతనిమాట యంగీకరింపఁదగినది కాదు. ౬

అందువలన వృద్ధుండైనను మఱలబాలుఁడుంబోలె మన్మథపరవశుండై మూఢుండై యున్న రాజు, ఎగదిగ నిట్లు చెప్పునేని పుత్త్రుం డెవ్వఁడు రాజనీతి దెలిసినవాఁడు దాని నంగీకరించును? ఎవ్వఁడు నంగీకరింపఁడు కావున మన్మథపరవశుం డైన దశరథుండు చెప్పినమాటను రాముండు వినవలసినది లేదు.

రాముఁడా! దశరథుండు నిన్ను వనంబునకుఁ బొమ్మన్నసమాచార మెవ్వరికిని దెలియకుండునప్పుడె, నీవు నాతోఁగూడ రాజ్యంబంతయుం స్వాధీనముఁ జేసికొనుము. ౭

నేను ధనుర్ధరుండనై పార్శ్వంబునం గాచియుండఁగా యముండుం బోలెఁ జూపట్టుచున్న నీయాజ్ఞ నెవ్వం డతిక్రమింపఁజాలును? ౮

పురుషశ్రేష్ఠుండవగు రాముఁడా! ఈయయోధ్యయందలి జను లేమైన విరోధము సేయుదు రేని, వీరలనందఱను దీక్ష్ణంబులగు బాణంబులచే ఖండించి, యయోధ్యలో నొక్కఁడునివసింపకుండునట్లు గావించెదను. ౧౦

ఇంక భరతునిపక్షము నవలంబించి యుండువారలు గాని, యితరులు గాని యతనిమేలుకోరువార లెవ్వరైన నుందు రేని వారలనందఱుం జంపెదను; మెత్తగానున్న నవమానంబు వచ్చును; కావునఁ గఠినముంగానే దండింపవల యును. ౧౧

దుష్టుండగుచున్న తండ్రి దశరథుఁడు, కైకేయిమాటవిని మనకు శత్రువై మనకార్యంబునకు విరోధంబు సేయునేని యతనినిం జంపుదము; లేక అంతఁ గాఠిన్యము వలదేని బంధించివేయుదము. ౧౨

తండ్రి యయినను గర్వించి కామాదులకు లోఁబడి "ఇది చేయఁదగినది

ఉత్పథం ప్రతిపన్నస్య కార్యం భవతి శాసనమ్. ౧౩

బల మేష కి మాశ్రిత్య హేతుం వా పురుషర్షభ!,
దాతు మిచ్ఛతి కైకేయ్యై రాజ్యం స్థిత మిదం తవ. ౧౪

త్వయా చైవ మయా చైవ కృత్వా వైర మనుత్తమమ్,
కాఽస్య శక్తిః శ్రియం దాతుం భరతా యారిశాసన!. ౧౫
అనురక్తోఽస్మి భావేన భ్రాతరం దేవి! తత్త్వతః,
సత్యేన ధనుషా చైవ దత్తే నేష్టేన తే శపే. ౧౬

దీప్త మగ్ని మరణ్యం వా యది రామః ప్రవేక్ష్యతి,
ప్రవిష్టం తత్ర మాం దేవి! త్వం పూర్వ మవధారయ. ౧౭

హరామి వీర్యా ద్దుఃఖం తే తమ సూర్య ఇ వోదితః,

దేవీ పశ్యతు మే వీర్యం రాఘవ శ్చైవ పశ్యతు. ౧౮

ఏతత్తు వచనం శ్రుత్వా లక్ష్మణస్య మహాత్మనః,
ఉవాచ రామం కౌసల్యా రుదన్తీ శోకలాలసా. ౧౯

భ్రాతు స్తే వదతః పుత్ర! లక్ష్మణస్య శ్రుతం త్వయా,
యద త్రానంతరం కార్యం కురుష్వ యది రోచతే. ౨౦
నచాధర్మ్యం వచ శ్శ్రుత్వా సపత్న్యా మమ భాషితమ్,
విహాయ శోకసంతప్తాం గంతు మర్హసి మా మితః. ౨౧

ఇది చేయఁదగనిది" యని తెలియక, మర్యాద నతిక్రమించి యుత్పథంబు నవలంబించువాని యతనికిని దండనము చేయవలసినది. ౧౩

పురుషశ్రేష్ఠుండవగు రామునఁడా! నీవు ధర్మంబునఁ బ్రాప్తంబైయుండు నీరాజ్యంబును దశరథుండు కైకేయి కియ్యఁగోరుచున్నాఁడే ఈ దశరథునకు నిన్ను జయించునంతటి బలం బేమియున్నది? లేక నీవు రాజ్యం బియ్యకుండుటకుఁ దగుకారణం బేమియున్నది? రెండును లేవు. ౧౪

శత్రువుల శిక్షించునట్టి రాముఁడా! నీతోను నాతోను విపరీతంబగు విరోధంబు చేసికొని, భరతునకు రాజ్యంబొసంగుట కీ దశరథున కేమిశక్తియున్నది?

కౌసల్యాదేవీ! నాకు యథార్థముగా హృదయమునం దన్నయగు రామునిమీఁద ననురాగంబున్నది. నేను జ్ఞాతినని శంకింపవలదు. నీయుందట సత్యమును ధనుస్సును దానంబును సాక్షిగాఁ బ్రమాణము చేసెదను. ౧౫

తల్లివగు కౌసల్యా! మండుచున్న యగ్నిహోత్రమును గాని యడవిని గాని రాముఁడు ప్రవేశింప యత్నించునేని నే నతనికన్న మున్నే ప్రవేశించితినని సిద్ధముగా నిశ్చయింపుము. ౧౬

సూర్యుఁ డుదయించి కాంతిచే జీఁకటిని బోఁగొట్టునట్లు నేను బరాక్రమంబున నీదుఃఖముం బోఁగొట్టెదను.

నాపరాక్రమంబును, కౌసల్యయుం రామునును ఇప్పుడు చూతురుగాక, అని లక్ష్మణుండు కౌసల్యతోను రామునితోనుం జెప్పెను. ౧౭

మహాపరాక్రమశాలియగు లక్ష్మణుండు చెప్పినమాటను విని కౌసల్య యేడ్చుచు తనదుఃఖంబున కంతంబు గల్గునేమోయని కోరి, రామునింజూచి యిట్లని చెప్పెను. ౧౮

రామునఁడా! నీతమ్ముఁడు లక్ష్మణుండు చెప్పుమాటలను వింటివిగదా! ఇఁక నీ కది రుచించునేని పైనఁ జేయవలసినకార్యముం జేయుము. ౨౦

నాచవతిచెప్పిన యధర్మవచనంబులు విని దుఃఖంబునం దపించుచున్న నన్ను విడిచి నీవు వనంబున కెంతమాత్రమును బోఁగూడదు. ౨౧

ధర్మజ్ఞ! యది ధర్మిష్ఠో ధర్మం చరితు మిచ్ఛసి,
శుశ్రూష మా మిహస్థ స్త్వం చర ధర్మ మనుత్తమమ్. ౨౨

శుశ్రూషు ర్జననీం పుత్ర! స్వగృహే నియతో వసన్,
పరేణ తపసా యుక్తః కాశ్యప స్త్రిదివం గతః. ౨౩

యథైవ రాజా పూజ్య స్తే గౌరవేణ తథా హ్యహమ్,
త్వాం నాహ మనుజానామి న గన్తవ్య మితో వనమ్. ౨౪

త్వద్వియోగా న్న మే కార్యం జీవితేన సుఖేన వా,
త్వయా సహ మమ శ్రేయ స్తృణానా మపి భక్షణమ్. ౨౫
యది త్వం యాస్యసి వనం త్యక్త్వా మాం శోకలాలసామ్,
అహం ప్రాయ మిహాసిష్యే న హి శక్ష్యామి జీవితుమ్. ౨౬

తత స్త్వం ప్రాప్స్యసే పుత్ర! నిరయం లోకవిశ్రుతమ్,
బ్రహ్మహత్యా మివాధర్మా త్సముద్ర స్సరితాం పతిః. ౨౭

విలపన్తీం తథా దీనాం కౌసల్యాం జననీం తతః,
ఉవాచ రామో ధర్మాత్మా వచనం ధర్మసంహితమ్. ౨౮
నాస్తి శక్తిః పితు ర్వాక్యం సమతిక్రమితుం మమ,
ప్రసాదయే త్వాం శిరసా గన్తు మిచ్ఛా మ్యహం వనమ్. ౨౯
ఋషిణా చ పితు ర్వాక్యం కుర్వతా వ్రతచారిణా,

రాముఁడా ! నీవు సమస్తధర్మంబుల నెఱుంగుదువు. నీకు ధర్మం బాచరింపవలెనను కోర్కిగలదేని నీవిచ్చటనె యుండి నాకు శుశ్రూషసేయుచు శ్రేష్ఠంబయిన యీధర్మం బాచరింపుము. మాతృశుశ్రూషకన్న నధికమయిన ధర్మము లేదు. ౨౨

రాముఁడా ! మున్ను కాశ్యపుండు తల్లి శుశ్రూషచేయుచుఁ దన యింటనె నియమంబుతోనుండి యందువలన మహాతపస్సునొంది స్వర్గంబు నొందెను. ౨౩

నీకు ఎట్లు తండ్రియగుటచే దశరథమహారాజుమాటప్రకారము నడుచుకొనవలసియున్నదో, అట్లే నేను నీకు దల్లినిగావున నామాటప్రకారము నీ కవశ్యము నడుచుకొనవలసి యుండుట తప్పదు; నీవడవికిఁబోవుటకు నేను సమ్మతింపను; నీవయోధ్య విడిచి యెంతమాత్రము వనంబునకు బోఁగూడదు. నీవు లేకున్నచో నాకు బ్రతుకేటికి ? సుఖంబేటికి ? నీతోఁగూడ గడ్డి తినుచుండుటయయినను నాకు మంచిది. ౨౪

నే నిట్లు దుఃఖంబునం బరితపించుచుండఁగా నీవు నన్నువిడిచి యడవి కేగుదువేని యటుపిమ్మట నేనెంతమాత్రము జీవింపఁజాలను. ఏమియుఁ దినక నీరు ద్రాగకుండి యయినను బ్రాణంబుల విడుతును. ౨౬

అట్లు నీనిమిత్తము నేను బ్రాణంబులు విడుచుటంజేసి సముద్రుండు పిప్పలాదమునికి నపకారముచేసి యతనికోపంబునఁ గష్టంబునొందినట్లు సమస్తలోకంబులను బ్రసిద్ధికెక్కినదుర్గతిం బొందఁగలవు అని కౌసల్యరామునితోఁ జెప్పెను. ౨౭

అంత నట్లు విలపించుచు దుఃఖితయై యున్నతల్లిని గౌసల్యంజూచి, ధర్మాత్ముండగు రాముండు ధర్మము నవలంబించి యిట్లనిచెప్పెను. ౨౮

తండ్రిమాట నతిక్రమింప నాచేతఁ గాదు; సాష్టాంగంబుగ నమస్కరించి నిన్ను వేఁడుకొనెదను. నే నడవికిం బోవలె పోనిమ్ము. ౨౯

దివ్యజ్ఞానముగలవాఁడును, ఎల్లప్పుడును వ్రతంబులు సేయుచుండు

గాః హ్యాతా జానతా ధర్మం కణ్డునాఽపి విపశ్చితా. 30

అస్మాకం చ కులే పూర్వం సగర స్యాజ్ఞయా పితుః,
ఖనద్భి స్సాగరై ర్భూమి మవా ప్తస్సుమహా న్వధః. 31

జామదగ్న్యేన రామేణ రేణుకా జననీ స్వయమ్,
కృత్తా పరశునాఽరణ్యే పితు ర్వచనకారిణా. 32

ఏతై రన్యై శ్చ బహుభి ర్దేవి! దేవసమైః కృతమ్,
పితు ర్వచన మక్లీబం కరిష్యామి పితు ర్హితమ్. 33

నఖ ల్వేత న్మయైకేన క్రియతే పితృశాసనమ్,
ఏతై రపి కృతం దేవి! యే మయా తవ కీర్తితాః. 34
నాహం ధర్మ మపూర్వం తే ప్రతికూలం ప్రవర్తయే,
పూర్వై రయ మభిప్రేతో గతో మార్గోఽనుగమ్యతే. 35

త దేత త్తు మయా కార్యం క్రియతే భువి నాన్యథా,
పితు ర్హి వచనం కుర్వ న్న కశ్చి న్నామ హీయతే. 36

తా మేవ ముక్త్వా జననీం లక్ష్మణం పున రబ్రవీత్,
వాక్యం వాక్యవిదాం శ్రేష్ఠ శ్రేష్ఠ స్సర్వధనుష్మతామ్. 37

వాఁడును, ధర్మరహస్యం బెఱింగినవాఁడును, బాడితుఁడునగు కండుమహర్షి యైనను దండ్రిపనుపు సేయంబూని ఆవునుంగూడఁ జంపినాఁడు. ౩౦

మున్ను మావంశంబునందును దండ్రి సగరునియాజ్ఞచే సగరపుత్రులం దఱు భూమిం ద్రవ్వి భయంకరంబుగా మరణంబునొందిరి. అట్లు వారలు ప్రాణంబులం బోఁగొట్టుకొనియైనను దండ్రియాజ్ఞం బాలించిరి. కొంతకాలమడవి యందు సుఖంబుండుట కేమికష్టము? ౩౧

జమదగ్నికొడుకు పరశురాముండు తండ్రివాక్యంబు సేయంబూని, యరణ్యంబున గొడ్డలిచేఁ దన్నుగన్న తల్లియగు రేణుకనుం జంపినాఁడు; అట్లుండుటంజేసి నీకు దుఃఖంబైనను నేను దండ్రియాజ్ఞ చొప్పున నడవికిఁ బోవుటవలన నేమియు దోషములేదు. ౩౨

తల్లీ! దేవసమానులయిన కండుమహర్షి మొదలగువారలును, ఇంక నితరులును జేసినట్లు, నేనును నాతండ్రికి సంతోషంబుగలుగునట్లు నాతండ్రియాజ్ఞ చొప్పునఁ జేసెదను. ౩౩

తల్లీ! నే నొక్కండనే తండ్రియాజ్ఞ చొప్పునం జేయుటలేదుగదా! ఇప్పుడు నేను నీకుఁ జెప్పిన మహాత్ములును జేసియున్నారే. ౩౪

నేను నీవు దుఃఖింపవలెనని ఇదివఱకులేక పూర్వాచారమునకు విరుద్ధమైయుండు క్రొత్తధర్మము సేయలేదు. మునుపటివారు మహాత్ము లంగీకరించిన పద్ధతిని అనుసరించెదను గాని వేఱుగాదు. ౩౫

భూలోకంబున ముఖ్యముగాఁ జేయవలసినదగు నీ పితృవచనమును నేనుమాత్రము చేయకుండఁజాలను; అవశ్యము చేయుందును; ఒకవేళఁ దల్లి మొదలగునితరులకు దుఃఖంబు సంభవిల్లినను దండ్రిపనుపు నెఱవేర్చువానికే దోషంబును గలుగదు. అని రాముండు కౌసల్యతోఁ జెప్పెను. ౩౬

చక్కఁగా మాటలాడువారలలో శ్రేష్ఠుండును, విలుకాండ్రయందఱి లోను మేటియును నగు రాముఁడు తల్లియగు కౌసల్యతో నీప్రకారము చెప్పి, యంత లక్ష్మణునింజూచి యిట్లనిచెప్పెను. ౩౭

తవ లక్ష్మణ! జానామి మయి స్నేహ మనుత్తమమ్,
విక్రమం చైవ సత్త్వంచ తేజశ్చ సుదురాసదమ్. ౩౮

మమ మాతు ర్మహ ద్దుఃఖ మతులం శుభలక్షణ!,
అభిప్రాయ మవిజ్ఞాయ సత్యస్య చ శమస్య చ. ౩౯

ధర్మో హి పరమో లోకే ధర్మే సత్యం ప్రతిష్ఠితమ్,
ధర్మసంశ్రిత మేత చ్చ పితు ర్వచన ముత్తమమ్. ౪౦

సంశ్రుత్య చ పితు ర్వాక్యం మాతు ర్వా బ్రాహ్మణస్య వా,
న కర్తవ్యం వృథా వీర! ధర్మ మాశ్రిత్య తిష్ఠతా. ౪౧

సోఽహం న శక్ష్యామి పితు ర్నియోగ మతివర్తితుమ్,
పితు ర్హి వచనా ద్వీర! కైకేయ్యాఽహం ప్రచోదితః. ౪౨

త దేతాం విసృజానార్యాం క్షత్రధర్మాశ్రితాం మతిమ్,
ధర్మ మాశ్రయ మా తైక్ష్ణ్యం మద్బుద్ధి రనుగమ్యతామ్. ౪౩

త మేవ ముక్త్వా సౌహార్దా ద్భ్రాతరం లక్ష్మణాగ్రజః,
ఉవాచ భూయః కౌసల్యాం ప్రాఞ్జలి శ్శిరసా నతః. ౪౪

లక్ష్మణుఁడా! నీకు నాయం దత్యంతస్నేహంబు గలుగుటయు, నీయట్టి పరాక్రమంబును బలంబును బ్రభావంబును మఱి యెవ్వరియందును లేకుండుటయు నే నెఱుంగుదును. ౩౮

మంగళకరములగు లక్షణములుగల లక్ష్మణుఁడా! సత్యంబును శాంతియును జక్కఁగాఁ దెలియమింజేసి మాతల్లియగు కౌసల్యకు మిగుల దుఃఖంబు గలుగుచున్నది. నీ వవి దెలిసియు నీవేల యిట్లు పలుకుచున్నావు? ౩౯

ప్రపంచంబున నన్నిపురుషార్థములలోను ధర్మంబు శ్రేష్ఠంబు. సత్యంబున ధర్మంబుగలుగును. ఉత్తమంబగు నీపితృవాక్యపరిపాలనంబువలనను అధిక ధర్మంబుగలుగును. నేను "దశరథుం డాజ్ఞాపించినట్లు చేసెదను" అని కైకేయితోఁ జెప్పినాను. దశరథునియాజ్ఞయు నైనది, కావున సత్యంబును బితృవాక్యపరిపాలనంబును ఈరెండును నా కవశ్యము చేయవలసినది. ౪౦

లక్ష్మణుఁడా! నీవుమిక్కిలియుఁ బరాక్రమశాలివే; అందుకు సంతసించెదను. అయితే తండ్రికిఁగాని తల్లికిఁగాని బ్రాహ్మణునకుఁగాని ఏదైనను జేసెదనని ప్రతిజ్ఞచేసి యామాటను ఎంతమాత్రము ధర్మమును గోరువాఁడు తప్పరాదు. ౪౧

పరాక్రమశాలివగు లక్ష్మణుఁడా! నే నట్లు తండ్రియాజ్ఞచొప్పునఁ గావించెదనని ప్రతిజ్ఞచేసి తండ్రిమాట నతిక్రమింపంజాలను అయితే తండ్రి నిన్నాజ్ఞాపించలేదే కైకేయియేగదా నీతోఁ జెప్పినదని యడుగుదువు. కాఁబోలు. తండ్రియాజ్ఞ ననుసరించియే కదా కైకేయి నన్నుఁ బ్రేరేపించినది.

అందువలన నీవిట్లు క్షాత్రంబు నవలంబించి ధర్మంబును విడిచి యధర్మవచనంబులు బలుకవలదు; ధర్మము నాశ్రయింపుము; క్రౌర్యంబును విడువుము; నాయిష్టముచొప్పున నుండుము. అని రాముండు లక్ష్మణునితోఁ జెప్పెను. ౪౩

రాముండు భ్రాతృస్నేహంబున నిట్లు లక్ష్మణునకుం జెప్పి యంతమఱలఁ గౌసల్యంజూచి చేతులు మొగిడ్చి సాష్టాంగంబుగ నమస్కరించి యిట్లని చెప్పెను. ౪౪

అనుమన్యస్వ మాం దేవి! గమిష్యన్త మితో వనమ్,
శాపితాఽసి మమ ప్రాణైః కురు స్వస్త్యయనాని మే. ౪౫

తీర్ణప్రతిజ్ఞశ్చ వనా త్పున రేష్యా మ్యహం పురీమ్,
యయాతి రివ రాజర్షిః పురా హిత్వా పున ర్దివమ్. ౪౬

శోక స్సంధార్యతాం మాత! ర్హృదయే సాధు మాశుచః,
వనవాసాది హైష్యామి పునః కృత్వా పితు ర్వచః. ౪౭

త్వయా మయా చ వైదేహ్యా లక్ష్మణేన సుమిత్రయా,
పితు ర్నియోగే స్థాతవ్య మేష ధర్మ స్సనాతనః. ౪౮

అమ్బ! సంహృత్య సంభారా న్దుఃఖం హృది నిగృహ్య చ,
వనవాసకృతా బుద్ధిర్మమ ధర్మ్యాఽనువర్త్యతామ్. ౪౯

ఏత ద్వచ స్తస్య నిశమ్య మాతా
సుధర్మ్య మవ్యగ్ర మవిక్లబంచ,
మృతేవ సంజ్ఞాం ప్రతిలభ్య దేవీ
సమీక్ష్య రామం పున రి త్యువాచ. ౫౦
యథైవ తే పుత్ర! పితా తథాఽహం
గురు స్స్వధర్మేణ సుహృ త్తయా చ,
న త్వాఽనుజానామి న మాం విహాయ
సుదుఃఖితా మర్హసి గన్తు మేవమ్. ౫౧
కిం జీవితే నేహ వినా త్వయా మే
లోకేనవా కిం స్వధయాఽమృతేన,

తల్లీ! నే నయోధ్యవిడిచి యడవికిఁబోవ నిశ్చయించితిని; నామీఁదఁ దప్పులుచెప్పక సమ్మతింపుము; నాప్రాణంబులపై నొట్టుపెట్టెదను. మఱియుం నాకేమియుఁ గష్టము గలుగకుండున ట్లాశీర్వదింపుము. ౪౫

రాజర్షియగు యయాతిమహారాజు స్వర్గమునుండి మఱల స్వర్గంబు నొందినట్లు, నేనును నాప్రతిజ్ఞ నెఱవేర్చికొనినంతనె యడవిని విడిచి మఱల నీయయోధ్యాపట్టణంబునకు వచ్చెదను. ౪౬

తల్లీ! నీవిట్లు దుఃఖింపవలదు; దుఃఖంబును మనంబులోనే చక్కఁగా నణంచుకొనుము; నేను దండ్రిపనుపుం గావించినంతనె వనంబువిడిచి యిచ్చటికి వచ్చెదను. ౪౭

దశరథుని యాజ్ఞకు లోఁబడవలసినది నాకుమాత్రమె కాదు; నీవును సుమిత్రయును లక్ష్మణుండును సీతయునుగూడ అట్లు దశరథునియాజ్ఞకు లోఁబడవలసియున్నది; ఇదియె శాశ్వతంబగు ధర్మంబు. ౪౮

తల్లీ! ఇప్పుడు నాపట్టాభిషేకమునకై నీవు సంగ్రహించియుండు ద్రవ్యంబులను విడిచి దుఃఖంబును మనంబును నణంచుకొని ధర్మ్యంబగువనవాసము సేయవలెనని నాతలంపునకు నీవును సమ్మతింపుము. ౪౯

పట్టపురాణియుం రాముని తల్లియు నగు నాకౌసల్య రాముండుచెప్పిన ధర్మ్యంబును ధీరంబును దిరుగుపాటు లేనిదియునగు మాటవిని చచ్చినట్లు పడి కొంతవడికిం దెలివొంది రామునింజూచి యిట్లని చెప్పెను. ౫౦

కొడుకా! నిన్నుఁ బోషించుట యనుధర్మంబునను, స్నేహంబునను నీకెట్లు తండ్రి గురువో, అట్లు తల్లినగు నేనును గురువైనదానను; కాఁబట్టి నాయనుజ్ఞ లేక నీవు పోఁగూడదు; నీవు వనంబులకుఁబోవ ననుజ్ఞ యొసంగను; నే నిట్లు మహాదుఃఖంబు నొంది పరితపించుచుండఁగా నన్నువిడిచి నీవు పోఁగూడదు. ౫౧

నీవు లేనిచో నాకుబ్రతుకేల? పరలోకముతో నేమికార్యము? పితృలోకంబునం గలుగుస్వధ నాకెందుకు? స్వర్గలోకంబున లభ్యమగు నమృ

శ్రేయో మహార్థం తవ సన్నిధానం
మమైవ కృత్స్నా దపి జీవలోకాత్. ౫౨

నరై రి వోల్కాభి రపోహ్యమానో
మహాగజోఽధ్వాన మనుప్రవిష్టః,
భూయః ప్రజజ్వాల విలాప మేవం
నిశమ్య రామః కరుణం జనన్యాః. ౫౩
స మాతరం చైవ విసంజ్ఞకల్పా
మార్తం చ సౌమిత్రి మభిప్రతప్తమ్,
ధర్మే స్థితో ధర్మ్య మువాచ వాక్యం
యథా స ఏ వార్హతి తత్ర వక్తుమ్. ౫౪
అహం హి తే లక్ష్మణ! నిత్య మేవ
జానామి భక్తిం చ పరాక్రమం చ,
మమ త్వభిప్రాయ మసన్నిరీక్ష్య
మాత్రా సహాభ్యర్దసి మాం సుదుఃఖమ్. ౫౫
ధర్మార్థకామాః ఖలు తాత! లోకే
సమీక్షితా ధర్మఫలోదయేషు,
తే తత్ర సర్వే స్యు రసంశయం మే
భార్యేవ వశ్యాఽభిమతా సుపుత్రా. ౫౬

యస్మింస్తు స ర్వే స్యు రసన్నివిష్టా
ధర్మో యత స్స్యా త్త దుపక్ర మేత,

తంబు నాకేల? నాకేదియుం దక్కుఱలేదు. నాకు సమస్తప్రాణిలోకంబులక న్నను కొంచెమునేనయినను నీయొద్దనుండుట శ్రేష్ఠము. అని కౌసల్య రాముని తోఁ జెప్పెను. ౧౨

మార్గంబునం బడి పోవుచున్నట్టి మహాగజంబు మనుష్యు లడ్డగించి కొఱవికట్టెలతో నదలింపఁగాఁ బరితపించునట్లు, రాముఁడు తనతల్లి యిట్లు మహాదుఃఖంబులోఁ జెప్పినమాటలువిని మిగులం బరితపించెను. ౬౩

ఆ రాముఁడు దృఢంబుగా ధర్మంబు నవలంబించి స్మృతిలేనట్లున్న తల్లిని, దుఃఖంబునం బరితపించుచున్న లక్ష్మణునిఁజూచి ధర్మ్యంబగునీ మాటం జెప్పెను; అట్టిధర్మసంకటకాలమునందు ఆ రాముఁడుదక్క ముల్లోకంబుల యందును మఱియెవ్వాఁడును అట్లు మాటలాడం జాలఁడు. ౨౪

లక్ష్మణుఁడా నీకు నాయందుఁగలభక్తిని నీపరాక్రమంబును నేనెఱుంగు దునుగదా! నీవు తల్లి కౌసల్యతోఁ జేరి యిట్లు నాకు మిగుల దుఃఖము గలుగు నట్లు బాధించుచున్నావేమి? ౨౫

నాయనా! లోకమునందు ధర్మము నాచరించువానికి ధర్మార్థకామ ములు మూఁడును గలుగునని చెప్పఁబడియున్నదిగదా! అట్లు ఒకధర్మము నాచ రించినచో ధర్మార్థకామములు మూఁడును సిద్ధించుననువిషయంబునందు నాకు సందేహము లేదు; ఒకభార్యయే భర్తకు స్వాధీనురాలై ధర్మమును, ప్రియురాలై కామమును, మంచికొడుకునుగని యర్థమును సిద్ధింపఁజేయునట్లు ఒకధర్మమే ధర్మమును గామమును అర్థమును మూఁడిటిని సిద్ధింపఁజేయును.

ఏకర్మమువలన ధర్మార్థకామములలో నేదియుఁ గలుగనేరదో దానిం జేయరాదు. అయితే ఏకర్మమువలన ధర్మార్థకామములు మూఁడును సిద్ధించునో దాని నవశ్యము సేయవలయును. మఱియు, నేకర్మంబువలన నర్థముగాని

ద్వేష్యో భవ త్యర్థపరో హి లోకే
కామాత్మతా ఖ ల్వపి న ప్రశస్తా. ౫౭

గురు శ్చ రాజా చ పితా చ వృద్ధః
క్రోధా త్ప్రహర్షా ద్యది వాఽపి కామాత్,
య ద్వ్యాదిశే త్కార్య మవేక్ష్య ధర్మం
క స్తం న కుర్యా దనృశంసవృత్తః. ౫౮
స వై న శక్నోమి పితుః ప్రతిజ్ఞా
మిమా మకర్తుం సకలాం యథావత్,
స హ్యావయో స్తాత! గురు ర్నియోగే
దేవ్యా శ్చ భర్తా స గతి స్స ధర్మః. ౫౯

తస్మి న్పున ర్జీవతి ధర్మరాజే
విశేషత స్స్వే పథి వర్తమానే,
దేవీ మయా సార్ధ మితోఽపగచ్ఛేత్
కథం స్వి దన్యా విధ వేవ నారీ. ౬౦

సా మాఽనుమన్యస్వ వనం వ్రజంతం
కురుష్వ న స్స్వస్త్యయనాని దేవి!,
యథా సమాప్తే పున రావ్రజేయం
యథా హి సత్యేన పున ర్యయాతిః. ౬౧

కామముగాని గలుగక ధర్మముమాత్రము గలుగునో దానినిం జేయవలయును; అయితే అర్థకామంబుల రెండిటినిమాత్రము నిచ్చుకర్మమునుమాత్రము సేయరాదు; ఎందువలననన్నఁగా, అర్థమునుమాత్రము గోరువానిం జూచి లోకంబున నందఱును నిందింతురు; అట్లు కామమునుమాత్రమె యవలంబించియుండు వాఁడు లోకంబున నిందితుఁ డగుచున్నాఁడు. ౫౭

ఆచార్యుండును రాజును దండ్రియును వృద్ధుండును నగువాఁడు, కోపంబునంగాని సంతోషంబునంగాని కామంబునంగాని యాజ్ఞాపించినప్పుడు పాపిష్ఠుండు గానివాఁ డెవ్వఁడు ధర్మంబెఱింగి తండ్రియాజ్ఞను శిరసావహించి యాకార్యంబును జేయకుండును? పాపిష్ఠుండు మాత్రము సేయఁడు యని ధార్మికులందఱునుం జెప్పుదురు. ౫౮

నేనట్లు పాపిష్ఠుండఁగాను కావున తండ్రి యాజ్ఞాపించిన కార్యము నంతయు జక్కఁగాఁ జేయకుండఁజాలను. నాకుమాత్రమె కాదు, దశరథుండు తండ్రి కావున నీకును నాకును ఆజ్ఞాపింపఁగలవాఁడు; నాతల్లి కౌసల్యకును బెనిమిటి కావున నతనియాజ్ఞ చొప్పున నడువవలసినదే; మఱియుం నతని విడువఁగూడదు; అట్లు పెనిమిటిని విడువకుండుట భార్యకు ధర్మము కావున ఈబిడ భర్తనువిడిచి నావెంట రాఁగూడదు. ౫౯

అట్టిపెనిమిటి యగు దశరథమహారాజు ధర్మంబుఁ గాపాడుచుఁ బూర్వరాజులకన్న మెచ్చుగా స్వధర్మంబు దప్పక రాజ్యంబేలుచు బ్రతికియుండఁగానే పట్టపురాణియై యొప్పుచుండుకౌసల్య మఱియొక్కతె విధవస్త్రీ కొడుకు నాశ్రయించి పోవునట్లు నాతోఁగూడ వనంబున కెట్లు రావచ్చును? ఎంతమాత్రమును రాఁగూడదు. అని రాముండు లక్ష్మణునితోఁ జెప్పెను. ౬౦

పట్టపురాణివగుకౌసల్యా! దశరథుఁడు జీవించి యున్నపుడు నీవు నావెంట రాఁగూడదు నేనడవికిఁ బోవుటకు సమ్మతింపుము. దౌహిత్రుం డిచ్చిన పుణ్యబలంబున యయాతి మఱల స్వర్గంబునొందినట్లు నేనును బదునాలుగు సంవత్సరములు ముగియఁగానే మఱల సుఖంబున నిచ్చటికి వచ్చునట్లు నాకు మంగళాశీర్వచనంబుల నొసంగుము. ౬౧

యశో హ్యహం కేవలరాజ్యకారణా
న్న పృష్ఠతః కర్తు మలం మహోదయమ్,
అదీర్ఘకాలేన తు దేవి! జీవితే
వృణేఽవరా మద్య మహీ మధర్మతః. ౬౨
ప్రసాదయ న్నరవృషభ స్స మాతరం
పరాక్రమా జ్జిగమిషు రేవ దణ్డకాన్,
అథానుజం భృశ మనుశాస్య దర్శనం
చకార తాం హృది జననీం ప్రదక్షిణమ్. ౬౩

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే ఏకవింశస్సర్గః.

---

## ద్వా విం శ స్స ర్గః

అథ తం వ్యథయా దీనం సవిశేష మమర్షితమ్,
శ్వసన్త మివ నాగేన్ద్రం రోషవిస్ఫారితేక్షణమ్. ౧
ఆసాద్య రామ స్సౌమిత్రిం సుహృదం భ్రాతరం ప్రియమ్,
ఉవాచేదం స ధైర్యేణ ధారయ న్సత్త్వ మాత్మవాన్. ౨

నిగృహ్య రోషం శోకం చ ధైర్య మాశ్రిత్య కేవలమ్,
అవమానం నిర స్యేమం గృహీత్వా హర్ష ముత్తమమ్. ౩
ఉపక్లృప్తం హి యత్కించి దభిషేకార్థ మద్య మే,
సర్వం విసర్జయ క్షిప్రం కురు కార్యం నిరత్యయమ్. ౪

సౌమిత్రే! యోఽభిషేకార్థే మమసంభారసమ్భృతిః,
అభిషేకనివృత్త్యర్థే సోఽస్తు సంభారసమ్భృతిః. ౫

నేను ధర్మంబువిడనాడి పట్టిరాజ్యమునకై మహాఫలంబగుకీర్తిని విడువఁజాలను; బ్రతుకునది స్వల్పకాలము. దీనికై యధర్మం బవలంబించి తుచ్ఛంబగు భూమిని సంపాదింప నాకిష్టములేదు. అని రాముండు కౌసల్యతోఁ జెప్పెను. ౬౨

పురుషోత్తముండగు నారాముం డిట్లు తల్లినూఱడించుచు తా నొంటరిగానే తన పరాక్రమంబు మాత్రమె సహాయముగాఁ గొని దండకారణ్యంబునకుఁబోదలంచి తమ్ముండగులక్ష్మణునకును దనయభిప్రాయంబాతయుఁ జక్కఁగాఁ దెలియఁజెప్పి మనస్సులో దల్లికౌసల్యకుఁ బ్రదక్షిణంబుచేసినట్లు భావించెను. ౬౩

ఇది యిరువదొకటవ సర్గము.

---

## ఇరువదిరెండవ సర్గము

అంత దుఃఖంబునొంది దీనుండై మిక్కిలియుఁ గోపంబునొంది సర్పంబుబోలె నిట్టూర్పులువుచ్చుచుఁ గోపంబున విస్తరిల్లినయుండుకండ్లతో నున్న వానిస్నేహితుండగు వానిఁ బ్రియుండగు వానిదమ్ముని లక్ష్మణునింజూచి రాముండు ధైర్యశాలికావున ధైర్యంబున మనోవికారము బయలుపడకుండ నణంచుకొని యిట్లని చెప్పెను. ౧,౨

నీవు తండ్రిపైఁ గోపంబును, "నా కిట్లు సంభవించినదిగదా" యని దుఃఖమునువిడిచి, ధైర్యం బవలంబించి యారంభించిన యభిషేకము నిలిచినదేయనునవమానంబు మనంబున నుంచక యధికంబుగ సంతోషంబునొంది, ఇప్పుడు నాపట్టాభిషేకమునకై చేసియుండు నలంకారాదులను శీఘ్రముగా విసర్జింపుము. బాగు సేయకుము. ౩, ౪

లక్ష్మణుండా! నాపట్టాభిషేకమునకై పదార్థములం గూర్చుటయందు నీకుం గల్గియుండు నుత్సాహంబును, నాపట్టాభిషేకంబు నిలిపి నాకు వనవాస

యస్యా మదభిషేకార్థే మానసం పరితప్యతే,
మాతా మే సా యథా న స్యా త్సవిశఙ్కా తథా కురు. ౬

తస్యా శ్శఙ్కామయం దుఃఖం ముహూర్తమపి నోత్సహే,
మనసి ప్రతిసంజాతం సౌమిత్రే! ఽహ ముపేక్షితుమ్. ౭
న బుద్ధిపూర్వం నాబుద్ధం స్మరామీహ కదాచన
మాతౄణాం వా పితు ర్వాఽహం కృత మల్పంచ విప్రియమ్. ౮
సత్య స్సత్యాభిసన్ధ శ్చ నిత్యం సత్యపరాక్రమః,
పరలోకభయా ద్భీతో నిర్భయోఽస్తు పితా మమ. ౯

తస్యాఽపి హి భవే దస్మి న్కర్మ ణ్యప్రతిసంహృతే,
సత్యం నేతి మనస్తాప స్తస్య తాప స్తపే చ్చ మామ్. ౧౦

అభిషేకవిధానం తు తస్మా త్సంహృత్య లక్ష్మణ!,
అన్వగే వాహ మిచ్ఛామి వనం గన్తు మితః పునః. ౧౧
మమ ప్రవ్రాజనా దద్య కృతకృత్యా నృపాత్మజా,
సుతం భరత మవ్యగ్ర మభిషేచయితా తతః. ౧౨

మయి చీరాజినధరే జటామణ్డలధారిణి,
గతేఽరణ్యం చ కైకేయ్యా భవిష్యతి మనస్సుఖమ్. ౧౩

యోగ్యంబులగు నారచీరమొదలగువాని సమకూర్చి నన్ను వనంబునకుఁ బంపుట యొందుంచుము. ౫

నాపట్టాభిషేకము నిలిచినదే యని పరితపించుచున్న నాతల్లి కౌసల్యకు "రాముండు పదునాలుగు సంవత్సరములేకదా వనంబుననుండును. అటు పిమ్మట మఱలనిచ్చటికివచ్చునుగదా! పదునాలుగుసంవత్సరము లనఁగా నెంత?" ఇట్లు చెప్పి భయంబు లేకుండునట్లు సేయుము. ౬

లక్ష్మణుండా! కౌసల్య మనంబున భయంబునొంది దుఃఖించుచుండు టను నేను గొంచెమునైనను ఉపేక్షించి యుండఁజాలను. ౭

నేను బుట్టినది మొదలు లోకప్పుడును దల్లులకుఁగాని తండ్రులకుఁగాని, తెలిసికాని తెలియకకాని కొంచెమైనను అపకారము చేసి యెఱుంగను. ౮

నాతండ్రి దశరథుండు ఎప్పటికి నబద్ధమాడఁడు. చేసినప్రతిజ్ఞ తప్పిన వాఁడుకాఁడు. అమోఘంబగు పరాక్రమంబుగలవాఁడు గావున నీభూలోకంబున నతనికెందును భయంబు లేదు. అయితే "యిప్పుడు చేసిన ప్రతిజ్ఞ తప్పు నేమో తప్పినట్టయినఁ బరలోకంబునఁగష్టంబునొందవలయునే" అని పరలోకంబువలన భయపడి యున్నాఁడు. అతఁడు నిర్భయుండు కావలయును. ౯

ఇప్పుడు నాపట్టాభిషేకమును నిలుపకున్నపక్షమున అట్టిదశరథమహా రాజునకు "నేను కైకేయికి వరంబొసంగిన మాట సత్యము కాలేదుగదా!" అని మనస్తాపము గలుగును. అతనికి మనస్తాపంబు గలుగుటను నే నోర్వఁజాలను. ౧౦

లక్ష్మణుండా! అందువలననే పట్టాభిషేకకార్యమునంతయుం విడిచి యిప్పుడె యిచ్చటనుండియె వనంబునకుఁ బోఁగోరుచున్నాను. ౧౧

ఇట్లు నేను వనంబునకుఁ బోయినపిదప, రాచకొమార్తెయగు కైకేయి కృతార్థయయి సంతోషంబునఁ దనకొడుకు భరతునకు నిర్విఘ్నంబుగాఁ బట్టాభిషేకంబు చేసికొనఁగలదు. ౧౨

నేను నారచీరలుఁ గృష్ణాజినంబుఁ గట్టుకొని జడలందాల్చి యడవికిఁ బోయినపిమ్మట కైకేయిమనంబునకు సంతోషంబుగలుగును. అంతవఱకుఁ గలుగదు కావున శీఘ్రముగాఁ బోవలయును. ౧౩

బుద్ధిః ప్రణీతా యేనేయం మనశ్చ సుసమాహితమ్,
తం తు నార్హామి సంక్లేష్టుం ప్రవ్రజిష్యామి మాచిరమ్. ౧౪

కృతాన్తస్త్వేవ సౌమిత్రే! ద్రష్టవ్యో మత్ప్రవాసనే,
రాజ్యస్య చ వితీర్ణస్య పున రేవ నివర్తనే. ౧౫

కైకేయ్యాః ప్రతిపత్తి ర్హి కథం స్యా న్మమ పీడనే,
యది భావో న దైవోఽయం కృతాన్తవిహితో భవేత్. ౧౬

జానాసి హి యథా సౌమ్య! న మాతృషు మమాన్తరమ్,
భూతపూర్వం విశేషో వా తస్యా మయి సుతేఽపి వా. ౧౭

సోఽభిషేకనివృత్త్యర్థైః ప్రవాసార్థైశ్చ దుర్వచైః,
ఉగ్రై ర్వాక్యై రహం తస్యా నాన్య ద్దైవా త్సమర్థయే. ౧౮

కథం ప్రకృతిసమ్పన్నా రాజపుత్రీ తథా గుణా,
బ్రూయా త్సా ప్రాకృతేవ స్త్రీ మత్పీడాం భర్తృసన్నిధౌ. ౧౯

ఎవ్వఁడు సత్యపరిపాలనార్థమయి, "రాముండు వనంబునకుఁ బోవల యును" అని తలంచి యట్లు అతికష్టంబున మనసును స్థిరముగాఁ జేసికొని యున్నాఁడో, అట్టి నాతండ్రి దశరథమహారాజు దుఃఖించునట్లు చేయఁగూడదు; నేను శీఘ్రముగా నడవికిఁ బోయెదను; జాగు సేయఁగూడదు. ౧౪

లక్ష్మణుఁడా! నన్ను వనంబునకుఁ బంపుటయందును నాకిచ్చిన రాజ్యము నాకు లభ్యముగాకుండుటయందును కైకేయి కారణముకాదు. ఇవన్నియు దైవమువలననే సంభవించినవని యెఱుంగుము. ౧౫

ఇప్పుడు తల్లియగు కైకేయికిం గల్గిన యీయభిప్రాయము దైవముచే గలిగినది కాదేని నాయం దెప్పుడును మిక్కిలియు వాత్సల్యము గలిగియుండు నట్టి కైకేయికి నన్ను బాధింపవలయుననుబుద్ధి యెట్లు కలుగును? ౧౬

తిన్ననివాఁడవగు లక్ష్మణుఁడా! ఇదివఱకెప్పుడును నేను దల్లుల నంద ఱను ఎంతమాత్రము "కన్నతల్లి చవతితల్లి" అని భేదముంచక సమానముగా జూచుకొనుచుండుటయు అట్లు కైకేయికిని దనకొడుకు భరతునియందును నాయందును భేదములేక సమానముగాఁ బ్రేమము గల్గియుండుటయుం నీకుఁ దెలిసియున్నదిగదా! అట్లుండునప్పుడు దైవప్రేరణము లేకుండునేని అట్టి కైకేయి కిట్టిబుద్ధి యేలగల్గును? ౧౭

నేను అట్లు మొదటనుండి యాబిడనాయందలి వాత్సల్యంబు గల్గియుం డుట ననుభవించి యున్నవాఁడను గావున అట్టి కైకేయి యిప్పుడు నన్నుఁ జూచి పట్టాభిషేకమునువిడిచి యరణ్యంబునకుఁ బొమ్మని చెప్పరాని భయంకర వాక్యంబు లాడుటచే దైవంబు దక్క మఱియేదియుఁ గారణముంగా నిశ్చ యింప నవకాశములేదు. కైకేయిస్వభావంబె కారణమయినచో నింతకుమున్ను బహుకాలముంగా నామెకు నాయందుం గల్గియుండు వాత్సల్యాతిశయంబు పోవుటకుఁ గారణము గానరాదు. కావున దైవమే యిట్లు సంభవింపఁజేసినది. అట్లగుటంజేసి కైకేయిని నిందింపవలదు. ౧౮

కైకేయి రాచకొమార్తె సద్గుణంబులు గలదియుం గావునఁ, బెనిమిటి యొద్ద నెట్లు నడుచుకొనవలయునో యామర్యాదం దెలిసి యట్లే యాచ

య దచిన్త్యం తు త ద్దైవం భూతే ష్వపి న హన్యతే,
వ్యక్తం మయిచ తస్యాంచ పతితో హి విపర్యయః. ౨౦

కశ్చి ద్దైవేన సౌమిత్రే! యోద్ధు ముత్సహతే పుమాన్,
యస్య న గ్రహణం కిఞ్చి త్కర్మణో౽న్యత్ర దృశ్యతే. ౨౧

రించునది; మఱియు నామీఁదనతివాత్సల్యంబుగలది. అట్టికైకేయి, తనస్వభావంబుతోనేయుండునేని, మునుపటియట్లు భర్తృగౌరవంబును బాటింపక నాయందు వాత్సల్యంబుం జూపక క్షుద్రస్త్రీయుంబోలెఁ బెనిమిటియొద్ద సిగ్గును భయంబును విడిచి తనకును బెనిమిటికిని మిక్కిలియుఁ బ్రియుండనైయున్న నాకుఁ బీడగలిగించు నిట్టిదుర్వాక్యంబులు చెప్పునా? ఎంతమాత్రము చెప్పదు. కావున దైవబలంబుననే యాకెస్వభావంబు భేదిల్లినది. ౧౯

దైవంబుమహిమము లెక్కింప నలవిగాదు. సమస్తభూతంబులయందును దాని కెదురులేదు. ఇందు సందియము లేదు. ఇప్పుడు అందఱుఁ జేరి యన్ని విధంబుల నాలోచించి నిష్కర్షించిన నాపట్టాభిషేకము నిలిచినది. అట్లు నాయం దతివాత్సల్యంబు గల్గియుండిన కైకేయిస్వభావంబు విపరీతం బైనది గదా! కావున దైవంబున కెందును ఎదురులేదనుట సత్యము. ౨౦

లక్ష్మణుఁడా! "ఆదైవంబున్నదనుట కేమిసాధకము? ఉన్నదిపో; పురుషప్రయత్నముచేత దానినేల నివారింపఁగూడదు?" అనియడుగుదువు కాఁబోలు: మనకు దైవమనునది యగపడకున్నను దానికార్యముచేత నది యున్నదని యనుమానించుచున్నాము, మనము చాల శ్రద్ధాశ్రమంబులతోఁ జేసినపనులలో గొన్ని సఫలములుకావు. అందు మనకేదియుఁ గారణము కనుపట్టదు. కొన్ని యెంతమాత్రమును శ్రద్ధగాని శ్రమముగాని లేనిదే యధికఫలము లగుచున్నవి. అట్లగుటకుం దగుసాధనసంపత్తియుం మనకుఁ గనుపట్టదు. ఈ రెంటికిని గారణమే దైవమనంబడును. కారణము లేనిదే కార్యముగలుగదు. కావున శ్రమంబు చేసినను ఫలింపకపోవుటయుఁ దగినశ్రమంబు లేనిదే యధికఫలం బగుటయును గారణముగల వగుచున్నవి. అయితే పైరెండు కార్యములును దైవమునకన్న నితరమగు కారణముగలది కాదని తెలియవచ్చుచున్నది. కాఁబట్టి పైరెండుకార్యములకును దైవమే కారణము. దైవములేనిదే పైరెంటికిని గారణ మెట్లగును? కావున దైవమనునది యొకటి యున్నదని యనుమానప్రమాణముచే సిద్ధించుచున్నది. అట్టిదైవము కార్యము సేయువానికిఁ గంటికగపడదు. అప్పుడది

సుఖదుఃఖే భయక్రోధౌ లాభాలాభౌ భవాభవౌ,
యచ్చ కిఞ్చి త్తథాభూతం నను దైవస్య కర్మ తత్. ౨౨
ఋషయోఽప్యుగ్రతపసో దైవే నాభిప్రపీడితాః,
ఉత్సృజ్య నియమాం స్తీవ్రా న్భ్రశ్యన్తే కామమన్యుభిః. ౨౩

అసఙ్కల్పిత మే వేహ యదకస్మా త్ప్రవర్తతే,
నివర్త్యారమ్భ మారబ్ధం నను దైవస్య కర్మ తత్. ౨౪

ఏతయా తత్త్వయా బుద్ధ్యా సంస్తభ్యాత్మాన మాత్మనా,
వ్యాహతేఽప్యభిషేకే మే పరితాపో న విద్యతే. ౨౫

తస్మా దపరితాప స్సం స్త్వ మప్యనువిధాయ మామ్,
ప్రతిసంహారయ క్షిప్ర మాభిషేచనికీం క్రియామ్. ౨౬
ఏభి రేవ ఘటై స్సర్వై రభిషేచనసమ్భృతైః,
మమ లక్ష్మణ! తాపస్యే వ్రతస్నానం భవిష్యతి. ౨౭

యనుకూలమో ప్రతికూలముగ నున్నదో యను సంగతియుం దెలియనేరదు. భవిష్యత్సంగతి యెవ్వనికి దెలియును? కార్యము చెడినప్పుడుమాత్రము తమకు దైవము ప్రతికూలముగ నుండినదని యెఱుంగును. అప్పుడు ఆదైవమున కేమి ప్రతికారము సేయనగును? కార్యము చెడిపోవుటకు మున్ను అది ప్రతికూలముగ నున్నదని తెలిసినంగదా దానికి బ్రతికారము సేయవచ్చును. మఱియు, నది యెప్పటికిని గంటికి గగపడదు. గావున ననుమానమువలన వస్తుస్థితిమాత్రము తెలిసియుం బురుషుం డేమి సేయఁగలఁడు? కావున దైవకార్యం బనుభవింపవలసినదే కాని దానికి బ్రతికారంబు లేదు. ౨౧

సుఖము, దుఃఖము, శాంతి, కోపము, లాభము, అలాభము, పుట్టుక, నాశము ఇవిమొదలుగఁ గారణ మగపడని కార్యములన్నియుం దైవకార్యములే.

భయంకరంబుగాఁ దపస్సుసేయుచు నింద్రాదులనుంగూడ నరకుసేయకుండు విశ్వామిత్రాది ఋషులును, దైవబలంబునం బీడితులై తా మవలంబించిన తీక్ష్ణవ్రతంబులం బరిత్యజించి, కామక్రోధంబులకు లోఁబడి తపస్సులం బోఁగొట్టుకొనుచున్నారు. ౨౩

ఈలోకంబునందు బహుప్రయత్నంబున నారంభించినకార్యమును నిలిపి యంతకుమును మనంబులోనుఁగూడఁ దలంపనికార్యము మఱియొకటి తటాలున సంభవించుచున్నదే; అది దైవకార్యమే. ౨౪

యథార్థమయిన యీన్యాయంబుచే నాకు నేనే మనసును నిగ్రహించుకొని యున్నాను; కావున నాకుఁ బట్టాభిషేకము నిల్చిపోయినను బరితాపము గలుగకున్నది. ౨౫

అట్లు నీవును నావలెనే దైవశక్తిం బర్యాలోచించి పరితాపంబువిడిచి యిప్పుడు నాపట్టాభిషేకమునకై సేయుచుండు కార్యములను నిలుపుము. ౨౬

లక్ష్మణుండా! ఇప్పుడు పట్టాభిషేకమునకై తెచ్చియున్నారే ఈ మంగళకలశంబులందలి జలంబంతయును నాపట్టాభిషేకంబున కుపయోగింపకున్న

అథవా కిం మమైతేన రాజ ద్రవ్యమయేన తు,
ఉద్ధృతం మే స్వయం తోయం వ్రతాదేశం కరిష్యతి. ౨౮

మా చ లక్ష్మణ! సన్తాపం కార్షీర్లక్ష్మ్యా విపర్యయే,
రాజ్యం వా వనవాసో వా వనవాసో మహోదయః. ౨౯

న లక్ష్మణాస్మిన్ ఖలు కర్మవిఘ్నే
మాతా యవీయస్యతిశఙ్కనీయా,
దైవాభిపన్నా హి వదత్యనిష్టం
జానాసి దైవం చ తథాప్రభావమ్. ౩౦

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే ద్వావింశస్సర్గః.

---

## త్రయోవింశస్సర్గః

ఇతి బ్రువతి రామే తు లక్ష్మణోఽధశ్శిరా ముహుః,
శ్రుత్వా మధ్యం జగామేవ మనసా దుఃఖహర్షయోః, ౧

తదా తు బద్ధ్వా భ్రుకుటీం భ్రువోర్మధ్యే నరర్షభః,
నిశశ్వాస మహాసర్పో బిలస్థ ఇవ రోషితః. ౨

నేమి? నేను దాపసవ్రతం బవలంబించుటకై చేయవలసిన సంకల్పస్నానం బున కుపయోగపడునుగాక. ౨౭

ఒకవేళ నీజలములో స్నానముచేయుందువేని కైకేయి మఱియు సందే హించును గాఁబోలు: ఇది రాజద్రవ్యము; మఱి రాజ్యమున కుపయుక్తములగు ద్రవ్యములతోఁ గూడియున్నది. ఇట్టిజలము నాకేల? నేనే చేఁదుకొని యీ జలములో వ్రతస్నానము చేసెదను. ౨౮

లక్ష్మణుఁడా! రాజ్యములేక పోయినదని నీవు పరితాపము పడవలదు. రాజ్యంబునఁ బ్రజాపాలనాదిధర్మములు గలుగును. వనవాసంబునఁ దపస్సు మొదలగునవిగలుగును. రెండును సమానములే. అయితే విచారింపఁగా మాత్రము రాజ్యంబుననుండు ప్రజలకృత్యాకృత్యసుఖదుఃఖచింతలేమిం జేసి పితృవచన పరిపాలనధర్మం బధికంబుగా నుండుటం జేసియుం వనవాసంబే యధికము. ౨౯

లక్ష్మణుఁడా! దైవప్రభావంబు నీ కిప్పుడు తెలిసియేయున్నదిగదా! అట్టిదైవము ప్రేరించుటచేతఁ గైకేయి యీప్రకారం బప్రియవార్తలం బలుకుచున్నది కాని వేఱుకాదు. కావున నిప్పుడు పట్టాభిషేకంబునకుఁ గైకేయి విఘ్నంబుచేసిన దని తలంపవలదు. విఘ్నముచేసినది దైవమే. ౩౦

ఇది యిరువదిరెండవసర్గము.

---

## ఇరువదిమూఁడవ సర్గము

రాముఁడిట్లు చెప్పుచుండఁగా లక్ష్మణుఁడు మాటిమాటికిఁ దలవంచుకొనుచు నంతయు విని తనయన్నరాముఁడు మిక్కిలియుం ధర్మబుద్ధిగలవాఁడని సంతోషంబును రాజ్యంబు విడుచునని దుఃఖంబును ఆరెంటినిఁ బొంది నట్టుండెను. ౧

పురుషశ్రేష్ఠుఁడగు లక్ష్మణుండు, అంతఁ గోపంబున బొమముడి భీకరంబై కనుపట్టఁ గుపితంబైన బిలస్థంబగు మహాసర్పంబుంబోలె నిట్టూర్పులు వుచ్చెను. ౨

తస్య దుష్ప్రతివీక్ష్యం తద్భ్రుకుటీసహితం తదా,
బభౌ క్రుద్ధస్య సింహస్య ముఖస్య సదృశం ముఖమ్. 3

అగ్రహస్తం విధున్వంస్తు హస్తీ హస్తమివాత్మనః,
తిర్యగూర్ధ్వం శరీరే చ పాతయిత్వా శిరోధరామ్. ౪
అగ్రాక్ష్ణా వీక్షమాణస్తు తిర్యగ్భ్రాతరమబ్రవీత్,
అస్థానే సమ్భ్రమో యస్య జాతో వై సుమహానయమ్. ౫
ధర్మదోషప్రసఙ్గేన లోకస్యానతిశఙ్కయా,

కథం హ్యేతదసంభ్రాన్తస్త్వద్విధో వక్తుమర్హతి. ౬
యథా దైవమశౌణ్డీరం శౌణ్డీర! క్షత్రియర్షభ!,

కింనామ కృపణం దైవమశక్తమభిశంససి. ౭
పాపయోస్తే కథం నామ తయోశ్శఙ్కా న విద్యతే,

సన్తి ధర్మోపధాశ్శ్లక్ష్ణాః ధర్మాత్మ! న్కిం న బుధ్యసే. ౮
తయోస్సుచరితం స్వార్థం శాఠ్యాత్పరిజిహీర్షతోః,

యది నైవం వ్యవసితం స్యాద్ధి ప్రాగేవ రాఘవ!, ౯
తయోః ప్రాగేవ దత్తశ్చ స్యాద్వరః ప్రకృతశ్చ సః,

అప్పుడు భయంకరంబగుబొమముడిగల్గి చూపఱులకు భయంబుగల్పించు చున్న యాలక్ష్మణునిముఖంబు కుపితంబైనసింహముముఖంబుతో సరియై చూపట్టుచుండినది. 3

ఆలక్ష్మణుఁడు కోపంబునఁ గొనచేతిని విదిలించి మెడను ముందుకు వెనుకకుఁ గ్రిందికిం ద్రిప్పి కడకంట నడ్డముగాఁజూచుచు అన్నయగు రాము నితో నిట్లని చెప్పెను. ౪

నీవు సమస్తనీతులం దెలిసినవాఁడవు. అట్టి నీవు, "పితృవచనధర్మంబు చేయు" నని యుం "నేను ధర్మంబు నాచరింపకుందునేని లోకులు ధర్మంబును విడుతు" రనియుం భ్రమించి వనంబునకుఁబోవ వేగిరపడుట యుక్తముగాదు. ౫

నీవు శూరులలో మేటివయినవాఁడవు. మఱియుం క్షత్త్రియశ్రేష్ఠుఁడవు. నీవుగూడ దుర్బలంబగుదైవంబును మహాప్రబలమునుగాఁ జెప్పు చున్నావే. నీకు భ్రాంతిగలిగినట్లున్నది. అట్లు భ్రాంతిగలుగకుండునేని నీయట్టి వాఁడిట్టిమాటం జెప్పఁడు. ౬

దీనుల నాశ్రయించియుండునదియు శక్తిలేనిదియునగు దైవంబు నేలపొగడెదవు? ఆకైకేయీదశరథులు పాపాత్ములని నీకేల తోఁచలేదు? వారలు పాపాత్ములు గావున వారల పనుపు సేయకుండుటచే నీ కేమియుం దోషంబుగలుగదు. ౭

ధర్మాత్ముఁడవగు రాముఁడా! లోకంబునఁ గొందఱు కపటముగా ధర్మమాచరించునట్లు వేషము వేసికొని స్వకార్యసిద్ధికై ప్రియవార్తలంజెప్పున ట్లభినయించుచుందురు. అట్లు ఆకైకేయీదశరథులును బైకి నీయందతి వాత్సల్యంబు గలిగియుండున ట్లభినయించుచు, రహస్యముగా మనంబులో నీకుఁ గీడుగోరి చేసినయాలోచనంబు నీకుఁ దెలియదా యేమి? ౮

రాముఁడా! దశరథుఁడు కైకేయికి వరంబొసఁగి బహుకాలంబైనది. ఇది వాస్తవమగునేని ధర్మజ్ఞుఁడగు దశరథుఁ డిదివఱకు దాని నుపేక్షించి

లోకవిద్విష్ట మారబ్ధం త్వదన్య స్యాభిషేచనమ్. ౧౦
నోత్సహే సహితుం వీర! తత్ర మే క్షన్తు మర్హసి,

యే నేయ మాగతా ద్వైధం తవ బుద్ధి ర్మహామతే!. ౧౧
సహి ధర్మో మమ ద్వేష్యః ప్రసఙ్గా ద్యస్య మువ్యాసి,

కథం త్వం కర్మణా శక్తః కైకేయీవశవర్తినః. ౧౨
కరిష్యసి పితు ర్వాక్య మధర్మిష్ఠం విగర్హితమ్,

యుండఁడు; ఇదివఱ కెప్పుడో దానిఁ దీర్చుకొనియేయుండును; ఇదివఱ కా ప్రస్తావమే లేదే; మఱియు నావరంబు నుపయోగపఱచుకొనుటకు ఇదే సమయమా? నీకుఁ బట్టాభిషేకంబు వెల్లడిసేయుట, అనంతరము ఈ వరప్రసక్తిగలుగుట వీనిఁజూడఁగా "భరతునకురాజ్యం బివ్వవలయును; జ్యేష్ఠుండగు రాముఁడుండఁగా నది పొసంగదు; కావున నేను రామునకుఁ బట్టాభిషేకమని వెల్లడి చేసెదను; అప్పుడు నీవు నేను వరంబులొసంగియున్నట్టును ఆవరంబులు రెంటికిని భరతాభిషేకంబును రామవివాసనంబును గావలసినట్టుగ నీవడుగుము; అప్పుడు నేను సత్యపాశబద్ధుఁడ నైనట్లుండి కార్యము నెఱవేర్చుకొనియెదను" అని దశరథుఁడును కైకేయియును జక్కఁగా నాలోచించుకొనినట్లు తోఁచుచున్నది; అట్లు వారలు ఆలోచింపకయేయుండియుందురేని దశరథుఁడిదివఱ కెన్నఁడో యిచ్చినవరంబులఁ గైకేయియు నూరక పెట్టియుండదు; దశరథుఁడును ఊరక పెట్టుకొనియుండఁడు; ఇదివఱకుఁ గైకేయియెన్నిమాఱులో అడిగియుండును; దశరథుఁడును ధర్మజ్ఞుఁడు కావున నిదివఱ కెన్నఁడో యిచ్చియుండును; అట్లుకాలేదు కాఁబట్టి వీరలు కృత్రిమంబుగ నాలోచించుకొనిరనుట సత్యము. ౯

పరాక్రమశాలివగు రాముఁడా! నిన్ను విడిచి సీతమ్మునకుఁ బట్టాభిషేకము సేయుట లోకవిరుద్ధంబయినకార్యము; ఈ కైకేయీదశరథులు దానిఁ జేయంబూనినారు; దానినిమాత్రము నే సహింపఁజాలను; ఆ విషయమందు మాత్రము నన్ను నీవు మన్నింపవలసినది. ౧౦

మహాబుద్ధిశాలివగు రాముఁడా! ఏధర్మముచేత నీకుఁ బట్టాభిషేకమును విడిచి యరణ్యంబునకుఁ బోవలెనని బుద్ధిభేదంబుగల్గినదో, ఏధర్మంబువలనఁ "జేయకున్నఁ బ్రత్యవాయముగల్గు" నని మోహంబు నొందియున్నావో, అట్టి పితృవచనపరిపాలనరూపధర్మము నా కిష్టముకాదు. ౧౧

నీవు ప్రతీకారంబుసేయుటయందు సమర్థుఁడవై దండ్రి కైకేయి వలలోఁ జిక్కి చెప్పిన యధార్మికంబును నిందితంబునగు వచనంబుసేయ

యస్త్వయం కిల్బిషా ద్భేదః కృతోఽప్యేవం న గృహ్యతే. ౧౩
జాయతే తత్ర మే దుఃఖం ధర్మసఙ్గశ్చ గర్హితః,

మనసాఽపి కథం కామం కుర్యా స్త్వం కామవృత్తయోః. ౧౪
తయో స్త్వహితయో ర్నిత్యం శత్ర్వోః పిత్రభిధానయోః,

యద్యపి ప్రతిపత్తి స్తే దైవీ చాపి తయో ర్మతమ్. ౧౫
తథా ప్యుపేక్షణీయం తే న మే తదపి రోచతే,

విక్లబో వీర్యహీనో యస్స దైవ మనువర్తతే. ౧౬
వీరా స్సంభావితాత్మానో న దైవం పర్యుపాసతే,

దైవం పురుషకారేణ యస్సమర్థః ప్రబాధితుమ్. ౧౭
న దైవేన విపన్నార్థః పురుష స్సోఽవసీదతి,

ద్రక్ష్యన్తి త్వద్య దైవస్య పౌరుషం పురుషస్య చ. ౧౮
దైవమానుషయో రద్య వ్యక్తా వ్యక్తి ర్భవిష్యతి,

అద్య మత్పౌరుషహతం దైవం ద్రక్ష్యన్తి వై జనాః. ౧౯

వచ్చునా? నీవు దానిఁ దిరస్కరించి పరాక్రమంబుఁ జూపవలయుఁగాని యెంత మాత్రము దశరథునిమాటను వినఁగూడదు. ౧౨

నీకై యారంభింపఁబడిన పట్టాభిషేకకార్యమును నిలిపి భరతునకుఁ బట్టాభిషేకమును నీకు వనవాసంబును గాఁ, గైకేయీదశరథులు కపటబుద్ధిచేతనే చేసియుండిరి; నీకట్లు తోఁచకుండుటవలన మాత్రము నాకు దుఃఖం బగుచున్నది. మఱియుఁ గాముకుఁడగు తండ్రిమాటవిని యరణ్యంబునకుఁ బోవుట లోకవిరుద్ధమగు ధర్మమే కాని వేఱుగాదు. ౧౩

కామాధీనులయి నీకెల్లప్పుడును కీడుసేయఁగోరుచుఁ దలిదండ్రులవేషముతో నుండు శత్రువులయిన యాకైకేయీదశరథులు కామపరవశులయి కోరరానిది కోరఁగా వారల కోర్కినిఁగూడ నెఱవేఱుపవలయునని నీవు మనసులోనం గూడ నెట్లు దలఁపవచ్చును? ౧౪

"ఆకైకేయీదశరథుల కిట్టి దురభిప్రాయంబుపుట్టుట దైవకృతమే కాని వారల స్వభావంబునం గలిగినది కాదు" అని నీవు తలంచియున్నావు; అది సరిగాదు; నాకెంతమాత్రము దైవము ప్రమాణముగానే దోఁచలేదు. ౧౫

పరాక్రమంబులేనివాఁడును, తెలివిలేనివాఁడునుమాత్రము దైవంబు ననుసరించును; పరాక్రమశాలులును బుద్ధిమంతులగువారలయినచో నెట్టియునఁ దమసామర్థ్యంబునఁ గార్యంబు సాధించుకొనుదురే కాని దైవంబునకు లొంగరు. ౧౬

పౌరుషంబున దైవంబు నడఁగం ద్రొక్కుటకు సమర్థుఁడగు పురుషుఁడుమాత్రము ఎప్పుడును దైవంబునకు వెఱచి స్వార్థంబుఁ బోఁగొట్టుకొని దుఃఖింపఁడు. ౧౭

జను లిప్పుడు దైవసామర్థ్యమును బురుషునిసామర్థ్యమునుఁ జూడఁగలరు; ఇప్పుడు దైవము ప్రబలమో పురుషుఁడు ప్రబలుఁడో యీ సందేహమును తీర్చెదను. ౧౮

ఏదైవ మిప్పుడు నీపట్టాభిషేకమును జెఱుపంజూచినదో, ఆ దైవము

యద్దైవా దాహతం తేఽద్య దృష్టం రాజ్యాభిషేచనమ్,
అత్యఙ్కుశ మివోద్దామం గజం మదబలోద్ధతమ్. ౨౦
ప్రధావిత మహం దైవం పౌరుషేణ నివర్తయే,

లోకపాలా స్సమస్తా స్తే నాద్య రామాభిషేచనమ్. ౨౧
నచ కృత్స్నా స్త్రయో లోకా విహన్యుః కింపునః పితా,

యై ర్వివాస స్తవారణ్యే మిథో రాజ! స్సమర్థితః. ౨౨
అరణ్యే తే నివత్స్యన్తి చతుర్దశసమా స్తథా,

అహం తదాశాం ఛేత్స్యామి పితు స్తస్యా శ్చ యా తవ. ౨3
అభిషేకవిఘాతేన పుత్రరాజ్యాయ వర్తతే,

మద్బలేన విరుద్ధాయ న స్యాద్దైవబలం తథా. ౨౪
ప్రభవిష్యతి దుఃఖాయ యథోగ్రం పౌరుషం మమ,

ఊర్ధ్వం వర్షసహస్రాన్తే ప్రజాపాల్య మనన్తరమ్. ౨౫
ఆర్యపుత్రాః కరిష్యన్తి వనవాసం గతే త్వయి,

పూర్వంరాజర్షివృత్త్యా హి వనవాసో విధీయతే. ౨౬
ప్రజా నిక్షిప్య పుత్రేషు పుత్రవ త్పరిపాలనే,

నిప్పుడు నాపౌరుషంబుచేఁ బ్రతిహతంబగుటను జనులందఱుఁ జూడఁగలరు

అంకుశమును సరకుసేయక నిగళంబు ద్రెంచుకొని మదబలంబున గర్వించి దుర్నివారంబై పరుగిడుచున్న యేనుఁగును సమర్థుఁడగు మావటీఁడు స్వసామర్థ్యంబున మఱల్చునట్లు నే నిప్పుడు దుర్నివారంబగు నీచేఁ జెప్పఁబడుచున్న దైవమును నాసామర్థ్యంబున మఱల్చెదను. ౨౦

దిక్పాలురందఱు నొక్కటియయివచ్చినను, ముల్లోకంబులన్నియు నొక్కటైనను ఇప్పుడు నేను సంరంభించియుండఁగా రామునిపట్టాభిషేకము నిలువనేరదు; ఇఁక ముసలివాఁ డొక్కఁడు దశరథుఁ డేమిసేయఁగలఁడు? ౨౧

మహారాజా! నీకు వనవాసంబు గలుగవలయునని యెవ్వరు రహస్యముగా నాలోచించి నిశ్చయించినారో అట్టి పాపాత్ములందఱు వారలు నీకుఁ జెప్పినట్లు పదునాలుగుసంవత్సరములును అడవినుండునట్లు గావించెదను. ౨౨

అందువలన నీపట్టాభిషేకమునకు విఘాతము గావించి తనకొడుకు భరతునకు రాజ్యంబు రావలయునని కోరుచున్న కైకేయికిని దశరథునకును గలిగియున్న దురాశను బోఁగొట్టెదను. ౨౩

అయితే కైకేయీదశరథులకు దైవం బనుకూలంబుగ నున్నదే; మనకది ప్రతికూలము; కావున వారల లోఁగొనుట మనకు దుస్తరమని యందువేమో; నాతో విరోధించినవానికిమాత్రము దైవ మెంతయనుకూలముగానున్నను ఏమియు నుపయోగ ముండదు; అతఁడు నాపౌరుషంబునకుం జిక్కి దుఃఖించునేకాని తప్పించుకొనలేఁడు. ౨౪

ఇట్లు సమస్తరాజ్యసుఖంబు లనుభవించి వేయిసంవత్సరంబులు గడచిన పిదప నీవు వానప్రస్థాశ్రమం బవలంబించి వనంబునకుం బోయిన యనంతరము నీకొడుకులు రాజ్యపరిపాలనంబు సేయుదురు; ఇఁక నెప్పటికిని భరతునకు రాజ్యపాలనాధికారమున కవకాశంబు లేదు. ౨౫

తాను శక్తియున్నంతవఱకుఁ బ్రజాపరిపాలనంబుచేసి యంతఁ బ్రజలను గొడుకుల కొప్పగించి, "మీరలు మీకొడుకులఁ గాపాడుకొనునట్లు

నచే ద్రాజ న్యనేకాగ్రే రాజ్యవిభ్రమశఙ్కయా. ౨౭
నైన మిచ్ఛసి ధర్మాత్మ! న్రాజ్యం రామ ! త్వ మాత్మని,
ప్రతిజానే చ తే వీర! మాభూవం వీరలోకభాక్. ౨౮

రాజ్యం చ తవ రక్షేయ మహం వేలేన సాగరమ్,

మఙ్గళై రభిషిఞ్చస్వ తత్ర త్వం వ్యాపృతో భవ. ౨౯
అహ మేకో మహీపాలా నలం వారయితుం బలాత్,

నశోభార్థా విమౌ బాహూ న ధను ర్భూషణాయ మే. ౩౦

నాఽసి రాబన్ధనార్థాయ న శరా స్తమ్భహేతవః,

అమిత్రదమనార్థం మే సర్వ మేత చ్చతుష్టయమ్. ౩౧

ప్రజలను పుత్రవాత్సల్యంబునం గాపాడుచుండవలయు” నని చెప్పి యిట్లు మునుపటిరాజర్షు లాచరించినవిధంబున వనవాసంబు సేయవలయునని యేకదా శాస్త్రంబునం జెప్పఁబడియున్నది. ౨౭

ధర్మాత్ముఁడ వగు రాముఁడా! “ఇప్పుడు దశరథమహారాజుమనసు చపలముగానున్నది; నేను సాహసించి రాజ్యంబు స్వాధీనము చేసికొనఁజాలు నేని రాజ్యమునం దెన్ని భేదములు గలుగునో వానినన్నిఁటిని నే నొంటరి గాఁడ నెట్లు సవరించుకొనంగలను?” అను నీయభిప్రాయంబున నీ వీరాజ్యంబుఁ గోరకుందువేని దానిం జెప్పుము; నీవును వీరుఁడవు; నేను నీకుఁ దోడుండఁగా నీకేమిభయము? “అట్లు భంగమువచ్చునట్లయ్యేనేని నేను వీరలోకంబున కర్హుఁడఁగాకపోవుదును” అని ప్రతిజ్ఞయుం జేసెను. ౨౮

చెలియలికట్ట, సముద్రము నెట్లు పొంగిరాకుండఁ గాచియుండునో, అట్లు నేను నీరాజ్యంబులో నేమియుం గలఁతలేకుండునట్లు కాచియుండెదను.

నీవు వసిష్ఠాదులం జేరి పట్టాభిషేకంబు చేసికొనుము; నీవిఁక నా కార్యంబుఁజూడుము; విరోధంబున నీ మీఁదికివచ్చురాజులనందఱ సంహరింపనే నొకండ నేచాలుదును. ౨౯

ఈ నాచేతులురెండును యుద్ధముసేయుటకై యున్నవి కాని యలంకారమునకుఁగాదు; నాచేతనుండు ధనుస్సును ఎక్కిడి శత్రువులపై నమ్ములం బ్రయోగించుటకై ధరించియున్నానుగాని యలంకారార్థమై కాదు. ౩౦

ఈ కత్తి శత్రువుల నఱకుటకై యుపయోగించునదే కాని యలంకారముగా మొలలోఁ గట్టుకొనుటకుఁగాదు. నాయమ్ములపొదిలోనుండుబాణంబులు శత్రువులపైఁ బ్రయోగించుటకై యుంచఁబడినవి కాని వ్యర్థముగా నూరక యుంచఁబడినవి కావు.

నాకు ఈనాలుగాయుధములును మఱియు నితరములయినవియు శత్రువుల నడఁగఁద్రొక్కుటకే కాని మఱిదేనికింగాదు. ౩౧

న చాహం కామయేఽత్యర్థం యస్స్యాచ్ఛత్రుర్మతో మమ,
అసినా తీక్ష్ణధారేణ విద్యుచ్చలితవర్చసా. ౩౨
ప్రగృహీతేన వై శత్రుం వజ్రిణం వా న కల్పయే,

ఖడ్గనిష్పేషనిష్పిష్టైర్గహనా దుశ్చరా చ మే. ౩౩
హస్త్యశ్వనరహస్తోరుశిరోభిర్భవితా మహీ,

ఖడ్గధారాహతా మేఽద్య దీప్యమానా ఇవాద్రయః. ౩౪
పతిష్యన్తి ద్విపా భూమౌ మేఘా ఇవ సవిద్యుతః,

బద్ధగోధాఙ్గులిత్రాణే ప్రగృహీతశరాసనే. ౩౫
కథం పురుషమానీ స్యాత్పురుషాణాం మయి స్థితే,

బహుభిశ్చైకమత్యస్యన్నేకేన చ బహూఞ్జనాన్. ౩౬
వినియోక్ష్యామ్యహం బాణాన్నృవాజిగజమర్మసు,

అద్య మేఽస్త్రప్రభావస్య ప్రభావః ప్రభవిష్యతి. ౩౭
రాజ్ఞశ్చాప్రభుతాం కర్తుం ప్రభుత్వం తవ చ ప్రభో!,

అద్య చన్దనసారస్య కేయూరామోక్షణస్య చ. ౩౮
వసూనాం చ విమోక్షస్య సుహృదాం పాలనస్య చ,
అనురూపా వివమౌ బాహూ రామ! కర్మ కరిష్యతః. ౩౯
అభిషేచనవిఘ్నస్య కర్తౄణాం తే నివారణే,

నాకు శత్రువని యెవ్వఁడు చెప్పఁబడుచున్నాఁడో అతఁడు జీవించుట కెంతమాత్రము నేను సహింపఁజాలను; కఱకుగలిగి మెఱుపుఁబోలె మెఱయుచున్న ఖడ్గమును జేకొని, దేవేంద్రుఁడు వజ్రాయుధముతో నెదిరించినను సరకుసేయక చంపుదును. ౩౨

నా ఖడ్గప్రహారంబులకుఁ జూర్ణములయి తెగి యేనుఁగులయుం గుఱ్ఱంబులయుం మనుష్యులయుఁ జేతులుఁగాళ్లుఁ దలలు నెచ్చుగా సందులేకపడియుండుటవలన భూమియందంతటను సంచరించుటకు నవకాశము లేకపోవును. ౩౩

ఇఁక శీఘ్రంబుగనే నా కత్తిదెబ్బకుం దెగి శత్రుగజంబులు నెత్తురు గ్రక్కుచుండుటవలన మండుచున్న కొండలుఁబోలె మెఱుపులతోఁగూడిన మేఘంబులుంబోలె జూపట్టుచు నేలంబడఁగలవు. ౩౪

నేను ఉడుముతోలుతోఁ గుట్టిన కవచంబును, అల్లెత్రాటిదెబ్బ తాఁకకుండుటకై వ్రేళ్లకుం దొడుగుకొని ధనువుధరించి యుద్ధంబునకు సన్నద్ధుండనై నిలువఁగా నెవ్వఁడు నేను బురుషుండనని యెదిరింపఁగలఁడు? అందఱును స్త్రీలుంబోలె భయంబునం బాఱిపోదురే కాని యెవ్వఁడును బురుషుఁడనని యే చెప్పుకొనఁడు. ౩౫

నేను బలవంతు నొక్కనిఁ బెక్కుబాణంబులను, క్షుద్రజనుల ననేకుల నొక్కబాణంబునను వ్రేయుచు నిట్లు నరహయగజంబుల మర్మస్థానంబులందు బాణంబులం బ్రయోగించుచు విహారంబు చేసెదను. ౩౬

ప్రభుండవగు రాముఁడా! నా నేర్చిన యస్త్రముల మాహాత్మ్యముఁ జూడుము; ఈక్షణంబుననే దశరథమహారాజు నవలం ద్రోసిపుచ్చి నిన్నుఁ బ్రభువుగాఁ జేసెదను. ౩౭

రాముఁడా! చందనరసం బలందికొనుటకును బాహుపురులు ధరించుకొనుటకును యాచకులకు ధనము లిచ్చుటకును స్నేహితులను శత్రుబాధలం జిక్కకుండఁ గాపాడుటకును యోగ్యంబులయిన యీ నా బాహువులు రెండును ఇప్పుడు నీ పట్టాభిషేకంబున కడ్డపడినవారల నందఱును బాఱఁదోలుట కుద్యోగింపఁగలవు. ౩౮, ౩౯

బ్రవీహి కోఽద్యైవ మయా వియుజ్యతాం
తవాసుహృత్ప్రాణయశస్సుహృజ్జనైః.
యథా తవేయం వసుధా వశే భవే
త్తథైవ మాం శాధి తవాస్మి కింకరః,

విమృజ్య బాష్పం పరిసాన్త్వ్య చాసకృ
త్స లక్ష్మణం రాఘువవంశవర్ధనః.
ఉవాచ పిత్రే వచనే వ్యవస్థితం
నిబోధ మా మేష హి సౌమ్య! సత్పథః.

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే త్రయోవింశస్సర్గః.

---

## చతుర్వింశస్సర్గః

తం సమీక్ష్య త్వవహితం పితు ర్నిర్దేశపాలనే,
కౌసల్యా బాష్పసంరుద్ధా వచో ధర్మిష్ఠ మబ్రవీత్.

అదృష్టదుఃఖో ధర్మాత్మా సర్వభూతప్రియంవదః,
మయి జాతో దశరథా త్కథ ముఞ్ఛేన వర్తయేత్.

యస్య భృత్యాశ్చ దాసాశ్చ మృష్టా న్యన్నాని భుఞ్జతే
కథం స భోక్ష్యతేఽనాథో వనే మూలఫలా న్యయమ్.

నీశత్రుఁ డెవ్వఁడు? నే నిప్పు డెవ్వని ప్రాణంబులను గీర్తిశిం గొనవలయును? ఎవ్వనిస్నేహితులం జంపవలయు? ఈ భూమియంతయు నీయధీనమగునట్టి యుపాయం బవలంబించిమాత్రము న న్నాజ్ఞాపింపుము; ఈ క్షణమే చేసెదను; నేను నీకుఁ గింకరుఁడనుగాని వేఱుగాదు. అని లక్ష్మణుఁడు రామునితోఁ జెప్పెను. ౪౦

లక్ష్మణునిమాటవిని రఘువంశంబును వృద్ధిఁబొందించునట్టిరాముఁడు లక్ష్మణునికన్నీళ్లుదుడిచి పలుమాఱు మంచిమాటలనోదార్చి యతనిఁజూచి "లక్ష్మణుఁడా! నీ వెప్పుడును సౌమ్యుఁడవే, ఇప్పు డేల యిట్లు కోపంబునొందితివి? నేను దండ్రి మాటను గొంచెమైన నతిక్రమింపను, ఎట్లైననేమి? ఆయన చెప్పినట్లే చేయుటకు స్థిరచిత్తుండనై యున్నాఁడనని తెలిసికొనుము; అదియే పరమధర్మము" అని చెప్పెను. ౪౧

ఇది యిరువదిమూఁడవసర్గము.

---

## ఇరువదినాలవ సర్గము

రాముఁడు తండ్రియాజ్ఞాప్రకారము సేయుటకు నిశ్చయించి దృఢచిత్తుఁడై యుండుటఁజూచి కౌసల్య కన్నీళ్లవలనఁ దడఁబడుచు ధర్మిష్ఠంబగు నీమాటం జెప్పెను. ౧

ఎప్పుడును దుఃఖంబనుభవించినవాఁడుగాఁడు. ధర్మాత్ముఁడు. సమస్త ప్రాణులకును బ్రియంబగువార్తనే చెప్పువాఁడు. దశరథమహారాజునకును నాకును బుట్టినవాఁడు. అట్టిరాముఁడు దైవవశంబున నేలరాలినధాన్యకణంబుల నొక్కొక్కటిగా నేరుకొని యెట్లు జీవింపఁగలఁడు? ౨

ఎవ్వని భృత్యులును బరిచారకులును మృష్టాన్నంబులం దినుచున్నారో, అట్టినాథుఁడగు రాముఁడు వనంబున గడ్డలను ఫలంబులనుఁదినుచు నెట్లు మనియుండఁగలఁడు? ౩

సర్వత్ర చ్ఛిద్రధేచ్ఛిత్వా కస్యనా న భవే ద్భయమ్,
గుణవాన్దయితో రాజ్ఞో రాఘవో యద్వివాస్యతే.

నూనం తు బలవాన్ లోకే కృతాన్త స్సర్వ మాదిశన్,
లోకే రామాభిరామ స్త్వం వనం యత్ర గమిష్యసి.

అయ స్తు మా మాత్మభవ స్త్వ వాదర్శనమారుతః,
విలాపదుఃఖసమిధో రుదితాశ్రుహుతాహుతిః.
చిన్తాబాష్పమహాధూమ స్తవాదర్శనచిత్తజః,
కర్శయిత్వా భృశం పుత్ర! నిశ్వాసాయాసమ్భవః.
త్వయా విహీనా మిహ మాం శోకాగ్ని రతులో మహాన్,
ప్రధక్ష్యతి యథా కక్షం చిత్రభాను ర్హిమాత్యయే.

కథం హి ధేను స్స్వం వత్సం గచ్ఛన్తం నానుగచ్ఛతి,
అహం త్వాఽనుగమిష్యామి యత్ర పుత్ర! గమిష్యసి.

తథా నిగదితం మాత్రా తద్వాక్యం పురుషర్షభః,
శ్రుత్వా రామోఽబ్రవీ ద్వాక్యం మాతరం భృశదుఃఖితామ్.
కైకేయ్యా వంచితో రాజా మయి చారణ్య మాశ్రితే,
భవత్యా చ పరిత్యక్తో న నూనం వర్తయిష్యతి. ౧౧

భర్తుః కిల పరిత్యాగో నృశంసః కేవలం స్త్రియాః,
స భవత్యా న కర్తవ్యో మనసాఽపి విగర్హితః. ౧౨

యావ జ్జీవతి కాకుత్స్థః పితా మే జగతీపతిః,
శుశ్రూషా క్రియతాం తావ త్స హి ధర్మ స్సనాతనః. ౧౩

ఏవ ముక్తా తు రామేణ కౌసల్యా శుభదర్శనా,
తథే త్యువాచ సుప్రీతా రామ మక్లిష్టకారిణమ్. ౧౪

ఏవ ముక్తస్తు వచనం రామో ధర్మభృతాం వరః,
భూయ స్తా మబ్రవీ ద్వాక్యం మాతరం భృశదుఃఖితామ్. ౧౫
మయా చైవ భవత్యా చ కర్తవ్యం వచనం పితుః,

రాజా భర్తా గురు శ్శ్రేష్ఠ స్సర్వేషా మీశ్వరః ప్రభుః. ౧౬

ఇమాని తు మహారణ్యే విహృత్య నవ పఞ్చ చ,
వర్షాణి పరమప్రీతః స్థాస్యామి వచనే తవ. ౧౭

ఏవ ముక్తా ప్రియం పుత్త్రం బాష్పపూర్ణాననా తదా,
ఉవాచ పరమార్తా తు కౌసల్యా పుత్త్రవత్సలా. ౧౮

ఆసాం రామ! సపత్నీనాం వస్తుం మధ్యే న మే క్షమమ్,

నయ మా మపి కాకుత్స్థ! వనం వన్యాం మృగీం యథా. ౧౯
యది తే గమనే బుద్ధిః కృతా పితు రపేక్షయా,

నాతండ్రి దశరథమహారాజు బ్రతికియుండునంతవఱకును నీవతనికిం బరిచర్య సేయుచుండుము; నీ కదియే శాశ్వతంబగుధర్మము; ఇంక నేదియు శాశ్వతముగాదు. అని రాముఁడు కౌసల్యతోఁ జెప్పెను. ౧౩

మంగళకరంబగుధర్మబుద్ధిగల కౌసల్యాదేవి, రాముఁడుచెప్పినది విని సంతోషంబునొంది ఎదిటివారిదుఃఖముఁ బోవునట్లు సేయునట్టి రాముం జూచి, "నీవుచెప్పినట్టే చేసెదను" అని చెప్పెను. ౧౪

ధార్మికులలో నుత్తముఁడగురాముఁడు, తల్లిమాట విని యంత మఱలఁ బరమదుఃఖితయయియున్న తల్లింజూచి యిట్లని చెప్పెను. ౧౫

నేనుమాత్రమే కాదు; నీవును నేను ఇద్దఱమును నాతండ్రిదశరథమహారాజు చెప్పినట్లు నడుచుకొనవలసినది.

ఆదశరథుఁడు మనకందఱకును రాజును, పోషించువాఁడును, ఆచార్యుఁడును, పూజింపఁదగినవాఁడును, అధిపతియును, ప్రభుండును గావున మనమందఱమును అతనిమాటకు లోఁబడవలసినవారమే. ౧౬

నేను ఈ పదునాలుగుసంవత్సరంబులుమాత్రము మహారణ్యంబునసుఖంబుగాఁ గాలంబుగడపి యటుపిమ్మటఁ బరమసంతోషంబున నీయాజ్ఞలోనే యుండెదను. అని రాముఁడు కౌసల్యతోఁ జెప్పెను. ౧౭

అప్పుడు రాముఁడు చెప్పినది విని కొడుకునం దతిప్రేమంబుగల కౌసల్యాదేవి మొగంబంతయుఁ గన్నీరునిండఁగాఁ బరమదుఃఖితయయి ప్రియపుత్రుండగు రాముఁ జూచి యిట్లని చెప్పెను. ౧౮

రాముఁడా! నాకుశత్రువులయిన యీ సవతులనడుమనుండుట నాకు మంచిదికాదు; కావున నన్ను నీతోఁగూడఁ దీసికొనిపొమ్ము.

రాముఁడా! నీవు తండ్రియాజ్ఞ చొప్పున నడవికిం బోవ నిశ్చయించితివేని అడవిలేడినిం బోలె నన్నును అడవికిం దీసికొనిపొమ్ము; అడవిలేడి యడవిలో సంతోషంబుననుండునట్లు, నేనును నీకు శ్రమంబుగలుగఁ జేయక సంతోషంబున నుండెదను. అని కౌసల్య రామునితోఁ జెప్పెను. ౧౯

తాం తథా రుదతీం రామో రుద న్వచన మబ్రవీత్. ౨౦

జీవన్త్యా హి స్త్రియా భర్తా దైవతం ప్రభు రేవ చ,

భవత్యా మమ చైవాద్య రాజా ప్రభవతి ప్రభుః. ౨౧

న హ్యనాథా వయం రాజ్ఞా లోకనాథేన ధీమతా,

భరతశ్చాపి ధర్మాత్మా సర్వభూతప్రియంవదః. ౨౨

భవతీ మనువర్తేత స హి ధర్మరత స్సదా,

యథా మయి తు నిష్క్రాన్తే పుత్రశోకేన పార్థివః. ౨౩
శ్రమం నా వాప్నుయా త్కించి దప్రమత్తా తథా కురు,

దారుణ శ్చా ప్యయం శోకో యథైనం న వినాశయేత్. ౨౪
రాజ్ఞో వృద్ధస్య సతతం హితం చర సమాహితా,

అట్లు వచించి యేడ్చుచున్న తల్లిని గౌసల్యంజూచి రాముఁడును దుఃఖంబున రోదనంబుసేయుచు నిట్లని చెప్పెను ౨౦

బ్రతికియున్నంతవఱకు ఆఁడుదానికిఁ బెనిమిటియే దేవుఁడుఁ బ్రభుఁడు. మఱియెవ్వరిని ఆఁడుది యాశ్రయింపఁగూడదు.

అట్లగుటంజేసి దశరథమహారాజు నాకుమాత్రమెకాదు; నాకును నీకునుంగూడ నియామకుఁ డగుచున్నాఁడు. ౨౧

లోకంబునంతయుం బాలింపగలవాఁడును ధార్మికుండు నగుదశరథ మహారాజు మనకు నాథుఁడై యున్నాఁడుగదా! నీ వనాథవుగావే! నీకేమి తక్కువ? అనాథయుంబోలె నేల భయంపడుచున్నావు?

"అయితే నాకుఁ జవతులవలని భయంబున్నదే" యని చెప్పెదవు కాఁబోలు; రాజు కాఁబోవు భరతుఁడును మిక్కిలి ధార్మికుఁడు; సర్వప్రాణులకును బ్రియముసేయువాఁడు కావున నీయందు మాతృభక్తియుంచి నిన్న రక్షించుచుండును. భయపడకుము. ౨౨

"అయితే భరతుఁడు స్వభావంబున ధార్మికుండయ్యెను గైకేయిమాట విని యేమైనను అపకారంబుసేయును" అని యందువు కాఁబోలు; అతఁడు ధర్మంబునందు మిక్కిలియుఁ బ్రీతిగలవాఁడు కావున నతఁ డెప్పుడును ఎవ్వరుచెప్పినను ధర్మవిరుద్ధంబగు మార్గంబునం బ్రవర్తింపఁడు; ఎల్లప్పుడును నీకుఁ బరిచర్య సేయుచునేయుండును.

నేను వనంబునకుఁబోయినపిదప నీవెంతమాత్రమేమఱుపాటులేని దానవై దశరథమహారాజునకుఁ బుత్రదుఃఖంబునం గొంచెమయిన నాయాసంబు గల్గకుండునట్లు మంచిమాటలం దేర్చుచు నుపచారంబులు సేయుచుండుము. ౨౩

భయంకరమగు నీపుత్రశోకమున వృద్ధుఁడగు దశరథమహారాజునకు మరణంబు గల్గకుండునట్లు నీ వెచ్చరికతోనుండి యతనికిఁ బ్రియంబులగు నుపచారంబులు సేయుచుండుము. ౨౪

వ్రతోపవాసనిరతా యా నారీ పరమోత్తమా.
భర్తారం నానువర్తేత సా తు పాపగతి ర్భవేత్,

భర్తృశ్శుశ్రూషయా నారీ లభతే స్వర్గ ముత్తమమ్.
అపి యా నిర్నమస్కారా నివృత్తా దేవపూజనాత్,

శుశ్రూషా మేవ కుర్వీత భర్తుః ప్రియహితే రతా.

ఏష ధర్మః పురా దృష్టో లోకే వేదే శ్రుతః స్మృతః,

అగ్నికార్యేషు చ సదా సుమనోభి శ్చ దేవతాః.
పూజ్యాస్తే మత్కృతే దేవి! బ్రాహ్మణా శ్చైవ సువ్రతాః

ఏవం కాలం ప్రతీక్షస్వ మమాగమనకాంక్షిణీ.
నియతా నియతాహారా భర్తృశుశ్రూషణే రతా,

ప్రాప్స్యసే పరమం కామం మయి ప్రత్యాగతే సతి.
యది ధర్మభృతాం శ్రేష్ఠో ధారయిష్యతి జీవితమ్,

ఏవ ముక్తా తు రామేణ బాష్పపర్యాకులేక్షణా.
కౌసల్యా పుత్రశోకార్తా రామం వచన మబ్రవీత్,

ఎల్లప్పుడును వ్రతంబులు నుపవాసంబులుం జేయుచు మిక్కిలియు నుత్తమ యని పేరువహించిన స్త్రీయును బెనిమిటి ననుసరించియుండదేని పాపిష్ఠురాలేయగును. ౨౫

బ్రాహ్మణులు మొదలగు పెద్దల కెప్పుడును నమస్కరింపక దేవతలం బూజింపకుండు స్త్రీయును భర్తకు భక్తితో శుశ్రూషసేయుచుండు నేని యుత్తమంబగు స్వర్గంబు నొందును. ౨౬

ఆఁడుది యెప్పటికిని బెనిమిటికి మనస్సంతోషంబు గలిగించునవియు మేలుగలిగించునవియు నగు కార్యంబులం జేయుచు సేవచేయుచునే యుండవలయును. ౨౭

ఈ ధర్మము లోకంబునందలి శిష్టాచారములవలనం దెలియవచ్చుచున్నది. అట్లు వేదమునను జెప్పఁబడియున్నది. తదనుకూలముగనే స్మృతులయందునుం జెప్పఁబడియున్నది.

తల్లీ ! నీవు నేను వచ్చువఱకు నాక్షేమార్థమై హోమములచేతను బుష్పాదులచేతను దేవతలం బూజింపుచుండుము. మఱియుం బ్రాహ్మణోత్తములను వివిధదానముల చేతం దనుపుచుండుము. ౨౮

నీవిట్లు నేను సుఖంబుగ మఱల నయోధ్యకు వచ్చుటంగోరుచు నియమంబవలంబించి మధుమాంసాదులవిడిచి శుద్ధంబగు సాత్త్వికాహారంబుగొనుచుఁ బెనిమిటికి శుశ్రూష సేయుచు నీపదునాలుగు వర్షంబులునుగడుపుము. ౨౯

నేను వనంబునుండి మఱల వచ్చినపిమ్మట ధార్మికోత్తముండగు దశరథుండు బ్రతికియున్నపక్షమున నీవు నీకోర్కులనన్నింటినిఁ బొందఁగలవు. అని రాముండు కౌసల్యతోఁ జెప్పెను. ౩౦

కౌసల్యాదేవి రాముఁడు చెప్పినది విని తనప్రియపుత్త్రుఁడగు రాముఁడు వనంబునకుఁ బోవుచున్నాఁడే యని పుత్త్రదుఃఖంబునం బరితపించుచుఁ గండ్లనిండ నీళ్లుగార్చుచు రామునిం జూచి యిట్లని చెప్పెను. ౩౧

గమనే సుకృతాం బుద్ధిం న తే శక్నోమి పుత్రక!. 32
వినివర్తయితుం వీర నూనం కాలో దురత్యయః,

గచ్ఛ పుత్ర! త్వమేకాగ్రో భద్రం తేఽస్తు సదా విభో!. 33

పునస్త్వయి నివృత్తే తు భవిష్యామి గతవ్యథా,

ప్రత్యాగతే మహాభాగే కృతార్థే చరితవ్రతే. 34
పితు రానృణ్యతాం ప్రాప్తే త్వయి లప్స్యే పరం సుఖమ్,

కృతాన్తస్య గతిః పుత్ర! దుర్విభావ్యా సదా భువి. 35
యస్త్వాం సంచోదయతి మే వచ ఆచ్ఛిద్య రాఘవ!,

గచ్ఛేదానీం మహాబాహో! క్షేమేణ పున రాగతః. 36
నన్దయిష్యసి మాం పుత్ర! సామ్నా వాక్యేన చారుణా,

అపీదానీం స కాల స్స్యా ద్వనా త్ప్రత్యాగతం పునః. 37
యత్త్వాం పుత్రక! పశ్యేయం జటావల్కలధారిణమ్,

తథా హి రామం వనవాసనిశ్చితం
సమీక్ష్య దేవీ పరమేణ చేతసా. 38
ఉవాచ రామం శుభలక్షణం వచో
బభూవ చ స్వస్త్యయనాభికాంక్షిణీ.

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే చతుర్వింశస్సర్గః

కొడుకా! నీవు పరాక్రమశాలివి కావున నీకెందును భయములేదు. వనంబునకుఁ బోవలయునని నీవు గట్టిగాఁ బట్టియున్నావు. దానిం ద్రిప్పుటకు నాచేతం గాలేదు. కావుననే కాలము నతిక్రమింప నలవిగాదని చెప్పుదురు. ౩౨

కొడుకా! నీవు చాపలంబునొందక వనంబునకుఁ బొమ్ము. నీకెందును మంగళమే యగునుగాక. ౩౩

నీవు మఱల వనంబునుండి రాఁగానే నాదుఃఖం బంతయుఁ బోయి నాకు సుఖంబు గలుగును.

మహాభాగుండవగు నీవు పితృవచనపరిపాలనవ్రతం బాచరించి కృతార్థుఁడవై తండ్రిఋణంబు దీర్చుకొనివనంబునుండి మఱల వచ్చినపిదప నేను బరమసౌఖ్యంబు నొందఁగలను. ౩౪

రాముఁడా! నే నెంత చెప్పినను వినకుండి వనంబునకుఁ బోఁగోరు నట్లు నిన్నుఁ బ్రేరేపించుచున్నదే, ఈ దైవబలము ఇంతయని యెన్నుట కలవి గాదు. ౩౫

రాముఁడా! నీవు మహాబాహుండవు కావున, నీ కన్నిటను జయంబె గలుగును. నీవు మఱల క్షేమంబున నిచ్చటికి వచ్చి మనోహరంబగు సామవచనంబున నన్నాహ్లాదింపఁగలవు. ౩౬

ఏకాలమునందు నాకు జడలును నారచీరలును దాల్చి వనంబునుండి మఱలివచ్చిననిన్నుఁ జూడఁగలుగునో, అట్టి చతుర్దశసంవత్సరానంతరకాలము ఇప్పుడె వచ్చినచో నాకు సంతోషముగా నుండును. ౩౭

కౌసల్యాదేవి, రాముఁ డట్లు పితృవచనప్రకారమున వనవాసంబు సేయ నిశ్చయించియున్నాఁడని యెఱింగి మంగళలక్షణంబులతోఁ గూడినయా రాముం జూచి ఆదరంబుతో నుదాహరింపఁబడినవిధంబునం జెప్పి రామునకు మంగళాశీర్వచనంబు లొసంగఁగోరెను. ౩౮

ఇది యిరువదినాలవసర్గము.

## పంచవింశస్సర్గః

సాఽపనీయ తమాయాస ముపస్పృశ్య జలం శుచిః,
చకార మాతా రామస్య మఙ్గళాని మనస్వినీ.

న శక్యసే వారయితుం గచ్ఛేదానీం రఘూత్తమ!,
శీఘ్రం చ వినివర్తస్వ వర్తస్వ చ సతాం క్రమే.

యం పాలయసి ధర్మం త్వం ధృత్యా చ నియమేన చ,
స వై రాఘవశార్దూల! ధర్మస్త్వా మభిరక్షతు.

యేభ్యః ప్రణమసే పుత్ర! చైత్యే ష్వాయతనేషు చ,
తే చ త్వా మభిరక్షన్తు వనే సహ మహర్షిభిః.

యాని దత్తాని తేఽస్త్రాణి విశ్వామిత్రేణ ధీమతా,
తాని త్వా మభిరక్షన్తు గుణై స్సముదితం సదా.

పితృశుశ్రూషయా పుత్ర మాతృశుశ్రూషయా తథా
సత్యేన చ మహాబాహో! చిరంజీవాభిరక్షితః.

సమిత్కుశపవిత్రాణి వేద్య శ్చాయతనాని చ,
స్థండిలాని చ చిత్రాణి శైలా వృక్షాః క్షుపా హ్రదాః.
పతఙ్గాః పన్నగా స్సింహాస్త్వాం రక్షన్తు నరోత్తమ,

## ఇరువదియైదవ సర్గము

మంచిమనసుగల యాకౌసల్యాదేవి యాదుఃఖంబును విడిచి రోదనంబు గావించుటవలనఁ గలిగిన మైలం బోఁగొట్టుకొనుటకై యాచమనంబు చేసి రామునకు మంగళాశీర్వచనంబులు గావించెను. ౧

రాముఁడా! నే నెంతచెప్పినను వినక వనంబునకుఁ బోవ నిశ్చయించియున్నావు. నీయిష్టప్రకార మిప్పుడు వనంబునకుఁ బొమ్ము. అయితే అట్టె యచ్చట నుండక పదునాలుగు సంవత్సరము లయినవెంటనె మఱలి రమ్ము. సత్పురుషులయాచారమును వదలకుము. ౨

రాముఁడా! నీవు సంతోషముగలవాఁడవై నియమనంబున నేధర్మంబును గొంచెమయినను దప్పకుండ ననుష్ఠించుచున్నాఁడవో, ఆధర్మమె నిన్ను సమస్తకాలంబులందును రక్షించుచుండుఁగాక. ౩

కొడుకా! నీవు ప్రతిదినమును జతుష్పథంబులయందును, దేవస్థానంబులందును ఏదేవతలకు నమస్కారము సేయుచుందువో, ఆదేవతలు అడవియందు మహర్షులతోఁగూడ నున్న నిన్ను అన్నివిషయములం గాపాడుదురుగాక. ౪

బుద్ధిమంతుఁడగు విశ్వామిత్రుఁడు నీ కొసంగినదివ్యాస్త్రంబులన్నియు సద్గుణసంపన్నుండ వగునిన్ను ఎల్లప్పుడును సమస్తస్థలంబులందును రక్షించుచుండుఁగాక. ౫

మహాబాహుఁడవగు రాముఁడా! నీవు ధర్మంబుదప్పక చేయుచుండిన పితృసేవయుం మాతృసేవయుం నీసత్యవ్రతంబును నిన్ను అన్నిసంకటంబులనుండి రక్షించుచుండుఁగాక ౬

పురుషశ్రేష్ఠుఁడవగు రాముఁడా! అరణ్యంబునందలి యాశ్రమంబులనుండు సమిత్తులును దర్భలును బవిత్రములును నగ్నివేదికలు దేవస్థానంబులును దేవపూజసేయుటకై యేర్పఱచిన నానావిధస్థలంబులును బర్వతంబులును పెద్దవృక్షములును చిన్నచెట్లును మడుగులును బక్షులును సర్పంబులును సింహంబులును నిన్నుఁ గాపాడుచుండుఁగాక.

స్వస్తి సాధ్యా శ్చ విశ్వే చ మరుత శ్చ మహర్షయః. ౮
స్వస్తి ధాతా విధాతా చ స్వస్తి పూషా భగోఽర్యమా,

లోకపాలా శ్చ తే సర్వే వాసవప్రముఖా స్తథా. ౯

ఋతవ శ్చైవ పక్షా శ్చ మాసా స్సంవత్సరాః క్షపాః,
దినాని చ ముహూర్తా శ్చ స్వస్తి కుర్వన్తు తే సదా. ౧౦

స్మృతి ర్ధృతి శ్చ ధర్మ శ్చ పాన్తు త్వాం పుత్ర! సర్వతః,

స్కన్ద శ్చ భగవా న్దేవ స్సోమ శ్చ స బృహస్పతిః. ౧౧
సప్తర్షయో నారద శ్చ తే త్వాం రక్షన్తు సర్వతః,

యే శ్చాపి సర్వత స్సిద్ధా దిశ శ్చ సదిగీశ్వరాః. ౧౨
స్తుతా మయా వనే తస్మి న్పాన్తు త్వాం పుత్ర! నిత్యశః,

శైలా స్సర్వే సముద్రా శ్చ రాజా వరుణ ఏవ చ. ౧౩
ద్యౌ ర న్తరిక్షం పృథివీ నద్య స్సర్వా స్తథైవ చ,
నక్షత్రాణి చ సర్వాణి గ్రహా శ్చ సహదేవతాః. ౧౪
అహోరాత్రే తథా సన్ధ్యే పాన్తు త్వాం వన మాశ్రితమ్,

ఋతవ శ్చైవ షట్పుణ్యా మాసా స్సంవత్సరా స్తథా. ౧౫

సాధ్యులును విశ్వేదేవులును వాయువులును మహర్షులును నీకు మంగళం బొసంగుచుందురుగాక. ౮

సమస్తప్రపంచముల కాధారభూతుఁడైన విరాట్పురుషుఁడును బ్రహ్మదేవుఁడును నీకు మంగళం బొసంగుదురుగాక. మఱియు ద్వాదశాదిత్యులలోఁ జేరిన పూషయును భగుఁడును అర్యముఁడును నీకు మంగళంబు నిచ్చుచుందురుగాక.

అట్లు దేవేంద్రుఁడు మొదలుగాఁగల దిక్పాలురు ఎనమండ్రును నీకు మంగళం బొసంగుచుందురుగాక. ౯

వసంతాదిఋతువులును శుక్లపక్షకృష్ణపక్షంబులును చైత్రాదిమాసంబులును ప్రభవాదిసంవత్సరంబులును రాత్రులును దినములును ముహూర్తంబులును నీ కెల్లప్పుడును మంగళం బొసంగుచుండుఁగాక. ౧౦

కొడుకా! ధ్యానంబును యోగంబును ధర్మంబును ఏ కష్టమును రాకుండ నిన్ను రక్షించుచుండుఁగాక.

భగవంతుఁడగు కుమారస్వామియును చంద్రుఁడును బృహస్పతియును సప్తర్షులును నారదుఁడును నీ కేమియుఁ గష్టము లేకుండునట్లు నిన్ను రక్షించుచుందురుగాక. ౧౧

కొడుకా! ప్రసిద్ధమయిన దిక్కులును దిక్పాలురును నేను జేయుం స్తోత్రంబులచేఁ బ్రసన్నులయి యడవియందు ని న్నెల్లప్పుడును గాపాడుచుందురుగాక. ౧౨

కులపర్వతంబులును సమస్త సముద్రంబులును స్వర్గంబును ఆకాశంబును భూమియును నదులును నక్షత్రంబు లన్నియు నంగారకాదిగ్రహంబులును దదభిమానిదేవతలును అహోరాత్రంబులును సంధ్యలును అడవిలోనున్న నిన్ను రక్షించుచుండుఁగాక; మఱియును గుబేరుఁడును వరుణుఁడును నిన్ను రక్షించుచుందురుగాక. ౧౩,౧౪

పవిత్రంబులగు ఋతువు లాఱును మాసంబులును సంవత్సరంబులును

కలా శ్చ కాష్ఠా శ్చ తథా తవ శర్మ దిశ న్తు తే,
మహావనే విచరతో మునివేషస్య ధీమతః. ౧౬
త వాదిత్యా శ్చ దైత్యాశ్చ భవ న్తు సుఖదా స్సదా,

రాక్షసానాం పిశాచానాం రౌద్రాణాం క్రూరకర్మణామ్. ౧౭
క్రవ్యాదానాం చ సర్వేషాం మాభూ త్పుత్రక! తే భయమ్,

ప్లవగా వృశ్చికా దంశామశకా శ్చైవ కాననే. ౧౮
సరీసృపా శ్చ కీటా శ్చ మా భూవ న్గహనే తవ,

మహాద్విపా శ్చ సింహా శ్చ వ్యాఘ్రా ఋక్షా శ్చ దంష్ట్రిణః.
మహిషా శ్శృఙ్గిణో రౌద్రా న తే ద్రుహ్యన్తు పుత్రక!,

నృమాంసభోజనా రౌద్రా యేచాన్యే సత్త్వజాతయః. ౨౦
మాచ త్వాం హింసిషుః పుత్ర! మయా సమ్పూజితా స్త్విహ,

ఆగమా స్తే శివా స్సన్తు సిద్ధ్యన్తు చ పరాక్రమాః. ౨౧
సర్వసమ్పత్తయే రామ! స్వస్తిమా న్గచ్ఛ పుత్రక!,

స్వస్తి తేఽ స్త్వన్తరిక్షేభ్యః పార్థివేభ్యః పునః పునః. ౨౨
సర్వేభ్య శ్చైవ దేవేభ్యో యే చ తే పరిపన్థినః,

గురు స్సోమ శ్చ సూర్య శ్చ ధనదోఽథ యమ స్తథా. ౨౩

గలలును గ్రావములును నీ కరణ్యంబున సౌఖ్యంబిచ్చుచుండుఁగాక. ౧౫

ధర్మబుద్ధిగలవాఁడవై పితృవచనంబున మునివేషంబు ధరించి కాఱడవిం దిరుగుచున్ననీకు దేవతలు నసురులు నెల్లప్పుడును సౌఖ్యం బొసంగుచుందురుగాక. ౧౬

కొడుకా! మిక్కిలియుఁ గోపమును గ్రూరములయిన కార్యములుఁగల రాక్షసులవలనను, పిశాచములవలనను, సమస్తములయిన క్రూరమృగములవలనను నీకు భయము గలుగకుండుఁగాక. ౧౭

చౌరరానియరణ్యంబునఁ గోఁతులును జేళ్లు నడవియీఁగలును దోమలును బాములు నింక నితరములయిన పురుగులును నిన్ను బాధింపకుండెడుఁగాక. ౧౮

కొడుకా! పెద్దయేనుంగులు సింహంబులుఁ బెద్దపులులు నెలుఁగుబంటులు మొదలగు కోఱలుగలమృగంబులును భయంకరములయిన యెనుఁబోతులు మొదలగు కొమ్ములుగలమృగంబులును అడవియందు నిన్ను బాధింపకుండుఁ గాక. ౧౯

మఱియుం మనుష్యమాంసంబు దినుచు భయంకరంబులై యుండు నితరములయిన క్రూరజంతువులును నే నిచ్చటం జేయుపూజచే సంతోషంబునొంది నిన్నడవియం దెంతమాత్రము బాధింపకుండెడుఁగాక. ౨౦

రాముఁడా! నీవు పోవుమార్గంబులు నీకు సుఖంబునిచ్చుచుండుఁగాక. అన్నిస్థలములయందును నీపరాక్రమంబున కెదురులేకపోవుఁగాక. నీ వెందును మంగళంబును బొందుచు సమస్తధర్మంబులుం బడయుంటకై వనంబునకుం బొమ్ము. ౨౧

అంతరిక్షంబున నుండు దేవతలును భూమియందుండు దేవతలు నితర దేవతలందఱును నీకు మంగళం బొసంగుదురుగాక. నీకు శత్రువులయిన వారలు గూడ నీకు మంగళంబునే సేయుచుందురుగాక. ౨౨

రాముఁడా! బృహస్పతియుఁ జంద్రుఁడును సూర్యుఁడును గుబేరుఁడును

పాన్తు త్వాం వత్స్యతో రామ! దణ్డకారణ్య మాశ్రితమ్,

అగ్ని ర్వాయు స్తథా ధూమో మన్త్రాశ్చర్షి ముఖాచ్చ్యుతాః.
ఉపస్పర్శనకాలే తు పాన్తు త్వాం రఘునన్దన!,

సర్వలోకప్రభు ర్బ్రహ్మా భూతభర్తా తథర్షయః. ౨౫
యే చ శేషా స్సురా స్తే త్వాం రక్షన్తు వనవాసినమ్,

ఇతి మాల్యై స్సురగణా న్గన్ధై శ్చాపి యశస్వినీ. ౨౬
స్తుతిభి శ్చానురూపాభి రానర్చాయతలోచనా,

జ్వలనం సముపాదాయ బ్రాహ్మణేన మహాత్మనా. ౨౭
హావయామాస విధినా రామమఙ్గలకారణాత్,

ఘృతం శ్వేతాని మాల్యాని సమిధ శ్శ్వేతసర్షపాన్. ౨౮
ఉపసమ్పాదయామాస కౌసల్యా పరమాఙ్గనా,
ఉపాధ్యాయ స్స విధినా హుత్వా శాన్తి మనామయమ్. ౨౯
హుతహవ్యావశేషేణ బాహ్యం బలి మకల్పయత్,

మధుదధ్యక్షతఘృతైః స్వస్తి వాచ్య ద్విజాం స్తతః. ౩౦
వాచయామాస రామస్య వనే స్వస్త్యయనక్రియాః,

తత స్తస్మై ద్విజేన్ద్రాయ రామమాతా యశస్వినీ. ౩౧
దక్షిణాం ప్రదదౌ కామ్యాం రాఘవం చేద మబ్రవీత్,

యముఁడును నేను జేయుంపూజకుఁ దృప్తినొంది దండకారణ్యంబున నివసింపుచున్న నిన్నుఁ గాపాడుదురుగాక. ౨౩

రాముఁడా! నీవు నదులలో స్నానము సేయునప్పుడును, అగ్నిదేవుఁడును వాయుదేవుఁడును అట్లు అగ్నిహోత్రధూమంబును విశ్వామిత్రమహర్షి నీ కుపదేశించినమంత్రంబులును నిన్నుఁ గాపాడుచుండెడుఁగాక. ౨౪

సమస్తలోకంబులకును నాయకుఁడగు బ్రహ్మదేవుఁడును సమస్తప్రాణులను బోషించునట్టి నారాయణుఁడును ఋషులును దక్కినదేవతలును వనవాసంబు సేయునిన్నుఁ గాపాడుచుందురుగాక. అని కౌసల్య రామునకు మంగళాశీర్వచనంబులు చేసెను. ౨౫

అధికమయిన కీర్తిగలదియుఁ బెద్దకండ్లు గలదియునగు కౌసల్య యిట్లు రామునకు మంగళాశీర్వచనంబు లొసంగి పుష్పమాలికలచేతను నానావిధ స్తోత్రంబులచేతను దేవతలం బూజించెను. ౨౬

కౌసల్య యంత రామునకు మంగళము గల్గుటకై యగ్నిహోత్రంబు గొనితెచ్చి మహాత్ముఁడగు బ్రాహ్మణునిచే యథాశాస్త్రముగా హోమము చేయించెను. ౨౭

స్త్రీలలో నుత్తమయయిన కౌసల్యాదేవి హోమమునకై నేయి తెల్లని పుష్పమాలికలు సమిధలు తెల్లయావాలు వీని రప్పించెను. ౨౮

ఆ ఋత్విజుఁడు సమస్తోపద్రవములు శమించుటకైయును ఆరోగ్యము గలుగుటకైయును యథావిధిగ హోమముచేసి హోమము సేయఁగా మిగిలిన హావిస్సుచే బాహ్యబలిం గావించెను. ౨౯

ఋత్విజుండగు నాబ్రాహ్మణుండు, తేనెయుఁ బెరుఁగు నక్షతలును నేయియుం దక్షిణలొసంగి బ్రాహ్మణులచేఁ బుణ్యాహంబు చదివించి మఱియు వనంబున రామునకు మంగళంబు గలిగించు మంత్రంబులఁ జదివించెను. ౩౦

అంత గొప్పకీర్తిగలరామునితల్లి యగుకౌసల్య యాబ్రాహ్మణోత్తముండగుఋత్విజునకు గొప్పదక్షిణనొసంగి రామునిం జూచి యిట్లని చెప్పెను.

యన్మఙ్గళం సహస్రాక్షే సర్వదేవనమస్కృతే. 3౨
వృత్రనాశే సమభవ త్తత్తే భవతు మఙ్గళమ్,

యన్మఙ్గళం సుపర్ణస్య వినతాఽకల్పయ త్పురా. 33
అమృతం ప్రార్థయానస్య తత్తే భవతు మఙ్గళమ్,
అమృతోత్పాదనే దైత్యాన్ ఘ్నతో వజ్రధరస్య యత్. 3౪
అదితి ర్మఙ్గళం ప్రాదా త్తత్తే భవతు మఙ్గళమ్,

త్రీన్విక్రమా న్ప్రక్రమతో విష్ణో రమితతేజసః. 3౫
య దాసీ న్మఙ్గళం రామ! త త్తే భవతు మఙ్గళమ్,

ఋతవ స్సాగరా ద్వీపా వేదా లోకా దిశ శ్చ తే. 3౬
మఙ్గళాని మహాబాహో! దిశన్తు శుభమఙ్గళాః,

ఇతి పుత్రస్య శేషాంశ్చ కృత్వా శిరసి భామినీ. 3౭
గన్ధైశ్చాపి సమాలభ్య రామ మాయతలోచనా,
ఓషధిం చాపి సిద్ధార్థాం విశల్యకరణీం శుభామ్. 3౮
చకార రక్షాం కౌసల్యా మన్త్రై రభిజజాప చ,

ఉవాచాతిప్రహృష్టేవ సా దుఃఖవశవర్తినీ. 3౯
వాఙ్మాత్రేణ న భావేన వాచా సంసజ్జమానయా,

సమస్తదేవతలచేతను నమస్కరింపఁబడుచుండుదేవేంద్రునకు శత్రువయినవృత్రుండు చచ్చుటంజేసి యేమంగళంబు గలిగెనో, ఆ మంగళంబు నీకుఁ గలుగుఁగాక. ౩౨

మునుపు వినత తనకొడుకు గరుత్మంతుఁ డమృతంబు దేరంబోవునప్పు డతనికి ఏ మంగళంబు గావించెనో, ఆ మంగళంబు నీకుఁ గలుగుఁగాక. ౩౩

అదితిదేవి యసురులం జంపునట్టి తనకొడుకు దేవేంద్రునకుసముద్రమథనకాలమునందు ఏమంగళం బొసంగెనో, ఆమంగళంబు నీ కిప్పుడు గలుగుఁగాక. ౩౪

రాముఁడా! త్రివిక్రమావతారంబున బలిచక్రవర్తి యొసంగిన మూఁడడుగుల నేలం గొలుచుకొనునప్పుడు కొలందిలేని ప్రభావముగల విష్ణుదేవున కే మంగళం బుండినదో, ఆమంగళంబు నీ కిప్పుడు గలుగుఁగాక. ౩౫

పెద్దచేతులుగల రాముఁడా! స్వభావంబుననె మంగళస్వరూపంబుగా నున్నదానికిని మంగళంబు నొసఁగఁజాలిన వసంతర్తుమొదలయిన ఋతువులును సముద్రంబులును ద్వీపంబులును వేదములును స్వర్గాదిలోకంబులును దిక్కులును నీకు మంగళంబుల నొసంగుచుండుఁగాక. అని కౌసల్య రామునితోఁ జెప్పినది. ౩౬

పెద్దకండ్లుగల కౌసల్యాదేవి యిట్లాశీర్వదించి రామునిశిరంబున నక్షతల నుంచి రామునిదేహమునకు సుగంధంబు నలఁది యిదివఱకుఁ బెక్కుమాఱులు పరీక్షింపఁబడి వీర్యవంతమని నిశ్చయింపఁబడిన దేహములోపల నిఱుకుకొనినబాణమును వెలికిఁదీయునట్టి విశల్యకరణి యను మూలికను రక్షార్థమయి రామునిచేతిలో రక్షగాఁ గట్టి దాని మంత్రంబుల నభిమంత్రించెను. ౩౭, ౩౮

ఆ కౌసల్య దుఃఖసముద్రములో మునిఁగియున్నను మనసునఁగాకున్నను ప్రయాణకాలంబున నమంగళంబు సేయరాదు. కావున నోటమాత్రము మహాసంతోషంబు నొందినట్లు చూపట్టుచుఁ దొట్రుపాటుతో నిట్లని చెప్పెను. ౩౯

ఆనమ్య మూర్ధ్ని చాఘ్రాయ పరిష్వజ్య యశస్వినీ. ౪౦
అవద త్పుత్ర! సిద్ధార్థో గచ్ఛ రామ! యథాసుఖమ్,

అరోగం సర్వసిద్ధార్థ మయోధ్యాం పున రాగతమ్. ౪౧
పశ్యామి త్వాం సుఖం వత్స! సుస్థితం రాజవర్త్మని,

ప్రణష్టదుఃఖసఙ్కల్పా హర్షవిద్యోతి తాననా. ౪౨
ద్రక్ష్యామి త్వాం వనా త్ప్రాప్తం పూర్ణచన్ద్రమి వోదితమ్,

భద్రాసనగతం రామ! వనవాసా దిహాగతమ్. ౪౩
ద్రక్ష్యామి చ పున స్త్వాంతు తీర్ణవన్తం పితు ర్వచః,
మఙ్గళై రుపసంపన్నో వనవాసా ది హాగతః. ౪౪
వధ్వా మమ చ నిత్యం త్వం కామా న్సంవర్ధ యాహి భోః,

మయాఽర్చితా దేవగణా శ్శివాదయో
మహర్షయో భూతమహాసురోరగాః. ౪౫
అభిప్రయాతస్య వనం చిరాయ తే
హితాని కాంక్షన్తు దిశ శ్చ రాఘవ!,
ఇతీవ సాఽశ్రుప్రతిపూర్ణలోచనా
సమాప్య చ స్వస్త్యయనం యథావిధి. ౪౬
ప్రదక్షిణం చైవ చకార రాఘవం
పునః పున శ్చాపి నిపీడ్య సస్వజే,
తథా తు దేవ్యా చ కృతప్రదక్షిణో
నిపీడ్య మాతు శ్చరణౌ పునఃపునః. ౪౭

అధికమయిన కీర్తిగలకౌసల్యాదేవి రామునివంచి శిరంబున మూర్కొని కవుఁగిలించికొని యిట్లని చెప్పెను. కొడుకా! నీవు కృతకృత్యుఁడవై సుఖంబుగా నడవికిఁ బొమ్ము. ౪౦

బిడ్డఁడవగు రాముఁడా! నీవేమియుం రోగంబునొందక సమస్తప్రయోజనంబులం బొంది క్షేమంబున మఱల నయోధ్యకు వచ్చి రాజమార్గంబయిన రాజ్యాధిపతిత్వంబు నవలంబించియుండఁగాఁ జూడఁగలను. ౪౧

నేను నాదుఃఖంబును జింతయును నశింపఁగా సంతోషంబునఁ బ్రకాశించుముఖంబుతోఁ గూడినదాననై పూర్ణచంద్రుఁ డుదయించునట్లు అడవినుండి మఱలివచ్చిన నిన్నుఁ జూడఁగలను. ౪౨

రాముఁడా! తండ్రియాజ్ఞను నెఱవేర్చి యడవిని విడిచి యిచ్చటికి వచ్చి సింహాసనంబు నధిష్ఠించియున్న నిన్ను నేను మఱలం జూడఁగలను. ౪౩

అడవినుండి యిచ్చటికివచ్చి సమస్తమంగళద్రవ్యంబులనుం గూడి నాకును నాకోడలు సీతకును ఎల్లకోర్కులను నెఱవేర్చుచుండుము. ఇప్పుడు నీయిష్టప్రకారము వనంబునకుఁ బొమ్ము. ౪౪

రాముఁడా! దిక్కులును సర్పంబులును అసురులును భూతంబులును మహర్షులును శివుఁడు మున్నగుదేవతలును నే నిప్పుడు చేసినపూజకుఁ దృప్తి నొంది వనంబునకుఁ బోవుచున్న నీకు బహుకాలము మేలుసేయుచుందురుగాక. అని కౌసల్య రామునితోఁ జెప్పెను. ౪౫

ఆ కౌసల్య యిట్లు కండ్లునిండఁ గన్నీరు పొదమఁగా రామునకు యథాశాస్త్రముగ మంగళాశీర్వచనం బొనరించి రక్షార్థమయి రామునిచుట్టునుఁ దిరిగి యతనిఁ బలుమఱుఁ గవుఁగిలించుకొనెను. ౪౬

అట్లు కౌసల్యాదేవి రక్షార్థమై ప్రదక్షిణంబు చేసినపిదప నధికమయినకీర్తిగల యారాముఁడు తల్లికౌసల్యపాదంబులకుఁ బలుమాఱు మ్రొక్కి

జగామ సీతానిలయం మహాయశా
స్స రాఘవః ప్రజ్వలిత స్స్వయా శ్రియా.
ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే పఞ్చవింశస్సర్గః.

---

## షడ్వింశస్సర్గః

అభివాద్య తు కౌసల్యాం రామ స్సమ్ప్రస్థితో వనమ్,
కృతస్వ_స్త్యయనో మాత్రా ధర్మిష్ఠే వర్త్మని స్థితః. ౧
విరాజయ న్రాజసుతో రాజమార్గం నరై ర్వృతమ్,
హృదయా న్యామమన్థేవ జనస్య గుణవత్తయా. ౨

వైదేహీ చాపి తత్సర్వం న శుశ్రావ తపస్వినీ,
త దేవ హృది తస్యాశ్చ యౌవరాజ్యాభిషేచనమ్. 3

దేవకార్యం స్వయం కృత్వా కృతజ్ఞా హృష్టచేతనా,
అభిజ్ఞా రాజ ధర్మాణాం రాజపుత్రం ప్రతీక్షతే. ౪

ప్రవివే శాథ రామస్తు స్వం వేశ్మ సువిభూషితమ్,
ప్రహృష్టజనసమ్పూర్ణం హ్రియా కిఞ్చి దవాఙ్ముఖః. ౫

అథ సీతా సముత్పత్య వేపమానా చ తం పతిమ్,
అపశ్య చ్ఛోకసంత_ప్తం చిన్తావ్యాకులితేన్ద్రియమ్. ౬

తాం దృష్ట్వా స హి ధర్మాత్మా న శశాక మనోగతమ్,

యది మహాదుఃఖకాలంబయినను గాంతిమంతుఁడు కావున నిజకాంతిచేఁ దేజరిల్లుచు సీతాదేవియింటికిఁ బోయెను. ౪౭

ఇది యిరువదియైదవసర్గము.

---

## ఇరువదియాఱవసర్గము

రాచకొమరుండగురాముఁడు తల్లిచే మంగళాశీర్వచనంబుఁగొంది కౌసల్యకు నమస్కరించి ధార్మికంబగుమార్గంబు నవలంబించి వనంబునకుం బోవ నడుకట్టి నిజకాంతిం దేజరిల్లుచు మనుష్యులతో నిండియుండు రాజమార్గంబుఁ జొరఁగా గుణవంతుఁడు గావున నారాము నచ్చటిజనులు చూడఁగానే వారలమనంబులు రామునందలిప్రీతివిశేషంబున మిక్కిలియుఁ జలనంబు నొందినవి. ౧, ౨

అభిషేకార్థమయి నియమంబున వ్రతం బవలంబించియున్న సీతాదేవికి రామునివనవాసంబు గుఱించినవృత్తాంతం బేమియుఁ దెలియదు.

సీతాదేవి మనంబున రామునకు యౌవరాజ్యంబున బట్టాభిషేకంబు సేయఁబడుననియె తలంచుచుండినది. ౩

సీతాదేవి తాను దేవతాపూజఁజేసి రాజునకుఁ బట్టాభిషేకమయిన వెన్కటఁ బట్టమహిషి చేయవలసిన కార్యముల నెఱింగినదియుం రాజులనడవడికల నెఱింగినదియుఁ గావున రాచకొమరుఁడగురాము నెదురుచూచుచుండెను. ౪

అంత రాముఁడు "ఈదుఃఖవృత్తాంతము నెట్లు సీతకుం జెప్పుదు"నని లజ్జచేఁ దల వంచుకొని చక్కఁగా నలంకరింపఁబడి మహాసంతోషంబు నొంది యుండుజనులతో నొప్పుచుండు తనగృహంబుఁ బ్రవేశించెను. ౫

అంత సీతాదేవి తటాలున లేచి భయంబున వడంకుచు మహాదుఃఖంబు నొంది కలఁతనొందిన యింద్రియంబులతో నున్న పెనిమిటిని రాముని జూచెను. ౬

ధర్మాత్ముండగు నారాముఁడు సీతం జూడఁగానే మనంబులో నున్న

తం శోకం రాఘవ స్సోఢుం తతో విస్మతతాం గతః. ౭

వివర్ణవదనం దృష్ట్వా తం ప్రస్విన్న మమర్షణమ్,
ఆహ దుఃఖాభిసన్తప్తా కి మిదానీ మిదం ప్రభో!. ౮

అద్య బార్హస్పత శ్శ్రీమా న్యుక్తః పుష్యేఽను రాఘవ,
ప్రోచ్యతే బ్రాహ్మణైః ప్రాజ్ఞః కేన త్వ మసి దుర్మనాః. ౯

న తే శతశలాకేన జలఫేననిభేన చ,
ఆవృతం వదనం వల్గు ఛత్త్రేణాపి విరాజతే. ౧౦

వ్యజనాభ్యాం చ ముఖ్యాభ్యాం శతపత్రనిభేక్షణమ్,
చన్ద్రహంసప్రకాశాభ్యాం వీజ్యతే న తవాననమ్. ౧౧

వాగ్మినో వన్దిన శ్చాపి ప్రహృష్టా స్త్వాం నరర్షభ!,
స్తువన్తో నాత్ర దృశ్యన్తే మఙ్గళై స్సూతమాగధాః. ౧౨

న తే క్షౌద్రం చ దధి చ బ్రాహ్మణా వేదపారగాః,
మూర్ధ్ని మూర్ధావసిక్తస్య దదతి స్మ విధానతః. ౧౩

న త్వాం ప్రకృతయ స్సర్వా శ్శ్రేణీముఖ్యా శ్చ భూషితాః,
అనువ్రజితు మిచ్ఛన్తి పౌరజానపదా స్తథా. ౧౪

దుఃఖంబు నెంతమాత్రము నడంచుకొనలేకపోయెను గావున నతనిదుఃఖము బయలు పడెను. ౭

దేహంబంతయుం జెమటపట్టఁగాఁ దెల్లఁబాఱినముఖంబుతోఁగూడి దుఃఖంబు దాళఁజాలకున్న యాశ్రీరాముని జూచి సీతాదేవి మిగుల దుఃఖంబు నొంది యిట్లని చెప్పెను. "నాథుఁడా! నీ విప్పుడేల యిట్లు దుఃఖించుచున్నావు?" ౮

రాముఁడా! పండితులగు బ్రాహ్మణులు, బృహస్పతిదేవతాకంబును సంపద నిచ్చునదియును నిప్పుడు నీపట్టాభిషేకమునకుఁ దగిననక్షత్రముగా నిర్ణయింపఁబడినదియు నగుపుష్యనక్షత్రము ఇప్పుడు వచ్చియున్నదని చెప్పుచున్నారు. నీ విట్టిమంగళసమయంబునం దిట్లేల దుఃఖించుచున్నావు? ౯

సుందరంబగు నీముఖంబు నూఱు కమ్ములు గలిగి నీటినురుఁగుంబోలె ధవళంబైయుండు శ్వేతచ్ఛత్రంబు లేకుండుటంజేసి వానిచేఁ గప్పఁబడుటం గల్గు ప్రకాశంబు నొందకున్నది. ౧౦

తామరపూలవంటికండ్లతో నొప్పుచున్ననీముఖమును జంద్రుఁడును హంసయుంబోలెఁ దెల్లఁగా శ్రేష్ఠములయియుండు చామరంబు లేందువలన వీవకున్నవి? ౧౧

పురుషశ్రేష్ఠుఁడవగు రాముఁడా! వాచాలురగు స్తుతిపాఠకులును బూర్వవృత్తాంతంబులం బ్రశంసించు సూతులును వంశావళిం గీర్తించు మాగధులును సంతోషంబున నిన్నిచ్చట మంగళవచనంబులం బ్రస్తుతింపకున్నారేమి? ౧౨

వేదవేదాంతవేత్తలగు బ్రాహ్మణులు, శిరస్స్నానంబు చేసి పరిశుద్ధుఁడవై యుండునీశిరసునఁ దేనెయు బెరుఁగును యథావిధిగఁ దీర్థోదకముతో నభిషేకింపకున్నారేమి? ౧౩

మంత్రులు మిత్రులు మున్నగువారలును అయోధ్యావీథులజనులలో ముఖ్యులయి యుండువారలును బట్టణవాసిజనులును గ్రామంబులనుండు జనులును జక్కఁగా నలంకరించుకొని నిన్ను వెంబడింపకున్నారేమి? ౧౪

చతుర్భి ర్వేగసమ్పన్నై ర్హయైః కాఞ్చనభూషితైః,
ముఖ్యః పుష్యరథో యుక్తః కిం న గచ్ఛతి తేఽగ్రతః. ౧౫

న హస్తీ చాగ్రత శ్శ్రీమాం స్తవ లక్షణపూజితః,
ప్రయాణే లక్ష్యతే వీర! కృష్ణమేఘగిరిప్రభః. ౧౬

న చ కాఞ్చనచిత్రం తే పశ్యామి ప్రియదర్శన!,
భద్రాసనం పురస్కృత్య యాన్తం వీరపురస్కృతమ్. ౧౭

అభిషేకో యథా సజ్జః కి మిదానీ మిదం తవ,
అపూర్వో ముఖవర్ణ శ్చ న ప్రహర్ష శ్చ లక్ష్యతే. ౧౮

ఇతీవ విలపన్తీం తాం ప్రోవాచ రఘునన్దనః,

సీతే! తత్రభవాం స్తాతః ప్రవ్రాజయతి మాం వనమ్. ౧౯

కులే మహతి సమ్భూతే! ధర్మజ్ఞే! ధర్మచారిణి!,
శృణు జానకి! యే నేదం క్రమే ణాభ్యాగతం మమ. ౨౦

రాజ్ఞా సత్యప్రతిజ్ఞేన పిత్రా దశరథేన చ,
కైకేయ్యై మమ మాత్రే తు పురా దత్తౌ మహావరౌ. ౨౧
తయాఽద్య మమ సజ్జేఽస్మి న్నభిషేకే నృపోద్యతే,
ప్రచోదిత స్స సమయో ధర్మేణ ప్రతినిర్జితః. ౨౨

మంచివేగముగల్గి బంగారముచే నలంకరింపఁబడియుండు నాలుగుగుఱ్ఱములుగట్టి యుంత్సవార్థమయి సింగారింపఁబడియుండు పుష్యరథంబు నీముందట నడవకున్నదేమి? ౧౫

పరాక్రమశాలివగు రాముఁడా! నల్లని మేఘంబుపోల్కిఁ బర్వతంబు మాడ్కిం గ్రాలుచు శ్రీమంతంబై శుభలక్షణంబులు గలిగియుండు పట్టపుటేనుఁగు నీవు వీథిం బోవునప్పుడు నీముందట లేకున్నదేమి? ౧౬

చూపరులకు సంతోషంబుగల్గించునట్టి రాముఁడా! నీవు బంగారముచే నలంకరింపఁబడిన సింహాసనంబును ముందిడుకొని వీరులు వెంట రాఁగా వీథి నూరేగకున్నావేమి? ౧౭

ఇప్పు డెంతసంతోషముగాఁ బట్టాభిషేకము సన్నద్ధముగానున్నదో, అంతదుఃఖముగా నిదివఱ కెన్నఁడును లేని యాకారంబు నీ మొగమునను గలిగి యున్నది. సంతోషము కనుపడలేదు. నీ కిప్పు డింతదుఃఖం బేల వచ్చినది? అని సీత రామునితోఁ జెప్పెను. ౧౮

ఇట్లు విలపించుచున్న సీతాదేవిం జూచి రాముం డీప్రకారము చెప్పెను.

సీతా! పూజ్యుండగు నాతండ్రి దశరథమహారాజు న న్నూరువిడిచి యడవికిఁ బొమ్మని యాజ్ఞాపించు చున్నాఁడు. ౧౯

సీతా! నీవు పూజ్యంబగు వంశంబునం బుట్టినదానవు. ధర్మంబు దెలిసినదానవు. ధర్మంబునె యాచరించుదానవు. పరమధార్మికుఁడగు జనకునికొమార్తెవు. కావున ధర్మము నతిక్రమింపవు. నా కీవనవాస మెట్లు సంభవించినదో ఆరీతిం జెప్పెదను. వినుము. ౨౦

మునుపు చేసినప్రతిన తప్పనివాఁడును నాతండ్రియు నగుదశరథమహారాజు నాతల్లి కైకేయికి గొప్పవరంబులు రెండు ఇచ్చినాఁడు. ౨౧

ఇప్పుడు దశరథునియాజ్ఞ చొప్పున నాకుఁ బట్టాభిషేకంబు సన్నద్ధమయియుండఁగా నాకైకేయి దశరథుని ఆ వరంబు లడిగినది. దశరథుండును ధర్మంబు దప్పనివాఁడు కావున ఆబిడకు లోఁబడినాఁడు. ౨౨

చతుర్దశ హి వర్షాణి వస్తవ్యం దణ్డకే మయా,
పిత్రా మే భరత శ్చాపి యౌవరాజ్యే నియోజితః. ౨౩

సోఽహం త్వా మాగతో ద్రష్టుం ప్రస్థితో విజనం వనమ్,
భరతస్య సమీపే తు నాహం కథ్యః కదాచన. ౨౪

బుద్ధియుక్తా హి పురుషా న సహన్తే పర స్తవమ్,
తస్మా న్న తే గుణాః కథ్యా భరత స్యాగ్రతో మమ. ౨౫

నాపి త్వం తేన భర్తవ్యా విశేషేణ కదాచన,
అనుకూలతయా శక్యం సమీపే త్వస్య వర్తితుమ్. ౨౬

తస్మై దత్తం నృపతినా యౌవరాజ్యం సనాతనమ్,
స ప్రసాద్య స్త్వయా సీతే! నృపతి శ్చ విశేషతః. ౨౭

అహం చాపి ప్రతిజ్ఞాం తాం గురో స్సమనుపాలయన్,
వన మద్యైవ యాస్యామి స్థిరా భవ మనస్వినీ!. ౨౮

యాతే చ మయి కల్యాణి! వనం మునినిషేవితమ్,
వ్రతోపవాసరతయా భవితవ్యం త్వయాఽనఘే!. ౨౯

ఆ రెండు వరంబులలో నొకటికిఁగా నేను దండకారణ్యంబునఁ బదునాలుగుసంవత్సరంబులు వాసంబు సేయవలయును.

ఆ రెండవవరంబునకై భరతునిఁ గూడ నప్పుడె నాతండ్రి దశరథమహారాజు యువరాజుగా నుండున ట్లేర్పఱిచినాఁడు. ౨౩

అట్లు గావున నే నిప్పుడు విజనంబగువనంబునకుఁ బోవ నిశ్చయించి నిన్ను జూచిపోవుటకై యిచ్చటికి వచ్చినాను.

భరతునిసమీపంబున మాత్రము న న్నెప్పటికిని శ్లాఘింపవలదు. ౨౪

శ్రీమంతులగుపురుషులు తమయెదుట ఇతరపురుషులం బొగడుటను సహింపరు.

అట్లగుటం జేసి నీవు భరతునియెదుట నాగుణంబులను శ్లాఘించి చెప్పవలదు. ౨౫

ఎప్పటికిని నిన్నుఁ బోషింపవలెనని యంతయొచ్చైనయావశ్యకత భరతునకు లేదు. బంధుత్వముచేత సామాన్యముగా నిన్ను వాఁడు పోషింపవలసినవాఁడే కాని వేఱు కాదు.

నీ వీభరతున కనుకూలముగా నున్నట్టయిన నే యతనిసమీపంబున నుండఁగలవు. లేనిచో నుండలేవు. ౨౬

దశరథమహారాజు సనాతనంబగు యువరాజదొరతనమును ఆభరతునకే యిచ్చియున్నాఁడు.

సీతా! నీ వాభరతునకును దశరథ మహారాజునకును విశేషించి సంతోషంబు గల్గునట్లు సేయుచుండవలయును. ౨౭

నేనును దండ్రియగు దశరథమహారాజు చేసిన యాప్రతిజ్ఞం బరిపాలించుటకై యిప్పుడె యడవికిఁ బోయెదను. నీవు మంచిమనస్సుతో నిలుకడగా నుండుము. ౨౮

పాపములేనిదానవు మంగళస్వరూపిణివగుసీతా! నేను మునులునివసించు దండకారణ్యంబునకుఁ బోయినపిదప నీవు వ్రతంబు నవలంబించి యుపవాసంబులు సలుపుచుండవలయుం. ౨౯

కాల్య ముత్థాయ దేవానాం కృత్వా పూజాం యథావిధి,
వన్దితవ్యో దశరథః పితా మమ నరేశ్వరః. 30

మాతా చ మమ కౌసల్యా వృద్ధా సన్తాపకర్శితా,
ధర్మ మేవాగ్రతః కృత్వా త్వత్త స్సమ్మాన మర్హతి. 31

వన్దితవ్యా శ్చ తే నిత్యం యా శ్శేషా మమ మాతరః,
స్నేహప్రణయసమ్భోగై స్సమా హి మమ మాతరః. 32

భ్రాతృపుత్రసమౌ చాపి ద్రష్టవ్యౌ చ విశేషతః,
త్వయా భరతశత్రుఘ్నౌ ప్రాణైః ప్రియతరౌ మమ. 33

విప్రియం న చ కర్తవ్యం భరతస్య కదాచన,
స హి రాజా ప్రభు శ్చైవ దేశస్య చ కులస్య చ. 34
ఆరాధితా హి శీలేన ప్రయత్నై శ్చోపసేవితాః,
రాజాన స్సమ్ప్రసీదన్తి కుప్యన్తి చ విపర్యయే. 35

ఔరసా నపి పుత్రా న్హి త్యజ న్త్యహితకారిణః,
సమర్థా న్సంప్రగృహ్ణన్తి జనా నపి జనాధిపాః. 36

సా త్వం వసేహ కల్యాణి! రాజ్ఞ స్సమనువర్తినీ,
భరతస్య రతా ధర్మే సత్యవ్రతపరాయణా. 37

నీవు ప్రతిదినమును ఉషఃకాలమందు నిద్రలేచి యథావిధిగ దేవతలం బూజించి మనుష్యుల కందఱకుఁ బ్రభుఁడైన నాతండ్రి దశరథమహారాజునకు నమస్కారము సేయవలయును. ౩౦

కేవలము ధర్మమునే యాశ్రయించియున్నదియు వృద్ధురాలును దుఃఖసముద్రంబున మునిఁగియున్నదియునగు నాతల్లి కౌసల్యను నీవు గౌరవించుచుండవలయును. ౩౧

నాయందు స్నేహంబును బ్రేమయు నుంచుట నన్నుఁ గాపాడుట ఈవిషయములందు నాతల్లు లందఱు నాకు సమానులే కావునఁ గౌసల్యనుం బోలె నితరలయిన నాతల్లులకును నీవు నమస్కారంబు చేయుచుండవలయు.

నాకు నాప్రాణంబులకన్న నధికప్రియులయిన భరతశత్రుఘ్నులను నీవు విశేషించి నీతోఁబుట్టువును గొడుకునుం జూచుకొనునట్లు చూచుకొనవలయును. ౩౩

భరతుఁ డీదేశమునకును మనయింటికినిగూడ రాజును బ్రభుఁడును గావున నీ వతని కెప్పుడును విరోధము సేయఁగూడదు. ౩౪

రాజులు తమ కనుకూలముగాఁ బ్రవర్తించి యాలస్యాదులులేక యెల్లప్పుడును దమ్ము సేవించుచుండిననే సంతోషింతురు. అట్లుగానిచో మిక్కిలియుఁ గోపము నొందుదురు. ౩౫

రాజులు తమకు విరోధము సేయుదురేని తమకుఁ దమధర్మపత్నులందు బుట్టిన ధర్మప్రదులగు నౌరసపుత్త్రులనైనను బరిత్యజింతురు. బంధువులు కాని సాధారణజనులయినను సమర్థులును దమకు హితముసేయువార లగుదురేని వారలం బరిగ్రహింతురు. ౩౬

మంగళస్వరూపిణి వగు సీతా! అట్లు భరతున కనుకూలముగాఁ బ్రవర్తింపనిచో నీకుఁ గష్టముగలుగుఁ గావున నీవు రాజయిన భరతు ననువర్తింపుచు ధర్మంబు వదలక సత్యంబును నియమంబు నవలంబించి యుచ్చటనే యుండుము. ౩౭

ఆహం గమిష్యామి మహావనం ప్రియే!
త్వయా హి వస్తవ్య మిహైవ భామిని!,
యథా వ్యళీకం కురుషే న కస్య చి
త్తథా త్వయా కార్య మిదం వచో మమ. 3౮

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే షడ్వింశస్సర్గః

---

## సప్తవింశస్సర్గః

ఏవ ముక్తా తు వైదేహీ ప్రియార్హా ప్రియవాదినీ,
ప్రణయా దేవ సంక్రుద్ధా భర్తార మిద మబ్రవీత్. ౧

కి మిదం భాషసే రామ! వాక్యం లఘుతయా ధ్రువమ్,
త్వయా య దపహాస్యం మే శ్రుత్వా నరవరాత్మజ!. ౨

ఆర్యపుత్ర! పితా మాతా భ్రాతా పుత్ర స్తథా స్నుషా,
స్వాని పుణ్యాని భుఞ్జానాః స్వం స్వం భాగ్య ముపాసతే. 3

భర్తు ర్భాగ్యం హి భార్యైకా ప్రాప్నోతి పురుషర్షభ!,
అత శ్చైవాహ మాదిష్టా వనే వస్తవ్య మి త్యపి. ౪

న పితా నాత్మజో నాత్మా న మాతా న సఖీజనః,

ప్రియంరాలవగుసీతా! నేను గాఁడవిలోఁ నుండఁబోయెదను. నీవు స్త్రీవి కావున నాతో నడవికి రాఁదగవు. నీ విచ్చటనె యుండవలయుఁ గదా! ఇచ్చట నెవ్వనికిని నీపైఁ గోపంబు రాకుండునట్లు అనుకూలముఁగా నడుచుకొనుచుండుము. ఇదే నేనుచెప్పుమాట! అని రాముఁడు సీతాదేవికిం జెప్పెను. ౩౮

ఇది యిరువదియాఱవసర్గము.

---

## ఇరువదియేడవసర్గము

సంతోషకరంబులగుమాటలె చెప్పఁదగినదియు సంతోషకరంబుగనె మాటలాడునదియునగు సీతాదేవి పెనిమిటిచెప్పినమాటలను విని స్నేహంబునను మిక్కిలియుఁ గోపంబునొంది పెనిమిటిని రామునిఁ జూచి యిట్లని చెప్పె. ౧

రాముఁడా! నీవు రాజపుత్రుండవు; నీ విప్పుడు నావంటిదానిఁ గూడ పరిహాసముసేయఁదగినట్టి పనికిమాలినమాటలు చెప్పుచున్నావే! ఇది యేమి విచిత్రము! ఇదివఱ కెన్నఁడును నీనోట నే నిట్టిమాటలను విన్నది లేదు! ౨

పెనిమిటివగురాముఁడా! తండ్రియును దల్లియును దోఁబుట్టువును గొడుకును గోడలును వీరలందఱుఁ దమతమపుణ్యపాపములఫలంబుల ననుభవించుచు వానివలనం దమకుఁగలుగు శుభాశుభకర్మంబులను దామె యనుభవించుచున్నారు. ౩

పెనిమిటి కర్ధశరీరమయినభార్య యొక్కతెమాత్రమె తన పెనిమిటికిం గలుగుశుభాశుభకర్మంబులను దానును బొందుచున్నది.

అట్లగుటం జేసి నిన్నాజ్ఞాపించుటమాత్రముచేతనే నన్నును అడవిలో నుండవలయునని యాజ్ఞాపించినట్టె యగుచున్నది. ౪

స్త్రీలకుఁ దండ్రిగాని, కొడుకుగాని, తల్లిగాని, చెలికత్తెలుగాని,

ఇహ ప్రేత్య చ నారీణాం పతి రేకో గతి స్సదా. ౫

యది త్వం ప్రస్థితో దుర్గం వన మద్యైవ రాఘవ!,
అగ్రత స్తే గమిష్యామి మృద్నన్తీ కుశకంటకాన్. ౬

ఈర్ష్యారోషౌ బహిష్కృత్య భుక్తశేష మి వోదకమ్,
నయ మాం వీర! విస్రబ్ధః పాపం మయి న విద్యతే. ౭

ప్రాసాదాగ్రై ర్విమానై ర్వా వైహాయసగతేన వా,
సర్వావస్థాగతా భర్తుః పాదచ్ఛాయా విశిష్యతే. ౮

అనుశిష్టాఽస్మి మాత్రా చ పిత్రా చ వివిధాశ్రయమ్,

నాఽస్మి సమ్ప్రతివక్తవ్యా వర్తితవ్యం యథా మయా. ౯

అహం దుర్గం గమిష్యామి వనం పురుషవర్జితమ్,
నానామృగగణాకీర్ణం శార్దూలవృకసేవితమ్. ౧౦

సుఖం వనే నివత్స్యామి యథైవ భవనే పితుః,
అచిన్తయన్తీ త్రీన్లోకాం శ్చిన్తయన్తీ పతివ్రతమ్. ౧౧

గతి కానేరరు, వారలు దమకుఁ దామె స్వతంత్రులును గారు; పెనిమిటి యొక్కఁడు మాత్రమె వారల కీలోకమునందును బరలోకమునందును నెల్లప్పుడును గతియగును; మఱియెవ్వఁడును లేఁడు. ౫

రాముఁడా! నీ విప్పుడె గహనంబగునరణ్యంబునకుం బోవఁ బయనం బగుదువేని, నేను నీముందట దర్భమొక్కల మెత్తగాఁ బాదంబుల నడుముచుఁ బోయెదను; వెనుకవచ్చునట్టినీకు వానిపైఁ బాదంబులుంచుటకుఁ గష్టముండదు.

నీవు పరాక్రమశాలివి; నీ కెందును భయములేదు; నావంటివాండ్ర నెందఱినైనం గాపాడఁజాలుదువు; నేను స్త్రీనని భయపడవలదు; "నేను రావల దనఁగా వినక వచ్చెదనని చెప్పుచున్నదే" యని యోర్వమియుం, "నామాట నతిక్రమించుచున్నదే" యని కోపంబును ద్రాఁగి మిగిలినజలంబును విడుచునట్లు పరిత్యజించి నాయందు నమ్మకంబుంచి నన్నును గొనిపొమ్ము; నేను నీ కేమియుం నపకారంబు సేయలేదు. ౭

మేడలపై నుండుటకన్నను విమానంబుల నుండుటకన్నను అణిమాది సిద్ధులంబొంది యాకాశంబునం దిరుగుటకన్నను అన్నియవస్థలందు నేకరీతిగాఁ బెనిమిటి ననుసరించి యతని పాదంబులకు సేవసేయుటయె యధికము. ౮

నా తల్లియును, నా తండ్రియును నాకీవిషయమునుగుఱించి నానావిధములుగా నుపదేశించి యున్నారు.

నే నెట్లు నడుచుకొనవలయునో, ఆసంగతి యిప్పుడు నా కెవ్వరు నుపదేశింపవలసినది లేదు; నాకిదివఱకె నాతలిదండ్రు లుపదేశించి యున్నారు. ౯

అరణ్యంబు చొరరానిదయ్యు జనులు లేనిదైనను బెద్దపులులు దోడేళ్లు మొదలగు నానావిధములయిన మృగంబులతో నిండినదైనను నేను దప్పక నీతోఁగూడ నరణ్యంబునకు వచ్చెదను. ౧౦

నేను త్రైలోక్యాధిపత్యమునైనను లెక్కింపక పెనిమిటివగునీకు శుశ్రూషసేయుట దక్క మఱి వేఱుతలంపక మాతండ్రియింట నుండునట్లు సుఖంబుగా వనంబులో నుండెదను. ౧౧

శుశ్రూషమాణా తే నిత్యం నియతా. బ్రహ్మచారిణీ,
సహ రంస్యే త్వయా వీర! వనేషు మధుగంధిషు. ౧౨

త్వంహి శక్తో వనే కర్తుం రామ! సంపరిపాలనమ్,
అన్యస్యాపి జనస్యేహ కిం పునర్మమ మానద!. ౧౩

సహ త్వయా గమిష్యామి వన మద్య న సంశయః,

నాహం శక్యా మహాభాగ! నివర్తయితు ముద్యతా. ౧౪

ఫలమూలాశనా నిత్యం భవిష్యామి న సంశయః,

నతే దుఃఖం కరిష్యామి నివసన్తీ సహ త్వయా. ౧౫
ఇచ్ఛామి సరితశ్శైలా న్పల్వలాని వనాని చ,
ద్రష్టుం సర్వత్ర నిర్భీకా త్వయా నాథేన ధీమతా. ౧౬

హంసకారండవాకీర్ణాః పద్మినీ స్సాధుపుష్పితాః,
ఇచ్ఛేయం సుఖినీ ద్రష్టుం త్వయా వీరేణ సఙ్గతా. ౧౭

అభిషేకం కరిష్యామి తాసు నిత్యం యతవ్రతా,

సహ త్వయా విశాలాక్ష! రంస్యే పరమనన్దినీ. ౧౮

ఏవం వర్షసహస్రాణాం శతం వాఽహం త్వయా సహ,

పరాక్రమశాలివగు రాముఁడా! నేను నీకెల్లప్పుడును సేవసేయుచు, నియమంబునఁ దపంబు సల్పుచు, మంచితేనియలు గల్గుటచే సుగంధంబు గుబాళించుచుండెడు వనంబులందు నిన్నుఁగూడి క్రీడింపుచుండెదను. ౧౨

నామానంబుఁ గాపాడునట్టి రాముఁడా! నీవు అడవియందు నన్నును ఇంక నితరజనులనుగూడఁ గాపాడుటకు శక్తుండవు; అట్లుండఁగా నన్నుమాత్రము గాపాడుట నీకెంతమాత్రము? ౧౩

నే నిప్పుడు నీతోఁగూడనే యడవికి వచ్చెదను; ఈ విషయంబునం దెంతమాత్రమును సందేహములేదు.

ఇట్లు వనంబునకు నీతోఁగూడ రావలయునని నిశ్చయించియున్న నన్ను ఇచ్చట నిలుప నీ కలవిగాదు. ౧౪

"వనంబున మంచియాహారంబు దొరకదు; పండ్లను గడ్డలను దినియుండవలయును" అనియందువేమొ? నే నెల్లప్పుడును బండ్లను గడ్డలనె దినుచుండెదను; మంచియాహారంబే నా కక్కఱలేదు; దీనికి సందేహములేదు.

నేను నీకేవిధమయినదుఃఖమునుం జేయక నీతోఁగూడ నుండెదను. ౧౫

నేను బుద్ధిమంతుండవు నాథుండవగు నీవు తోడుండఁగా నెంతమాత్రము భయములేక అడవియందుండు నదులను బర్వతంబులను నీళ్లునిలిచియుండు పల్లములను వనంబులను వీనినన్నిటిని జూడఁగోరుచున్నాను. ౧౬

నేను బరాక్రమశాలివగు నిన్నుఁగూడి భయంబులేక సుఖముగా హంసపక్షులును నీరుకోళ్లును గలిగి చక్కఁగాఁ బూచియుండు తామరకొలంకులం జూడఁగోరుచున్నాను. ౧౭

నేను దృఢమయిననియమం బవలంబించి యాతామరకొలంకులందె స్నానంబుచేసెదను; ఉష్ణోదకంబు గోరను.

విశాలంబులగు నేత్రంబులుగల రాముఁడా! ఆ తామరకొలంకులందు నిన్నుఁగూడి పరమసంతోషమునం గ్రీడించుచుండెదను. ౧౮

ఈ ప్రకారము నీతోఁగూడ నరణ్యంబున వాసంబు సేయుచు నూఱు

వ్యతిక్రమం న వేత్స్యామి స్వర్గోఽపి న హి మే మతః. ౧౯

స్వర్గేఽపి చ వినా వాసో భవితా యది రాఘవ!,
త్వయా మమ నరవ్యాఘ్ర! నాహం తమపి రోచయే. ౨౦
అహం గమిష్యామి వనం సుదుర్గమం
మృగాయుతం వానరవారణై ర్యుతమ్,

వనే నివత్స్యామి యథా పితు ర్గృహే
త వైవ పాదా వుపగృహ్య సంయతా. ౨౧
అనన్యభావా మనురక్తచేతసం
త్వయా వియుక్తాం మరణాయ నిశ్చితామ్,
నయస్వ మాం సాధు కురుష్వ యాచనాం
న తే మయాఽతో గురుతా భవిష్యతి. ౨౨
తథా బ్రువాణా మపి ధర్మవత్సలో
న చ స్మ సీతాం నృవరో నినీషతి,
ఉవాచ చైనాం బహుసన్నివర్తనే
వనే నివాసస్య చ దుఃఖితాం ప్రతి. ౨౩
ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే సప్తవింశస్సర్గః.

అష్టావింశస్సర్గః.

స ఏవం బ్రువతీం సీతాం ధర్మజ్ఞో ధర్మవత్సలః,
న నేతుం కురుతే బుద్ధిం వనే దుఃఖాని చిన్తయన్. ౧

వేలసంవత్సరంబులు గడచినను ఇంతకాలంబై నదని యెఱుంగకుండెదను; ఇంకc బదునాలుగుసంవత్సరము లెంతమాత్రము? నిన్నువిడిచి స్వర్గంబులో నుండుట యందును నా కిష్టము కాదు. ౧౯

పురుషశ్రేష్ఠుండవగు రామ్ముండా! నాకు స్వర్గంబున వాసంబు సిద్ధించినను, నీవు లేకున్నచో నేనుదానింగూడ నెంతమాత్రము సమ్మతింపను. ౨౦

నేను అడవిలోనికిం జొరనలవి కాకున్నను, అందుc గోఁతులు నేనుంగులు మున్నగుమృగంబులున్నను నేను దప్పక నీతోఁగూడ నడవికి వచ్చెదను.

నేను నియమంబున నీపాదంబుల నాశ్రయించి తండ్రియింటనుండు నట్లు సుఖంబుగా వనంబున నుండెదను. ౨౧

నిన్నుఁదక్క మఱియెవ్వనిం గన్నెత్తి చూడనిదానను, నీయందను రాగంబుగలదానను, నీవు విడిచిపోవుదువేని మరణంబునొంద నిశ్చయించినదానను, నన్నుఁగొట్టి నీతోఁగూడ వనంబునకుc దీసికొనిపొమ్ము; నా ప్రార్థన నంగీకరింపుము; నన్నుc గొనిపోవుటవలన నాచే నీకేమియుంc గష్టము రాదు.

ధర్మమునందు దలి ప్రీతిగలపురుషోత్తముండగు రాముండు, సీతాదేవి యిట్లు ప్రార్థింపుచున్నను, ఆవిడను వనంబునకుc దోడ్కొనిపోవ నొప్పఁడయ్యెc; ఆవిడను నిలుపునిమిత్తమయి వనవాసంబునం గల్గుదుఃఖంబులంగూర్చి యధికముగా నావిడకుం జెప్పెను. ౨౩

ఇది యిరువదియేడవసర్గము.

---

## ఇరువదియెనిమిదవసర్గము

సీత యిట్లుచెప్పుకొన్నను ధర్మంబు నెఱిఁగినవాఁడును, ధార్మికుండు నగురాముండు వనంబునందుc గలుగుకష్టంబులం దలంచుకొని యావిడం దన తోఁగూడ నరణ్యంబునకుc గొనిపోవుటకు ఎంతమాత్ర మంగీకరింపc డయ్యె.

సాన్త్వయిత్వా పున స్తాం తు బాష్పదూషితలోచనామ్,
నివర్తనార్థే ధర్మాత్మా వాక్య మేత దువాచ హ. ౨

సీతే మహాకులీనాఽసి ధర్మే చ నిరతా సదా,
ఇహాఽచర స్వధర్మం త్వం మా యథా మనస స్సుఖమ్. ౩

సీతే! యథా త్వాం వక్ష్యామి తథా కార్యం త్వయాఽబలే!,
వనే దోషా హి బహవో వదత స్తా న్నిబోధ మే. ౪

సీతే! విముచ్యతా మేషా వనవాసకృతా మతిః,
బహుదోషం హి కాన్తారం వన మి త్యభిధీయతే. ౫

హితబుద్ధ్యా ఖలు వచో మ యైత దభిధీయతే,
సదా సుఖం న జానామి దుఃఖ మేవ సదా వనమ్. ౬

గిరినిర్ఝరసమ్భూతా గిరికన్దరవాసినామ్,
సింహానాం నినదా దుఃఖా శ్రోతుం దుఃఖ మతో వనమ్. ౭
క్రీడమానా శ్చ విస్రబ్ధా మత్తా శ్శూన్యే మహామృగాః,
దృష్ట్వా సమభివర్తన్తే సీతే దుఃఖ మతో వనమ్. ౮

సగ్రాహా స్సరిత శ్చైవ పఙ్కవత్య స్సుదుస్తరాః,

ధర్మాత్ముండగురాముండు, కన్నీళ్లనిండి కలంకంబాఱిన కండ్లతోనున్న సీతాదేవి నూఱడించి యాయిడ నచ్చటనె నిలుపునిమిత్తమయి మఱల నిట్లని చెప్పెను. ౨

సీతా! నీవు పూజ్యమగువంశమునం బుట్టినదానవు; మఱియుం నెల్లప్పుడును ధర్మమునందు మిక్కిలి యాసక్తిగలదానవు; నీ విచ్చటనెయుండి నీ మనసునకు సుఖంబు గల్గునట్లుగా నన్నుద్దేశించి నీవు చేయవలసినధర్మము నాచరించుచుండుము. 3

అబలవగుసీతా! నేను నీకెట్లుచెప్పుచున్నానో, నీవట్లు సేయవలయును గాని స్వతంత్రింపఁగూడదు.

అడవియందుఁ బెక్కుకష్టములున్నవి; నేను నీకు వానిం జెప్పెదను వినుము. ౪

సీతా! అడవిలో వాసంబు సేయవలయునను నీతలంపును విడువుము. "ప్రవేశించుటకశక్యమయినమహారణ్యంబున నుండువారలకుఁ బెక్కు కష్టములు సంభవించును" అని జనులు చెప్పుచుండఁగావినియున్నావుగదా! ౫

నీమేలుఁగోరియే నే నీమాటం జెప్పుచున్నానుగాని, నిన్ను భరించుట కష్టమని కాదు.

అడవిలోనుండుటచే నెప్పటికిని గష్టమే గల్గును; ఒకప్పుడైనను సుఖము గల్గదు; అని నేను నిశ్చయించియున్నాను. ౬

కొండలయందలి సెలయేఱులధ్వనులును, గుహాలందుండు సింహంబుల ధ్వనులును వినుట కలవిగావు. కావున నడవిలోనుండుట కష్టము. ౭

సీతా! నిర్జనప్రదేశములందు భయంబులేక విచ్చలవిడిగాఁ గ్రీడించుచు మదించియుండు సింహశార్దూలాదిక్రూరజంతువులు మనలం జూచినంతనె సంభ్రమంబున మనలం జంపుటకు మనయొద్దకు వచ్చును కావున వనంబులో నుండుట కష్టము. ౮

అడవిలో నచ్చటచ్చట ఎల్లప్పుడును మొసళ్లుగలిగి విశేషముగా

మత్తై రపి గజై ర్నిత్య మతో దుఃఖతరం వనమ్. ౯

లతాకంటకసఙ్కీర్ణాః కృకవాకూపనాదితాః,
నిరపా శ్చ సుదుర్గా శ్చ మార్గా దుఃఖ మతో వనమ్. ౧౦

సుప్యతే పర్ణశయ్యాసు స్వయంభగ్నాసు భూతలే,
రాత్రిషు శ్రమఖిన్నేన తస్మా ద్దుఃఖ మతో వనమ్. ౧౧

అహోరాత్రం చ సంతోషః కర్తవ్యో నియతాత్మనా,
ఫలై ర్వృక్షావపతితైః సీతే! దుఃఖతరం వనమ్. ౧౨

ఉపవాస శ్చ కర్తవ్యో యథా ప్రాణేన మైథిలి!,
జటాభార శ్చ కర్తవ్యో వల్కలామ్బరధారిణా. ౧౩
దేవతానాం పితౄణాం చ కర్తవ్యం విధిపూర్వకమ్,
ప్రాప్తానా మతిథీనాం చ నిత్యశః ప్రతిపూజనమ్. ౧౪
కార్య స్త్రి రభిషేక శ్చ కాలేకాలే చ నిత్యశః,
చరతా నియమే నైవ తస్మా ద్దుఃఖతరం వనమ్. ౧౫

ఉపహార శ్చ కర్తవ్యః కుసుమైః స్స్వయ మాహృతైః,
ఆర్షేణ విధినా వేద్యాం బాలే! దుఃఖమతో వనమ్. ౧౬

యథాలబ్ధేన కర్తవ్యః సంతోష స్తేన మైథిలి!,
యతాహారై ర్వనచరై ర్నిత్యం దుఃఖ మతో వనమ్. ౧౭

ఖరదటలోఁగూడి మత్తగజంబులకైనను దాఁటనలవిగాకుండు నదులుగలవు; వానిని దాఁటి యవ్వలిగట్టుచేర మన కలవిగాదు, కావున వనములో నుండుట మహాకష్టము. ౯

అడవిలోనిమార్గంబులు దీఁగెలతోను ముండ్లతోను నిండి భయంకరములగు నానావిధోల్లధ్వనులతోఁ గూడి నీళ్లు కొంచెమైనను లేక చొర నలవిగాకుండును; కావున వనంబులలో నుండుట కష్టము. ౧౦

పగలంతయుఁ బండ్లు గడ్డలు దిని యలసి, దుఃఖంబున రాత్రులందు నేలం దమంతనె రాలినపత్రంబులం బఱచుకొని పరుండి నిద్రింపవలయును; కావున నడవిలో నుండుట మహాకష్టము. ౧౧

సీతా! రేయింబవలును నియమంబునఁ దమంతనె చెట్లనుండిరాలినపండ్లం దిని తృప్తినొంది యుండవలయు; ఇంకేమియుం దొరకదు కావున నడవిలో నుండుట కష్టము. ౧౨

సీతా! అడవిలోనికిఁ బోయినపిమ్మట యథాశక్తి నుపవాసంబులు సేయవలయుఁ; మఱియుం నారచీరలు గట్టుకొని జడలుధరించియుండవలయుం. ౧౩

నిత్యము దేవతలకును బితరులకును అప్పుడప్పుడు వచ్చునతిథులకును యథావిధిగఁ బూజసేయుచుండవలయుం. ౧౪

ఎల్లప్పుడు నియమం బవలంబించియే యుండవలయును. మఱియుఁ బ్రతి దినమునందును బ్రాతర్మధ్యాహ్నసాయంకాలములందు మూఁడుమాఱులు స్నానముసేయుచుండవలయు. కావున నడవిలోనుండుట మహాకష్టము. ౧౫

వానప్రస్థులగు ఋషులు సేయువిధంబునఁ, దామగోసి తెచ్చిన పూలచేత నగ్ని వేదికిఁ బ్రతిదినమును బూజసేయుచుండవలయుం; నీవు చిన్నదానవు కావున నిట్టికష్టకార్యంబులు సేయఁజాలవు. కావునవనంబులోనుండుటకష్టము.

సీతా! వనంబున నుండువారలు ఆహారమును నియతముగాఁ జేసికొని యెల్లప్పుడును బండ్లుమొదలగునవి యెంతదొరకునో అంతమాత్రముచేతనే తృప్తిఁబొందుచుండవలయును; కావున వనంబులోనుండుట కష్టము. ౧౭

అతీవ వాతా స్తిమిరం బుభుక్షా చాత్ర నిత్యశః,
భయాని చ మహా న్త్యత్ర తతో దుఃఖతరం వనమ్. ౧౮

సరీసృపా శ్చ బహవో బహురూపా శ్చ భామిని!,
చరన్తి పృథివీం దర్పా త్తతో దుఃఖతరం వనమ్. ౧౯

నదీనిలయనా స్సర్పా నదీకుటిలగామినః,
తిష్ఠ న్త్యావృత్య పన్థానం తతో దుఃఖతరం వనమ్. ౨౦

పతఙ్గా వృశ్చికాః కీటా దంశా శ్చ మశకై స్సహ,
బాధన్తే నిత్య మబలే సర్వం దుఃఖ మతో వనమ్. ౨౧

ద్రుమాః కంటకిన శ్చైవ కుశాః కాశా శ్చ భామిని!,
వనే వ్యాకులశాఖాగ్రా స్తేన దుఃఖతరం వనమ్. ౨౨

కాయక్లేశా శ్చ బహవో భయాని వివిధాని చ,
అరణ్యవాసే వసతో దుఃఖ మేవ తతో వనమ్. ౨౩
క్రోధలోభౌ విమోక్తవ్యౌ కర్తవ్యా తపసే మతిః,
న భేతవ్యం చ భేతవ్యే నిత్యం దుఃఖ మతో వనమ్. ౨౪

త దలం తే వనం గత్వా క్షమం న హి వనం తవ,

విమృశ న్నిహ పశ్యామి బహుదోషకరం వనమ్. ౨౫

వనమునందు ఎప్పుడును గాలి యెచ్చుగావీచుచుండును. రాత్రులందుఁ జీఁకటి యధికముగానుండును. ఎల్లప్పుడును ఆఁకలి యధికముగాఁ గలిగి యుండును. మఱియు గొప్పభయంబులును గలుగును. కావున వనంబులో నుండుట మహాకష్టము. ౧౮

మిక్కిలియుఁ బెద్దవైన కొండపాము లనేకంబులు గర్వంబున నేలపైఁ జరుగుచుండును. నీవు స్త్రీవి కావున వానింజూడఁగానే భయంబు నొందుదువు. అందువలన వనంబులోనుండుట మహాకష్టము. ౧౯

నదులుంబోలెఁ గుటిలంబుగాఁబోవునవియు నదులయందుండునవియు నగుమహాసర్పంబులు దారికడ్డముగాఁ బరుండియుండును. కావున వనంబులో నుండుట మహాకష్టము. ౨౦

మిడుతలును జేళ్లను పురుగులు నడవియీఁగలును దోమలును ఎల్లప్పుడు బాధించుచుండును. నీవు స్త్రీవికావున ఈకష్టము నోర్చియుండలేవు. అందువలన వనంబులోనుండుట మహాకష్టము. ౨౧

అడవియందుఁ జెట్లకొమ్మలు దట్టముగా నొకటితో నొకటి యొరసుకొని యుండును. దర్భలును ఱెల్లును దట్టముగా మొలిచియుండును. కావున నడచుటకు గొంచెమయినను దారియె యుండదు. అందువలన వనంబులో నుండుట మహాకష్టము ౨౨

మఱియు నరణ్యంబులో నుండువారలకు దేహకష్టంబు లనేకంబులును నానావిధభయంబులును గలవు కావున వనంబులోనుండుటచాలఁగష్టమే. ౨౩

క్రోధంబును లోభంబును విడువవలయు. తపస్సునందె బుద్ధియుంచవలయు. భయముగల్గించు సింహాదు లగపడినను భయపడఁగూడదు. కావున వనంబులోనుండుట యెప్పటికిని గష్టము. ౨౪

అట్లగుటంజేసి నీవు వనంబునకు రావలయు ననుకోరికను విడువుము. నీ వడవిలో నుండఁదగినదానవుకావు.

నే నిచ్చటఁ జక్కఁగా నాలోచింపఁగా నాకు వనంబులోనుండుట

వన న్తు నేతుం న కృతా మతి స్తదా
బభూవ రామేణ యదా మహాత్మనా,
న తస్య సీతా వచనం చకార త
త్తతోఽబ్రవీ ద్రామ మిదం సుదుఃఖితా. ౨౬

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే అష్టావింశస్సర్గః.

---

ఏకోనత్రింశస్సర్గః.

ఏత త్తు వచనం శ్రుత్వా సీతా రామస్య దుఃఖితా,
ప్రసక్తాశ్రుముఖీ మన్ద మిదం వచన మబ్రవీత్. ౧
యే త్వయా కీర్తితా దోషా వనే వస్తవ్యతాం ప్రతి,
గుణా ని త్యేవ తా న్విద్ధి తవ స్నేహపురస్కృతాన్. ౨

మృగా స్సింహా గజా శ్చైవ శార్దూలా శ్శరభా స్తథా,
పక్షిణ స్సృమరా శ్చైవ యేచా న్యే వనచారిణః. 3
అదృష్టపూర్వరూపత్వా త్సర్వే తే తవ రాఘవ!,
రూపం దృష్ట్వాఽపసర్పేయు ర్భయే సర్వే హి బిభ్యతి. ౪

త్వయా చ సహ గ న్తవ్యం మయా గురుజనాజ్ఞయా,

త్వద్వియోగేన మే రామ! త్య క్తవ్య మిహ జీవితమ్, ౫

మిక్కిలియుఁ గష్టమనియే తోఁచుచున్నది. అని రాముఁడు సీతతోఁ జెప్పెను. ౨౯

ఇట్లు మహాత్ముఁడగు రాముఁడు సీతను వనంబునకుఁ దోడ్కొని పోవుటకు సమ్మతింపకుండఁగా సీత యతనిమాటనంగీకరింపక పరమదుఃఖితయయి యారామునిం జూచి యిట్లని చెప్పెను. ౩౦

ఇది యిరువదియెనిమిదవసర్గము.

---

## ఇరువదితొమ్మిదవసర్గము

సీతాదేవి రాముఁడు చెప్పినమాటను విని పరమదుఃఖమునొంది కండ్ల నీళ్లునించుచు రామునిఁజూచి తిన్నఁగా నిట్లని చెప్పెను. ౧

నీవిప్పుడు వనవాసంబు సేయుటయందు దోషంబు లున్నవనిచెప్పితివో, అవన్నియుం దోషములుగావు. నీవు తోడున్నావు కావున నవన్నియుం నాకుఁ గుణంబులే యని యెఱుంగుము. ౨

రాముఁడా! జింకలును, సింహంబులును, ఏనుఁగులును, పెద్దపులులును, శరభంబులును, పెద్దచమరంబులును, బఱ్ఱులు, మఱియు నరణ్యంబులోనుండు నితరమృగంబులన్నియుం నీరూపమువంటి యమానుషరూపంబును ఇదివఱ కెప్పుడును జూచియుండవు. కావున నీరూపమును జూడఁగానే భయంబున నవ్వలికిం బాఱిపోఁగలవు. భయంబుగల్గినప్పుడు అందఱును భయము పడుదురుగదా! కావున నా క్రూరజంతువులవలన నాకేమియుభయంబుగలుగదు.

ఇదిగాక నిన్ను వనంబునకుఁ బొమ్మని యాజ్ఞాపించుటచే నన్ను నాజ్ఞాపించిన ట్లగుచున్నది. కావున దశరథునియాజ్ఞాప్రకారము నే నవశ్యము నీతోఁ గూడ వనంబునకు రావలసినదాన నగుచున్నాను.

రాముఁడా! నీవు నన్నిచ్చట నే విడిచి యరణ్యంబునకుఁ బోదువేని నే నవశ్యము ప్రాణములు విడువవలసినది. ఇది సాధర్మము. ౪

న హి మాం త్వత్సమీపస్థా మపి శక్నోతి రాఘవ!,
సురాణా మీశ్వర శ్శక్ర గ్ప్రధర్షయితు మోజసా. ౬
పతిహీనా తు యా నారీ న సా శక్ష్యతి జీవితుమ్,
కామ మేవంవిధం రామ! త్వయా మమ విదర్శితమ్. ౭

అథచాపి మహాప్రాజ్ఞ! బ్రాహ్మణానాం మయా శ్రుతమ్,
పురా పితృగృహే సత్యం వస్తవ్యం కిల మే వనే. ౮

లక్షణిభ్యో ద్విజాతిభ్య శ్ర్శుత్వాఽహం వచనం పురా,
వనవాసకృతోత్సాహా నిత్య మేవ మహాబల!. ౯

ఆదేశో వనవాసస్య ప్రాప్తవ్య స్స మయా కిల,

సా త్వయా సహ తత్రాహం యాస్యామి ప్రియ! నాన్యథా.

కృతాదేశా భవిష్యామి గమిష్యామి సహ త్వయా,

కాల శ్చాయం సముత్పన్న స్సత్యవా గ్భవతు ద్విజః. ౧౧

వనవాసేఽభిజానామి దుఃఖాని బహుధా కిల,

ప్రాప్యన్తే నియతం వీర! పురుషై రకృతాత్మభిః. ౧౨

రాముఁడా! నేను నీసమీపంబున నుండఁగా, దేవతలకుఁ బ్రభుఁడైన యింద్రుఁడైనను బరాక్రమంబున నన్నవమానింపఁజాలఁడు. ౬

పెనిమిటిం బాసిన స్త్రీమాత్రము ఎంతమాత్రము జీవింపఁజాలదు.

రాముఁడా! నీవును బెక్కుమారులు నా కీసంగతి నుపదేశించి యున్నావు. ౭

మహాపండితుఁడవగు రాముఁడా! మున్ను నేను నాతండ్రియింట నుండునప్పుడు "నాకుఁ గొంతకాలము వనంబున నుండవలసివచ్చును" అని జ్యోతిర్వేత్త లగు బ్రాహ్మణులు చెప్పఁగా వినియున్నాను. ౮

మహాబలుఁడవగు రాముఁడా! నేను మున్ను సాముద్రికలక్షణములు దెలిసిన బ్రాహ్మణులవలన "నాకుఁ గొంతకాలము వనవాసముగల్గును" అను మాటనువిన్నది మొదలు నామనంబున "ఎప్పుడెప్పుడు వనంబునకుఁబోవుదును" అని చాల నుత్సాహంబు గలిగియున్నది. ౯

లక్షణవేత్తలగు నా బ్రాహ్మణులు చెప్పినట్లు నేను గొంతకాలము వనంబులో నుండవలసినదాన నేకదా.

ప్రియుండవగు రాముఁడా! నేను వనంబునకు నీతోఁగూడ రావలయును గాని మఱి వేఱేయుపాయము నేను వనంబునకుఁ బోవుట కేదియుం లేదు. ౧౦

నే నిప్పుడు నీతోఁగూడ వనంబునకు వచ్చి యా బ్రాహ్మణులవచనంబును సత్యంబుఁ గావించెదను.

అందుకుఁ దగినట్టుగా వనవాసంబు ఘటిల్లఁజేయుకాలమును సంభవించినది; కావున నేను దప్పక నీతోఁగూడవచ్చెదను; లక్షణవేత్తలగు నా బ్రాహ్మణులమాట సత్యముగుఁగాక. ౧౧

వనంబునందు వాసంబుసేయుటలోఁ బెక్కుకష్టంబులు గలుగునని నాకును దెలిసియున్నది.

నీవు పరాక్రమవంతుఁడవు; నీకేమియు నట్టికష్టంబులు గలుగవు; మనోధైర్యములేనివారికిమాత్రమే అట్టికష్టంబులు సంభవించును. ౧౨

కన్యయా చ పితు ర్గేహే వనవాస శ్ర్శుతో మయా,
భిక్షిణ్యా స్సాధువృత్తాయా మమ మాతు రిహాగ్రతః. ౧౩

ప్రసాదిత శ్చవై పూర్వం త్వం వై బహువిధం ప్రభో!,

గమనం వనవాసస్య కాంక్షితం హి సహ త్వయా. ౧౪

కృతక్షణాఽహం భద్రం తే గమనం ప్రతి రాఘవ,
వనవాసస్య శూరస్య చర్యా తే మమ రోచతే. ౧౫

శుద్ధాత్మ న్ప్రేమభావాద్ధి భవిష్యామి వికల్మషా,
భర్తార మనుగచ్ఛన్తీ భర్తా హి మమ దైవతమ్. ౧౬

ప్రేత్యభావే హి కల్యాణ స్సఙ్గమో మే సహ త్వయా,

శ్రుతిర్హి శ్రూయతే పుణ్యా బ్రాహ్మణానాం యశస్వినామ్. ౧౭

ఇహలోకే చ పితృభి ర్యాస్త్రీ యస్య మహామతే!,
అద్భి ర్దత్తా స్వధర్మేణ ప్రేత్యభావేఽపి తస్య సా. ౧౮

ఏవ మస్మా త్స్వకాం నారీం సువృత్తాం హి పతివ్రతామ్,
నాభిరోచయసే నేతుం త్వం మాం కేనేహ హేతునా. ౧౯
భక్తాం పతివ్రతాం దీనాం మాం సమాం సుఖదుఃఖయోః,
నేతు మర్హసి కాకుత్స్థ! సమానసుఖదుఃఖినీమ్. ౨౦

నాకుఁ బెండ్లి గాకమునుపు నేను నాతండ్రియింటనుండునపుడు నే నొకనాఁడు నాతల్లిసమీపంబున నుండఁగా సదాచారసంపన్నయగు నొక తాపసస్త్రీ నన్నుఁజూచి నాకుఁ గొంతకాలము వనవాసము సంభవించునట్లు చెప్పఁగా వినియున్నాను. ౧౩

నాథుఁడవగు రాముఁడా! ఇదిగాక నేను నీకు అనేకవిధములుగా సేవ చేసి సంతోషము గలుగఁజేసియున్నాను; కావున నా యీ యభీష్టమును నీవు నెఱవేర్పవలయును.

నేను నిన్నుఁగూడి వనంబునకుఁ బోయి యచ్చట వాసముసేయవల యునని యప్పుడప్పుడు కోరుచుంటినిగదా! ౧౪

రాముఁడా! నేను వనంబునకు వచ్చుటకై మిక్కిలియు నుత్సాహంబు గలిగియున్నాను; నీకు మంగళమగుఁగాక; శూరుఁడవగు నీవు వనంబులో వాసముసేయుచుండఁగా నీకు శుశ్రూషసేయవలెనని గోరుచున్నాను. ౧౫

అసూయాదులులేనిరాముఁడా! నేను స్నేహంబునఁ బెనిమిటివగు నిన్ననుసరించుచుండి నాపాపంబులను నశింపఁజేసికొని కృతార్థురాల నయ్యెదను; నాకుఁ బెనిమిటియే దేవుఁడు; అతనికన్న మఱియేదైవము నధికముగాదు. ౧౬

ఇచ్చటమాత్రమె కాదు; పరలోకమునందును నీతోఁగూడ నాకు ఎడతెగక సంగమంబు గల్గియుండును.

కీర్తిమంతులగు బ్రాహ్మణులు చదువుకొనుచుండఁగాఁ బవిత్రంబగు నీ వేదవాక్యమును వినియున్నాముగదా! ౧౭

అధికమయిన బుద్ధిగలవాఁడవగురాముఁడా! తండ్రి మొదలగువారలచే నీలోకంబున, నేస్త్రీయేపురుషునకుఁ దమవర్ణాదిధర్మంబు ననుసరించి యుదక పూర్వకముగా నివ్వఁబడునో, ఆస్త్రీకి పరలోకమునందును ఆ పురుషుఁడే పెనిమిటిగా నుండును. అనునర్థముగల వేదవాక్యము వినియున్నాము. ౧౮

ఇట్లు వేదమునందునుఁ జెప్పఁబడియుండఁగా నీవు సదాచారసంపన్నను పతివ్రతనుఁ దోడ్కొనిపోవుటకు సమ్మతింపవేమి? ౧౯

రాముఁడా! నీయం దనురాగముగలదానను, పతివ్రతను, నన్నెక్కడ విడిచిపోయెదవో యని దుఃఖమునొందియున్నదానను, సుఖంబుగల్గినను

యది మాం దుఃఖితా మేవం వనం నేతుం న చేచ్ఛసి,
విష మగ్నిం జలం వాఽహ మాస్థాస్యే మృత్యుకారణాత్.

ఏవం బహువిధం తం సా యాచతే గమనం ప్రతి,
నానుమేనే మహాబాహు స్తాం నేతుం విజనం వనమ్. ౨౨

ఏవ ముక్తా తు సా చిన్తాం మైథిలీ సముపాగతా,
స్నాపయన్తీ వ గా ముష్ణై రశ్రుభి ర్నయనచ్యుతైః. ౨౩

చిన్తయన్తీం తథా తాం తు నివర్తయితు మాత్మవాన్,
తామ్రోష్ఠీం స తదా సీతాం కాకుత్స్థో బహ్వసాన్త్వయత్.

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే ఏకోనత్రింశస్సర్గః

---

త్రింశస్సర్గః

సాన్త్వ్యమానా తు రామేణ మైథిలీ జనకాత్మజా,
వనవాసనిమిత్తాయ భర్తార మిద మబ్రవీత్.

దుఃఖంబు సంభవించినను ఒకటేవిధముగా నుండుదానను. నీవు సుఖంబుగల్గిన ప్పుడు సుఖంబునొందుదానను. నీవు దుఃఖంబువచ్చునప్పుడు దుఃఖంబునొందు దాననగు నన్ను వనంబునకుం దోడ్కొనిపొమ్ము ౨౦

ఇట్లు పరమదుఃఖంబునం బరితపించుచున్న నన్ను వనంబునకుం దోడ్కొనిపోవసమ్మతింపవేని నేను విషముద్రావియయినను అగ్నిహోత్రములోం బడియయినను నీళ్లలో దుమికియయినను ప్రాణంబులు విడిచెదను. అని సీత రామునితోం జెప్పెను. ౨౧

ఆ సీత యాప్రకారము పెక్కువిధంబులం దన్నడవికిం దోడ్కొని పొమ్మని రాముని ప్రార్థించినను, అధికమయిన బాహుబలంబు గలరాముండు "అడవిలో జనులెవ్వరు నుండరే, ఈసీత మిక్కిలియుం సుకుమారదేహముగలది. అచ్చట దీని నెట్లు కాపాడుదు" ననునభిప్రాయంబున నాసీతను వనంబునకుం గొనిపోవ సమ్మతింపండయ్యె. ౨౨

ఆ సీత, యిట్లు రాముండు తన్నుం దోడ్కొని యడవికింబోవ సమ్మతింపక చెప్పినమాటనువిని నేలయంతయుం దడియునట్లు కండ్లనుండి కన్నీళ్లు గాఱంగా మిక్కిలియుం దుఃఖమునొందెను. ౨౩

బుద్ధిమంతుండగురాముండు అట్లుదుఃఖించుచున్న యెట్టిపెదవులుగల యాసీతాదేవింజూచి యాబిడను నిలుపునిమిత్తమయి మిక్కిలియుం నూఱడించెను. ౨౪

ఇది యిరువదితొమ్మిదవసర్గము.

---

## ముప్పదియవసర్గము

జనకునికూంతురయినసీత యట్లు రామునిచే నూఱడింపంబడి యెట్ల యినను వనంబులోనుండ రామునియనుమతిం బొందుటకై పెనిమిటియగు రాముంజూచి యిట్లని చెప్పెను. ౧

సా తము_త్తమసంవిగ్నా సీతా విపులవక్షసమ్,
ప్రణయాచ్చాభిమానా చ్చ పరిచిక్షేప రాఘవమ్. ౨

కిం త్వాఽమన్యత వై దేహః పితా మే మిథిలాధిపః,
రామ! జామాతరం ప్రాప్య స్త్రియం పురుషవిగ్రహామ్. ౩

అనృతం బత లోకోఽయ మజ్ఞానా ద్యద్ధి వక్ష్యతి,
తేజో నా_స్తి పరం రామే తపతీవ దివాకరే. ౪

కిం హి కృత్వా విషణ్ణ_స్త్వం కుతో వా భయ మ_స్తి తే,
య త్పరిత్య_క్తుకామ _స్త్వం మా మనన్యపరాయణామ్. ౫

ద్యుమత్సేనసుతం వీర! సత్యవ_న్త మనువ్రతామ్,
సావిత్రీ మివ మాం విద్ధి త్వ మాత్మవశవ_ర్తినీమ్. ౬

నత్వహం మనసాఽప్యన్యం ద్రష్టాఽస్మి త్వదృతేఽనఘ!,
త్వయా రాఘవ! గచ్ఛేయం యథాఽన్యా కులపాంసినీ. ౭

స్వయం తు భార్యాం కౌమారీం చిర మధ్యుషితాం సతీమ్,
శైలూష ఇవ మాం రామ! పరేభ్యో దాతు మిచ్ఛసి. ౮

ఆసీతాదేవి యిట్లు పరమదుఃఖంబు నొంచియున్నది కావున విశాలమగు ఱొమ్ముగలిగి శూరుఁడైన రాముఁజూచి స్నేహంబున మిక్కిలియుఁ గోపంబు నొంది యిట్లని తిరస్కారముగాఁ బలికెను. ౨

రాముఁడా! నాతండ్రి జనకమహారాజు స్వభావంబున స్త్రీని పురుషాకారంబు గలవాఁడవగు నిన్ను అల్లునిఁగాఁ బొందినాఁడే, నీకు నన్నిచ్చినప్పుడు అతనికి నీయథార్థస్వరూపము తెలియదు కాఁబోలు; తెలిసియుండినచో నీకు నన్నిచ్చియుండఁడు. ౩

ప్రకాశించుచుండు సూర్యునియందుండునట్లు రామునియం దెంతమాత్రము తేజస్సు లేదు; ఈజనులు రామునందు సూర్యునందుంబోలె నధికమయిన తేజం బున్నదని చెప్పుచున్నారే యని యందువేమొ? వార లజ్ఞానంబున నట్లు చెప్పుచున్నారుగాని వేఱుగాదు; అది సత్యమగుచో సూర్యునందుఁ బోలె రామునందును దేజంబగపడుఁగాక; అట్లు గనుపడకుండుటం జేసి యది యబద్ధమే. ౪

నీవు మనంబున నేమియుంచుకొని యిట్లు దుఃఖమునొందియున్నావు? మఱియు మహాపరాక్రమశాలివగు నీకు దేనివలన భయమున్నది? నీవు తప్ప వేఱెగతి లేకుండు నన్నేల విడువఁగోరుచున్నావు. ౫

పరాక్రమశాలివగురాముఁడా! సావిత్రీదేవి తన పెనిమిటియగు ద్యుమత్సేనునికొడుకును సత్యవంతు ననుసరించుచు నతని విడువకున్నట్లు నేను నీయధీనురాలనై నిన్ను విడువకుండుదాననని యెఱుంగుము. ౬

అనఘుఁడవగురాముఁడా! అట్లుగాక దానుబుట్టినకులమును జెఱుపునట్టి దుష్టస్త్రీయుంబోలె నేనెప్పటికైనను మనంబుననైనను నీవుదక్క నితర పురుషుఁ జూచుదానను గాను; కావున నీతోడ వనంబునకు వత్తును గాని నిన్ను విడిచి యుండఁజాలను. ౭

రాముఁడా! నీవు నూతనయౌవనంబునొంది యున్నదానను, బహుకాలము సహవాసంబునొందినదానను, బతివ్రతను, భార్యనగునన్ను తనభార్య నితరపురుషులకిచ్చి జీవించువానియట్లు నీవైయే యితరుల కియ్యఁగోరినావు.

యస్య పథ్యం చ రామాఽత్థ యస్య చార్థేఽవరుధ్యసే,
త్వం తస్య భవ వశ్యశ్చ విధేయ శ్చ సదాఽనఘ!. ౯

స మా మనాదాయ వనం న త్వం ప్రస్థాతు మర్హసి,

తపో వా యదివాఽరణ్యం స్వర్గో వా స్యా త్సహ త్వయా.

నచ మే భవితా తత్ర కశ్చి త్పథి పరిశ్రమః,
పృష్ఠత స్తవ గచ్ఛన్త్యా విహారశయనేష్వివ. ౧౧

కుశకాశశరేషీకా యే చ కంటకినో ద్రుమాః,
తూలాజినసమస్పర్శా మార్గే మమ సహ త్వయా. ౧౨

మహావాతసముద్ధూతం య న్మా మపకరిష్యతి,
రజో రమణ! త న్మన్యే పరార్థ్య మివ చన్దనమ్. ౧౩

శాద్వలేషు యథా శిశ్యే వనాన్తే వనగోచర!,
కుథాస్తరణతల్పేషు కిం స్యా త్సుఖతరం తతః. ౧౪

పత్రం మూలం ఫలం య త్త్వ మల్పం వా యదివా బహు,
దాస్యసి స్వయ మాహృత్య తన్మేఽమృతరసోపమమ్. ౧౫

అనఘుఁడవగురాముఁడా! నీవిప్పు డెవ్వరికి హితముసేయుమని చెప్పు
చున్నావో మఱియు నెవ్వరినిమిత్తమయి నన్ను వనంబునకు రావలదని చెప్పు
చున్నావో అట్టికౌసల్య దశరథుఁడు మున్నగుగురుజనులకు నీవు ఎల్లప్పుడును
వశ్యుఁడవై వారలు చెప్పుపనులు సేయుచుండుము; నేనో నిన్ననుసరించెదను.

ఇట్లు సమస్తనీతులును దెలిసిననీవు, నన్నిచ్చటవిడిచి వనంబునకుఁ
బోఁగూడదు.

తపస్సు సేయుటగాని, యడవిలో నుండుట గాని, స్వర్గంబులో నుండుట
గాని నాకు నీతోఁగూడ కావలయును కాని వేఱులేదు. ౧౦

నేను నీవెనుక వచ్చుచుండఁగా నెట్టికష్టమార్గములందైనను నాకు
ఉద్యానంబులం దిరుగునప్పుడును బరుండియుండునప్పుడును సుఖముగానుండు
నట్లు సుఖముగానేయుండును గాని ఎంతమాత్రము నలసటగలుగదు. ౧౧

దారిలో నున్న దర్భమొక్కలను ఱెల్లును ముండ్లదుబ్బులును మఱియు
ముండ్లవృక్షంబు లేవియున్నవో యవియన్నియును, నీసమీపంబున నుండు
నప్పుడు నాకు దూదియు జింకతోలు మొదలగుతోళ్లనుబోలెఁ దాఁకుటకు
సుఖముగానే యుండును. ౧౨

ప్రియుఁడవగు రాముఁడా! అడవిలోఁ బెద్దగాలికిఁ బైకెగిరి నాదే
హంబంతయు నంటుకొనుదుమ్మును గస్తూరిమొదలగునవి గలసిన శ్రేష్ఠంబగు
సుగంధంబుగాఁ దలంచెదను. ౧౩

వనవాసంబుసేయుంరాముఁడా! నాకు వనమధ్యంబున లేఁతపచ్చికలు
మొలిచియుండునేలపై నీతోఁగూడఁ బరుండుటకన్న నీచిత్రకంబళముల
తోను బైఁబఱచెడువస్త్రములతో నుంగూడిన పాన్పులం దిచ్చట బరుండుటచే
నెంతమాత్రము నెచ్చుగా సుఖంబుగలుగదు. ౧౪

వనంబున నీవు పత్రముగాని గడ్డగాని పండుగాని కొంచెముగాఁగాని
యెచ్చుగాఁగాని దేని నీచేతులారఁ దెచ్చియిత్తువో అది నాకమృతమువంటిది.

న మాతు ర్న పితు స్తత్ర స్మరిష్యామి న వేశ్మనః,
ఆ ర్తవాన్యుపభుఞ్జానా పుష్పాణి చ ఫలాని చ. ౧౭

న చ తత్ర గతః కించి ద్ద్రష్టు మర్హసి విప్రియమ్,
మత్కృతే న చ తే శోకో న భవిష్యామి దుర్భరా. ౧౮

య స్త్వయా సహ స స్వర్గో నిరయో య స్త్వయా వినా,
ఇతి జాన న్పరాం ప్రీతిం గచ్ఛ రామ! మయా సహ. ౧౯

అథ మా మేవ మవ్యగ్రాం వనం నైవ నయిష్యసి,
విష మద్యైవ పాస్యామి మావిశం ద్విషతాం వశమ్. ౧౯

పశ్చా దపి హి దుఃఖేన మమ నై వా స్తి జీవితమ్,
ఉజ్ఝితాయా స్త్వయా నాథ! త దైవ మరణం వరమ్. ౨౦

ఇమం హి సహితుం శోకం ముహూ ర్త మపి నోత్సహే,
కిం పున ర్దశ వర్షాణి త్రీణి చైకం చ దుఃఖితా. ౨౧

ఇతి సా శోకసంతప్తా విలప్య కరుణం బహు,
చుక్రోశ పతి మాయస్తా భృశ మాలిఙ్గ్య సస్వరమ్. ౨౨

సా విద్ధా బహుభి ర్వాక్యై ర్దిగ్ధై రివ గజాంగనా,

నేను వనంబున నయ్యైఋతువులం గలుగుపుష్పంబులను ధరించి ఫలంబులం దినుచు సుఖముగా నాతల్లినిగాని, నాతండ్రినిగాని, యింటినిగాని యెంతమాత్రమును స్మరింపకుండెదను. ౧౬

నీవు నన్నుఁ దోడ్కొని యడవికింబోయినవెనుక నీకెంతమాత్ర మచ్చట నానిమిత్తమయి కష్టముగాని దుఃఖముగాని గలుగదు; కావున నన్నుఁగాపాడుట కేమియుఁ గష్టములేదు. ౧౭

రాముఁడా! నాకు నీతోఁగూడ నుండుటయే స్వర్గము; నీవు లేకుండుటయె నరకము; ఇది నామతము; నాకు నీయందుండు ప్రీతి యిట్టిదనియెఱింగి నన్నుఁ దోడ్కొని యడవికింబొమ్ము; ఇచ్చట విడువవలదు. ౧౮

నే నింతదూరము చెప్పినను, నామాటవినక యిట్లు నిన్ననుసరించుటయందు దృఢనిశ్చయముగల నన్నుఁ దోడ్కొనకయే వనంబునకుఁబోదువేని నే నెంతమాత్రము శత్రువులగు భరతాదులవశంబున నుండఁజాలను; ఇప్పుడు నీయెదుటనే విషంబుద్రావి ప్రాణంబులు విడిచెదను. ౧౯

పెనిమిటివగురాముఁడా! ఒకవేళ నేనిప్పుడు చావకున్నను, నీవు నన్ను విడిచిపోయినపిమ్మటనైనను దుఃఖంబునఁ జావవలసినదాననే; కావున నట్లు దుఃఖంబు నొందుటకుమునుపే నీవు నన్నువిడిచిపోవునప్పుడే ప్రాణంబు విడుచుట మంచిది. ౨౦

నిన్ను విడిచియుండి యేదుఃఖమును ముహూర్తకాలమయినను సహింపఁజాలను; అట్లుండఁగా మొదటసంవత్సరములు పది, అపిమ్మట మూఁడు, నటుపిమ్మట నొక్కసంవత్సరమును ఇట్లు పదునాలుగుసంవత్సరములు సహింపఁజాలనని చెప్పనేల? అని సీత రామునితోఁ జెప్పినది. ౨౧

సీతాదేవి మహాదుఃఖంబున నాయాసంబునొంది యిట్లు వినువారలకును దుఃఖముగల్గునట్లు విలపించి, యంతఁ బెనిమిటియగు రాముని దృఢంబుగాఁ గవుఁగిలించుకొని గట్టిగా నేడ్చెను. ౨౨

సీతాదేవి, రాముఁడుచెప్పిన కర్ణకఠోరంబులగు నామాటలకు విషంబు

చిరసన్నియతం బాష్పం ముమోచాగ్నిమి వారణిః. ౨౩

తస్యా స్స్ఫటికసంకాశం వారి సన్తాపసమ్భవమ్,
నేత్రాభ్యాం పరిసుస్రావ పంకజాభ్యా మివోదకమ్. ౨౪

తచ్చైవామలచన్ద్రాభం ముఖ మాయతలోచనమ్,
పర్యశుష్యత బాష్పేణ జలోద్ధృత మివామ్బుజమ్. ౨౫

తాం పరిష్వజ్య బాహుభ్యాం విసంజ్ఞా మివ దుఃఖితామ్,
ఉవాచ వచనం రామః పరివిశ్వాసయం స్తదా. ౨౬

న దేవి! తవ దుఃఖేన స్వర్గమప్యభిరోచయే,

నహి మేఽస్తి భయం కించి త్స్వయంభో రివ సర్వతః. ౨౭

తవ సర్వ మభిప్రాయ మవిజ్ఞాయ శుభాననే!,
వాసం న రోచయేఽరణ్యే శక్తిమా నపి రక్షణే. ౨౮

య త్సృష్టాఽసి మయా సార్ధం వనవాసాయ మైథిలి,
న విహాతుం మయా శక్యా కీర్తి రాత్మవతా యథా. ౨౯

పూసినబాణంబుల ప్రేటున కాఁడేనుంగుఁబోలె ఖిన్నయయి యరణిచక్కఁగా మథింపఁబడి బహుకాలముగాఁ దనలో నడంగియున్నయగ్నిం గ్రక్కునట్లు అమంగళశంకచే బహుకాలముగా నడంచికొనియుండిన కన్నీళ్లను విడిచెను. ౨౩

అప్పుడాసీతాదేవికండ్లనుండి ధారగాఁ గాఱుచుండుటచేఁ గాటుకంతయుఁ బోయినందున స్ఫటికమువలె స్వచ్ఛముగానుండు కన్నీరు తడుపఁబడిన కమలంబులనుండి నీళ్లు కాఱునట్లు కాఱుచుండెను. ౨౪

స్వచ్ఛమగుచంద్రబింబంబుంబోలెఁ జూడనగుచుఁ బెద్దకండ్లతో నొప్పుచున్న సీతాదేవిముఖంబు గన్నీరు గ్రమ్మియుంటంజేసి జలంబునుండి వెలుపలికిఁదీయఁబడినకమలంబు లెండ తాఁకుడుకు వాడునట్లు వాడియుండినది.

అప్పుడు రాముఁడు పరమదుఃఖంబున మూర్ఛవోయినట్లు నేలంబడి యున్నసీతాదేవిని బాహువులం గవుఁగిలించుకొని మంచిమాటలం దేర్చుచు నిట్లని చెప్పెను. ౨౫

సీతా ! నీకు దుఃఖముగలుగునట్టయిన నాకు స్వర్గము ప్రాప్తించినను దానింగూడ సరకుసేయను.

సమస్తజంతుజాలమును బుట్టించుటకును వానినుదుట నాయుఃపరిమాణంబును భాగ్యంబును వ్రాయుటకును దుడుచుటకును గర్తయయిన బ్రహ్మదేవున కెందును భయము లేనట్లు నాకు దేనివలనను భయములేదు. ౨౬

సుందరంబగు ముఖముగల దానవగుసీతా ! నేను నిన్నడవిలోఁ గాపాడుటకు శక్తుండనైనను నీమనసునందలి యభిప్రాయము నాకుఁ దెలియకుండినది కావున నింతవఱకు నీవు నాతోఁగూడ వనంబునకు వచ్చుటకుసమ్మతింపకుంటిని. ౨౭

సీతా ! నీవిట్లు అన్నివిధంబులను నాతోడఁగూడ వనములో నుండవలయునని దృఢముగా నిశ్చయించియున్నావు; కావున నెట్టికష్టమునందైనను ధైర్యంబు విడువనివాఁడు కీర్తిని విడువఁజాలనట్లు నేను నిన్నింకవిడువఁజాలను. ౨౮

ధర్మ స్తు గజనాసోరు! సద్భి రాచరితః పురా,
తం చాహ మనువ ర్తేఽద్య యథాసూర్యం సువర్చలా. 30

న ఖ ల్వహం న గచ్ఛేయం వనం జనకనన్దిని!,
వచనం త న్నయతి మాం పితు స్సత్యోపబృంహితమ్. 31

ఏష ధర్మస్తు సుశ్రోణి! పితు ర్మాతు శ్చ వశ్యతా,
అత శ్చ తం వ్యతిక్రమ్య నాహం జీవితు ముత్సహే. 32

అస్వాధీనం కథం దైవం ప్రకారై రభిరాధ్యతే,
స్వాధీనం సమతిక్రమ్య మాతరం పితరం గురుమ్. 33

యత్త్రయం తత్త్రయో లోకాః పవిత్రం తత్సమం భువి,
నాన్య దస్తి శుభాపాఙ్గే! తేనేద మభిరాధ్యతే. 34

న సత్యం దానమానౌ వా న యజ్ఞా శ్చాప్తదక్షిణాః,
తథా బలకరా స్సీతే! యథా సేవా పితు ర్హితా. 35

స్వర్గో ధనం వా ధాన్యం వా విద్యాః పుత్రా స్సుఖాని చ,
గురువృత్త్యనురోధేన న కించి దపి దుర్లభమ్, 36

ఏనుఁగుతొండమువంటి తొడలుగలదానవగుసీతా! భార్య పెనిమిటి యెచ్చటికిఁబోయినను, అచ్చటికిఁ దానతని వెంబడింపవలయునను నీవుచెప్పిన ధర్మమును ముందు పెద్ద లాచరించినవేగాని నేఁడుగాదు; సువర్చల సూర్యు ననుసరించియుండలేదా? అట్లు కావున నీవును నాతోఁగూడ వనంబునకు రమ్ము. నే నాధర్మంబు ననుసరించి నిన్ను వనంబునకుఁ దోడ్కొనిపోయెదను. ౩౦

సీతా! నేను పితృవాక్యప్రకారముచేసెదనని కైకేయికిఁ జెప్పినసత్యమును, తండ్రియాజ్ఞయును నన్నువనంబున కీడ్చుకొనిపోవుచున్నవి; కావున నే నెంతమాత్రము నిలువను; అవశ్యము వనమునకుఁ బోవుదును. ౩౧

మంచిపిఱుఁదులుగలసీతా! తండ్రికిని దల్లికిని విధేయుఁడుగానుండుట కన్న యధికమయినధర్మము మఱియొకటిలేదు; ఇందువలన అట్టిధర్మమును విడిచి బ్రతికియుండుట నాకిష్టముగాదు. ౩౨

తనకాజ్ఞాదులుచేసి తాను జేసినసత్కార్యముల కప్పుడే సంతోషంబు నొందునట్టి తల్లి, తండ్రి, గురువు ఈదైవమును విడిచి మనకండ్లకగపడక కోపసంతోషాదులు మనకుఁ దెలుప నవకాశములేకుండు దైవంబు నెట్లు లారాధింపవచ్చును. ౩౩

సుందరములయిన కడకండ్లుగల సీతా! తల్లియుఁ, దండ్రియు, గురువును ఈముగ్గురె ముల్లోకంబులును, వీరల నారాధించినచో ముల్లోకంబులను జయింపవచ్చును; వీరలతో సమానమయిన మఱియొకదైవ మెచ్చటనులేదు; అందుచేతనే నేను వారలనే యారాధించుచున్నాను. ౩౪

సీతా! పితృశుశ్రూష పరలోకమునకు బలముగల్గించి మేలుసేయునట్లు సత్యముగాని, దానమానములుగాని, సరియయినదక్షిణలతోఁగూడిన యాగములుగాని, పరలోకమునకు బలముగల్గింపవు. ౩౫

స్వర్గముగాని, ధనముగాని, ధాన్యముగాని, విద్యలుగాని, మఱియేదిగాని పితృశుశ్రూషసేయుచుండినచో నన్నియు సిద్ధించును; పితృశుశ్రూషకు సాధ్యముకాని దేదియులేదు. ౩౬

దేవగన్ధర్వగోలోకా న్బ్రహ్మలోకాం స్తథాఽపరాన్,
ప్రాప్నువన్తి మహాత్మానో మాతాపితృపరాయణాః. ౩౭

స మాం పితా యథా శాస్తి సత్యధర్మపథే స్థితః,
తథా వర్తితు మిచ్ఛామి స హి ధర్మ స్సనాతనః. ౩౮

మమ సన్నా మతి స్సీతే! త్వాం నేతుం దణ్డకావనమ్,
వసిష్యామీతి సా త్వం మా మనుయాతుం సునిశ్చితా. ౩౯

సా హి సృష్టాఽనవద్యాఙ్గి! వనాయ మదిరేక్షణే!,
అనుగచ్ఛస్వ మాం భీరు! సహధర్మచరీ భవ. ౪౦

సర్వథా సదృశం సీతే! మమ స్వస్య కులస్య చ,
వ్యవసాయ మతుక్రాన్తా కాన్తే! త్వ మతిశోభనమ్. ౪౧

ఆరభస్వ శుభశ్రోణి! వనవాసక్షమాః క్రియాః,
నేదానీం త్వదృతే సీతే! స్వర్గోఽపి మమ రోచతే. ౪౨

బ్రాహ్మణేభ్యశ్చ రత్నాని భిక్షుకేభ్య శ్చ భోజనమ్,
దేహి చాశంసమానేభ్య స్సంత్వరస్వ చ మాచిరమ్. ౪౩

భూషణాని మహార్హాణి వరవస్త్రాణి యాని చ,
రమణీయా శ్చ యే కేచి త్క్రీడార్థా శ్చా ప్యుపస్కరాః. ౪౪

తలిదండ్రులకు విడువక శుశ్రూష సేయుచుండుమహాత్ములు, దేవలో
కమును, గంధర్వలోకమును, గోలోకమును, ఇతరలోకములనుం బొంది అట్టిక్ర
మంగా బ్రహ్మలోకంబు నొందుదురు. ౩

అట్టినాతండ్రి సత్యమును ధర్మము నవలంబించి నన్నేమి యాజ్ఞాపిం
చున్నాఁడో, నే నాప్రకారము నడుచుకొనఁగోరుచున్నాను. అట్టితండ్రి
యాజ్ఞ ననువర్తించుట సనాతనంబగు ధర్మము. ౩

సీతా! నా కింతకుమున్ను నిన్ను దండకారణ్యమునకుఁ గొనిపోవఁద
గని తోఁచలేదు; అయితే నీవు పతివ్రతవుగావున "నేనును వనములో
యుండెదను" అని నాతో నడవికివచ్చుటకు నిశ్చయించుకొన్నావు. ఇప్పు
నీభావము తెలిసినదిగావున నిన్నుఁ దోడ్కొనిపోయెదను. ౩

మదముగప్పిన కండ్లుగలసీతా! నీవు వనంబులోనుండుటకై యే యుఁ
యతిసుందరములయిన సుకుమారావయవంబులలోఁ బుట్టియున్నావు కాఁబోలు
నీవు భయపడుస్వభావంబు గలదానవయ్యును నాతోఁగూడ రమ్ము; నీకేభయ
మునుగలుగదు; నాతోడ నచ్చుట నే ధర్మము నాచరించుచుండుము. ౪

మనోహరంబగు రూపంబుగల సీతా! నీకిప్పుడు, భర్త ననుసరించవ
నను నీప్రయత్నముగలిగియున్నదే; ఇది నీకులంబునకు నాకులంబునకును ఁ
నది; మిక్కిలియు మంచిది. ౪

సుందరములయిన పిఱుఁదులుగలసీతా! నీవింక వనవాసంబునకు
గావలసినకార్యంబులం జేయుము; ఇఁక నీవులేకున్న నాకు స్వర్గమయిన
ఇష్టముగాదు. ౪

బ్రాహ్మణులకు నానావిధమణులను భిక్షుకులకు యథేష్టముగా భో
నమునొసంగుము; మఱియు నెవ్వరెవ్వరు దేని యాచింతురో దానినంతయు
వారలకిమ్ము; జాగుసేయకుము; త్వరపడుము. ౪

అట్లు బ్రాహ్మణులకు దానముచేసినపిమ్మట, వెలగలసొమ్ములు నుత్తమము
లైనవస్త్రములును సుందరములును గ్రీడింప నుపయోగించునవియునగు న

శయనీయాని యానాని మమ చాన్యాని యాని చ,
దేహి స్వభృత్యవర్గస్య బ్రాహ్మణానా మనన్తరమ్. ४४

అనుకూలం తు సా భర్తు ర్జ్ఞాత్వా గమన మాత్మనః,
క్షిప్రం ప్రముదితా దేవీ దాతు మే వోపచక్రమే. ४८

తతః ప్రహృష్టా ప్రతిపూర్ణ మానసా
యశస్వినీ భర్తు రవేక్ష్య భాషితమ్,
ధనాని రత్నాని చ దాతు మఙ్గనా
ప్రచక్రమే ధర్మభృతాం మనస్వినీ. ४૨

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే త్రింశస్సర్గః

## ఏకత్రింశస్సర్గః

ఏవం శ్రుత్వా తు సంవాదం లక్ష్మణః పూర్వ మాగతః,
బాష్పపర్యాకులముఖ శ్శోకం సోఢు మశక్నువన్. ೧
స భ్రాతు శ్చరణౌ గాఢం నిపీడ్య రఘునన్దనః,
సీతా మువాచాతియశా రాఘవం చ మహావ్రతమ్. ೨

యది గన్తుం కృతా బుద్ధి ర్వనం మృగగజాయుతమ్,
అహం త్వాఽనుగమిష్యామి వన మగ్రే ధనుర్ధరః. 3

మయా సమేతోఽరణ్యాని బహూని విచరిష్యసి,
పక్షిభి ర్మృగ యూథై శ్చ సంఘుష్టాని సమన్తతః. ४

కరణములును బొన్నులును యానములును నావిగాని నీవిగాని యే వేవి యున్నవో వానినన్నిటిని మనభృత్యులకిమ్ము. అని రాముఁడు సీతతోఁ జెప్పెను. ౪౪౪౫

సీతాదేవి, తా నరణ్యమునకు వచ్చుటకుఁ దన పెనిమిటి సమ్మతించుటను దెలిసికొన్నయంతనే మహాసంతోషంబునొంది, శీఘ్రముగాఁ బెనిమిటిచెప్పినట్లు దానములుసేయ నారంభించెను. ౪౬

అంత మహాకీర్తిగలదియు మంచిమనస్సుగలదియునగు నాసీతాదేవి, రాముఁడుచెప్పినమాటను విని మహాసంతోషంబునొంది మనంబున వేఱుయోచన సేయక ధార్మికులగువారలకు ధనంబులను రత్నంబులను యథేష్టంబుగా నొసంగ నారంభించెను. ౪౭

ఇది ముప్పదియవసర్గము.

---

## ముప్పదొకటవసర్గము

అచ్చటికి రామునితోఁగూడవచ్చియున్న మహాకీర్తిశాలియగులక్ష్మణుఁడు అంతవఱకు సీతకును రామునకును జరిగినసంవాదమును విని "తనదేహములో నర్థమయినసీత వచ్చుటకును బహుకష్టంబున రాముఁ డొప్పుకొన్నాఁడే ఇఁక నాకేమిచెప్పునో" అని భయపడి కండ్లునిండ నీళ్లు గాఱఁగా దుఃఖంబుఁబట్టఁజాలక అన్నగారిపాదంబులను గట్టిగాఁ బట్టుకొని సీతను రామునింజూచి యిట్లని చెప్పెను. ౧,౨

మృగములు నేనుఁగులు వ్యాపించియుండువనంబునకుఁ బోవలసినదే యని నిర్ణయింతువేని, నేను నీకు ముందు ధనుర్ధరుఁడనై నిన్ను వెంబడించి వచ్చెదను. ౩

నీవు నాచే సేవింపఁబడుచుఁ బక్షులును మృగసమూహములును ధ్వనింపఁగా మనోహరంబులయియుండు పెక్కడవులం దిరుగఁగలవు. ౪

న దేవలోకాక్రమణం నామరత్వ మహం వృణే,
ఐశ్వర్యం వాపి లోకానాం కామయే న త్వయా వినా. ౫

ఏవం బ్రువాణ స్సౌమిత్రి ర్వనవాసాయ నిశ్చితః,
రామేణ బహుభి స్సాన్త్వై ర్నిషిద్ధః పున రబ్రవీత్. ౬

అనుజ్ఞాత శ్చ భవతా పూర్వ మేవ య దస్మ్యహమ్,
కి మిదానీం పున రిదం క్రియతే మన్ని వారణమ్. ౭

యదర్థం ప్రతిషేధో మే క్రియతే గన్తు మిచ్ఛతః,
ఏత దిచ్ఛామి విజ్ఞాతుం సంశయో హి మమానఘ!. ౮

తతోఽబ్రవీ న్మహాతేజా రామో లక్ష్మణ మగ్రతః,
స్థితం ప్రాగ్గామినం వీరం యాచమానం కృతాఞ్జలిమ్. ౯

స్నిగ్ధో ధర్మరతో వీర స్సతతం సత్పథే స్థితః,
ప్రియః ప్రాణసమో వశ్యో భ్రాతా చాపి సఖా చ మే. ౧౦

మయాఽద్య సహ సౌమిత్రే! త్వయి గచ్ఛతి తద్వనమ్,
కో భరిష్యతి కౌసల్యాం సుమిత్రాం వా యశస్వినీమ్. ౧౧

అభివర్షతి కామై ర్యః పర్జన్యః పృథివీ మివ,

నీవు లేనిచో, నాకు దేవలోకముగాని, దేవత్వముగాని, సమస్తలోకములను బ్రభుత్వముగాని యేమియుం నక్కఱలేదు. అని లక్ష్మణుండు రామునితోఁ జెప్పెను. ౫

లక్ష్మణుండు తానును రామునివెంట వనంబునకుంబోవ నిశ్చయించి యీప్రకారము చెప్పి, రాముండు మంచిమాటలతో వలదనిచెప్పఁగా మఱల రామునితో నిట్లని చెప్పెను. ౬

నీవు మునుపే నేను వనంబునకు నీతో వచ్చుట కనుజ్ఞయిచ్చియే యున్నావు; అట్లుండఁగా మఱల నన్ను వనంబునకు రావలదని చెప్పుచున్నావే! ఇదియేమి? ౭

పాపములేనిరాముండా! నేను నీతో వనంబునకు వచ్చుట కిచ్ఛించియుండఁగా నన్ను రావలదని చెప్పుచున్నావే; ఇదియేల? దీనికిఁ గారణము నాకుఁ జెప్పవలయును; నాకు సంశయముగల్గియున్నది. అని లక్ష్మణుండు రామునితోఁ జెప్పెను. ౮

అంత మహాపరాక్రమశాలియగు రాముండు తనముందటఁ జేతులు మొగుడ్చుకొని "నేనును వనంబునకువచ్చెదను దీసికొనిపొమ్మని" ప్రార్థించుచు నిలుచున్నవాని, ఎట్టికష్టమునందును ఎంతమాత్రమును వెనుకకుఁ దిరుగనట్టి పరాక్రమవంతుని లక్ష్మణునిఁజూచి యిట్లనిచెప్పెను. ౯

నీవు మంచిమనసుగలవాఁడవు ధార్మికుఁడవు పరాక్రమశాలివి ఎల్లప్పుడును సన్మార్గమునందే ప్రవర్తించువాఁడవు; మఱియు నాకుఁ బ్రియుఁడవు ప్రాణసముఁడవు వశ్యుఁడవు తమ్ముఁడవు స్నేహితుఁడవును గావున నీవు నాతోఁ గూడ వత్తువేని నాకేమో సౌఖ్యమే; అందుకు సందేహము లేదు. ౧౦

లక్ష్మణుండా! ఇప్పుడు నీవు నాతో నడవికివత్తువేని యటుపిమ్మట కౌసల్యను సుమిత్రను వీరల నిర్వుర నెవ్వరు విచారింతురు? అట్లుగావున వారలపోషణమునకై నిన్ను రావలదని చెప్పినాను. ౧౧

భూమిమీఁదఁ బర్జన్యుఁడువర్షించునట్లు తనవారలకోర్కెలన్నియుఁ

స కామపాశపర్యస్తో మహాతేజా మహీపతిః. ౧౨

సా హి రాజ్య మిదం ప్రాప్య నృప స్యాశ్వపతే స్సుతా,
దుఃఖితానాం సపత్నీనాం న కరిష్యతి శోభనమ్. ౧౩

న స్మరిష్యతి కౌసల్యాం సుమిత్రాం చ సుదుఃఖితామ్,
భరతో రాజ్య మాసాద్య కైకేయ్యాం పర్యవస్థితః. ౧౪

తా మార్యాం స్వయ మేవేహ రాజానుగ్రహణేన వా,
సౌమిత్రే! భర కౌసల్యా ముక్త మర్థ మిమం చర. ౧౫

ఏవం మమ చ తే భక్తి ర్భవిష్యతి సుదర్శితా,
ధర్మజ్ఞ! గురుపూజాయాం ధర్మశ్చా ప్యతులో మహాన్. ౧౬

ఏవం కురుష్వ సౌమిత్రే! మత్కృతే రఘునన్దన!.
అస్మాభి ర్విప్రహీణాయా మాతు ర్నో న భవే త్సుఖమ్. ౧౭

ఏవ ముక్తస్తు రామేణ లక్ష్మణ శ్శ్లక్ష్ణయా గిరా,
ప్రత్యువాచ తదా రామం వాక్యజ్ఞో వాక్యకోవిదమ్. ౧౮

త వైవ తేజసా వీర! భరతః పూజయిష్యతి,
కౌసల్యాం చ సుమిత్రాం చ ప్రయతో నాత్ర సంశయః. ౧౯

కౌసల్యా బిభృయా దార్యా సహస్ర మపి మద్విధాన్,

దీర్చునట్టిపరాక్రమశాలి దశరథమహారాజు ఇప్పుడిట్లు కైకేయికిలోఁబడి కామపాశంబులోఁ జిక్కుకొనియున్నాఁడు. ౧౨

అశ్వపతియగు కేకయరాజు కొమార్తెయయిన యీ కైకేయి యీ రాజ్యమునంతయుఁ బొంది యటుమీఁద దుఃఖితలయిన తనసవతుల కెంతమాత్రమును మంచి సేయదు. ౧౩

భరతుఁడును దొరతనమునొంది రాజ్యగర్వంబునను కైకేయిమతంబునం దుండవలసినవాఁడగుటవలనను దుఃఖితలయిన కౌసల్యాసుమిత్రల నెంతమాత్రము తలంపఁడు. ౧౪

లక్ష్మణుఁడా! నీవిచ్చట నేయుండి దశరథునియనుగ్రహంబు సంపాదించికాని, లేక నీవైయేగాని. పూజ్యులగు నాకౌసల్యాసుమిత్రలం బోషింపుచుండుము; బదులుచెప్పక చెప్పినట్లు సేయుము ౧౫

లక్ష్మణుఁడా! నీవు సమస్తధర్మంబుల నెఱింగినవాఁడవు; నీ వీప్రకారము సేయుందువేని నీకు నాయందుఁగలభక్తినిఁజూపినట్లగును. మఱియుం మాతృపూజవలన సదృశమయిన ధర్మమునుఁ బొందుదువు. ౧౬

లక్ష్మణుఁడా! నీధార్మికత్వముఁజూచి మనవంశమునఁ బుట్టినవారలందఱు సంతసింతురు; నాకుఁగా నేను జెప్పినట్లు సేయుము; మనము లేకున్నచో మనతల్లి కెంతమాత్రము సుఖము గలుగదు. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౧౭

అంతఁ జక్కఁగా మాటలాడఁగలిగిన లక్ష్మణుఁడు ఈప్రకారము రాముఁడు మధురవచనంబునం జెప్పినమాటలనువిని, యంత మాటలాడుటలోఁ బండితుఁడగు రామునిఁజూచి యిట్లని బదులుచెప్పెను. ౧౮

రాముఁడా! నీవు మహాపరాక్రమశాలివి; నీపరాక్రమంబునకే భయపడి భరతుఁడు కౌసల్యను సుమిత్రను శ్రద్ధతోఁ జక్కఁగా బూజింపుచుండును; ఇందుకు సందేహము లేదు. ౧౯

మఱియుఁ గౌసల్యను మఱియొకరు పోషింపవలయునా? ఆబిద

యస్యా స్సహస్రం గ్రామాణాం సమ్ప్రాప్త ముపజీవనమ్. ౨౦

తదాత్మభరణే చైవ మమ మాతు స్తథైవ చ,
పర్యాప్తా మద్విధానాం చ భరణాయ యశస్వినీ. ౨౧
కురుష్వ మామనుచరం వైధర్మ్యం నేహ విద్యతే,
కృతార్థోఽహం భవిష్యామి తవ చార్థః ప్రకల్పతే. ౨౨

ధను రాదాయ సశరం ఖనిత్ర పిటకాధరః,
అగ్రత స్తే గమిష్యామి పన్థాన మనుదర్శయన్. ౨౩
ఆహరిష్యామి తే నిత్యం మూలాని చ ఫలానిచ,
వన్యాని యాని చాన్యాని స్వాహారాణి తపస్వినామ్. ౨౪
భవాం స్తు సహ వైదేహ్యా గిరిసానుషు రంస్యతే,
అహం సర్వం కరిష్యామి జాగ్రత స్స్వపత శ్చతే. ౨౫

రామ స్త్వనేన వాక్యేన సుప్రీతః ప్రత్యువాచ తమ్,

వ్రజాఽపృచ్ఛస్వ సౌమిత్రే! సర్వమేవ సుహృజ్జనమ్. ౨౬

యే చ రాజ్ఞో దదౌ దివ్యే మహాత్మా వరుణ స్స్వయమ్,
జనకస్య మహాయజ్ఞే ధనుషీ రౌద్రదర్శనే. ౨౭
అభేద్యకవచే దివ్యే తూణీ చాక్షయసాయకౌ,
ఆదిత్యవిమలౌ చోభౌ ఖడ్గౌ హేమపరిష్కృతౌ. ౨౮
సత్కృత్య నిహితం సర్వ మేత దాచార్యసద్మని,
స త్వ మాయుధ మాదాయ క్షిప్ర మావ్రజ లక్ష్మణ!, ౨౯

ప్రసాదంబునం జేసి ఆబిడ నాశ్రయించినవారలు వేనవేలుగా గ్రామంబుల నొందినారు; ఆబిడ నావంటివారల వేయిమందినైనం గాపాడఁగలదు. ౨౦

అట్లగుటం జేసి మహాకీర్తిశాలిని యగు నాకౌసల్యాదేవి తన్నును నాతల్లిసుమిత్రను నావంటివారల ననేకులను బోషించుకొనఁగలదు. ౨౧

నన్ను సేవకునిఁగాఁ జేసికొనుము; ఇట్లుచేయుటవలన నధర్మము గలుగదు; దీనిచే నేనును గృతార్థుఁడ నయ్యెదను; నీకును నేను జేయుశుశ్రూషలవలనఁ గొంత ప్రయోజనముగలుగును. ౨౨

నేను ధనుర్బాణంబులఁ దాల్చి గుద్దలిని బిన్నగంపనుఁ దీసికొని నీకు ముందుగా మార్గంబుఁ జూపుచుఁ బోయెదను. ౨౩

నేను నీకెల్లప్పుడును గడ్డలను ఫలంబులను మఱియుఁ దపసు లింకం బుచ్చుకొను మంచియాహారంబులను గొనితెచ్చి యిచ్చుచుండెదను. ౨౪

నీవును సీతయును గొండనెత్తములందుఁ గ్రీడించుచుండవచ్చును; నేను నీవు మేలుకొనియుండునప్పుడును, నీవు నిదురవోయి యుండునప్పుడును సమస్తకార్యములనుం జేయుచుండెదను. అనిలక్ష్మణుఁడు రామునితోఁ జెప్పెను.

రాముఁడు లక్ష్మణుఁడు చెప్పినమాటకుఁ బరమసంతోషంబునొంది యతనింజూచి యిట్లని చెప్పెను.

లక్ష్మణుఁడా! అట్లయిన నీవిప్పుడుపోయి నీస్నేహితుల కందఱకును జెప్పిరమ్ము. ౨౫

లక్ష్మణుఁడా! జనకమహారాజు యాగంబున మహాత్ముఁడగు వరుణుఁడు ప్రీతిపూర్వకంబుగా మనకొసంగిన దివ్యంబులగు జూచువారలకు భయంకరంబులు నగుధనువులును దివ్యంబులు నభేద్యంబులు నగుకవచంబులును ఎప్పటికిని బాణంబులు తరుగకుండు నక్షయతూణీరంబులును బంగారముచే నలంకరింపఁబడి సూర్యుండుఁబోలె వెలుంగు ఖడ్గంబులును వీనినన్నిటిని నేను ఆచార్యుఁడగు వసిష్ఠునింట నుంచియున్నాను. నీవుపోయి వానినన్నింటినిఁదీసికొని శీఘ్రముగారమ్ము. అని రాముఁడు లక్ష్మణునకుఁజెప్పెను. ౨౬-౨౮

స సుహృజ్జన మామన్త్ర్య వనవాసాయ నిశ్చితః,
ఇక్ష్వాకుగురు మామన్త్ర్య జగ్రాహాఽయుధ ముత్తమమ్. 30

త ద్దివ్యం రాజశార్దూల సత్కృతం మాల్యభూషితమ్,
రామాయ దర్శయామాస సౌమిత్రి స్సర్వ మాయుధమ్. 31

త మువాచాత్మవా న్రామః ప్రీత్యా లక్ష్మణ మాగతమ్,

కాలే త్వ మాగత స్సౌమ్య ! కాంక్షితే మమ లక్ష్మణ!. 32

అహం ప్రదాతు మిచ్ఛామి యదిదం మామకం ధనమ్,
బ్రాహ్మణేభ్య స్తపస్విభ్య స్త్వయా సహ పరన్తప!. 33
వస న్తీహ దృఢం భక్త్యా గురుషు ద్విజసత్తమాః,
తేషా మపి చ మే భూయ స్సర్వేషాం చోపజీవినామ్. 34

వసిష్ఠపుత్రం తు సుయజ్ఞ మార్యం
త్వ మానయాశు ప్రవరం ద్విజానామ్,
అభిప్రయాస్యామి వనం సమస్తా
నభ్యర్చ్య శిష్టా నపరా న్ద్విజాతీన్. 35

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డ ఏకత్రింశస్సర్గః.

## ద్వాత్రింశస్సర్గః

తత శ్శాసన మాజ్ఞాయ భ్రాతు శ్శుభతరం ప్రియమ్,
గత్వా స ప్రవివేశాశు సుయజ్ఞస్య నివేశనమ్. 1

అట్లు లక్ష్మణుఁడు వనంబులోనుండి నిశ్చయించి స్నేహితులయొద్దకుఁ బోయి వారలవీడ్కొని యిక్ష్వాకుకులాచార్యుఁడైన వసిష్ఠునిగృహంబుననుండు నుత్తమంబులయిన యాయుధంబులం దీసికొనివచ్చెను. ౩౦

లక్ష్మణుఁడు స్వర్గంబునఁబుట్టినవియు గొప్పరాజులచేఁ బూజింపఁబడినవియుఁ బుష్పమాలికలచే నలంకృతంబులునగు నాయాయుధంబులనన్నింటిని రామునకుం జూపెను. ౩౧

మహాధైర్యశాలియగు రాముఁడు అట్లాయుధంబులం దీసికొనివచ్చిన లక్ష్మణుఁజూచి సంతోషించి యిట్లని చెప్పెను.

సౌమ్యుఁడవగులక్ష్మణుఁడా! నేను నీకెదురుసూచుచున్నాను. తగిన కాలములోనే నీవును వచ్చినావు. ౩౨

శత్రువులఁ దపింపఁజేయుఁనట్టి లక్ష్మణుఁడా! నేను నీతోఁగూడ నా ధనమునంతయుఁ దపస్వులకును బ్రాహ్మణులకు నివ్వఁగోరుచున్నాను. ౩౩

ఇచ్చటనుండు దృఢమయిన గురుభక్తిగల మహాత్ములైన బ్రాహ్మణులకును నాయాశ్రితులకందఱకును ఎప్పటికంటె నధికముగా దానముసేయఁ గోరుచున్నాను. ౩౪

నీ విప్పుడు పోయి బ్రాహ్మణశ్రేష్ఠుఁడును బూజ్యుఁడు నగు వసిష్ఠ పుత్రుఁ డయిన సుయజ్ఞునిమాత్రము శీఘ్రముగాఁ బిలుచుకొనిరమ్ము.

నేను వసిష్ఠపుత్రుఁ డగు నాసుయజ్ఞుని మఱియు మహాత్ము యిన యితర బ్రాహ్మణులనుఁ బూజించి యటుపిమ్మట నరణ్యంబునకుఁ బోయెదను. అని రాముఁడు, లక్ష్మణు నాజ్ఞాపించెను. ౩౫

ఇది ముప్పదొకటవసర్గము.

---

## ముప్పదిరెండవసర్గము

అంత నాలక్ష్మణుఁడు మంగళకరంబును బ్రియంబునగు తనయన్నగారి యాజ్ఞల శిరసావహించి శీఘ్రంబుగా సుయజ్ఞునియింటికిం బోయెను. ౧

తం విప్రమగ్న్యగారస్థం వన్దిత్వా లక్ష్మణోఽబ్రవీత్,
సఖే! ఽభ్యాగచ్ఛ పశ్య త్వం వేశ్మ దుష్కరకారిణః. ౨

తత స్సన్ధ్యా ముపాస్యాశు గత్వా సౌమిత్రిణా సహ,
జుష్టం తత్ప్రావిశ ల్లక్ష్మ్యా రమ్యం రామనివేశనమ్. ౩

త మాగతం వేదవిదం ప్రాఞ్జలి స్సీతయా సహ,
సుయజ్ఞ మభిచక్రామ రాఘవోఽగ్ని మివార్చితమ్. ౪

జాతరూపమయై ర్ముఖ్యై రఙ్గదైః కుణ్డలై శ్శుభైః,
సహేమసూత్రై ర్మణిభిః కేయూరై ర్వలయై రపి. ౫
అన్యై శ్చ రత్నై ర్బహుభిః కాకుత్స్థః ప్రత్యపూజయత్,

సుయజ్ఞం స తదోవాచ రామ స్సీతాప్రచోదితః. ౬

హారం చ హేమసూత్రం చ భార్యాయై సౌమ్య! హారయ,
రశనాం చాధునా సీతా దాతు మిచ్ఛతి తే సఖే!. ౭

అఙ్గదాని విచిత్రాణి కేయూరాణి శుభాని చ,
ప్రయచ్ఛతి సఖే! తుభ్యం భార్యాయై గచ్ఛతీ వనమ్. ౮

పర్యఙ్క మగ్ర్యాస్తరణం నానారత్నవిభూషితమ్,
త మపీచ్ఛతి వైదేహీ ప్రతిష్ఠాపయితుం త్వయి. ౯

లక్ష్మణుఁడు, అగ్నిహోత్రగృహంబులోనున్న సుయజ్ఞుంజూచి నమస్కరించి యిట్లనిచెప్పెను.

స్నేహితుఁడవగు సుయజ్ఞుఁడా! రాముఁడు వనవాసంబు సేయఁబోవుచున్నాఁడు. నీవిప్పు డతనియింటికివచ్చి దుష్కరంబయిన యతనికార్యముఁ జూడుము. అని లక్ష్మణుఁడు సుయజ్ఞునకుం జెప్పెను. ౨

అంత నాసుయజ్ఞుఁడు, శీఘ్రముగా సంధ్యావందనముచేసి, లక్ష్మణుని తోడఁ బోయి లక్ష్మీసంపన్నంబును రమణీయంబునగు రామగృహముఁ బ్రవేశించెను. ౩

అట్లువచ్చి హుతంబగు నగ్నిహోత్రంబు చందంబునం దేజరిల్లుచున్న వేదవేత్తయగు సుయజ్ఞునకు రాముఁడు చేమోడ్పుగేలించి సీతతోఁగూడఁ బ్రదక్షిణంబు చేసెను. ౪

అంత రాముఁడు శ్రేష్ఠములయిన బంగారుబాహుపురులును మణులు చెక్కినబాహుపురులును, సుందరములయిన కుండలంబులును, బంగారుతో గట్టిన మణిసరములను, కంకణంబులును, ఇంకనితరములయినమణు లనేకంబులును సుయజ్ఞునకొసంగెను. ౫

అంత నారాముఁడు సీత ప్రేరింపఁగా నాసుయజ్ఞుంజూచి, యిట్లని పలికెను. ౬

సౌమ్యుఁడవగు సుయజ్ఞుఁడా! సీత యిప్పుడు నీభార్యకు హారమును, బంగారుమెడనూలును, మొలనూలును ఇవ్వఁగోరియున్నది; వీనిం దీసికొని పోయి యామెకిమ్ము. ౭

స్నేహితుఁడా! ఇప్పుడీసీత వనంబునకుఁ బోవుచున్నది; కావున, నీభార్యకై నీచేతికి నానావిధమణిఖచితంబులౌటచే నానావర్ణములయిన బాహుపురులను పట్టెబంగారు బాహుపురులను ఇచ్చుచున్నది. ౮

శ్రేష్ఠమయిన యాస్తరణవస్త్రముగల్గి నానావిధమణుల నలంకృతంబైన యాపాన్పునుంగూడ సీత నీ కియ్యఁగోరుచున్నది. ౯

నాగశ్శత్రుంజయో నామ మాతులోఽయం దదౌ మమ,
తం తే గజసహస్రేణ దదామి ద్విజసత్తమ!. ౧౦

ఇత్యుక్తస్స హి రామేణ సుయజ్ఞః ప్రతిగృహ్య తత్,
రామలక్ష్మణసీతానాం ప్రయుయోజాఽశిషశ్శుభాః. ౧౧
అథ భ్రాతర మవ్యగ్రం ప్రియం రామః ప్రియం వదః,
సౌమిత్రిం తమువాచేదం బ్రహ్మేవ త్రిదశేశ్వరమ్. ౧౨

అగస్త్యం కౌశికం చైవ తావుభౌ బ్రాహ్మణోత్తమౌ,
అర్చయాఽహూయ సౌమిత్రే రత్నై స్సస్యమివామ్బుభిః. ౧౩

తర్పయస్వ మహాబాహో! గోసహస్రైశ్చ మానద!,
సువర్ణై రజతైశ్చైవ మణిభిశ్చ మహాధనైః. ౧౪

కౌసల్యాం చ య ఆశీర్భి ర్భక్తః పర్యుపతిష్ఠతి,
ఆచార్య స్తైత్తిరీయాణా మభిరూపశ్చ వేదవిత్. ౧౫

తస్య యానం చ దాసీశ్చ సౌమిత్రే! సమ్ప్రదాపయ,
కౌశేయాని చ వస్త్రాణి యావత్తుష్యతి స ద్విజః. ౧౬
సూత శ్చిత్రరథ శ్చార్య స్సచివ స్సుచిరోషితః,

తోషయైనం మహార్హై శ్చ రత్నై ర్వస్త్రై ర్ధనై స్తథా. ౧౭
పశుకాభిశ్చ సర్వాభి ర్గవాం దశశతేన చ,
యే చేమే కఠకాలాపా బహవో దణ్డమాణవాః. ౧౮
నిత్యస్వాధ్యాయశీలత్వా న్నాన్యత్కుర్వన్తి కించన,

సాటి నామేనమామయిచ్చిన శత్రుంజయం బనుగజం బొకటిగలదు; దానిని ఇంక వేయియేనుంగులనుం జేర్చి నీకొసంగెదను. అని రాముఁడు, సుయజ్ఞునితోఁ జెప్పెను. ౧౦

ఆ సుయజ్ఞుఁడు, రామునిమాటలు విని వానినన్నింటిని బ్రతిగ్రహించి, రామునకును లక్ష్మణునకును సీతకును మంగళాశీర్వచనంబు లొసంగెను. ౧౧

అంత ప్రియభాషియగు రాముఁడు, ఏమఱుపాటులేనివాఁడునుఁ బ్రియుఁడును సమ్మఁడునగు లక్ష్మణుంజూచి బ్రహ్మదేవుఁడు దేవేంద్రున కాజ్ఞాపించునట్లు ఇట్లని యాజ్ఞాపించెను. ౧౨

లక్ష్మణుఁడా! నీవుపోయి అగస్త్యుని, విశ్వామిత్రుని ఈయిద్దఱు బ్రాహ్మణోత్తములనుం దీసికొనివచ్చి పైరును నీళ్లతోడంబోలె వారల రత్నములతోఁ బూజింపుము. ౧౩

మానంబుఁ గాపాడుకొనునట్టి లక్ష్మణుఁడా! మఱియుం వారలకుఁ బెక్కువేలయావులును బంగారమును వెండియుం నొసంగి సంతోషంబుగలుగునట్లు సేయుము. ౧౪

ఎవ్వఁ డెల్లప్పుడును శ్రద్ధతోఁ గౌసల్య నాశీర్వదింపుచుండునో, అట్టి తైత్తిరిశాఖం జదువువారల యుపాధ్యాయుఁడును, బండితుఁడు, వేదంబులు తెలిసినవాఁడును. ౧౫

లక్ష్మణుఁడా! ఆ బ్రాహ్మణుఁడు తృప్తిఁ బొందునట్లు ఆతనికి వాహనంబులును దాసీలును బట్టుపుట్టల నొసంగుము. ౧౬

చిత్రరథుఁడను సారథియుం, మనతండ్రి దశరథమహారాజునకుఁ గావలసినవాఁడు; బహుకాలముగా మనయింట నున్నవాఁడు.

నీ వితనికి ఉత్తమంబులగు మణులును వస్త్రంబులును ధనంబులు అన్నిసన్నజీవంబులు వేయియావులు నొసంగి సంతోషము గల్గునట్లు సేయుము.

మఱియుం, నీకఠశాఖ నధ్యయనించువారలును గాలాపశాఖ నధ్యయనించువారలును ననేకులు పలాశదండధారులగు బ్రహ్మచారులును వీరలందఱు

అలసా స్స్వాదుకామా శ్చ మహతాం చాపి సమ్మతాః. ౧౯

తేషా మశీతియానాని రత్నపూర్ణాని దాపయ,
శాలివాహసహస్రం చ ద్వే శతే భద్రకాం స్తథా. ౨౦
వ్యఞ్జనార్థం చ సౌమిత్రే! గోసహస్ర ముపాకురు,

మేఖలీనాం మహాసఙ్ఘః కౌసల్యాం సముపస్థితః. ౨౧
తేషాం సహస్రం సౌమిత్రే! ప్రత్యేకం సమ్ప్రదాపయ,

అమ్బా యథా చ సా నన్దే త్కౌసల్యా మమ దక్షిణామ్. ౨౨
తథా ద్విజాతీ న్సర్వాం స్తా ల్లక్ష్మ ణార్చయ సర్వశః,

తత స్స పురుషవ్యాఘ్ర స్తద్ధనం లక్ష్మణ స్స్వయమ్. ౨౩
యథోక్తం బ్రాహ్మణేన్ద్రాణా మదదా ద్ధనదో యథా,

అథాఽబ్రవీ ద్బాష్పకళాం స్తిష్ఠత శ్చోపజీవినః. ౨౪
సమ్ప్రదాయ బహు ద్రవ్య మేకైకస్యోపజీవనమ్,

లక్ష్మణస్య చ య ద్వేశ్మ గృహం చ య దిదం మమ. ౨౫
అశూన్యం కార్య మేకై కం యావదాగమనం మమ,

ఇత్యుక్త్వా దుఃఖితం సర్వం జనం త ముపజీవినమ్. ౨౬
ఉవా చేదం ధనాధ్యక్షం ధన మానీయతా మితి,

యెల్లప్పుడు వేదాధ్యయనము చేయుచుందురు; మఱి యేకార్యమునుం గొంచెమయినం జేయువారలుకారు. ౧౮

వారలు కొంచెము సోమరులు; రుచ్యమయిన యాహారమును గోరుచుందురు; పూజ్యులయినవారలుగూడ వారల సమ్మానింపుచుందురు. ౧౯

వారలకు, ఎనుబదిబండ్లరత్నములును ధాన్యమును మోయునవృషభంబులు వేయింటిని, ఇన్నూఱు దున్నెడు నెద్దులను ఇమ్ము. ౨౦

లక్ష్మణుఁడా! వారలకు భోజనంబునకుఁ బాలుఁ బెరుఁగు నేయి మొదలగువానికొఱకై వేయిగోవులనిమ్ము.

మఱియు ననేకులు బ్రహ్మచారులు కౌసల్య నాశ్రయించియున్నవారు.

లక్ష్మణుఁడా! వారలకుఁ బ్రతిమనిషికిని, వేయిగోవులచొప్పున నొసంగుము.

లక్ష్మణుఁడా! మనతల్లికౌసల్య సంతోషించునట్లు, నీవన్నివిధంబులను ఆబ్రాహ్మణులదండఱం బూజింపవలయును. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౨౨

అంతఁ బురుషశ్రేష్ఠుఁడగు నాలక్ష్మణుఁడు కుబేరుండుఁబోలె నాధనమంతయుఁ రాముఁడుచెప్పినట్లు తానే బహుశ్రద్ధతో బ్రాహ్మణోత్తములకొసంగెను. ౨౩

అంత రాముఁడు తనయెదుటఁ గన్నీళ్లు నించుకొనుచు(గన్నీళ్లుగార్చుచు), నిలుచున్నపరిచారకులంజూచి వారలు జీవించుటకై యొక్కొక్కనికి నధికముగా ధనంబొసంగి యిట్లని చెప్పెను. ౨౪

మీరు నేను వచ్చువఱకు నాయింటను లక్ష్మణునింటను ఎవ్వరులేనట్లు సేయక యెల్లప్పుడును గావలియుండి కాపాడుచుండవలయును. అని రాముఁడు నౌకరులకుం జెప్పెను. ౨౫

రాముఁడు దుఃఖము నొందియున్న పరిచారకులకుం జెప్పి యంతధనాధికారింజూచి ధనమును దీసికొని రమ్ము, అని యాజ్ఞాపించెను. ౨౬

తతో౽స్య ధన మాజహ్రు స్సర్వ మే వోపజీవినః, ౨౭
స రాశి స్సుమహాం స్తత్ర దర్శనీయో హ్యదృశ్యత,

తత స్స పురుషవ్యాఘ్రో స్తద్ధనం సహలక్ష్మణః. ౨౮
ద్విజేభ్యో బాలవృద్ధేభ్యః కృపణేభ్యో హ్యదాపయత్,
తత్రా౽సీ త్పిఙ్గళో గార్గ్య స్త్రిజటో నామ వై ద్విజః. ౨౯
ఉఞ్ఛవృత్తి ర్వనే నిత్యం ఫాలకుద్దాలలాఙ్గలీ,

తం వృద్ధం తరుణీ భార్యా బాలా నాదాయ దారకాన్. 30
అబ్రవీ ద్బ్రాహ్మణం వాక్యం దారిద్ర్యే ణాభిపీడితా,
అపాస్య ఫాలం కుద్దాలం కురుష్వ వచనం మమ. 31
రామం దర్శయ ధర్మజ్ఞం యది కించి దవాప్స్యసి,

స భార్యావచనం శ్రుత్వా శాటీ మాచ్ఛాద్య దుశ్ఛదామ్. 32
స ప్రాతిష్ఠత పన్థానం యత్ర రామనివేశనమ్,

భృగ్వంగిరస్సమం దీప్త్యా త్రిజటం జనసంసది. 33
ఆపఞ్చమాయాః కక్ష్యాయా నైనం కశ్చి దవారయత్,

స రాజపుత్ర మాసాద్య త్రిజటో వాక్య మబ్రవీత్. 34
నిర్ధనో బహుపుత్రో౽స్మి రాజపుత్ర! మహాయశః!,
ఉఞ్ఛవృత్తి ర్వనే నిత్యం ప్రత్యవేక్షస్వ మా మితి. 35

అంతఁ బరిచారకు లీరామునిధనమునంతయుఁ గొనితెచ్చిరి. ౨౭

ఆ ధనరాశి మిక్కిలియు గొప్పది కావునఁ, జూపరుల కచ్చెరువుఁ గల్గించు చుండినది.

అంతఁ బురుషశ్రేష్ఠుఁడగు నా రాముఁడు లక్ష్మణునిం గూడి యాధనము నంతయుఁ దరిద్రబ్రాహ్మణులయిన బాలురకు వృద్ధులకు నొసంగెను. ౨౮

అడవిలోఁ నెల్లప్పుడును జిన్నగొడ్డలియును గుద్దలియును దోఁటియుం చు ధరించి, కందమూలాదులు త్రవ్వికొని ఫలములు గోసికొనియు జీవించుచుండు వాఁడును, పింగళవర్ణుఁడునగు త్రిజటుఁడను దరిద్రబ్రాహ్మణుఁ డొక్కఁడు దైవవశంబున నప్పు డక్కడ నుండెను. ౨౯

యశోవనవతియగు నతనిభార్య దారిద్ర్యంబునకుఁ గుందుచు, బాలు రగు కొడుకులఁ దీసికొని వృద్ధుఁడగు నా త్రిజటుఁ జేరఁజని యిట్లని చెప్పినది.

ఇప్పు డీగొడ్డలిని పాఱవైచి నేను జెప్పునట్లు సేయుము. ౩౧

రాము నొద్దకుఁ బోయి నీకుటుంబము నతనికిఁ జూపి నీదారిద్ర్యమును జెప్పుకొనుము. అతఁడు మిక్కిలియు ధార్మికుఁడు; నీవట్లు సేయుదు వేని నీకేమైన నిచ్చును.

ఆ త్రిజటుఁడు భార్యచెప్పినమాటను విని మిక్కిలియుఁ జీర్ణమయి యుండుటఁ జేసి కప్పుకొన సరిపోనివస్త్రంబుఁ గప్పుకొని, రాముని గృహం బుండుమార్గంబుఁ బట్టి పోయెను. ౩౨

అట్లు జనసమూహంబున నా త్రిజటుండు బ్రహ్మవర్చస్సుచేత భృగ్వాం గిరసులుంబోలె వెలుంగుచున్నవాఁడు గావున నతఁడు రామగృహంబు లోనికిఁ జేరఁగా నయిదవతొట్టికట్టువఱకును ఎవ్వరు నడ్డగింపరైరి. ౩౩

ఆ త్రిజటుండు రాచకొమరుఁడగు రాముం జేరఁజని "రాజపుత్రుఁడా! నీవు మహాకీర్తిగలవాఁడవు; నేను దరిద్రుఁడను; పెక్కుకొడుకులుగలవాఁడను; ఎల్లప్పుడును వనంబున ధాన్యంబు నొక్కొకటిగా నేరుకొని జీవించుచున్నాను; నామీఁదఁ గొంచెము దృష్టియుంచుము" అని యిట్లని చెప్పెను. ౩౪, ౩౫

త మువాచ తతో రామః పరిహాససమన్వితమ్,
గవాం సహస్ర మప్యేకం నతు విశ్రాణితం మయా. ౩౬
పరిక్షిపసి దణ్డేన యావ త్తావ దవాప్స్యసి,

స శాటీం త్వరితః కట్యాం సమ్భ్రాన్తః పరివేష్ట్య తామ్. ౩౭
ఆవిద్ధ్య దణ్డం చిక్షేప సర్వప్రాణేన వేగితః,

స తీర్త్వా సరయూపారం దణ్డ స్తస్య కరా చ్చ్యుతః. ౩౮
గోవ్రజే బహుసాహస్రే పపాతోక్షణసన్నిధౌ,

తం పరిష్వజ్య ధర్మాత్మా ఆ తస్మా త్సరయూతటాత్. ౩౯
ఆనయామాస తా గోపై స్త్రిజట స్యాశ్రమం ప్రతి,

ఉవాచ స తతో రామ స్తం గార్గ్య మభిసాన్త్వయన్. ౪౦

మన్యు ర్న ఖలు కర్తవ్యః పరిహాసో హ్యయం మమ,

ఇదం హి తేజ స్తవ య ద్దురత్యయం
త దేవ జిజ్ఞాసితు మిచ్ఛతా మయా. ౪౧
ఇదం భవా నర్థ మభిప్రచోదితో
వృణీష్వ కిం చే దపరం వ్యవస్యతి,
బ్రవీమి సత్యేన న తేఽస్తి యన్త్రణా
ధనం హి య ద్య న్మమ విప్రకారణాత్. ౪౨
భవత్సు సమ్య క్ప్రతిపాదనేన త
న్మయాఽర్జితం ప్రీతియశస్కరం భవేత్,

అంత రాముఁడు, ఆత్రిజటుంజూచి పరిహాసంబుగా నిట్లని చెప్పెను.

నేను నీకు వేయిగోవులనైనను ఇవ్వను. 36

నీవు కొయ్యను విసరివేయఁగా నది యెంతదూరముపోవునో అంతదూరములో నుండఁదగినగోవులను నీకిత్తును. అని రాముఁడు త్రిజటునకుఁ జెప్పెను.

అంత నాత్రిజటుండు సంతోషంబునొంది వేగిరపాటున నావస్త్రంబు మొలకుఁజుట్టుకొని వేగంబున దండంబు గిరగిరం ద్రిప్పి తనయావద్బలమును బూని విసరివైచెను. 37

అట్లు లాత్రిజటుండువైవఁగా నాదండంబు సరయూనది యావలిగట్టును దాఁటి పెక్కువేలగోవుల నతిక్రమించి, యాఁబోతుసమీపమునఁ బడెను. 38

ధర్మాత్ముఁడగురాముఁడు, ఆత్రిజటుంజూచి కౌఁగిలించుకొని సరయూనదిగట్టున నతని కొయ్యపడినచోటునుండి యాయావుల నన్నిఁటిని గొల్లవాంద్రచే నాత్రిజటుని యాశ్రమంబునకుఁ దోలించెను. 39

అంత రాముఁడు గార్గ్యుఁడగు నాత్రిజటుని మంచిమాటల ననునయింపుచు నిట్లని చెప్పెను. ४०

కోపము సేయకుము. నేను వినోదముగా నీమాటం జెప్పితినుగాని వేఱుగాదు.

నీతేజంబు మిక్కిలి నధికంబుగా నుండుటంజూచి దానింజక్కఁగాఁ దెలిసికొనఁగోరి, నేను నీకు "కొయ్యను ద్రిప్పివైవు" మని చెప్పినాను; మఱియేమియుంగాదు; నీ కింక నేమైనఁ గావలయుననిగోర్కెయుండు నేని దానిఁజెప్పుము; ఇచ్చెదను. ४१

నేను సత్యముగాఁ జెప్పుచున్నాను; నీకు సంకోచ మక్కఱలేదు; నాధన మేదేదియున్నదో, అదియంతయు బ్రాహ్మణులకొఱకేగాని వేఱుగాదు; మీయం దది చక్కఁగా వినియోగపడునేని, నేనుసంపాదించినది సుప్రయోజనమై నాకు సంతోషంబును గీర్తియును గలుగును. అని రాముఁడు త్రిజటునకుఁ జెప్పెను. ४२

తత స్సభార్య స్త్రిజటో మహాముని
ర్గవా మనీకం ప్రతిగృహ్య మోదితః. ౪౩
యశోబలప్రీతిసుఖోపబృంహిణీ
స్తదాఽఽశిషః ప్రత్యవద న్మహాత్మనః,
స చాపి రామః ప్రతిపూర్ణ పౌరుషో
మహాధనం ధర్మబలై రుపార్జితమ్. ౪౪
నియోజయామాస సుహృజ్జనేఽచిరా
ద్యథార్హ సమ్మానవచః ప్రచోదితః,
ద్విజ స్సుహృ ద్భృత్యజనోఽథవా తదా
దరిద్రభిక్షాచరణ శ్చ యోఽభవత్. ౪౫
న తత్ర కశ్చి న్న బభూవ తర్పితో
యథార్హసమ్మాననదానసమ్భ్రమైః.

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే ద్వాత్రింశస్సర్గః.

## త్రయస్త్రింశస్సర్గః

దత్వా తు సహ వైదేహ్యా బ్రాహ్మణేభ్యో ధనం బహు,
జగ్మతుః పితరం ద్రష్టుం సీతయా సహ రాఘవౌ. ౧
తతో గృహీతే దుష్ప్రేక్షే త్వశోభేతాం తదాయుధే,
మాలాదామభి రాబద్ధే సీతయా సమలఙ్కృతే. ౨

తతః ప్రాసాదహర్మ్యాణి విమానశిఖరాణి చ,
అధిరుహ్య జన శ్శ్రీమా నుదాసీనో వ్యలోకయత్. ౩

నహి రథ్యాస్స్మ శక్యన్తే గన్తుం బహుజనాకులాః,

అంత మహామునియగు త్రిజటుండును, అతనిభార్యయును నాయావులం బుచ్చుకొని సంతోషించి, మఱేమియుంగోరక మహాత్ముఁడగురామునకుఁ గీర్తియు బలంబును సంతోషంబును సుఖంబును వృద్ధిఁబొందునట్లు ఆశీర్వచనంబు లొసంగిరి. 43

అంత రాముఁడు పూర్ణంబగుమనంబున వారివారికిఁ దగునట్లు సమ్మానవాక్యంబులాడి తాను ధర్మంబు దప్పక పరాక్రమంబునం సంపాదించిన ధనమునంతయుం స్నేహితుల కిమ్మని యాజ్ఞాపించెను. 44

అయోధ్యయందు బ్రాహ్మణుఁడుగాని రాముని స్నేహితుఁడుగాని యతనిభృత్యజనముగాని బిచ్చమెత్తుకొనువారుగాని యందఱును రాముని వలన యథోచితగౌరవంబును ధనంబును గోవులనుంబొంది మహాసంతోషంబు నొందిరి. 45

ఇది ముప్పదిరెండవసర్గము.

---

## ముప్పదిమూఁడవసర్గము

రామలక్ష్మణులు సీతతోఁగూడ నట్లు బ్రాహ్మణులకు యథేష్టంబుగా ధనంబొసంగి యంత ఆదశరథుఁ జూచుటకై సీతనుం దీసికొనిపోయిరి. 1

అంత నారామలక్ష్మణులు పుష్పమాలికల నలంకరింపఁబడిన ధనుఃఖడ్గాద్యాయుధంబుల గ్రహింపఁగా నవి దేఱిచూడ నలవిగాక సీతసమీపంబున నుండుటం జేసి మిక్కిలియుఁ బ్రకాశించినవి. 2

అంత రామునిపట్టాభిషేకంబునకై యలంకరించుకొనియుండు జనులందఱు సంతోషంబువిడిచి రాజగృహంబుల దేవాలయంబులను, విమానశిఖరంబులను ఎక్కి చూచుచుండిరి. 3

మార్గములలో జను లధికముగా నుండుటవలన అందుఁబోవుటకు వీలు

ఆరుహ్య తస్మా త్ప్రాసాదా న్దీనాః పశ్యన్తి రాఘవమ్. ౪

పదాతిం వర్జితచ్ఛత్రం రామం దృష్ట్వా జనా స్తదా,
ఊచు ర్బహువిధా వాచ శ్శోకోపహతచేతసః. ౫
యం యాన్త మనుయాతి స్మ చతురఙ్గబలం మహత్.
తమేకం సీతయా సార్ధ మనుయాతి స్మ లక్ష్మణః. ౬

ఐశ్వర్యస్య రసజ్ఞస్స న్కామినాం చైవ కామదః,
నేచ్ఛ త్యే వానృతం కర్తుం పితరం ధర్మగౌరవాత్. ౭

యా న శక్యా పురా ద్రష్టుం భూతై రాకాశగై రపి,
తా మద్య సీతాం పశ్యన్తి రాజమార్గగతా జనాః. ౮

అఙ్గరాగోచితాం సీతాం రక్తచన్దనసేవినీమ్,
వర్ష ముష్ణం చ శీతం చ నేష్య న్త్యాశు వివర్ణతామ్. ౯

అద్య నూనం దశరథ స్సత్త్వ మావిశ్య భాషతే,

న హి రాజా ప్రియం పుత్రం వివాసయితు మిచ్ఛతి. ౧౦

నిర్గుణ స్యాపి పుత్రస్య కథం స్యా ద్విప్రవాసనమ్,
కింపున ర్యస్య లోకోఽయం జితో వృత్తేన కేవలమ్. ౧౧

గాకుండుటంజేసి జనులు ప్రాసాదంబులనెక్కి దుఃఖంబున రాముఁ జూచు చుండిరి. ౪

అప్పుడు జనులు, రాముఁడు ఛత్రంబుగూడలేక కాళ్లతో నడుచుచుఁ బోవుటంజూచి పరమదుఃఖంబునొంది నానావిధములుగా మాటలాడుకొనిరి. ౫

ఎవ్వఁడు పోవుచుండఁగా గొప్పచతురంగసైన్యము వెంబడించుచుండునో, ఇప్పు డట్టిరాముఁ డొక్కఁడై పోవుచుండఁగా సీతయును లక్ష్మణుఁడు నతనివెంబడించుచున్నారు. ౬

రాముఁడు ఐశ్వర్యరసమును జక్కఁగా ననుభవింపుచున్నాఁడు; మఱియు నెవ్వరు దేనిఁగోరుదురో వారలకు వాని నొసంగువాఁడు; అట్లయి నను ధర్మగౌరవంబునఁ దండ్రి కసత్యదోష మెట్లయినను సంభవింపకుండునట్లు చేయఁబూనియున్నాఁడు. ౭

ము న్నెవ్వతెను ఆకాశంబునం దిరుగఁజాలినభూతంబులు సైతము చూడలేకుండినవో అట్టిసీత నిప్పుడు రాజమార్గంబులోని జనులందఱుఁ జూచుచున్నారు. ౮

మేలయినను మైపూఁతఁకుఁ దగినదియు నెప్పుడు నెఱ్ఱనిచందనంబుఁ బూసుకొనునదియునగు సీతను, ఇంక శీఘ్రముగానే వానయు నెండయుఁ జలియు మాఱురంగుగల్గునట్లు సేయఁగలవు. ౯

ఇప్పుడు దశరథునకుఁ బిశాచముపట్టియున్నది. ఇది నిశ్చయము. కావుననే యిట్లు చెప్పుచున్నాఁడు.

దశరథమహారాజెంతమాత్రము తనప్రియపుత్రుఁడగురాము నడవికిం బంపఁగోరఁడు. ౧౦

నిర్గుణుండైనను కొడుకు నడవికిఁబంపుదురా? అందు దానాదిధర్మంబు లట్లుండఁగా నొకసచ్చరిత్రముచేతనే లోకంబునంతయుం జయించిన రాముని వంటిసత్పుత్రు నరణ్యంబునకుఁ బంపరని చెప్పనేల?. ౧౧

ఆనృశంస్య మనుక్రోశ శ్శ్రుతం శీలం దమ శ్శమః,
రాఘవం శోభయ న్త్యే తే షడ్గుణాః పురుషోత్తమమ్. ౧౨

తస్మాత్తస్యోపఘాతేన ప్రజాః పరమపీడితాః,
ఔదకానీవ సత్త్వాని గ్రీష్మే సలిలసంక్షయాత్. ౧౩

పీడయా పీడితం సర్వం జగ దస్య జగత్పతేః,
మూల స్యే వోపఘాతేన వృక్షః పుష్పఫలోపగః. ౧౪

మూలం హ్యేష మనుష్యాణాం ధర్మసారో మహాద్యుతిః,
పుష్పం ఫలం చ పత్రం చ శాఖా శ్చా స్యేతరే జనాః. ౧౫

తే లక్ష్మణ ఇవ క్షిప్రం సపత్న్యః సహబాన్ధవాః,
గచ్ఛన్త మనుగచ్ఛామో యేన గచ్ఛతి రాఘవః. ౧౬
ఉద్యానాని పరిత్యజ్య క్షేత్రాణి చ గృహాణి చ,
ఏకదుఃఖసుఖా రామ మనుగచ్ఛామ ధార్మికమ్. ౧౭

సముద్ధృతనిధానాని పరిధ్వస్తాజిరాణి చ,
ఉపాత్తధనధాన్యాని హృతసారాణి సర్వశః. ౧౮
రజసాఽభ్యవకీర్ణాని పరిత్యక్తాని దైవతైః,
మూషకైః పరిధావద్భి రుద్బిలై రావృతాని చ. ౧౯
అపేతోదకధూమాని హీనసమ్మార్జనాని చ,
ప్రణష్టబలికర్మేజ్యామన్త్రహోమజపాని చ. ౨౦
దుష్కాలే నేవ భగ్నాని భిన్నభాజనవన్తి చ,
అస్మత్త్యక్తాని వేశ్మాని కైకేయీ ప్రతిపద్యతామ్. ౨౧

అహింసయు, దయయు, విద్యయు, సత్స్వభావమును, ఇంద్రియనిగ్రహమును, కోపములేకుండుటయు నీయాఱుగుణంబులును రాముని యందు నిత్యంబులై యున్నవి. ౧౨

అట్టిసద్గుణసంపన్నుండగు రామునకుఁ గష్టము సంభవించుటవలన జనులందఱు వెండకాలమున నీళ్లింకఁగా జలజంతువులుంబోలెఁ బరమపీడ నొందియున్నారు. ౧౩

జగత్తునకంతకును నధిపతియయినయట్టిరామునకుఁ గష్టముగలుగుటచేత మూలము నఱుకఁబడిన పిమ్మట పుష్పఫలసహితముగా వృక్షము నాశంబు నొందునట్లు ప్రపంచమంతయుఁ గష్టము నొందియున్నది. ౧౪

ధర్మమునే యవలంబించి యుండువాఁడును, గాంతిమంతుండునగు నీరాముండు ప్రాణిమయమయిన వృక్షమునకు వేరు; వృక్షమునందలి పువ్వును ఫలమును బత్త్రమును గొమ్మలునే సమస్తజనులు. ౧౫

కావున మనము భార్యలను బంధువులనుంగూడి లక్ష్మణుండుంబోలె శీఘ్రముగా రాముఁడు పోవుదారింబట్టి యతనివెంట నరుగుదము. ౧౬

మనము ఉద్యానంబులను భూములను గృహంబులను విడిచి రాముండు సుఖించిన సుఖంపుచు, అతండు దుఃఖించిన దుఃఖించుచు ధార్మికుండగు రాముని వెంబడించుచుఁ బోవుదము. ౧౭

అట్లు, మనము విడిచిపోయినపిమ్మట నిక్షేపములు పెల్లగింపఁబడియు ముంగిళ్లుచెడియు, ధనధాన్యంబు లవ్వలికిం గొనిపోఁబడియు, శయనాసనాది ముఖ్యపదార్థంబులన్నియుఁ దీసికొనిపోఁబడియు నుండుటంజేసి కాంతివిహీనంబులై దుమ్ముచేనిండి గృహదేవతలచే విడువఁబడినవై బిలంబులు ద్రవ్వుకొనియిటునటుఁ బాఱుచుండు మూషకంబులచే వ్యాపింపఁబడి జలముచిల్కరించుటయుఁ జిమ్ముటయు లేకుండుటవలన నపరిశుద్ధంబులయి వంటలేకుండుటవలన ధూమవిహీనంబులై "బలికర్మము ఇష్టిమంత్రధ్వనిహోమము జపము" ఇవిలేనందున నెంతమాత్రము శోభింపక క్షామాదిదుష్టకాలంబులం బాడువడినవివోలెఁ

వనం నగర మేవాస్తు యేన గచ్ఛతి రాఘవః,
అస్మాభి శ్చ పరిత్యక్తం పురం సమ్పద్యతాం వనమ్. ౨౨

బిలాని దంష్ట్రిణ స్సర్వే సానూని మృగపక్షిణః,
త్యజ న్త్వస్మద్భయా ద్భీతా గజా స్సింహా వనా న్యపి. ౨౩

అస్మ త్త్యక్తం ప్రపద్యన్తాం సేవ్యమానం త్యజన్తు చ,

తృణమాంసఫలాదానాం దేశం వ్యాళమృగద్విజమ్, ౨౪
ప్రపద్యతాం హి కైకేయీ సపుత్రా సహ బాన్ధవైః,

రాఘవేణ వనే సర్వే వయం వత్స్యామ నిర్వృతాః. ౨౫

ఇత్యేవం వివిధా వాచో నానాజనసమీరితాః,
శుశ్రావ రామ శ్శ్రుత్వా చ న విచక్రేఽస్య మానసమ్. ౨౬
స తు వేశ్మ పితు ర్దూరా త్కైలాసశిఖరప్రభమ్,
అభిచక్రామ ధర్మాత్మా మత్తమాతఙ్గవిక్రమః. ౨౭

వినీతవీరపురుషం ప్రవిశ్య తు నృపాలయమ్,
దదర్శావస్థితం దీనం సుమన్త్ర మవిదూరతః. ౨౮

ప్రతీక్షమాణోఽపి జనం తదాఽఽర్త

జూపట్టుచు విలిఁగిపోయిన కుండలలోనుండు మనయిండ్లను దీసికొని కైకేయి సుఖముగా నుండుఁగాక. ౧౮-౨౧

రాముం డడవికిఁ బోవుటవలన నాయడవి పట్టణముగానే యుండుఁగాక, రాముండును మేమును విడిచి పోయినపిమ్మట నీయయోధ్యాపట్టణమె యడవియగుఁగాక. ౨౨

మన మడవిలోఁ జేరినపిమ్మట మనకు భయంపడి పాములు బిలములను, మృగములుఁ బక్షులుఁ గొండనెత్తములను, ఏనుంగులు సింహములు నడవులను విడువఁగలవు. ౨౩

ఆక్రూరసర్పాదులు అట్లు ఇదివఱకు వానికి నివాసస్థానమయినవనంబును విడిచి మనచే విడువఁబడిన యీయయోధ్యాపట్టణంబులో వాసము సేయుచుండుఁగాక.

మనము విడిచినపిమ్మట కైకేయియు, ఆబిడకొడుకును, బంధువులును, జింకలు పులులు సింహములు కాకులు ఇవి మొదలగుక్రూరజంతువులవలన క్రూరపక్షులకును నివాసస్థానమయిన యీదేశమును బొందుదురుగాక. ౨౪

మనమందఱమును అడవిలో రామునితోఁగూడ సుఖంబుగా వాసము సేయుచుండెదము. అని జనులు పరస్పరము మాటలాడుకొనిరి. ౨౫

రాముం డిట్లు వారువారు నానావిధంబులుగా ననుకొనుమాటలను వినెను; అట్లువిన్నను అతనికి మనంబున కెంతమాత్రము వికారము గల్గలేను.

ధర్మాత్ముండును మదపుటేనుఁగుంబోలె గంభీరంబుగా నడచువాఁడు నగురాముండు, దూరంబునఁ గైలాసపర్వతశిఖరంబుంబోలెఁ దెల్లఁగా నత్యున్నతంబై యుండు తనతండ్రిగృహముంజూచి ప్రదక్షిణము చేసెను.

రాముండు వినయవంతులగు వీరపురుషులచే రక్షింపఁబడుచుండు రాజగృహంబుం బ్రవేశించి కొంచెముదూరంబున దుఃఖితుండై యున్న సుమంత్రుం జూచెను. ౨౮

అట్లు రాముండు తనతండ్రియాజ్ఞను యథావిధిం జేయఁగోరి

మనాన్తరూపః ప్రహసన్నివాథ,
జగామ రామః పితరం దిదృక్షుః
పితు ర్నిదేశం విధివ చ్చికీర్షుః. ౨౯
తత్పూర్వ మైక్ష్వాకసుతో మహాత్మా
రామో గమిష్య న్వన మార్తరూపమ్,
వ్యతిష్ఠత ప్రేక్ష్య తదా సుమన్త్రం
పితు ర్మహాత్మా ప్రతిహారణార్థమ్. ౩౦
పితు ర్నిదేశేన తు ధర్మవత్సలో
వనప్రవేశే కృతబుద్ధినిశ్చయః,
స రాఘవః ప్రేక్ష్య సుమన్త్ర మబ్రవీ
న్నివేదయ స్వాగమనం నృపాయ మే. ౩౧

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే త్రయస్త్రింశ స్సర్గః.

---

## చతుస్త్రింశస్సర్గః.

తతః కమలపత్రాక్ష శ్శ్యామో నిరుదరో మహాన్,
ఉవాచ రామ స్తం సూతం పితు రాఖ్యాహి మా మితి. ౧

స రామప్రేషితః క్షిప్రం సన్తాపకలుషేన్ద్రియః,
ప్రవిశ్య నృపతిం సూతో నిశ్వస న్తం దదర్శ హ. ౨

ఉపరక్త మి వాదిత్యం భస్మచ్ఛన్న మి వానలమ్,
తటాక మివ నిస్తోయ మపశ్య జ్జగతీపతిమ్. ౩

ఆలోక్య తు మహాప్రాజ్ఞః పరమాకులచేతసమ్,

తండ్రిం జూచుటకై పోవుచు దారిలో తన్నుఁజూచి దుఃఖితులయిన జనులం జూచియుం నెంతమాత్రము దుఃఖము నొందకుండుటయేగాక నవ్వుచున్నట్లు సంతోషముననే యుండెను. ౨౯

మహాత్ముండును మహాధైర్యశాలియును దశరథపుత్రుండును వనంబునకుఁ బోఁబోవువాఁడునగురాముండు అచ్చట తన్నుదశరథుం డడవికిఁ బొమ్మన్నది మొదలు దుఃఖితుండై యున్న సుమంత్రుంజూచి తండ్రికిం దనరాకం దెల్పుటకై యతనిం బ్రతీక్షింపుచుఁ గొంతవడవు నిలిచెను. ౩౦

పరమధార్మికుండుగావునఁ దండ్రియాజ్ఞచే వనంబున నుండ నిశ్చయించుకొనియుండు రామండు సుమంత్రుం జూచి "నేను వచ్చి కనిపెట్టి యున్నానని దశరథమహారాజునకుం దెల్పుము" అనిచెప్పెను. ౩౧

ఇది ముప్పదిమూఁడవసర్గము.

---

## ముప్పదినాలవసర్గము

అంతఁ దామరపూరేకులుంబోలె విశాల సుందరంబులయిన కండ్లు గలిగి శ్యామలవర్ణంబునొప్పుచు సన్ననడుముగలిగియుండుపూజ్యుండగు రాముండు సారథియగు నాసుమంత్రుంజూచి "నేను వచ్చియున్నానని నా తండ్రికిం జెప్పుము" అని చెప్పెను. ౧

ఆసుమంత్రుండు దుఃఖంబున నింద్రియంబులన్నియుఁ గలంకంబొందఁగా రామునిపంపున శీఘ్రంబున లోనికింబోయి నిట్టూర్పులు వుచ్చుచున్నదశరథుం జూచెను. ౨

ఆసుమంత్రుఁడు చూచినప్పుడు, దశరథుండు రాహుగ్రస్తుండగు సూర్యునిచందంబున బూడిదచేఁ గప్పఁబడిన యగ్నిహోత్రునికైవడి నీళ్లులేని చెఱువు భంగి కాంతిహీనుఁడై యుండెను. ౩

మహాపండితుఁడగు సుమంత్రుఁడు పరమదుఃఖంబునొంది రామునిం

రామ మే వానుశోచ న్తం సూతః ప్రాఞ్జలి రాసదత్. ౪

తం వర్ధయిత్వా రాజానం పూర్వం సూతో జయాశిషా,
భయవిక్లబయా వాచా మన్దయా శ్లక్ష్ణ మబ్రవీత్. ౫

అయం స పురుషవ్యాఘ్రో ద్వారి తిష్ఠతి తే సుతః,
బ్రాహ్మణేభ్యో ధనం దత్వా సర్వం చైవోపజీవినామ్. ౬

స త్వా పశ్యతు భద్రం తే రామ స్సత్యపరాక్రమః,
సర్వా స్సుహృద ఆపృచ్ఛ్య త్వా మిదానీం దిదృక్షతే. ౭

గమిష్యతి మహారణ్యం తం పశ్య జగతీపతే!,
వృతం రాజగుణై స్సర్వై రాదిత్య మివ రశ్మిభిః. ౮

స సత్యవాదీ ధర్మాత్మా గామ్భీర్యాత్సాగరోపమః,
ఆకాశ ఇవ నిష్పఙ్కో నరేన్ద్రః ప్రత్యువాచ తమ్. ౯

సుమన్త్రానయ మే దారా న్యే కేచి దిహ మామకాః,
దారైః పరివృత స్సర్వై ర్ద్రష్టు మిచ్ఛామి ధార్మికమ్. ౧౦
సోఽన్తఃపుర మతీత్యైవ స్త్రియ స్తా వాక్య మబ్రవీత్,

ఆర్యా! హ్వాయతి వో రాజా గమ్యతాం తత్ర మా చిరమ్.౧౧

ఏవ ముక్తాః స్త్రియ స్సర్వా స్సుమన్త్రేణ నృపాజ్ఞయా,
ప్రచక్రము స్తద్భవనం భర్తురాజ్ఞాయ శాసనమ్. ౧౨

కేర్కొనుచు దుఃఖించుచున్న దశరథుం జూచినంతనె చేతులు మొగుడ్చుకొని సమీపంబునకుఁ బోయెను. ౪

సుమంత్రుఁ డంత దశరథమహారాజునకు జయముగలుగునట్లు ఆశీర్వచనముచేసి భయంబునం దడఁబడుచు మందవాక్యంబున మధురంబుగా నిట్లని చెప్పెను. ౫

పురుషశ్రేష్ఠుండగునట్టి నీకొడుకు రాముండు తనధనమునంతయుం బ్రాహ్మణులకును భృత్యులకు నొసంగి నిన్నుఁజూచుటకై వచ్చి వాకిటం గని పెట్టియున్నాఁడు. ౬

సత్యపరాక్రముండగు నారామునకు నీవిప్పుడు దర్శనం బొసంగుము. అతండు మిత్రుల నందఱను వీడుకొని నిన్ను వీడ్కొనుటకై యిచ్చటకువచ్చి నిన్నుం జూడఁగోరుచున్నాఁడు. ౭

దశరథమహారాజా! ఆరాముం డింక నడవికిఁ బోవుట కున్నాఁడు కావున సూర్యుండు కిరణంబులతోఁ గూడియుండునట్లు సమస్తరాజగుణంబులతోనుం గూడియున్నయతని నీవిప్పుడే చూడుము. అని సుమంత్రుఁడు దశరథునితోఁ జెప్పెను. ౮

సత్యవాదియును ధర్మాత్ముండును గాంభీర్యంబున సముద్రంబునకు సరి వచ్చువాఁడు నాకాశముంబోలె నిర్మలుండునగు నాదశరథమహారాజు సుమంత్రుంజూచి యిట్లని చెప్పెను. ౯

సుమంత్రుఁడా! ఇప్పు డిచ్చటనుండు నాభార్యలనందఱిం దోడ్కొని రమ్ము. భార్యలనందఱింగూడి ధార్మికుండగురాముం జూడఁగోరుచున్నాను.

ఆ సుమంత్రుఁడు అంత నంతఃపురము నతిక్రమించిపోయి దశరథుని భార్యలంజూచి యిట్లని చెప్పెను.

దశరథమహారాజు మిమ్ములం బిలుచుచున్నాఁడు; శీఘ్రముగా నచ్చటికిఁ బొండు. అని సుమంత్రుఁడు దశరథునిభార్యలతోఁ జెప్పెను. ౧౧

ఆ దశరథభార్యలు సుమంత్రుఁడు రాజాజ్ఞ ననుసరించిచెప్పిన మాటను విని పెనిమిటియాజ్ఞను శిరసావహించి పెనిమిటియుండునింటికిం బోయిరి.

అర్ధసప్తశతాస్తాస్తు ప్రమదాస్తామ్రలోచనాః,
కౌసల్యాం పరివార్యాథ శనైర్జగ్ముర్ధృతవ్రతాః. ౧౩

ఆగతేషు చ దారేషు సమవేక్ష్య మహీపతిః,
ఉవాచ రాజా తం సూతం సుమన్త్రానయ మే సుతమ్. ౧౪
స సూతో రామమాదాయ లక్ష్మణం మైథిలీం తదా,
జగామాభిముఖస్తూర్ణం సకాశం జగతీపతేః. ౧౫
స రాజా పుత్రమాయాన్తం దృష్ట్వా దూరాత్కృతాఞ్జలిమ్,
ఉత్పపాతాసనాత్తూర్ణమార్తస్త్రీజనసంవృతః. ౧౬

సోఽభిదుద్రావ వేగేన రామం దృష్ట్వా విశాంపతిః,
తమసంప్రాప్య దుఃఖార్తః పపాత భువి మూర్ఛితః. ౧౭

తం రామోఽభ్యపతత్క్షిప్రం లక్ష్మణశ్చ మహారథః,
విసంజ్ఞమివ దుఃఖేన సశోకం నృపతిం తదా. ౧౮

స్త్రీసహస్రనినాదశ్చ సంజజ్ఞే రాజవేశ్మని,
హాహా రామేతి సహసా భూషణధ్వనిమూర్ఛితః. ౧౯

తం పరిష్వజ్య బాహుభ్యాం తావుభౌ రామలక్ష్మణౌ,
పర్యఙ్కే సీతయా సార్ధం రుదన్తస్సమవేశయన్. ౨౦
అథ రామో ముహూర్తేన లబ్ధసంజ్ఞం మహీపతిమ్,
ఉవాచ ప్రాఞ్జలిర్భూత్వా శోకార్ణవపరిప్లుతమ్. ౨౧

ఆపృచ్ఛే త్వాం మహారాజ! సర్వేషామీశ్వరోఽసి నః,

అంతఁ బతివ్రతలగు నాస్త్రీలు మూఁడునూఱుల యేఁబదిమందియును రామదుఃఖంబున నెఱ్ఱఁగా నుండుకండ్లతోఁ గౌసల్యం బరివేష్టించి మెల్లఁగా నడుచుచుఁ బోయిరి. ౧౩

అట్లు భార్యలందఱు వచ్చుటయు దశరథమహారాజు చూచి సుమంత్రుం బిలిచి, "నాకొడుకు రాముం దీసికొనిరమ్ము" అని చెప్పెను. ౧౪

అప్పుడు సుమంత్రుఁడు రాముని లక్ష్మణుని సీతను బిలుచుకొని శీఘ్రముగా దశరథమహారాజునొద్దకుఁ బోయెను. ౧౫

దశరథమహారాజు దూరంబుననుండి చేతులు మొగుడ్చుకొని వచ్చుచున్నకొడుకును రాముంజూచి దుఃఖితుఁడై భార్యలతోఁగూడ శీఘ్రంబుగా నాసనంబుననుండి లేచెను. ౧౬

అట్లు దశరథుండు రాముంజూచి, వేగంబున లేచి యతనికెదురుగాఁ బోయెను. అంత దుఃఖితుం డగుటవలన రాముంజేర నరుగంజాలక మూర్ఛితుండై నేలంబడెను. ౧౭

రాముండును మహారథుండగు లక్ష్మణుండును అట్లు దుఃఖితుండై దుఃఖంబునఁ దెల్విఁ దప్పినట్లు నేలంబడియున్నదశరథుని లేవనెత్తుటకై తోడనే నేలకు వ్రాలిరి. ౧౮

అంత రాజగృహమునందు దశరథభార్యలందఱు దేహమునందలి భూషణంబులు మ్రోయఁగా హాహాకారంబుల రామునిం జేర్కొని యేడ్వసాగిరి. ౧౯

రామలక్ష్మణులును సీతయును మువ్వురును ఆదశరథునిఁ జేతులం గ్రుచ్చి యెత్తి రోదనంబు సేయుచుఁ బాన్పునం గూర్చుండఁబెట్టిరి. ౨౦

అంత రాముండు చేమోడ్పుగీలించి కొంతకాలమునకు మూర్ఛదేఱి దుఃఖసముద్రంబున మునింగియున్న తండ్రియగుదశరథుంజూచి యిట్లని చెప్పెను. ౨౧

మహారాజా! నీవు మాకందఱకును బ్రభుండవు; నిన్ను వీడ్కొని

ప్రస్థితం దణ్డకారణ్యం పశ్య త్వం కుశలేన మామ్. ౨౨

లక్ష్మణం చానుజానీహి సీతా చాన్వేతు మాం వనమ్,
కారణై ర్బహుభి స్తథ్యై ర్వార్యమాణౌ న చేచ్ఛతః. ౨౩

అనుజానీహి సర్వా న్న శ్శోక ముత్సృజ్య మానద!,
లక్ష్మణం మాంచ సీతాంచ ప్రజాపతి రివ ప్రజాః. ౨౪

ప్రతీక్షమాణ మవ్యగ్ర మనుజ్ఞాం జగతీపతేః,
ఉవాచ రాజా సమ్ప్రేక్ష్య వనవాసాయ రాఘవమ్. ౨౫
అహం రాఘవ! కైకేయ్యా వరదానేన మోహితః,
అయోధ్యాయా స్త్వ మే వాద్య భవరాజా నిగృహ్య మామ్.

ఏవ ముక్తో నృపతినా రామో ధర్మభృతాం వరః,
ప్రత్యువాచాఞ్జలిం కృత్వా పితరం వాక్యకోవిదః. ౨౭

భవా న్వర్షసహస్రాయ పృథివ్యా నృపతే! పతిః,
అహం త్వరణ్యే వత్స్యామి న మే కార్యం త్వయాఽనృతమ్.
"నమేకార్య స్త్వమానృతః" ఇతి పాఠాంతరం.

నవ పఞ్చ చ వర్షాణి వనవాసే విహృత్య తే,
పునః పాదౌ గ్రహీష్యామి ప్రతిజ్ఞాన్తే నరాధిప!. ౨౯

రుద న్నార్తః ప్రియం పుత్రం సత్యపాశేన సంయతః.

దను; నేనిప్పుడు దండకారణ్యమునకుఁ బోయెదను; నీవిట్లు దుఃఖింపక సుఖంబుగా నన్నుఁ జూడుము. ౨౨

మఱియుం లక్ష్మణునకు ననుజ్ఞయిమ్ము; సీతయుం నావెంట నరణ్యంబునకు వచ్చుచున్నది; సీతకు ననుజ్ఞయిమ్ము; వీరలు సరియైన పెక్కుకారణములు చెప్పి యెంతనివారించినను ఇచ్చట నిలుచుటకు సమ్మతింపకున్నారు. ౨౩

మాకందఱకును మానముఁ గలిగించునట్టివాఁడవు నీవు; ఈదుఃఖంబు విడిచి లక్ష్మణునకును నాకును సీతకును మాకందఱకును బ్రహ్మదేవుండు ప్రజలకుంబోలె ననుజ్ఞయొసంగుము. అని రాముఁడు దశరథునితోఁ జెప్పెను. ౨౪

దశరథుం డట్లు లాలస్యంబు సేయక, వనవాసంబునకై తనయనుజ్ఞకెదురుచూచుచున్న రాముంజూచి యిట్లని చెప్పెను. ౨౫

రాముఁడా! నేను కైకేయికి వరంబిచ్చియుండుటంజేసి మోసపోయియున్నాను; నీవిప్పుడు నన్ను నిగ్రహించి నీవే యయోధ్యకు రాజవగుము. అని దశరథుండు రామునకుఁ జెప్పెను ౨౬

మాటలఁ జెప్పుటయందుఁ బండితుండును, ధార్మికశ్రేష్ఠుండునగు రాముండు తండ్రిచెప్పినది విని చేమోడ్పుగీలించి తండ్రితో నిట్లని చెప్పెను. ౨౭

దశరథమహారాజా! నీవు పెక్కుసంవత్సరంబులుగా భూమిం బాలించుచున్నావు. అట్టి నీవు నన్నసత్యవంతునిఁగాఁ జేయవలదు; (పాఠాంతరపక్షమందు: అట్టినీకు నేను గొంచెమంతైన నసత్యదోషము గలుగునట్లు చేయఁగూడదు) కావున నేనరణ్యములో నుండెదను. ౨౮

దశరథమహారాజా! నేను బదునాలుగువర్షంబులు వనంబులో సుఖంబుగానుండి ప్రతిజ్ఞ దీర్చుకొనినపిమ్మట మఱల నిచ్చటికివచ్చి నీపాదంబుల నాశ్రయించెదను. అని రాముండు దశరథునితోఁ జెప్పెను. ౨౯

అంత దశరథుండు సత్యపాశబద్ధుండై రోదనంబు సేయుచు దీనుండై

కైకేయ్యా చోద్యమాన స్తు మిథో రాజా త మబ్రవీత్. 30

శ్రేయసే వృద్ధయే తాత! పునరాగమనాయ చ,
గచ్ఛ స్వారిష్ట మవ్యగ్రః పన్థాన మకుతోభయమ్. ౩౧

న హి సత్యాత్మన స్తాత! ధర్మాభిమనస స్తవ,
వినివర్తయితుం బుద్ధి శ్శక్యతే రఘునన్దన!. ౩౨

అద్య త్విదానీం రజనీం పుత్ర! మాగచ్ఛ సర్వథా,
ఏకాహదర్శనేనాపి సాధు తావ చ్చరా మ్యహమ్. 33

మాతరం మాం చ సమ్పశ్య న్వసే మా మద్య శర్వరీమ్,
తర్పిత స్సర్వకామై స్త్వం శ్వః కాలే సాధయిష్యసి. ౩౪

దుష్కరం క్రియతే పుత్ర! సర్వథా రాఘవ! త్వయా,
మత్ప్రియార్థం ప్రియాం స్త్యక్త్వా యద్యాసి విజనం వనమ్.

న చైత న్మే ప్రియం పుత్ర! శపే సత్యేన రాఘవ!,
ఛన్నయా చలిత స్త్వస్మి స్త్రియా ఛన్నాగ్నికల్పయా. ౩౬

వఞ్చనా యాతు లబ్ధా మే తాం త్వం నిస్తర్తు మిచ్ఛసి,
అనయా వృత్తసాదిన్యా కైకేయ్యాఽభిప్రచోదితః. ౩౭

రహస్యంబునఁ గైకేయీప్రేరితుండై ప్రియపుత్రుండగు రామునింజా
పుట్టని చెప్పెను. 3

నాయనా! నీకుఁ బరలోకసుఖంబును, ఐహికసౌఖ్యంబును గలుగు
గాక; మఱల నిచ్చటికి వచ్చుటయుఁ గలుగుఁ గాక. మంగళకరంబున
కష్టంబులేనిదియుం బెంతమాత్రము భయంబులేనిదియు నగుమార్గము నవల
బించి పొమ్ము. 3

నాయనా! నిన్నుఁజూడఁగా రఘువంశమునఁ బుట్టినవారల కంద
కును సంతోషంబు గలుగును. నీవు సత్యస్వభావుఁడవు, పరమధార్మికుండవు
అట్టినీబుద్ధి మాఱునట్లు సేయ నలవిగాదు. 3.

కొమరా! ఇప్పుడుమాత్రము నీవెట్లయినను బోఁగూడదు. ఈరాత్రి
యంతయు నిచ్చటనేయుండుము. ఇట్లు ఒకదినమయినను నిన్నుఁజూచుచు
సుఖముగా నుండెదను. 3

నీవు, నీతల్లిని నన్నుం జూచుచు నీరాత్రియంతయు నిచ్చట నుండుము
మేము నీకోర్కులన్నియుఁ దీర్చి నీవు తృప్తిఁబొందునట్లు చేసెదము; అం
రేపు ప్రాతఃకాలంబునం బోవచ్చును. 3

రాముఁడా! నాసంతోషమునకై నీకుఁ బ్రియంబు గలిగించువా
నన్నిటిని బరిత్యజించి విజనంబగు నరణ్యంబునకుఁ బోవుచున్నావే; ఇట్టి
కఠినకార్యము చేయుచున్నావు; ఇట్లెవ్వరును జేయఁజాలరు. 3

రాముఁడా! నీవి ట్లరణ్యమునకుఁ బోవుట నాకెంతమాత్ర మిష్టమ
గాదు; అయితే అగ్నిహోత్రము బూడిదచేఁ గప్పఁబడినట్లు సత్యముతో
బాసచేసెదను. ఈకైకేయి మనసులో వేఱుక్రూరాభిప్రాయంబు నుంచుకొ
నన్నుఁ జాపలంబునొందినట్లు చేసినది ఇదిమాత్రము వాస్తవము. 3

నన్నుఁ గైకేయి మోసము చేసినది; అట్టిమోసమునుగూడ నీవు కుల
చారముం జెఱచు నీకైకేయిమాట విని సఫలముగాఁ జేయఁగోరుచున్నావు
నీధార్మికతం జూడఁగా నాశ్చర్యము గలుగుచున్నది. 3

నచైతదాశ్చర్యతమం యస్త్వం జ్యేష్ఠ స్సుతో మమ,
అపానృతకథం పుత్ర! పితరం కర్తు మిచ్ఛసి. ౩౮

అథ రామ స్తథా శ్రుత్వా పితు రార్తస్య భాషితమ్,
లక్ష్మణేన సహా భ్రాత్రా దీనో వచన మబ్రవీత్. ౩౯
ప్రాప్స్యామి యా నద్య గుణా న్కో మే శ్వస్తా నృదాస్యతి,
అపక్రమణ మే వాత స్సర్వకామై రహం వృణే. ౪౦

ఇయం సరాష్ట్రా సజనా ధనధాన్యసమాకులా,
మయా విసృష్టా వసుధా భరతాయ ప్రదీయతామ్. ౪౧
వనవాసకృతా బుద్ధి ర్నచ మేఽద్య చలిష్యతి,

య స్తుష్టేన వరో దత్తః కైకేయ్యై వరద! త్వయా. ౪౨
దీయతాం నిఖిలేనైవ సత్య స్త్వం భవ పార్థివ!,

అహం నిదేశం భవతో యథోక్త మనుపాలయన్. ౪౩
చతుర్దశ సమా వత్స్యే వనే వనచరై స్సహ,
మా విమర్శో వసుమతీ భరతాయ ప్రదీయతామ్. ౪౪
న హి మే కాంక్షితం రాజ్యం సుఖ మాత్మని వా ప్రియమ్,
యథా నిదేశం కర్తుం వై తవైవ రఘునన్దన!. ౪౫
అపగచ్ఛతు తే దుఃఖం మాభూ ర్బాష్పపరిప్లుతః,
నహి క్షుభ్యతి దుర్ధర్ష స్సముద్ర స్సరితాంపతిః. ౪౬

నైవాహం రాజ్య మిచ్ఛామి నసుఖం న చ మైథిలీమ్,

కొడుకా! నాజ్యేష్ఠపుత్రుండవగు నీవు తండ్రినగు నా కసత్య దోషంబు లేకుండునట్లు సేయఁగోరుట యంత యాశ్చర్యకరముగాదు. అని దశరథుఁడు రామునితోఁ జెప్పెను. ౩౮

అంత రాముండు దుఃఖితుండగు తండ్రి చెప్పినమాటను విని దుఃఖితుండై లక్ష్మణుండును దుఃఖింప నిట్లని చెప్పెను. ౩౯

మీరు చెప్పినట్లు ఇప్పుడు నేను మంచిపదార్థంబుల ననుభవించి నను వానివి రేపు నా కెవ్వఁడిచ్చును? కావున నిప్పుడు గావలెననుటయు వ్యర్థము; అందువలన నాకోర్కులు నక్కఱలేదు; ఇప్పుడే వనంబునకుఁబోవుట గావలసినది. ౪౦

దేశంబులతోఁగూడి జనులతోను ధాన్యములతోను సంపూర్ణంబైయున్న నాచే విడువఁబడిన భూమినంతయు భరతున కొసంగుము. ౪౧

వనవాసంబు సేయవలయునను నాతలంపు ఇప్పుడెంతమాత్రము చలనము నొందదు.

వరంబుల నివ్వఁజాలినదశరథుఁడా! నీవు సంతోషంబునఁ గైకేయికి వరం బిచ్చియున్నావో, దానినంతయుఁ గొఱంత లేనట్లు ఆబిడ కిచ్చిసత్యవాది వగుము. ౪౨

నీ వాజ్ఞాపించినట్లు వనంబున ఋషులతోఁ దంగూడఁ బదునాలుగు సంవత్సరంబులుండి నీయాజ్ఞను నెఱవేర్చెదను. ౪౩

ఎంతమాత్రము సంశయింపకుము; భరతునకు రాజ్యము నొసంగుము.

దశరథుఁడా! నీయాజ్ఞ నెఱవేర్చుటయందు నాకుఁగలంతటికోర్కి రాజ్యమునందుఁగాని, మఱియేసుఖమునందుఁగాని నా కెంతమాత్రము లేదు.

ఈదుఃఖమును విడువుము; ఇట్లు కన్నీళ్లు గార్చుచుండవలదు; నదీపతియయినసముద్రం బెప్పుడైనఁ గలఁతనొందునా? అట్టిసముద్రునివంటి వాఁడవు నీవు; ఇట్లింతదుఃఖించుచుండుట సరిగాదు. ౪౪

నాకు రాజ్యమునందుఁగాని సుఖమునందుఁగాని సీతయందుఁగాని

నైవ సర్వా నిమాన్కామా న్న స్వర్గం నైవ జీవితమ్. ౪౭

త్వాం మహం సత్య మిచ్ఛామి నానృతం పురుషర్షభ!,
ప్రత్యక్షం తవ సత్యేన సుకృతేన చ తే శపే. ౪౮
న చ శక్యం మయా తాత! స్థాతుం క్షణమపి ప్రభో,
న శోకం ధారయ స్వేమం న హి మేఽస్తి విపర్యయః. ౪౯

అర్థితో హ్యస్మి కైకేయ్యా వనం గచ్ఛేతి రాఘవ!,
మయా చోక్తం వ్రజామీతి తత్సత్య మనుపాలయే. ౫౦

మా చోత్కణ్ఠాం కృథా దేవ! వనే రంస్యామహే వయమ్,
ప్రశాన్తహరిణాకీర్ణే నానాశకునినాదితే. ౫౧

పితా హి దైవతం తాత! దేవతానా మపి స్మృతమ్,
తస్మా ద్దైవత మిత్యేవ కరిష్యామి పితు ర్వచః. ౫౨

చతుర్దశసు వర్షేషు గతేషు నరసత్తమ!,
పునర్ద్రక్ష్యసి మాం ప్రాప్తం సన్తాపోఽయం విముచ్యతామ్. ౫౩
యేన సంస్తమ్భనీయోఽయం సర్వో బాష్పగళో జనః,
స త్వం పురుషశార్దూల! కిమర్థం విక్రియాం గతః. ౫౪

పురం చ రాష్ట్రం చ మహీ చ కేవలా
మయా నిసృష్టా భరతాయ దీయతామ్,
అహం నిదేశం భవతోఽనుపాలయ
న్వనం గమిష్యామి చిరాయ సేవితుమ్. ౫౫

మఱియు నీకామ్యపదార్థములయందుఁగాని స్వర్గమునందుఁగాని ప్రాణము నందుఁగాని నాకెంతమాత్రమును గోర్కిలేదు. ౪౭

పురుషశ్రేష్ఠుఁడవగు దశరథుఁడా! నాకు నీవును సత్యమునె కావలసి నది. నీయెదుట సత్యముతోను సుకృతంబుతోను బాసచేయుచున్నాను. ౪౮

ప్రభుండవగుదశరథుఁడా! ఇచ్చట క్షణకాలమయిన నుండుటకు నా కలవికాదు. నీ వీదుఃఖ ముంచుకొనియుండకుము. నాసంకల్పము మఱలం జలనము నొందదు. ౪౯

దశరథుఁడా! కైకేయి నన్ను "వనంబునకుఁ బొమ్ము" అని ప్రార్థించినది. అందుకు నేనును "అలాగే వనంబునకుఁ బోయెదను" అని చెప్పినాను. కాఁబట్టి నే నిప్పు డాసత్యమును రక్షించుకొనుచున్నాను. ౫౦

దశరథమహారాజా! నీవు మమ్ముగుఱించి దుఃఖింపుచుండకుము. మేము శాంతములయినమృగంబులతోఁగూడి మనోహరంబులయిన నానావిధపక్షిధ్వను లతో నొప్పుచున్నయరణ్యంబున సుఖంబుగా విహరింపుచుండెదము. ౫౧

తండ్రీ! దేవతలకునుంగూడ దండ్రియే దైవతమని చెప్పఁబడి యున్నది గదా! అందువలన తండ్రియే దైవమని యెంచియే నేను దండ్రియాజ్ఞను నెఱవేర్చెదను. ౫౨

మనుష్యశ్రేష్ఠుండవగు దశరథుఁడా! పదునాలుగేఁడులు గడచిన పిమ్మట వచ్చిన నన్ను మఱలఁ జూచెదవు. ఈదుఃఖము విడువుము. ౫౩

పురుషశ్రేష్ఠుండవగు దశరథమహారాజా! ఇట్లు డగ్గుత్తికతో దుఃఖింపు చున్న యీజనులందఱును దేర్పవలసినట్టి నీవును ఇట్లు దుఃఖించుచున్నా వేమి? ౫౪

నేను బరిత్యజించిన పట్టణమును రాజ్యమును ఈభూమినంతయును భర తున కొసంగుము. నేను నీ వాజ్ఞాపించినట్లు అరణ్యంబునకుఁ బోయి బహు కాలం బుండెదను. ౫౫

మయా నిసృష్టాం భరతో మహీ మిమాం
సశైలషణ్డాం సపురాం సకాననామ్,
శివాం సుసీమా మనుశాస్తు కేవలం
త్వయా యదుక్తం నృపతే! తథాఽస్తు తత్. ౫౧

న మే తథా పార్థివ! ధీయతే మనో
మహాత్సు కామేషు నచాత్మనః ప్రియే,
యథా నిదేశే తవ శిష్టసమ్మతే
వ్యపైతు దుఃఖం తవ మత్కృతేఽనఘ. ౫౨

త దద్య నైవానఘ! రాజ్య మవ్యయం
న సర్వకామా న్న సుఖం న మైథిలీమ్,
న జీవితం త్వా మనృతేన యోజయన్
వృణీయ సత్యం వ్రత మస్తు తే తథా. ౫౩

ఫలాని మూలాని చ భక్షయ న్వనే
గిరీంశ్చ పశ్య న్సరిత స్సరాంసి చ,
వనం ప్రవి శ్యైవ విచిత్రపాదపం
సుఖీ భవిష్యామి త వాస్తు నిర్వృతిః. ౫౪

ఏవం స రాజా వ్యసనాభిపన్న
శ్శోకేన దుఃఖేన చ తామ్యమానః,
ఆలిఙ్గ్య పుత్రం సువినష్టసంజ్ఞో
మోహం గతో నైవ చిచేష్ట కించిత్. ౫౫
దేవ్య స్తత స్సంరురుదు స్సమేతా
స్తాం వర్జయిత్వా నరదేవపత్నీమ్,

దశరథమహారాజా! పర్వతంబులతోను బట్టణంబులతోను వనంబులతోను ఒప్పుచు స్థిరములయిన యెల్లలుగలుగుటం జేసి సుఖకరంబైయున్న నేను బరిత్యజించిన యీభూమిని భరతుఁడే పరిపాలింపుచుండుఁగాక. నీ వెట్లు చెప్పితివో అట్లే జరగవలయును. ౫౬

పాపరహితుఁడవగు దశరథమహారాజా! నాకు శిష్టసమ్మతంబగు నీయాజ్ఞఁ బరిపాలించుటయం దుత్సాహంబుండునట్లు ఉత్కృష్టములయిన కోర్కులందుఁ గాని నాకుఁ బ్రియంబయిన దానియందుఁగాని యుత్సాహంబు లేదు. కావున, నరణ్యంబునకుఁ బోవుట నాకుఁ గష్టమని నీవెంతమాత్రము నాకుఁగా దుఃఖింపవలదు. ౫౭

పాపరహితుఁడా! మహాత్ముఁడవగు నీ కసత్యదోషంబు సంభవించునట్లగునేని సమస్తకామంబులను సుఖంబును సీతను దుదకుఁ బ్రాణంబునుం గూడఁ గోరను; ఇంక నీరాజ్యంబుఁ గోరనని చెప్పనేల? ఎట్లైనను నీసత్యవ్రతంబు చెడకుండవలయును. ౫౮

నేను నానావిధంబులగు వృక్షంబుల నొప్పుచుండు నడవికిఁ బోయి యచ్చటనే ఫలంబులను గడ్డలనుం దినుచుఁ బర్వతంబులను నదులను గొలంకులనుం జూచుచు సుఖంబుగా నుండెదను; నీవు దుఃఖంబు విడిచి సుఖంబు నొందుము. అని రాముండు దశరథునితోఁ జెప్పెను. ౫౯

పరమదుఃఖితుండగు నాదశరథమహారాజు, ఇట్లు తాపంబునను దుఃఖంబునను బరితపించుచుఁ గొడుకుం గవుఁగిలించుకొని తెల్విదప్పి మూర్ఛితుండై చేష్టలుడిగియుండెను. ౬౦

అంత నాకైకేయిదక్కఁ దక్కినరాజపత్నులందఱు నొక్కటియయి మిక్కుటంబుగ రోదనంబుచేసిరి. సుమంత్రుండును రోదనంబు సేయుచు

రుదన్సుమన్త్రోఽపి జగామ మూర్ఛాం
హాహాకృతం తత్ర బభూవ సర్వమ్. ౬౧

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే చతుస్త్రింశస్సర్గః.

---

## పఞ్చత్రింశస్సర్గః

తతో నిర్ధూయ సహసా శిరో నిశ్శ్వస్య చాసకృత్,
పాణౌ పాణిం వినిష్పిష్య దన్తాన్కటకటాప్య చ. ౧
లోచనే కోపసంరక్తే వర్ణం పూర్వోచితం జహత్,
కోపాభిభూత స్సహసా సన్తాప మశుభం గతః. ౨
మన స్సమీక్షమాణశ్చ సూతో దశరథస్య సః,
కమ్పయన్నివ కైకేయ్యా హృదయం వాక్ఛరైః శితైః. ౩
వాక్యవజ్రై రనుపమై ర్నిర్భిన్దన్నివ చాశుగైః,
కైకేయ్యా స్సర్వమర్మాణి సుమన్త్రః ప్రత్యభాషత. ౪
యస్యా స్తవ పతి స్త్యక్తో రాజా దశరథ స్స్వయమ్,
భర్తా సర్వస్య జగత స్స్థావరస్య చరస్య చ. ౫
న హ్యకార్యతమం కిఞ్చి త్తవ దేవీహ విద్యతే,
పతిఘ్నీం త్వా మహం మన్యే కులఘ్నీ మపి చాన్తతః. ౬
యన్మహేన్ద్ర మి వాజయ్యం దుష్ప్రకమ్ప్య మి వాచలమ్,
మహోదధి మి వాక్షోభ్యం సన్తాపయసి కర్మభిః. ౭

మావమంస్థా దశరథం భర్తారం వరదం పతిమ్,
భర్తు రిచ్ఛా హి నారీణాం పుత్రకోట్యా విశిష్యతే. ౮

మూర్ఛితుండయ్యె. అచ్చటి జనులందఱును హాహాకారంబుల రోదనంబుచేసిరి.

ఇది ముప్పదినాలవసర్గము.

---

## ముప్పదియైదవసర్గము

అంత సారథియగుసుమంత్రుండు కోపాతిరేకంబునఁ దలను విదిర్చికొని పలుమాఱు నిట్టూర్పులుపుచ్చి చేతిలోఁ జేయియుంచి నలుపుకొనుచు దంతంబులు కటకటంగొఱుకుచుఁ గోపంబునఁ గండ్లనెఱ్ఱంజేసుకొని దేహంబంతయుఁ బూర్వవర్ణంబు విడిచి రౌద్రదనంబునొంద మహాసంతాపంబునొంది దశరథుండు కైకేయివైపఁ గోపంబునొందియుండుటంజూచి తీక్ష్ణంబులగు బాణంబులంబోలు వాక్యంబులఁ గైకేయి హృదయంబు గడగడ వడంకునట్లు సేయువాఁడువలె బాణంబులచే మర్మస్థానంబు భేదించునట్లు మాటలచే నాబిడగుట్టు బట్టబయలు సేయుచు నిట్లని చెప్పెను. ౧-౪

కైకేయీ! పెనిమిటియను స్థావరజంగమాత్మకమయిన భూమికంతయుఁ బ్రభువునగు దశరథునే విడిచితివే; అట్టినీకు ఈలోకంబునందంతయుఁ జేయరాని దేదియున్నది? నీ వెట్టియకార్యమునైనం జేయఁగలవు! ౫

దేవేంద్రుఁడుంబోలెఁ జయింప నలవిగానివాఁడును, బర్వతంబుంబోలె జలనంబు నొందఁజేయ నలవిగానివాఁడును, సముద్రంబుంబోలె క్షోభము నొందునట్లుసేయ నలవిగానివాఁడునగు దశరథమహారాజునకుఁ గూడదుఃఖంబు గల్గునట్లుసేయుచున్నావు; గావున నీవు పెనిమిటిం జంపుదానవు; చక్కఁగా విచారించినచోఁ గులంబునంతయుఁ నశింపఁజేయుదానవని తలంచుచున్నాను.

అందఱను బోషించువాఁడును, వరంబుల నిచ్చువాఁడును, పెనిమిటియు నగుదశరథు నవమానించకుము. స్త్రీలకుఁ బెనిమిటి సంతోషించుటయె కోటికొడుకులకన్న నధికము. ౭-

యథా వయోహి రాజ్యాని ప్రాప్నువన్తి నృపక్షయే,
ఇక్ష్వాకుకులనాథేఽస్మిం స్తల్లోపయితు మిచ్ఛసి. ౯

రాజా భవతు తే పుత్రో భరత శ్శాస్తు మేదినీమ్,
వయం తత్ర గమిష్యామో యత్ర రామో గమిష్యతి. ౧౦
నహి తే విషయే కశ్చి ద్బ్రాహ్మణో వస్తు మర్హతి,
తాదృశం త్వ మమర్యాద మద్య కర్మ చికీర్షసి. ౧౧

ఆశ్చర్య మివ పశ్యామి యస్యా స్తే వృత్త మీదృశమ్,
ఆచరన్త్యా న వివృతా సద్యో భవతి మేదినీ. ౧౨
మహాబ్రహ్మర్షిజుష్టా వా జ్వలన్తో భీమదర్శనాః,
ధిగ్వాగ్దణ్డా న హింసన్తి రామప్రవ్రాజనే స్థితామ్. ౧౩

ఆమ్రం ఛిత్త్వా కుఠారేణ నిమ్బం పరిచరేత్తు యః,
యశ్చైనం పయసా సిఞ్చే న్నైవాస్య మధురో భవేత్. ౧౪

ఆభిజాత్యం హి తే మన్యే యథా మాతు స్తథైవ చ,
నహి నిమ్బా త్స్రవే త్క్షౌద్రం లోకే నిగదితం వచః. ౧౫

లోకంబున రాజున కవసానకాలము వచ్చినప్పుడు కొడుకులు వారి వయస్సు ననుసరించి జ్యేష్ఠుఁడు రాజ్యంబునొందుటయుం నితరు లతనిననుసరించు చుండుటయుం నిట్లు నడుచుకొనుచుందురుకదా! అట్లు జ్యేష్ఠుఁడగుటంజేసి యిక్ష్వాకువంశంబునకుఁ బ్రభువు కాఁదగిన యీరాముని విషయమయి యీధర్మము నేల చెఱపఁదలంచితివేమి! ౯

నీకొడుకు భరతుండు రాజగుఁగాక. అతఁడే భూమిం బాలించుచుండుఁగాక. రాముఁ డెచ్చటికిఁబోవునో మే మందఱము నచ్చటికిఁబోయెదము. ౧౦

నీదేశమునం దింక నొక్క బ్రాహ్మణుండైన నుండఁడు. అట్లు బ్రాహ్మణు లందఱును లేచిపోవునట్లు నీవిప్పు డెంతమాత్రము మర్యాదలేని కార్యము సేయఁ దలంచియున్నావు. ౧౧

నీ విట్టి క్రూరమయిన యాచారమును జేయుచున్నను తత్క్షణమే భూమి పగులకున్నదే! దీనింజూడఁగా నా కాశ్చర్యమగుచున్నది. ౧౨

తీక్ష్ణంబులును జాపరులకు భయంబుఁ బుట్టించునవియునగు బ్రహ్మర్షులచేఁ గోపంబునం జెప్పఁబడు "దహింపఁబడుఁగాక" అను శాపవాక్యంబులయి నను రాము నరణ్యంబునకుఁ బంపఁదలఁచియున్న యీకైకేయింగాలియు పెట్టవేమి! ౧౩

ఎవ్వఁడేని తియ్యనిపండ్ల నొసంగునట్టి మామిడిచెట్టును గొడ్డలిచే నఱికి వేఁపచెట్టుకుఁ బాఁదులుగట్టి దానిం బాలచేఁ దడుపుచు వచ్చునేని యావేఁపచెట్టతనికిఁ దియ్యనిపండ్ల నొసంగక చేఁదుకాయలనే యిచ్చునట్లు రాము నడవికిఁ బంపి కైకేయికి సంతోషము సేయుటచేత దశరథునకుఁ గష్టమే. కాని యెంతమాత్రము కైకేయివలన సుఖంబుగలుగదు. ౧౪

నీసత్స్వభావమును నాకుఁ దెలియును; నీతల్లిస్వభావ మెట్టిదో అట్టిదే నీస్వభావమును; వేఁపచెట్టునుండి తేనె స్రవింపదను సంగతి లోకంబునం బ్రసిద్ధముగదా! దుష్టరాలకు సుపుత్రి యెట్లుపుట్టును! ౧౫

తవ మాతు రసద్గ్రాహం విద్మః పూర్వం యథాశ్రుతమ్,
పితు స్తే వరదః కశ్చి ద్దదౌ వర మనుత్తమమ్. ౧౬

సర్వభూతరుతం తస్మా త్సంజజ్ఞే వసుధాధిపః,
తేన తిర్యగ్గతానాం చ భూతానాం విదితం వచః ౧౭

తతో జృమ్భస్య శయనే విరుతా ద్భూరివర్చసః,
పితు స్తే విదితో భావ స్స తత్ర బహుధాఽహసత్. ౧౮

తత్ర తే జననీ క్రుద్ధా మృత్యుపాశ మభీప్సతీ,
హాసం తే నృపతే! సౌమ్య! జిజ్ఞాసామీతి చాబ్రవీత్. ౧౯

నృప శ్చోవాచ తాం దేవీం దేవి! శంసామి తే యది,
తతో మే మరణం సద్యో భవిష్యతి న సంశయః. ౨౦

మాతా తే పితరం దేవి! తతః కేకయ మబ్రవీత్,
శంస మే జీవ వా? మా వా? న మా మపహసిష్యసి. ౨౧

ప్రియయా చ తథో క్తస్సన్ కేకయః పృథివీపతిః,
తస్మై తం వరదాయార్థం కథయామాస తత్త్వతః. ౨౨

సీతల్లిచేసిన దుశ్చేష్టలన్నియుం మున్ను వినియున్నాము. మాకుం దెలియును.

వరంబుల నొసంగఁజాలిన యొకానొకమహాత్ముఁడు నీతండ్రికుత్తమం బగువరం బొక్కటి యొసంగెను. ౧౬

ఆవరమువలన నతనికి సమస్తప్రాణులు మాటలాడుకొనుమాటలు దెలియుచు వచ్చెను.

అతనికిఁ దిర్యగ్జంతువులు మాటలాడుకొనుమాటలును దెలియుచుండినవి. ౧౭

అంత నొక్కనాఁడు, కాంతిమంతుండగు నీతండ్రి శయనసమీపంబున జృంభంబను నొక్కపిపీలిక పలికినమాటవలన దానియభిప్రాయంబెఱింగి దానిం దలంచుకొని పలుమాఱు నవ్వెను. ౧౮

అంత నీతల్లి, పెనిమిటి యట్లు నవ్వుటంజూచి తన్నుఁజూచి పరిహసించెనని తలంచి యవమానంబు సహింపఁజాలక మరణంబునైనం గోరు నంతటికోపంబునొంది పెనిమిటింజూచి "శాంతుఁడవగుమహారాజా! నీవిప్పుడు నవ్వుటకుఁగల కారణంబును నాకుఁ జెప్పవలయుం" అని యడిగెను.

కేకయమహారాజును భార్యంజూచి 'నీకు నే నవ్విన కారణముం జెప్పితినేని నాకుఁ దత్క్షణంబె మరణంబు గలుగును. ఇందుకు సందేహము లేదు." అని చెప్పెను. ౨౦

కైకెయీ! అంత నీతల్లి నీతండ్రియగు కేకయమహారాజుం జూచి యిట్లని చెప్పెను.

నీవు బ్రతుకుము లేక చచ్చిపొమ్ము. నాకు నక్కఱలేదు. నీవు నవ్విన కారణముం జెప్పుము. నీవు నన్నుఁ బరిహసించినావో లేదో తెలిసికొనవలయును అని నీతల్లి నీతండ్రితోఁ జెప్పినది. ౨౧

భూమికిఁ బ్రభువైన కేకయమహారాజు భార్యచెప్పినమాటను విని ఆసమాచారము నంతయుం యథార్థముగా మున్ను తన కావరమునిచ్చినవానికిం జెప్పెను. ౨౨

తత స్స వచన స్సాధూ రాజానం ప్రత్యభాషత,

మ్రియతాం ధ్వంసతాం చేయం మాకృథా స్త్వం మహీపతే!.

స త చ్ఛ్రుత్వా వచ స్తస్య ప్రసన్నమనసో నృపః,
మాతరం తే నిర స్యాశు విజహార కుబేరవత్. ౨౪

తథా త్వ మపి రాజానం దుర్జనాచరితే పథి,
అసద్గ్రాహ మిమం మోహా త్కురుషే పాపదర్శిని!. ౨౫

సత్య శ్చాద్య ప్రవాదోఽయం లౌకికః ప్రతిభాతి మా,
పితౄ న్సమనుజాయ న్తే నరా మాతర మఙ్గనాః. ౨౬

నైవం భవ గృహా ణేదం య దాహ వసుధాధిపః,
“నేయాంభవ” ఇతి పాఠాంతరం.
భ ర్తు రిచ్ఛా ముపా స్వేహ జనస్యాస్య గతి ర్భవ. ౨౭

మా త్వం ప్రోత్సాహితా పాపై ర్దేవరాజసమప్రభమ్,
భర్తారం లోకభర్తార మసద్ధర్మ ముపాదధాః. ౨౮

నహి మిథ్యా ప్రతిజ్ఞాతం కరిష్యతి తవానఘః,
శ్రీమా న్దశరథో రాజా దేవి! రాజీవలోచనః. ౨౯

అంత సత్పురుషుండగు నావరంబు నిచ్చినవాఁడు కేకయమహారాజుం జూచి యిట్లని చెప్పెను.

కేకయమహారాజా ! ఈబిడ చచ్చినను జచ్చుఁగాక, లేక చెడిపోయి నను జెడిపోవుఁగాక. ఏమిచేసినను ! నీ వింతమాత్రమును జెప్పకుము. అని వరము నిచ్చినవాఁడు కేకయమహారాజుతోఁ జెప్పెను. ౩౩

ఆ కేకయమహారాజు నిర్మలమానసుండగు నావరంబు నిచ్చినవాఁడు చెప్పినమాటను విని శీఘ్రముగా నీతల్లిని దిరస్కరించి కుబేరునిభంగి సుఖముగా విహరింపుచుండెను. ౩౪

పాపములుమాత్రము సేయఁగోరునట్టి కైకేయీ ! నీవును, నీతల్లివలెనే దుష్టస్త్రీల మార్గంబు నవలంబించి మోహంబున దశరథునకుఁ జెడుపుగల్గునట్లు సేయుచున్నావు. ౩౫

“కొడుకులకుఁ దండ్రిగుణములు వచ్చును. కొమార్తెలకుఁ దల్లిగుణములు వచ్చును” అని లోకమునం జెప్పఁబడువార్త ఇప్పుడు నాకు అబద్ధము కాదని తోఁచుచున్నది. ౩౬

నీ విట్లుండకుము. (పాఠాంతరపక్షమందు: నీవు పెనిమిటియగు దశరథమహారాజునకు విధేయురాల వగుము) అతఁడు చెప్పినట్లు వినుము.

నీ పెనిమిటికోర్కెచొప్పున నీవును రామునిపట్టాభిషేకంబున గొడంబడుము. ఇప్పుడు రాముని వనవాసమునుగుఱించి పరమదుఃఖంబు నొంది యున్న యీపౌరజానపదాదిజనులం గాపాడుము. ౩౭

నీవు పాపిష్ఠులు చెప్పుమాటలు విని దేవేంద్రునకు సాటియయిన వాఁడును, లోకనాయకుండునగు పెనిమిటికి అధర్మము గల్గునట్లు సేయకుము. ౩౮

కైకేయీ ! పాపరహితుండును శ్రీమంతుండును కమలంబులంబోలె విశాలరమణీయంబులయిన నేత్రంబులు గలవాఁడునగు దశరథమహారాజు నకు వాగ్దత్తము చేసినదాని నివ్వఁదనుస్సందియంబు నీకు వలదు. అతఁడు

జ్యేష్ఠో వదాన్యః కర్మణ్యః స్వధర్మపరిరక్షితా,
రక్షితా జీవలోకస్య బలీ రామోఽభిషిచ్యతామ్. 30

పరివాదో హి తే దేవి! మహాన్లోకే చరిష్యతి,
యది రామో వనం యాతి విహాయ పితరం నృపమ్. 3౧
స రాజ్యం రాఘవః పాతు భవ త్వం విగతజ్వరా,
నహి తే రాఘవాదన్యః క్షమః పురవరే వసేత్. 3౨

రామే హి యౌవరాజ్యస్థే రాజా దశరథో వనమ్,
ప్రవేక్ష్యతి మహేష్వాసః పూర్వవృత్తమనుస్మరన్. 33

ఇతి సాన్త్వైశ్చ తీక్ష్ణైశ్చ కైకేయీం రాజసంసది,
సుమన్త్రః క్షోభయామాస భూయ ఏవ కృతాఞ్జలిః. 3౪

నైవ సా క్షుభ్యతే దేవీ న చ స్మ పరిదూయతే,
నచాస్యా ముఖవర్ణస్య విక్రియా లక్ష్యతే తదా. 3౫

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే పఞ్చత్రింశస్సర్గః.



సత్యసంధుండు గావున, నేవిధముననైన నీవరంబు లొసంగి సంతోషంబు నేయంను. ౨౯

జ్యేష్ఠుండు మిక్కిలి యుదారుండు, సదాచారసంపన్నుండుఁ, దన క్షత్రియధర్మంబు దప్పక నడుచుకొనువాఁడు, జీవలోకంబునంతయుఁగాపాడఁ జాలినవాఁడు, బలవంతుఁడు నిట్లు పట్టాభిషేకయోగ్యంబులగు సద్గుణంబు లన్నియుం గలిగి యొప్పుచున్నరామునకుఁ బట్టాభిషేకము ఘటిల్లునట్లు నేయుము. ౩౦

కైకేయీ ! రాముఁడు మహారాజుగానుండు తండ్రింబాసి యరణ్యంబు నకుఁ బోవునేని నీకీలోకంబునందంతయుఁ గొప్పయపవాదము గలుగును. ౩౧

అట్టిసద్గుణసంపన్నుండగురాముఁడె రాజ్యంబుఁ బాలింపుచుండుఁ గాక. నీ వీపరితాపంబు విడువుము. రాముం డడవికిఁ బోయినచో నీ యయోధ్యయందు మఱియొక్కం డెవ్వఁడును వాసంబు సేయఁడు. ౩౨

రాముండు యావరాజ్యంబు వహించినపిమ్మట మహాపరాక్రమశాలి యగుదశరథమహారాజు, మున్నిక్ష్వాకువంశ్యులు గావించిన యాచారపద్ధతి ననుసరించి వనంబునకుఁ బోవును. ఇదియేగదా యుక్తము ! అని సుమంత్రుఁడు కైకేయితోఁ జెప్పెను. ౩౩

ఇట్లు సుమంత్రుఁడు, రాజసభయందు సాంత్వవాక్యంబులచేతను గఠినవాక్యంబులచేతను గైకేయిని క్షోభింపఁజేసి యంత నెప్పటియట్ల చేతులు మొగడ్చుకొనియుండెను.

అప్పు డట్లు ఎంతకఠినంబుగా మాటలాడినను ఆకైకేయికి క్షోభంబు గలుగదయ్యె. ఎంతసాంత్వవాక్యంబు లాడినను మనంబు గరఁగి దుఃఖంబు నొందదయ్యె. మఱియు మొగంబునందు క్రూరవర్ణము ఎంతమాత్రము మాఱదయ్యె.

ఇది ముప్పదియైదవసర్గము

---

## షట్త్రింశస్సర్గః

తత స్సుమన్త్ర మైక్ష్వాకః పీడితోఽత్ర ప్రతిజ్ఞయా,
స బాష్ప మతినిశ్శ్వస్య జగాదేదం పునః పునః. ౧

సూత! రత్నసుసమ్పూర్ణా చతుర్విధబలా చమూః,
రాఘవ స్యానుయాత్రార్థం క్షిప్రం ప్రతివిధీయతామ్. ౨
రూపాజీవా శ్చ వాదిన్యో వణిజ శ్చ మహాధనాః,
శోభయన్తు కుమారస్య వాహినీం సుప్రసారితాః. ౩

యే చైన ముపజీవన్తి రమతే యై శ్చ వీర్యతః,
తేషాం బహువిధం దత్వా తా న ప్యత్ర నియోజయ. ౪

ఆయుధాని చ ముఖ్యాని నాగరా శ్శకటాని చ,
అనుగచ్ఛన్తు కాకుత్థ్సం వ్యాధా శ్చారణ్యగోచరాః. ౫

నిఘ్నన్ మృగాన్ కుఞ్జరాం శ్చ పిబం శ్చారణ్యకం మధు,
నదీ శ్చ వివిధాః పశ్య న్నరాజ్యస్య స్మరిష్యతి. ౬

ధాన్యకోశ శ్చ యః కశ్చి ద్ధనకోశ శ్చ మామకః,
తౌ రామ మనుగచ్ఛేతాం వసన్తం నిర్జనే వనే. ౭
యజ న్పుణ్యేషు దేశేషు విసృజం శ్చాప్తదక్షిణాః,
ఋషిభి శ్చ సమాగమ్య ప్రవత్స్యతి సుఖం వనే. ౮

భరత శ్చ మహాబాహు రయోధ్యాం పాలయిష్యతి,

## ముప్పదాఱవసర్గము

అంత దశరథుఁడు వరదానమును గుఱించి తాను జేసిన ప్రతిజ్ఞను దప్పింపఁ జాలక దుఃఖితుఁడై వేఁడినిట్టూర్పులు పుచ్చి, సుమంత్రుం జూచి మాటిమాటికి నిట్లని చెప్పెను. ౧

సుమంత్రుఁడా! అడవిలో రామునకు సేవసేయుచుండుటకై, రత్నరాశితోఁ గూడిన చతురంగసేనను శీఘ్రముగా రాముని వెంటం బంపుము. ౨

మాటలచే నితరచిత్తమును వశీకరింపఁజాలిన వేశ్యలును రాముని వెంటఁ బోదురు గాక. మఱియు ధనవంతులగు వైశ్యులు అచ్చటచ్చట పదార్థములం బఱచుకొని విక్రయించుచు రాముని వెంటఁబోవు సైన్యంబుల నలంకరింతురు గాక. ౩

ఎవ్వరు రాముని నాశ్రయించి జీవించుచుందురో, మఱియు నెవ్వరితో రాముండు వీర్యపరీక్షార్థము క్రీడించుచుండునో వారల నందఱను ఈ సేనతో రాముని వెంటం బంపుము. ౪

ఉత్తమంబులగు నాయుధంబులం దాల్చినవారును బట్టణవాసులును నూనె మొదలగువానిం గొనిపోవు బండ్లును వనంబున మార్గంబుం జూపుటకై వనచరులగు బోయవాండ్రును రాముని వెంటం బోదురు గాక. ౫

రాముం డట్టి సైన్యములం గూడి యడవిలో నేనుఁగులు మొదలగు మృగంబులం జంపుచు వన్యంబగు తేనియం ద్రావుచు నానావిధంబులయిన నదులం జూచుచు రాజ్యంబును గూర్చి దలంచుకొనక సుఖముగా నుండును. ౬

నా ధాన్యకోశమును ధనకోశమునంతయు వనంబులో నివసింపఁబోవు రాముని వెంటం బంపుము. ౭

రాముండు, పుణ్యక్షేత్రంబుల యాగంబులు సేయుచు యథోక్తదక్షిణ లొసంగుచుఁ జతురంగసైన్యంబులను ఋషులను గూడి వనంబున సుఖముగా వాసంబు సేయఁగలఁడు. ౮

మహాబాహుండగు భరతుం డిచ్చట నుండి యయోధ్యం బాలించుచుం

సర్వకామై స్సహ శ్రీమా న్రామ స్సంసాధ్యతా మితి. ౯

ఏవం బ్రువతి కాకుత్స్థే! కైకేయ్యా భయ మాగతమ్,
ముఖం చాప్యగమ చ్ఛోషం స్వర శ్చాపి న్యరుధ్యత. ౧౦
సా విషణ్ణా చ సన్త్రస్తా ముఖేన పరిశుష్యతా,
రాజాన మే వాభిముఖీ కైకేయీ వాక్య మబ్రవీత్. ౧౧
రాజ్యం గతజనం సాధో! పీతమణ్డాం సురా మివ,
నిరాస్వాద్యతమం శూన్యం భరతో నాభిపత్స్యతే. ౧౨

కైకేయ్యాం ముక్తలజ్జాయాం వదన్త్యా మతిదారుణమ్,
రాజా దశరథో వాక్య మువాచాఽయతలోచనామ్. ౧౩

వహన్తం కిం తుదసి మాం నియుజ్య ధురి మాఽహితే,
అనార్యే! కృత్య మారబ్ధం కిం న పూర్వ ముపారుధః. ౧౪

తస్యైత త్క్రోధసంయుక్త ముక్తం శ్రుత్వా వరాఙ్గనా,
కైకేయీ ద్విగుణం క్రుద్ధా రాజాన మిద మబ్రవీత్. ౧౫

తవైవ వంశే సగరో జ్యేష్ఠం పుత్ర ముపారుధత్,
అసమఞ్జ ఇతి ఖ్యాతం తథాఽయం గన్తు మర్హతి. ౧౬

దుంగాక; శ్రీమంతుండగు రాముని సమస్తసంపదలతోనుం జేర్చి యడవికిం బయనముసేయుము; అని దశరథుఁడు సుమంత్రున కాజ్ఞాపించెను. ౯

ఇట్లు దశరథుండు చెప్పఁగాఁ గైకేయికి మిక్కిలి భయంబు గలిగినది; ఆబిడముఖము కోపిల్లినది! కంఠధ్వనియును దగ్గినది. ౧౦

ఆకైకేయి పరమదుఃఖమునొంది భయపడినదై ముఖము కోపిల్లఁగా దశరథమహారాజున కభిముఖియయి యిట్లని చెప్పెను. ౧౧

సత్పురుషుఁడవగు దశరథుఁడా! జనులులేక మంచిపదార్థములుపోయి శూన్యంబై మఱియొకరిచేఁ ద్రావఁబడిన సారముగల మద్యముపలెనుండు నీ రాజ్యమును భరతుండు సమ్మతింపఁడు. అని కైకేయి దశరథునితోఁ జెప్పినది.

ఇట్లు కైకేయి సిగ్గువిడిచి కర్ణకఠోరంబగుమాటం జెప్పఁగా దశరథ మహారాజు విశాలంబులగు నేత్రంబులతో నొప్పుచుండు నాకైకేయింజూచి యిట్లని చెప్పెను. ౧౩

కైకేయీ! నీవు నాకు శత్రువవు; నన్ను గొప్పబరువు మోయుమని చెప్పి యట్లునేను మోయుచుండఁగా నన్నేల యింకం బీడించెదవు? దుష్టురాలా! అప్పుడు నేను రామునివెంట సేనలు మొదలగువానిం బంపఁదలంచి నానే; అట్లు పంపఁగూడదని నీవేల మున్నే యడుగుకొనవైతివి? అని దశరథుండు కైకేయితోఁ జెప్పెను. ౧౪

ఉత్తమస్త్రీయయినకైకేయి దశరథమహారాజు కోపంబుతోఁ జెప్పిన మాటను విని ప్రకారాంతరంబునఁ దనయభీష్టంబుఁ జెల్లపందలఁచెనని యిను మడికోపంబునొంది దశరథమహారాజుఁ జూచి యిట్లని చెప్పెను. ౧౫

నీవంశమునందే సగరుం డనువాఁడు తనజ్యేష్ఠపుత్రు నసమంజుఁడను వాని వనంబునకుఁ బంపెఁగదా! అప్పు డాయసమంజుఁడు సేనాదులతోఁ గూడి పోయినాఁడా? లేదు; కావున అరణ్యంబునకుఁ బంపవలె ననుటచేతనే "నిర్ధనుండై పోవలె" ననియు నర్థ మగుచున్నది; అయసమంజుఁ డెట్లరణ్యంబు నకుఁ బోయెనో అట్లు ఈరాముండును నిర్ధనుండైయె యరణ్యంబునకుఁబోవల యును. అని కైకేయి దశరథునితోఁ జెప్పెను. ౧౬

ఏవ ముక్తో ధిగిత్యేవ రాజా దశరథోఽబ్రవీత్,

వ్రీళితశ్చ జనస్సర్వ స్సా చ తం నావబుధ్యత. ౧౭

తత్ర వృద్ధో మహామాత్ర స్సిద్ధార్థో నామ నామతః,
శుచి ర్బహుమతో రాజ్ఞః కైకేయీ మిద మబ్రవీత్. ౧౮
అసమఞ్జో గృహీత్వా తు క్రీడతః పథి దారకాన్,
సరయ్వాః ప్రక్షిప న్నప్సు రమతే తేన దుర్మతిః. ౧౯

తం దృష్ట్వా నాగరా స్సర్వే క్రుద్ధా రాజాన మబ్రువన్,

అసమఞ్జం వృణీష్వైక మస్మా న్వా రాష్ట్రవర్ధన!. ౨౦

తా నువాచ తతో రాజా కిన్నిమిత్త మిదం భయమ్,

తా శ్చాపి రాజ్ఞా సమ్పృష్టా వాక్యం ప్రకృతయోఽబ్రువన్.

క్రీడత స్త్వేష నః పుత్రా న్బాలా నుద్భ్రాన్తచేతనః,
సరయ్వాం ప్రక్షిప న్మౌర్ఖ్యా దతులాం ప్రీతి మశ్నుతే. ౨౨

స తాసాం వచనం శ్రుత్వా ప్రకృతీనాం నరాధిపః,
తం తత్యాజాహితం పుత్రం తేషాం ప్రియచికీర్షయా. ౨౩

దశరథమహారాజు ఇట్లు కైకేయిచెప్పినమాటను విని "పూర్వము దానడుగనిదానినింగూడ నిప్పుడు గోరుచున్నది! ఇది యెంతనీచురాలు! దహింపఁబడుఁగాక" అనిచెప్పి యూరకుండెను.

అట్లు కైకేయి చెప్పుటంజూచి యచ్చటిజనులందఱు జుగుప్సనొందిరి; అట్లు వారు జుగుప్సనొందినను కైకేయి దానినెంతమాత్రము సరకుసేయ దయ్యెం. ౧౬

అప్పు డచ్చట వృద్ధుండును బరిశుద్ధుండును దశరథున కిష్టుండునగు సిద్ధార్థుండను నొక్కమంత్రి కైకేయింజూచి యిట్లని చెప్పెను. ౧౭

దుర్బుద్ధియగు నసమంజుఁడు మార్గంబున నాటలాడుకొనుచుండు పిల్లకాయలం బట్టితెచ్చి సరయూనదీజలంబులం బడవైచుచు దానం గ్రీడింపుచుండెను. ౧౮

అంతఁ బట్టణవాసులందఱు నసమంజుని క్రూరకృత్యముంజూచి కోపంబు నొంది సగరచక్రవర్తితో నిట్లని చెప్పిరి.

సగరచక్రవర్తీ! నీవు రాజ్యంబును వృద్ధిఁబొందించువాఁడవు; నీ వసమంజుని నొక్కనినైన నుంచుకొనుము; మేమూరు విడిచిపోయెదము; లేక అతని వెడలఁగొట్టి మమ్ములనైన నుంచుకొనుము. అని పట్టణవాసులు సగరునితోఁ జెప్పిరి. ౨౦

అంత సగరచక్రవర్తి వారలం జూచి "మీ కెందువలన నింతభయము గల్గినది?" అని యడిగెను.

అట్లు సగరచక్రవర్తి యడిగినపిమ్మట నాపట్టణవాసిజనులును అతనిం జూచి యిట్లని చెప్పిరి. ౨౧

ఈయసమంజుఁడు బుద్ధిభ్రమంబున నాటలాడుకొనుచుండు మాకొడుకులంబట్టి సరయూనదిలోఁ బడవైచి మూర్ఖుం డగుటవలనఁ బరమసంతోషంబు నొందుచున్నాఁడు అని జనులు సగరునకుఁ జెప్పిరి. ౨౨

ఆసగరచక్రవర్తి ప్రజలుచెప్పినమాటను విని వారలకు సంతోషంబు సేయఁగోరి ప్రియపుత్రుఁడగు నసమంజుని విడిచెను. ౨౩

తం యానం శీఘ్ర మారోప్య సభార్యం సపరిచ్ఛదమ్,
యావజ్జీవం వివాస్యోఽయ మితి స్వా నన్వశా త్పితా. ౨౪

సఫాలపిటకం గృహ్య గిరిదుర్గా ణ్యమోచయత్,
దిశ స్సర్వా స్త్వనుచర న్స యథా పాపకర్మకృత్. ౨౫

ఇత్యేవ మత్యజ ద్రాజా సగరో వై సుధార్మికః,

రామః కి మకరో త్పాపం యే నైవ ముపరుధ్యతే. ౨౬

నహి కంచన పశ్యామో రాఘవస్యాగుణం వయమ్,
దుర్లభో హ్యస్య నిరయ శ్శశాఙ్కస్యేవ కల్మషమ్. ౨౭

అథవా దేవి! దోషం త్వం కఞ్చి త్పశ్యసి రాఘవే,
త మద్య బ్రూహి తత్త్వేన తతో రామో వివాస్యతామ్. ౨౮

అదుష్టస్య హి సన్త్యాగః సత్పథే నిరతస్య చ,
నిర్దహే దపి శక్రస్య ద్యుతిం ధర్మనిరోధనాత్. ౨౯
త దలం దేవి! రామస్య శ్రియా విహతయా త్వయా,
లోకతోఽపి హి తే రక్ష్యః పరివాద శ్శుభాననే!. 30

శ్రుత్వా తు సిద్ధార్థవచో రాజా శ్రాన్తతరస్వనః,
శోకోపహతయా వాచా కైకేయీ మిద మబ్రవీత్. 3౧

అంత సగరుం డాయసమంజుని బైగుడ్డతో భార్యాసమేతంబుగ రథంబు నెక్కించి "అతని యావజ్జీవము పట్టణమునకు రానీయవలదు. అరణ్యంబులోనే యుండునట్లు సేయుండు" అని తనభృత్యుల కాజ్ఞాపించెను. ౨౪

ఆయసమంజుఁ డంత గుద్దలిని చిన్నగంపనుందాల్చి పాపిష్ఠుండుఁ బోలె నన్నిదిక్కులం దిరుగుచుఁ బర్వతములయందలి గహనప్రదేశంబులం జేరి కందమూలాదులు త్రవ్వుకొని జీవించుచుండెను. ౨౫

అట్లు తనకొడుకు మహాపరాధంబు గావించుటంజేసి పరమధార్మికుం డగు సగరచక్రవర్తి యతని విడిచినాఁడు.

ఇప్పుడు నీవు రాము నడవికిం బంపుమనుచున్నావే; అట్లు రాముం డెంతటిపాప మేమి చేసినాఁడు? ౨౬

రామునియం దేదుర్గుణంబును మా కగపడలేదు.

చంద్రునియందు మాలిన్యంబు లేనట్లు రామునియం దెంతమాత్రము దోషము లేదు. ౨౭

కైకేయీ! అటుగాక నీకు రామునం దేదైన దోషముగపడెనేని వాని నిప్పుడు యథార్థముగాఁ జెప్పుము. అటుపిమ్మట రాము నరణ్యంబునకుఁ బంపవచ్చును. ౨౮

దోషంబు లేనివాఁడును, బరమధార్మికుండు నగువాని వెడలఁగొట్టు నేని అట్టియధర్మంబు దేవేంద్రునిసంపదనయినను నశింపఁజేయును. ౨౯

సుందరంబగు ముఖముగల కైకేయీ! అందువలన నింక నీవు రాముని సంపదకు విఘాతంబు సేయకుము. అధర్మదోషం బట్లుండఁగా నీకు లోకంబున నిందగలుగకుండు నట్లైనను జేసికొనవలయుంగదా! అని సిద్ధార్థుండను మంత్రి కైకేయికిం జెప్పెను. ౩౦

దశరథుండు సిద్ధార్థుండు చెప్పినమాటలన్నియుం విని దుఃఖంబున మిక్కియుం హీనంబగుస్వరంబున డగ్గుత్తికగదురఁ గైకేయిం జూచి యిట్లని చెప్పెను. ౩౧

నతద్వచో నేచ్ఛసి పాపవృత్తే!
హితం న జానాసి మమాఽత్మనోవా,
ఆస్థాయ మార్గం కృపణం కుచేష్టా
చేష్టా హి తే సాధుపథా దపేతా. ౩౨

అనువ్రజిష్యా మ్యహ మద్య రామం
రాజ్యం పరిత్యజ్య సుఖం ధనం చ,
సహైవ రాజ్ఞా భరతేన చ త్వం
యథాసుఖం భుఙ్క్ష్వ చిరాయ రాజ్యమ్. ౩౩

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే షట్త్రింశస్సర్గః.

---

## సప్తత్రింశస్సర్గః

మహామాత్రవచ శ్శ్రుత్వా రామో దశరథం తదా,
అభ్యభాషత వాక్యన్తు వినయజ్ఞో వినీతవత్. ౧

త్యక్తభోగస్య మే రాజ! న్వనే వన్యేన జీవతః,
కిం కార్య మనుయాత్రేణ త్యక్తసఙ్గస్య సర్వతః. ౨

యో హి దత్త్వా ద్విపశ్రేష్ఠం కక్ష్యాయాం కురుతే మనః,
రజ్జుస్నేహేన కిం తస్య త్యజతః కుఞ్జరోత్తమమ్. ౩

తథా మమ సతాం శ్రేష్ఠ! కిం ధ్వజిన్యా జగత్పతే!,
సర్వాణ్యేవానుజానామి చీరాణ్యేవాఽనయన్తు మే. ౪

పాపిష్ఠురాలా! ఈసిద్ధార్థుండు చెప్పినమాట నంగీకరింపవుగదా! ఇట్లు కుత్సితమార్గంబు నవలంబించి కుచేష్టలు సేయుచు నీమేలునుగాని నామేలును గాని యెఱుంగకున్నావు. నీకార్యము ఎంతమాత్రము మంచిదిగాదు. ౩౨

నే నిప్పుడ రాజ్యంబును సుఖంబును ధనంబునుం బరిత్యజించి రాముని వెంటం బోయెదను. నీవు భరతుని రాజుగాఁ జేసికొని యతనితోఁగూడ సుఖంబుగా రాజ్యంబు ననుభవింపుచుండుము. అని దశరథుఁడు కైకేయితోఁ జెప్పెను. ౩౩

ఇది ముప్పదియాఱవసర్గము

---

## ముప్పదియేడవసర్గము

సిద్ధార్థుండు చెప్పినది విని గురువులయెడ సవినయంబుగా నుండ నేర్పరి యయినరాముండు సవినయంబుగా దశరథుంజూచి యీమాటం జెప్పెను. ౧

మహారాజా! సమస్తభోగంబులను విడిచి సమస్తసంగంబులనుం బరిత్యజించి వనంబునం గందమూలాదికంబు దిని జీవించునట్టినాకు ఈసేన మొదలగుదానితో నేమికార్యము? ౨

ఉత్తమంబయిన గజంబు నొసంగి దానినడుమునఁ గట్టెడుమోకునం దిచ్చ యించునేని అట్టిుత్తమగజమునే విడుచుచున్నాఁడే అతని త్రాటిచే నేమికార్యము? ౩

దశరథమహారాజా! నీవు సత్పురుషులలో శ్రేష్ఠుఁడవు. మదపుటేనుఁగునే విడిచినవానికిఁ దానినడుముత్రాటితో నేమియుఁ గార్యము లేనట్లు రాజ్యమును భోగములను అన్నిటిని విడిచిన నాకీసేన మొదలగువానితో నేమియుఁ బ్రయోజనంబు లేదు. కావున నిప్పుడు నీవు నాకీఁదలంచినవాని నన్నిటిని నేను భరతున కీయ నిశ్చయించినాను. నాకు వల్కలంబులుమాత్రము దెచ్చి యివ్వవలయును. ౪

ఖనిత్రపిటకే చోభే సమానయత గచ్ఛతః,
చతుర్దశ వనే వాసం వర్షాణి వసతో మమ.

అథ చీరాణి కైకేయీ స్వయమాహృత్య రాఘవమ్,
ఉవాచ పరిధత్స్వేతి జనౌఘే నిరపత్రపా.
స చీరే పురుషవ్యాఘ్రః కైకేయ్యాః ప్రతిగృహ్య తే,
సూక్ష్మవస్త్ర మవక్షిప్య మునివస్త్రాణ్యవస్త హ.

లక్ష్మణ శ్చాపి తత్రైవ విహాయ వసనే శుభే,
తాపసాచ్ఛాదనే చైవ జగ్రాహ పితు రగ్రతః.
అథాఽత్మపరిధానార్థం సీతా కౌశేయవాసినీ,
సమీక్ష్య చీరం సంత్రస్తా పృషతీ వాగురా మివ. ౯
సా వ్యపత్రపమాణేవ ప్రతిగృహ్య చ దుర్మనాః,
కైకేయీకుశచీరే తే జానకీ శుభలక్షణా. ౧౦
అశ్రుసంపూర్ణనేత్రా చ ధర్మజ్ఞా ధర్మదర్శినీ,
గన్ధర్వరాజప్రతిమం భర్తార మిద మబ్రవీత్. ౧౧
కథంను చీరం బధ్నన్తి మునయో వనవాసినః,

ఇతి హ్యకుశలా సీతా సా ముమోహ ముహుర్ముహుః. ౧౨

కృత్వా కణ్ఠే చ సా చీర మేక మాదాయ పాణినా,
తస్థా హ్యకుశలా తత్ర వ్రీళితా జనకాత్మజా. ౧౩

తస్యా స్తత్ క్షిప్ర మాగమ్య రామో ధర్మభృతాం వరః.

నే నింకఁ బోయి వనంబునం బదునాలుగుసంవత్సరంబులు వాసంబు సేయువలయును గావున నంతపట్టుఁ గందమూలాదులఁ గొని తెచ్చుకొనుటకై గుద్దలిని పుటికను ఈరెంటిని నాకుఁ దెచ్చి యీవలయును. అని రాముఁడు దశరథునితోఁ జెప్పెను. ౫

అంతఁ గైకేయి యందలి జనులయెదుట సిగ్గులేనిదై తానె వల్కలంబులం దెచ్చి రామునిం జూచి "వీనిం గట్టుకొమ్ము" అని చెప్పినది. ౬

పురుషశ్రేష్ఠుఁడగు నారాముఁడు కైకేయియొద్దనుండి రెండునారచీరలఁ బుచ్చుకొని మునుపుగట్టుకొనియున్న సూక్ష్మవస్త్రంబుల విచ్చి మునులుంబోలె నారచీరలఁ గట్టుకొనెను. ౭

అప్పుటనే లక్ష్మణుఁడును దండ్రియెదుట సుందరంబులగు వస్త్రంబులను విచ్చి బుషులంగట్టుకొను వల్కలంబులం దాల్చెను. ౮

అంతఁ బట్టువస్త్రమును దాల్చియున్న సీతాదేవి తానును గట్టుకొనుటకై వల్కలమును జూచి వలం జూచిన లేడిపగిది భయంబు నొందినది. ౯

మంగళకరంబులగు లక్షణంబులు గలదియు, ధర్మంబు నెఱింగి యితరులకును దెలియునట్టు ఆచరించునదియు నగుసీతాదేవి కైకేయియొసఁగిన నారచీరలను మహాదుఃఖంబునం బుచ్చుకొని కండ్లునిండ గన్నీరుగాఱఁగా గంధర్వరాజుంబోలు పెనిమిటిని రాముంజూచి యిట్లని చెప్పెను. ౧౦,౧౧

అరణ్యంబున నివసించునట్టిమునులు వల్కలము నేవిధంబునం గట్టుకొనుదురు? నాకుఁ జెప్పుము. అని సీత రామునితోఁ జెప్పినది.

ఆసీతాదేవి నారచీరగట్టుకొనం దెలియక యాప్రకారము ఏమియుఁ దోఁచక భ్రాంతి నొందియుండెను. ౧౨

అప్పుట జనకపుత్రియగు నాసీతాదేవి యావల్కలంబుల రెంటిని ఒకటిఁ జేతను మఱియొకటి కంఠంబునను ధరించి కట్టుకొనంజాలక సిగ్గునొందియుండెను. ౧౩

అది చూచి ధార్మికశ్రేష్ఠుఁడగు రాముఁడు శీఘ్రముగా సీతయొద్దకు

చీరం బబన్ధ సీతాయాః కౌశేయ స్యోపరి స్వయమ్. ౧౪
రామం ప్రేక్ష్యతు సీతాయా బధ్నన్తం చీర ముత్తమమ్,
అన్తఃపురగతా నార్యో ముముచు ర్వారి నేత్రజమ్. ౧౫
ఊచు శ్చ పర మాయస్తా రామం జ్వలితతేజసమ్,

వత్స! నైవం నియుక్తేయం వనవాసే మనస్వినీ. ౧౬

పితు ర్వాక్యానురోధేన గతస్య విజనం వనమ్,
తావ ద్దర్శన మస్యా న్న స్సఫలం భవతు ప్రభో!. ౧౭

లక్ష్మణేన సహాయేన వనం గచ్ఛస్వ పుత్రక!,

నేయ మర్హతి కల్యాణీ వస్తుం తాపసవ ద్వనే. ౧౮

కురు నో యాచనాం పుత్ర! సీతా తిష్ఠతు భామినీ,
ధర్మనిత్య స్స్వయం స్థాతుం న హీదానీం త్వ మిచ్ఛసి. ౧౯

తాసా మేవంవిధా వాచ శ్శృణ్వ న్దశరథాత్మజః,
బబంధైవ తదా చీరం సీతయా తుల్యశీలయా. ౨౦

చీరే గృహీతే తు తయా సమీక్ష్య నృపతే ర్గురుః,
నివార్య సీతాం కైకేయీం వసిష్ఠో వాక్య మబ్రవీత్. ౨౧
అతిప్రవృత్తే! దుర్మేధే! కైకేయి! కులపాంసని!,
వఞ్చయిత్వా చ రాజానం న ప్రమాణేఽవతిష్ఠసే. ౨౨

వచ్చి సీతాదేవి కట్టుకొనియున్న పట్టువస్త్రముపైని నారచీరం గట్టెను. ౧౪

ఆట్లుత్తముండగు రాముఁడు సీతకు నారచీరఁ గట్టుటం జూచి యంతఃపురంబుననుండు స్త్రీలందఱు గన్నీళ్లుగాఱ రోదనంబు చేసిరి. ౧౫

ఆయంతఃపురస్త్రీలు, పరమాయాసంబు నొంది శాంతిచేఁ బ్రకాశించుచుండు రాముం జూచి యిట్లని చెప్పిరి.

రామఁడా! ఇట్లు వనంబునకుఁ బోవలయునని నీ కాజ్ఞాపింపఁబడియున్నదేకాని సీత కట్లాజ్ఞ లేదు. ౧౬

నాయకుఁడవగు రాముఁడా! నీవు తండ్రిమాట ననుసరించి యరణ్యంబునకుం బోయిన వెనుక నీవు వచ్చువఱకును మేము నిన్నుఁజూచుటకు బదులుగా నీసీతం జూచుచు సంతోషంబు నొందెదము. ౧౭

చిన్నికొడుకా! నీవు లక్ష్మణుని దోడుగాఁ జేసికొని యరణ్యంబునకుఁ బొమ్ము.

ఈసీత మంగళస్వరూపిణి. ఈబిడ ఋషివలె నరణ్యంబున నివసింపఁదగదు. ౧౮

కొడుకా! నీవు ధర్మమునందు నిలుకడగలవాఁడవు గావున నెంత వేఁడుకొన్నను ఇప్పుడు నీ విచ్చటనుండుట కొప్పుకొనవు; అట్లు నీ వొప్పుకొనకున్నను ఈసీతనైన నిచ్చటనుంచిపొమ్ము; మేము ప్రార్థించునట్లు సేయుము. అని యంతఃపురస్త్రీలు రామునితోఁ జెప్పిరి. ౧౯

అప్పుడు దశరథుని కొడుకైన రాముఁడు ఆయంతఃపురస్త్రీ లెన్ని విధంబులఁ జెప్పినను వారిమాటలవినుచునే తప్పక ననవలెనే పరిశుద్ధస్వభావముగల సీతకు నారచీరం గట్టెను. ౨౦

దశరథమహారాజునకు గురుండైన వసిష్ఠుండు ఆసీతాదేవి నారచీరలఁ గట్టుకొనుటంజూచి సీతాదేవిని వారించి కైకేయింజూచి యిట్లని చెప్పెను.

కైకేయీ! నీ వధికప్రసంగము సేయుదానవు; దుర్బుద్ధురాలవు; వంశంబుఁ జెఱుపఁబుట్టినదానవు; నీవు మహారాజును మోసపుచ్చి వరంబులు

న గన్తవ్యం వనం దేవ్యా సీతయా శీలవర్జితే!,
అనుష్ఠాస్యతి రామస్య సీతా ప్రకృత మాసనమ్. ౨౩

ఆత్మా హి దారా స్సర్వేషాం దారసంగ్రహవర్తినామ్,
ఆత్మేయ మితి రామస్య పాలయిష్యతి మేదినీమ్. ౨౪

అథ యాస్యతి వైదేహీ వనం రామేణ సంగతా,
వయమప్యనుయాస్యామః పురంచేదం గమిష్యతి. ౨౫
అన్తపాలా శ్చ యాస్యన్తి సదారో యత్ర రాఘవః,

సహోపజీవ్యం రాష్ట్రం చ పురం చ సపరిచ్ఛదమ్. ౨౬

భరతశ్చసశత్రుఘ్నశ్చీరవాసా వనేచరః,
వనే వసన్తం కాకుత్స్థ మనువత్స్యతి పూర్వజమ్. ౨౭
తత శ్శూన్యాం గతజనాం వసుధాం పాదపై స్సహా,
త్వమేకా శాధి దుర్వృత్తా ప్రజానా మహితే స్థితా. ౨౮

నహి తద్భవితా రాష్ట్రం యత్ర రామో న భూపతిః,
తద్వనం భవితా రాష్ట్రం యత్ర రామో నివత్స్యతి. ౨౯

న హ్యదత్తాం మహీం పిత్రా భరత శ్శాస్తు మర్హతి,
త్వయి వా పుత్రవ ద్వస్తుం యది జాతో మహీపతేః. ౩౦

గానియు, దేనికి వనంబుగొంటివో అంతలో నిలువక మఱియుం గ్రౌర్యము సేయుచున్నావు. ౨౨

సదాచారములేనిదానా! సీతాదేవి యిప్పు డెంతమాత్రము వనంబునకుఁ బోవలసినది లేదు.

సీతాదేవి యిప్పుడు రామునకు సిద్ధముగానుండు సింహాసనంబు నధిష్ఠించి రాజ్యంబుఁ బాలింపుచుండఁగలదు. ౨౩

గృహస్థులకందఱకు భార్య స్వరూపమువంటిది. (అట్లు వేదమునందుఁ జెప్పఁబడియున్నది.) అట్లు ఈసీత రామునియాత్మ గావున నతనిచేఁ బాలింపఁదగిన భూమిం బాలింపుచుండఁగలదు. ౨౪

ఇంక సీతాదేవి రామునితోఁగూడ నరణ్యంబునకుఁ బోవునేని మేము నుంగూడఁ బోయెదము. ఈపట్టణమున నుండువారలందఱును బోదురు.

రాముండు భార్యతోఁగూడఁ బోవుచోటికి సేనానాయకులునుం బోదురు.

దశరథుండును దాసీదాసాదిసహితంబుగా నీపట్టణంబున నున్నవారు నీదేశంబున నున్నవారు నందఱును రాముని వెంబడించి పోవుదురు. ౨౬

భరతుండును, శత్రుఘ్నుండును నారచీరలంగట్టుకొని యడవికిఁబోయి వనవాసియగు దమయన్నరామునకు శుశ్రూష సేయుచుండఁగలరు. ౨౭

అంత దురాచారవు, ప్రజలకుఁ గీడుసేయుదానవునగు నీ వొక్కతెవిచ్చటనుండి జనులులేక పాడువడియుండు భూమిని వృక్షములతోఁగూడఁ బాలింపుచుండుము. ౨౮

రాముఁ డెచ్చట రాజుగానుండెడో అది యెంతమాత్రము రాజ్యముగానేరదు; వనముగానే యుండును. ఎచ్చట రాముండు వాసము సేయునో ఆయరణ్యమె రాజ్యమగును. ౨౯

భరతుఁడు దశరథమహారాజునకుఁ బుట్టినవాఁడె యగునేని తనకుఁ దండ్రి మనఃపూర్వకముగా నియ్యని భూమిం బాలింపఁడు, తండ్రికి విరోధముచేసి నీయందు మాతృభక్తి నుంచఁడు. ౩౦

యద్యపి త్వం క్షితితలా ద్గగనం చోత్పతిష్యసి,
పితృవంశచరిత్రజ్ఞ స్సోఽన్యథా న కరిష్యతి. ౩౧

త త్త్వయా పుత్రగర్ధిన్యా పుత్రస్య కృత మప్రియమ్,
లోకే హి స న విద్యేత యో న రామ మనువ్రతః. ౩౨

ద్రక్ష్యస్యద్యైవ కైకేయి! పశువ్యాళమృగద్విజాన్,
గచ్ఛత స్సహ రామేణ పాదపాంశ్చ తదున్ముఖాన్. ౩౩

అథో త్తమా న్యాభరణాని దేవి!
దేహే స్నుషాయై వ్యవనీయ చీరమ్,
న చీర మస్యాః ప్రవిధీయతేతి
న్యవారయ త్తద్వసనం వసిష్ఠః. ౩౪
ఏకస్య రామస్య వనే నివాస
స్త్వయా వృతః కేకయరాజపుత్రి,
విభూషితేయం ప్రతికర్మనిత్యా
వసత్వరణ్యే సహ రాఘవేణ. ౩౫

యానైశ్చ ముఖ్యైః పరిచారకైశ్చ
సుసంవృతా గచ్ఛతు రాజపుత్రీ,
వస్త్రైశ్చ సర్వై స్సహితై ర్విధానై
ర్నేయం వృతా తే వరసమ్ప్రదానే. ౩౬

నీవు భూమినుండి యాకాశమున కెగిరినను దండ్రివంశమునం బుట్టిన వారి సదాచారము నెఱింగియున్నట్టి భరతుఁ డెంతమాత్రము నీవుకోరినట్లు సేయఁడు. ౩౧

రాము ననుసరింపకుండువాఁడు ప్రపంచంబునందె యుండఁడు. అట్టుండఁగా దమ్ముఁడగుభరతునకు రామునియందు స్నేహం బధికంబుగా నుండు నని చెప్పనేల? అట్లు నీవు రాజ్యంబు నొసంగినను భరతుఁడు రామునందలి స్నేహంబున నిన్ను శత్రువునుగానె యెంచును. కావున నీవు భరతునియందలి స్నేహంబున నింతదూరముచేసినను ఇదియంతయుం నతని కపకారముచేసినట్లె పర్యవసన్నమగును. ౩౨

కైకేయీ! నీ విం శీఘ్రంబునసే రామునింవెంబడిం బోవు పశువుల నేనుంగులను జింకలను బక్షులను అతనితోఁ బోవంగోరుచున్నట్టుండు వృక్షంబులనుం జూడఁగలవు. ౩౩

కైకేయీ! ఇంక నీవు నీకోడలయినసీతకు మంచిసొమ్ముల నిమ్ము. ఈ బిడకీనారచీర యెంతమాత్రము దగియుండలేదు. అనిచెప్పి వసిష్ఠుండు సీతాదేవి నారచీరం గట్టుకొనుచుండఁగా దాని నివారించెను. ౩౪

కైకేయీ! నీవు ఒక్క రాముం డడవిలో వాసముసేయుటనే కోరితావు. ఈసీత యడవిలో నుండవలెనని కోరవైతివి. కావున ఎల్లప్పుడు నలంకారమునకుఁ దగినట్టి సుందరాంగియగు నీసీతాదేవి భూషణంబుల నలంకృతయయి యరణ్యంబున రామునితోఁగూడ వాసంబు సేయుంగాక. దీని కియ్యకొనుము. ౩౫

రాచకొమార్తెయగు సీతాదేవి యుత్తమంబులగు వాహనంబులతోను పరిచారకులతోను నానావిధములయిన వస్త్రములతోను సమస్తములయిన యుపకరణములతోనుంగూడి పోనిమ్ము. నీవు వరంబు లడుగునప్పుడు "ఈబిడ్డ వనంబులో నుండవలయు"నని యడుగలేదు. అని వసిష్ఠుండు కైకేయితోఁ జెప్పెను. ౩౬

తస్మిం స్తథా జల్పతి విప్రముఖ్యే
గురౌ నృపస్యాప్రతిమప్రభావే,
నైవ స్మ సీతా వినివృత్తభావా
ప్రియస్య భర్తుః ప్రతికారకామా. 3౭

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే సప్తత్రింశస్సర్గః.

---

## అష్టత్రింశస్సర్గః

తస్యాం చీరం వసానాయాం నాథవత్యా మనాథవత్,
ప్రచుక్రోశ జన స్సర్వో ధి క్త్వాం దశరథం త్వితి. ౧

తేన తత్ర ప్రణాదేన దుఃఖిత స్స మహీపతిః,
చిచ్ఛేద జీవితే శ్రద్ధాం ధర్మే యశసి చాఽత్మనః. ౨

స నిశ్వస్యోష్ణ మైక్ష్వాక స్తాం భార్యా మిద మబ్రవీత్,
కైకేయి! కుశచీరేణ న సీతా గన్తు మర్హతి. 3
సుకుమారీ చ బాలా చ సతతం చ సుఖోచితా,
నేయం వనస్య యోగ్యేతి సత్య మాహ గురు ర్మమ. ౪

ఇయం హి కస్యాపకరోతి కిఞ్చి
త్తపస్వినీ రాజవరస్య కన్యా,
యా చీర మాసాద్య జనస్య మధ్యే
స్థితా విసంజ్ఞా శ్రమణీవ కాచిత్. ౫
చీరాణ్యపాస్యా జ్జనకస్య కన్యా
నేయం ప్రతిజ్ఞా మమ దత్తపూర్వా,

బ్రాహ్మణశ్రేష్ఠుండును, దశరథమహారాజు కులగురుండును, మహాప్రభావుండునగు వసిష్ఠమహర్షి యీవిధంబునం జెప్పుచున్నను భర్తను వెంబడించి యరణ్యంబునకుం బో నిశ్చయించిన సీతాదేవియభిప్రాయంబు ఎంతమాత్రము దిరుగదయ్యె. 38

ఇది ముప్పదియేడవసర్గము.

---

## ముప్పదెనిమిదవసర్గము

లోకనాథుండగురాముండు నాథుండుగానున్నను ఆ సీతాదేవి యనాథయుంబోలె వల్కలంబుఁ గట్టుకొనుటంజూచి యచ్చటిజనులందఱు దశరథునిం జూచి "నీవు దహింపఁబడుదువుగాక" అని నిందించిరి. ౧

దశరథుం డట్లు దన్ను జనులందఱు నిందించుటంజూచి పరమదుఃఖంబు నొంది తనప్రాణమునందును ధర్మమునందును కీర్తియందును ప్రియము లేనివాఁడయ్యె. ౨

ఆదశరథమహారాజు వేఁడినిట్టూర్పులు పుచ్చి ఆకైకేయిం జూచి యిట్లని చెప్పెను.

కైకేయీ! సీతాదేవి నారచీరం గట్టుకొని పోఁదగదు. ౩

"ఈసీత కోమలదేహముగలది. చిన్నది యెల్లప్పుడును సుఖముగా నుండఁదగినది. ఎంతమాత్రము వనంబులో నుండఁదగినదిగాదు." అని నా గురుండగు వసిష్ఠుండు చెప్పినది సత్యము. ౪

ఈసీతాదేవి వల్కలంబు గట్టుకొని జనులనడుమ మైమఱచి యొకానొక తాపసస్త్రీవలె నున్నదే! శోచనీయరాయం రాజశ్రేష్ఠుండగు జనకుని కొమార్తెయు నగుసీత యెవ్వరి కేమియపకారము చేసినది? ౫

జనకమహారాజపుత్రియగు నీసీత యిప్పుడు వల్కలంబుల విచ్చివేయుంగాక. ఈప్రకారము సీతయును వల్కలములం గట్టుకొనుననని మున్ను

యథాసుఖం గచ్ఛతు రాజపుత్రీ
వనం సమగ్రా సహ సర్వరత్నైః. ౬

ఆజీవనార్హేణ మయా నృశంసా
కృతా ప్రతిజ్ఞా నియమేన తావత్,
త్వయా హి బాల్యా త్ప్రతిపన్న మేత
త్తన్మాం దహే ద్వేణు మివాత్మపుష్పమ్. ౭

రామేణ యది తే పాపే! కిఞ్చి త్కృత మశోభనమ్,
అపకారః క ఇహ తే వైదేహ్యా దర్శితోఽధమే!. ౮

మృగీవోత్ఫుల్లనయనా మృదుశీలా తపస్వినీ,
అపకారం క మివ తే కరోతి జనకాత్మజా. ౯
నను పర్యాప్త మేత త్తే పాపే! రామవివాసనమ్,
కి మేభిః కృపణై ర్భూయః పాతకై రపి తే కృతైః. ౧౦
ప్రతిజ్ఞాతం మయా తావ త్త్వయోక్తం దేవి! శృణ్వతా,
రామం య దభిషేకాయ త మిహాఽగత మబ్రవీః. ౧౧

త త్త్వేత త్సమతిక్రమ్య నిరయం గన్తు మిచ్ఛసి,
మైథిలీ మపి యా హి త్వ మీక్షసే చీరవాసినీమ్. ౧౨

నేను నీకు వరం బొసంగియుండలేదు. కావున రాచకొమార్తెయగుసీత సమస్తాభరణంబులం దాల్చి సమస్తరత్నంబులంగూడి సుఖంబుగా నడవికింబోవుం గాక. ౬

నా కింక మరణకాలంబు సమీపించినది. కావున నేను "నీ వడిగిన దానిం దప్పకచేసెద" నని శపథపూర్వకముగాఁ బ్రతిజ్ఞఁ జేసితిని. అంత నీ వజ్ఞానంబున రాము నరణ్యంబునకుఁ బంపుటయుం భరతు నభిషేకించుటయుం నే కావలయునని నిశ్చయించినావు. ఏమిసేయవచ్చును! వెదురును దాని పుష్పమె దహించునట్లు నేను జేసిన ప్రతిజ్ఞయే నన్ను దహించుచున్నది. ౭

పాపిష్ఠురాలవు నీచురాలవు నగు కైకేయీ! ఒకవేళ రాముం డేమైనఁ గొంచెముకష్టము నీకుఁ జేసియుండు నేని యీసీత నీకేమి యపకారము చేసినది? ౮

లేడివలె సుందరంబులయిన కండ్లుగలదియుం దిన్ననిస్వభావము గలదియు శోచనీయయుం నగు నీసీత నీ కేమియుపకారము సేయుచున్నది? ౯

పాపిష్ఠురాలా! నీకు రాము నడవికిఁ బంపుట చాలదా? ఇంక నిట్లు కుత్సితముగాఁ బాపములు సేయుంటచేఁ బ్రయోజనమేమి? ౧౦

కైకేయీ! నీ విచ్చటికిఁ బట్టాభిషేకమునకై వచ్చిన రాముంజూచి "నీవు నారచీరలు గట్టుకొని యరణ్యంబునఁ బదునాలుగుసంవత్సరంబు లుండుము" అని చెప్పితివే; నే నామాటను విని యట్లు రాముం డరణ్యంబునకుఁ బోవుటకే యొప్పుకొంటిని గాని సీత వనంబునకుం బోవుటనుగురించి నే నెంతమాత్రము ప్రతిజ్ఞ చేయలేదు. ౧౧

నీవు ఎట్టిదానవో! సీతగూడ నారచీరలం గట్టుకొనియుండఁగాఁ జూడఁగోరుచున్నావు! అట్లు నే నెంతవఱకుఁ బ్రతిజ్ఞ చేసినానో అంతవఱకు నిలువక నరకంబు నొందఁగోరియున్నావు. అని దశరథుఁడు కైకేయితోఁ జెప్పెను. ౧౨

ఇతీవ రాజా విలప న్మహాత్మా
శోకస్య నా న్తం స దదర్శ కిఞ్చిత్,
భృశాతురత్వా చ్చ పపాత భూమౌ
తే నైవ పుత్త్రవ్యసనేన మగ్నః. ౧౩
ఏవం బ్రువ న్తం పితరం రామ స్సమ్ప్రస్థితో వనమ్,
అవాక్శిరస మాసీన మిదం వచన మబ్రవీత్. ౧౪
ఇయం ధార్మిక! కౌసల్యా మమ మాతా యశస్వినీ,
వృద్ధా చాక్షుద్రశీలా చ న చ త్వాం దేవ! గర్హతే. ౧౫

మయా విహీనాం వరద! ప్రపన్నాం శోకసాగరమ్,
అదృష్టపూర్వవ్యసనాం భూయ స్సమ్మన్తు మర్హసి. ౧౬

పుత్రశోకం యథా నర్ఛే త్త్వయా పూజ్యేన పూజితా,
మాం హి సంచి న్తయ న్తీ సా త్వయి జీవే త్తపస్వినీ. ౧౭

ఇమాం మహేన్ద్రోపమజాతగర్ధినీం
తథా విధాతుం జననీం మ మార్హసి,
యథా వనస్థే మయి శోకకర్శితా
న జీవితం న్యస్య యమక్షయం వ్రజేత్. ౧౮

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డేఽష్టత్రింశస్సర్గః.

## ఏకోనచత్వారింశస్సర్గః

రామస్య తు వచ శ్శ్రుత్వా మునివేషధరం చ తమ్,

మహైశ్వర్యశాలియగు నాదశరథమహారాజు ఈప్రకారము దుఃఖము నకుఁ గొంచెమయినఁ దుదంగానక, ఆపుత్రదుఃఖంబునమునిఁగి పరమ దుఃఖితుఁడగుటవలన నేలవ్రాలెను. ౧౩

ఇట్లు చెప్పుచుఁ దలవంచుకొని కూర్చుండియున్న తండ్రిం జూచి రాముఁడు వనంబునకుఁ బయనంబై యిట్లని చెప్పెను. ౧౪

ధార్మికుఁడవగు దశరథమహారాజా! నాతల్లియయిన యీకౌసల్య కీర్తిమంతురాలు. ముసలిది. మఱియు నుత్తమంబగు స్వభావంబుగలది. నీవు ప్రియపుత్రుఁడనైన నన్ను వనంబునకుఁ బంపుచున్నను నిన్నేమియుం నిందింపక చూచుచున్నది. ౧౫

దశరథుఁడా! నీవు వరంబుల నిచ్చువాఁడవు. నేను బోయినవెనుక నన్నుఁబాసి దుఃఖసముద్రంబునం బడియున్న, యిదివఱ కెన్నఁడును దుఃఖంబు ననుభవించియుండని నాతల్లిని గౌసల్యను నీవు మిక్కిలియు సన్మానింపు చుండుము. ౧౬

శోచనీయయగుకౌసల్య పుత్రదుఃఖము నొందకుండునట్లు పూజ్యుఁడ వగు నీవు పూజింపుచుండుదువేని యీబిడ యెట్లయిన నన్నుఁ దలంచు కొనుచు నీప్రాపున బ్రతికియుండును. ౧౭

దేవేంద్రునకు సాటియయినవాఁడా! పుత్రునియం దధికస్నేహంబుగల నాతల్లి కౌసల్య నేనరణ్యంబునకుఁ బోయినపిమ్మట దుఃఖంబునం గృశించి ప్రాణంబులు విడువకుండునట్లు నీ వాబిడయం దాదరంబు సూపుచుండవల యును. అని రాముఁడు దశరథునితోఁ జెప్పెను. ౧౮

ఇది ముప్పదెనిమిదవసర్గము.

---

## ముప్పదితొమ్మిదవసర్గము

దశరథమహారాజు రాముఁడు చెప్పినమాటను విని భార్యలతోఁగూడ

సమీక్ష్య సహభార్యాభీ రాజా విగతచేతనః. ౧

నైనం దుఃఖేన సన్తప్తః ప్రత్యవైక్షత రాఘవమ్,
నచైన మభిసమ్ప్రేక్ష్య ప్రత్యభాషత దుర్మనాః. ౨

స ముహూర్త మివాసంజ్ఞో దుఃఖిత శ్చ మహీపతిః,
విలలాప మహాబాహూ రామ మేవానుచిన్తయన్. ౩
మన్యే ఖలు మయా పూర్వం వివత్సా బహవః కృతాః,
ప్రాణినో హింసితా వాఽపి తస్మా దిద ముపస్థితమ్. ౪
న త్వేవానాగతే కాలే దేహా చ్చ్యవతి జీవితమ్,

కైకేయ్యా క్లిశ్యమానస్య మృత్యు ర్మమ న విద్యతే. ౫
యోఽహం పావకసఙ్కాశం పశ్యామి పురత స్స్థితమ్,
విహాయ వసనే సూక్ష్మే తాపసాచ్ఛాదమాత్మజమ్. ౬

ఏకస్యాః ఖలు కైకేయ్యాః కృతేఽయం క్లిశ్యతే జనః.
స్వార్థే ప్రయతమానాయా స్సంశ్రిత్య నికృతిం త్విమామ్. ౭

ఏవ ముక్త్వా తు వచనం బాష్పేణ పిహితేక్షణః,
రామేతి సకృ దే వోక్త్వా వ్యాహర్తుం న శశాక హ. ౮
సంజ్ఞాం తు ప్రతిలభ్యైవ ముహూర్తా త్స మహీపతిః,
నేత్రాభ్యా మశ్రుపూర్ణాభ్యాం సుమన్త్ర మిద మబ్రవీత్. ౯
ఔపవాహ్యం రథం యుక్త్వా త్వ మాయాహి హయోత్తమైః,
ప్రాప యైనం మహాభాగ మితో జనపదా త్పరమ్. ౧౦

నతఁడు మునివేషంబు దాల్చియుండుటం జూచి పరమదుఃఖంబు నొంది మూర్ఛపోయెను. ౧

పరమదుఃఖితుఁ డగు నాదశరథుఁడు మునివేషధరుఁడగు రామునిం జూడనే లేకపోయెను. చూచియుం దుఃఖంబున నేమియుఁ బలుకంజాల కుండెను. ౨

మహాబాహుఁ డగు దశరథుఁడు దుఃఖితుఁడై కొంతసేపు మూర్ఛపోయినట్లుండి రామునే తలంచుకొనుచు రోదనంబు చేసెను. ౩

నేను మున్ను నేకులబిడ్డలం జంపియుందును. లేక ప్రాణిహింసనయినం జేసియుందును కావుననే నా కిట్టిపుత్రదుఃఖము సంభవించినది. ౪.

'అవసానకాలము రానిచో నెవ్వనికిని దేహమునుండి ప్రాణంబు పోనేపోదు.

నేను అగ్నిహోత్రునకు సాటియగు నాకుమారుఁడు సూక్ష్మవస్త్రంబులం బరిత్యజించి మునులు గట్టుకొను నారచీరలం దాల్చి నాముందట నుండఁగాఁ జూచుచు నిట్లు కైకేయిచే బాధింపఁబడుచున్నను నాకు మరణంబు గలుగకున్నది. ౫,౬

ఇట్లు కుట్ర నవలంబించి తనకార్యంబు చక్కఁబెట్టుకొనుటకై యే ప్రయత్నించుచున్న యొక్క కైకేయికిఁగా నీజనులందఱును దుఃఖపడుచున్నారు గదా! దైవగతి కేమిసేయవచ్చును! అని దశరథుఁ డేడ్చెను. ౭

ఆదశరథుఁడు ఇట్లు విలపించి కన్నీటం దోఁగుకండ్లతో 'రామఁడా' యనియొక్క మాటమాత్రము చెప్పి యాపైని మాటలాడం జాలకుండెను. ౮

దశరథుఁ డంతఁ గొంతసేపునకుఁ దెలివొంది కండ్లనిండఁ గన్నీరు గాఱఁగా సుమంత్రుంజూచి యిట్లని చెప్పెను. ౯

నీవు పోయి విలాసార్థముగా నెక్కఁదగిన రథం బొకటి మంచిగుఱ్ఱంబులు గట్టి యిచ్చుటకిఁ దెచ్చి మహాభాగుఁడగు నీరాము నెక్కించుకొనిపోయి యీదేశంబున కవ్వల నరణ్యంబున వదలిపెట్టి రమ్ము. ౧౦

ఏవం మన్యే గుణవతాం గుణానాం ఫల ముచ్యతే,
పిత్రా మాత్రా చ య త్సాధు ర్వీరో నిర్వాస్యతే వనమ్. ౧౧

రాజ్ఞో వచన మాజ్ఞాయ సుమన్త్ర శ్శీఘ్రవిక్రమః,
యోజయిత్వాఽఽయయౌ తత్ర రథ మశ్వై రలఙ్కృతమ్.
తం రథం రాజపుత్రాయ సూతః కనకభూషితమ్,
ఆచచక్షేఽఞ్జలిం కృత్వా యుక్తం పరమవాజిభిః. ౧౩

రాజా సత్వర మాహూయ వ్యాపృతం విత్తసంచయే,
ఉవాచ దేశకాలజ్ఞం నిశ్చితం సర్వత శ్శుచిమ్. ౧౪

వాసాంసి చ మహార్హాణి భూషణాని వరాణి చ,
వర్షాణ్యేతాని సంఖ్యాయ వైదేహ్యాః క్షిప్ర మానయ. ౧౫

నరేన్ద్రేణైవ ముక్త స్తు గత్వా కోశగృహం తతః,
ప్రాయచ్ఛ త్సర్వ మాహృత్య సీతాయై సమ మేవ తత్. ౧౬

సా సుజాతా సుజాతాని వైదేహీ ప్రస్థితా వనమ్,
భూషయామాస గాత్రాణి తై ర్విచిత్రై ర్విభూషణైః. ౧౭

వ్యరాజయత వైదేహీ వేశ్మ త త్సువిభూషితా,
ఉద్యతోఽంశుమతః కాలే ఖం ప్రభేవ వివస్వతః. ౧౮

తండ్రియుఁ దల్లియుం జేరి సత్పురుషుండును వీర్యవంతుఁడు నగు కొడుకు నరణ్యంబునకుఁ బంపుచున్నారే, గుణవంతులకు గుణంబులు గలుగుట కిదియే ఫలమని తోఁచించుచున్నది. నాకు సత్యాదిగుణములు లేకున్న నే నిట్లు రాము నరణ్యంబునకుఁ బంపనుగదా! కావున గుణంబులును గొన్ని సమయంబులఁ గష్టంబు నిచ్చును. అని దశరథుఁడు సుమంత్రునితోఁ జెప్పెను. ౧౧

సుమంత్రుఁ డంత రాజాజ్ఞను శిరసావహించి శీఘ్రంబుగాఁ బోయి రథంబు నలంకరించి గుఱ్ఱంబులుగట్టి యచ్చటికిఁ దీసికొనివచ్చెను. ౧౨

సుమంత్రుఁడు "బంగారముచే నలంకరింపఁబడినదియు నుత్తమాశ్వంబులు గట్టినదియునగు రథం బాయత్తంబుగానున్న" దని చేతులు మొగుడ్చుకొని రాచకొమరుఁడగు రామునకుఁ జెప్పెను. ౧౩

అంత దశరథమహారాజు ఏదేశంబున నేకాలంబున నేది సేయవలయునో అది యంతయుం దెలిసినవాఁడును నిశ్చయవంతుఁడును బాహ్యాభ్యంతరంబుల నుం బరిశుద్ధుఁడునగు ధనాధ్యక్షుని సత్వరంబుగాఁ బిలిచి యిట్లని చెప్పెను

ఇప్పుడు సీత యరణ్యంబున నుండవలసిన సంవత్సరంబులు లెక్కపెట్టుకొని ఈపదునాలుగుసంవత్సరములకును జాలునట్లు, ఉత్తమంబులగు వస్త్రంబులును మంచిసొమ్ములును శీఘ్రముగాఁ దెచ్చి సీత కిమ్ము. అని దశరథుఁడు ధనాధ్యక్షున కాజ్ఞాపించెను. ౧౪

అంత దశరథుఁడు చెప్పినట్లు ధనాధ్యక్షుఁడు కోశగృహమునకుఁ బోయి దశరథుండు చెప్పినవన్నియుఁ దీసికొనివచ్చి పదునాలుగుసంవత్సరములకునుం జాలునట్లు సీత కొసంగెను. ౧౫

సుందరియయిన యాసీతాదేవి యరణ్యంబునకుఁ బయనంబయి నానావిధంబులగు నాభూషణంబులను సుందరంబులయిన యవయవంబుల ధరించుకొని యలంకరించుకొనెను. ౧౬

ప్రాతఃకాలంబున నూతనకిరణంబులతో నుదయించుచున్న సూర్యుని కాంతిచే నాకాశంబు ప్రకాశించునట్లు అప్పుడు భూషణంబులం జక్కఁగా నలంకృతయయియున్న సీతచే నాగృహం బంతయుఁ బ్రకాశించినది. ౧౭

తాం భుజాభ్యాం పరిష్వజ్య శ్వశ్రూ ర్వచన మబ్రవీత్ ,
అనాచరన్తీం కృపణం మూర్ధ్న్యుపాఘ్రాయ మైథిలీమ్. ౧౯
అసత్య స్సర్వలోకేఽస్మి న్సతతం సత్కృతాః ప్రియైః,
భర్తారం నానుమన్యన్తే వినిపాతగతం స్త్రియః. ౨౦

ఏష స్వభావో నారీణా మనుభూయ పురా సుఖమ్,
అల్పా మప్యాపదం ప్రాప్య దుష్యన్తి ప్రజహ త్యపి. ౨౧

అసత్యశీలా వికృతా దుర్గ్రాహ్యహృదయా స్సదా,
యువత్యః పాపసఙ్కల్పాః క్షణమాత్రా ద్విరాగిణః. ౨౨

న కులం న కృతం విద్యాం న దత్తం నాపి సంగ్రహమ్,
స్త్రీణాం గృహ్ణాతి హృదయ మనిత్యహృదయా హి తాః. ౨3

సాధ్వీనాం హి స్థితానాం తు శీలే సత్యే శ్రుతే శమే,
స్త్రీణాం పవిత్రం పరమం పతిరేకో విశిష్యతే. ౨౪

స త్వయా నావమన్తవ్యః పుత్త్రః ప్రవ్రాజితో మమ,
తవ దైవత మ స్త్వేష నిర్ధన స్సధనోఽపి వా. ౨౫

విజ్ఞాయ వచనం సీతా తస్యా ధర్మార్థసంహితమ్,
కృతాఞ్జలి రువాచేదం శ్వశ్రూ మభిముఖే స్థితామ్. ౨౬

అంత నత్తయగున కౌసల్య శుద్ధాచారంబులం జేయనట్టి యాసీతను జేతులం గుచ్చి కౌఁగిలించికొని శిరంబు మూర్కొని యిట్లని చెప్పెను. ౧౯

ఈలోకమునం దంతయుం దుష్టస్త్రీలు తమకుఁ బెనిమిటి యెల్లప్పుడును గోరినదాని నొసంగి సంతోషంబు సేయుచుండినను అతనికిఁ గొంచము కష్టదశ గల్గినప్పుడు ఆతని నెంతమాత్రము లెక్కింపకుందురు. ౨౦

మొదట సుఖం బనుభవించునప్పుడు మంచివారలుగా నుండి యెంతో సుఖంబుననుభవించి పిమ్మట భర్తకు దారిద్ర్యము మొదలగు నాపద గొంచెము వచ్చినను దుష్టలయి భర్తను విడువంజూతురు. అది స్త్రీలకు స్వభావము. ౨౧

స్త్రీలు ఎప్పుడు నబద్ధమునె యాడుచుందురు. వికారముగలిగి ప్రవర్తింతురు. వారిమనంబు నెఱుంగరాదు. మఱియుం వారలు పాపమునే సేయఁ గోరుచుందురు. స్వల్ప మప్రియము గావించినను అదివఱ కున్న ప్రేమ నంతయుం విడుతురు. కావున వారి నమ్మరాదు. ౨౨

స్త్రీలమనసు సత్కులమును గాని యుపకారమును గాని విద్యనుగాని ధనాదులనుగాని లోకమర్యాదనుగాని దేనిని లెక్కింపదు. వారలమనసు మిక్కిలియుఁ జపలముగా నుండును. కావున వారల నమ్మఁగరాదు. (అని కౌసల్య కపటముగాఁ గైకేయిని నిందించినది). ౨౩

సదాచారము నవలంబించి సత్యంబు దప్పక గురుజను లుపదేశించినట్లు కోపం బెంతమాత్రము లేక ప్రవర్తించునట్టి పతివ్రతలగువారలకుఁ బరమ పావనరూపుఁడయిన పెనిమిటి యొక్కఁడే యధికుఁడు మఱేదియుఁ గాదు.

అట్లు దుష్టస్త్రీస్వభావంబు నవలంబించి నీవు వనంబునకుఁ బంపఁబడినాఁడని నాకొడుకు నవమానింపవలదు. ఇతఁడు దరిద్రుఁడైనను ధనికుండైన నేమి ? నీవితని దేవతగాఁ జూచుకొనుచుండుము. అని కౌసల్య సీతకుఁ జెప్పినది. ౨౪

సీతాదేవి, కౌసల్య చెప్పినమాట ధర్మ్యముగా నున్నదని తెలిసికొని తనయెదుటనున్న కౌసల్యం జూచి చేమోడ్పుగేలించి యిట్లని చెప్పెను. ౨౫

కరిష్యే సర్వమేవాహ మార్యా య దనుశాస్తి మామ్,
అభిజ్ఞాఽస్మి యథా భర్తు ర్వర్తితవ్యం శ్రుతం చ మే. ౨౭

న మా మసజ్జనే నార్యా సమానయితు మర్హతి,
ధర్మా ద్విచలితుం నాహ మలం చన్ద్రా దివ ప్రభా. ౨౮

నాతన్త్రీ వాద్యతే వీణా నాచక్రో వర్తతే రథః,
నాపతి స్సుఖ మేధేత యా స్యా దపి శతాత్మజా. ౨౯

మితం దదాతి హి పితా మితం మాతా మితం సుతః,
అమితస్య హి దాతారం భర్తారం కా న పూజయేత్. 30

సాఽహ మేవం గతా శ్రేష్ఠా శ్రుతధర్మపరావరా,
ఆర్యే! కి మవమన్యేఽహం స్త్రీణాం భర్తాహి దైవతమ్. 3౧

సీతాయా వచనం శ్రుత్వా కౌసల్యా హృదయంగమమ్,
శుద్ధసత్త్వా ముమోచాశ్రు సహసా దుఃఖహర్షజమ్. 3౨

తాం ప్రాఞ్జలి రభిక్రమ్య మాతృమధ్యేఽతిసత్కృతామ్,
రామః పరమధర్మజ్ఞో మాతరం వాక్యమబ్రవీత్. 33

అమ్బ! మా దుఃఖితా భూ స్త్వం పశ్య త్వం పితరం మమ,

పూజ్యురాలవగు నీవు నా కేది యాజ్ఞాపించుచున్నావో, అదంతయుం జక్కఁజేసెదను. పెనిమిటివిషయమై నే నెట్లుండవలయునో అది నాకుం దెలియును. నేను వినియున్నాను. ౨౭

పూజ్యురాలవగు నీవు నన్ను దుష్టస్త్రీలతో సాటిసేయవలదు. కాంతి చంద్రుని విడువఁజాలనట్లు, నేను ధర్మంబు నెంతమాత్రమును విడువఁజాలను. ౨౮

వీణెకుఁ దంత్రులు లేనిచో వాయింపరాదు. రథమునకుఁ జక్రంబులు లేనిచో నది నడవదు; అట్లు నూఱుకొడుకులు గలవయ్యును, స్త్రీకిం బెనిమిటి లేనిచో నది సుఖంబు నొందఁజాలదు. ౨౯

స్త్రీకిఁ దండ్రి పరిమితిగానే యిచ్చును. తల్లియుఁ బరిమితిగానే యిచ్చును. కొడుకును బరిమితిగానే యిచ్చును. పెనిమిటి యిచ్చుదానికి మాత్రము పరిమితి లేదు. అట్టి పెనిమిటి నెవ్వతె పూజింపకుండును? అట్లు పూజింపనిది దుష్టురాలని చెప్పవలయును. ౩౦

ఇట్లు పాతివ్రత్యం బవలంబించి యున్నదానను, మహాపతివ్రతలయిన వారివలన ధర్మంబులసంగతి యంతయుం వినియున్నదాన నగునట్టి నే నేల పెనిమిటి నవమానింతును? ఎంతమాత్రము నవమానింపను. స్త్రీలకుఁ బెనిమిటి దేవత గదా! అని సీత కౌసల్యతోఁ జెప్పెను. ౩౧

పరిశుద్ధంబగు సత్త్వగుణముగల కౌసల్యాదేవి, సీతాదేవి చెప్పిన సంతోషకరంబగుమాటను విని అప్పుడే రాముఁ డరణ్యంబునకుఁ బోనున్నాఁడే యని దుఃఖంబును సీత యింత పతివ్రతగా నున్నదని సంతోషంబునుం బెనంగొనఁ గండ్లనిండఁ గన్నీరు గార్చెను. ౩౨

పరమధార్మికుఁడగు రాముఁడు, తల్లు లందఱిచేతను మిక్కిలియుఁ బూజింపఁబడిన తల్లికౌసల్యకుఁ జేమోడ్పుగేలించి, ప్రదక్షిణముచేసి యిట్లని చెప్పెను. ౩౩

తల్లీ! నేను వనంబున నుండవలసిన పదునాలుగుసంవత్సరములు శీఘ్ర

క్షయో హి వనవాసస్య క్షిప్రమేవ భవిష్యతి. ౩౪

సుప్తాయా స్తే గమిష్య న్తి నవవర్షాణి పఞ్చ చ,
సా సమగ్ర మిహ ప్రాప్తం మాం ద్రక్ష్యసి సుహృద్వృతమ్.

ఏతావదభినీతార్థ ముక్త్వా స జననీం వచః,
త్రయశ్శతశతార్ధా శ్చ దదర్శావేక్ష్య మాతరః. ౩౬
తా శ్చాపి స తథై వార్తా మాతౄ ర్దశరథాత్మజః,
ధర్మయుక్త మిదం వాక్యం నిజగాద కృతాఞ్జలిః. ౩౭
సంవాసా త్పరుషం కించి దజ్ఞానా ద్వాఽపి యత్కృతమ్,
తన్మే సమనుజానీత సర్వా శ్చామన్త్రయామి వః. ౩౮

వచనం రాఘవ స్యైత ద్ధర్మయుక్తం సమాహితమ్,
శుశ్రువు స్తాః స్త్రియ స్సర్వా శ్శోకోపహతచేతసః. ౩౯
జజ్ఞేఽథ తాసాం సన్నాదః క్రౌఞ్చీనా మివ నిస్వనః,
మానవేన్ద్ర స్య భార్యాణా మేవం వదతి రాఘవే. ౪౦
మురజపణవమేఘఘోషవ
ద్దశరథవేశ్మ బభూవ యత్పురా,
విలపితపరిదేవనాకులం
వ్యసనగతం త దభూ త్సుదుఃఖితమ్. ౪౧

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే ఏకోనచత్వారింశస్సర్గః

ముగానే గడచిపోవును. కావున నీవు దుఃఖింపకుము, నాతండ్రిని జూచు కొనుచుండుము. ౩౪

నీవు కొంచెమునేపు కండ్లుమూసుకొని నిద్రపొమ్ము. ఇంతలోఁ బదు నాలుగుసంవత్సరంబులు గడచిపోవును. అంత నిచ్చటికిఁ వచ్చి స్నేహితులం గూడి సంపూర్ణకాముఁడనై యున్న నన్నుం జూడఁగలవు. అని రాముఁడు తల్లితోఁ జెప్పెను. ౩౫

రాముఁడు తల్లికి సవినయముగా నింతమట్టునకుఁ జెప్పి, యంత తన తల్లులను మున్నూటయేఁబదిమందిని విమర్శించి చూచెను. ౩౬

దశరథపుత్త్రుఁడగు రాముండు, అలాగే దుఃఖితలయియున్న యా తల్లులం జూచి చేమోడ్పుగేలించి ధార్మికంబగు నీమాటం జెప్పెను. ౩౭

చిరపరిచయదోషంబునంగాని యజ్ఞానంబునం గాని నేనేమైన నప రాధంబు చేసియుండునేని దానిని మీరు క్షమింపుఁడు. మిమ్ముల నందఱను వీడ్కొనియెదను. అని రాముఁడు ఆతల్లులతోఁ జెప్పెను. ౩౮

ఆదశరథభార్య లందఱు మహాదుఃఖంబున ధర్మయుక్తంబును మంచి యర్థంబుగలదియు నగురామునిమాటను వినిరి. ౩౯

రాముఁ డిట్లు సెప్పుటను విని యాదశరథభార్యలు ఆఁడక్రౌంచ పక్షులంబోలె మనోహరంబగు కంఠస్వరంబున రోదనంబు చేసిరి. ౪౦

మున్ను నిత్యంబును వాయింపఁబడుచుండు మృదంగంబులయు నుదు కలయు మేఘంబులను వాద్యవిశేషంబులయు ధ్వనుల నొప్పుచుండిన దశరథు నిల్లు అప్పుడు ఆందలిజనులందఱు నాపదనొంది మిక్కిలియు దుఃఖింపుచు రామునిం బ్రస్తుతించుచు నిట్లు నానావిధవాక్యంబు లాడుకొనుచుండ నా మాటలచేతను వారలరోదనధ్వనులచేతను వ్యాకులంబై యుండినది. ౪౧

ఇది ముప్పదితొమ్మిదవసర్గము.

## చత్వారింశస్సర్గః

అథ రామ శ్చ సీతా చ లక్ష్మణ శ్చ కృతాఞ్జలిః,
ఉపసంగృహ్య రాజానం చక్రు ర్దీనాః ప్రదక్షిణమ్. ౧

తం చాపి సమనుజ్ఞాప్య ధర్మజ్ఞ స్సీతయా సహ,
రాఘవ శ్శోకసమ్మూఢో జననీ మభ్యవాదయత్. ౨

అన్వక్షం లక్ష్మణో భ్రాతుః కౌసల్యా మభ్యవాదయత్,

అథ మాతు స్సుమిత్రాయా జగ్రాహ చరణౌ పునః. ౩

తం వన్దమానం రుదతీ మాతా సౌమిత్రి మబ్రవీత్,
హితకామా మహాబాహుం మూ ర్ధ్న్యుపాఘ్రాయ లక్ష్మణమ్.

సృష్ట స్త్వం వనవాసాయ స్వనురక్త స్సుహృజ్జనే,
రామే ప్రమాదం మాకార్షీః పుత్ర! భ్రాతరి గచ్ఛతి. ౫

వ్యసనీ వా సమృద్ధో వా గతి రేష తవానఘ!,
ఏష లోకే సతాం ధర్మో య జ్జ్యేష్ఠవశగో భవేత్. ౬

ఇదం హి వృత్త ముచితం కుల స్యాస్య సనాతనమ్,
దానం దీక్షా చ యజ్ఞేషు తనుత్యాగో మృధేషు చ.

## నలువదియవసర్గము

అంత రాముఁడును సీతయును లక్ష్మణుఁడును మువ్వురును జేతులు మోడ్చుకొని దశరథునకు నమస్కరించి వృద్ధులగు తలిదండ్రులను విడిచి పోవలయునే అని దుఃఖితులయి ప్రదక్షిణము చేసిరి. ౧

రాముఁడు ధర్మంబునెఱింగినవాఁడు గావున దశరథుని యనుమతిలేక సీతాలక్ష్మణులు తనవెంట రాఁగూడదని తెలిసికొని వారలకును దశరథునిచే ననుజ్ఞనిప్పించి తల్లిని విడిచిపోవలయునే యని మిక్కిలియుం దుఃఖితుఁడై తల్లియగు కౌసల్యకు నమస్కారము చేసెను. ౨

తనయన్న రాముఁడు కౌసల్యకు నమస్కారముఁ జేసినవెంటనే, లక్ష్మణుఁడు కౌసల్యకు నమస్కారముఁ జేసెను.

లక్ష్మణుఁ డట్లు కౌసల్యకు నమస్కరించినపిమ్మటఁ దనతల్లియయిన సుమిత్రపాదంబులకు నమస్కారము చేసెను. ౩

తల్లియగు సుమిత్ర రోదనంబు సేయుచు లక్ష్మణునిహితంబుఁ గోరి తనకు నమస్కరించుచున్న మహాబాహుఁడగు లక్ష్మణు నెత్తి శిరంబు మూర్కొని యిట్లని చెప్పెను. ౪

కొడుకా! నిన్ను అడవిలో నుండుటకై యిట్లు స్నేహితుఁడగు రాముని యం దనురక్తునిఁగా దైవము సృజించినది. నీయన్న రాముఁడు భార్యతోఁ గూడ వనంబునందలి వైచిత్రిం జూచుచుఁ బరవశుఁడై పోవుచుండునప్పుడు నీ వేమఱి యుండవలదు. ౫

పాపరహితుఁడవగు లక్ష్మణుఁడా! ఈరాముఁడు నిర్ధనుండై యుండినను, రాజ్యంబు నొందియుండిన నేమి? యతఁడే నీకు శరణము ఏల యనఁగా గనిష్ఠుఁడు జ్యేష్ఠునకు లోఁబడియుండుట లోకంబునందంతయుఁ బెద్ద లాచరించు ధర్మము. ౬

ఇట్లు జ్యేష్ఠు ననుసరించుటయుం, దానంబుసేయుటయుఁ, యాగంబులందు దీక్షవహించుటయుం, యుద్ధంబున దేహంబు విడుచుటయుఁ, ఇవన్నియుం

లక్ష్మణం త్వేవ ముక్త్వా సా సంసిద్ధం ప్రియరాఘవమ్,
సుమిత్రా గచ్ఛ గచ్ఛేతి పునః పున రువాచ తమ్. ౮

రామం దశరథం విద్ధి మాం విద్ధి జనకాత్మజామ్,
అయోధ్యా మటవీం విద్ధి గచ్ఛ తాత! యథాసుఖమ్, ౯
తత స్సుమన్త్రః కాకుత్స్థం ప్రాఞ్జలి ర్వాక్య మబ్రవీత్,
వినీతో వినయజ్ఞశ్చ మాతలిర్వాసవం యథా. ౧౦

రథ మారోహ భద్రం తే రాజపుత్ర! మహాయశః,
శీఘ్రం త్వాం ప్రాపయిష్యామి యత్ర మాం రామ! వక్ష్యసి.

చతుర్దశ హి వర్షాణి వస్తవ్యాని వనే త్వయా,
తాన్యుపక్రమితవ్యాని యాని దేవ్యా సుచోదితః. ౧౨

తం రథం సూర్యసఙ్కాశం సీతా హృష్టేన చేతసా,
ఆరురోహ వరారోహా కృత్వాఽలఙ్కార మాత్మనః. ౧౩

అథో జ్వలనసఙ్కాశం చామీకరవిభూషితమ్,
త మారురుహతు స్తూర్ణం భ్రాతరౌ రామలక్ష్మణౌ. ౧౪

వనవాసం హి సంఖ్యాయ వాసాంస్యాభరణాని చ,
భర్తార మనుగచ్ఛన్త్యై సీతాయై శ్వశురో దదౌ. ౧౫
తథైవాఽఽయుధజాలాని భ్రాతృభ్యాం కవచాని చ,

మీవంశంబునకుం దగినవియు సనాతనంబులు నగు ధర్మములు. అని సుమిత్ర లక్ష్మణునితోఁ జెప్పెను. ౯

సుమిత్ర రామునితో నరణ్యంబునకుఁ బోవ నుద్యుక్తుఁడయి రాముఁడు దక్క మఱేదియుఁ బ్రియపదార్థము లేకుండునట్టి లక్ష్మణున కీప్రకారము చెప్పి మాటిమాటికి నీవు వనంబునకుఁ బొమ్మని చెప్పెను. రా

రామునిఁ దండ్రిగాఁ దలంపుము. సీతను దల్లిగాఁ దలంపుము. అడవి నే యయోధ్యగాఁ దలంపుము. ఇంక సుఖంబుగా వనంబునకుఁ బొమ్ము

అంత వినయాచారంబు లెఱింగిన సుమంత్రుఁడు వినయంబునఁ జేమోడ్పుగీలించి మాతలి యింద్రునితోఁ జెప్పునట్లు రామునిం జూచి యిట్లని చెప్పెను. ౧౦

అధికమయిన కీర్తిగలవాఁడవగు రాముఁడా! నీవు రథం బెక్కుము. నీకు మంగళంబులు గలుగుఁగాక. నీ వెచ్చటికిఁ గొనిపొమ్మనుదువో అచ్చటికి శీఘ్రంబుగాఁ గొనిపోయెదను. ౧౧

నీవు వనంబునందుఁ బదునాలుగుసంవత్సరంబు లుండవలయుంగదా! కైకేయి నీ కాజ్ఞాపించినట్లు నీ వాపదునాలుగుసంవత్సరంబులు వనంబున నుండ నారంభింపవలసినది అని సుమంత్రుఁడు రామునితోఁ జెప్పెను. ౧౨

సుందరములయిన పిఱుఁదులుగల సీతాదేవి చక్కఁగా నలంకారంబు చేసికొని సంతుష్టంబగుమనంబున సూర్యునిభంగిఁ దేజరిల్లుచున్న యారథంబు నెక్కెను. ౧౩

అంత బంగారములతో నలంకరింపఁబడి యగ్నిహోత్రమువలె వెలుంగుచున్న యారథంబును, అన్నదమ్ములు రామలక్ష్మణులును శీఘ్రముగా నారోహించిరి. ౧౪

దశరథుఁడు వనంబున నుండవలసినకాలమును లెక్కపెట్టి సీతాదేవికి వస్త్రములను సొమ్ములను రామలక్ష్మణులకు ఆయుధంబులను గవచంబులను ఇచ్చెనుగదా!. ౧౫

రథోపస్థే ప్రతిన్యస్య సచర్మ కఠినం చ తత్. ౧౬
సీతాతృతీయా నారూఢా న్దృష్ట్వా ధృష్ట మచోదయత్,
సుమన్త్ర స్సమ్మతా నశ్వా న్వాయువేగసమా న్జవే. ౧౭

ప్రతియాతే మహారణ్యం చిరరాత్రాయ రాఘవే,
బభూవ నగరే మూర్ఛా బలమూర్ఛా జనస్య చ. ౧౮

త త్సమాకులసమ్భ్రాన్తం మత్తసంకుపితద్విపమ్,
హయశిఞ్జితనిర్ఘోషం పుర మాసీ న్మహాస్వనమ్. ౧౯

తత స్సబాలవృద్ధా సా పురీ పరమపీడితా,
రామమేవాభిదుద్రావ ఘర్మార్తా సలిలం యథా. ౨౦

పార్శ్వతః పృష్ఠత శ్చాపి లమ్బమానా స్తదున్ముఖాః,
బాష్పపూర్ణముఖాస్సర్వే త మూచు ర్భృశనిస్వనాః. ౨౧

సంయచ్ఛ వాజినాం రశ్మీ న్సూత! యాహి శనైశ్శనైః,
ముఖం ద్రక్ష్యామ రామస్య దుర్దర్శం నో భవిష్యతి. ౨౨

ఆయసం హృదయం నూనం రామమాతు రసంశయమ్,

ఆసుమంత్రుఁడు దశరథుఁడా సీతారామలక్ష్మణుల కొసంగిన వస్త్రభూషణంబుల నాయుధకవచంబులను చిన్నపుటికను గుద్దలిని రథంబునడుమ నుంచి యంత సీతారామలక్ష్మణులు మువ్వురును రథంబెక్కి యుండుటం జూచి శుభలక్షణయుక్తంబులును వాయువునకుం బోలె మహావేగంబు గలవియు నగుగుఱ్ఱంబులను వడిగాఁ దోలెను. ౧౬,౧౭

రాముఁడు బహుకాలము నివసించుటకై వనంబునకుం బోఁగానే పట్టణంబునందలి సమస్తజనులును మూర్ఛఁబొందిరి. మఱియుం గుఱ్ఱములు గజములు మొదలగునవియు మూర్ఛఁబొందినవి. రామునియుత్సవంబుఁ జూడ గ్రామంబులనుండి వచ్చినజనులును మూర్ఛనొందిరి. ౧౮

అంత నాయయోధ్యాపట్టణంబున జనులు దుఃఖంబునఁ గలఁతనొంది దొట్రుపాటున నేమియుఁ దోఁచక తిరుగుచుండిరి. ఏనుఁగులును దుఃఖాతిశయంబు కోపరూపంబునం బరిణమింప మదించి కేకలు వేయుచుండినవి. గుఱ్ఱంబులు భూషణధ్వనిచెలంగ నిట్టట్టు పరుగెత్తినవి. ఇట్లు అయోధ్యాపట్టణంబంతయు మహాధ్వని నిండియుండినది. ౧౯

అంత బాలురును మున్నగు నాపట్టణంబుననున్న జను లందఱు మహాదుఃఖంబు నొంది దప్పిగొన్నవారు జలంబువెంటం బోవునట్లు రామువెంటనే పరుగెత్తుచుఁ బోయిరి. ౨౦

ఆజను లందఱును ఆరామునిరథంబునకుఁ బార్శ్వభాగంబులను గొందఱును బృష్ఠభాగంబును గొందఱును బట్టుకొని వంగి తలయెత్తి రాముని ముఖంబుతట్టు చూచుచు ముఖంబునిండఁ గన్నీళ్లు గాఱఁ బెద్దయెలుంగున నిట్లని చెప్పిరి. ౨౧

సారథివగు సుమంత్రుఁడా! గుఱ్ఱములపగ్గముల నీడ్చిపట్టుకొని మెల్ల మెల్లఁగాఁ బోనిమ్ము. మేము రాముని ముఖంబుఁ జూచెదము. ఇంక దానిం జూచుటకు మాకవకాశ ముండదు. ౨౨

దేవకుమారునింబోలిన కొడుకు రాముఁ డడవికిఁ బోవుచుండఁగాఁ

ము ద్దేవగర్భప్రతిమే వనం యాతి న భిద్యతే. ౨౩

కృతకృత్యా హి వైదేహీ ఛాయేవానుగతా పతిమ్,
న జహాతి రతా ధర్మే మేరు మర్కప్రభా యథా. ౨౪

అహో! లక్ష్మణ! సిద్ధార్థ స్సతతం ప్రియవాదినమ్,
భ్రాతరం దేవసఙ్కాశం య స్త్వం పరిచరిష్యసి. ౨౫
మహత్యేషా హి తే సిద్ధి రేష చాభ్యుదయో మహాన్,
ఏష స్వర్గస్య మార్గశ్చ య దేన మనుగచ్ఛసి. ౨౬
ఏవం వద న్త స్తే సోఢుం న శేకు ర్బాష్ప మాగతమ్,
నరా స్త మనుగచ్ఛ న్తఙ్ప్రియ మిక్ష్వాకునన్దనమ్. ౨౭
అథ రాజా వృతః స్త్రీభి ర్దీనాభి ర్దీనచేతనః,
నిర్జగామ ప్రియం పుత్రం ద్రక్ష్యా మీతి బ్రువన్గృహాత్. ౨౮
శుశ్రువే చాగ్రతః స్త్రీణాం రుద న్తీనాం మహాస్వనః,
యథా నాదః కరేణూనాం బద్ధే మహాతి కుఞ్జరే. ౨౯
పితా హి రాజా కాకుత్స్థః శ్రీమా న్సన్న స్తదాఽభవత్,
పరిపూర్ణశశీ కాలే గ్రహేణోపప్లుతో యథా. ౩౦

స చ శ్రీమా న చిన్త్యాత్మా రామో దశరథాత్మజః,
సూతం సంచోదయామాస త్వరితం వాహ్యతా మితి. ౩౧

రామో యాహీతి తం సూతం తిష్ఠేతి స జన స్తదా,
ఉభయం నాశక త్సూతః కర్తు మధ్వని చోదితః. ౩౨

కౌసల్య మనసు పగులకున్న దే; ఇనుముతోఁ జేయఁబడినది కాఁబోలు. ఇందు సందేహము లేదు. ౨౩

సీతాదేవి ఛాయవలెఁ బెనిమిటిని వెంబడించినది కావునఁ గృతార్థురాలైనది. ధర్మము నాశ్రయించి మేరుపర్వతమును సూర్యకాంతి వదలకుండునట్లు వదలకున్నది. ౨౪

లక్ష్మణుఁడా! నీవు ప్రియవాదియుం దేవసమానుఁడు నగు నన్నకెల్లప్పుడును బరిచర్యసేయ నిశ్చయించితివి కావున నీవు కృతార్థుఁడవు. ౨౫

నీ కీరాముని వెంబడించుటయె గొప్పతపస్సిద్ధి. ఇదియె నీ కభ్యుదయము. ఇదియె నీకు స్వర్గము గలిగించునదియుం. అని జను లందఱుఁ జెప్పిరి. ౨౬

ప్రియుండగు నారాముని వెంబడించునట్టి యారాజనులు ఈప్రకారము చెప్పుచుఁ గన్నీళ్ల నణఁచుకొనం జాలరైరి. ౨౭

అంత దశరథమహారాజు దుఃఖంబున దుఃఖితలగుభార్యలం గూడి "ప్రియపుత్రుం జూచెదను" అని చెప్పుచు నింటనుండి వెడలెను. ౨౮

అంత ముందట స్త్రీలందఱు మహాగజము బంధింపఁబడఁగా నాఁడేనుంగులు దుఃఖించునట్లు రోదనంబు గావించిరి. అందువలన మహాధ్వని గలిగినది. ౨౯

అప్పుడు తండ్రియును శ్రీమంతుఁడునగు దశరథుఁడు రామదుఃఖంబున గ్రహణకాలమునందు రాహువుచే గ్రసింపఁబడిన చంద్రుఁడువలె క్షీణత నొందెను. ౩౦

శ్రీమంతుఁడును ఇంతమాత్రమని తెలియరాని మహాధైర్యము గలవాఁడునగు "దశరథపుత్రుఁడగు రాముఁడు జనులట్లు తన్ను వెంబడించుటం జూచి శీఘ్రముగాఁ దోలుము" అని సారథి యయిన సుమంత్రున కాజ్ఞాపించెను. ౩౧

అప్పుడు రాముఁ డాసుమంత్రుని శీఘ్రముగాఁ దోలు మని యాజ్ఞాపించెను; ఆజనులు నిలుపుమని చెప్పిరి. ఇట్లు రెండువిధము లగుటవలన సుమంత్రుఁడు రెంటినిం జేయఁజాలఁ డయ్యె. ౩౨

నిర్గచ్ఛతి మహాబాహౌ రామే పౌరజనాశ్రుభిః,
పతితై రభ్యవహితం ప్రశశామ మహీరజః. ౩౩
రుదితాశ్రుపరిద్యూనం హాహాకృత మచేతనమ్,
ప్రయాణే రాఘవ స్యాసీ త్పురం పరమపీడితమ్. ౩౪

సుస్రావ నయనైః స్త్రీణా మాస్ర మాయాససమ్భవమ్,
మీనసంక్షోభ చలితైః స్సలిలం పఙ్కజై రివ. ౩౫
దృష్ట్వాతు నృపతి శ్శ్రీమా నేకచిత్తగతం పురమ్,
నిపపాతైవ దుఃఖేన హతమూల ఇవ ద్రుమః. ౩౬

తతో హలహలాశబ్దో జజ్ఞే రామస్య పృష్ఠతః,
నరాణాం ప్రేక్ష్య రాజానం సీదన్తం భృశదుఃఖితమ్. ౩౭
హా రామేతి జనాః కేచి ద్రామమాతేతి చాపరే,
అన్తఃపురం సమృద్ధం చ క్రోశన్తః పర్యదేవయన్. ౩౮

అన్వీక్షమాణో రామ స్తు విషణ్ణం భ్రాన్తచేతసమ్,
రాజానం మాతరం చైవ దదర్శానుగతౌ పథి. ౩౯
స బద్ధ ఇవపాశేన కిశోరో మాతరం యథా,
ధర్మపాశేన సంక్షిప్తః ప్రకాశం నాభ్యుదైక్షత. ౪౦

పదాతినౌ చ యానార్హా వదుఃఖార్హౌ సుఖోచితౌ,
దృష్ట్వా సంచోదయామాస శీఘ్రం యాహీతి సారథిమ్. ౪౧

నహి త త్పురుషవ్యాఘ్రో దుఃఖదం దర్శనం పితుః.

మహాబాహుఁడగు రాముఁడు వనంబునకు వెడలఁగానే జనసమ్మర్దంబున
రేఁగిన దుమ్మంతయుం బౌరజనులు కన్నీళ్లుపడుటవలన నడఁగినది. ౩౩

రాముని ప్రయాణకాలమునందు ఆయయోధ్యలోనిజనులందఱు రోద
నంబుసేయుచు విశేషంబుగాఁ గన్నీళ్లు గార్చుచు హాహాకారంబులు సేయుచు
మూర్ఛనొందుచు నిట్లు పరమపీడితు లయిరి. ౩౪

అప్పుడు మత్స్యంబులు కదలుటచేఁ గదలినకమలంబులనుండి జలము
గాఱునట్లు స్త్రీలనేత్రములనుండి దుఃఖంబునఁ గన్నీరు గాఱినది. ౩౫

శ్రీమంతుఁడగు దశరథమహారాజు అప్పు డప్పట్టణంబుననుండు జను
లందఱు ఒక్కటేవిధంబున మహాదుఃఖంబునొంది యుండుటం జూచినంతనె
దుఃఖం బినుమడింప వేరునఱుకఁగానే వృక్షంబు గూలునట్లు నేలం బడెను.

అంత రామునివెనుకం బోవుచుఁ గృశించి పరమదుఃఖితుఁ డైయున్న
దశరథమహారాజును జూచి జను లందఱు రోదనంబు గావించిరి. ౩౭

కొందఱు జనులు రామునిం బేర్కొనుచును మఱికొందఱు కౌసల్యం
బేర్కొనుచును రోదనంబు గావించిరి. అట్లంతఃపురస్త్రీలందఱు రోదనంబు
గావించిరి. ౩౮

రాముఁ డారోదనధ్వనిని విని వెనుకతట్టు తిరిగిచూచి పరమదుఃఖి
తులగు తలిదండ్రులు తన్ను వెంబడించి వచ్చుటం జూచెను. ౩౯

ఆరాముఁడు త్రాటం గట్టఁబడిన గుఱ్ఱపుపిల్ల తనతల్లిం జూచుచందం
బున ధర్మపాశంబుచే బద్ధుఁడుకావునఁ దలిదండ్రుల వెల్లడిగాఁ జూడక
యోరచూపులం జూచుచుండెను. ౪౦

రాముఁడు వాహనార్హు లయ్యును గాలినడకను వచ్చుచున్నవారలును
దుఃఖంబునకుఁ దగినవారలు గాకున్నను బరమదుఃఖంబు నొందియున్నవార
లును సుఖోచితులయినను సుఖము లేకున్నవారలు నగు తలిదండ్రులం జూచి
"శీఘ్రంబుగా రథంబును బోనిమ్ము" అని సుమంత్రున కాజ్ఞాపించెను. ౪౧

పురుషశ్రేష్ఠుఁడగు రాముఁడు అట్లు పరమదుఃఖితులయియున్న తలి

మాతు శ్చ సహితుం శక్త స్తోత్రార్దిత ఇవ ద్విపః. ౪౨

ప్రత్యగార మి వాయాన్తీ వత్సలా వత్సకారణాత్,
బద్ధవత్సా యథా ధేనూ రామమాతాఽభ్యధావత, ౪౩

తథా రుదన్తీం కౌసల్యాం రథం త మనుధావతీమ్,
క్రోశన్తీం రామ రామేతి హాసీతే! లక్ష్మణే! తి చ. ౪౪
రామలక్ష్మణసీతార్థం స్రవన్తీం వారి నేత్రజమ్,
అసకృ త్ప్రైక్షత తదా నృత్యన్తీ మివ మాతరమ్. ౪౫
తిష్ఠేతిరాజా చుక్రోశ యాహియా హీతి రాఘవః,
సుమన్త్రస్య బభూవాత్మా చక్రయో రివ చాన్తరా. ౪౬

నాశ్రౌష మితి రాజాన ముపాలబ్ధోఽపి వక్ష్యసి,
చిరం దుఃఖస్య పాపిష్ఠ మితి రామ స్త మబ్రవీత్. ౪౭

రామస్య స వచః కుర్వ న్ననుజ్ఞాప్య చ తం జనమ్,
వ్రజతోఽపి హయాఞ్ శీఘ్రం చోదయామాస సారథిః. ౪౮

న్యవర్తత జనో రాజ్ఞో రామం కృత్వా ప్రదక్షిణమ్,
మనసాప్యశ్రువేగైశ్చ న న్యవర్తత మానుషమ్. ౪౯

దండ్రులఁజూచి పరిగోలచేఁ బొడువఁబడిన యేనుఁగుభంగిఁ బరమపీడితుఁడై మరల వారలం జూడఁజాలకుండెను. ౪౨

దూడ యింటఁ గట్టఁబడియుండుటంజేసి దూడయం దతిప్రేమగలది కావున దూడం జేరుటకొఱకై యతివేగంబున నింటికిం బోవ గోవుకైవడి రామునితల్లి యయిన కౌసల్య రథంబుఁ జేరం బరుగెత్తినది. ౪౩

అట్లు రోదనంబు సేయుచు రథంబువెంబడిఁ బరుగెత్తుచు "అయ్యో రాముఁడా! సీతా! లక్ష్మణుఁడా!" అని యాక్రోశించుచు సీతారామలక్ష్మణుల దుఃఖంబునఁ గన్నీళ్లు గార్చుచు దుఃఖాతిశయంబున నొడలు దెలియక, నర్తనంబు సేయుచున్నట్లున్న తల్లియగు కౌసల్యను రాముఁడు మాటిమాటికిం జూచెను. ౪౪, ౪౫

దశరథమహారాజు నిలు నిలు మని యఱచెను. రాముఁడు "శీఘ్రంబుగాఁ దోలు" మని చెప్పెను. అందువలన, సుమంత్రుఁడు నిలుచుటకును బోవుటకునుం దోఁచక చక్రంబులనడుమనుండినట్లు డోలాయమానమానసుఁడై యుండెను. ౪౬

"దశరథుఁడు నిన్ను నామాట యేల వినవైతి వని నిందించునేని నీవు దానికి ఆగుంపులో నాకు నీవు చెప్పినది వినరాలే దని బదులు చెప్పవచ్చును. ఇట్లు వారలు బహుకాలంబు దుఃఖం బనుభవించుచుండుటం జూడ నలవి గాదు." అని రాముఁడు సుమంత్రునితోఁ జెప్పెను. ౪౭

ఆసుమంత్రుఁడు రామునిమాటప్రకారము సేయ నిశ్చయించి రాముని వెంబడి వచ్చుచున్న యంతఃపురజనమునకు రామునివలన ననుజ్ఞయిప్పించి గుఱ్ఱంబులు తమంతనే వేగంబుగాఁ బోవుచున్నను వానిని మఱియు వేగంబుగాఁ దోలెను. ౪౮

రాజసంబంధిజనులు రామునకుం బ్రదక్షిణంబుచేసి వెనుకకు మరలిరి. అట్లు మఱియుఁ గొందఱు మరలిరి గాని మనుష్యమాత్రులుగా నుండువారల కెవ్వరికిని మనంబుననుండు దుఃఖంబును గన్నులం గాఱుకన్నీళ్లను ఎంత మాత్రము దగ్గలేదు. ౪౯

య మిచ్ఛే త్పున రాయాన్తం నైనం దూర మనువ్రజేత్,
ఇత్యమాత్యా మహారాజ మూచు ర్దశరథం వచః. ౫౦
తేషాం వచ స్సర్వగుణోపపన్నం
ప్రస్విన్నగాత్రః ప్రవిషణ్ణరూపః,
నిశమ్య రాజా కృపణ స్సభార్యో
వ్యవస్థిత స్తం సుత మీక్షమాణః. ౫౧

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే చత్వారింశస్సర్గః.

---

## ఏకచత్వారింశస్సర్గః

తస్మిం స్తు పురుషవ్యాఘ్రే వినిర్యాతి కృతాఞ్జలౌ,
ఆర్తశబ్దో హి సంజజ్ఞే స్త్రీణా మన్తఃపురే మహాన్. ౧

అనాథస్య జనస్యాస్య దుర్బలస్య తపస్వినః,
యో గతి శ్శరణం చాసీ త్స నాథః క్వను గచ్ఛతి. ౨

న క్రుధ్య త్యభిశస్తోఽపి క్రోధనీయాని వర్జయన్,
క్రుద్ధా న్ప్రసాదయ న్సర్వా న్సమదుఃఖః క్వ గచ్ఛతి. 3

కౌసల్యాయాం మహాతేజా యథా మాతరి వర్తతే,
తథా యో వర్తతేఽస్మాసు మహాత్మా క్వను గచ్ఛతి. ౪

కైకేయ్యా క్లిశ్యమానేన రాజ్ఞా సంచోదితో వనమ్,

"ఎవ్వండు శీఘ్రముగా మరల రావలెనని కోరికయున్నదో అతని దూరము వెంబడింపరాదు" అని మంత్రులు దశరథమహారాజునకుం జెప్పిరి. ౫౦

దేహాంతమునకుం జేరుటతోం దడిసి మహాదుఃఖంబు నొందియున్న దశరథమహారాజు భార్యతోం గూడినవాండై ఆమంత్రులు చెప్పిన సుగుణయుక్తంబయిన మాటను విని యంత రాముని వెంబడింపక నిలిచి ప్రియపుత్రుండగు రామునిం జూచుచుండెను. ౫౧

ఇది నలువదియవసర్గము.

---

## నలువదొకటవసర్గము

పురుషశ్రేష్ఠుండగు నారాముండు చేమోడ్పు గీలించి వనంబునకు వెడలంగానే యప్పు డంతఃపురమునందలి స్త్రీలు, మహాధ్వని గలుగునట్లు రోదనంబు చేసిరి. ౧

అనాథులు నశక్తులుం గరుణింపందగినవారలు నగు నీజనుల కెవ్వండు ప్రాప్యస్థానమై రక్షకుండుగా నుండునో, అట్టి నాథుండు రాముం డిప్పు డెచ్చటికిం బోవుచున్నాండు? ౨

ఎవ్వండు తనపై నితరులులేనిదోషము నారోపించినప్పటికిని కోపంబు గలిగించువానిని విడిచి, తాను గోపంబు నొందకుండుటయే గాక కోపంబు నొందినవారల నూఱడించుచుండునో, మఱియు నితరులు దుఃఖపడుదురేని తానును దుఃఖపడునో, అట్టి రాముం డిప్పు డెచ్చటికిం బోవుచున్నాండు ౩

ఎవ్వండు తనతల్లియయిన కౌసల్యయందుం బ్రవర్తించినట్లె, చవతితల్లులయిన మాయందునుం బ్రవర్తించునో, అట్టిమహాతేజుండును మహాత్ముండు నగు రాముం డిప్పు డెచ్చటికిం బోవుచున్నాండు? ౪

ఈజనులకును బ్రపంచమునకును రక్షకుండైన రాముండుదశరథుండు

పరిత్రాతా జనస్యాస్య జగతః క్వను గచ్ఛతి. ౫

అహో! నిశ్చేతనో రాజా జీవలోకస్య సంప్రియమ్,
ధర్మ్యం సత్యవ్రతం రామం వనవాసే ప్రవత్స్యతి. ౬

ఇతి సర్వా మహిష్య స్తా వివత్సా ఇవ ధేనవః,
రురుదు శ్చైవ దుఃఖార్తా స్సస్వరంచ విచుక్రుశుః. ౭
స త మన్తఃపురే ఘోర మార్తశబ్దం మహీపతిః,
పుత్రశోకాభిసంతప్త శ్శ్రుత్వా చాసీ త్సుదుఃఖితః. ౮

నాగ్నిహోత్రా ణ్యహూయన్త నాపచ న్గృహమేధినః,
అకుర్వ న్న ప్రజాః కార్యం సూర్య శ్చాన్తరధీయత. ౯

వ్యసృజ న్కబలా న్నాగా గావో వత్సా న్నపాయయన్,
పుత్రం ప్రథమజం లబ్ధ్వా జననీ నాభ్యనందత. ౧౦

త్రిశంకు ర్లోహితాంగ శ్చ బృహస్పతిబుధా వపి,
దారుణా స్సోమ మభ్యేత్య గ్రహా స్సర్వే వ్యవస్థితాః. ౧౧

నక్షత్రాణి గతార్చీంషి గ్రహాశ్చ గతతేజసః,
విశాఖా స్తు సధూమా శ్చ నభసి ప్రచకాశిరే. ౧౨

కాలికానిలవేగేన మహోదధి రి వోత్థితః,

కై కేయిబాధ పడఁజాలక వనంబునకుఁ బొమ్మని యాజ్ఞాపింపఁగా దానికిలోఁబడి యిప్పు డెచ్చటికిఁ బోవుచున్నాఁడు? ౫

దశరథమహారాజు ఎంతబుద్ధిలేనివాఁడు! ప్రాణివర్గమున కంతయుఁ బ్రియుఁడును ధార్మికుఁడును సత్యవ్రతుఁడునగు రాముని వనంబునకుఁ బంపుచున్నాఁడే! అని యంతఃపురస్త్రీలు విలపించిరి. ౬

ఆరాజభార్య లందఱు, దూడను విడచిన యావులచందంబున రోదనంబు సేయుచు మహాధ్వని గల్గునట్లు అఱచిరి. ౭

పుత్రదుఃఖంబునఁ బరితపించుచుండు నాదశరథమహారాజు అంతఃపురమునందుండి భయంకరంబై వినఁబడుచుండు రోదనశబ్దంబును వినియిమ్మడి దుఃఖంబు నొందెను. ౮

రాముఁడు వనంబునకుఁ బోయెనను దుఃఖంబున నాహితాగ్ను లగ్నిహోత్రంబులందు హోమము సేయరైరి. గృహస్థు లెవ్వరును దమయిండ్ల యందు వండుకొనరైరి. జను లన్నిపనులను విడిచిపెట్టి యుండిరి. సూర్యుఁడు నంతర్ధానంబు నొందియుండెను. ౯

ఏనుఁగు లాహారమును దినలేదు. ఆవులు తమదూడలకుఁ బాలీయ లేదు. తల్లి తనయొద్దకు మొదటికొడుకు వచ్చినప్పుడు ఎంతమాత్రము సంతోషింపకుండినది. ౧౦

ఇక్ష్వాకుకులంబునకుఁ గూటస్థుఁడు ఆకాశంబున నక్షత్రరూపంబున నున్నవాఁడునగు త్రిశంకువును, అంగారకుఁడును బృహస్పతియును బుధుఁడును ఇంక నితరములయిన క్రూరగ్రహములును కొన్నిసంగమంబుచేతను గొన్ని దృష్టిచేతను గొన్ని వక్రగతిచేతను జంద్రునిం బొందియుండినవి. ౧౧

ఆకాశంబున నక్షత్రంబులు కాంతిలేకుండినవి గ్రహంబులును నిష్ప్రభంబులై యుండినవి. కోసలదేశనక్షత్రమయిన విశాఖానక్షత్రము పొగతోఁ గూడినట్లు మలినంబై చూపట్టుచుండినది. ౧౨

వర్షాకాలమునందు మేఘసమూహముతోఁ గూడిన మహావాయువేగం

రామే వనం ప్రవ్రజితే నగరం ప్రచచాల తత్. ౧౩

దిశః పర్యాకులా స్సర్వా స్తిమిరేణేవ సంవృతాః,
నగ్రహో నాపి నక్షత్రం ప్రచకాశే న కించన. ౧౪

అకస్మా న్నాగర స్సర్వో జనో దైన్య ముపాగమత్,
ఆహారే వా విహారే వా నకశ్చి దకరో న్మనః. ౧౫

శోకపర్యాయస న్తప్త స్సతతం దీర్ఘముచ్ఛ్వసన్,
అయోధ్యాయాం జన స్సర్వ శ్శుశోచ జగతీపతిమ్. ౧౬

బాష్పపర్యాకులముఖో రాజమార్గగతో జనః,
న హృష్టో లక్ష్యతే కశ్చి త్సర్వ శ్శోకపరాయణః. ౧౭

నవాతి పవన శ్శీతో న శశీ సౌమ్యదర్శనః,
న సూర్య స్తపతే లోకం సర్వం పర్యాకులం జగత్. ౧౮

అనర్థిన స్సుతాః స్త్రీణాం భర్తారో భ్రాతర స్తథా,
సర్వే సర్వం పరిత్యజ్య రామమేవాన్వచిన్తయన్. ౧౯

యే తు రామస్య సుహృద స్సర్వే తే మూఢచేతసః,
శోకభారేణ చాక్రాన్తా శ్శయనం న జహు స్తదా. ౨౦
తత స్త్వయోధ్యా రహితా మహాత్మనా
పురన్దరేణేవ మహీ సపర్వతా,

ఖున సముద్రంబు ఘోంగునట్లు, రాముఁ డడవికిఁ బోఁగానే ఆ యయోధ్యా పట్టణం బంతయుఁ జలనంబు నొందినది. ౧౩

సమస్తములయిన దిక్కులును వ్యాకులంబులయి చీఁకట్లు క్రమ్మిన ట్లుండినవి. గ్రహములుగాని నక్షత్రంబులుగాని, సమస్తమును ప్రకాశము లేకుండినవి. ౧౪

పట్టణమునందున్న జను లందఱును రాముఁ డరణ్యంబునకుఁ బోవుట కన్న నితరకారణంబు లేకయె మహాదుఃఖంబు నొందినది; ఆహారమునందుఁ గాని విహారమునందుఁ గాని, యెవ్వనికిని రుచి గలుగకుండినది. ౧౫

అయోధ్యయందలి జను లందఱు మహాదుఃఖంబు నొంది, యెల్లప్పుడును విడువక నిట్టూర్పులు పుచ్చుచు దశరథమహారాజుం జేర్కొని దుఃఖించుచుండిరి. ౧౬

జను లందఱు ముఖంబునిండఁ గన్నీళ్లుగాఱ గృహంబులకుఁ బోవక రాజమార్గంబునం దిరుగుచుండిరి. ఒక్కఁడును సంతోషంబు నొందియుండ లేదు. అందఱును బరమదుఃఖంబు నొందిరి. ౧౭

వాయువు చల్లఁగా వీవఁ డయ్యె. చంద్రుఁడు భయంకరంబుగాఁ జూపట్టె. సూర్యుఁ డెండగాయఁడయ్యె. ఇట్లు ప్రపంచ మంతయుఁ గలఁత నొందియుండినది. ౧౮

కొడుకులకు తల్లులపై మమత లేకుండినది. భర్తలకు భార్యలపై ప్రేమ దప్పినది. తోఁబుట్టువులు ఒండొరులపై స్నేహంబు వదలిరి. అందఱును అన్నిటిని విడిచి, రామునే చింతింపుచుండిరి. ౧౯

రాముని స్నేహితు లందఱును మహాదుఃఖంబున నేమియుం దోఁచక భ్రాంతి నొంది నేలం బరుండి లేవరైరి. ౨౦

అంత దేవేంద్రుఁడు లేనిచో నీభూమండలము వ్యాకులం బగునట్లు రాముఁడు లేకుండుటం జేసి యయోధ్యాపట్టణం బంతయుం వ్యాకులంబై

చచాల ఘోరం భయశోకపీడితా
సనాగయోధాశ్వగణా ననాద చ. ౨౧

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డ ఏకచత్వారింశస్సర్గః

## ద్వి చ త్వా రిం శ స్స ర్గః

యావత్తు నిర్యత స్తస్య రజోరూప మదృశ్యత,
నైవేక్ష్వాకువర స్తావ త్సంజహారాఽత్మచక్షుషీ. ౧

యావ ద్రాజా ప్రియం పుత్త్రం పశ్యత్యత్య న్తధార్మికమ్,
తావ ద్వ్యవర్ధ తే వాస్య ధరణ్యాం పుత్త్రదర్శనే. ౨

న పశ్యతి రజోఽప్యస్య యదా రామస్య భూమిపః,
తదాఽఽర్తశ్చ విషణ్ణశ్చ పపాత ధరణీతలే. 3

తస్య దక్షిణ మన్వాగా త్కౌసల్యా బాహు మఙ్గనా,
వామం చాస్యాన్వగాత్పార్శ్వం కైకేయీ భరతప్రియా. ౪

తాం నయేన చ సమ్పన్నో ధర్మేణ వినయేన చ,
ఉవాచ రాజా కైకేయీం సమీక్ష్య వ్యథితేన్ద్రియః. ౫

కైకేయి! మా మ మాఙ్గాని స్ప్రాక్షీ స్త్వం దుష్టచారిణి!,
న హి త్వాం ద్రష్టు మిచ్ఛామి న భార్యా న చ బాన్ధవీ. ౬

యేచ త్వా మనుజీవన్తి నాహం తేషాం న తే మమ,
కేవలార్థపరాం హి త్వాం త్యక్తధర్మాం త్యజా మ్యహమ్. ౭

గజంబులును భటులును గుఱ్ఱంబులును దుఃఖంబును భయంబు నొంది నాదం బులు సేయఁ జలనంబునొంది మహాధ్వని గల్గియుండినది. ౨౧

ఇది నలువదియొకటవసర్గము.

---

## నలువది రెండవసర్గము

ఆరాముఁడు పోవుచుండఁగా మార్గంబున రథసంచారమువలనం గలిగిన దుమ్ము ఎంతవఱ కగపడుచుండెనో, అంతవఱకును దశరథమహారాజు విడువక రామునిం జూచుచునే యుండెను. ౧

దశరథమహారాజు ప్రియుండును బరమధార్మికుఁడు నగు తనకొడుకును రామునిం జూచునంతవఱకు ఆరాముఁ డెంతదూరముపోయినను బరాగ మగపడుచుండుటం జేసి యాదశరథమహారాజును గొడుకును జూడవలెననియే భూమియందుఁ బరాగ మవ్విధమున వృద్ధిఁ బొందుచుండినట్లు దోఁచుచుండినది. ౨

దశరథమహారాజంత రామునిరథపరాగముకూడఁ గనుపడకపోఁగానే దీనుఁడును బరమదుఃఖితుఁడు నై నేలంబడెను. ౩

దశరథుఁడు నేలం బడఁగానే కౌసల్య లేవనెత్తుటకై యతనికుడిచేతిం బట్టుకొనినది. భరతునియందుమాత్ర మధికప్రీతిగల కైకేయియు నతని వామపార్శ్వంబున నుండినది. ౪

నీతియు ధర్మమును వినయంబును గల దశరథమహారాజు తనయెడమప్రక్కనున్న యాకైకేయిం జూచి పరమపీడితుఁ డై యిట్లని చెప్పెను. ౫

కైకేయీ! నీవు దుష్టురాలవు. నీవు నాయవయవంబులం దాఁకవలదు. నిన్నుఁ జూచుటకు నా కిచ్ఛలేదు. నీవు భార్యవు కావు. నీకును నాకును సాధారణబంధుత్వమును లేదు. ౬

మఱియు ని న్నెవ్వ రాశ్రయించి యున్నారో వారలకు నేను రాజునుగాను. నాకు వారలు భృత్యులు గారు. నీవు అర్థమునందు మాత్రమె

అగృహ్ణాం యచ్చతే పాణి మగ్నిం పర్యణయం చ యత్,
అనుజానామి తత్సర్వ మస్మిం ల్లోకే పరత్ర చ. ౮

భరత శ్చే త్ప్రతీత స్స్యా ద్రాజ్యం ప్రాప్యైత మవ్యయమ్,
యన్మే సదద్యా త్పిత్రర్థం మాం మా త ద్దత్త మాగమత్. ౯
అథ రేణుసముధ్వస్తం సముత్థాప్య నరాధిపమ్,
న్యవర్తత తదా దేవీ కౌసల్యా శోకకర్శితా. ౧౦
హత్వేవ బ్రాహ్మణం కామా త్స్పృష్ట్వాఽగ్ని మివ పాణినా,
అన్వతప్యత ధర్మాత్మా పుత్త్రం సంచిన్త్య తాపసమ్. ౧౧

నివృత్త్యైవ నివృత్త్యైవ సీదతో రథవర్త్మసు,
రాజ్ఞో నాతిబభౌ రూపం గ్రస్త స్యాంశుమతో యథా. ౧౨

విలలాప చ దుఃఖార్తః ప్రియం పుత్త్ర మనుస్మరన్,

నగరాన్త మనుప్రాప్తం బుద్ధ్వా పుత్త్ర మథాబ్రవీత్. ౧౩

వాహనానాం చ ముఖ్యానాం వహతాం తం మమాత్మజమ్,
పదాని పథి దృశ్యన్తే స మహాత్మా న దృశ్యతే. ౧౪
య స్సుఖే షూపధానేషు శేతే చన్దనరూషితః,
వీజ్యమానో మహార్హాభిః స్త్రీభి ర్మమ సుతోత్తమః. ౧౫
స నూనం క్వచి దే వాద్య వృక్షమూల ముపాశ్రితః,

యూసక్తిగలదానవు. నీకు ధర్మంబు గావలసినది లేదు. కావున నిన్నువిడిచెదను. ౭

నే నగ్నిసాక్షికంబుగా నీహస్తమును గ్రహించుటయుం, నీతోఁగూడ నగ్నికిం బ్రదక్షిణంబు జేసియుండుటయు ఈరెంటివలన నీతో నాకుం గలిగినసంబంధమును ఐహికసంబంధముగాని పరలోకసంబంధముగాని యంతయు నిప్పుడు విడుచుచున్నాను. ౮

భరతుఁ డక్షయంబగు రాజ్యంబు నొంది సంతోషించునేని యతఁడు నన్నుద్దేశించి యొసంగు జలతర్పణాదులు నాకుఁ జేరకుండుఁగాక. ౯

అంత దుఃఖమునం గృశించియున్న కౌసల్యాదేవి దుమ్ముతో నిండియున్న దశరథమహారాజును లేవనెత్తియతనిం దీసికొని మరలిపోయెను. ౧౦

ధార్మికుఁడగు దశరథమహారాజు తాపసవేషమును దాల్చిన తనకొడుకుం దలంచుకొని కావలెనని బ్రాహ్మణునిం జంపినవానికైవడి హస్తంబున నగ్నిం దాఁకినవానిభంగి మిక్కిలియు ననుతాపంబు నొందుచుండెను. ౧౧

అంత నడుగడుగునకును మార్గములందు మరలి మరలి చూచుచుఁ బరమదుఃఖంబు నొందుచున్న యాకౌసల్యాదశరథులు రాహుగ్రస్తుఁడగు సూర్యునికైవడిఁ బ్రకాశము లేకుండిరి. ౧౨

ఆదశరథుఁడు ప్రియపుత్రుఁడగు రాముం దలంచుకొని పరమదుఃఖితుఁడై రోదనంబు సేయుచుండెను.

ఆదశరథమహారా జంత రాముఁడు పట్టణంబు దాఁటెనని తెలిసికొని దుఃఖంబున నిట్లని చెప్పెను. ౧౩

నాకొడుకయిన రామునిం దీసికొనిపోయిన యుత్తమాశ్వంబులయడుగులును మార్గంబున నగపడుచున్నవి. ఆ మహాత్ముఁడుమాత్రము గపడలేడు. ౧౪

సుగంధిచందనంబుఁ బూసికొని యుత్తమస్త్రీలు వీవఁగా సుఖకరంబులయిన తలగడలందుఁ బరుండునట్టి నాప్రియపుత్రుఁ డిప్పుడు ఎచ్చటనో యొక్కచోట నొక్కచెట్టుక్రింద కొయ్యను గాని ఱాతినిగాని తలగడగాఁ జేసికొని పరుండియుండును. ఇది నిశ్చయము. ౧౫,౧౬.

కాష్ఠం వా యదివాఽశ్మాన ముపధాయ శయిష్యతే. ౧౬
ఉత్థాస్యతి చ మేదిన్యాః కృపణః పాంసుకుణ్ఠితః,
వినిశ్శ్వస న్ప్రస్రవణా త్కరేణూనా మివర్షభః. ౧౭
ద్రక్ష్యన్తి నూనం పురుషా దీర్ఘబాహుం వనేచరాః,
రామ ముత్థాయ గచ్ఛన్తం లోకనాథ మనాథవత్. ౧౮

సా నూనం జనక స్యేష్టా సుతా సుఖసదోచితా,
కణ్టకాక్రమణాక్రాన్తా వన మద్య గమిష్యతి. ౧౯

అనభిజ్ఞా వనానాం సా నూనం భయ ముపైష్యతి,
శ్వాపదానర్దితం శ్రుత్వా గమ్భీరం రోమహర్షణమ్. ౨౦

సకామా భవ కైకేయి! విధవా రాజ్య మావస,
న హి తం పురుషవ్యాఘ్రం వినా జీవితు ముత్సహే. ౨౧

ఇత్యేవం విలప న్రాజా జనౌఘే నాభిసంవృతః,
అపస్నాత ఇవారిష్టం ప్రవివేశ పురోత్తమమ్. ౨౨

శూన్యచత్వరవేశ్మాన్తాం సంవృతాపణదేవతామ్,
క్లాన్తదుర్బలదుఃఖార్తాం నాత్యాకీర్ణమహాపథామ్. ౨౩
తా మవేక్ష్య పురీం సర్వాం రామమేవానుచిన్తయన్,
విలప న్ప్రావిశ ద్రాజా గృహం సూర్య ఇవామ్బుదమ్. ౨౪

అట్టి శోకోద్ధతు రాముఁ డింక దుఃఖితుఁడై దేహం బంతయుం దుమ్ము నిండియుండఁగా నిట్టూర్పులు పుచ్చుచు సెలయేటిసమీపంబుననుండి యేనుఁగు లేచునట్లు నేలపైనుండి లేవఁగలఁడు. ౧౭

వనవాసులగు పురుషులు మహాబాహుఁడును లోకనాథుఁడు నగు రాముఁ డనాథయుంబోలె నేలపైనుండి లేచిపోవుచుండఁగాఁ జూడఁగలరు. ఇది నిశ్చయము. ౧౮

జనకమహారాజుప్రియపుత్రియుం జెల్లప్పుడును సుఖం బనుభవించుటకే తగినదియు నగు నాసీత యిప్పుడు ముండ్లపై నడుగులం బెట్టి పాదంబుల యందు ముండ్లు గ్రుచ్చుకొనఁగా బాధపడుచు నడవిలోఁ బోఁగలదు. నిశ్చయము. ౧౯

ఆసీత యెప్పుడు నడవుల నెఱుంగనిది కావున, భయంకరంబును గగుర్పాటు గలిగించునదియునగు క్రూరజంతువులధ్వనిని విని భయంబునొందును. ఇది నిశ్చయము. ౨౦

కైకేయీ! నీకోరికి నెఱవేఱినది. ఇంక విధవవై దొరతనము సేయుము. నేనుమాత్రము పురుషశ్రేష్ఠుఁడగు నారాముని విడిచి యెంతమాత్రము జీవింపఁ జాలను. అని దశరథుఁడు విలపించెను. ౨౧

దశరథమహారాజు, ఈప్రకారము రోదనము సేయుచు జనసమూహముచేఁ బరివేష్టితుఁడై బంధువు మృతుఁ డగునేని స్నానము చేసినవాఁడువలెఁ బరమదీనుఁడై యయోధ్యం బ్రవేశించెను. ౨౨

దశరథమహారాజు, చతుష్పథంబులందును గృహద్వారంబులందును జనులులేనిదియుం, మూయఁబడిన యంగడివీథియందలి దేవాలయములు గలదియుం, దేహంబున నడువ శక్తిగల జను లందఱు రాముని వెంబడించిపోయిరి కావున బడలియుం దుర్బలులై దుఃఖార్తులయిన జనులుమాత్రమె గలదియుం, రాజమార్గమునందుఁగూడఁ గొంచెముగానే జనులు గలదియునగు నయోధ్యా

మహాహ్రద మివాక్షోభ్యం సుపర్ణేన హృతోరగమ్,
రామేణ రహితం వేశ్మ వైదేహ్యా లక్ష్మణేన చ. ౨౫

అథ గద్గదశబ్దస్తు విలప న్మనుజాధిపః,
ఉవాచ మృదు మన్దార్థం వచనం దీన మస్వరమ్. ౨౬

కౌసల్యాయా గృహం శీఘ్రం రామమాతు ర్నయన్తు మామ్,
న హ్యన్యత్ర మమాశ్వాసో హృదయస్య భవిష్యతి. ౨౭

ఇతి బ్రువన్తం రాజాన మనయ న్ద్వారదర్శినః,
కౌసల్యాయా గృహం తత్ర న్యవేశ్యత వినీతవత్. ౨౮
తత స్తస్య ప్రవిష్టస్య కౌసల్యాయా నివేశనమ్,
అధిరుహ్యాపి శయనం బభూవ లులితం మనః. ౨౯
పుత్త్రద్వయవిహీనం చ స్నుషయాపి వివర్జితమ్,
అపశ్య ద్భవనం రాజా నష్టచన్ద్ర మివామ్బరమ్. ౩౦
తచ్చ దృష్ట్వా మహారాజో భుజ ముద్యమ్య వీర్యవాన్,
ఉచ్చై స్స్వరేణ చుక్రోశ హా! రాఘవ! జహాసి మామ్. ౩౧

సుఖితా బత తం కాలం జీవిష్యన్తి నరోత్తమాః,
పరిష్వజన్తో యే రామం ద్రక్ష్యన్తి పున రాగతమ్. ౩౨

అథ రాత్ర్యాం ప్రపన్నాయాం కాళరాత్ర్యామివాఽత్మనః,
అర్ధరాత్రే దశరథః కౌసల్యా మిద మబ్రవీత్. 33

రామం మేఽనుగతా దృష్టి రద్యాపి న నివర్తతే,
న త్వా పశ్యామి కౌసల్యే! సాధు మాం పాణినా స్పృశ. 34

తం రామ మే వానువిచిన్తయన్తం
సమీక్ష్య దేవీ శయనే నరేన్ద్రమ్,
ఉపోపవిశ్యాధిక మార్తరూపా
వినిశ్శ్వసన్తీ విలలాప కృచ్ఛ్రమ్. 35

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే ద్విచత్వారింశస్సర్గః.

## త్రి చ త్వా రిం శ స్స ర్గః

తత స్సమీక్ష్య శయనే సన్నం శోకేన పార్థివమ్,
కౌసల్యా పుత్త్రశోకార్తా త మువాచ మహీపతిమ్. ౧

రాఘవే నరశార్దూలే విష ముప్త్వా విజిహ్మగామ్,
విచరిష్యతి కైకేయీ నిర్ముక్తేవ హి పన్నగీ. ౨

వివాస్య రామం సుభగా లబ్ధకామా సమాహితా,
త్రాసయిష్యతి మాం భూయో దుష్టాహి రివ వేశ్మని. 3

అంతఁ దనకుఁ బ్రళయకాలరాత్రివలె నతిభయంకరంబై తోఁచు చున్న రాత్రి రాఁగానే దశరథుఁ డర్ధరాత్రి సమయంబునఁ గౌసల్యం జూచి యిట్లని చెప్పెను. 33

కౌసల్యా! నాదృష్టి ఇంకను రామునిపైననే యున్నది. ఇప్పుడును స్వాధీనము గాకున్నది. కావున నేను నిన్నుంగూడఁ జూడఁజాలకున్నాను. నీవు నాయందు దయయుంచి "కైకేయిమాట విని యింతదూరము చేసినాఁ" డను కోపంబు విడిచి "యేమో తెలియక చేసినాఁ" డని మన్నించి నీహస్తము చేత నన్నుఁ జక్కఁగా స్పృశింపుము. అప్పటికి నాసంతాపము కొంతవఱకు అణఁగును. అని దశరథుఁడు కౌసల్యతోఁ జెప్పెను. 34

అంతఁ గౌసల్యాదేవి పాన్పుపైనుండి రామునే తలంచుకొనుచు దుఃఖించుచున్న యాదశరథమహారాజుం జూచి యతని సమీపంబునఁ గూర్చుండి పరమదుఃఖంబు నొంది నిట్టూర్పులు పుచ్చుచు రోదనంబు చేసెను. 35

ఇది నలువదిరెండవసర్గము.

---

## నలువదిమూఁడవసర్గము

అంతఁ బుత్రదుఃఖంబునం బీడింపఁబడుచున్న కౌసల్య శయనంబు నందు దుఃఖముచేఁ గృశించియున్న దశరథమహారాజుం జూచి యిట్లని చెప్పెను. 1

కైకేయి పురుషశ్రేష్ఠుండగు రామునకుఁ గుటిలముగా విషంబువంటి యపకారము గావించినది. ఇంక సుఖముగాఁ గుబుసమువిడిచిన పాముపలె సంతోషంబున విహరింపఁగలదు. 2

సుందరాంగియగు కైకేయి రాముని వనంబునకుఁ బోవునట్లుచేసి తన కోర్కులం దీర్చుకొన్నదై మనస్సమాధానంబు నొంది యింటం జేరిన దుష్ట సర్పమువలె నన్నిఁక మఱియు నధికముగా భయపఱచును. 3

అథ స్మ నగరే రామ శ్చర న్నైక్షతం గృహే వసేత్,
కామకారో వరం దాతు మపిదాసం మ మాత్మజమ్. ౪

పాతయిత్వా తు కైకేయ్యా రామం స్థానా ద్యథేష్టతః,
ప్రదిష్టో రక్షసాం భాగః పర్వణీవాఽహి తాగ్నినా. ౫

గజరాజగతి ర్వీరో మహాబాహు ర్ధనుర్ధరః,
వన మావిశతే నూనం సభార్య స్సహలక్ష్మణః. ౬

వనే త్వదృష్టదుఃఖానాం కైకేయ్యాఽనుమతే త్వయా,
త్యక్తానాం వనవాసాయ కా న్వవస్థా భవిష్యతి. ౭

తే రత్నహీనా స్తరుణాః ఫలకాలే వివాసితాః,
కథం వత్స్యన్తి కృపణాః ఫలమూలైః కృతాశనాః. ౮

అపీదానీం స కాల స్స్యా న్మమ శోకక్షయ శ్శివః,
సభార్యం య త్సహ భ్రాత్రా పశ్యేయ మిహ రాఘవమ్. ౯

సు త్త్వై వోపస్థితౌ వీరౌ కదాఽయోధ్యాం గమిష్యతః,
యశస్వినీ హృష్టజనా సూచ్ఛ్రితధ్వజమాలినీ. ౧౦

ఇంతకన్న రాముని కష్టమునుం బెట్టక, భరతుని కతని దాసునిగాఁ గోరుటయయిన నాకు మంచిదే. ఆపక్షమున రాముఁడు పట్టణంబున బిచ్చ మెత్తి తినుచు భరతునకు సేవచేయుచు గృహంబున నాయొద్దనె యుండును. ౪

నీవు స్వేచ్ఛగా రాముని నతనిస్థానంబుననుండి పడఁద్రోసి యాహితాగ్నియగువాఁడు” పర్వకాలంబున దేవతల కీయఁదగిన హవిర్భాగమును మోహంబున రాక్షసుల కిచ్చునట్లు రాముని కీవలసిన రాజ్యభాగమును కైకేయి కిచ్చినావు. ౫

మహాగజంబునకుం బోలె గంభీరంబగు నడతగలవాఁడును బరాక్రమశాలియును మహాబాహుఁడును ధనుర్ధరుఁడు నగు రాముఁడు భార్యను లక్ష్మణునిం గూడి వనంబునకుఁ బోవుచున్నాఁడు !. ౬

నీవు కైకేయిమాటను విని ఎప్పుడును వనవాసదుఃఖంబు ననుభవించి యెఱుంగనట్టి యాసీతారామలక్ష్మణుల వనంబున నివసింప నాజ్ఞాపించితివే ! వారలు వనంబున నెట్లుందురు?. ౭

సీతారామలక్ష్మణులు మంచియౌవన కాలంబున భోగంబు లనుభవింప వలసినప్పుడు శ్రేష్ఠవస్తువులం బాసి నీయాజ్ఞవలన నరణ్యంబునకుఁ బోయి దరిద్రులయి ఫలమూలంబులం దినుచు నెట్లుండఁగలరు? ౮

ఇప్పుడే యాపదునాలుగు సంవత్సరంబులును గడిచి రాముఁడును సీతయుం లక్ష్మణుఁడును ఇచ్చటికి రాఁగా నేను జూచి నాదుఃఖంబు నశించు నంతటికాలము గల్గునా యేమి!. ౯

పరాక్రమశాలులగు రామలక్ష్మణులు నిద్రపోయి లేచినంత సుఖముగాను శీఘ్రముగాను అయోధ్యాపట్టణసమీపంబునకు వచ్చి యంత వారు వచ్చుటను విని జనులు పట్టణం బంతయుం నలంకరింపఁగా మహాకీర్తిగలదియుఁ బరమసంతోషంబు నొందినజనులతోను పైకెత్తి కట్టఁబడిన ధ్వజంబులతోను ఒప్పుచున్నదియు నగు నయోధ్యాపట్టణంబు నెప్పుడు ప్రవేశింతురు? ౧౦

కదా ప్రేక్ష్య నరవ్యాఘ్రా వరణ్యా త్పునరాగతౌ,
నన్దిష్యతి పురీ హృష్టా సముద్ర ఇవ పర్వణి. ౧౧

కదాఽయోధ్యాం మహాబాహుః పురీం వీరః ప్రవేక్ష్యతి,
పురస్కృత్య రథే సీతాం వృషభో గోవధూ మివ. ౧౨

కదా ప్రాణిసహస్రాణి రాజమార్గే మమాఽత్మజౌ,
లాజై రవకిరిష్యన్తి ప్రవిశన్తా వరిన్దమౌ. ౧౩

ప్రవిశన్తౌ కదాఽయోధ్యాం ద్రక్ష్యామి శుభకుణ్డలౌ,
ఉదగ్రాయుధనిస్త్రింశౌ సశృఙ్గా వివ పర్వతౌ. ౧౪

కదా సుమనసః కన్యా ద్విజాతీనాం ఫలాని చ,
ప్రదిశన్త్యః పురీం హృష్టాః కరిష్యన్తి ప్రదక్షిణమ్. ౧౫

కదా పరిణతో బుద్ధ్యా వయసా చామరప్రభః,
అభ్యుపైష్యతి ధర్మజ్ఞ స్త్రివర్ష ఇవ లాలయన్. ౧౬

నిస్సంశయం మయా మన్యే పురా వీర! కదర్యయా,
పాతుకామేషు వత్సేషు మాతౄణాం శాతితా స్తనాః. ౧౭

సాఽహం గౌరివ సింహేన వివత్సా వత్సలాకృతా,
కైకేయ్యా పురుషవ్యాఘ్ర! బాలవత్సేవ గౌ ర్బలాత్. ౧౮

అడవినుండి మరలవచ్చిన పురుషశ్రేష్ఠులగు రామలక్ష్మణులం జూచి, యీపట్టణంబునందలి జనులందఱు, పున్నమనాఁడు సముద్రము వొంగునట్లు ఎప్పుడు పరమసంతోషంబు నొందుదురు?. ౧౧

మహాబాహుఁడును పరాక్రమవంతుఁడు నగు రాముఁడు అంబోతు గోవుతోఁ గూడినట్లు సీతతోఁ గూడి, రథంబున నీయయోధ్యాపట్టణమున కెప్పుడు వచ్చును?. ౧౨

శత్రువుల నడంగఁ ద్రొక్కి జాలినట్టి నాకొడుకులు పట్టణప్రవేశము సేయుచుండఁగా రాజమార్గంబున వారలపై వేనవేలజను లెప్పుడు పేలాలు చల్లుదురు?. ౧౩

రామలక్ష్మణులు మరల నిచ్చటికి వచ్చి సుందరములగు కుండలంబులతో నొప్పుచు నున్నతంబులగు ధనుఃఖడ్గంబులు ధరించినవారలుగావున శిఖరవంతంబులగు పర్వతంబులకరణిం దేజరిల్లుచు నీయయోధ్యాపట్టణంబుఁ బ్రవేశించుచుండఁగా నే నెప్పుడు చూడఁగలను?. ౧౪

ఆసీతారామలక్ష్మణులు మంగళకన్యకలకును బ్రాహ్మణులకును బువ్వంబుల ఫలంబుల నొసంగుచు సంతోషంబున నయోధ్యాపట్టణంబున కెప్పుడు ప్రదక్షిణంబు సేయుందురు?. ౧౫

జ్ఞానంబున వృద్ధుఁడును వయసున దేవతలువలె నిరువదియిరువదేండ్ల వాఁడును ధార్మికుఁడు నగు రాముఁడు మూఁడేండ్లపిల్లవానిభంగి లాలన సేయుచు నాయొద్ద కెప్పుడు వచ్చును?. ౧౬

పరాక్రమశాలివగు దశరథుఁడా! నేను బూర్వజన్మమునందు బిడ్డలు దల్లులయొద్దఁ బాలు ద్రాగుట కుండఁగా అతల్లుల స్తనములను ఛేదించియుందును. ఇందు సంశయము లేదు. అని తలంచెదను. ౧౭

పురుషశ్రేష్ఠుఁడవగు దశరథుఁడా! లేఁతదూడగల యావువలె బిడ్డయందలి ప్రేమగల నన్నును సింహము దూడను జంపి ఆవును దూడలేనిదానిఁ గాఁ జేయునట్లు కైకేయి బలాత్కారమువలన బిడ్డలేనిదానిఁగాఁ జేసినది. ౧౮

నహి తావద్గుణై ర్జుష్టం సర్వశాస్త్రవిశారదమ్,
ఏకపుత్రా వినా పుత్ర మహం జీవితు ముత్సహే. ౧౯

నహి మే జీవితే కిఞ్చి త్సామర్థ్య మిహ కల్ప్యతే,
అపశ్యన్త్యాః ప్రియం పుత్త్రం మహాబాహుం మహాబలమ్. ౨౦
అయం హి మాం దీపయతే సముత్థిత
స్తనూజశోకప్రభవో హుతాశనః,
మహీ మిమాం రశ్మిభి రుద్ధతప్రభో
యథా నిదాఘే భగవా న్దివాకరః. ౨౧

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే త్రిచత్వారింశస్సర్గః.

---

## చతుశ్చత్వారింశస్సర్గః

విలపన్తీం తథా తాం తు కౌసల్యాం ప్రమదోత్తమామ్,
ఇదం ధర్మే స్థితా ధర్మ్యం సుమిత్రా వాక్య మబ్రవీత్. ౧
తవార్యే సద్గుణై ర్యుక్తః పుత్త్ర స్సపురుషోత్తమః,
కిం తే విలపితే నైవం కృపణం రుదితేన వా. ౨

య స్తవార్యే గతః పుత్త్ర స్త్యక్త్వా రాజ్యం మహాబలః,
సాధు కుర్వ న్మహాత్మానం పితరం సత్యవాదినమ్. 3
శిష్టై రాచరితే సమ్య క్ఛశ్వ త్ప్రేత్య ఫలోదయే,
రామో ధర్మే స్థిత శ్శ్రేష్ఠో న స శోచ్యః కదాచన. ౪

నేను లేక లేక యొక్క కొడుకును బెట్టుకొనియున్నాను. లోకంబునఁ గల్యాణగుణంబు లెన్నిగలవో వానియన్నిటితోడం గూడినవాఁడును సమస్త శాస్త్రంబులందును బండితుఁడునగు నాకొడుకునుం గూడ విడిచి నేను బ్రతుకంజాలను. ౧౯

మహాబాహుఁడును మహాబలుఁడునగు ప్రియపుత్రుం జూడకున్న నా కిప్పుడు జీవించుట కేయుపాయమును లేదు. ౨౦

ఎండకాలంబున నినుమడికాంతిగల భగవంతుఁడగు సూర్యుఁడు కిరణంబుల భూమినిం దపింపఁజేయునట్లు, ఈపుత్రదుఃఖమునం బుట్టిన యగ్నిహోత్రము ప్రజ్వరిల్లి నన్నుఁ దపింపఁజేయుచున్నది. అని కౌసల్య విలపించినది. ౨౧

ఇది నలువదిమూఁడవసర్గము.

---

## నలువదినాలుగవ సర్గము

అంత నట్లు విలపించుచున్న యుత్తమస్త్రీ యగు కౌసల్యం జూచి ధార్మికురాలగు సుమిత్ర ధర్మిష్ఠంబగు నీమాటం జెప్పెను. ౧

పూజ్యురాలవగు కౌసల్యా! నీపుత్రుండు, సమస్తసద్గుణంబులుం గలవాఁడు. పురుషులయందఱిలో నుత్తముఁడు. నీ వేల యిట్లు విలపించుచు దుఃఖంబున రోదనంబు చేసెదవు ?. ౨

పూజ్యురాలవగు కౌసల్యా! మహాబలుఁడగు నీకొడుకు రాముఁడు ఎల్లప్పుడును శిష్టులచే శ్రద్ధతో నాచరింపఁబడుచున్నదియుఁ బరలోకంబునందు మహాఫలంబు గల్గించునదియు నగు ధర్మంబు నవలంబించి మహాత్ముఁడగు తండ్రికిని అసత్యదోషంబు నొందనీయక సత్యవాదిం జేయుటకై రాజ్యంబును విడిచి యరణ్యంబునకుఁబోయెను. అట్టి పరమధార్మికుఁడు నుత్తముఁడు నగు రాముని గుఱించి దుఃఖింపరాదు. ౩,౪

వర్తతే చోత్తమాం వృత్తిం లక్ష్మణోఽస్మి న్సదాఽనఘః,
దయావా న్సర్వభూతేషు లాభ స్తస్య మహాత్మనః. ౫

అరణ్యవాసే యద్దుఃఖం జానతీ వై సుఖోచితా,
అనుగచ్ఛతి వై దేహీ ధర్మాత్మానం త వాత్మజమ్. ౬

కీర్తిభూతాం పతాకాం యో లోకే భ్రమయతి ప్రభుః,
ధర్మసత్యవ్రతధనః కిం న ప్రాప్త స్త వాత్మజః. ౭

వ్యక్తం రామస్య విజ్ఞాయ శౌచం మాహాత్మ్య ముత్తమమ్,
న గాత్ర మంశుభి స్సూర్య స్సన్తాపయితు మర్హతి. ౮
శివ స్సర్వేషు కాలేషు కాననేభ్యో వినిస్సృతః,
రాఘవం యుక్తశీతోష్ణ స్సేవిష్యతి సుఖోఽనిలః. ౯

శయాన మనఘం రాత్రౌ పితే వాభిపరిష్వజన్,
రశ్మిభి స్సంస్పృశం శ్శీతై శ్చన్ద్రి మాహ్లాదయిష్యతి. ౧౦

దదౌ చాస్త్రాణి దివ్యాని యస్మై బ్రహ్మా మహౌజసే,
దానవేన్ద్రిం హతం దృష్ట్వా తిమిధ్వజసుతం రణే. ౧౧
స శూరః పురుషవ్యాఘ్రః స్వబాహుబల మాశ్రితః,
అస న్త్రస్తోఽప్యరణ్యస్థో వేశ్మ నీవ నివత్స్యతి. ౧౨

యస్యేషుపథ మాసాద్య వినాశం యాన్తి శత్రవః,
కథం న పృథివీ తస్య శాసనే స్థాతు మర్హతి?. ౧౩

పాపరహితుఁడును సమస్తప్రాణులందును దయగలవాఁడు నగు లక్ష్మణుఁడు ఆరామునకు మిక్కిలియు సేవసేయుచున్నాఁడు. ఇది మహాత్ముఁ డగు నాలక్ష్మణునకు గొప్పలాభము. ౫

ఎల్లప్పుడును సుఖం బనుభవించుటకే తగినదగు సీత వనవాసంబునం గలుగు దుఃఖంబు నెఱింగినదయ్యు పతివ్రత కావున వనంబునకుఁ బోవుచున్న ధర్మాత్ముఁడగు నీకుమారుని వెంబడించినది. ౬

ప్రపంచమునం దంతయు మనకులంబునకుఁ గీర్తి దెచ్చునట్టి మహాసమర్థుఁ డును ధర్మమును సత్యము నె ధనముగా నెంచియున్నవాఁడు నగు రామున కేమియు నపాయము గలుగదు. సమస్తశత్రువులను జయించి సుఖంబుగా నిచ్చటికి రాఁగలఁడు. ౭

సూర్యుఁడును రామునిపారిశుద్ధ్యమును మాహాత్మ్యంబును స్పష్టముగా నెఱింగి రామునిదేహమును దనకిరణములచే నెంతమాత్రము తపింపఁజేయుఁడు.

రామునిసద్గుణంబులకు మెచ్చి యడవులనుండి సుఖకరంబయినదియు సమశీతోష్ణంబును మంగళకరంబు నగు వాయువు రామునిపై సమస్తకాలంబుల యందును వీచుచుండఁగలదు. ౯

చంద్రుఁడును బాపరహితుఁడగురామునిసద్గుణంబులకు మెచ్చి రాముఁడు రాత్రికాలంబునం బరుండియుండఁగాఁ దండ్రివలె వాత్సల్యంబునఁ జల్లని కిరణంబులం గవుఁగిలించి యతని సంతోషింపఁజేయఁగలఁడు. ౧౦

రాముఁడు మహాపరాక్రమశాలి. యతఁడుఁ మున్ను దానవశ్రేష్ఠుఁ డగు శంబరకుమారుం జంపఁగా నప్పుడు దానిం జూచి హర్షించి బ్రహ్మదేవుఁడును రామునకు దివ్యాస్త్రంబుల నొసంగెనుగదా! అట్టి మహాశూరుఁ డగు రామునకు వనంబులోనుండుట యెంతమాత్రము కష్టము గాదు. అతఁ డడవియందైనను నిర్భయుఁడై యింటనుండునట్లు సుఖంబుగా నుండఁగలఁడు.

రాముని బాణంబులకు గుఱియగుటచేతనే శత్రువు లందఱు నాశంబు నొందుచున్నారే అట్టి రామునియాజ్ఞకు భూమి యెట్లు లోఁబడకుండును! అవశ్యము లోఁబడును. ౧౩

యా శ్రీ శ్శౌర్యం చ రామస్య యా చ కల్యాణసత్త్వతా,
నివృత్తారణ్యవాస స్స క్షిప్రం రాజ్య మవాప్స్యతి. ౧౪

సూర్యస్యాపి భవే త్సూర్యో హ్యగ్నే రగ్నిః ప్రభోః ప్రభుః,
శ్రియః శ్రీ శ్చ భవే దగ్ర్యా కీర్తిః కీర్త్యాః క్షమాక్షమా. ౧౫
దైవతం దైవతానాం చ భూతానాం భూతసత్తమః,
తస్య కే హ్యగుణా దేవి! రాష్ట్రే వా ప్యథవా పురే. ౧౬

పృథివ్యా సహ వైదేహ్యా శ్రియా చ పురుషర్షభః,
క్షిప్రం తిసృభి రేతాభి స్సహ రామోఽభిషేక్ష్యతి. ౧౭
దుఃఖజం విసృజ న్త్యస్రం నిష్క్రామ న్త ముదీక్ష్యయమ్,
అయోధ్యాయాం జనా స్సర్వే శోకవేగసమాహతాః. ౧౮
కుశచీరధరం దేవం గచ్ఛ న్త మపరాజితమ్,
సీతేవానుగతా లక్ష్మీ స్తస్య కిం నామ దుర్లభమ్. ౧౯

ధనుర్గ్రహవరో యస్య బాణఖడ్గా స్త్రభృ త్స్వయమ్,
లక్ష్మణో వ్రజతి హ్యగ్రే తస్య కింనామ దుర్లభమ్?. ౨౦

నివృత్తవనవాసం తం ద్రష్టాఽసి పున రాగతమ్,
జహి శోకం చ మోహం చ దేవి! సత్యం బ్రవీమి తే. ౨౧

శిరసా చరణా వేతౌ వన్దమాన మనిన్దితే,

రాముని దేహకాంతియు నతనిపరాక్రమంబును నతనిమహాబలంబునుం జూడఁగా నతఁడు పదునాలుగుసంవత్సరంబులు నరణ్యంబులో లీలమెయిఁ గడపి శీఘ్రంబుగ రాజ్యంబు నొందునని స్పష్టముగాఁ దెలియవచ్చుచున్నది.

కౌసల్యాదేవీ! రాముఁడు సూర్యునకును సూర్యుఁడు. నిప్పునకును నిప్పు. నియంతకును నియంత. సంపదకును సంపద. కీర్తికిని గీర్తి. ఓర్పునకును ఓర్పు. దేవతలకును దేవత. భూతంబులకును భూతము. అట్టిమహాప్రభావుఁడగు రామునకు దేశమునందుఁగాని పట్టణంబునందుఁగాని యెవ్వరు విరోధముసేయఁ జాలుదురు? ౧౭,౧౮

ఈయయోధ్యయందలి జను లందఱు ఎవ్వఁడు వనంబునకుఁ బోవుటం జూచి పరమదుఃఖంబు నొంది కన్నీళ్లు విడుచుచున్నారో అట్టి పురుషశ్రేష్ఠుఁడగు రాముఁడు పదునాలుగుసంవత్సరంబులయినంతనె శీఘ్రంబుగానే సీతను భూదేవిని రాజ్యలక్ష్మినిం గూడి పట్టాభిషేకము నొందఁగలఁడు.

అపజయంబె యెఱుంగని రాముఁడు, దర్భాసనమును నారచీరలుం దాల్చి వనంబునకుఁ బోవునప్పుడు అతని సీత వెంబడించినట్లు రాజ్యలక్ష్మియు వెంబడించినది. అట్టిరామున కేది దుర్లభము? ౧౯

ధనుర్ధరులలో శ్రేష్ఠుఁడు నగులక్ష్మణుఁడు బాణంబులను ఖడ్గంబును ఇతరాయుధంబులను ధరించి రామునిముందటం బోవుచున్నాఁడే! అట్టి రామునకు దుర్లభం బెద్ది? ౨౦

కౌసల్యాదేవీ! నీవు యథావిధిగ వనవాసము చేసి మరల వచ్చిన కొడుకుం జూడఁగలవు. ఇట్టజ్ఞానముచే దుఃఖింపవలదు. నీకు సత్యము చెప్పుచున్నాను గాని వేఱుగాదు. ౨౧

ఎవ్వరిచేతను నిందింపఁబడనట్టి కళ్యాణరూపిణివగు కౌసల్యాదేవీ! రాముఁడు వనంబునుండి మరల వచ్చి సర్వలక్షణసంపన్నంబులగు నీపాదంబుల

పున ర్ద్రక్ష్యసి కల్యాణి! పుత్త్రం చన్ద్రమి వోదితమ్. ౨౨

పునః ప్రవిష్టం దృష్ట్వా త మభిషిక్తం మహాశ్రియమ్,
సముత్స్రక్ష్యసి నేత్రాభ్యాం క్షిప్ర మానన్దజం పయః. ౨౩

మా శోకో దేవి! దుఃఖం వా న రామే దృశ్యతేఽశివమ్,
క్షిప్రం ద్రక్ష్యసి పుత్త్రం త్వం ససీతం సహలక్ష్మణమ్. ౨౪

త్వయా శేషో జనశ్చైవ సమాశ్వాస్యో యదాఽనఘే,
కి మిదానీ మిదం దేవి! కరోషి హృది విక్లబమ్. ౨౫

నార్హా త్వం శోచితుం దేవి! యస్యా స్తే రాఘవ స్సుతః,
నహి రామా త్పరో లోకే విద్యతే సత్పథే స్థితః. ౨౬

అభివాదయమానం తం దృష్ట్వా ససుహృదం సుతమ్,
ముదాఽశ్రు మోక్ష్యసే క్షిప్రం మేఘలేఖేవ వార్షికీ. ౨౭

పుత్త్ర స్తే వరదః క్షిప్ర మయోధ్యాం పున రాగతః,
పాణిభ్యాం మృదుపీనాభ్యాం చరణౌ పీడయిష్యతి. ౨౮

అభివాద్య నమస్యన్తం శూరం ససుహృదం సుతమ్,
ముదాఽఽస్రైః ప్రోక్ష్యసి పున ర్మేఘరాజి రి వాచలమ్.

నమస్కరించుచు అప్పు డుదయించిన చంద్రునిభంగి నొప్పుచుండఁగా నీ పతిని బరమసంతోషంబునం జూడఁగలవు. ౨౨

మరల నీయయోధ్యకు వచ్చి పట్టాభిషిక్తుఁడై మహాకాంతితో వెలుఁగుచున్న రామునిం జూచి నీవు శీఘ్రంబుగానే యానందబాష్పంబుల విడువఁగలవు. ౨౩

కౌసల్యాదేవీ! రామున కేమియు నమంగళము గలుగదు. కావున నీ విట్లువిలపించుటను గాని మనోవ్యథను గాని చేయవలదు. సీతతోను లక్ష్మణునితోను గూడినరాముని శీఘ్రంబుగానే చూడఁగలవు. ౨౪

పాపరహితురాలవగు కౌసల్యాదేవీ! నీవు మిగిలినవారలనుంగూడ నాశ్వాసింపవలసినదానవై యుండఁగా నీవే యిట్లు మనంబున దుఃఖించుచున్నా వేమి? ౨౫

కౌసల్యాదేవీ! నీకు మహాత్ముఁ డగు రాముఁడు కొడుకుగా నున్నాఁడు. నీయట్టిది యిట్లు దుఃఖింపఁదగదు. రామునికన్న ధార్మికుఁ డెవ్వఁడున్నాఁడు?

రాముఁడు మరల నిచ్చటికి వచ్చి స్నేహితులం గూడి నీకు నమస్కరించుచుండఁగాఁ జూచి నీవు శీఘ్రంబుగానే వర్షాకాలమేఘంబు జలంబు విడుచునట్లు ఆనందబాష్పంబులు విడువంగలవు. ౨౬

శీఘ్రంబుగానే వరదుఁడగు నీకొడుకు రాముఁడు మరల నయోధ్యకు వచ్చి మెత్తనివియుం బలిసినవియుం నగు హస్తంబులచేత నీపాదంబులం బిసుకఁగలఁడు. ౨౭

రాముఁడు మరల నయోధ్యకు వచ్చి స్నేహితులం గూడి నీకుఁ బ్రవరోచ్చారణపూర్వకంబుగా నమస్కారము సేయుచుండునప్పుడు నీవు మేఘసమూహము వర్షాకాలంబునఁ బర్వతముం దడుపునట్లు ఆనందబాష్పంబుల పతిని దడుపఁగలవు. అని సుమిత్ర కౌసల్య నాశ్వాసించినది. ౨౮

ఆశ్వాసయన్తీ వివిధైశ్చవాక్యై
ర్వాక్యోపచారే కుశలాఽనవద్యా,
రామస్య తాం మాతర మేవ ముక్త్వా
దేవీ సుమిత్రా విరరామ రామా. 30
నిశమ్య త ల్లక్ష్మణమాతృవాక్యం
రామస్య మాతు ర్నరదేవపత్న్యాః,
సద్య శ్శరీరే వినశాశ శోక
శ్శరద్గతో మేఘఇవాల్పతోయః. 31

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే చతుశ్చత్వారింశస్సర్గః.

## పఞ్చచత్వారింశస్సర్గః

అనురక్తా మహాత్మానం రామం సత్యపరాక్రమమ్,
అనుజగ్ముః ప్రయాన్తం తం వనవాసాయ మానవాః. 1

నివర్తితేఽపి చ బలా త్సుహృద్వర్గే చ రాజని,
నైవ తే సంన్యవర్తన్త రామ స్యానుగతా రథమ్. 2

అయోధ్యానిలయానాం హి పురుషాణాం మహాయశాః,
బభూవ గుణసమ్పన్నః పూర్ణచన్ద్ర ఇవ ప్రియః. 3
స యాచ్యమానః కాకుత్స్థ స్తాభిః ప్రకృతిభి స్తదా,
కుర్వాణః పితరం సత్యం వన మే వాన్వపద్యత. 4
అవేక్షమాణ స్సస్నేహం చక్షుషా ప్రపిబ న్నివ,
ఉవాచ రామ స్స్నేహేన తాః ప్రజా స్స్వాః ప్రజా ఇవ. 5
యా ప్రీతి ర్బహుమాన శ్చ మ య్యయోధ్యానివాసినామ్,
మత్ప్రియార్థం విశేషేణ భరతే సా నివేశ్యతామ్. 6

మాటలచే నుపచారము సేయుటయందు సమర్థురాలును నిందింపఁబడ నిదియు నగు నాసుమిత్రాదేవి కౌసల్యాదేవి నాశ్వాసించుచు నీప్రకారమునం జెప్పి యంత నూరకుండెను. ౩౦

లక్ష్మణునితల్లి యయిన యాసుమిత్రా దేవి చెప్పినమాటను విన్నంతనె శరదృతువునందు మేఘము నశించుచున్నట్లు రాముని తల్లియయిన కౌసల్యాదేవి దుఃఖమంతయు నప్పుడె నశించినది. ౩౧

ఇది నలువదినాలవసర్గము.

---

## నలువదైదవసర్గము

జను లందఱు రామునం దనురాగము గలవారలు కావున వనవాసంబు నకై పోవుచున్నమహాత్ముఁడును సత్యపరాక్రముఁడు నగు రాముని వెంబడించిరి. ౧

రాముని స్నేహితులును దశరథమహారాజును బలాత్కారంబున వెనుకకుఁ బోయినను రామునిరథంబు వెంబడిఁ బోయినజనులు మాత్ర మెంతమాత్ర మతని విడువరైరి. ౨

ఆరాముఁడు మహాకీర్తిశాలియు సద్గుణసంపన్నుఁడును గావున అయోధ్యయందలి జనులకు నిండుచంద్రుఁడువలెఁ బ్రియుఁడై యుండెను. ౩

ఆరాముఁడు తన ప్రజలు తన్నువనంబులకుఁ బోవలదని యెంత యాచించినను వారలమాటలను వినక అడవికే పోయెను. ౪

రాముఁడు సస్నేహంబుగ నేత్రంబులఁ బానంబు సేయునట్లు ఆజనులను తనబిడ్డలవలెఁ జూచుచు స్నేహంబున నిట్లని చెప్పెను. ౫

అయోధ్యానివాసులగు మీకు నాయందుండు ప్రీతియును గౌరవంబును నాప్రీత్యర్థమయి విశేషంబుగ భరతునియం దుంచుఁడు. ౬

స హి కల్యాణచారిత్రః కైకేయ్యానన్దవర్ధనః,
కరిష్యతి యథావ ద్వః ప్రియాణిచ హితాని చ. ౭

జ్ఞానవృద్ధో వయోబాలో మృదు ర్వీర్యగుణాన్వితః,
అనురూప స్సవో భర్తా భవిష్యతి భయాపహః. ౮

స హి రాజగుణై ర్యుక్తో యువరాజ స్సమీక్షితః,
అపి చాపి మయా శిష్టైః కార్యం వో భర్తృశాసనమ్. ౯

న చ తప్యే ద్యథా చాసౌ వనవాసం గతే మయి,
మహారాజ స్తథా కార్యో మమ ప్రియచికీర్షయా. ౧౦

యథా యథా దాశరథి ర్ధర్మ ఏవాఽస్థితోఽభవత్,
తథా తథా ప్రకృతయో రామం పతి మకామయన్. ౧౧

బాష్పేణ పిహితం దీనం రామ స్సౌమిత్రిణా సహ,
చకర్షేవ గుణై ర్బద్ధ్వా జనం పురనివాసినమ్. ౧౨

తే ద్విజా స్త్రివిధం వృద్ధా జ్ఞానేన వయసౌజసా,
వయఃప్రకమ్పశిరసో దూరా దూచు రిదం వచః. ౧౩

వహన్తో జవనా రామం భోభో జాత్యా స్తురఙ్గమాః,
నివర్తధ్వం న గన్తవ్యం హితా భవత భర్తరి. ౧౪

కల్యాణగుణంబులుగలవాఁడును కైకేయీపుత్రుండు నగు నాభరతుఁడు మీకుఁ బ్రియంబులును హితంబులు నగు కార్యంబులం జక్కఁగాఁ జేయుచుండును. ౭

ఆభరతుఁడు వయసునం జిన్నవాఁడయ్యు జ్ఞానంబున వృద్ధుఁడు. మృదువైనను పరాక్రమశాలి. అతఁడు మీభయంబులం బోఁగొట్టి మీకుఁ దగినభర్త కాఁగలఁడు. ౮

ఆభరతుఁడు రాజగుణంబులు గలవాఁడు. దశరథమహారాజుచే యువరాజుగా నియమింపఁబడినవాఁడు. మీకును నాకును దక్కినవారలకును రాజయిన దశరథుని యాజ్ఞచొప్పున నడుచుకొనవలయును. ౯

నేను వనంబునకుఁ బోఁగానే దశరథమహారాజు దుఃఖంబు నొందకున్నట్టుగ మీర లందఱు నాసంతోషార్థమయి చేయవలెను. అని రాముఁడు జనులకుం జెప్పెను. ౧౦

రాముఁడు స్థిరముగా ధర్మంబు నవలంబించి ప్రజ లెంత చెప్పినను వారిమాటలను వినక నిరాకరించుకొలందిగా ఆప్రజలకు "రాముఁడే రాజు కావలయును" అని కోర్కె యంతకంతకు వృద్ధిఁ బొందినది. ౧౧

ఆపట్టణమునందు జను లందఱు ముఖంబునిండఁ గన్నీళ్లుగాఱ దీనులై రామలక్ష్మణులచే గుణంబులం గట్టఁబడి యాకర్షింపఁబడుచుండునట్లు విడువక ఆరామలక్ష్మణులవెంబడిం బోవుచుండిరి. ౧౨

జ్ఞానంబునను వయసునను బ్రహ్మవర్చసంబునను ఇట్లు మూఁడువిధంబులను వృద్ధులగు నాబ్రాహ్మణులు వార్ధకంబున శిరంబులు వడఁక దూరంబున నుండి యిట్లని చెప్పిరి. ౧౩

రాముని మోయుచున్నవియుం నతివేగముగలవియుం మంచిజాతిలోఁ బుట్టినవియు నగు నోగుఱ్ఱములారా! మీరలు పోవలదు. వెనుకకు మరలుఁడు. మీప్రభువయిన రామునకు హితము సేయుఁడు. ౧౪

కర్ణవన్తి హి భూతాని విశేషేణ తురఙ్గమాః,
యూయం తస్మాన్నివర్తధ్వం యాచనాం ప్రతివేదితాః. ౧౫

ధర్మతస్స విశుద్ధాత్మా వీరశ్శుభదృఢవ్రతః,
ఉపవాహ్యస్తు వో భర్తా నాపవాహ్యః పురాద్వనమ్. ౧౬

ఏవమార్తప్రలాపాంస్తాన్వృద్ధాన్ప్రలపతో ద్విజాన్,
అవేక్ష్య సహసా రామో రథాదవతతార హ. ౧౭
పద్భ్యామేవ జగామాథ ససీతస్సహలక్ష్మణః,
సన్నికృష్టపదన్యాసో రామో వనపరాయణః. ౧౮

ద్విజాతీంస్తు పదాతీంస్తాన్రామశ్చారిత్రవత్సలః,
న శశాక ఘృణాచక్షుః పరిమోక్తుం రథేన సః. ౧౯

గచ్ఛన్తమేవ తం దృష్ట్వా రామం సమ్భ్రాన్తచేతసః,
ఊచుః పరమసన్తప్తా రామం వాక్యమిదం ద్విజాః. ౨౦
బ్రాహ్మణ్యం సర్వమేతత్త్వాం బ్రహ్మణ్యమనుగచ్ఛతి,
ద్విజస్కన్ధాధిరూఢాస్త్వామగ్నయోఽప్యనుయాన్త్వమీ.

జంతువుల యన్నిటిలోను, గుఱ్ఱములు అధికముగాఁ జెవులుగలవి. కావున మీరు మా ప్రార్థన చక్కఁగా వినవచ్చును. మీరు మా ప్రార్థనను విని శీఘ్రముగా మరలుండు. ౧౫

మీ ప్రభువైన రాముఁడు మహాధార్మికుఁడు. పరిశుద్ధమయిన మనసు గలవాఁడు. పరాక్రమశాలి. ధర్మమునందు దృఢమయిన యభిమానము గలవాఁడు. కావున మీచేతఁ బట్టణంబునకుఁ దీసికొనిపోఁదగినవాఁడే కాని యెంతమాత్రము పట్టణంబుననుండి వనంబునకుఁ గొనిపోఁ దగినవాఁడు కాఁడు. అని వృద్ధబ్రాహ్మణులు రామునిరథంబునకుఁ గట్టఁబడియుండు గుఱ్ఱములతోఁ జెప్పిరి. ౧౬

ఇట్లు మహాదుఃఖంబున విలపించుచున్నయావృద్ధబ్రాహ్మణులం జూచి రాముఁడు శీఘ్రంబున రథముననుండి దిగెను. ౧౭

ఆవృద్ధబ్రాహ్మణులు వెనుకను దూరంబున నుండుటం జేసి వారల నాశ్వాసించుటకై, వారలయొద్దకుఁ బోయినచో వ్రతభంగం బగుననియుం వారల నుపేక్షించినచో దోషంబు గలుగు ననియుఁ దలంచి రాముఁడు సీతాలక్ష్మణులం గూడి యీవృద్ధబ్రాహ్మణులు తన్నుఁ జేరుటకై మెల్లఁగాఁ గాలినడకచేత నే పోయెను. ౧౮

రాముఁడు, దయాశాలియును సదాచారముఁ గోరువాఁడును గావునఁ దాను రథంబుననుండి కాలినడకచే వచ్చుచున్న యాబ్రాహ్మణులను ఆశ్వాసింప సమ్మతింపఁ దయ్యె. ౧౯

ఆబ్రాహ్మణులు రాముఁడు నిలువక పోవుచునే యుండుటం జూచి సంభ్రాంతులై పరమసంతాపంబు నొంది, రామునితో నిట్లని చెప్పిరి. ౨౦

ఈబ్రాహ్మణులందఱు బ్రాహ్మణులకుఁ జక్కఁగా సేవసేయునట్టి నిన్ను వెంబడించుచున్నారు. వారలు తమ యగ్నిహోత్రములను అరణ్యారోపితములఁ జేసి తమమూఁపులపై నుంచుకొని వచ్చుచున్నారు. చూడుము. ౨౧

వాజపేయసముత్థాని ఛత్త్రాణ్యేతాని పశ్య నః,
పృష్ఠతోఽనుప్రయాతాని మేఘా నివ జలాత్యయే. ౨౨

అనవాప్తాతపత్రస్య రశ్మిసన్తాపితస్య తే,
ఏభి శ్ఛాయాం కరిష్యామ స్సైస్వ శ్ఛత్త్రై ర్వాజపేయికైః ౨౩

యా హి న స్సతతం బుద్ధి ర్వేదమన్త్రానుసారిణీ,
త్వత్కృతే సా కృతా వత్స! వనవాసానుసారిణీ. ౨౪
హృదయే ష్వేవ తిష్ఠన్తి వేదా యే నః పరంధనమ్,
వత్స్యన్త్యపి గృహేష్వేవ దారా శ్చారిత్రరక్షితాః. ౨౫

న పున ర్నిశ్చయః కార్య స్త్వద్గతౌ సుకృతా మతిః,
త్వయి ధర్మవ్యపేక్షే తు కింస్యా ద్ధర్మ మపేక్షితుమ్. ౨౬

యాచితో నో నివర్తస్వ హంసశుక్లశిరోరుహైః,
శిరోభి ర్నిభృతాచార మహీపతనపాంసులైః. ౨౭

బహూనాం వితతా యజ్ఞా ద్విజానాం య ఇహాగతాః,
తేషాం సమాప్తి రాయత్తా తవ వత్స! నివర్తనే. ౨౮

భక్తిమన్తి హి భూతాని జఙ్గమాజఙ్గమాని చ,
యాచమానేషు రామ! త్వం భక్తిం భక్తేషు దర్శయ. ౨౯

మాకు వాజపేయయాగంబున వచ్చినవియు శరదృతువునందలి మేఘంబులవలెఁ దెల్లఁగా నున్నవియు నగు శ్వేతచ్ఛత్రంబులును వెంబడించి వచ్చుచున్నవి. చూడుము. ౨౨

నీకు గొడుగు లేదు కావున నీ కెండ సోఁకునప్పుడు మేము వాజపేయ యాగము చేసినప్పుడు మాకు వచ్చిన యాఛత్రములచేత నీకు నీడగల్గునట్లు చేసెదము. ౨౩

బిడ్డఁడా! ఎల్లప్పుడును వేదమంత్రంబుల ననుసరించియుండు మాబుద్ధి యిప్పుడు నీకుఁగా వనవాసంబుపైఁ బ్రవర్తించియున్నది. ౨౪

మాకు మహాధనరూపములయిన యీ వేదములు మామనసులోనే యుండఁగలవు. మాభార్యలను వారిపాతివ్రత్యమె రక్షించును. వారలను మేము రక్షింపవలసినది లేదు. కావున వారలు గృహంబులయందె యుండుదురు. ౨౫

ని న్నెట్టయిన నాయయోధ్యకుఁ దీసికొని పోవలయునని నిశ్చయించుకొన్నాము. నీ వింక, "వనంబునకుఁ బోవలయు" నను తలంపును విడువుము. నీవే యిట్లు బ్రాహ్మణుల ప్రార్థనం జేయుంటయును ధర్మమునం దపేక్ష లేనివాఁడ వగుదువేని, దీనికన్న నీవు మఱి యేధర్మమును గోరఁగలవు? ౨౬

నిశ్చలమయిన ధర్మానుష్ఠానము గలవాఁడవగు రాముఁడా! మేము, హంసపక్షులవలెఁ దెల్లనైన వెండ్రుకలుగలవియును దుఃఖంబున నేలం బొరలుటచే దుమ్ము దగిలియున్నవియు నగు శిరంబుల యాచించుచున్నాము. నీ వయోధ్యకు రమ్ము. ౨౭

అయోధ్యకు వచ్చి యనేకబ్రాహ్మణులు యాగంబులు సేయ నారంభించి సంభారంబులం గూర్చికొని యున్నారు. నీ వయోధ్యకు వచ్చినఁగాని ఆయాగములు సమాప్తిఁ బొందవు. నీవు రాకుందువేని వానికి విఘ్నము చేసినవాఁడ వగుదువు. ౨౮

రాముఁడా! మేముమాత్రమె కాదు. జంగమంబులగు తిర్యగ్జంతువులును స్థావరంబులును నీయందు భక్తి గలిగి నీరాకం గోరుచున్నవి. కావున అట్లు యాచించుచున్న భక్తులయెడ స్నేహంబుఁ జూపుము. ౨౯

అనుగన్తు మశక్తా స్త్వాం మూలై రుద్ధతవేగినః,
ఉన్నతా వాయువేగేన విక్రోశ న్తీవ పాదపాః. ౩౦

నిశ్చేష్టాహారసంచారా వృక్షైకస్థానవిష్ఠితాః,
పక్షిణోఽపి ప్రయాచ న్తే సర్వభూతానుకమ్పినమ్. ౩౧

ఏవం విక్రోశతాం తేషాం ద్విజాతీనాం నివ ర్తనే,
దదృశే తమసా తత్ర వారయ న్తీవ రాఘవమ్. ౩౨

తత స్సుమన్త్రోఽపి రథా ద్విముచ్య
శ్రాన్తా న్హయా న్సంపరివ ర్త్య శీఘ్రమ్,
పీతోదకాం స్తోయపరిప్లుతాఙ్గా
నచారయ ద్వై తమసావిదూరే. ౩౩

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే పఞ్చచత్వారింశస్సర్గః.

## షట్చత్వారింశస్సర్గః

తత స్తు తమసాతీరం రమ్య మాశ్రిత్య రాఘవః,
సీతా ముద్వీక్ష్య సౌమిత్రి మిదం వచన మబ్రవీత్. ౧
ఇయ మద్య నిశా పూర్వా సౌమిత్రే! ప్రహితా వనమ్,
వనవాసస్య భద్రం తే స నోత్కణ్ఠితు మర్హసి. ౨

ఉన్నతంబులగు వృక్షము లిట్లు వాయువేగంబున శబ్దించుటం జూడఁగా నవి నీవు వనంబునకుఁ బోవుటం జూచి మహాదుఃఖితంబులై నిన్ను వెంబడింపఁ బూనినవయ్యు మూలంబులు కదలకుండుటం జేసి నిన్ను వెంబడింపఁజాలక "రాముని వెంబడించుభాగ్యంబు మాకుఁగలుగదయ్యె" అని యాక్రోశించునట్లు తోఁచుచున్నది. ౩౦

పక్షులును గదలక యాహారంబును సంచారంబును బరిత్యజించి వృక్షంబుల నొకానొకచోటనుండి సమస్తప్రాణులయందును గరుణగలవాఁడవగు నిన్ను అయోధ్యకు రమ్మని యాచించుచున్నవి. అని వృద్ధబ్రాహ్మణులు రామునితోఁ జెప్పిరి. ౩౧

ఇట్లాక్రోశించుచున్న యాబ్రాహ్మణుల మరలింపక ముందుదిన్నఁగాఁ బోవుచున్న రాముని, "ఇదిసరిగాదు. ఆవృద్ధబ్రాహ్మణుల నాశ్వాసించి యాపిమ్మట నీవు పోవలసినది" అని నివారించునదివలెఁ దమసానది రామున కడ్డపడినది.

అంత సుమంత్రుఁడును అలసినగుఱ్ఱంబులను రథంబుననుండి విప్పి అలపుదీఱుటకై నేలం బొరలించి నీళ్లు త్రాఁగించి నీళ్లచేఁ జక్కఁగాఁ గడిగి యాతమసాతీరంబునం ద్రిప్పెను. ౩౩

ఇది నలువదైదవసర్గము.

---

## నలువదాఱవసర్గము

అంత రాముఁడు రమణీయంబగు తమసాతీరంబుఁ జేరి సీతం జూచి లక్ష్మణునితో నిట్లని చెప్పెను. ౧

లక్ష్మణుఁడా! మనము వనములో నుండవలసిన పదునాలుగు సంవత్సరములలో మొదటిదిన మిప్పుడు వచ్చియున్నది. నీకు మంగళ మగుఁగాక. నీ వింక నిల్లుమొదలగువానిం దలంచుకొనరాదు. ౨

పశ్య శూన్యా న్యరణ్యాని రుదన్తీవ సమంతతః,
యథానిలయ మాయద్భి ర్నిలీనాని మృగద్విజైః. 3

అద్యాయోధ్యా తు నగరీ రాజధానీ పితు ర్మమ,
సస్త్రీపుంసా గతా నస్మాం శోచిష్యతి న సంశయః. ౪

అనురక్తా హి మనుజా రాజానం బహుభి ర్గుణైః,
త్వాం చ మాం చ నరవ్యాఘ్ర! శత్రుఘ్నభరతౌ తథా. ౫

పితరం చానుశోచామి మాతరం చ యశస్వినీమ్,
అపి వాఽన్ధౌ భవేతాం తు రుదన్తౌ తా వభీక్ష్ణశః. ౬

భరతః ఖలు ధర్మాత్మా పితరం మాతరం చ మే,
ధర్మార్థకామసహితై ర్వాక్యై రాశ్వాసయిష్యతి. ౭
భరత స్యానృశంసత్వం విచి న్త్యాహం పునః పునః,
నానుశోచామి పితరం మాతరం చాపి లక్ష్మణ!. ౮
త్వయా కార్యం నరవ్యాఘ్ర! మా మనువ్రజతా కృతమ్,
అన్వేష్టవ్యా హి వైదేహ్యా రక్షణార్థే సహాయతా. ౯

అద్భి రేవ తు సౌమిత్రే! వత్స్యా మ్యద్య నిశా మిమామ్,
ఏత ద్ధి రోచతే మహ్యం వన్యేఽపి వివిధే సతి. ౧౦

ఏవ ముక్త్వా తు సౌమిత్రిం సుమన్త్ర మపి రాఘవః,
అప్రమత్త స్త్వ మశ్వేషు భవ సౌమ్యేత్యువాచ హ. ౧౧

ఈయడవులు తమతమ నెలవులం జేరిన మృగంబులచేతను బక్షులచేతను వ్యాపింపఁబడి నిష్ప్రభంబులు కావున ఆమృగపక్షులశబ్దంబులచే రోదనంబు సేయుచునట్లున్నవి చూడుము. ౩

నాతండ్రి రాజధానియయిన యయోధ్యానగరమునందలి స్త్రీలును బురుషులు నందఱును అడవికిఁ బోయిన మనలం గూర్చి యిప్పుడు దుఃఖింపు చుందురు. సందేహము లేదు. ౪

పురుషశ్రేష్ఠుఁడవగు లక్ష్మణుఁడా! ప్రజలందఱు మనగుణంబులం జూచి దశరథమహారాజునందును నీయందును నాయందును భరతశత్రుఘ్ను లందును మిక్కిలియు ననురాగము గల్గియున్నారు. ౫

నాకు నాతండ్రిని నాతల్లిని దలంచుకొనఁగా దుఃఖము వచ్చుచున్నది. వారలు అట్లు పలుమాఱు రోదనంబుసేయుచుఁ గండ్లుచెడి గ్రుడ్డివార లగుదురు. ౬

భరతుఁడు ధర్మాత్ముఁడు గావున ధర్మార్థకామంబులతోఁ గూడినమాట లం జెప్పి నాతండ్రికిని దల్లికిని ఊఱట గలుగఁజేయును. ౭

లక్ష్మణుఁడా! భరతునిసద్గుణంబులందలంచుకొన్నప్పుడుమాత్రము నాకు దలిదండ్రులగుఱించి యంతగా దుఃఖము గలుగకున్నది. ౮

పురుషశ్రేష్ఠుఁడవగు లక్ష్మణుఁడా! నీవు నాతో వనంబునకు వచ్చుట వలన మంచికార్యము చేసితివి. నీవు రాకుండువేని సీతాసంరక్షణమునకై చాలఁ గష్టముగా నుండును. ౯

లక్ష్మణుఁడా! నే నీరాత్రి నీళ్లు త్రాగి యుండెదను. నానావిధములయిన వన్యాహారంబు లుండినను నా కిప్పు డిదియె యిష్టముగా నున్నది. అనిరాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౧౦

రాముఁడు ఈప్రకారము లక్ష్మణునితోఁ జెప్పి యంత సుమంత్రుం జూచి 'సౌమ్యుఁడా! గుఱ్ఱంబులవిషయమయి మేమఱకుండుము' అనిచెప్పెను.

సోఽశ్వా న్సుమన్త్ర స్సంయమ్య సూర్యేఽస్తం సముపాగతే,
ప్రభూతయవసా న్కృత్వా బభూవ ప్రత్యనన్తరః. ౧౨
ఉపాస్యతు శివాం సన్ధ్యాం దృష్ట్వా రాత్రి ముపస్థితామ్,
రామస్య శయనం చక్రే సూత స్సౌమిత్రిణాసహ. ౧౩
తాం శయ్యాం తమసాతీరే వీక్ష్య వృక్షదళైః కృతామ్,
రామ స్సౌమిత్రిణా సార్ధం సభార్య స్సంవివేశహ. ౧౪
సభార్యం సంప్రసుప్తం తం భ్రాతరం వీక్ష్య లక్ష్మణః,
కథయామాస సూతాయ రామస్య వివిధా న్గుణాన్. ౧౫
జాగ్రతో హ్యేవ తాం రాత్రిం సౌమిత్రే రుదితో రవిః,
సూతస్య తమసాతీరే రామస్య బ్రువతో గుణాన్. ౧౬
గోకులాకులతీరాయా స్తమసాయా విదూరతః,
అవసత్తత్ర తాం రాత్రిం రామః ప్రకృతిభిస్సహ. ౧౭
ఉత్థాయ చ మహాతేజాః ప్రకృతీ స్తా నిశామ్య చ,
అబ్రవీ ద్భ్రాతరం రామో లక్ష్మణం పుణ్యలక్షణమ్. ౧౮

అస్మద్వ్యపేక్షా న్సౌమిత్రే! నిరపేక్షా న్గృహే ష్వపి,
వృక్షమూలేషు సంసుప్తా న్పశ్య లక్ష్మణ! సామ్ప్రతమ్. ౧౯
యథైతే నియమం పౌరాః కుర్వ న్త్యస్మన్నివర్తనే,
అపి ప్రాణా న సిష్య న్తి న తు త్యక్ష్య న్తి నిశ్చయమ్. ౨౦

యావ దేవ తు సంసుప్తా స్తావ దేవ వయం లఘు,
రథ మారుహ్య గచ్ఛామః పన్థాన మకుతోభయమ్. ౨౧
అతో భూయోఽపి నేదానీ మిక్ష్వాకుపురవాసినః,
స్వపేయు రనురక్తా మాం వృక్షమూలాని సంశ్రితాః. ౨౨

ఆసుమంత్రుఁడు సూర్యుఁ డస్తమించినవెనుక గుఱ్ఱంబులఁ గట్టి వానికిఁ జాలినంత గడ్డి వేసి రామునిసన్నిధానంబున నుండెను. ౧౨

సుమంత్రుఁడు సాయంకాలసంధ్య నుపాసించి రాత్రి యగుటంజూచి లక్ష్మణునితోఁ గూడ రామునకు శయనస్థలం బేర్పఱిచెను. ౧౩

రాముఁడు తమసానదీతీరంబునఁ జెట్లయాకులతోఁ జేయఁబడిన శయనంబుఁ జూచి లక్ష్మణుని సీతనుం గూడి పరుండెను. ౧౪

లక్ష్మణుఁడు! రాముఁడు భార్యతోఁగూడఁజక్కఁగా నిద్రపోవుట జూచి సుమంత్రునికి రామునిసద్గుణంబుల నన్నిటిని వర్ణించి చెప్పెను. ౧౫

లక్ష్మణుఁడు సుమంత్రునకు రాముని సద్గుణంబులఁ జెప్పుచు నిట్లా రాత్రియంతయుం మేలుకొనియుండఁగానే సూర్యుఁ డుదయించెను. ౧౬

రాముఁడు తనవెంట వచ్చిన పట్టణవాసిజనులతోఁ గూడ గోసమూహంబుల నిండియుండు తమసానదీతీరంబునకు సమీపమున నారాత్రియంతయు నుండెను. ౧౭

మహాతేజుఁడగు రాముఁడు నిద్రలేచి యాజనులం గూడి మంగళకర లక్షణంబులతో నొప్పుచునుండు తమ్ముని లక్ష్మణుం జూచి యిట్లని చెప్పెను. ౧౮

లక్ష్మణుఁడా! మనయం దుండు నపేక్షవలన నిండ్లయందు నపేక్ష విడిచి యీచెట్లక్రిందఁ బరుండి నిద్రించిన జనులం జూడుము. ౧౯

ఈపౌరులు మనలను మరల నయోధ్యకు రమ్మని నిర్బంధించుటం జూడఁగా "వీరలు తమప్రాణంబుల నైనను విడుతురుగాని యిట్లు నిర్బంధించుట నెంతమాత్రము విడువరు" అని తోఁచుచున్నది. ౨౦

వీరలు నిద్రమేలుకొనుటను మునుపే మనము శీఘ్రముగా రథంబు నెక్కి నిర్భయంబుగాఁ బోవుదము. ౨౧

మన మిట్లు సేయుదమేని నాయం దనురాగముగల యీయయోధ్యా పురవాసు లిట్లింకమీఁద జెట్లక్రిందఁ బడి నిద్రింపకుందురు. ౨౨

పౌరా హ్యాత్మకృతా ద్దుఃఖా ద్విప్రమోచ్యా నృపాత్మజైః,
నతు ఖల్వాత్మనా యోజ్యా దుఃఖేన పురవాసినః. ౨3

అబ్రవీ ల్లక్ష్మణో రామం సాక్షా ద్ధర్మమివ స్థితమ్,
రోచతే మే తథా ప్రాజ్ఞ! క్షిప్ర మారుహ్యతా మితి. ౨౪

అథ రామోఽబ్రవీ చ్ఛ్రీమా న్సుమన్త్రం యుజ్యతాం రథః,
గమిష్యామి తతోఽరణ్యం గచ్ఛ శీఘ్ర మితః ప్రభో!. ౨౫

సూత స్తత స్సంత్వరిత స్స్యన్దనం తై ర్హయోత్తమైః,
యోజయిత్వాఽథ రామాయ ప్రాఞ్జలిః ప్రత్యవేదయత్. ౨౬

అయం యుక్తో మహాబాహో! రథ స్తే రథినాం వర!,
త్వ మారోహస్వ భద్రం తే ససీత స్సహలక్ష్మణః. ౨౭

తం స్యన్దన మధిష్ఠాయ రాఘవ స్సపరిచ్ఛదః,
శీఘ్రగా మాకులావర్తాం తమసా మతరన్నదీమ్. ౨౮
స సంతీర్య మహాబాహుః శ్రీమా ఞ్ఛివ మకణ్టకమ్,
ప్రాపద్యత మహామార్గ మభయం భయదర్శినామ్. ౨౯

మోహనార్థం తు పౌరాణాం సూతం రామోఽబ్రవీ ద్వచః,

రాచకొమరులు తమవలనఁ బట్టణవాసిజనులకు దుఃఖంబు గలుగు నప్పుడు దాని నెట్టియినం బోఁగొట్టవలసినది. తామే తమపట్టణంబుననుండు జనులకు దుఃఖము గలుగఁజేయరాదు గదా! అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౨౩

అంత లక్ష్మణుఁడు సాక్షాద్ధర్మస్వరూపుఁడైన రాముని జూచి "నీవు ప్రాజ్ఞుఁడవు. నాకు నదియే సమ్మతముగా నున్నది. శీఘ్రంబుగా రథంబు నెక్కుము" అని చెప్పెను. ౨౪

అంత శ్రీమంతుఁడగు రాముఁడు సుమంత్రుం జూచి "సమర్థుఁడవగు సుమంత్రుఁడా! నీవు రథం బాయితంబు సేయుము. నేను రథంబు నెక్కి యడవికిఁ బోయెదను. శీఘ్రముగాఁ బొమ్ము." అని చెప్పెను. ౨౫

అంత సారథియగు నాసుమంత్రుఁడు శీఘ్రంబున రథంబున కుత్తమంబులయిన యాగుఱ్ఱంబులం గట్టి చేతులు మొగిడ్చుకొని రథం బాయితం బయినదని రామునకుం దెలిపెను. ౨౬

రథికులలో నుత్తముఁడవు మహాబాహుఁడవు నగు రాముఁడా! ఇదిగో రథంబు సిద్ధమయినది. నీకు మంగళము గలుగుఁగాక! నీవు సీతను లక్ష్మణునిఁ గూడి రథంబు నారోహింపుము. అని సుమంత్రుఁడు రామునితోఁ జెప్పెను. ౨౭

రాముఁడు ధనుఃఖడ్గకవచాదిపరికరములతో నారథంబు నెక్కి వడిగాఁ బాఱునదియు నధికముగా సుడులుగలదియు నగు తమసానదిని దాఁటెను.

మహాబాహుఁడును శ్రీమంతుఁడు నగు రాముఁడు తమసానదిని దాఁటి రథము లవ్వలిగట్టుసమీపముం జేరఁగానే డిగ్గి మంగళకరంబును ముండ్లు లేనిదియును భీరువులకును భయము లేకుండునదియు నగు పెద్దదారిం బొందెను. ౨౮

రాముఁడు తనవెంట వచ్చిన పట్టణవాసిజనుల మోసపుచ్చుటకై సుమంత్రుం జూచి యిట్లని చెప్పెను.

ఉదఙ్ముఖః ప్రయాహి త్వం రథ మాస్థాయ సారథే. 30
ముహూర్తం త్వరితం గత్వా నివర్తయ రథం పునః,
యథా న విద్యుః పౌరా మాం తథా కురు సమాహితః. 31

రామస్య వచనం శ్రుత్వా తథా చక్రే స సారథిః,
ప్రత్యాగమ్య చ రామస్య స్యన్దనం ప్రత్యవేదయత్. 32
తౌ సమ్ప్రయుక్తం తు రథం సమాస్థితౌ
తదా ససీతౌ రఘువంశవర్ధనౌ,
ప్రచోదయామాస తత స్తురంగమా
న్స సారథి ర్యేన పథా తపోవనమ్. 33
తత స్సమాస్థాయ రథం మహారథ
స్ససారథి ర్దాశరథి ర్వనం యయౌ,
ఉదఙ్ముఖం తం తు రథం చకార స
ప్రయాణమాఙ్గల్యనిమిత్తదర్శనాత్. 34
ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే షట్చత్వారింశస్సర్గః.

## సప్తచత్వారింశస్సర్గః

ప్రభాతాయాం తు శర్వర్యాం పౌరాస్తే రాఘవం వినా,
శోకోపహతనిశ్చేష్టా బభూవు ర్హతచేతసః. 1
శోకజాశ్రుపరిద్యూనా వీక్షమాణా స్తత స్తతః,
ఆలోక మపి రామస్య న పశ్యన్తి స్మ దుఃఖితాః. 2

సుమంత్రుఁడా! నీవుమాత్రము రథంబు నెక్కి కొంచెము సేపు ఉత్తరపు దిక్కును బట్టి పొమ్ము. అట్లు సేయుదు వేని ఈ పౌరు లందఱు "నే నయోధ్యకే పోతిని" అని తలంచుకొందురు. నీ వట్లు శీఘ్రముగాఁ గొంచెము దూరము పోయి మరల రథంబును మరల్చుకొని వేఱుమార్గంబున రమ్ము. ఈ ప్రకారము చేసినపక్షమునఁ బౌరజనులకు మనము వనంబునకుఁ బోవుట తెలియకుండును. ఎచ్చరికగలవాఁడవై నేను జెప్పినట్లు సేయుము. అని రాముఁడు సుమంత్రునకుఁ జెప్పెను. ౩౦,౩౧

సుమంత్రుఁడు రామునిమాటను విని యాప్రకారముచేసి మరల వచ్చి రామునకు రథంబు సమర్పించెను. ౩౨

అంత రఘువంశమును వృద్ధిఁ బొందించునట్టి యారామలక్ష్మణులును సీతయుఁను మువ్వురును రథంబు నెక్కిరి. పిమ్మట సుమంత్రుఁడు తపోవనంబునకుం బోవుమార్గంబుఁ బట్టి గుఱ్ఱంబులం దోలెను. ౩౩

ఆసుమంత్రుఁడు ప్రయాణకాలంబున మంగళసూచనార్థమయి కొంచె ముత్తరపుమొగముగా రథంబుఁ బోనిచ్చెను. అంతఁ దన్ను సారథిని గుఱ్ఱములనుం గాపాడుకొనుచుఁ బదునొకండువేలమంది విలుకాండ్రతోఁ బోరంజాలునట్టి రాముఁడు సారథింగూడి రథంబునెక్కి యడవికింబోయెను.

ఇది నలువదాఱవసర్గము.

---

## నలువదేడవ సర్గము

తెల్లవాఱఁగానే ఆపౌరు లందఱు రామునిం గానక మహాదుఃఖంబు నొంది చేష్టను దక్కి మూర్ఛనొందిరి. ౧

అంత నాపౌరుల్లు మహాదుఃఖంబునఁ గన్నీటం దోఁగుచు నలుగడలం జూచుచు రామునిరథపరాగంబు నైనను జూడఁజాలరైరి. ౨

తే విషాదార్తవదనా రహితా స్తేన ధీమతా,
కృపణాః కరుణా వాచో వదన్తి స్మ మనస్వినః. ౩

ధిగస్తు ఖలు నిద్రాం తాం యయాఽపహృతచేతసః,
నాద్య పశ్యామహే రామం పృథూరస్కం మహాభుజమ్. ౪

కథం నామ మహాబాహు స్స తథాఽవితథక్రియః,
భక్తం జనం పరిత్యజ్య ప్రవాసం రాఘవో గతః. ౫

యో న స్సదా పాలయతి పితా పుత్త్రా నివౌరసాన్,
కథం రఘూణాం స శ్రేష్ఠ స్త్యక్త్వా నో విపినం గతః. ౬

ఇహైవ నిధనం యామో మహాప్రస్థాన మేవ వా,
రామేణ రహితానాం హి కిమర్థం జీవితం హి నః. ౭

సన్తి శుష్కాణి కాష్ఠాని ప్రభూతాని మహాన్తి చ,
తైః ప్రజ్వాల్య చితాం సర్వే ప్రవిశామోఽథ పావకమ్. ౮
కిం వక్ష్యామో మహాబాహు రనసూయః ప్రియంవదః,
నీత స్స రాఘవోఽస్మాభి రితి వక్తుం కథం క్షమమ్. ౯

సా నూనం నగరీ దీనా దృష్ట్వాఽస్మా న్రాఘవం వినా,
భవిష్యతి నిరానన్దా సస్త్రీబాలవయోధికా. ౧౦

నిర్యాతా స్తేన వీరేణ సహ నిత్యం జితాత్మనా,

బుద్ధిమంతుఁ డగు నారాముఁడు విడిచిపోవుటంజేసి రామునం దధిక మయిన యనురాగముగల యాపౌరులు దుఃఖంబున ముఖంబులు వెలవెలఁబోవ దీనులయి దీనస్వరంబున నిట్లని రోదనంబు చేసిరి. ౩

మేము నిద్రపోవుటవలనఁ గదా యిప్పుడు విశాలంబగు ఱొమ్ముగల వాఁడును మహాబాహుండు నగు రాముం జూడఁజాలకున్నాము. అట్టిదుష్ట నిద్ర దహింపఁబడుఁగాక. ౪

మహాబాహుఁడగు రాముఁ డెప్పుడును భక్తులవంచించువాఁడు కాఁడు. అట్టిమహాదయాశాలి యిప్పుడు భక్తులమయిన మమ్ముం బరిత్యజించి యడవి కెట్లు పోయినాఁడు? ౫

తండ్రి తనయౌరసపుత్త్రులం గాపాడుకొనునట్లు మమ్ముల నెల్లప్పుడుం గాపాడునట్టి రఘూత్తముఁ డగు రాముఁ డిప్పుడు మమ్ము విడిచి యరణ్యంబు నకుఁ బోయినాఁడేమి? ౬

మేము ప్రాయోపవేశము చేసిగాని మరణదీక్షాపూర్వకముగా నుత్తర దిశం బట్టి పోయిగాని ప్రాణంబులు విడిచెదము. రాముని విడిచి యింక మాకు బ్రతు కేటికి? ౭

పెద్దయెండినకొయ్య లధికముగా నున్నవి. వానితోఁ జితి పేర్చుకొని వెలిఁగించి మే మందఱము నగ్నిహోత్రముఁ బ్రవేశించెదము. ౮

ఇంక నయోధ్యలో రాముని వృత్తాంతము నడుగుజనులకు మే మేమి చెప్పఁగలము? మహాబాహుఁడు ననసూయలేనివాఁడును బ్రియవాదియు నగు రాము నడవిలో వదలిపెట్టి వచ్చినాము అని చెప్పవలయుం. ఈప్రకార మెట్లు చెప్పవచ్చును? ౯

రాముఁడు లేక మేముమాత్రము వచ్చుటం జూచి యయోధ్యలోని జనులు స్త్రీలును బాలురును ముదుసలులును అందఱు పరమదుఃఖంబునొంది నిరానందులు కాఁగలరు. ఇది నిశ్చయము! ౧౦

మే మెల్లప్పుడును మనోనిగ్రహంబు గలిగియుండునట్టి వీరుఁడగు రామునితోఁ గూడ నయోధ్యనుండి వెడలినాము. ఇప్పు డట్టిరాముని విడిచి

విహీనాస్తేన చ పునః కథం పశ్యామ తాం పురీమ్. ౧౧

ఇతీవ బహుధా వాచో బాహు ముద్యమ్య తే జనాః,
విలపన్తి స్మ దుఃఖార్తా వివత్సా ఇవ ధేనవః. ౧౨

తతో మార్గానుసారేణ గత్వా కిఞ్చిత్క్షణం పునః,
మార్గనాశా ద్విషాదేన మహతా సమభిప్లుతాః. ౧౩
రథస్య మార్గనాశేన న్యవర్తన్త మనస్వినః,
కిమిదం కిఙ్కరిష్యామో దైవే నోపహతా ఇతి. ౧౪

తతో యథాగతే నైవ మార్గేణ క్లాన్తచేతసః,
అయోధ్యా మగమ న్సర్వే పురీం వ్యథితసజ్జనామ్. ౧౫

ఆలోక్య నగరీం తాం చ క్షయవ్యాకులమానసాః,
అవర్తయన్త తేఽశ్రూణి నయనైః శోకపీడితైః. ౧౬
ఏషా రామేణ నగరీ రహితా నాతిశోభతే,
ఆపగా గరుడేనేవ హ్రదా దుద్ధృతపన్నగా. ౧౭

చన్ద్రహీన మివాకాశం తోయహీన మివార్ణవమ్,
అపశ్యన్నిహతానన్దం నగరం తే విచేతసః. ౧౮

తే తాని వేశ్మాని మహాధనాని
దుఃఖేన దుఃఖోపహతా విశన్తః,

మే మెట్లు మరల నయోధ్యం జూతుము? అని యాపౌరులు రోదనంబు చేసిరి. ౧౧

ఆపౌరజనులు దూడలం బాసినగోవులభంగి మహాదుఃఖంబు నొంది చేతులం బైకెత్తి యీప్రకారముగా నానావిధంబులగు వాక్యంబుల రోదనంబు చేసిరి. ౧౨

అంత నాపౌరులు రథంబు పోయినజాడం బట్టి కొంచెముదూరంబు పోయి యంత మార్గం బగపడకుండుటవలన మహాదుఃఖంబు నొందిరి. ౧౩

మంచిమనసుగల యాపౌరులు రథంబుజాడయుంచు గానరామిం జేసి 'ఇది యేమి? ఇంక నేమి సేయంగలము? దైవమే యిట్లు విరోధించియున్నదే!' అని మరలి వచ్చిరి. ౧౪

అంత నాపౌరులందఱు మనంబున దుఃఖంబు గదురం దాము వచ్చిన దారినే పట్టి దుఃఖితులయిన సత్పురుషులతోం గూడిన యయోధ్యాపట్టణంబు నకుం బోయిరి. ౧౫

ఆపౌరులు అయోధ్యాపట్టణంబుం జూచి తమయిండ్లకుం బోవుటకును మనసు లేక పరమదుఃఖంబునం గన్నీళ్లు విడిచిరి. ౧౬

రాముఁడు లేకుండుటం జేసి యీయయోధ్యాపట్టణంబు గరుత్మంతుఁడు మడుగుననుండి మహాసర్పంబు నెత్తినవిమ్మట భయంకరత దక్కియున్నదివలె శత్రువులకు సుఖసాధ్యముగా నున్నది. అని చెప్పుచుఁ బౌరులు కన్నీళ్లు విడిచిరి. ౧౭

అప్పుడు రాముడు లేకుండుటం జేసి యానందములేకున్న యాపట్టణముపరమదుఃఖితులగు నాపౌరులకుఁ జంద్రుఁడు లేనిరాత్రియందలి యాకాశంబుపగిది నీళ్లులేని సముద్రంబుచాడ్పునను జూపట్టుచుండెను. ౧౮

ఎంతమాత్రము సంతోషంబు లేని యాపౌరులు, ఎల్లలేని మహా దుఃఖంబున నధికధనముతోఁ గూడిన తమయిండ్లను బ్రవేశించుచుఁ బరమ

నైవ ప్రజజ్ఞుస్స్వజనం జనం వా
నిరీక్షమాణాః ప్రవినష్టహర్షాః. ౧౯

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే సప్తచత్వారింశస్సర్గః.

---

## అష్టచత్వారింశస్సర్గః

తేషామేవం విషణ్ణానాం పీడితానామతీవ చ,
బాష్పవిప్లుతనేత్రాణాం సశోకానాం ముమూర్షయా. ౧
అనుగమ్య నివృత్తానాం రామం నగరవాసినామ్,
ఉద్గతానీవ సత్త్వాని బభూవు రమనస్వినామ్. ౨
స్వం స్వం నిలయ మాగమ్య పుత్త్రదారైస్సమావృతాః,
అశ్రూణి ముముచుస్సర్వే బాష్పేణ పిహితాననాః. 3
న చాహృష్యన్న చామోదన్వణిజో న ప్రసారయన్,
న చాశోభన్త పుణ్యాని నాపచన్ గృహమేధినః. ४

నష్టం దృష్ట్వా నాభ్యనన్దన్విపులం వా ధనాగమమ్,

పుత్త్రం ప్రథమజం లబ్ధ్వా జననీ నాభ్యనన్దత. ౫

గృహే గృహే రుదన్త్యశ్చ భర్తారం గృహ మాగతమ్,
వ్యగర్హయన్త దుఃఖార్తా వాగ్భిస్తోత్త్రైరివ ద్విపాన్. ౬

కిం ను తేషాం గృహైః కార్యం కిం దారైః కిం ధనేన వా,
పుత్త్రైర్వా కిం సుఖైర్వాపి యే న పశ్యన్తి రాఘవమ్. ౭

దుఃఖితులు కావునఁ దమయెదుట నున్నవారలనుం గూడ స్వజనమో యితర జనమో తెలియఁజాలరైరి. ౧౯

ఇది నలుబదియేడవసర్గము.

---

## నలుబదియెనిమిదవసర్గము

ఆ ట్లాపౌరులు రాముని వెంబడించి మరలివచ్చి దుఃఖితులయి పరమ పీడితులయి నేత్రంబులనుండి కన్నీళులు గాఱ ముమూర్షతోఁ గూడినవారలై ధైర్యంబు విడిచి మూర్ఛ నొందిరి. ౧,౨

అంత నాపౌరులు తమతమ గృహంబులకుం బోయి కొడుకులను భార్యలనుం గూడి ముఖంబునిండఁ గన్నీళ్లు గాఱ దుఃఖించిరి. ౩

ఆపౌరులు స్నేహితులు మొదలగువారలం జూచినను సంతోషింపకుండిరి. అపూర్వవస్తువు లభించినను అభినందింపరైరి. వర్తకులు అంగళ్లు పెట్టరైరి. ఎవ్వరును అగ్నిహోత్రాదిపుణ్యకార్యంబులం జేయరైరి. గృహస్థులు వండుకొనకుండిరి. ౪

ఆపౌరులు చిరకాలముగా నగపడకుండిన రత్నాదులు మరల నగపడినను అధికముగా ధనంబు లభించినను సంతోషింపకుండిరి.

దశరథుని మొదటికొడుకైన రాముని కీగతి సంభవించిన దని మొదటి కొడుకు దగ్గఱకు వచ్చినప్పుడు తల్లి సంతోషింపకుండినది. ౫

ఇంటింటను స్త్రీలు పరమదుఃఖితులయి రోదనంబుసేయుచు నంకుశంబులచే నేనుఁగులం బొడుచునట్లు ఇండ్లకు వచ్చిన పెనిమిటులను కఠిన వాక్యంబుల నిందించిరి. ౬

రామునిం జూచుటకు లేకపోయిన దే; ఇంక మీకు ఇండ్లచేతఁ గాని భార్యలచేతఁగాని ధనముచేతఁగాని కొడుకులచేతఁగాని సుఖంబులచేతఁగాని యేమి ప్రయోజనము? ౭

ఏక స్సత్పురుషో లోకే లక్ష్మణ స్సహ సీతయా,
యోఽనుగచ్ఛతి కాకుత్స్థం రామం పరిచరన్వనే. ౮
ఆపగాః కృతపుణ్యా స్తాః పద్మిన్య శ్చ సరాంసి చ,
యేషు స్నాస్యతి కాకుత్స్థో విగాహ్య సలిలం శుచి. ౯

శోభయిష్యన్తి కాకుత్స్థ మటవ్యో రమ్యకాననాః,
ఆపగాశ్చ మహానూపా స్సానుమన్త శ్చ పర్వతాః. ౧౦

కాననం వాపి శైలం వా యం రామోఽధిగమిష్యతి,
ప్రియాతిథి మివ ప్రాప్తం నైనం శక్ష్య న్త్యనర్చితుమ్. ౧౧

విచిత్రకుసుమాపీడా బహుమఞ్జరిధారిణః,
రాఘవం దర్శయిష్యన్తి నగా భ్రమరశాలినః. ౧౨

అకాలే చాపి ముఖ్యాని పుష్పాణి చ ఫలాని చ,
దర్శయిష్య న్త్యనుక్రోశా ద్గిరయో రామ మాగతమ్. ౧౩

ప్రస్రవిష్యన్తి తోయాని విమలాని మహీధరాః,
విదర్శయన్తో వివిధా న్భూయ శ్చిత్రాం శ్చ నిర్ఝరాన్. ౧౪

పాదపాః పర్వతాగ్రేషు రమయిష్యన్తి రాఘవమ్,

యత్ర రామో భయం నాత్ర నాస్తి తత్ర పరాభవః. ౧౫
స హి శూరో మహాబాహుః పుత్త్రో దశరథస్య చ,

వనంబున సీతాసహితుఁడగురామునకుఁ బరిచర్యసేయుటకై యతనివెంబ డించి పోయిన లక్ష్మణుఁ డొక్కఁడే ప్రపంచమం దంతయు సత్పురుషుఁడు. ౮

వనంబునఁ రాముఁడు ఏయే నదులయందును దామరకొలఁకులందును సాధారణంబులగు కొలఁకులందును దిగి స్నానము సేయునో అవన్నియుఁగూడఁ బుణ్యంబుగలవి. ౯

మనోహరంబులగు వృక్షంబులుగల యడవులును, గొప్పజలప్రాయప్రదేశంబులుగల నదులును, గొప్ప నెత్తములుగల పర్వతంబులును రామునకు సంతోషంబు సేయుచుండును. ౧౦

రాముఁడు అడవికిఁగాని పర్వతమునకుఁ గాని యెచ్చటికిఁ బోయినను అవి తమయొద్దకుఁ బ్రియాతిథియుంబోలె వచ్చిన యారాముని బూజింప కుండఁజాలవు. ౧౧

శిఖరంబుల నానావిధపుష్పంబులు గలవియుఁ బెక్కు ఫలగుత్తుల నొప్పుచుండునవియుఁ దుమ్మెదలతో నిండియుండునవియు నగు వృక్షంబులు రామునిమనంబునకు సంతోషంబు సేయఁగలవు. ౧౨

పర్వతంబులు రామునందలి దయచే నకాలంబునందును మంచిపుష్పంబులను ఫలంబులను రామునకుఁ జూపి సంతోషంబు సేయఁగలవు. ౧౩

పర్వతంబులు రామునకుఁ గావలసినప్పు డంతయు నానావిధము లయిన సెలయేఱులం జూపి స్వచ్ఛములగు జలంబుల నొసంగఁగలవు. ౧౪

పర్వతశిఖరంబులందు వృక్షంబులు రామునకు సంతోషంబు గల్గునట్లు సేయుచుండును.

రాముఁడు శూరుఁడు మహాబాహుఁడు శూరుఁడగు దశరథమహారాజుకొడుకుగదా! అట్టిరాముఁ డుండుచోట మనకు భయంబుగాని యవమానంబుగాని యెంతమాత్రమును గలుగదు. ౧౫

పురా భవతి నో దూరా దనుగచ్ఛామ రాఘవమ్. ౧౬

పాదచ్ఛాయా సుఖా భర్తు స్తాదృశస్య మహాత్మనః,
స హి నాథో జనస్యాస్య స గతి స్స పరాయణమ్. ౧౭

వయం పరిచరిష్యామ స్సీతాం యూయం తు రాఘవమ్,
ఇతి పౌరస్త్రియో భర్తౄం దుఃఖార్తా స్తత్త దబ్రువన్. ౧౮
యుష్మాకం రాఘవోఽరణ్యే యోగక్షేమం విధాస్యతి,
సీతా నారీజనస్యాస్య యోగక్షేమం కరిష్యతి. ౧౯
కో న్వనే నాప్రతీతేన సోత్కణ్ఠితజనేన చ,
సంప్రీయేతామనోజ్ఞేన వాసేన హృతచేతసా. ౨౦

కైకేయ్యా యది చే ద్రాజ్యం స్యా దధర్మ్య మనాథవత్,
నహి నో జీవితే నార్థః కుతః పుత్త్రైః కుతో ధనైః. ౨౧

యయా పుత్త్రశ్చ భర్తా చ త్యక్తా వైశ్వర్యకారణాత్,
కం సా పరిహరే దన్యం కైకేయీ కులపాంసనీ. ౨౨

కైకేయ్యా న వయం రాజ్యే భృతకా నివసేమ హి,
జీవన్త్యా జాతు జీవ న్త్యః పుత్త్రై రపి శపామహే. ౨౩

యా పుత్త్రం పార్థివేన్ద్రస్య ప్రవాసయతి నిర్ఘృణా,
క స్తాం ప్రాప్య సుఖం జీవే దధర్మ్యాం దుష్టచారిణీమ్. ౨౪

ఉపద్రుత మిదం సర్వ మనాలమ్బ మనాయకమ్,

ఇంక నాలస్యము చేయుందుమేని రాముఁడు మఱియుం దూరముగాఁ బోవును. కావున నిప్పుడె రామునొద్దకుఁ బోవుదము. ౧౬

అట్టిమహాత్ముఁడగు రాముని పాదసేవయే మనకు సుఖకరము. అతఁడె మనకుఁ బ్రభుఁడును గతియును బరమగతియును. ౧౭

మేము సీతకుఁబరిచర్య చేసెదము. మీరు రామునకుఁబరిచర్య చేయుఁడు. అడవియందు రాముఁడు మీయోగక్షేమంబులం జేయును. మాకు సీతాదేవి యోగక్షేమంబులం జేయును. ఈప్రకారముగా నాపట్టణంబునందలి స్త్రీలు పరమదుఃఖితలయి భర్తలతో నయ్యోమాటలం జెప్పిరి. ౧౮, ౧౯

ఆరాముఁడు లేకుండుటచే నప్రశస్తంబును దుఃఖితజనులతోఁ గూడి నదియు రమ్యంబు కానిదియును మనంబునకుఁ జాలదుఃఖంబు గలిగించు నదియు నగు నీయయోధ్యయం దింక నెవ్వఁ డుండును? ౨౦

ఈరాజ్యంబు అధర్మంబున అనాథయుంబోలెఁ గైకేయిదగునేని మాకుఁ బ్రాణంబులపైననుంగూడ నాసలేదు. ఇంకఁ గొడుకులును ధనంబులు నెందుకు? ౨౧

కైకేయి యైశ్వర్యంబుకొఱకై కొడుకైన రాముని జెనిమిటియయిన దశరథునిం బరిత్యజించినదే. అట్టికులపాంసనియగు కైకేయియింక నెవ్వనిఁ బరిత్యజింపక విడుచును! ౨౨

కైకేయిరాజ్యంబునందు ఆబిడ బ్రతికియుండఁగా మేము బ్రతికియుండునంతవఱకును భృత్యులుం బోలె నెంతమాత్రము నివసించియుండము. మాకొడుకులచే శపథము చేయుచున్నాము. ౨౩

ఎంతమాత్రమును దయలేక రాజశ్రేష్ఠుఁడగు దశరథునికొడుకయిన రాము నరణ్యంబునకుఁ బంపుచున్నదే. అట్టియధార్మికురాలును దుష్టురాలు నగు కైకేయియొద్ద నెవ్వఁడు సుఖంబుగా జీవింపఁగలఁడు? ౨౪

ఈరాజ్యం బాతయు నాధారంబు లేక నాయకుఁడు లేనిదై యుంప

కైకేయ్యా హి కృతే సర్వం వినాశ ముపయాస్యతి. ౨౫

నహి ప్రవ్రజితే రామే జీవిష్యతి మహీపతిః,
మృతే దశరథే వ్యక్తం విలాప స్తదన న్తరమ్. ౨౬
తే విషం పిబతాఽలోడ్య క్షీణపుణ్యా స్సుదుర్గతాః,
రాఘవం వాఽనుగచ్ఛధ్వ మశ్రుతిం వాఽపి గచ్ఛత. ౨౭

మిథ్యా ప్రవ్రాజితో రామ స్ససీత స్సహాలక్ష్మణః,
భరతే సన్నిసృష్టా స్స్మ సౌనికే పశవో యథా. ౨౮

పూర్ణచన్ద్రానన శ్శ్యామో గూఢజత్రు రరిన్దమః,
ఆజానుబాహుః పద్మాక్షో రామో లక్ష్మణపూర్వజః. ౨౯
పూర్వాభిభాషీ మధుర స్సత్యవాదీ మహాబలః,
సౌమ్య స్సర్వస్య లోకస్య చన్ద్రవ త్ప్రియదర్శనః. 3౦
నూనం పురుషశార్దూలో మత్తమాతఙ్గవిక్రమః,
శోభయిష్యత్యరణ్యాని విచరన్ స మహారథః. 3౧

తా స్తథా విలప న్త్యస్తు నగరే నాగర స్త్రియః,
చుక్రుశు ర్దుఃఖస న్తప్తా మృత్యో రివ భయాగమే. 3౨
ఇత్యేవం విలప న్తీనాం స్త్రీణాం వేశ్మసు రాఘవమ్,
జగామాస్తం దినకరో రజనీ చాభ్యవ ర్తత. 33

ద్రవంబు నొందియున్నది. ఒక్క కైకేయినిమిత్తము యీరాజ్యమంతయును నశించుట కున్నది. ౨౫

రాముఁ డడవికిఁ బోయినపిమ్మట దశరథుఁడు జీవింపఁడు. దశరథుఁడు చచ్చినపిమ్మట నెచ్చుగా రోదనంబు గలుగునని చెప్పనక్కఱలేదు. ౨౬

మీరలు పుణ్యములేనివారలు. మిక్కిలియుం దరిద్రులు. చక్కఁగా విచారించి విషమునైన ద్రావుఁడు. రామునైనను వెంబడింపుఁడు. లేక ఎచ్చటికిఁబోయినచో మీ పేరుంగూడ వినఁబడకుండునో అట్టిదూరదేశమునకైనను బాఱిపోండు. ౨౭

దశరథుఁడు, రాముని సీతను లక్ష్మణుని గపటంబుగా నరణ్యంబునకుఁ బంపి మనలను బశువులం గసాయివానియొద్ద నుంచునట్లు, భరతునియొద్దనుంచి నాఁడు కాఁబోలు. ౨౮

నిండుచందురుఁడువలె సుందరంబయిన ముఖంబుగలవాఁడును నీలవర్ణుఁడును మాంసంబున నణఁగియున్నమూఁపులసంధియెముకలుగలవాఁడును శత్రువుల నడంగఁద్రొక్కం జాలినవాఁడును మ్రోఁకాళ్లవఱకు దీర్ఘములయిన బాహువులుగలవాఁడును గమలంబులుంబోలె విశాలసుందరంబులయిన నేత్రంబులుగలవాఁడును ఎవ్వరైన సంధిల్లినప్పుడుముందుగాఁ దానే మాటలాడి వారలకు సంతోషంబుసేయువాఁడును మనోహరుఁడును మహాబలశాలియును శాంతుఁడును జంద్రుఁడుంబోలె సమస్తభూతంబులకును దర్శనమాత్రంబున నానందంబు గలిగించువాఁడును బురుషశ్రేష్ఠుఁడును మత్తగజంబునకుంబోలెఁ బరాక్రమంబు గలవాఁడును దన్నును సారథిని గుఱ్ఱంబులనుం గాపాడుకొనుచుఁ బదునొకండువేలమంది విలుకాండ్రతోఁ బోరంజాలినవాఁడును లక్ష్మణాగ్రజుఁడునగు రాముండు విహరించుటచే నరణ్యంబులన్నియుఁ బ్రకాశించుచుండఁగలవు. అని స్త్రీలు రోదనంబు చేసిరి. ౨౯-౩౧

అయోధ్యాపట్టణమునందు ఆపౌరస్త్రీలు ఆప్రకారమున విలపించుచుఁ బరమదుఃఖితలయి మరణసమయంబునందుంబోలె గట్టిగా నఱచిరి. ౩౨

ఈప్రకారముగా నాస్త్రీలు గృహంబులందు రాముని గూర్చి విలపించుచుండఁగానే సూర్యుఁ డస్తమించెను. అంత రాత్రియయినది. ౩౩

నష్టజ్వలనసంపాతా ప్రశాన్తాధ్యాయసత్కథా,
తిమిరేణాభిలిప్తేవ సా తదా నగరీ బభౌ. 34

ఉపశాన్తవణిక్పణ్యా నష్టహర్షా నిరాశ్రయా,
అయోధ్యా నగరీ చాసీ న్నష్టతారమివామ్బరమ్. 35

తథా స్త్రియో రామనిమిత్త మాతురా
యథా సుతే భ్రాతరి వా వివాసితే,
విలప్య దీనా రురుదు ర్విచేతస
స్సుతై ర్హి తాసా మధికో హి సోఽభవత్. 36
ప్రశాన్తగీతోత్సవనృత్తవాదనా
వ్యపాస్తహర్షా పిహితాపణోదయా,
తదా హ్యయోధ్యా నగరీ బభూవ సా
మహార్ణవ స్సంక్షపితోదకో యథా. 37
ఇతి శ్రీమదయోధ్యాకాణ్డేఽష్టచత్వారింశస్సర్గః.

## ఏకోనపఞ్చాశస్సర్గః.

రామోఽపి రాత్రిశేషేణ తే నైవ మహా దన్తరమ్,
జగామ పురుషవ్యాఘ్రః పితు రాజ్ఞా మనుస్మరన్. 1
తత్రైవ గచ్ఛత స్తస్య వ్యపాయా ద్రజనీ శివా,
ఉపాస్య స శివాం సన్ధ్యాం విషయా న్తం వ్యగాహత. 2

గ్రామా న్వికృష్టసీమాన్తా న్పుష్పితాని వనాని చ,
పశ్య న్నతియయా శీఘ్రం శనై రివ హయోత్తమైః. 3

అప్పుడు ఆహితాగ్ను లగ్నిహోత్రములం బ్రణయింపరైరి. బ్రాహ్మణులు వేదాధ్యయనములం గాని పురాణపాఠంబులం గాని చేయరైరి. కావున నాయయోధ్యాపట్టణ మంతయుం జీకట్లు క్రమ్మిన ట్లుండెను. ౩౪

అప్పు డాయయోధ్యయందు వర్తకు లంగళ్లు నుంచరైరి. ఎవ్వరికిని సంతోషమె కలుగకుండినది. రాముఁడు లేకుండుటంజేసి దిక్కే లేకుండినది. ఇట్లుండుటవలన నాయయోధ్య నక్షత్రములు లేని యాకాశమువలెఁ జూపట్టినది. ౩౫

తమకొడుకుగాని తోఁబుట్టువుగాని యరణ్యంబునకుఁ బోయినచో నెట్లు దుఃఖింతురో ఆప్రకారము ఈపౌరస్త్రీలు రామునినిమిత్తమయిదుఃఖితలయి దీనలయి రోదనంబుచేసిరి. ఆరాముఁడు వారలకుఁ గొడుకులకన్న నెక్కుడుగా నుండెను. ౩౬

అప్పు డాయయోధ్యయందుఁ బాటలు నుత్సవంబులు నాటలువాద్యవాదనంబులును నిలిచిపోయినవి. ఎవ్వరికిని సంతోషంబులేకుండినది. వర్తకులంగళ్లు మూసివేవేసిరి. ఇందువలన నాపట్టణము నీళ్లులేనిసముద్రంబుకరణిఁ గాంతిలేకుండినది. ౩౭

ఇది నలుపదియెనిమిదవసర్గము.

---

## నలువదితొమ్మిదవసర్గము

పురుషశ్రేష్ఠుఁడగు రాముఁడు తండ్రియాజ్ఞను స్మరించుచు సూర్యోదయమగుటకు మున్నే చాలదూరము పోయెను. ౧

రాముఁ డట్లు పోవుచుండఁగానే మంగళకరంబగు రాత్రి గడచినది. అంత రాముఁడు ప్రాతఃకాలసంధ్య నుపాసించి యుత్తరకోసలదేశముదక్షిణపుహద్దుఁ జేరెను. ౨

రాముఁడు విత్తనము చల్లుటకై చక్కఁగా దున్నఁబడియున్న నేలలుకల గ్రామంబులను బుష్పితంబులగు వనంబులనుం జూచుచుఁ బెద్దగ్రామంబు

శ్రుత్వా న్వాచో మనుష్యాణాం గ్రామసంవాసవాసినామ్,

రాజానం ధిగ్దశరథం కామస్య వశ మాస్థితమ్. ౪

హా నృశంసాఽద్య కైకేయీ పాపా పాపానుబన్ధినీ,

తీక్ష్ణా సమ్భిన్నమర్యాదా తీక్ష్ణకర్మణి వర్తతే. ౫
యా పుత్త్ర మీదృశం రాజ్ఞః ప్రవాసయతి ధార్మికమ్,
వనవాసే మహాప్రాజ్ఞం సానుక్రోశం జితేన్ద్రియమ్. ౬

కథంనామ మహాభాగా సీతా జనకనన్దినీ,
సదా సుఖేష్వభిరతా దుఃఖాన్యనుభవిష్యతి. ౭

అహో! దశరథో రాజా నిస్స్నేహః స్వసుతం ప్రియమ్,
ప్రజానా మనఘం రామం పరిత్యక్తు మిహేచ్ఛతి. ౮

ఏతా వాచో మనుష్యాణాం గ్రామసంవాసవాసినామ్,
శృణ్వ న్నతియయౌ వీరః కోసలా న్కోసలేశ్వరః. ౯

తతో వేదశ్రుతిం నామ శివవారివహాం నదీమ్,
ఉత్తీర్యాభిముఖః ప్రాయా దగస్త్యాధ్యుషితాం దిశమ్. ౧౦
గత్వా తు సుచిరం కాలం తత శ్శీతజలాం నదీమ్,
గోమతీం గోయుతానూపా మతర త్సాగరఙ్గమామ్. ౧౧

లందును చిన్నగ్రామంబులందును నివసించు జను లాడుకొనుమాటలు వినుచు శీఘ్రముంగానైనను గుఱ్ఱములవలన చాతుర్యముచేతను అచ్చటచ్చటికి విశేషములం జూచుటచేతను మెల్లఁగాఁ బోయినట్లై చాలదూరము పోయెను. 3

దశరథమహారాజు కేవలము మన్మథపరుఁడు. అతఁడు దహింపఁబడుఁ గాక. ౪

అయ్యో! కైకేయి యెంతక్రూరురాలు! ఎంతపాపాత్మురాలు! పాపము చేయుటయే యీబిడ సంకల్పము.

ధార్మికుఁడును మహాపండితుఁడును దయాశాలియును జితేంద్రియుఁడును నగు నిట్టిరాముని అరణ్యంబునకుఁ బంపుచున్నదే! ఈకైకేయి యెంత క్రూరురాలు! తన కులస్త్రీమర్యాద నతిక్రమించి యెంత క్రూరకార్యము చేసినది. ౫,౬

మహాభాగురాలును ఎల్లప్పుడును సుఖంబులనె యనుభవించుచుండినది యును జనకమహారాజుచే సుఖంబుననె పెంపఁబడినదియు నగు సీతాదేవి యింక నెట్లు వనంబున దుఃఖంబు లనుభవింపఁగలదు! ౭

అయ్యో! దశరథమహారా జెంత దయలేనివాఁడు! కొడుకనియైనను స్నేహంబుంచక తనకుఁ గొడుకును బ్రజల కందఱకును బ్రియుఁడును బాపరహితుఁడును నగు రాముని విడువఁగోరినాఁడే అని గ్రామంబులయందుజనులు చెప్పుకొనిరి. ౮

పరాక్రమశాలియుఁ గోసలదేశాధిపతియు నగురాముఁడు పెద్దగ్రామంబులను చిన్నగ్రామంబులనుండు జనులు చెప్పుకొనుచున్నయీమాటలను వినుచుఁ గోసలదేశంబు దాఁటిపోయెను. ౯

అంత నారాముఁడు మంచినీళ్ల నొప్పుచుండు వేదశ్రుతియను నదిని దాఁటి యగస్త్యుం డున్న దక్షిణపుదిక్కున కభిముఖుఁడై పోయెను. ౧౦

ఆరాముఁ డంత బహుదూరము పోయి మంచినీళ్లు గలదియు జలప్రాయసమీపప్రదేశంబుల నెచ్చుగా గోవులు గలదియు గంగాద్వారంబున సముద్రగామినియు నగు గోమతీనదిని దాఁటెను. ౧౧

గోమతీం చాప్యతిక్రమ్య రాఘవ శ్శీఘ్రగై ర్హయైః,
మయూరహంసాభిరుతాం తతార స్యన్దికాం నదీమ్. ౧౨

స మహీం మనునా రాజ్ఞా దత్తా మిక్ష్వాకవే పురా,
స్ఫీతాం రాష్ట్రావృతాం రామో వైదేహీ మన్వదర్శయత్. ౧౩

సూత ఇత్యేవ చాభాష్య సారథిం తమభీక్ష్ణశః,
హంసమత్తస్వర శ్శ్రీమా నువాచ పురుషర్షభః. ౧౪

కదాఽహం పున రాగమ్య సరయ్వాః పుష్పితే వనే,
మృగయాం పర్యటిష్యామి మాత్రా పిత్రా చ సఙ్గతః. ౧౫
రాజర్షీణాం హి లోకేఽస్మి న్రత్యర్థం మృగయా వనే,

కాలే వృతాం తాం మనుజై ర్ధన్వినా మభికాఙ్క్షితామ్. ౧౬
నాత్యర్థ మభికాఙ్క్షామి మృగయాం సరయూవనే,

రతి ర్హ్యేషాఽతులా లోకే రాజర్షిగణసమ్మతా. ౧౭

స త మధ్వాన మైక్ష్వాక స్సూతం మధురయా గిరా,
తం తమర్థ మభిప్రేత్య యయౌ వాక్యముదీరయన్. ౧౮

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే ఏకోనపఞ్చాశస్సర్గః.

రాముఁడు గుఱ్ఱములు వడిగాఁ బోవుటంజేసి శీఘ్రముగా గోమతీనదిం గూడ నతిక్రమించి మధురంబుగాఁ గూయుం మయూరంబుల హంసపక్షుల నొప్పుచుండు స్యందికానదిని దాఁటెను. ౧౨

ఆరాముఁడు మున్ను వైవస్వతమనువుచే నిక్ష్వాకువున కియ్యఁబడినదియుం నధికమయినదియుం నవాంతరరాష్ట్రములతోఁ గూడినదియుం నగు కోసల దేశమును సీతాదేవికిఁ జూపెను. ౧౩

మదించిన హంసపక్షిస్వరంబువంటిస్వరంబుగలవాఁడును శ్రీమంతుఁడును బురుషశ్రేష్ఠుఁడునగు రాముఁడు శీఘ్రంబుగా నాసుమంత్రుని "సారథీ!" అని పిలిచి యిట్లని చెప్పెను. ౧౪

నేనింక నెప్పుడు మరల వచ్చి తలిదండ్రులం గూడి పుష్పితంబగు సరయూవనంబునందు వేఁటాడుచు విహరింపఁగలను? ౧౫

అడవియందు వేఁటాడుట పరలోకమునందు సుఖప్రదంబు గాకపోయి నను రాజర్షు లగువారల కీలోకంబున మిక్కిలియుం సంతోషంబు గల్గించు చున్నది.

శ్రాద్ధాదికాలంబున మనుష్యులచే నపేక్షింపఁబడినదియుం విలుకాండ్రకు లక్ష్యవేధనాభ్యాసార్థమయి ముఖ్యముగాఁ గావలసినదియుం నగు నావేఁటను నేను స్వల్పముగానే గోరుదును. నిరంతరము గోరిన దోషముగాని కొంచెమయినచో దోషము లేదు. ౧౬

ఈవేఁట రాజర్షులకు సమ్మతమయినది. లోకంబునం దిట్టి క్రీడ మఱే దియుం లేదు. అని రాముఁడు సుమంత్రునితోఁ జెప్పెను. ౧౭

అట్లారాముఁ డాయావిషయంబుల నుద్దేశించి మధురవచనంబున సారథి యగు సుమంత్రునితోఁ జెప్పుచు నామార్గంబు నతిక్రమించెను. ౧౮

ఇది నలువదితొమ్మిదవసర్గము.

---

## పఞ్చాశస్సర్గః

విశాలా న్కోసలా న్రమ్యా న్యాత్వా లక్ష్మణపూర్వజః,
అయోధ్యాభిముఖో ధీమా న్ప్రాఞ్జలి ర్వాక్య మబ్రవీత్. ౧

ఆపృచ్ఛే త్వాం పురిశ్రేష్ఠే కాకుత్స్థ పరిపాలితే,
దైవతాని చ యాని త్వాం పాలయ న్త్యావస న్తి చ. ౨

నివృత్తవనవాస స్త్వా మనృణో జగతీపతేః,
పున ర్ద్రక్ష్యామి మాత్రా చ పిత్రా చ సహ సఙ్గతః. ౩

తతో రుధిరతామ్రాక్షో భుజ ముద్యమ్య దక్షిణమ్,
అశ్రుపూర్ణముఖో దీనోఽబ్రవీ జ్జానపదం జనమ్. ౪

అనుక్రోశో దయా చైవ యథార్హం మయి వః కృతః,
చిరం దుఃఖస్య పాపీయో గమ్యతా మర్థసిద్ధయే. ౫

తేఽభివాద్య మహాత్మానం కృత్వా చాపి ప్రదక్షిణమ్,
విలపన్తో నరా ఘోరం వ్యతిష్ఠన్త క్వచి త్క్వచిత్. ౬

తథా విలపతాం తేషా మతృప్తానాం చ రాఘవః,
అచక్షుర్విషయం ప్రాయా ద్యథాఽర్కః క్షణదాముఖే. ౭

## ఏఁబదవ సర్గము

బుద్ధిమంతుఁడును లక్ష్మణుని కన్నయుం నగు రాముఁడు విశాలంబును రమ్యంబు నగు కోసలదేశము నతిక్రమించి యయోధ్యతట్టు తిరిగి చేమోడ్పు గీలించి యిట్లని చెప్పెను. ౧

కకుత్స్థవంశమునం బుట్టిన రాజులచేఁ బాలింపఁబడుచుండు నయోధ్యాపట్టణమా ! నే నరణ్యంబునకుఁ బోయెదను. నిన్ను వీడ్కొనుచున్నాను. మఱియుం నీయం దెవ్వ రున్నారో నిన్నెవ్వరు పాలించుచున్నారో ఆ దేవతలనుం గూడ వీడ్కొనుచున్నాను. ౨

నేను వనంబునఁ బదునాలుగుసంవత్సరంబులు గడపి నాతండ్రి దశరథమహారాజు ఋణంబు దీర్చుకొని నాతలిదండ్రులం గూడి మరల నిన్నుఁ జూచెదను. అని రాముఁ డయోధ్యాపట్టణముం బ్రార్థించెను. ౩

అంత నెత్తురువలె నెఱ్ఱని కండ్లుగల రాముఁడు కుడిభుజంబు నెత్తి ముఖంబు నిండఁ గన్నీళ్లు గాఱ దీనుఁడై గ్రామంబులనుండి తన్నుఁ జూడ వచ్చిన జనులం జూచి యిట్లని చెప్పెను. ౪

మీరలు నాయందు యథాయోగ్యముగా నే యాదరంబును దయయుంఁ జూపినారు. బహుకాలము దుఃఖముతో నుండుట మంచిది కాదు. నాయొద్ద నుండు రేని మీకు దుఃఖము గల్గుచునే యుండును. కావున మీరలిండ్లకుఁ బోయి మీకార్యంబులం జూచుకొనుఁడు. అని రాముఁడు జానపదజనులకుం జెప్పెను. ౫

ఆజానపదజనులు మహాత్ముఁడగు రామునకుఁ బ్రదక్షిణనమస్కారంబులు చేసి భయంకరముగా రోదనంబు సేయుచు రాముం జూడకుండఁజాలక యచ్చటచ్చట నిలిచి నిలిచి రాముం జూచుచుఁ బోయిరి. ౬

ఆజనులు అట్లు రాముం జూచుటయందుఁ దనివి దీరక రోదనంబు సేయుచుండఁగా నే సాయంకాలానంతరము సూర్యుఁ డగపడకుండురీతిని రాముఁడు వారలకండ్ల కగపడకుండునట్లు బహుదూరము పోయెను. ౭

తతో ధాన్యధనోపేతా న్దానశీలజనాఞ్ఛివాన్,
అకుతశ్చి ద్భయా న్రమ్యాం శ్చైత్యయూపసమావృతాన్. ౮
ఉద్యానామ్రవణోపేతా న్సమ్పన్నసలిలాశయాన్,
తుష్టపుష్టజనాకీర్ణాన్ గోకులాకులసేవితాన్. ౯
లక్షణీయా న్నరేన్ద్రాణాం బ్రహ్మఘోషాభినాదితాన్,
రథేన పురుషవ్యాఘ్రః కోసలా నత్యవర్తత. ౧౦

మధ్యేన ముదితం స్ఫీతం రమ్యోద్యానసమాకులమ్,
రాజ్యం భోగ్యం నరేన్ద్రాణాం యయౌ ధృతిమతాంవరః. ౧౧

తత స్త్రిపథగాం దివ్యాం శివతోయా మశైవలామ్,
దదర్శ రాఘవో గఙ్గాం పుణ్యా మృషినిషేవితామ్. ౧౨

ఆశ్రమై రవిదూరస్థైః శ్రీమద్భి స్సమలఙ్కృతామ్,
కాలేఽప్సరోభి ర్హృష్టాభి స్సేవితామ్భో హ్రదాం శివామ్. ౧౩
దేవదానవగన్ధర్వైః కిన్నరై రుపశోభితామ్,
నాగగన్ధర్వపత్నీభి స్సేవితాం సతతం శివామ్. ౧౪
దేవాఽఽక్రీడశతాకీర్ణాం దేవోద్యానశతాయుతాం,
దేవార్థ మాకాశగమాం విఖ్యాతాం దేవపద్మినీమ్. ౧౫
జలాఘాతాట్టహాసోగ్రాం ఫేననిర్మలహాసినీమ్,

అంత నట్లు పురుషశ్రేష్ఠుఁడగు రాముఁడు రథమువలననె ధనధాన్యంబులతోఁ గూడినదియు బహుదాతలగు జనులుఁగలదియు మంగళకరమును భయంబు లేనిదియు సుందరంబైనదియు యాగశాలలతోను యూపస్తంభములతోనుం గూడినదియు నుద్యానవనంబులతోను మామిడితోఁపులతోనుఁ గూడినదియు నీళ్లతో నుండిన కొలంకులు గలదియు సంతుష్టులు ధనధాన్యంబులం బుష్టులు నగు జనులు గలదియు ఆవులగుంపులతో నిండినదియును రాజులకుం జూడఁదగినదియు నెల్లప్పుడును వేదపాఠధ్వనితో నొప్పుచున్నదియు నగుకోసల దేశము నతిక్రమించి పోయెను. ౭-౧౦

రాముఁడు సంతుష్టంబును సుందరంబులగు నుద్యానంబుల నొప్పుచున్నదియు రాజుల కనుభవింపఁదగినదియు నగుకోసలరాజ్యంబు నడిమిమార్గంబుఁ బట్టి యందలి సౌందర్యవిశేషంబులం జూచుచుఁ బోయినను బరమధైర్యశాలులలో నుత్తముఁడు కావున దానియందు మనంబుంచక కోసలదేశంబు నతిక్రమించి పోయెను. ౧౧

ఆకోసలదేశంబునకు దక్షిణపుదిక్కునందు రాముఁడు స్వర్గభూపాతాళంబుల మూఁడిటం జరించునదియు మనోహరమయినదియు మంచియుదకము గలదియుఁ బాఁచిలేకుండుటంజేసి స్వచ్ఛముగా నుండునదియుఁ బుణ్యంబును ఋషులచే సేవింపఁబడినదియు నగు గంగానదిం జూచెను. ౧౨

అంత సమీపంబునందు శ్రీమంతంబులగు నాశ్రమంబులచే నలంకృతంబు నచ్చటచ్చటి మనుజుల సంతోషంబున జలక్రీడలాడు నచ్చరలతో నొప్పుచున్నదియు, మంగళకరంబును దేవదానవగంధర్వులచేతను గిన్నరులచేతను నానావిధ గంధర్వపత్నులచేతను క్రీడార్థమయి సేవింపఁబడినదయ్యు నెప్పటికిని చెడనియందంబుగలదియు ననేకంబులగు దేవక్రీడాపర్వతములును దేవోద్యానంబులును దీరభూములం గలదియు దేవతలకొఱకై యాకాశంబునం జరించునదియు జగత్ప్రసిద్ధియు దేవతలకుఁ బూజార్థమయిన కమలంబుల

క్వచిద్వేణీకృతజలాం క్వచిదావర్తశోభితామ్. ౧౬
క్వచిత్ స్తిమితగమ్భీరాం క్వచిద్వేగజలాకులామ్,
క్వచి ద్గమ్భీరనిర్ఘోషాం క్వచి ద్భైరవనిస్వనామ్. ౧౭
దేవసఙ్ఘాప్లుతజలాం నిర్మలోత్పలశోభితామ్,
క్వచి దాభోగపులినాం క్వచి న్నిర్మలవాలుకామ్. ౧౮
హంససారససంఘుష్టాం చక్రవాకోపకూజితామ్,
సదామదై శ్చ విహగై రభిసన్నాదితాన్తరామ్. ౧౯
క్వచి త్తీరరుహై ర్వృక్షై ర్మాలాభి రివ శోభితామ్,
క్వచిత్ఫుల్లోత్పలచ్ఛన్నాం క్వచి త్పద్మవనాకులామ్. ౨౦
క్వచి త్కుముదషణ్డై శ్చ కుట్మలై రుపశోభితామ్,
నానాపుష్పరజోధ్వస్తాం సమదా మివ చ క్వచిత్. ౨౧
వ్యపేతమలసఙ్ఘాతాం మణినిర్మలదర్శనామ్,
దిశాగజై ర్వనగజై ర్మత్తైశ్చ వరవారణైః. ౨౨
దేవోపవాహ్యై శ్చ మహా స్సన్నాదితవనాన్తరామ్,
ప్రమదా మివ యత్నేన భూషితాం భూషణోత్తమైః. ౨౩
ఫలైః పుష్పైః కిసలయై ర్వృతాం గుల్మై ర్ద్విజై స్తథా,
శింశుమారై శ్చ నక్రై శ్చ భుజఙ్గై శ్చ నిషేవితామ్. ౨౪
విష్ణుపాదచ్యుతాం దివ్యా మపాపాం పాపనాశినీమ్,
తాం శఙ్కరజటాజూటా ద్భ్రష్టాం సాగరతేజసా. ౨౫
సముద్రమహిషీం గఙ్గాం సారసక్రౌఞ్చనాదితామ్,
ఆససాద మహాబాహు శ్శృఙ్గిబేరపురం ప్రతి. ౨౬

నొసంగునదియు నొక్కచోఁ బెద్దఱాళ్లపైఁ బ్రవాహంబుపడుటం గల్గుశబ్దం
బులె పెద్దనవ్వుగా నురుగులే చిఱునవ్వులుగా మిట్టనుండి పల్లంబునకుఁ బోవు
ప్రవాహంబె తలజడగా నుత్తమాంగనకైవడిం జూపట్టునదియు, నొక్కచో
నావర్తంబులనొప్పుచున్నదియు,నొక్కచో నిశ్చలంబుగా నుండుటంజేసి గంభీ
రతగల్గినట్లున్నదియు, నొక్కచో నతివేగంబునం బ్రవహించునదియు,నొకచో
గంభీరధ్వనిగల్గియుండునదియు, నొక్కచోట భయంకరధ్వనిగలదియుఁ, జలం
బులం గ్రుంకులిడుదేవతల తోఁగూడినదియుఁ, స్వచ్ఛంబులగుకలువలం దేజరిల్లు
చున్నదియుఁ, నొక్కచోఁ బెద్దపెద్ద యిసుకతిన్నెలు గలదియుఁ నొక్కచోటఁ
స్వచ్ఛమైన యిసుకగలదియుఁ, నడుమ మధురంబుగాఁగూయుచుఁ దిరుగుచుండు
హంసలతోను సారసంబులతోను జక్రవాకంబులతోను మఱియు మత్తంబులగు
నితరపక్షులతోనుం గూడినదియు, నొక్కచోఁ దీరంబుల వరుసగాఁ జెట్లు
మొలచియుండుటంజేసి పుష్పమాలికలు వేసికొనినదివలె నగపడునదియు,
నొక్కచో వికసించినకలువలచేఁ గప్పఁబడినదియు, నొక్కచోఁ గమలంబు
లతో నిండినదియు, నొక్కచోఁ దెల్లకలువలను మఱియు సగమువిరిసిన
మొగ్గలుగానుండు నితరపుష్పంబులును మెండుగాఁగలదియును, నొక్కచోఁ
బుష్పపరాగంబుల నెఱ్ఱఁగానుండుటవలన మదంబుతోఁగూడినట్లు చూపట్టు
నదియుఁ నెంతమాత్రమును మలము లేకుండుటంజేసి వైడూర్యమణియుంబోలె
స్వచ్ఛమయిన జలము గలదియు, మఱియు దిగ్గజంబులును మదించినయడవి
యేనుంగులును దేవతలెక్కుమత్తగజంబులును రేకలువేయఁగా నాధ్వనిచే నిండిన
తీరభూములందలి వనంబులుగలదియు, ఫలంబులను బుష్పంబులను జిగురులను
గుల్మంబులను బక్షులను గప్పఁబడియుండుటవలనఁ బ్రయత్నంబున నుత్తమభూ
షణంబుల నలంకరించుకొనినవనితయుంబోలె జూడఁదగియున్నదియును, నీరు
కోఁతులును మొసళ్లును బాములునుం గలదియును, విష్ణుపాదంబుననుండి జాఱి
నదియును, దివ్యయును, బాపరహితంబును, బాపంబులంబోఁగొట్టునదియును,
భగీరథునితపంబువలన నీశ్వరుజటాజూటంబుననుండి యవతరించినదియు, సము
ద్రుని భార్యయు నగు నాగంగానదిని మహాబాహుఁడగు రాముఁడు శృంగి
బేరపురసమీపంబునం జేరెను. ౧౩-౨౯

తాంమూర్మికలిలావర్తా మన్వవేక్ష్య మహారథః,
సుమన్త్రి మబ్రవీ త్సూత మిహైవాద్య వసామహే. ౨౭

అవిదూరా దయం నద్యా బహుపుష్పప్రవాళవాన్,
సుమహా నిఙ్గుదీవృక్షో వసామోఽత్రైవ సారథే!. ౨౮
ద్రక్ష్యామ స్సరితాం శ్రేష్ఠాం సమ్మాన్యసలిలాం శివామ్,
దేవదానవగన్ధర్వమృగమానుషపక్షిణామ్. ౨౯

లక్ష్మణ శ్చ సుమన్త్రి శ్చ బాఢమిత్యేవ రాఘవమ్,
ఉక్త్వా తమిఙ్గుదీవృక్షం తదోపయయతు ర్హయైః. ౩౦
రామోఽభియాయ తం రమ్యం వృక్ష మిక్ష్వాకునన్దనః,
రథా దవాతర త్తస్మా త్సభార్య స్సహలక్ష్మణః. ౩౧

సుమన్త్రోఽప్యవతీర్యాస్మా న్మోచయిత్వా హయోత్తమాన్,
వృక్షమూలగతం రామ ముపతస్థే కృతాఞ్జలిః. ౩౨

తత్ర రాజా గుహో నామ రామస్యాఽత్మసమ స్సఖా,
నిషాదజాత్యో బలవాన్ స్థపతి శ్చేతి విశ్రుతః. ౩౩

స శ్రుత్వా పురుషవ్యాఘ్రం రామం విషయ మాగతమ్,
వృద్ధైః పరివృతోఽమాత్యైః జ్ఞాతిభి శ్చాభ్యుపాగతః. ౩౪

తతో నిషాదాధిపతిం దృష్ట్వా దూరా దుపస్థితమ్,
సహ సౌమిత్రిణా రామ స్సమాగచ్ఛ ద్గుహేన సః. ౩౫

తన్నును సారథిని గుఱ్ఱములనుం గాపాడుకొనుచుఁ బదునొకండు వేల మంది విలుకాండ్రతోఁ బోరంజాలిన మహావీరుండగు రాముండు అలల తోను సుడులతోను ఒప్పుచుండు గంగానదిం జూచి సారథియగు సుమం త్రునితో "మనమిప్పు డిచ్చటనే యుందము" అని చెప్పెను. ౨౮

ఈగంగానదికి సమీపంబునఁ బూలును జిగుళ్లును మెండుగాఁగల యొక్క పెద్దగారచెట్టున్నది. కావున సుమంత్రుఁడా! ఇచ్చటనేయుందము.

దేవతలకును దానవులకును గంధర్వులకును మనుష్యులకును మృగంబుల కును బక్షులకును గౌరవింపఁదగిన యుదకంబుగలదియు మంగళప్రదయును నదులలోనుత్తమయు నగు గంగానదింజూతము అని రాముఁడు సుమంత్రు నితోఁ జెప్పెను. ౨౯

అంత లక్ష్మణుఁడును సుమంత్రుఁడును రాముఁడు చెప్పినమాట నంగీక రించి రథంబును ఆయింగుదీవృక్షంబునొద్దకుఁ గొనిపోయిరి. ౩౦

ఇక్ష్వాకువంశంబునఁ బుట్టినవారలకు సంతోషంబు సేయునట్టి రాముఁడు సుందరంబగు నా గారచెట్టుఁ జేరినంతనె యారథంబున నుండి భార్యయును లక్ష్మణుఁడును దానును దిగెను. ౩౧

సుమంత్రుఁడును రథంబుననుండి దిగి యుత్తమంబులగు గుఱ్ఱంబుల విచ్చి చెట్టుక్రిందనున్న రామునొద్దకుఁబోయి చేతులుమొగుడ్చుకొని సేవింపు చుండెను. ౩౨

అప్పు డాదేశమునందు రామునకుఁ బ్రాణస్నేహితుఁడును బలవంతుఁ డును బోయజాతిం బుట్టినవాఁడును నిషాదులకుఁ బ్రభువునగు గుహుండను రాజుండెను. ౩౩

ఆగుహుండు పురుషశ్రేష్ఠుఁడగు రాముఁడు తన దేశంబునకు వచ్చుటను విని కులవృద్ధులను మంత్రులను తనజాతిలోనివాండ్రనుం బరివేష్టింప రామునొద్దకు వచ్చెను. ౩౪

అంత నిషాదాధిపతి యయిన గుహుండు దూరంబున వచ్చుటం జూచి రాముఁడును లక్ష్మణుఁడును ఆగుహుని నెదుర్కొని యతనిం జేరిరి. ౩౫

తమార్త స్సమ్పరిష్వజ్య గుహో రాఘవ మబ్రవీత్,
యథాఽయోధ్యా తథేయం తే రామ! కింకరవాణి తే. 36

ఈదృశం హి మహాబాహో! కః ప్రాప్స్యత్యతిథిం ప్రియమ్,

తతో గుణవ దన్నాద్య ముపాదాయ పృథగ్విధమ్. 37
అర్ఘ్యం చోపానయ క్షిప్రం వాక్యం చేద మువాచ హ,

స్వాగతం తే మహాబాహో! తవేయ మఖిలా మహీ. 38
వయం ప్రేష్యా భవా న్భర్తా సాధు రాజ్యం ప్రశాధి నః,

భక్ష్యం భోజ్యం చ పేయం చ లేహ్యం చేద ముపస్థితమ్. 39
శయనాని చ ముఖ్యాని వాజినాం ఖాదనం చ తే,

గుహ మేవం బ్రువాణం తు రాఘవః ప్రత్యువాచ హ. 40

అర్చితా శ్చైవ హృష్టా శ్చ భవతా సర్వథా వయమ్,
పద్భ్యామభిగమా చ్చైవ స్నేహసందర్శనేన చ. 41

భుజాభ్యాం సాధు పీనాభ్యాం పీడయ న్వాక్య మబ్రవీత్,

దిష్ట్యా త్వాం గుహ! పశ్యామి అరోగం సహ బాన్ధవైః. 42

గుహుండు దుఃఖితుండై రాముం గవుంగిలించుకొని యిట్లని చెప్పెను.

రాముండా! అయోధ్య నీ కెట్లు సొంతమో అట్లు నాపట్టణమును నీకు సొంతమే. నీకు నే నేమిచేయవలెను? చెప్పుము. ౩౬

మహాబాహుండవగు రాముండా; నీయట్టిమహానుభావుండును బ్రియుండు నగు నతిథి యెవ్వనికిఁ గల్గును? నీ విచ్చటికి వచ్చుట నాపూర్వపుణ్యఫలము గాని వేఱె గాదు. అని గుహుండు రామునితోఁ జెప్పెను.

అంత నాగుహుండు ఉత్తమంబులగు నానావిధములగు యన్నాదులను గొనితెచ్చి శీఘ్రింబుగా నర్ఘ్యంబును దెప్పించి రామునిం జూచి యిట్లని చెప్పెను. ౩౭

మహాబాహుండవగు రాముండా! నీకు స్వాగతం బగుంగాక. ఈ నా భూమియంతయుం నీది. మే మందఱము నీకుఁ బరిచారకులము. నీవు మాకుఁ బ్రభుండవు. ఇంక మారాజ్యంబును యథేచ్ఛగాఁ బాలింపుము ౩౮

ఇదిగో! పిండివంటలును అన్నమును పానకాది పేయద్రవ్యములును శాకం దగినరసాయనాదులును సిద్ధములయి యున్నవి. వీని నారగింపుము. ఉత్తమంబులగు శయనంబు లివిగో వీని నంగీకరింపుము. నీగుఱ్ఱంబులకు గడ్డి మొదలగు నవియును సిద్ధముగా నున్నవి అని గుహుండు రామునితోఁ జెప్పెను. ౩౯

ఇట్లు గుహుండు చెప్పుచుండఁగా రాముఁ డతనిం జూచి యిట్లని చెప్పెను. ౪౦

నీ విట్లు పాదంబుల నడచివచ్చి మమ్మెదుర్కొనుటవలనను మాయందు స్నేహంబు చూపుటవలనను మా కన్నివిధంబులనుం బూజచేసినవాఁడవే యగుచున్నావు. మాకుఁ జాలసంతోషంబును గల్గినది. అని రాముఁడు గుహునకుం జెప్పెను. ౪౧

అంత మరల రాముఁడు గుహుని బాహువుల గట్టిగాఁ గవుంగిలించి యిట్లని చెప్పెను.

నాభాగ్యవశంబున బంధువులతోఁ గూడ నేమియుం శోకంబులేక

అపి తే కుశలం రాష్ట్రే మిత్రేషు చ ధనేషు చ,

య త్త్విదం భవతా కించి త్ప్రీత్యా సముపకల్పితమ్. ౪౩
సర్వం తదనుజానామి న హి వర్తే ప్రతిగ్రహే,
కుశచీరాజినధరం ఫలమూలాశినం చ మామ్. ౪౪
విద్ధి ప్రణిహితం ధర్మే తాపసం వనగోచరమ్,

అశ్వానాం ఖాదనేనాహ మర్థీ నాన్యేన కేనచిత్. ౪౫
ఏతావతాఽత్ర భవతా భవిష్యామి సుపూజితః,

ఏతే హి దయితా రాజ్ఞః పితు ర్దశరథస్య మే. ౪౬
ఏతై స్సువిహితై రశ్వై ర్భవిష్యా మ్యహ మర్చితః,

అశ్వానాం ప్రతిపానం చ ఖాదనం చైవ సోఽన్వశాత్. ౪౭
గుహ స్తత్రైవ పురుషాం స్త్వరితం దీయతా మితి,

తత శ్చీరో త్తరాసఙ్గ స్సన్ధ్యా మన్వాస్య పశ్చిమామ్. ౪౮
జల మేవాఽదదే భోజ్యం లక్ష్మణేనాఽహృతం స్వయమ్,

తస్య భూమౌ శయానస్య పాదౌ ప్రక్షాళ్య లక్ష్మణః. ౪౯
సభార్యస్య తతోఽభ్యేత్య తస్థౌ వృక్షముపాశ్రితః,

గుహోఽపి సహ సూతేన సౌమిత్రి మనుభాషయన్. ౫౦
అన్వజాగ్ర త్తతో రామ మప్రమత్తో ధనుర్ధరః.

నీరాజ్యంబున నుపద్రవంబు లేమియుం లేక క్షేమంబుగ నున్నదా? నీమిత్రులు క్షేమంబున నున్నవారా? నీధనంబు నాశంబు నొందక నానాటికి వృద్ధిఁబొందుచున్నదిగదా!

నీ విప్పుడు నాయందలి ప్రేమచే నాకొఱకు సిద్ధముచేసినవాని నంతయుం మరల నీకే యిచ్చెదను. నే నిప్పుడు వానిం బ్రతిగ్రహింపను. 43

నేను పితృవాక్యపరిపాలనరూపంబగు ధర్మంబునం దెచ్చరికగలవాఁడను. పిత్రాజ్ఞాప్రకారము దర్భలను నారచీరలను ధరించి ఫలంబులను మూలంబులనుం దినుచు నడవులందుఁ దపస్సుచేసుకొనవలయును. అని యెఱుంగుము. 44

ఈగుఱ్ఱంబులకు గడ్డి యొకటియె నాకుఁ గావలసినది మఱేదియుం నక్కఱలేదు. ఈసమయమునందు ఇంతమాత్రము నీవుసేయుదువేని నాకుఁ జక్కఁగాఁ బూజించినవాఁడ వగుదువు 45

ఈగుఱ్ఱములు రాజయిన నాతండ్రి దశరథునకుఁ బ్రియంబు లయినవి. ఈగుఱ్ఱములు చక్కఁగా గడ్డి దిని తృప్తిఁబొందినట్లు సేయుదువేని నన్నుఁ బూజించినవాఁడవు కాఁగలవు. అని రాముఁడు గుహునకుం జెప్పెను. 46

అంత నాగుహుఁడు అచ్చటనే యుండు భృత్యులం బిలిచి "యీ గుఱ్ఱంబులకు శీఘ్రముంగా బొలును నీరును ద్రాగించి గడ్డి మొదలగునది. వేయుఁడు" అని యాజ్ఞాపించెను. 47

అంత రాముఁడు నారచీరనె యుత్తరీయముగా వేసికొని సాయంకాల సంధ్య నుపాసించి లక్ష్మణుఁడు తానె పోయి తెచ్చినగంగాజలమునే యాహార ముంగాఁ బుచ్చుకొనెను. 48

రాముఁడు పాదప్రక్షాళనంబు చేసికొని యాచమనముచేసి భార్యతోఁ గూడ నేలపైఁ బరుండినపిమ్మట లక్ష్మణుఁడు ఆగారచెట్టునొద్దకు వచ్చి కనిపెట్టి యుండెను. 49

అంత గుహుఁడును సుమంత్రునితోను లక్ష్మణునితోను రాముని గుణంబుల గుఱించి మాటలాడుచునే ధనుర్ధరుఁడై యేమఱుపాటులేక రామ సంరక్షణార్థమయి యారాత్రి యంతయుం మేలుకొనియుండెను. 50

తథా శయానస్య తతోఽస్య ధీమతో
యశస్వినో దాశరథే ర్మహాత్మనః,
అదృష్టదుఃఖస్య సుఖోచితస్య సా
తదా వ్యతీయాయ చిరేణ శర్వరీ. ౫౧

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే పఞ్చాశస్సర్గః.

---

## ఏ క ప ఞ్చా శ స్స ర్గః.

తం జాగ్రత మదమ్భేన భ్రాతు రర్థాయ లక్ష్మణమ్,
గుహ స్సన్తాపసంతప్తో రాఘవం వాక్య మబ్రవీత్. ౧
ఇయం తాత! సుఖా శయ్యా త్వదర్థ ముపకల్పితా,
ప్రత్యాశ్వసిహి సా ధ్వస్యాం రాజపుత్ర! యథాసుఖమ్. ౨

ఉచితోఽయం జనస్సర్వః క్లేశానాం త్వం సుఖోచితః,
గుప్త్యర్థం జాగరిష్యామః కాకుత్స్థస్య వయం నిశామ్. ౩

నహి రామా త్ప్రియతమో మమా స్తి భువి కశ్చన,
బ్రవీమ్యేతదహం సత్యం సత్యేనైవ చ తే శపే. ౪

అస్య ప్రసాదా దాశంసే లోకేఽస్మిన్సుమహా ద్యశః,
ధర్మావాప్తిం చ విపులా మర్థావాప్తిం చ కేవలామ్. ౫
సోఽహం ప్రియసఖం రామం శయానం సహ సీతయా,
రక్షిష్యామి ధనుష్పాణి స్సర్వతో జ్ఞాతిభి స్సహ. ౬

న హి మేఽవిదితం కించి ద్వనేఽస్మిం శ్చరత స్సదా,
చతురఙ్గం హ్యాపి బలం సుమహా త్ప్రసహేమహి. ౭

లక్ష్మణ స్తం త దోవాచ రక్ష్యమాణా స్త్వయాఽనఘ!,
నాత్ర భీతా వయం సర్వే ధర్మ మే వానుపశ్యతా. ౮

కథం దాశరథౌ భూమౌ శయానే సహ సీతయా,
శక్యా నిద్రా మయా లబ్ధుం జీవితం వా సుఖాని వా. ౯

యో న దేవాసురై స్సర్వై శ్శక్యః ప్రసహితుం యుధి,
తం పశ్య సుఖసంవిష్టం తృణేషు సహ సీతయా. ౧౦

యో మన్త్రతపసా లబ్ధో వివిధై శ్చ పరిశ్రమైః,
ఏకో దశరథ స్యేష్టః పుత్ర స్సదృశలక్షణః. ౧౧
అస్మి న్ప్రవ్రాజితే రాజా న చిరం వర్తయిష్యతి,

విధవా మేదినీ నూనం క్షిప్ర మేవ భవిష్యతి. ౧౨

వినద్య సుమహానాదం శ్రమే ణోపరతాః స్త్రియః,
నిర్ఘోషోపరతం చాతో మన్యే రాజనివేశనమ్. ౧౩

కౌసల్యా చైవ రాజా చ తథైవ జననీ మమ,

నే నెల్లప్పుడును ఈవనంబులో నే దిరుగువాఁడను గావున నాకుఁ దెలియక యిచ్చట నేవిరోధియును రాఁజాలఁడు. మఱియు మాకిచ్చటిరహస్యస్థానంబు లన్నియుఁ దెలియునుగావునఁ జతురంగసైన్యము లైనను సరకు సేయము అని గుహుఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౭

అంత లక్ష్మణుఁడు గుహునింజూచి యిట్లని చెప్పెను. పాపరహితుఁడ వగు గుహుఁడా! పరమధార్మికుఁడవగు నీవు రక్షించుచుండఁగా మా కెవ్వరికి నిచ్చట నెంతమాత్రమును భయము లేదు. ౮

దశరథమహారాజపుత్త్రుఁడైన రాముఁడు సీతతోఁగూడ నిట్లు నేలపైఁ బరుండియుండఁగా నే నింక నెట్లు నిద్రనుగాని ప్రాణంబులనుగాని సుఖము గాని పొందఁగలను? ౯

దేవతలు నసురులైనను యుద్ధంబున నెవ్వని నోర్వఁజాలరో అట్టి మహాపరాక్రమశాలియయిన రాముఁ డిప్పుడు సీతతోఁగూడ నేలపైఁ బచ్చికలయందుఁ బరుండియున్నాఁడు. చూడుము. ౧౦

ఎవ్వని దశరథుఁడు మంత్రజపంబులును దపస్సులును నానావిధ శ్రమంబులును జేసి పొందినాఁడో మఱియు నెవ్వఁడు తండ్రియగు దశరథునకు సమానంబులగు గుణంబులు గల్గి ప్రియపుత్త్రుఁడై యుండునో అట్టి యీరాముఁ డరణ్యంబునకుఁ బోయినపిమ్మట దశరథమహారాజింక నెంత మాత్రము జీవింపఁడు. ౧౧

దశరథుఁడు జీవింపఁజాలఁడు: గావున నింక శీఘ్రముగనే యీ భూమియంతయుం విధవ కాగలదు. ఇది నిశ్చయము. ౧౨

రాజగృహమునందలి స్త్రీలు మహాధ్వని గల్గునట్లు రోదనంబు చేసి శ్రమంబున నూరకుండఁగలరు. అంత రాజగృహం బంతయుం నిశ్శబ్దముగా నుండఁగలదు. అని తలంచెదను. ౧౩

కౌసల్యయును దశరథమహారాజును నాతల్లి సుమిత్రయును వార

నాశంసే యది జీవన్తి సర్వే తే శర్వరీ మిమామ్. ౧౪

జీవే దపి హి మే మాతా శత్రుఘ్నస్యాన్వవేక్షయా,
త ద్దుఃఖం య త్తు కౌసల్యా వీరసూ ర్వినశిష్యతి. ౧౫

అనురక్తజనాకీర్ణా సుఖా లోకప్రియావహా,
రాజవ్యసనసంసృష్టా సా పురీ వినశిష్యతి. ౧౬

కథం పుత్రం మహాత్మానం జ్యేష్ఠం ప్రియ మపశ్యతః,
శరీరం ధారయిష్యన్తి ప్రాణా రాజ్ఞో మహాత్మనః. ౧౭

వినష్టే నృపతౌ పశ్చా త్కౌసల్యా వినశిష్యతి,
అనన్తరం చ మాతాఽపి మమ నాశ ముపైష్యతి. ౧౮
అతిక్రాన్త మతిక్రాన్త మనవాప్య మనోరథమ్,
రాజ్యే రామ మనిక్షిప్య పితా మే వినశిష్యతి. ౧౯

సిద్ధార్థాః పితరం వృత్తం తస్మి న్కాలేఽప్యుపస్థితే,
ప్రేతకార్యేషు సర్వేషు సంస్కరిష్యన్తి భూమిపమ్. ౨౦

రమ్యచత్వరసంస్థానాం సువిభక్తమహాపథామ్,
హర్మ్యప్రాసాదసమ్పన్నాం గణికావరశోభితామ్. ౨౧
రథాశ్వగజసమ్బాధాం తూర్యనాదవినాదితామ్,

లందఱును ఇఁక బ్రతుకుదురని నాకుఁ దోఁచలేదు. ఒక్కవేళ బ్రతుకుదు
రేని ఈరాత్రిమాత్రమే బ్రతికి యుందురుగాని ఆపైని బ్రతుకం జాలరు.

నాతల్లి సుమిత్ర శత్రుఘ్నుఁడు మఱియొక్క కొడుకున్నాఁడు
గావున నతనిఁ జూచుచు జీవించినను జీవించును. ఆవిషయమయి నాకు దుః
ఖము లేదు. రామునంతటి మహాపరాక్రమశాలిం గన్నట్టి కౌసల్యమాత్రము
నాశము నొందునే! దీనికే నాకు దుఃఖమగుచున్నది. ౧౫

దశరథునం దనురక్తులగు జనులచే నిండినదియుం సుఖకరంబును జనులకు
సంతోషము సేయునదియుం నగు నాయయోధ్యాపట్టణములోనుండు జను
లందఱు రాజు చచ్చుటచే మహాదుఃఖంబునొంది నాశంబు నొందఁగలరు. ౧౬

మహాత్ముఁడగు దశరథమహారాజు మహాత్ముఁడును ప్రియుఁడును జ్యేష్ఠ
పుత్రుఁడు నగు రాముం జూడక దేహంబునఁ బ్రాణంబు లుంచుకొని యెట్లు
బ్రతికియుండును. ౧౭

దశరథమహారాజు మృతినొందఁగానే కౌసల్యాదేవి మృతినొందును.
ఆబిడ మృతినొందిన వెనుక నాతల్లి సుమిత్రయును నాశమునొందును. ౧౮

అతిక్రమించిన దతిక్రమించినదే. అవస్థయఁ దలంచుకొని కార్యము
లేదు. నాతండ్రి రామునకుఁ బట్టాభిషేకము సేయక తనకోర్కె నీడేర్చు
కొనకయె నాశంబునొందును. ఇదిమాత్రము తప్పదు. ౧౯

మరణకాలము వచ్చినప్పుడు సమీపమున నుండి సమస్తప్రేతకార్యము
లందును మృతుఁడగు తండ్రికి సంస్కారములు సేయుట కృతార్థులగువార
లకు సిద్ధించుఁ గాని యితరులకు సిద్ధింపదు. మేము కృతార్థులము కాము
గావున మాకు మాతండ్రి మరణకాలమునందు సమీపముననుండి సంస్కారము
సేయంగలుగదు. ౨౦

సుందరములయిన ముంగిళ్లు గలదియుం ఇరుప్రక్కలను క్రమముగా
నేర్పడియుండు నిండ్లవరుసలు గలిగి వంకరలేక విశాలములయి యుండు రాజ
మార్గంబులు గలదియుం హర్మ్యంబులతోను బ్రాసాదంబులతోనుం గూడినదియుం

సర్వకల్యాణసంపూర్ణాం హృష్టపుష్టజనాకులామ్. ౨౨
ఆరామోద్యానసమ్పన్నాం సమాజోత్సవశాలినీమ్,
సుఖితా విచరిష్యన్తి రాజధానీం పితు ర్మమ. ౨౩

అపి జీవే ద్దశరథో వనవాసా త్పున ర్వయమ్,
ప్రత్యాగమ్య మహాత్మాన మపి పశ్యేమ సువ్రతమ్. ౨౪

అపి సత్యప్రతిజ్ఞేన సార్ధం కుశలినా వయమ్,
నివృత్తే వనవాసేఽస్మి న్నయోధ్యాం ప్రవిశేమహి. ౨౫

పరిదేవయమానస్య దుఃఖార్తస్య మహాత్మనః,
తిష్ఠతో రాజపుత్రస్య శర్వరీ సాఽత్యవర్తత. ౨౬
తథాహి సత్యం బ్రువతి ప్రజాహితే
నరేన్ద్రపుత్రే గురుసౌహృదా ద్గుహః,
ముమోచ బాష్పం వ్యసనాభిపీడితో
జ్వరాతురో నాగ ఇవ వ్యథాతురః. ౨౭

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డ ఏకపఞ్చాశస్సర్గః.

---

ద్విపఞ్చాశస్సర్గః.

ప్రభాతాయా న్తు శర్వర్యాం పృథువక్షా మహాయశాః,
ఉవాచ రామ స్సౌమిత్రిం లక్ష్మణం శుభలక్షణమ్. ౧

నుత్తమవేశ్యలతో నొప్పుచున్నదియుం నెచ్చటం జూచినను రథంబులను గుఱ్ఱంబు
లను గజంబులను నిండియుండునదియుం నెల్లప్పుడును వాయింపంబడుచుండు
వాద్యంబులధ్వనులతో నొప్పుచున్నదియుం సమస్తమంగళసంపూర్ణంబును సం
తుష్టులును ధనాదులం బుష్టులు నగు జనులు గలదియుం సాధారణోపవనంబులను
రాజుల క్రీడావనంబులనుం దేజరిల్లుచున్నదియు జనులు గుంపులయి సేయుం దేవ
తోత్సవంబుల నెంతయుం బ్రకాశించుచున్నదియుం నగు నాతండ్రి రాజధాని
యయిన యయోధ్యాపట్టణమునందు సుఖంబు నొందువారు సుఖంబున విహ
రించుచుండంగలరు. ౨౧-౨౩

ఇంక దశరథుండు బ్రతికియుండునా యేమి! బ్రతికియుండినను మేము
వనవాసంబు గడపి మరల మహాత్ముండును సువ్రతుండునగు దశరథుం జూడం
గలమా యేమి!. ౨౪

ఈరాముండు వనవాసంబు గడపినపిమ్మట సత్యప్రతిజ్ఞుండగు దశర
థుండు క్షేమంబుగ నుండంగా నతనిం గూడి యయోధ్యం బ్రవేశింపంగలమా
యేమి! అని లక్ష్మణుండు గుహునితోం జెప్పి దుఃఖించెను. ౨౫

మహాత్ముండగు నాలక్ష్మణుం డిట్లు దుఃఖార్తుండై రోదనంబు సేయుచు
మేలుకొని నిలుచుండంగానే యారాత్రి యతిక్రమించినది. ౨౬

ఇట్లు జనులకుం బ్రియుండగు లక్ష్మణుండు చెప్పినసత్యంబగు మాటను
విని గుహుండు అధికస్నేహంబు గలవాండు గావున నధికదుఃఖంబును మనో
వ్యథనుం బొంది జ్వరంబు నొందినయేనుంగుంబోలెం గన్నీళ్లు విడిచెను. ౨౭

ఇది యేబదియొకటవసర్గము.

---

## ఏబదిరెండవసర్గము

అంతం దెల్లవాఱంగానే విశాలంబగు ఱొమ్ముగలవాండును మహాయ
శుండు నగు రాముండు శుభలక్షణుండగు సుమిత్రాపుత్రుని లక్ష్మణునిం జూచి
యిట్లని చెప్పెను. ౧

భాస్కరోదయకాలోఽయం గతా భగవతీ నిశా,
అసౌ సుకృష్ణో విహగః కోకిల స్తాత! కూజతి. ౨

బర్హిణానాం చ నిర్ఘోష శ్శ్రూయతే నదతాం వనే,
తరామ జాహ్నవీం సౌమ్య! శీఘ్రగాం సాగరఙ్గమామ్. ౩

విజ్ఞాయ రామస్య వచ స్సౌమిత్రి ర్మిత్రనన్దనః,
గుహ మామన్త్ర్య సూతంచ సోఽతిష్ఠ ద్భ్రాతు రగ్రతః. ౪

స తు రామస్య వచనం నిశమ్య ప్రతిగృహ్య చ,
స్థపతి స్తూర్ణ మాహూయ సచివా నిద మబ్రవీత్. ౫
అస్య వాహనసంయుక్తాం కర్ణగ్రాహవతీం శుభామ్,
సుప్రతారాం దృఢాం తీర్థే శీఘ్రం నావ ముపాహర. ౬

తం నిశమ్య సమాదేశం గుహామాత్యగణో మహాన్,
ఉపోహ్య రుచిరాం నావం గుహాయ ప్రత్యవేదయత్. ౭
తత స్స ప్రాఞ్జలి ర్భూత్వా గుహో రాఘవ మబ్రవీత్,

ఉపస్థితేయం నౌ ర్దేవ! భూయః కిం కరవాణి తే. ౮

తవామరసుతప్రఖ్య! తర్తుం సాగరగాం నదీమ్,
నౌ రియం పురుషవ్యాఘ్ర! తాం త్వ మారోహ సువ్రత!. ౯

నాయనా! సూర్యోదయము కాఁబోవుచున్నది. భగవతియగు రాత్రి గడచినది. ఇదిగో నల్లని కోయిలపక్షి మధురంబుగాఁ గూయుచున్నది. ౨

అడవియందుఁ గేకలువేయుచున్న నెమళ్లధ్వనియుం వినవచ్చుచున్నది. సముద్రగామినియగు నీగంగానది మిక్కిలియుం వడిగాఁ బాఱునది. దీని నేలాగైనదాఁటుదము. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౩

స్నేహితులకు సంపమతో సేయునట్టి లక్ష్మణుఁడు రామునిమాటకు "ఓడ లేనిచో మనము గంగానదిని దాఁటఁజాలము" అనునది యభిప్రాయ మని తెలిసికొని దీని గుహుని సుమంత్రునిం బిలిచి వారలకుం జెప్పి యంతఁ దాను అన్నయెదుట నుండెను. ౪

అంత నాగుహుఁడును రామునియాజ్ఞను విని శిరసావహించి శీఘ్రంబుగాఁ దనమంత్రులం బిలిచి వారల కిట్లని యాజ్ఞాపించెను. ౫

ఈరామునికి సులభముగా దాఁటించునదియు సుందరంబును దృఢంబు నగునోడ యొకటి తెడ్డు మొదలగువానితోను ఓడనడుపువానితోను జతపఱచి రేవులోనికిఁ దీసికొని రండు. అని గుహుఁడు మంత్రుల కాజ్ఞాపించెను. ౬

గుహునిమంత్రులు ఆతనియాజ్ఞను విని సుందరమయినయోడను రేవులోనికిం దెచ్చి గుహునకు నివేదించిరి. ౭

అంత నాగుహుఁడు చేతులు మొగుడ్చుకొని రామునిం జూచి యిట్లని చెప్పెను.

రాముఁడా! నీయాజ్ఞప్రకారము ఓడను దెప్పించినాను. ఇంకను నీ కేమి కావలయును చెప్పుము. చేసెదను. ౮

పురుషశ్రేష్ఠుఁడవును దేవపుత్రతుల్యుఁడవును మంచివ్రతంబులు గల వాఁడవునగు రాముఁడా! నీవు సముద్రగామినియగుగంగానదిని దాఁటుటకై యిదిగో యోడవచ్చియున్నది. నీవు దీనినెక్కుము. అని గుహుఁడు రాము

అథోవాచ మహాతేజా రామో గుహ మిదం వచః,
కృతకామోఽస్మి భవతా శీఘ్రి మారోప్యతా మితి. ౧౦

తతః కలాపా న్సన్నహ్య ఖడ్గౌ బద్ధ్వా చ ధన్వినౌ,
జగ్మతు ర్యేన తౌ గఙ్గాం సీతయా సహ రాఘవౌ. ౧౧
రామ మేవ తు ధర్మజ్ఞ ముపగమ్య వినీతవత్ ,
కి మహం కరవాణీతి సూతః ప్రాఞ్జలి రబ్రవీత్. ౧౨
తతోఽబ్రవీద్దాశరథిస్సుమన్త్రంస్పృశన్కరేణో త్తమదక్షిణేన,

సుమన్త్రి! శీఘ్రిం పునరేవయాహి రాజ్ఞస్సకాశే భవచాప్రమత్తః.

నివర్త స్వేత్యువాచ్ చైన మేతావ ద్ధి కృతం మమ,
రథం విహాయ పద్భ్యాం తు గమిష్యామి మహావనమ్. ౧౪

ఆత్మానం త్వభ్యనుజ్ఞాత మవేక్ష్యాఽర్త స్స సారథిః,
సుమన్త్రిః పురుషవ్యాఘ్రి మైక్ష్వాక మిద మబ్రవీత్. ౧౫

నాతిక్రాన్త మిదం లోకే పురుషేణేహ కేనచిత్,
తవ సభ్రాతృభార్యస్య వాసః ప్రాకృతవ ద్వనే. ౧౬

న మన్యే బ్రహ్మచర్యేఽస్తి స్వధీతే వా ఫలోదయః,
మార్దవార్జవయోర్వాపి త్వాం చే ద్వ్యసన మాగతమ్. ౧౭

అంత మహాతేజుఁడగు రామునుఁడు గుహుం జూచి "నీవు మాకొర్కి నెఱవేర్చినావు. ఇంక సీతవస్త్రాభరణంబులు మొదలగువాని నోడలోఁ జేర్పుము" అని చెప్పెను. ౧౦

అంత నారామలక్ష్మణులు కవచములును దూణీరంబులును ఖడ్గంబులును ధనువులును ధరించి సీతం గూడి గంగానదికిఁ బోవుమార్గంబుఁబట్టి పోయిరి.

సుమంత్రుఁడు చేతులు మొగిడ్చి ధర్మజ్ఞుండగు రామునొద్దకుఁబోయి వినయంబున "నన్నేమి చేయుమనెదరు" అని మన్వి చేసెను. ౧౨

అంత రాముఁడు ఉత్తమంబగు దక్షిణహస్తంబున సుమంత్రుం దాఁకుచు నిట్లని చెప్పెను.

సుమంత్రుఁడా! నీవు శీఘ్రంబుగా మరల దశరథమహారాజునొద్దకుఁ బొమ్ము. అతనియొద్ద నేమఱ కుండుము. ౧౩

నీవు నన్ను రథంబున నింతదూరము దీసికొని వచ్చి విడిచిపెట్టినావు గదా! ఇంక నీవు దశరథునొద్దకుఁ బొమ్ము. నేను రథమును విడిచి కాళ్లతో నడిచి యరణ్యంబునకుఁ బోయెదను. అని రాముఁడు సుమంత్రునకుం జెప్పెను. ౧౪

సారథియగు సుమంత్రుఁడు తన్ను రాముఁడు దశరథునొద్దకుఁ బొమ్మని చెప్పుటను విని దుఃఖితుఁడై పురుషోత్తముఁడును ఇక్ష్వాకుకులంబునం బుట్టినవాఁడు నగు రాముం జూచి యిట్లని చెప్పెను. ౧౫

నీవు తమ్మునితోను భార్యతోనుం గూడి క్షుద్రుఁడుంబోలె నడవిలో వాసముసేయుట యను నీకష్టమును బ్రిప్పివేయుటకు ఈలోకంబున నెవ్వరికి నలవిగాకున్నది. ౧౬

చక్కఁగా బ్రహ్మచర్యవ్రతంబు సల్పి వేదాధ్యయనంబుచేసి దయయు నార్జవంబును గల్గియుండునట్టి నీకే యిట్టికష్టము ప్రాపించినది కావున బ్రహ్మచర్యవ్రతంబునందుఁ గాని వేదాధ్యయనమునందుఁ గాని దయగల్గి యుండుటయందుఁ గాని కపటము లేకుండుటయందుఁ గాని యెంతమాత్రము ఫలము లేదని తలంచెదను. ౧౭

సహ రాఘవ! వైదేహ్యా భ్రాత్రా చైవ వనే వసన్,
త్వం గతిం ప్రాప్స్యసే వీర! త్రీ ల్లోకాం స్తు జయ న్నివ. ౧౮

వయం ఖలు హతా రామ! యే త్వయా హ్యుపవఞ్చితాః,
కై కేయ్యా వశ మేష్యామః పాపాయా దుఃఖభాగినః. ౧౯

ఇతి బ్రువ న్నాత్మసమం సుమన్త్ర స్సారథి _స్తదా,
దృష్ట్వా దూరగతం రామం దుఃఖార్తో రురుదే చిరమ్. ౨౦

తత _స్తు విగతే బాష్పే సూతం స్పృష్టోదకం శుచిమ్,
రామ _స్తు మధురం వాక్యం పునఃపున రువాచ తమ్. ౨౧

ఇక్ష్వాకూణాం త్వయా తుల్యం సుహృదం నోపలక్షయే,
యథా దశరథో రాజా మాం న శోచే _త్తథా కురు. ౨౨

శోకోపహతచేతా శ్చ వృద్ధ శ్చ జగతీపతిః,
కామభారావసన్న శ్చ తస్మా దేత ద్బ్రవీమి తే. ౨౩
యద్య దాజ్ఞాపయే త్కించి త్స మహాత్మా మహీపతిః,
కై కేయ్యాః ప్రియకామార్థం కార్యం త దవికాంక్షయా. ౨౪

ఏతదర్థం హి రాజ్యాని ప్రశాసతి నరేశ్వరాః,
య దేషాం సర్వకృత్యేషు మనో న ప్రతిహన్యతే. ౨౫
య ద్యథా స మహారాజో నాలీక మధిగచ్ఛతి,
నచ తామ్యతి దుఃఖేన సుమన్త్ర కురు త _త్తథా. ౨౬

అదృష్టదుఃఖం రాజానం వృద్ధ మార్యం జితేన్ద్రియమ్,
బ్రూయా స్త్వ మభివాద్యైవ మమ హేతో రిదం వచః. ౨౭

నై వాహ మనుశోచామి లక్ష్మణో నచ మైథిలి,
అయోధ్యాయా శ్చ్యుతా శ్చేతి వనే వత్స్యామ హేతి చ. ౨౮

చతుర్దశసువర్షేషు నివృత్తేషు పునఃపునః,
లక్ష్మణం మాం చ సీతాం చ ద్రక్ష్యసి క్షిప్ర మాగతాన్. ౨౯

ఏవ ముక్త్వా తు రాజానం మాతరం చ సుమన్త్ర! మే,
అన్యా శ్చ దేవీ స్సహితాః కైకేయీం చ పునః పునః. 30
ఆరోగ్యం బ్రూహి కౌసల్యా మథ పాదాభివన్దనమ్,
సీతాయా మమ చార్యస్య వచనా ల్లక్ష్మణస్య చ. 3౧
బ్రూయా శ్చ హి మహారాజం భరతం క్షిప్ర మానయ,

ఆగతశ్చాపి భరతః స్థాప్యో నృపమతే పదే. 3౨

భరతం చ పరిష్వజ్య యౌవరాజ్యేఽభిషిచ్య చ,
అస్మ త్సన్తాపజం దుఃఖం న త్వా మభిభవిష్యతి. 33

భరత శ్చాపి వక్తవ్యో యథా రాజని వర్తసే,
తథా మాతృషు వర్తేథా స్సర్వా స్వే వావిశేషతః. 34

యథా చ తవ కైకేయీ సుమిత్రా చ విశేషతః,
తథైవ దేవీ కౌసల్యా మమ మాతా విశేషతః. 35

నీవు దుఃఖంబు నెఱుంగనివాఁడును వృద్ధుఁడును బూజనీయుఁడును జితేంద్రియుఁడు నగు దశరథమహారాజునకు నాకు బదులుగా నమస్కరించి యీమాటం జెప్పుము. ౨౭

"అయోధ్యారాజ్యమునుండి భ్రష్టుల మయితిమి. ఇంక నడవిలో నుండవలయునే" అని నాకును లక్ష్మణునకును సీతకును ఎంతమాత్రమును దుఃఖము లేదు. ౨౮

ఈపదునాలుగు సంవత్సరములును గడచినపిమ్మట లక్ష్మణుఁడును నేనును సీతయును వనంబుననుండి రాఁగానే మమ్ము మాటిమాటికిఁ జూచుచుండఁ గలవు. అని దశరథునకుఁ జెప్పుము. ౨౯

సుమంత్రుఁడా! ఈమాటను దశరథునకును నాతల్లికౌసల్యకును ఇతరులగు రాజపత్నులకును కైకేయికిని మాటిమాటికిం జెప్పి యంత సీతయు నేనును ఆర్యుఁడగు లక్ష్మణుఁడునుం జెప్పినట్లు కౌసల్యకు మాయారోగ్యంబును నమస్కారంబునుం జెప్పుము. 3౦,3౧

దశరథమహారాజునకును ఈమాటం జెప్పుము. భరతుని శీఘ్రంబుగాఁ దోడ్కొనిరమ్ము.

భరతుఁడు వచ్చినపిమ్మట నతని రాజసమ్మతంబగు రాజ్యపరిపాలనము నందుంచవలయును. 3౨

భరతునకు యౌవరాజ్యపట్టాభిషేకముచేసి యతనిం గవుఁగిలించుకొందువేని మేము వనంబునకుఁ బోవుటవలనం గలుగుదుఃఖము నిన్ను బాధింపదు. అని దశరథునకుఁ జెప్పుము. 33

భరతునకును ఇట్లని చెప్పవలయును. నీవు దశరథమహారాజునం దెట్లు ప్రవర్తింతువో అట్లె తల్లుల యందఱియందును భేదము లేక ప్రవర్తింపుచుండవలయును. 3౪

నీకుఁ గైకేయియుం శత్రుఘ్నునకు సుమిత్రయుం సాక్షాన్మాత లగుటవలన నెచ్చుగా గౌరవింపఁదగినవార లెట్లగుదురో అట్లె నాకు కౌసల్య

తాతస్య ప్రియకామేన యథావ ద్రాజ్య మపేక్షతా,
లోకయో రుభయో శ్శక్యం నిత్యదా సుఖ మేధితుమ్. 36

నివ_ర్త్యమానో రామేణ సుమ_న్త్రి శ్శోకకర్శితః,
తత్సర్వం వచనం శ్రుత్వా స్నేహా త్కాకుత్స్థ మబ్రవీత్. 37

యదహం నోపచారేణ బ్రూయాం స్నేహా దవిక్లబః,
భ_క్తిమా నితి తత్తావ ద్వాక్యం త్వం క్ష_న్తు మర్హసి. 38

కథం హి త్వద్విహీనో౽హం ప్రతియాస్యామి తాం పురీమ్,
తవ తావ ద్వియోగేన పు_త్త్రిశోకాకులా మివ. 39
సరామ మపి తావ న్మే రథం దృష్ట్వా తదా జనః,
వినా రామం రథం దృష్ట్వా విదీర్యేతాపి సా పురీ. 40

దైన్యం హి నగరీ గచ్ఛే ద్దృష్ట్వా శూన్య మిమం రథమ్,
సూతావశేషం స్వం సై_న్యం హతవీర మివాహవే. 41

దూరే౽పి నివస_న్తం త్వాం మానసేనాగ్రతః స్థితమ్,
చి_న్తయన్త్యో౽ద్య నూనం త్వాం నిరాహారాః కృతాః ప్రజాః.

దృష్టం తద్ధి త్వయా రామ! యాదృశం త్వత్ప్రవాసనే,
ప్రజానాం సంకులం వృత్తం త్వచ్ఛోకక్లాంతచేతసామ్. ४३

ఆర్తనాదో హి యః పౌరై ర్ముక్త స్త్వద్విప్రవాసనే,
సరథం మాం నిశా మ్యైవ కుర్యు శ్శతగుణం తతః. ४४

అహం కించాపి వక్ష్యామి దేవీం తవ సుతో మయా,
నీతోఽసౌ మాతులకులం సన్తాపం మాకృథా ఇతి. ४५

అసత్య మపి నైవాహం బ్రూయాం వచన మీదృశమ్,
కథ మప్రియ మే వాహం బ్రూయాం సత్య మిదం వచః. ४६

మమ తావ న్నియోగస్థా స్త్వద్బన్ధుజన వాహినః,
కథం రథం త్వయా హీనం ప్రవక్ష్యన్తి హయోత్తమాః. ४७
తం న శక్ష్యా మ్యహం గన్తు మయోధ్యాం త్వదృతేఽనఘ,
వనవాసానుయానాయ మా మనుజ్ఞాతు మర్హసి. ४८

యది మే యాచమానస్య త్యాగమేవ కరిష్యసి,
సరథోఽగ్నిం ప్రవేక్ష్యామి త్యక్తమాత్ర ఇహ త్వయా. ४९

భవిష్యన్తి వనే యాని తపో విఘ్నకరాణి తే,
రథేన ప్రతిబాధిష్యే తాని సత్త్వాని రాఘవ!. ५०
త్వత్కృతే న మయాఽవాప్తం రథచర్యాకృతం సుఖమ్,
ఆశంసే త్వత్కృతే నాహం వనవాసకృతం సుఖమ్. ५१

రామా! నీవు వనంబునకుఁ బయనం బయినప్పుడు నీవు పోవు చున్నావను దుఃఖంబున జనులకుం గలిగిన క్షోభంబు నంతయుం నీవే చూచి యున్నావు గదా! ౪౩

నీవు వనంబునకుఁ బయనంబగునపుడు పట్టణవాసిజనులు ఎంతమాత్రము రోదనము చేసినారో ఇప్పుడు నీవు లేక రథంబుతోఁ గూడఁ బోయిన నన్నుఁ జూడఁగానె దానికి నూఱింతలుగా రోదనంబు గావింతురు. ౪౪

నేను మీతల్లి కేమి చెప్పుదును? "నీకొడుకును నేను మేనమామ యింట విడిచిపెట్టి వచ్చినాను. నీవు దుఃఖింపకుము" అని చెప్పుదునా యేమి? ౪౫

"నేను నీకొడుకును మేనమామయింట విడిచివచ్చితి" నని యబద్ధమైనను జెప్పుటకు లేదు. "నీకొడుకును వనంబులో విడిచితి" నని యప్రియమయిన సత్యమును జెప్పుటకును లేదు. ఏమి సేయవచ్చును? ౪౬

నాచేఁ దోలఁబడి నిన్నును సీతాదేవిని లక్ష్మణుని వహించుచుండు నీయుత్తమాశ్వంబులు నీవు లేని రథంబును ఎటు లాకర్షించును? ౪౭

పాపరహితుఁడవగు రామా! అట్లగుటం జేసి నేను నిన్ను విడిచి యయోధ్యకుం బోఁజాలను. నేను నీతో వచ్చి యడవిలో నుండెదను. యనుజ్ఞ నొసంగుము. ౪౮

నే నెంత ప్రార్థించినను నన్ను వనంబునకుఁ దీసికొనిపోక విడుతు వేని నీవు విడిచినంతనె నేను రథంబుతోఁ గూడ నగ్నిలోఁ బడి చచ్చెదను. ౪౯

రామా! నీతపసునకు విఘ్నము సేయు క్రూరజంతువుల నన్నింటిని నేను రథంబు నెక్కి చంపుచుండెదను. ౫౦

నీయనుగ్రహంబున నేను నీకు రథంబు దోలి దానం గలుగు సుఖంబు ననుభవించితిని. ఇంక నీయనుగ్రహంబున నీతోఁ గూడ వనంబులో వాసంబు సేయుచు నీ కచ్చట సేవ సేయుచుండుటవలనం గలుగు సుఖంబు ననుభవింపఁ గోరినాఁడను. ౫౧

ప్రసీదేచ్ఛామి తేఽరణ్యే భవితుం ప్రత్యనన్తరః,
ప్రీత్యాఽభిహిత మిచ్ఛామి భవ మే ప్రత్యనన్తరః. ౫౨

ఇమే చాపి హయా వీర! యది తే వనవాసినః,
పరిచర్యాం కరిష్యన్తి ప్రాప్స్యన్తి పరమాం గతిమ్. ౫౩
తవ శుశ్రూషణం మూర్ధ్నా కరిష్యామి వనే వసన్,
అయోధ్యాం దేవలోకం వా సర్వథా ప్రజహామ్యహమ్.

న హి శక్యా ప్రవేష్టుం సా మయాఽయోధ్యా త్వయా వినా,
రాజధానీ మహేన్ద్రస్య యథా దుష్కృతకర్మణా. ౫౫
వనవాసే క్షయం ప్రాప్తే మమైష హి మనోరథః,
య దనేన రథే నైవ త్వాం వహేయం పురీం పునః. ౫౬

చతుర్దశ హి వర్షాణి సహితస్య త్వయా వనే,
క్షణభూతాని యాస్యన్తి శతసంఖ్యా న్యతోఽన్యథా. ౫౭

భృత్యవత్సల! తిష్ఠన్తం భర్తృపుత్త్రగతే పథి,
భక్తం భృత్యం స్థితం స్థిత్యాం త్వం న మాం హాతు మర్హసి.

ఏవం బహువిధం దీనం యాచమానం పునఃపునః,
రామో భృత్యానుకమ్పీ తు సుమన్త్ర మిద మబ్రవీత్. ౫౯
జానామి పరమాం భక్తిం మయి తే భర్తృవత్సల!,
శృణు చాపి యదర్థం త్వాం ప్రేషయామి పురీ మితః. ౬౦

నగరీం త్వాం గతం దృష్ట్వా జననీ మే యవీయసీ,
కైకేయీ ప్రత్యయం గచ్ఛే దితి రామో వనం గతః. ౯౧
పరితుష్టా హి సా దేవీ వనవాసం గతే మయి,
రాజానం నాతిశఙ్కేత 'మిథ్యావా దీ'తి ధార్మికమ్. ౯౨

ఏష మే ప్రథమః కల్పో య దమ్బా మే యవీయసీ,
భరతారక్షితం స్ఫీతం పుత్త్రరాజ్య మవాప్నుయాత్. ౯౩
మమ ప్రియార్థం రాజ్ఞ శ్చ సరథ స్త్వం పురీం వ్రజ,
సన్దిష్ట శ్చాసి యా నర్థాం స్తాం స్తా న్బ్రూయా స్తథా తథా.

ఇత్యుక్త్వా వచనం సూతం సాన్త్వయిత్వా పునఃపునః,
గుహం వచన మక్లీబో రామో హేతుమ దబ్రవీత్. ౯౫
నేదానీం గుహ! యోగ్యోఽయం వాసో మే సజనే వనే,
అవశ్యం హ్యాఽఽశ్రమే వాసః కర్తవ్య స్తద్గతో విధిః. ౯౬

సోఽహం గృహీత్వా నియమం తపస్విజనభూషణమ్,
హితకామః పితు ర్భూయ స్సీతాయా లక్ష్మణస్య చ. ౯౭
జటాః కృత్వా గమిష్యామి న్యగ్రోధక్షీర మానయ,

తత్క్షీరం రాజపుత్త్రాయ గుహః క్షిప్ర ముపాహరత్. ౯౮

లక్ష్మణ స్యాఽఽత్మన శ్చైవ రామ స్తేనాకరో జ్జటాః,

దీర్ఘబాహు ర్నరవ్యాఘ్రో జటిలత్వ మధారయత్. ౯

నాపిన్నతల్లియగు కైకేయి నీ వయోధ్యకుఁ బోయినవెనుక నిన్నుఁ జూచి "రాముఁ డడవికిఁ బోయినాఁడు" అని నమ్మకంబు నొందును. ౨౧

నేను వనంబునకుఁ బోయినపిమ్మటఁ గైకేయి యీసమాచారమును విని సంతోషంబు నొందినవెనుకఁ గదా! ధార్మికుఁడగు దశరథునందు, "అబద్ధంబుఁ జెప్పువాఁడు" అను సంశయమును వదలును. ౨౨

నాపిన్నతల్లి కైకేయి భరతునిచేఁ జక్కఁగాఁ బరిపాలింపఁబడుటం జేసి వృద్ధినొందిన రాజ్యముం బొందుటయె నాకు ముఖ్యము. ౨౩

అట్లుకావున నాకును దశరథునకును బ్రియంబు గలుగుటకై నీ విప్పుడు రథంబుతో నయోధ్యకుఁ బొమ్ము. నీ కేయేమాటలం జెప్పినానో వాని నన్నింటిని ఎచ్చుతక్కువలు లేక వారివారితోఁ జెప్పుము. అని రాముఁడు సుమంత్రునకుం జెప్పెను. ౨౪

ధైర్యశాలియగు రాముఁ డిట్లు సుమంత్రునకుం జెప్పి యతనిం బలుమాఱు లూఱడించి గుహుం జూచి సహేతుకంబుగా నిట్లని చెప్పెను.

గుహుఁడా! ఇప్పుడు నేను జనసంచారముతోఁ గూడిన యీవనప్రదేశమునం దుండుట సరిగాదు. ఆవశ్యముగా నాశ్రమములయందె యుండవలయును. తండ్రియాజ్ఞ యట్లే యున్నది. ౨౫

అట్లు కావున నేను ముఖ్యముగా మహర్షు లవలంబించునట్టి వ్రతంబు నవలంబించి నాతండ్రి దశరథునకును సీతకును లక్ష్మణునకును మేలు గలుగుటకై జటలు దాల్చి వనంబునకుఁ బోయెదను. నీవు మఱ్ఱిపాలు తెమ్ము. అని రాముఁడు గుహునకుఁ జెప్పెను. ౨౬

గుహుఁడు రాచకొమరుఁడగు రామునకు అమఱ్ఱిపాలను శీఘ్రముగాఁ గొనితెచ్చి యిచ్చెను. ౨౭

రాముఁడు మొదల లక్ష్మణుని ఆమఱ్ఱిపాలతో జటల ధరింపఁజేసి తానును జటలం దాల్చెను.

ఇట్లు, మహాబాహుఁడును బురుషశ్రేష్ఠుఁడునగు రాముఁడు జటలం దాల్చెను. ౨౮

తౌ తదా చీరవసనౌ జటామణ్డలధారిణౌ,
అశోభేతా మృషిసమౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ. ౭౦
తతో వైఖానసం మార్గ మాస్థిత స్సహలక్ష్మణః,
వ్రత మాదిష్టవా న్రామ స్సఖాయం గుహ మబ్రవీత్. ౭౧

అప్రమత్తో బలే కోశే దుర్గే జనపదే తథా,
భవేథా గుహ! రాజ్యం హి దురారక్ష్యతమం మతమ్. ౭౨

తత స్తం సమనుజ్ఞాయ గుహ మిక్ష్వాకునన్దనః,
జగామ తూర్ణ మవ్యగ్ర స్సభార్య స్సహలక్ష్మణః. ౭౩

స తు దృష్ట్వా నదీతీరే నావ మిక్ష్వాకునన్దనః,
తితీర్షు శ్శీఘ్రగాం గఙ్గా మిదం లక్ష్మణ మబ్రవీత్. ౭౪
ఆరోహ త్వం నరవ్యాఘ్ర! స్థితాం నావ మిమాం శనైః,
సీతాం చాఽఽరోపయాఽన్వక్షం పరిగృహ్య మనస్వినీమ్. ౭౫

స భ్రాతు శ్శాసనం శ్రుత్వా సర్వ మప్రతికూలయన్,
ఆరోప్య మైథిలీం పూర్వ మారురోహాఽఽత్మవాం స్తతః. ౭౬

అథాఽఽరురోహ తేజస్వీ స్వయం లక్ష్మణపూర్వజః,

తతో నిషాదాధిపతి ర్గుహో జ్ఞాతీ నచోదయత్.

అప్పుడు వల్కలంబులం గట్టుకొని జటాసమూహంబు దాల్చి ఋషులం బోలియున్న యారామలక్ష్మణు లెంతయుం బ్రకాశించిరి. ౭౦

అంత రాముఁడు లక్ష్మణునితోఁ గూడ విఖనస్సను మహర్షి చేఁ జెప్పంబడిన మార్గంబున వానప్రస్థవ్రతంబు నవలంబించి తనస్నేహితుఁడగు గుహుం జూచి యిట్లని చెప్పెను. ౭౧

గుహుఁడా! రాజ్యమును రక్షించుట మిక్కిలియుఁ గష్టము గావున నీవు చతురంగబలమునందును బొక్కసమునందును దుర్గములందును దేశము నందును ఎంతమాత్రము నేమఱుపాటు లేకుండ వర్తింపవలయును. అని రాముఁడు గుహునకుం జెప్పెను. ౭౨

అంత నిక్ష్వాకువంశంబునం బుట్టినవారలకు సంతోషంబు సేయునట్టి రాముఁడు ఆగుహుని వీడుకొల్పి భార్యను లక్ష్మణునిం గూడి యవ్యగ్రుఁడై శీఘ్రంబుగాఁ బోయెను. ౭౩

రాముఁ డట్లుపోయి యేటిగట్టున నోడం జూచి వడిగాఁ బాఱుచున్న గంగానదిని దాఁటం గోరి లక్ష్మణుం జూచి యిట్లని చెప్పెను. ౭౪

పురుషశ్రేష్ఠుఁడవగు లక్ష్మణుఁడా! కదలక నిలిచియున్న యీ యోడను నీవు మెల్లఁగా నెక్కుము. పిమ్మట మనస్వినియగు సీతను జేతులతో నెత్తి యెక్కునట్లు సేయుము. అని రాముఁడు లక్ష్మణునకుఁ జెప్పెను. ౭౫

ఆలక్ష్మణుఁడు అన్నయగు రామునాజ్ఞను విని బుద్ధిమంతుఁడు గావున ముందు సీత నెక్కించి యాపిమ్మటఁ దా నెక్కుటయె రామునియిష్టంబని యెఱింగి రాము నభిప్రాయంబునకు విరోధంబు గలుగకుండునట్లు మొదల సీత నోడపై నెక్కించి యాపిమ్మటఁ దా నెక్కెను. ౭౬

మహాపరాక్రమశాలియు లక్ష్మణున కన్నయునగు రాముఁడు, అటు పిమ్మటఁ దా నోడపై నెక్కెను.

అంత నిషాదులకుఁ బ్రభువైన గుహుఁడు తనబంధువులఁ జూచి 'ఓడను మీర లావలిగట్టుఁ జేర్పుఁడు.' అని యాజ్ఞాపించెను.

రాఘవోఽపి మహాతేజా నావ మారుహ్య తాం తతః,
బ్రహ్మవ త్క్షత్రవ చ్చైవ జజాప హిత మాత్మనః. ౭౮

ఆచమ్య చ యథాశాస్త్రం నదీం తాం సహ సీతయా,
ప్రాణమ త్ప్రీతిసంహృష్టో లక్ష్మణశ్చామితప్రభః. ౭౯

అనుజ్ఞాయ సుమన్త్రం చ సబలం చైవ తం గుహమ్,
ఆస్థాయ నావం రామ స్తు చోదయామాస నావికాన్. ౮౦
తత స్తై శ్చోదితా సా నౌః కర్ణధారసమాహితా,
శుభస్ఫ్యవేగాభిహతా శీఘ్రం సలిల మత్యగాత్. ౮౧
మధ్యం తు సమనుప్రాప్య భాగీరథ్యా స్త్వనిన్దితా,
వైదేహీ ప్రాఞ్జలి ర్భూత్వా తాం నదీ మిద మబ్రవీత్. ౮౨
పుత్రో దశరథ స్యాయం మహారాజస్య ధీమతః,
నిదేశం పాలయి త్వేమం గఙ్గే! త్వదభిరక్షితః. ౮౩
చతుర్దశ హి వర్షాణి సమగ్రా ణ్యుష్య కాననే,
భ్రాత్రా సహ మయా చైవ పునః ప్రత్యాగమిష్యతి. ౮౪
తత స్త్వాం దేవి! సుభగే! క్షేమేణ పునరాగతా,
యక్ష్యే ప్రముదితా గఙ్గే! సర్వకామసమృద్ధినీ. ౮౫
త్వం హి త్రిపథగా దేవి! బ్రహ్మలోకం సమీక్షసే,
భార్యా చోదధిరాజస్య లోకేఽస్మి న్సంప్రదృశ్యసే. ౮౬

సా త్వాం దేవి! నమస్యామి ప్రశంసామి చ శోభనే!,
ప్రాప్తరాజ్యే నరవ్యాఘ్రే శివేన పున రాగతే, ౮౭

మహాతేజుఁడగు రాముఁడును ఓడనెక్కి యంత బ్రాహ్మణక్షత్రియులకు రెండుజాతులకును సాధారణముగ జపింపఁదగిన "దైవీం నావం" అను నావారోహణమంత్రమును, తనకు మేలుగలుగుటకై జపించెను. ౮౮

రాముఁడు సీతతోఁగూడ నాచమించి పరమసంతోషంబున దేహాంబంతయుం గగుర్పాటు నొంద యథాశాస్త్రముగా నాగంగానదికి నమస్కారముచేసెను. అట్లు కొలఁదిలేని కాంతిగల లక్ష్మణుఁడును నమస్కారము చేసెను. ౮౯

రాముఁ డంత సుమంత్రుని సైన్యసమేతుఁడగు గుహుని వీడుకొల్పి ఓడలోఁ గూర్చుండి నావికులను, "ఓడనడుపుఁ" డని యాజ్ఞాపించెను. ౯౦

అంత నానావికులు ఎచ్చరికగల్గి సుందరంబులగు తెడ్లతో వేగంబున నాయోడం ద్రోయఁగా నది శీఘ్రంబునను దరిఁజేరినది. ౯౧

అనిందితయగు సీతాదేవి ఓడ నదీమధ్యప్రదేశమును జేరఁగానే చేతులు మొగుడ్చుకొని గంగానదిం జూచి యిట్లని చెప్పినది. ౯౨

భక్తుల కోర్కులం దీర్చునట్టి గంగానదీ! బుద్ధిమంతుఁడగు దశరథ మహారాజు పుత్రుఁడైన యీ రాముఁడు పదునాలుగుసంవత్సరంబులు వనంబున నుండి తండ్రియాజ్ఞను నిర్వర్తించి తమ్మునితోను నాతోను గూడి మరల నిచ్చటికి వచ్చినప్పుడు నేను క్షేమంబున మరల నిచ్చటికి వచ్చినదాననై సమస్తకామంబులం బొంది పరమసంతోషంబున నిన్నేఁ బూజించెదను. ౯౩

గంగాదేవీ! నీవు స్వర్గమర్త్యపాతాళలోకంబులఁ దిరుగుదానవు. గావున బ్రహ్మలోకంబునుం గూడఁ జూచుచున్నావు. సముద్రంబునకుభార్యవు గావున నీలోకంబున నందఱకు నగపడుచున్నావు.

మంగళప్రదవగు గంగాదేవీ! నేను నీకు నమస్కారంబు చేసెదను. నిన్నుఁ బ్రస్తుతించెదను. ౯౪

పురుషశ్రేష్ఠుఁడగు రాముఁడు క్షేమంబున మరల నిచ్చటికి వచ్చి

గవాం శతసహస్రాణి వస్త్రాణ్యన్నంచ పేశలమ్,
బ్రాహ్మణేభ్యః ప్రయచ్ఛామి తవ ప్రియచికీర్షయా. ౮౮
సురాఘటసహస్రేణ మాంసభూతౌదనేన చ,
యక్ష్యే త్వాం ప్రయతా దేవి! పురీం పునరుపాగతా. ౮౯

యాని త్వత్తీరవాసీని దైవతాని వసన్తి చ,
తాని సర్వాణి యక్ష్యామి తీర్థాన్యాయతనాని చ. ౯౦

పునరేవ మహాబాహు ర్మయా భ్రాత్రా చ సంగతః,
అయోధ్యాం వనవాసాత్తు ప్రవిశత్వనఘోఽనఘే!. ౯౧

తథా సమ్భాషమాణా సా సీతా గఙ్గా మనిన్దితా,
దక్షిణా దక్షిణం తీరం క్షిప్ర మేవాభ్యుపాగమత్. ౯౨
తీరం తు సమనుప్రాప్య నావం హిత్వా నరర్షభః,
ప్రాతిష్ఠత సహ భ్రాత్రా వైదేహ్యా చ పరన్తపః. ౯౩

అథాబ్రవీ న్మహాబాహు స్సుమిత్రానన్దవర్ధనమ్,

భవ సంరక్షణార్థాయ సజనే విజనేఽపి వా. ౯౪

అవశ్యం రక్షణం కార్య మదృష్టే విజనే వనే,

అగ్రతో గచ్ఛ సౌమిత్రే! సీతా త్వా మనుగచ్ఛతు. ౯౫
పృష్ఠతోఽహం గమిష్యామి త్వాం చ సీతాం చ పాలయన్,

రాజ్యంబు నొందినపిమ్మట నేను నీకు సంతోషంబు గలుగుటకై లక్షగోవులను వస్త్రంబులను మనోహరంబగు నన్నంబును బ్రాహ్మణుల కొసంగెదను.

గంగాదేవీ! నేను మరల నయోధ్యకు వచ్చినపిమ్మట పరిశుద్ధంబగు మనంబున నీకు వేయిబానల మద్యంబును మాంసంబును సమర్పించి పూజ చేసెదను. ౭౯

నీతీరంబున నేయేదేవత లుండురో వారల నందఱం బూజించెదను. మఱియు నీతీరంబున నున్న తీర్థంబులను దేవాలయంబులను అన్నింటిని బూజించెదను. ౮౦

పాపరహితవగు గంగానదీ! పాపరహితుఁడును మహాబాహుఁడు నగు రాముఁడు వనవాసంబు చేసినపిదప నన్నును దమ్ముని గూడి మరల క్షేమంబున నయోధ్యం బ్రవేశించునట్లు అనుగ్రహింపుము. అని సీతాదేవి గంగానదిం బ్రార్థించినది. ౮౧

నిందింపఁబడనిదియును సమర్థురాలు నగు నాసీతాదేవి యట్లు గంగానదిం బ్రార్థించుచునే శీఘ్రంబున దక్షిణపుగట్టుం జేరెను. ౮౨

శత్రువులం దపింపఁజేయునట్టి పురుషశ్రేష్ఠుఁడగు రాముఁడు ఓడ గంగానదిదక్షిణపుగట్టుఁ జేరఁగానే యోడనుండి డిగ్గి భార్యను దమ్ముని గూడి యప్పాలిదారిఁ బట్టి పోయెను. ౮౩

అంత మహాబాహుఁడగు రాముఁడు సుమిత్రకు సంతోషంబు నేయు నట్టి లక్ష్మణుం జూచి యిట్లని చెప్పెను.

నీ వింక జనులు లేనిచోటఁ గాని జను లున్నచోటఁ గాని యంతటను జాగ్రత్తతో మమ్ము రక్షించు చుండవలయును. ౮౪

మన మిదివఱ కెప్పుడును జూచియుం జెఱుంగని విజనంబగు వనంబునకుఁ బోవుచున్నాము. కావున నవశ్యము రక్షించుకొనవలసినది.

లక్ష్మణుఁడా! నీవు ముందు పొమ్ము. సీత నీవెంబడి వచ్చుఁగాక. ౮౫

నేను నిన్నును సీతను మీయిద్దఱను రక్షించుచు సీతవెనుకను వచ్చెదను.

అన్యోన్యస్యేహ నో రక్షా కర్తవ్యా పురుషర్షభ!. ౯౬

న హి తావ దతిక్రాన్తా సుకరా కాచన క్రియా,

అద్య దుఃఖం తు వైదేహీ వనవాసస్య వేత్స్యతి. ౯౭

ప్రణష్టజనసమ్బాధం క్షేత్రారామవివర్జితమ్,
విషమం చ ప్రపాతం చ వన మద్య ప్రవేక్ష్యతి. ౯౮

శ్రుత్వా రామస్య వచనం ప్రతస్థే లక్ష్మణోఽగ్రతః,
అనన్తరం చ సీతాయా రాఘవో రఘునన్దనః. ౯౯

గతం తు గఙ్గాపరపార మాశు
రామం సుమన్త్రః ప్రతతం నిరీక్ష్య,
అధ్వప్రకర్షా ద్వినివృత్తదృష్టి
ర్ముమోచ బాష్పం వ్యథిత స్తపస్వీ. ౧౦౦
స లోకపాలప్రతిమప్రభావవాం
స్తీర్త్వా మహాత్మా వరదో మహానదీమ్,
తత స్సమృద్ధా ఞ్ఛుభసస్యమాలినః
క్రమేణ వత్సా న్ముదితా నుపాగమత్. ౧౦౧
తౌ తత్ర హత్వా చతురో మహామృగా
న్వరాహ మృశ్యం పృషతం మహారురుమ్,
ఆదాయ మేధ్యం త్వరితం బుభుక్షితౌ
వాసాయ కాలే యయతు ర్వనస్పతిమ్. ౧౦౨

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే ద్విపఞ్చాశస్సర్గః.

పురుషశ్రేష్ఠుఁడవగు లక్ష్మణుఁడా ! ఈవనంబున మనము, ఒకరి నొకరు రక్షించుకొనుచుండవలయును. ౯౫

ఏకార్యమయినను చెడిపోయినపిమ్మట దాని మరల సరిచేయ నలవిగాదు. కావున నట్టి చెడుగురాకుండ మనము ఎచ్చరికతో నుండవలయును. ౯౬

ఇప్పుడు సీతకును వనంబులో నుండుటవలనం గలుగు దుఃఖము దెలియం గలదు. ౯౭

సీత యిప్పుడు జనసమ్మర్దములేక పంటభూములుగాని తోఁటలుగాని లేక మిట్టపల్లములయి చఱియలు గలిగియున్న వనప్రదేశంబులం బ్రవేశింపఁ గలదు. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౯౮

లక్ష్మణుఁడు రామునిమాటను విని సీతకు ముందు పోయెను. సీత యతనివెంబడిగా నడచినది. రఘువంశమునం బుట్టిన వారల సంతసింపఁజేయం నట్టి రాముఁడు సీతను వెంబడించి పోయెను. ౯౯

శోచనీయుఁడగు సుమంత్రుఁడు రాముఁడు గంగానది యవ్వలిగట్టుఁ జేరువఱకు నతని విడువక చూచుచుండి యంత నతఁడు దూరంబు పోవుట వలన దృష్టి యానకుండుటంజేసి దుఃఖితుఁడై కన్నీళ్లు విడిచెను. ౧౦౦

దేవేంద్రునకుంబోలె మహాప్రభావంబు గలవాఁడును మహాత్ముఁడును భక్తులకు వరంబులొసంగువాఁడు నగు నారాముఁడు గంగానదిని దాఁటి యంతఁ గ్రమంబున మంచిసస్యసమూహంబులు గలిగి సమృద్ధంబయి యున్న దియుం సంతసించిన జనులతోఁ గూడినదియు నగు వత్సదేశంబు నొందెను.

ఆరామలక్ష్మణులు అచ్చట నాఁకలిగొని వరాహంబును మనుఁబోతును దుప్పిని నల్లచాఱలదుప్పిని ఈనాలుగుమృగంబులం జంపి పరిశుద్ధంబగు వాని మాంసంబు నాహారంబుగాఁ గొని సాయంకాలము కాఁగానే నివాసార్థమయి యొకవృక్షముక్రిందం జేరిరి. ౧౦౧

ఇది యేబదిరెండవ సర్గము.



## త్రిపఞ్చాశస్సర్గః

స తం వృక్షం సమాసాద్య సన్ధ్యా మన్వాస్య పశ్చిమామ్,
రామో రమయతాం శ్రేష్ఠ ఇతి హోవాచ లక్ష్మణమ్. ౧

అద్యేయం ప్రథమా రాత్రి ర్యాతా జనపదా ద్బహిః,
యా సుమన్త్రేణ రహితా తాం నోత్కణ్ఠితు మర్హసి. ౨

జాగర్తవ్య మతన్ద్రిభ్యా మద్యప్రభృతి రాత్రిషు,
యోగక్షేమౌ హి సీతాయా వర్తేతే లక్ష్మణా!ఽఽవయోః. 3

రాత్రిం కథంచి దే వేమాం సౌమిత్రే! వర్తయామహే,
ఉపావర్తామహే భూమా వాస్తీర్య స్వయ మార్జితైః. ౪

స తు సంవిశ్య మేదిన్యాం మహార్హ శయనోచితః,
ఇమాః సౌమిత్రయే రామో వ్యాజహార కథాః శుభాః. ౫
ధ్రువ మద్య మహారాజో దుఃఖం స్వపితి లక్ష్మణ!,
కృతకామా తు కైకేయీ తుష్టా భవితు మర్హతి. ౬

సా హి దేవీ మహారాజం కైకేయీ రాజ్యకారణాత్,
అపి న చ్యావయే త్ప్రాణాన్ దృష్ట్వా భరత మాగతమ్. ౭

అనాథ శ్చ హి వృద్ధ శ్చ మయా చైవ వినాకృతః,
కిం కరిష్యతి కామాత్మా కైకేయీవశ మాగతః. ౮

## ఏఁబదిమూఁడవ సర్గము

ఇతరుల సంతసింపఁజేయుం వారలలో నుత్తముఁడగు రాముఁడు ఆచెట్టు నొద్దకుఁ బోయి సాయంకాలసంధ్య నుపాసించి లక్ష్మణుం జూచి యిట్లని చెప్పెను. ౧

ఇప్పుడు మనము మనదేశమును దాఁటి వచ్చియున్నాము. సుమంత్రుఁడును బోయినాఁడు. ఇది మనము వనంబున నొంటరిగా నుండు రాత్రులలో మొదటిది. నీవు దుఃఖింపవలదు. ౨

మనయోగక్షేమంబులను మనకు మనమె చూచుకొనఁగలవారలమె యయినను సీత తనయోగక్షేమంబులం దాను జూచుకొనం జాలదుకావున దాని యోగక్షేమంబులను మనమె చూడవలసియున్నది. కావున ఇదిమొదలు రాత్రులందు మనము మేలుకొని యుండవలసినది. ౩

లక్ష్మణుఁడా! మనమిచ్చటికి వచ్చువఱకే యస్తమయ మయినది కావున చక్కఁగాఁ బర్ణములచే శయ్యనిర్మించుకొనుట కవకాశములేదు. కాఁబట్టి మనమె కొంచెము పండుటాఁకులు మొదలగువానిం బఱచుకొని పరుండి యెట్లయినను ఈరాత్రిం గడపుదము అని రాముఁడు లక్ష్మణునకుఁ జెప్పెను. ౪

ఉత్తమంబగు పాన్పుపైఁ బరుండఁదగినయా రాముఁడు నేలం బరుండి లక్ష్మణునకు, ఈప్రకారముగాఁ మంచిమాటలం జెప్పెను. ౫

లక్ష్మణుఁడా! ఇప్పుడు దశరథమహారాజునకు దుఃఖంబున నిద్ర చక్కఁగాఁ బట్టకుండును. ఇది నిశ్చయము. కైకేయిమాత్రము తనకోర్కి నెఱవేర్చుకొన్నది కావున సంతోషంబు నొంది యుండును. ౬

ఆకైకేయి భరతుఁడు పట్టాభిషేకమునకై వచ్చినపిదప వానిం జూచి యయినను ఇంకఁ దనకొడుకునకుఁ బట్టాభిషేకంబు గలుగం గలదని రాజ్యాపేక్షచే దశరథమహారాజు ప్రాణంబులు దీయకుండునుగదా! ౭

దశరథుఁ డనాథుఁడు వృద్ధుఁడు. నేను నతనినివిడిచివచ్చినాను. కామాత్ముఁడు కావున కైకేయిచేతం జిక్కుకొనియున్నాఁడు. ఇంకనేమి సేయఁగలఁడు?

ఇదం వ్యసన మాలోక్య రాజ్ఞ శ్చ మతివిభ్రమమ్,
కామ ఏ వార్థధర్మాభ్యాం గరీయా నితి మే మతిః. ౯
కో హ్యవిద్వా నపి పుమాన్ ప్రమదాయాః కృతే త్యజేత్,
ఛన్దానువ ర్తినం పుత్రం తాతో మా మివ లక్ష్మణ!. ౧౦

సుఖీ బత! సభార్య శ్చ భరతః కైకయీసుతః,
ముదితా న్కోసలా నేకో యో భోక్ష్య త్యధిరాజవత్. ౧౧

స హి సర్వస్య రాజ్యస్య ముఖ మేకం భవిష్యతి,
తాతే చ వయసాఽతీతే మయి చారణ్య మాస్థితే. ౧౨

అర్థధర్మౌ పరిత్యజ్య యః కామ మనువర్తతే,
ఏవ మాపద్యతే క్షిప్రం రాజా దశరథో యథా. ౧౩

మన్యే దశరథాన్తాయ మమ ప్రవ్రాజనాయ చ,
కైకేయీ సౌమ్య! సమ్ప్రాప్తా రాజ్యాయ భరతస్య చ. ౧౪

అపీదానీం న కైకేయీ సౌభాగ్యమదమోహితా,
కౌసల్యాం చ సుమిత్రాం చ సమ్ప్రబాధేత మత్కృతే. ౧౫

మాస్మ మత్కారణా ద్దేవీ సుమిత్రా దుఃఖ మావసేత్,
అయోధ్యా మిత ఏవ త్వం కాల్యే ప్రవిశ లక్ష్మణ!. ౧౬

అహ మేకో గమిష్యామి సీతయా సహ దణ్డకాన్,

మన కిప్పుడు వచ్చినకష్టమును దశరథుని బుద్ధికిం గల్గిన తిరుగుపాటునుఁ జూడగా సర్వధర్మంబులకన్నఁ గామంబె యధికం బని నాకుఁ దోఁచుచున్నది. ౯

లక్ష్మణుఁడా! అపండితుఁ డైనను ఏపురుషుఁడును దశరథుఁడు నన్ను విడిచినట్లు ఆఁడుదానిమాట విని తాను చెప్పినట్లు వినుచుండు కొడుకును ఎంతమాత్రమును విడువఁడు. ౧౦

కైకేయికొడుకు భరతుఁడు మహారాజుగా సమృద్ధంబగు కోసల దేశంబు నంతయుఁ బాలింపఁగలఁడే! అయ్యో! అతనికిని అతని భార్యకును మాత్రము ఇంక సుఖమే. ౧౧

ఇంక దశరథుఁడు మృతినొంది నే నరణ్యంబునకుఁ బోయినపిమ్మట భరతుఁడె కదా! సమస్తరాజ్యంబునకు నద్వితీయంబుగఁ బ్రధానరాజుగా నుండఁ గలఁడు. ౧౨

ఎవ్వఁడు దశరథమహారాజుంబోలె సర్వధర్మంబులం బరిత్యజించి కామమునుమాత్రము నవలంబించునో అతనికి ఇప్పుడు దశరథమహారాజునకు వచ్చినట్లు శీఘ్రముగానే గొప్ప యాపద వచ్చును. ౧౩

శాంతుఁడవగు లక్ష్మణుఁడా! దశరథుఁడు చచ్చుటకును భరతునకు దొరతనంబు వచ్చుటకునే కైకేయి మనయింటం జేరినట్లు నాకుఁ దోఁచుచున్నది. ౧౪

కైకేయి యిప్పుడు తనకుఁగల్గినసౌభాగ్యంబుచేమదించి దేహంబు దెలియక నానిమిత్తమయి కౌసల్యను సుమిత్రను అవశ్యము బాధించుచునే యుండును. ౧౫

లక్ష్మణుఁడా! నానిమిత్తమయి సుమిత్రయుం దుఃఖంబునొందకుండుఁ గాక. మన మింక దూరము పోయినపిమ్మటఁ గష్టము. ఇచ్చటనుండియే నీవు ప్రొద్దున లేచి యయోధ్యకుఁ బొమ్ము. ౧౬

నే నొక్కఁడనె సీతతోఁ గూడ దండకారణ్యంబునకుఁ బోయెదను.

అనాథాయా హి నాథ స్త్వం కౌసల్యాయా భవిష్యసి. ౧౭

క్షుద్రకర్మా హి కైకేయీ ద్వేష్య మన్యాయ్య మాచరేత్,

పరిదద్యా హి ధర్మజ్ఞే భరతే మమ మాతరమ్. ౧౮

నూనం జాత్యన్తరే కస్మిం స్త్రియః పుత్త్రై ర్వియోజితాః,
జనన్యా మమ సౌమిత్రే! తస్మా దేత దుపస్థితమ్. ౧౯

మయా హి చిరపుష్టేన దుఃఖసంవర్ధితేన చ,
విప్రాయుజ్యత కౌసల్యా ఫలకాలే ధిగస్తు మామ్. ౨౦

మాస్మ సీమన్తినీ కాచి జ్జనయే త్పుత్త్ర మీదృశమ్,
సౌమిత్రే! యోఽహ మమ్బాయా దద్మి శోక మనన్తకమ్. ౨౧
మన్యే ప్రీతివిశిష్టా సా మత్తో లక్ష్మణ శారికా,
యస్యా స్త చ్ఛ్రూయతే వాక్యం శుకపాద మరే ర్దశ. ౨౨

శోచన్త్యా శ్చాల్పభాగ్యాయా న కించి దుపకుర్వతా,
పుత్త్రేణ కి మపుత్త్రాయా మయా కార్య మరిన్దమ!. ౨3

అల్పభాగ్యా హి మే మాతా కౌసల్యా రహితా మయా,
శేతే పరమదుఃఖార్తా పతితా శోకసాగరే. ౨౪

కౌసల్య యచ్చట దిక్కులేకున్నది. నీవు ఆవిడకుఁ గొంకసహాయుండవుగా నుండుము. ౧౭

కైకేయి దుష్టురాలు. ఒకవేళఁ దనద్వేషమును దీర్చుకొనుటకై కౌసల్యకేదైన గొప్ప యపకారము చేయును.

నీవు నాతల్లిని భరతున కప్పగింపుము. అతఁడు ధర్మజ్ఞుఁడు కావునఁ జక్కఁగా రక్షించును. ౧౮

లక్ష్మణుఁడా! నాతల్లి కౌసల్య పూర్వము జన్మాంతరంబున నెప్పుడో కొందఱుస్త్రీలకును వారికొడుకులకును వియోగముగల్గునట్లుచేసియుండును. ఇది వాస్తవము. అందువలననె యిట్లు సంభవించినది. ౧౯

కౌసల్య నన్ను బహుకాలముగాఁ బోషించి మిక్కిలియుఁ గష్టమునం బెంచినది. ఇంక నావలన శుశ్రూష మొదలగుఫలము నొందఁదగిన సమయంబుననే నావిడను విడిచి వచ్చినాను. నేను దహింపఁబడుదునుగాక. ౨౦

లక్ష్మణుఁడా! నేను తల్లికిఁ దుదలేని దుఃఖమును గలుగఁజేయుచున్నానే నాయట్టికొడుకు ఏస్త్రీకిని గలుగకుండుఁగాక. ౨౧

లక్ష్మణుఁడా! నాతల్లి కౌసల్య పెంచిన గోరువంకపిట్ట మనకౌసల్యతో వనంబునకుఁబోయెదమని చెప్పినప్పుడు "చిలుకా! శత్రువైనకైకేయి పాదమును గొఱుకుము" అని చెప్పినదిగదా! తిర్యగ్జాతియగు నాగోరువంకపిట్ట తన్నుఁబెంచినదని కౌసల్యకుఁ జేసినంత ప్రియమును గూడ ఆవిడకుఁ బుట్టిన పుత్త్రుఁడను మనుష్యుఁడ నైన నేను జేయనైతిని. కావున నాజన్మము నిరర్థకము. ౨౨

శత్రువుల నడంగఁద్రొక్కునట్టి లక్ష్మణుఁడా! ఇట్లు పరమదుఃఖంబు నొంది నేనుదక్క మఱి వేఱే కొడుకును లేనిదై పరితపించుచున్న యల్పభాగ్యురాలగు నాతల్లి కౌసల్యకు నేను బుత్త్రుండనై యుండియుఁ గొంచెమయిన నుపకారము సేయకున్నానే. నాచే నావిడకేమి ప్రయోజనము? ౨౩

నాతల్లి కౌసల్య యల్పభాగ్యురాలు. నేను విడిచివచ్చుటవలనఁ బరమదుఃఖితయయి దుఃఖసముద్రంబునం బడియున్నది. ౨౪

లక్ష్మణుఁడా! కోపంబు వచ్చునేని నే నొక్కఁడనె అయోధ్యను మాత్రమె కాదు ఈభూమి నంతయుం బాణంబుల నాక్రమింతును. ఇప్పుడు మాత్రము పరాక్రమంబు నవలంబింపఁగూడదు. ౨౫

పాపరహితుఁడవగు లక్ష్మణుఁడా! నేను అధర్మంబునకును బరలోకంబునకు భయపడియున్నాను. అందుచేతనే యిప్పుడు నేను బట్టాభిషేకముచేసికొనలేదు. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౨౬

రాముఁడు విజనంబగు వనంబునందు రాత్రికాలంబున నీమాటలును ఇంకఁ గొన్నిమాటలునుం జెప్పి విలపించి ముఖంబునిండఁ గన్నీళ్లు గాఱనంత మాటలాడఁజాలక యూరకుండెను. ౨౭

మంటలులేని యగ్నిహోత్రుని పోల్కి వేగరహితుఁడగు సముద్రుని భంగి నిట్లు విలపించి యూరకున్న రాముని జూచి లక్ష్మణుఁ డూఱడించెను.

ఆయుధధారులలోపల నుత్తముఁడవగు రాముఁడా! నీవు విడిచివచ్చినపిమ్మట నిప్పుడు అయోధ్యాపట్టణంబు చంద్రుఁడు లేని రాత్రియుంబోలెఁ గాంతిహీనంబై యుండును. ఇది నిశ్చయము. ౨౯

పురుషశ్రేష్ఠుఁడవగు రాముఁడా! నీవు ఇట్లు పరితపించుట యుక్తము గాదు. దీనివలన నాకును సీతకునుంగూడ దుఃఖము గలుగుచున్నది. ౩౦

రాముఁడా! సీతయుం నిన్నువిడిచి యుండదు. నేనును నిన్ను విడిచి యుండఁజాలను. జలంబుననుండి బయటవేయఁబడిన మత్స్యంబులు కొంచెము సేపైనను జీవింపఁజాలనట్లు నిన్నువిడిచి మే మిద్దఱమును గొంచెము సేపయినను జీవింపఁజాలము. ౩౧

శత్రువులం దపింపఁజేయునట్టి రాముఁడా! ఇప్పుడు నిన్ను విడిచి నేను దండ్రినిగాని శత్రుఘ్నునిగాని సుమిత్రనుగాని స్వర్గమునైనను గాని చూడ నొల్లను. అని లక్ష్మణుఁడు రాముని నూఱడించెను. ౩౨

అంత నాభోజనస్థలంబునను సుఖోపవిష్టులయి యున్న ధార్మికులగు

న్యగ్రోధే సుకృతాం శయ్యాం భేజాతే ధర్మవత్సలౌ. ౩౩

స లక్ష్మణస్యోత్తమపుష్కలం వచో
నిశమ్య చైవం వనవాస మాదరాత్,
సమా స్సమస్తా విదధే పరన్తపః
ప్రపద్య ధర్మం సుచిరాయ రాఘవః. ౩౪
తత స్తు తస్మి న్విజనే వనే తదా
మహాబలౌ రాఘవవంశవర్ధనౌ,
న తౌ భయం సమ్భ్రమ మభ్యుపేయతు
ర్యథైవ సింహౌ గిరిసానుగోచరౌ. ౩౫

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే త్రిపఞ్చాశస్సర్గః.

## చతుః పఞ్చాశ స్సర్గః

తే తు తస్మి న్మహావృక్షే ఉషిత్వా రజనీం శివామ్,
విమలేఽభ్యుదితే సూర్యే తస్మా ద్దేశా త్ప్రతస్థిరే. ౧

యత్ర భాగీరథీం గఙ్గాం యమునాఽభిప్రవర్తతే,
జగ్ము స్తం దేశ ముద్దిశ్య విగాహ్య సుమహద్వనమ్. ౨
తే భూమిభాగా న్వివిధా న్దేశాం శ్చాపి మనోరమాన్,
అదృష్టపూర్వా న్పశ్యన్త స్తత్ర తత్ర యశస్వినః. ౩
యథా క్షేమేణ గచ్ఛన్ స పశ్యంశ్చ వివిధా న్ద్రుమాన్,
నివృత్తమాత్రే దివసే రామ స్సౌమిత్రి మబ్రవీత్. ౪

ప్రయాగ మభితః పశ్య సౌమిత్రే ధూమ మున్నతమ్,

సీతారాములు అచ్చటికి సమీపంబున మఱ్ఱిచెట్టుక్రింద లక్ష్మణుఁడు చక్కఁగా నేర్పఱిచిన పాన్పుఁజూచి యందుఁ బవ్వళించిరి. 33

శత్రువులం దపింపఁజేయునట్టి రాముఁడు లక్ష్మణుఁడుచెప్పిన యుక్తమంబును సంపూర్ణార్థంబు నగుమాట నాదరంబున నాలకించి చిరకాలము వానప్రస్థవ్రతము సేయ నిశ్చయించి లక్ష్మణునితోఁ గూడఁ బదునాలుగు సంవత్సరంబులును వనవాసంబు సేయఁగోరెను. 34

అంత నప్పుడు ఆరామలక్ష్మణు లుండుస్థలము విజనంబగు వనంబైనను మహాబలశాలులును ధైర్యవంతులును గావున వారలు పర్వతసానువులందిరుగు సింహంబులంబోలె భయంబును గాని దొట్రుపాటును గాని యొంతమాత్రమును బొందకుండిరి. 35

ఇది యేఁబదిమూఁడవసర్గము

---

## ఏఁబదినాలవ సర్గము

ఆసీతారామలక్ష్మణులు ముగ్వురును ఆరాత్రి యంతయు నాగొప్పచెట్టుక్రింద నుండి సూర్యుఁడు చక్కఁగా నుదయించిన పిమ్మట బయలుదేఱి పోయిరి. 1

అధికమయినకీర్తిగల యాసీతారామలక్ష్మణులు గొప్పవనంబుఁ బ్రవేశించి అచ్చటచ్చట నిదివఱ కెప్పుడును జూడని నానావిధ ప్రదేశములను, మనోహరంబులగు నవాంతరదేశంబులనుం జూచుచు యమునానది భాగీరథి యను గంగానదితో సంగమించు ప్రదేశంబునుగూర్చి పోయిరి. 2,3

ఆరాముఁడు కష్టము లేకుండునట్లు మెల్లగా నడచుచు నానావిధంబులగు వృక్షంబులం జూచుచునుం బోయి ప్రొద్దుతిరుగఁగానే లక్ష్మణుంజూచి యిట్లని చెప్పెను. 4

లక్ష్మణుఁడా! ప్రయాగక్షేత్రమునకుఁ జుట్టును భగవంతుఁడగు నగ్ని

అగ్నే ర్భగవతః కేతుం మన్యే సన్నిహితో మునిః. ౫

నూనం ప్రాప్తాః స్మ సమ్భేదం గఙ్గాయమునయో ర్వయమ్,
తథాహి శ్రూయతే శబ్దో వారిణో వారిఘట్టితః. ౬

దారూణి పరిభిన్నాని వనజై రుపజీవిభిః,
భరద్వాజాశ్రమే చైతే దృశ్యన్తే వివిధా ద్రుమాః. ౭

ధన్వినౌ తౌ సుఖం గత్వా లమ్బమానే దివాకరే,
గఙ్గాయమునయో స్సన్ధౌ ప్రాపతు ర్నిలయం మునేః. ౮

రామ స్త్వాశ్రమ మాసాద్య త్రాసయ న్మృగపక్షిణః,
గత్వా ముహూర్త మధ్వానం భరద్వాజ ముపాగమత్. ౯

తత స్త్వాశ్రమ మాసాద్య మునే ర్దర్శనకాఙ్క్షిణౌ,
సీతయాఽనుగతౌ వీరౌ దూరా దేవాఽవతస్థతుః. ౧౦

స ప్రవిశ్య మహాత్మాన మృషిం శిష్యగణై ర్వృతమ్,
సంశితవ్రత మేకాగ్రం తపసా లబ్ధచక్షుషమ్. ౧౧
హుతాగ్నిహోత్రం దృష్ట్వైవ మహాభాగం కృతాఞ్జలిః,
రామ స్సౌమిత్రిణా సార్ధం సీతయా చాభ్యవాదయత్. ౧౨

న్యవేదయత చాత్మానం తస్మై లక్ష్మణపూర్వజః,

హోత్రుని ధ్వజంబగు ధూమంబు గ్రమ్మియున్నది చూడుము. కావున భరద్వాజమహాముని మనకు సమీపంబుననె యున్నాఁడని తలంచుచున్నాను. ౫

మన మిప్పుడు నిశ్చయముగా గంగాయమునాసంగమక్షేత్రంబునకు వచ్చినాము. జలంబుల పరస్పరఘట్టనంబునం గలుగుధ్వనియుఁ వినఁబడు చున్నది చూడుము. ౬

వన్యంబులగు వృక్షములు మొదలగు వానిచే జీవించుచుండు వారలు కఱకి పడవేసిన మ్రాఁకులున్నవి చూడుము. మఱియు భరద్వాజాశ్రమంబు నందు ఋషులచేఁ జక్కఁగా సంస్కరింపఁబడిన నానావిధవృక్షంబు లున్నవి చూడుము. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౭

ధనుర్ధరులగు నారామలక్ష్మణులు, సుఖంబుగా దారి నడచి సూర్యుఁడు వ్రాలునంతకు, గంగాయమునాసంగమస్థలంబునం దున్న భరద్వాజాశ్రమంబు నకుఁ జేరిరి. ౮

అంత రాముఁడు ఆశ్రమంబు ప్రవేశించి, తనయద్భుతాకారంబుఁ జూచి మృగపక్షులు బెదరఁ, గొంచెము దూరము పోయి భరద్వాజుని సమీపంబుఁ జేరెను. ౯

అంతఁ బరాక్రమశాలులగు నారామలక్ష్మణులు, సీతతోఁ గూడ నాశ్రమంబుఁ బ్రవేశించి భరద్వాజమహాముని దర్శనంబు గోరి సమయంబు దెలియుటకై కొంతసేపు దూరంబుననె కనిపెట్టి యుండిరి. ౧౦

అట్లు రాముఁడు భరద్వాజుఁడున్న గృహంబుం బ్రవేశించి, మహాత్ముఁడును శిష్యసమూహంబులచేఁ బరివేష్టితుండును, దీక్ష్ణంబగు నియమము గలవాఁడును, ధ్యానపరుఁడును, తపోబలంబున జ్ఞానచక్షుస్సు సంపాదించిన వాఁడును, మహాభాగుఁడు నగు భరద్వాజమహర్షిని హోమానంతరము సందర్శించి చేమోడ్పు గీలించి తానును లక్ష్మణుఁడును సీతయును నమస్కరించిరి. ౧౧,౧౨

లక్ష్మణుని యన్నయగు రాముఁడు భరద్వాజమహర్షికిఁ దనసంగతిఁ గూడఁ దెలుపుకొనెను.

పుత్రౌ దశరథస్యావాం భగవ! న్రామలక్ష్మణౌ. ౧౩

భార్యా మమేయం వైదేహీ కల్యాణీ జనకాత్మజా,
మాం చానుయాతా విజనం తపోవన మనిన్దితా. ౧౪

పిత్రా ప్రవ్రాజ్యమానం మాం సౌమిత్రి రనుజః ప్రియః,
అయ మన్వగమ ద్భ్రాతా వన మేవ దృఢవ్రతః. ౧౫
పిత్రా నియుక్తా భగవ న్ప్రవేక్ష్యామ స్తపోవనమ్,
ధర్మమేవ చరిష్యామ స్తత్ర మూలఫలాశనాః. ౧౬

తస్య తద్వచనం శ్రుత్వా రాజపుత్రస్య ధీమతః,
ఉపానయత ధర్మాత్మా గా మర్ఘ్య ముదకం తతః. ౧౭

నానావిధానన్నరసా న్వన్యమూలఫలాశ్రయాన్,
తేభ్యో దదౌ తప్తతపా వాసం చైవా భ్యకల్పయత్. ౧౮

మృగపక్షిభి రాసీనో మునిభి శ్చ సమ న్తతః,
రామ మాగత మభ్యర్చ్య స్వాగతేనాఽహ తం మునిః. ౧౯

ప్రతిగృహ్య చ తా మర్చా ముపవిష్టం స రాఘవమ్,
భరద్వాజోఽబ్రవీ ద్వాక్యం ధర్మయుక్త మిదం తదా. ౨౦
చిరస్య ఖలు కాకుత్స్థ! పశ్యామి త్వా మిహాఽగతం,

శ్రుతం తవ మయా చేదం వివాసన మకారణమ్. ౨౧

భగవంతుఁడవగు భరద్వాజుఁడా! మేము దశరథుని పుత్త్రులము. రామలక్ష్మణు లనంబడువారలము. ౧౩

కల్యాణియగు నీబిడ నాభార్య. జనకమహారాజుకూఁతు రయిన సీత.

ఈబిడ యనిందిత కావున, నేను విజనంబగు తపోవనంబునకు వచ్చుచున్నను నన్ను వెంబడించి వచ్చినది. ౧౪

దృఢవ్రతుఁడును దమ్ముఁడును బ్రియుఁడు నగు నీలక్ష్మణుఁడు నేను దండ్రిపనుపున నడవికి రాఁగా, వనంబునకె నన్ను వెంబడించి వచ్చినాఁడు.

భగవంతుఁడవగు భరద్వాజుఁడా! మేము తండ్రిపనుపునఁ దపోవనంబునకుఁ బోయెదము. అచ్చటఁ దపోవనంబున గడ్డలను ఫలంబులను దినుచు ధర్మంబునె యాచరింపుచుండెదము. అని రాముఁడు భరద్వాజునితోఁ జెప్పెను. ౧౬

ధర్మాత్ముఁడగు భరద్వాజుఁడు, బుద్ధిమంతుఁడగు నారాచకొమరుఁడయిన యారాముఁడు చెప్పినమాటను విని యంత మధుపర్కము నకై గోవును అర్ఘ్యజలంబునుం దెచ్చెను. ౧౭

తపస్వియగు భరద్వాజుఁడు, ఆసీతారామలక్ష్మణులకు అడవియందుఁ గల్గిన మూలఫలంబులు మొదలగు నానావిధంబులయిన యన్నంబుల నొసంగి వారలకు రాత్రిఁ బరుండుటకు వాసస్థానంబు నేర్పఱిచెను. ౧౮

భరద్వాజమహాముని చుట్టును మృగపక్షులచేతను మునులచేతనుం బరివేష్టితుఁడై, రాముని "నీకు స్వాగతం బగుఁగాక" యని పూజించి యటు పిమ్మట నతనిఁ జూచి యిట్లని చెప్పెను. ౧౯

ఆపూజం బ్రతిగ్రహించి సుఖోపవిష్టుఁడై యున్న రాముం జూచి యప్పుడు భరద్వాజుఁడు ధర్మయుక్తంబగు నీమాటం జెప్పెను. ౨౦

రాముఁడా! నాకు బహుకాలమునకు ఇచ్చటికి వచ్చిన నిన్నుం జూడం గల్గినది.

నిన్ను దశరథుఁడు నిష్కారణంబుగా నడవికిఁ బంపుటనుంగూడ నేను విన్నాను. ౨౧

అవకాశో వివిక్తోఽయం మహానద్యో స్సమాగమే,
పుణ్యశ్చ రమణీయ శ్చ వసత్విహా భవా న్సుఖమ్. ౨౨

ఏవ ముక్త స్తు వచనం భరద్వాజేన రాఘవః,
ప్రత్యువాచ శుభం వాక్యం రామ స్సర్వహితే రతః. ౨౩
భగవ! న్నిత ఆసన్నః పౌరజానపదో జనః,

సుదర్శ మిహ మాం ప్రేక్ష్య మన్యేఽహమిమ మాశ్రమమ్,
ఆగమిష్యతి వైదేహీం మాం చాపి ప్రేక్షకో జనః,

అనేన కారణే నాహ మిహ వాసం న రోచయే. ౨౫
ఏకాన్తే పశ్య భగవ! న్నాశ్రమస్థాన ముత్తమమ్,
రమేత యత్ర వైదేహీ సుఖార్హా జనకాత్మజా. ౨౬

ఏతచ్ఛ్రుత్వా శుభం వాక్యం భరద్వాజో మహామునిః,
రాఘవస్య తతో వాక్య మర్థగ్రాహక మబ్రవీత్. ౨౭
దశక్రోశ ఇత స్తాత! గిరి ర్యత్ర నివత్స్యసి,
మహర్షి సేవితః పుణ్య స్సర్వత స్సుఖదర్శనః. ౨౮
గోలాఙ్గూలానుచరితో వానరర్క్ష నిషేవితః,
చిత్రకూట ఇతి ఖ్యాతో గన్ధమాదనసన్నిభః. ౨౯
యావతా చిత్రకూటస్య నర శ్శృఙ్గా ణ్యవేక్షతే,
కల్యాణాని సమాధత్తే న పాపే కురుతే మనః. 30

ఋషయ స్తత్ర బహవో విహృత్య శరదాం శతమ్,

ఈ గంగాయమునా మహానదుల సంగమప్రదేశము వివిక్తమయినది. పుణ్యంబును రమ్యంబును గావున నీవిచ్చట సుఖంబుగా నుండుము. అని భరద్వాజుఁడు రామునితోఁ జెప్పెను. ౨౨

సమస్తప్రాణులకును మేలుసేయుటయం దాసక్తుఁడగు రాముఁడు భరద్వాజమహర్షి చెప్పినమాటను విని సవినయంబుగా నిట్లని బదులు చెప్పెను. ౨౩

భగవంతుఁడవగు భరద్వాజుఁడా! ఈస్థలము పట్టణవాసిజనులకును గ్రామవాసిజనులకును సమీపముగా నున్నది.

మమ్ముఁ జూడఁగోరునట్టి జనులు ఇచ్చట నన్ను సుఖంబుగాఁ జూడ వచ్చునని యెఱింగి నన్నును సీతనుఁ జూచుటకై యీయాశ్రమంబునకు వచ్చుచుందురు. అని తలంచుచున్నాను. ౨౪

ఈకారణముచేత నాకీయాశ్రమంబునం దుండుట కిష్టము లేదు.

కావున భగవంతుఁడవగు నీవు జనుల కెవ్వరికిని దెలియనిచోట నెచ్చట నైనను జనకమహారాజకూఁతురును సుఖం బనుభవింపఁ దగినదియు నగు సీతకు సంతోషంబు గల్గించునట్టి యుత్తమంబగు నాశ్రమంబు నాలోచించి చెప్పుము. అని రాముఁడు భరద్వాజునితోఁ జెప్పెను. ౨౬

భరద్వాజమహాముని రాముఁడు చెప్పినమాటలను విని యంత రాముఁడు గోరినట్టి స్థలంబు దేటపడ నీమాటం జెప్పెను. ౨౭

నాయనా! ఇచ్చటికిఁ బదికోసులదూరంబున మహర్షిసేవితంబును, పవిత్రంబును, అంతటను రమణీయంబును గొండముచ్చులును వానరంబులును భల్లూకంబులును గలదియును, గంధమాదనంబునకు సాటివచ్చునదియునగు చిత్రకూటంబను పర్వతంబున్నది. అందు నీవు నివసింపవచ్చును. ౨౮,౨౯

మనుష్యుఁ డెప్పుడు చిత్రకూటపర్వతము శిఖరంబులం జూచునో యప్పుడె యతనికిఁ బాపబుద్ధి వదలి మంగళకరంబులగు కార్యములయందే బుద్ధి జనించును. ౩౦

ఆచిత్రకూటపర్వతమునం దనేకులు ఋషులు క్రీడించినట్లు ఆశ్రమం

బునఁ గపాలాసనంబు వేయుంటవలనఁ దలలోనివెంద్రుకలుఁ జన్మంబును వీడి కపాలముమాత్రము మిగులునట్లు మహాతపంబు గావించి సశరీరంబుగా స్వర్గంబునకుఁ బోయిరి. ౩౧

రాముఁడా! ఆచిత్రకూటము మిక్కిలియు విజనమయినది. నీ కచ్చట సుఖంబుగానుండునని తోఁచుచున్నది. అట్లుగాదేని యిచ్చటనైనను నాతోఁ గూడ నివసించుచు నీవనవాసవ్రతమును నిర్వర్తించుకొనుము. అని భరద్వాజుఁడు రామునితోఁ జెప్పెను. ౩౨

ధర్మజ్ఞుఁడగు నాభరద్వాజుఁడు రామునకును సీతకును లక్ష్మణునకును వారు కోరిన యుపచారంబు లన్నియుఁ జేసి సంతోషము గల్గించెను. ౩౩

అట్లు ప్రయాగయందు రాముఁడు ఆభరద్వాజమహర్షి సమీపంబునం గూర్చుండి యర్థ్యో మాటలం జెప్పుచుండఁగా, పవిత్రంబగు రాత్రి వచ్చినది. ౩౪

సుఖోచితులగు నాసీతారామలక్ష్మణులు పరిశ్రాంతులై రమణీయంబగు నాభరద్వాజాశ్రమంబునందు ఆరాత్రి యంతయు సుఖంబుగా నుండిరి. ౩౫

పురుషశ్రేష్ఠుఁడగు రాముఁడు తెల్లవాఱఁగానే కాంతిచేఁ బ్రకాశించుచున్న భరద్వాజమహామునియొద్దకు వచ్చి యిట్లని చెప్పెను. ౩౬

సత్యస్వభావుఁడవు భగవంతుఁడవగు భరద్వాజుఁడా! మే మీరాత్రి యంతయు నీయాశ్రమమున నుంటిమిగదా? ఇంక నీ వానతిచ్చిన వాసస్థానంబునకుం బోయెదము. అనుజ్ఞ యొసంగుము. అని రాముఁడు భరద్వాజునితోఁ జెప్పెను. ౩౭

ఆరాత్రి కడచినపిమ్మట భరద్వాజుఁడు రామునిం జూచి, "తేనె మూలంబుల ఫలంబులు మున్నగువానిచే సమృద్ధంబగు చిత్రకూటంబునకుఁ బొమ్ము" అని చెప్పెను. ౩౮

మహాబలుఁడవగు రాముఁడా! ఆచిత్రకూటపర్వతము నీకు యుక్తమయిన వాసస్థానమని తలంచుచున్నాను.

నానానగగణోపేతః కిన్నరోరగసేవితః,
మయూరనాదాభిరుతో గజరాజనిషేవితః,
గమ్యతాం భవతా శైల శ్చిత్రకూట స్సవిశ్రుతః.
పుణ్య శ్చ రమణీయ శ్చ బహుమూలఫలాయుతః,
తత్ర కుఞ్జరయూథాని మృగయూథాని చాభితః.
విచరన్తి వనాన్తేఽస్మిం స్తాని ద్రక్ష్యసి రాఘవ!,

సరిత్ప్రస్రవణప్రస్థాన్దరీకన్దరనిర్ఝరాన్.
చరత స్సీతయా సార్ధం నన్దిష్యతి మన స్తవ,

ప్రహృష్టకోయష్టికకోకిలస్వనై
ర్వినాదితం తం వసుధాధరం శివమ్,
మృగై శ్చ మత్తై ర్బహుభి శ్చ కుఞ్జరై
స్సురమ్యమాసాద్య సమావసాఽశ్రమమ్.

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే చతుఃపఞ్చాశస్సర్గః.

---

## పఞ్చపఞ్చాశస్సర్గః

ఉషిత్వా రజనీం తత్ర రాజపుత్త్రా వరిన్దమౌ,
మహర్షిమభివాద్యాథ జగ్మతు స్తం గిరిం ప్రతి.

తేషాం చైవ స్వస్త్యయనం మహర్షి స్స చకార హ,
ప్రస్థితాం శ్చైవ తాన్ప్రేక్ష్య పితా పుత్త్రాని వాన్వగాత్

నీవు నానావిధవృక్షసమూహంబులతోఁ గూడినదియును కిన్నరోరగసేవితంబును మయూరధ్వనులతో నొప్పుచున్నదియును ఉత్తమంబులగు ఏనుంగులతోఁ గూడినదియును ప్రసిద్ధంబును పుణ్యంబును రమణీయంబును పెక్కుగడ్డలును ఫలంబులును గలదియునగు నాచిత్రకూటపర్వతంబునకుఁ బొమ్ము. ౪౦

రాముఁడా! ఆచిత్రకూటపర్వతంబున వనమధ్యప్రదేశంబునందు ఏనుఁగుల సమూహంబులును పెక్కు జింకలును దిరుగుచుండును. నీవు వానిం జూడఁగలవు. ౪౧

అచ్చటినదులను సెలయేఱులను గొండనెత్తములను చిన్నగుహలను పెద్దగుహలను జలప్రవాహంబులను జూచునప్పుడు నీకును సీతకును మిక్కిలియు సంతోషంబు గల్గును. ౪౨

సంతుష్టంబులయి మనోహరంబుగాఁ గూయుచున్న చీకుఁగొక్కెరలతోను కోయిలలతోను మృగంబులతోను పెక్కుమత్తగజంబులతోను ఒప్పుచున్నదియు సుందరంబును మంగళకరంబు నగు నాచిత్రకూటపర్వతంబుఁ జేరి యందాశ్రమంబు నిర్మించికొని యుండుము. అని భరద్వాజమహాముని రామునకుం జెప్పెను. ౪౩

ఇది యేఁబదినాలవసర్గము.

---

## యేఁబదియైదవ సర్గము

శత్రువుల నడఁగఁద్రొక్కఁజాలిన రాజపుత్రులగు నారామలక్ష్మణులు అట్లు రాత్రి యంతయుం నాభరద్వాజాశ్రమంబున నుండి యంతఁ బ్రాతఃకాలంబున లేచి భరద్వాజమహర్షికి నమస్కరించి, యాచిత్రకూటంబునకుఁ బోవుదారిం బట్టి పోయిరి. ౧

ఆభరద్వాజమహర్షి సీతారామలక్ష్మణులకు మంగళాశీర్వాదంబు లొసంగెను. అంత వారలు పయనం బగుటం జూచి తండ్రి కొడుకులను వెంబడించు నట్లు తాను వారల వెంబడించెను. ౨

తతః ప్రచక్రమే వక్తుం వచనం స మహామునిః,
భరద్వాజో మహాతేజా రామం సత్యపరాక్రమమ్.

గఙ్గాయమునయో స్సన్ధి మాసాద్య మనుజర్షభౌ,
కాళిన్దీ మనుగచ్ఛేతాం నదీం పశ్చాన్ముఖాశ్రితామ్.

తథాఽసాద్య తు కాళిన్దీం శీఘ్రస్రోతస మాపగామ్,
తస్యా స్తీర్థం ప్రచలితం పురాణం ప్రేక్ష్య రాఘవౌ.

తత్ర యూయం ప్లవం కృత్వా తరతాంశుమతీం నదీమ్
తతో న్యగ్రోధ మాసాద్య మహాన్తం హరితచ్ఛదమ్.
వివృద్ధం బహుభి ర్వృక్షైః శ్యామం సిద్ధోపసేవితమ్,
తస్మై సీతాఽఞ్జలిం కృత్వా ప్రయుఞ్జీతాశిష శ్శివాః.
సమాసాద్య తు తం వృక్షం వసేద్వాఽతిక్రమేత వా

క్రోశమాత్రం తతో గత్వా నీలం ద్రక్ష్యథ కాననమ్
పలాశబదరీమిశ్రం రమ్యం వంశైశ్చ యామునైః,

స పన్థా శ్చిత్రకూటస్య గత స్సుబహుశో మయా.
రమ్యో మార్దవయుక్త శ్చ వనదావై ర్వివర్జితః,

ఇతి పన్థాన మావేద్య మహర్షి స్సన్యవర్తత.

అంత, మహాప్రభావుఁడగు భరద్వాజమహాముని ఎచ్చటను వ్యర్థము కాని పరాక్రమంబు గల రామునిం జూచి యీమాటఁ జెప్ప నారంభించెను. 3

పురుషశ్రేష్ఠులగు రామలక్ష్మణులారా! మీరు మొదట గంగాయమునా సంగమస్థలమునకుఁ బోయి యచ్చట గంగానదీజలవేగముచేతఁ దిరుగుపాటు నొంది కొంచెము పడమరతట్టుగాఁ బాఱుచున్న యమున ననుసరించి పొండు. ४

రామలక్ష్మణులారా! మీర లంత యమునానది పడిగల్గి పాఱుచుండు స్థలమునకుఁ బోయి యందు పురాతనంబును జనుల కెప్పుడును దాఁటెడు స్థలంబునగు రేవుఁ జేరి యచ్చటఁ దెప్ప నిర్మించుకొని యమునానదిని దాఁటుఁడు. ౫

అంత నచ్చటఁ బచ్చనిమాకులు గలదియుఁ జుట్టును పెక్కువృక్షంబులఁ బరివేష్టితంబును సిద్ధసేవితంబు నగు శ్యామంబను నొక్క పెద్ద మఱ్ఱిచెట్టు గలదు. సీతాదేవి దానికి మ్రొక్కి తనకోర్కు లీడేఱవలయునని ప్రార్థించుకొనవలయును. ౬, ౭

ఆమఱ్ఱిచెట్టుఁ జేరి సీత యలసియుండు నేని యచ్చటనే కొంతసేపు విశ్రమింపవచ్చును. లేనిచోఁ బోవచ్చును.

అంత నొక్కకోసుదూరము పోయినపిమ్మటఁ బలాశవృక్షములతోను రేఁగుచెట్లతోను యమునాతీరంబునంబుట్టిన వెదుళ్లతోనుం గూడి రమణీయంబై నల్లఁగా నుండు నొక్కయడవిం జూడఁగలరు. ౮

అది చిత్రకూటపర్వతమునకుఁ బోవునట్టిమార్గము. నేనామార్గంబునఁ పెక్కుమార్లు చిత్రకూటంబునకుఁ బోయియుంన్నాను. అది రమ్యంబుగను నడచుటకు మెత్తఁగాను కార్చిచ్చుబాధ లేకయుం నుండును. అని భరద్వాజమహర్షి రామునకుఁ జెప్పెను. ౯

ఆభరద్వాజమహర్షి యీ ప్రకారముగా రామునకుఁ జిత్రకూటపర్వతంబునకుఁ బోవుమార్గంబుఁ జెప్పి యంతఁ దానాశ్రమంబునకుఁ బోయెను. ౧౦

అభివాద్య తథేత్యుక్త్వా రామేణ వినివర్తితః,
ఉపావృత్తే మునౌ తస్మి న్రామో లక్ష్మణ మబ్రవీత్. ౧౧

కృతపుణ్యా స్స్మ సౌమిత్రే! ముని ర్యన్నో౽నుకమ్పతే,
ఇతి తౌ పురుషవ్యాఘ్రౌ మన్త్రయిత్వా మనస్వినౌ. ౧౨
సీతామేవాగ్రతః కృత్వా కాళిన్దీం జగ్మతు ర్నదీమ్,

అథా౽సాద్య తు కాళిన్దీం శీఘ్రస్రోతోవహాం నదీమ్. ౧౩
చిన్తా మాపేదిరే సర్వే నదీజలతితీర్షవః,

తౌ కాష్ఠసఙ్ఘాత మథో చక్రతు స్సుమహాప్లవమ్. ౧౪
శుష్కై ర్వంశై స్సమాస్తీర్ణ ముశీరై శ్చ సమావృతమ్,
తతో వేతసశాఖాశ్చ జమ్బూశాఖాశ్చ వీర్యవాన్. ౧౫
చకార లక్ష్మణ శ్ఛిత్వా సీతాయా స్సుఖ మాసనమ్,

తత్ర శ్రియ మివాచిన్త్యాం రామో దాశరథిః ప్రియామ్. ౧౬
ఈషత్సంలజ్జమానాం తా మధ్యారోపయత ప్లవమ్,

పార్శ్వే చ తత్ర వైదేహ్యా వసనే భూషణాని చ. ౧౭
ప్లవే కఠినకాజం చ రామ శ్చక్రే సహాయుధైః,
ఆరోప్య సీతాం ప్రథమం సఙ్ఘాటం పరిగృహ్య తౌ. ౧౮
తతః ప్రతేరతు ర్యత్తౌ వీరౌ దశరథాత్మజౌ,

రాముఁడును, ఆభరద్వాజమహర్షికి నమస్కరించి "అలాగే పోం" దని వీడుకొలిపెను.

ఆభరద్వాజమహాముని యాశ్రమంబునకుఁ బోయినపిమ్మట రాముఁడు లక్ష్మణుం జూచి యిట్లని చెప్పెను. ౧౧

లక్ష్మణుఁడా! భరద్వాజమహామునికి మనయందు దయ గల్గియున్నది. కావున మనము పుణ్యవంతుల మని తోఁచుచున్నది.

పురుషశ్రేష్ఠులును ధైర్యవంతులు నగు నారామలక్ష్మణులు ఈప్రకారముగా నాలోచించుకొనుచు, సీతాదేవినే ముందిడుకొని యమునానదికిం బోయిరి. ౧౨

అంత శీఘ్రముగాఁ బాఱునట్టి యమునానదియొద్దఁ బోయినంతనె ఆసీతారామలక్ష్మణు లందఱును "దీని నెట్లు దాఁటఁగలము" అని చింత నొందిరి. ౧౩

అంత నారామలక్ష్మణులు కొయ్యలం గీసి వానికి ఎండినవెదుళ్లను జత పఱిచి, దారమునకు బదులుగా వట్టివేళ్లతోఁ గట్టి, పెద్దతెప్పగాఁ జేసిరి. ౧౪

అంత పరాక్రమవంతుఁడగు లక్ష్మణుఁడు ప్రబ్బలితీఁగెలను నేరెడుకొమ్మలను నఱికి వానిచే నాతెప్పపై సీతకు సుఖకరంబగు నాసనంబునొకటి నిర్మించెను. ౧౫

అప్పుడు దశరథపుత్రుఁడగు రాముఁడు లక్ష్మియుం బోలె నచింత్యంబగు సౌందర్యంబు గలదియుఁ గొంచెము సిగ్గుపడుచున్నదియు నగు ప్రియురాలిని తెప్పపై నెక్కించెను. ౧౬

రాముఁడు ఆతెప్పపై సీతప్రక్కను, అధికవస్త్రంబులను సొమ్ములను గుద్దలిని మేఁకతోలు గప్పినపుటికను ఆయుధంబులను ఉంచెను. ౧౭

అంత దశరథునికొడుకులును పరాక్రమవంతులు నగు నారామలక్ష్మణులు మొదట సీతను తెప్పపై నెక్కించి అటుపిమ్మటఁ దాము తెప్ప నెక్కి ప్రయత్నంబున యమునానదిని దాఁటిరి. ౧౮

కాళిన్దీమధ్య మాయాతా సీతా త్వేనామవన్దత. ౧౯

స్వస్తి దేవి! తరామి త్వాం పారయే న్మే పతి ర్వ్రతమ్,
యక్ష్యే త్వాం గోసహస్రేణ సురాఘటశతేన చ. ౨౦

స్వస్తి ప్రత్యాగతే రామే పురీ మిక్ష్వాకుపాలితామ్,

కాళిన్ది మథ సీతా తు యాచమానా కృతాఞ్జలిః. ౨౧
తీర మేవాభిసమ్ప్రాప్తా దక్షిణం వరవర్ణినీ,

తతః ప్లవేనాంశుమతీం శీఘ్రగా మూర్మిమాలినీమ్. ౨౨
తీరజై ర్బహుభి ర్వృక్షైః సన్తేరు ర్యమునాం నదీమ్,

తే తీర్ణాః ప్లవముత్సృజ్య ప్రస్థాయ యమునావనాత్. ౨౩
శ్యామం న్యగ్రోధ మాసేదు శ్శీతలం హరితచ్ఛదమ్,

న్యగ్రోధం త ముపాగమ్య వైదేహీ వాక్య మబ్రవీత్. ౨౪
నమ స్తేఽస్తు మహావృక్ష! పారయే న్మే పతి ర్వ్రతమ్,
కౌసల్యాం చైవ పశ్యేయం సుమిత్రాం చ యశస్వినీమ్. ౨౫

ఇతి సీతాఽఞ్జలిం కృత్వా పర్యగచ్ఛద్వనస్పతిమ్,

సీతాదేవి తెప్ప యమునానదిమధ్యప్రదేశంబుఁ జేరినంతనె యమునా నదికి ఈప్రకారముగా నమస్కారంబు చేసెను. ౧౯

యమునాదేవీ ! నే నిప్పుడు నిన్ను దాఁటుచున్నాను. నాకు మంగళము గలుగుఁగాక. నాపెనిమిటి వనవాసవ్రతంబును నిర్వర్తించుకొనునేని నేను నీకు వెయ్యావులను నూఱుమద్యభాండంబుల నొసంగి పూజించెదను.

రాముఁడు సుఖంబుగ మరల నిక్ష్వాకువంశ్యులగురాజులచేఁ బాలింపఁ బడునట్టి యయోధ్యాపురంబునకు రాఁగానే నీకు వెయ్యావులును నూఱు మద్యభాండంబులు నొసంగి పూజచేసెదను. అని సీతాదేవి యమునానదిం బ్రార్థించినది.

అంత నట్టి ఉష్ణకాలంబున సుఖశీతలమును శీతకాలమున సుఖోష్ణం బునగు నంగము గలిగి భర్తయందనురాగముగల యుత్తమవనితయగు సీతాదేవి, చేమోడ్పు గీలించి యమునానదిం బ్రార్థింపుచునే దక్షిణపుగట్టుం జేరినది. ౨౧

ఆ ట్లాసీతారామలక్ష్మణులు తీరంబులం బుట్టిన చెట్టులంగొట్టి తెప్ప గట్టుకొని సూర్యునికూఁతురియుం శీఘ్రముగాఁ బాఱునదియుం మిక్కిలియుం నలలుగలదియునగు యమునానదిని దాఁటిరి. ౨౨

ఆసీతారామలక్ష్మణు లట్లు యమునానదిని దాఁటి తెప్పను విడిచి యమునానదీతీరమునందలి వంబుననుండి పయనంబయి పోయి పచ్చని యాకులు గల్గి చల్లగా నుండు శ్యామంబను మఱ్ఱిచెట్టునొద్దకుఁ బోయిరి. ౨౩

సీతాదేవి యామఱ్ఱిచెట్టునొద్దకుఁబోయి యిట్లని ప్రార్థించినది. ౨౪

మహావృక్షమవగు శ్యామమా! నీకు నమస్కరించెదను. నాపెనిమిటి వనవాసవ్రతంబును సమాప్తి నొందించువాఁడగును. నేను మరలఁ గౌసల్యను మహాకీర్తిశాలినియగు సుమిత్రనుం జూతునుగాక. ౨౫

ఇట్లు ప్రార్థించి సీతాదేవి చేమోడ్పు గీలించి ఆశ్యామవృక్షంబునకుఁ బ్రదక్షిణంబుచేసెను.

అవలోక్య తత స్సీతా మాయాచ స్త్రీ మనిన్దితామ్. ౨౬
దయితాం చ విధేయాం చ రామో లక్ష్మణ మబ్రవీత్,

సీతా మాదాయ గచ్ఛ త్వ మగ్రతో భరతాగ్రజ. ౨౭
పృష్ఠతోఽహం గమిష్యామి సాయుధో ద్విపదాం వర!

య ద్య త్ఫలం ప్రార్థయతే పుష్పం వా జనకాత్మజా ౨౮
త త్త త్ప్రదద్యా వైదేహ్యై యత్రాఽస్యా రమతే మనః,

గచ్ఛతోఽస్తు తయో ర్మధ్యే బభూవ జనకాత్మజా. ౨౯
మాతఙ్గయో ర్మధ్యగతా శుభా నాగవధూ రివ

ఏకైకం పాదపం గుల్మం లతాం వా పుష్పశాలినీమ్. ౩౦
అదృష్టపూర్వాం పశ్యన్తీ రామం పప్రచ్ఛ సాఽబలా,
రమణీయా న్బహువిధా న్పాదపా న్కుసుమోత్కటాన్. ౩౧
సీతావచనసంరబ్ధ ఆనయామాస లక్ష్మణః,

విచిత్రవాలుకజలాం హంససారసనాదితామ్. ౩౨
రేమే జనకరాజస్య సుతా ప్రేక్ష్య తదా నదీమ్,

క్రోశమాత్రం తతో గత్వా భ్రాతరౌ రామలక్ష్మణౌ. ౩౩
బహూ న్మేధ్యా న్మృగా న్హత్వా చేరతు ర్యమునావనే.

విహృత్య తే బర్హిణపూగనాదితే
శుభే వనే వానరవారణాయుతే,

అంత రాముఁడు అట్లు కోర్కులం బ్రార్థించుచున్నదియును నతిందిత యును బ్రియురాలును దనకు విధేయురాలు నగు సీతాదేవిం జూచి సీతాదేవి కలసట గలుగలేదని యెంచి లక్ష్మణుం జూచి యిట్లని చెప్పెను. ౨౬

భరతునితమ్ముఁడవుఁ బురుషశ్రేష్ఠుఁడవునగు లక్ష్మణుఁడా! సీతను వెంటఁ బెట్టుకొని నీవు ముందు పొమ్ము. నే నాయుధధరుఁడ నై మీయిద్దఱివెంట వచ్చెదను. ౨౭

సీత పండును గాని పుష్పమును గాని దేనిఁ గోరునో దేనిం జూచి సంతసించునో దాని నంతయుఁ దీసికొనివచ్చి సీత కిమ్ము. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౨౮

అప్పు డారామలక్ష్మణుల నడుమం బోవుచున్న సీతాదేవి మగయేనుం గుల నడుమనున్న సుందరమయిన యాఁడేనుంగువలె నుండెను. ౨౯

సీత మున్ను దా నెప్పుడును జూడని వృక్షమును గాని చిన్నచెట్టును గాని మంచిపూలుంగల తీఁగెను గానిచూచినప్పుడు రాము నడుగుచుండెను. ౩౦

లక్ష్మణుఁడు సీత యడిగినంతనె త్వరితుఁడై సుందరంబులును నానా విధంబులు నగు పూలతో నిండిన మండెలను విఱిచి సీతకుఁ దెచ్చి యిచ్చు చుండెను. ౩౧

అప్పుడు జనకమహారాజుకొమార్తె యగు సీతాదేవి సుందరమయిన యిసుకయును నీళ్లను గలదియును మధురంబుగాఁ గూయు హంసపక్షులతోను సారసపక్షులతోనుం గూడినదియు నగుయమునానదిం జూచి సంతోషించెను.

అంత నన్నదమ్ములగు నారామలక్ష్మణులు యమునాతీరవనంబున నొక్క కోసువఱకుఁ బోయి భక్ష్యంబులగు మృగంబులం బెక్కులం జావిధతెం చిరి. ౩౩

అంతటికష్టంబు సంభవించినను దైన్యంబు నొందని యాసీతారామ లక్ష్మణులు మధురంబుగా ధ్వనించు నెమళ్లతోను గోఁతులతోను గజంబుల

తోడం గూడిన యడవియందు విహరించి మిట్టపల్లములు లేని యేటిగట్టుఁజేరి తమకు సమ్మతంబగు చోటం బరుండిరి. 38.

ఇది యేఁబదియైదవ సర్గము.

---

## ఏఁబదియాఱవ సర్గము

అంతఁ దెల్లవాఱినవెనుక రాముఁడు తాను నిద్రించి లేచినవిమ్మటఁ గొంచెము నిదురించినలక్ష్మణుని మెల్లఁగా మేలుకొలిపెను. ౧

శత్రుకులం దపింపఁజేయఁజాలినట్టి లక్ష్మణుఁడా! అడవియందుఁ బుట్టిన పక్షులు మనోహరంబుగాఁ గూయుచున్నవి చూడుము. మన మింక బయలు దేఱవలయును. బయలుదేఱవలసిన సమయంబు వచ్చినది. అని రాముఁడు లక్ష్మణుని మేలుకొలిపెను. ౨

అట్లు నిద్రవోవుచుండిన లక్ష్మణుఁడు రామునిచే యథాకాలంబున మేలుకొలుపంబడి నిద్రను సోమరితనమును మార్గాయాసంబును బరిత్యజించెను. 3

అంత నాసీతారామలక్ష్మణులు మువ్వురును లేచి శివంబగు నదీజలంబునఁ బ్రాతఃకాలంబునందుఁ జేయవలసిన స్నానాదికార్యంబుల నిర్వర్తించుకొని భరద్వాజమహర్షి చెప్పినట్లు చిత్రకూటపర్వతమార్గంబుఁ బట్టి పోయిరి. ౪

అంత రాముఁడు సరియయిన సమయంబునం బయనమయి పోవుచు లక్ష్మణునిఁ దామరపూఱేకులంబోలు కన్నులు గల సీతనుం జూచి యిట్లని చెప్పెను. ౫

సీతా! వసంతర్తువునందుఁ జక్కఁగా విరియఁబూచి యుండుటచే నిప్పు దగిలి మండునట్లున్నవియుఁ, బూలమాలికలు వేసికొనునట్లు చూపట్టుచున్నవియు నగు పలాశవృక్షంబులం జూడుము. ౬.

పశ్య భల్లాతకాన్ ఫుల్లా న్నరై రనుపసేవితాన్,
ఫలపత్రై రవనతా న్నూనం శక్ష్యామి జీవితుమ్.

పశ్య ద్రోణప్రమాణాని లంబమానాని లక్ష్మణ!,
మధూని మధుకారీభి స్సంభృతాని నగే నగే.
ఏష క్రోశతి నత్యూహ స్తం శిఖీ ప్రతికూజతి,
రమణీయే వనోద్దేశే పుష్పసం_స్తరసంకటే.
మాతఙ్గయూథానుసృతం పక్షిసంఘానునాదితమ్,
చిత్రకూట మిమం పశ్య ప్రవృద్ధశిఖరం గిరిమ్.

సమభూమితలే రమ్యే ద్రుమై ర్బహుభిరావృతే,
పుణ్యే రంస్యామహే తాత! చిత్రకూటస్య కాననే.

తతస్తౌ పాదచారేణ గచ్ఛన్తౌ సహ సీతయా,
రమ్య మాసేదతు శ్శైలం చిత్రకూటం మనోరమమ్.
తన్తు పర్వత మాసాద్య నానాపక్షిగణాయుతమ్,
బహుమూలఫలం రమ్యం సంపన్నం సరసోదకమ్.
మనోజ్ఞోఽయం గిరి స్సౌమ్య! నానాద్రుమలతాయుతః,
బహుమూలఫలో రమ్య స్స్వాజీవః ప్రతిభాతి మే.
మునయ శ్చ మహాత్మానో వస న్త్యస్మిన్ శిలోచ్చయే,
అయం వాసో భవేత్తావ దత్ర సౌమ్య! రమేమహి.
ఇతి సీతా చ రామ శ్చ లక్ష్మణ శ్చ కృతాఞ్జలిః,
అభిగమ్యాఽశ్రమం సర్వే వాల్మీకి మభివాదయన్.

చక్కఁగా విరియంబూచినవియు మనుష్యులకుఁ బొందరానివియును బండ్లచేతను బత్రంబులచేతను వంగియున్నవియు నగు జీడిచెట్లం జూడుము. ఇవన్నియు నుండుటచే మనమిచ్చట జీవింపవచ్చును. సందియము లేదు. ౭

లక్ష్మణుఁడా! తేనెటీఁగెలచేఁ గూర్పఁబడి నాలుగుతూములంత తేనె గల తేనెతెట్టెలు ప్రతివృక్షమునందును వ్రేలుకాడుచున్నవి చూడుము. ౮

నేలపై రాలినపూలచే రమణీయంబయియుండు వనప్రదేశమునందు ఈవానకోయిలకూయుచున్నది. దానికి నెమలి బదులుకూయుచున్నదిచూడుము. ౯

ఏనుఁగులసమూహములోఁ గూడినదియును మధురంబుగా ధ్వనించు పక్షులతోఁ గూడినదియును మిక్కిలియు నున్నతంబులగు శిఖరంబులు గలదియునగు చిత్రకూటపర్వతం బిదిగో కనఁబడుచున్నది చూడుము. ౧౦

నాయనా! మిట్టపల్లములు లేనిదియు మనోహరంబును బహువృక్షంబులు గలదియును బుణ్యంబునగు చిత్రకూటవనంబునం గ్రీడింతము. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౧౧

అంత నట్టి రామలక్ష్మణులు సీతతోఁ గూడఁ గాలినడకం బోవుచు సుందరంబును మనోహరంబునగు చిత్రకూటపర్వతంబు నొందిరి. ౧౨

ఆసీతారామలక్ష్మణులు నానావిధపక్షులతోఁ గూడినదియు నధికంబుగా మూలఫలంబులు గలదియు రమ్యంబును సమృద్ధంబును మంచినీళ్లు గలదియు నగు నాచిత్రకూటపర్వతంబు నొంది "ఈపర్వతంబు మనోహరముగానున్నది. ఇది నానావిధంబులగు వృక్షంబులు లతలును బెక్కుమూలఫలంబులునుంగల్గినది, కావున నిందె సుఖముగా జీవింపవచ్చునని దోఁచుచున్నది. మఱియు నీపర్వతంబున, మహాత్ములగు మునులు వాసంబు చేసెదరు. కాఁబట్టి మనకును ఇది వాసస్థానము కావచ్చును. ఇందుఁ గ్రీడింపుచుందము" అని పరస్పరము చెప్పుకొనుచు, మువ్వురును వాల్మీకిమహాముని యాశ్రమంబునకుఁబోయి ఆయనకు నమస్కారంబు చేసిరి. ౧౩-౧౫

ధర్మజ్ఞుఁడగు వాల్మీకిమహర్షి, యతిథులు వచ్చినందుకు మిక్కిలియుం సంతుష్టుఁడై, యాసీతారామలక్ష్మణులం బూజించి స్వాగతంబుఁ జెప్పి కూర్చుండుఁ డనెను. ౧౭

అంత సమర్థుఁడును మహాబాహుండును లక్ష్మణునకన్నయునగు రాముఁడు తనసంగతినంతయుం యథాక్రమముగా వాల్మీకిమహామునికిం జెప్పి కొని లక్ష్మణుంజూచి యిట్లని చెప్పెను. ౧౮

తిన్ననివాఁడవగు లక్ష్మణుఁడా! దృఢంబులు నుత్తమంబులు నగు మ్రానులం దెచ్చి యిల్లుగట్టుము. నాకు ఇల్లుకావలెనని యున్నది. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౧౯

శత్రువుల నడంగం ద్రొక్కువాఁడగు లక్ష్మణుఁడు, రామునిమాటను విని నానావిధంబులగు మ్రానులం గొట్టితెచ్చి పర్ణశాల నిర్మించెను. ౨౦

రాముఁడు, గాలి వాన మొదలగువానికిఁ గదలింపఁగూడనిదై దృఢమయినయావరణము గలదై సుందరంబై యుండు నాపర్ణశాలంజూచి, తనకుఁ బరిచర్యసేయుచు నింక నేమి యాజ్ఞాపించునోయని సావధానుఁడై యున్న లక్ష్మణుం జూచి యిట్లని చెప్పెను. ౨౧

లక్ష్మణుఁడా! మన మిప్పుడు నల్లయిఱ్ఱిమాంసము దెచ్చి దానిచే గృహాధిష్ఠాతృదేవతలం బూజింతము. బహుకాలము చక్కఁగా నుండఁగోరు వారలు ఆవశ్యము వాస్తుశాంతిం జేయవలయుం. ౨౨

సుందరంబులగు నేత్రంబులుగల లక్ష్మణుఁడా! నీవు శీఘ్రముగా నల్లయిఱ్ఱింజంపి యిచ్చుటకుఁ దెమ్ము. శాస్త్రమునందు విధింపఁబడిన కార్యము చేయక తప్పదు. నీవును ధర్మమును దలంచుకొనుము. నీకును దెలియును. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౨౩

శత్రువీరులం జంపునట్టి లక్ష్మణుఁడు అన్నచెప్పినమాటను విని యాప్రకారము నల్లయిఱ్ఱిం జంపి తెచ్చెను; రాముఁడు మఱల నతనిం జూచి యిట్లని చెప్పెను. ౨౪

ఈనల్లయిఱ్ఱిమాంసమును బక్వముఁజేయుము. దీనిచే గృహాధిష్ఠాతృ దేవతలం బూజింతము; ఇది శుభముహూర్తము; ఈతిథియుం యజమానునకు స్థైర్యము గలిగించునది కావున జాగు సేయవలదు. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౨౫

పరాక్రమశాలియుం సుమిత్రాపుత్రుఁడు నగులక్ష్మణుండు భవ్యమృగంబులలోఁజేరిన నల్లయిఱ్ఱిం జంపి యామాంసమును మండుచున్నయగ్నిహోత్రంబునఁ బక్వము చేసెను. ౨౬

లక్ష్మణుండు అంత నామాంసము చక్కఁగాఁ గాల్చంబడి నెత్తురులేక పక్వముగానుండుట నెఱింగి పురుషశ్రేష్ఠుఁడగు రాముం జూచి యిట్లని చెప్పెను. ౨౭

ఈనల్లయిఱ్ఱిలోని యన్నియవయవంబులమాంసంబులను, నల్ల యిఱ్ఱిని పండునట్లు పక్వముగా వండినాను. దేవతలతో సమానుఁడవగు రాముఁడా! నీ విఁక వాస్తుదేవతలం బూజింపుము; దానికి నీవే సమర్థుఁడవు. అని లక్ష్మణుండు రామునకుఁ జెప్పెను. ౨౮

గుణవంతుఁడును జపింపఁదగిన మంత్రంబులం బండితుఁడునగు రాముఁడు స్నానముచేసి నియతుండై వాస్తుశాంత్యుపయుక్తంబులగు మంత్రంబులన్నియుం సంక్షేపంబుగా జపించి వాస్తుకర్మము గావించెను. ౨౯

అట్లు రాముఁడు వాస్తుదేవతల నందఱం బూజించి గృహప్రవేశము చేసెను; దానివలనఁ గొలందిలేని కాంతిగల రామునిమనంబునకు మిగుల నానందంబు గలిగెను. 30

రాముఁడు వైశ్వదేవబలిని రుద్రబలిని విష్ణుబలినిం జేసి వాస్తుశాంతికొఱకై పుణ్యాహవాచనాదిమంగళకార్యంబులం గావించి క్రమంబుగానయ్యా మంత్రంబుల జపించి యథావిధి నదిలో స్నానంబుఁ జేసి సమస్తపాపశాంత్యర్థమయి మరల నుత్తమంబగు బలిం జేసెను. ౩౧,౩౨

అంత రాముఁడు బలిహరణాదివేదికలును దేవాలయంబులును అగ్ని హోత్రగృహంబులును ఆశ్రమంబునకుఁ దగునట్లు నిర్మించుకొనెను. 33

మంగళకరంబులగు లక్షణంబులు గలవారలగు నా రామలక్ష్మణులు హవ్యంబులగు పుష్పమాలికలచేతను ఫలమూలంబులచేతను పక్వంబులగుమాంసములచేతను జలతర్పణములచేతను వేదోక్తమంత్రజపంబులచేతను దర్భలచేతను సమిధలచేతను యథాశాస్త్రముగా భూతంబులకుఁ దృప్తిగలుగఁజేసి సీతతోఁ గూడ సుందరంబగు నాపర్ణశాలం బ్రవేశించిరి. 34, 35

సీతారామలక్ష్మణులు ముప్వురును నివసించుటకొఱకు వృక్షపత్రములచేఁ గప్పఁబడినదియుఁ మనోహరంబును శాస్త్రములం జెప్పినట్లు నిర్మింపఁబడిన వంటయిల్లు మొదలగు ప్రదేశములుగలదియుఁ నెచ్చుగా గాలిలేనిదియుఁ నగు నాపర్ణశాలను దేవతలు సుధర్మయను దేవసభం బ్రవేశించునట్లు ప్రవేశించిరి. 36

అప్పుడు జితేంద్రియులగు నా సీతారామలక్ష్మణులు నానావిధములగు పెక్కుమృగపక్షులతోఁగూడినదియుఁ నానావిధములయిన పూగుత్తులుగల వృక్షములతో నొప్పుచున్నదియుఁ మదించి కేకలువేయుచుండు నేనుఁగులు యితరమృగంబులుఁ గలదియుఁనగు నుత్తమంబయిన వనంబునందు సుఖంబుగా విహరించుచుండిరి. 37

రాముఁడు మిగుల రమణీయంబగు చిత్రకూటపర్వతంబును మంచి రేవుగల మాల్యవతీనదినిం జేరినంతనే దేహంబంతయును గగుర్పొంద మిక్కిలియుఁ సంతసించి పట్టణంబు విడుచుటవలనఁ గలుగుదుఃఖంబును వదలెను.

ఇది ఏఁబదియాఱవ సర్గము.

## సప్తపఞ్చాశస్సర్గః

కథయిత్వా సుదుఃఖార్త స్సుమన్త్రేణ చిరం సహ,
రామే దక్షిణకూలస్థే జగామ స్వగృహం గుహః.

భరద్వాజాభిగమనం ప్రయాగే చ సహాఽసనమ్,
ఆగిరే ర్గమనం తేషాం తత్రస్థై రుపలక్షితమ్.

అనుజ్ఞాత స్సుమన్త్రోఽథ యోజయిత్వా హయోత్తమాన్,
అయోధ్యా మేవ నగరీం ప్రయయౌ గాఢదుర్మనాః.
స వనాని సుగన్ధీని సరిత శ్చ సరాంసి చ,
పశ్యన్నతియయౌ శీఘ్రం గ్రామాణి నగరాణి చ.

తతస్సాయాహ్నసమయే తృతీయేఽహని సారథిః,
అయోధ్యాం సమనుప్రాప్య నిరానన్దాం దదర్శ హ.

స శూన్యా మివ నిశ్శబ్దాం దృష్ట్వా పరమదుర్మనాః,
సుమన్త్ర శ్చిన్తయామాస శోకవేగసమాహతః.
కచ్చి న్న సగజా సాశ్వా సజనా సజనాధిపా,
రామసన్తాపదుఃఖేన దగ్ధా శోకాగ్నినా పురీ.

ఇతి చిన్తాపర స్సూతో వాజిభి శ్శీఘ్రపాతిభిః,
నగరద్వార మాసాద్య త్వరితః ప్రవివేశ హ.

## ఏఁబదియేడవ సర్గము

అంత నచ్చట గుహుఁడు రామాదులు గంగానది దక్షిణపుగట్టు చేరిన పిమ్మట పరమదుఃఖితుఁడై సుమంత్రునితోఁగూడ బహుకాలము మాటలాడు చుండి యతనిం దోడ్కొని తనయింటికిం బోయెను. ౧

అంత శృంగిబేరపురంబుననుండు గుహునిచారులు ఆసీతారామ లక్ష్మణులు భరద్వాజమహర్షి యొద్దకుఁబోవుటయుం నాయనతోఁగూడఁ బ్రయాగ క్షేత్రంబుననుండుటయు నట్లు వారలు చిత్రకూటపర్వతంబునకుఁ బోవువఱకు జరిగినసంగతులన్నియుం సుమంత్రునకుం దెల్పిరి. ౨

అంత సుమంత్రుఁడు గుహుని యనుమతినొంది రథంబునకు నుత్తమంబు లగు గుఱ్ఱంబులు గట్టి పరమదుఃఖితుఁడై యయోధ్యాపట్టణంబునకేఁపోయెను. ౩

ఆసుమంత్రుఁడు మార్గంబునఁ బూలతావులు గుబాళించుచుండు వనంబులను నదులను గొలంకులను గ్రామంబులను పట్టణంబులనుం జూచుచుఁ బోయెను. ౪

అంత సుమంత్రుఁడు శృంగిబేరపురంబుననుండి బయలుదేఱిన మూఁడవ దినంబునందు సాయంకాలంబున నయోధ్యాపట్టణంబుఁ జేరి దుఃఖితులయిన జనులతోఁగూడిన యాపట్టణముం జూచెను. ౫

దుఃఖితుఁడగు సుమంత్రుఁడు పాడుపడినట్లు నిశ్శబ్దంబుగానున్న యాయయోధ్యం జూచి దుఃఖం బినుమడింప నిట్లని చింతించెను. ౬

అయోధ్యాపట్టణము ఏనుంగులతోను గుఱ్ఱంబులతోను జనులతోను రాజుతోనుంగూడ రామదుఃఖంబునం బీడింపఁబడి యాదుఃఖంబను నగ్నిహోత్రముచే దహింపఁబడలేదాయేమి? అని సుమంత్రుఁడు చింతించెను. ౭

సుమంత్రుఁడట్లు చింతించుచుఁ "పట్టణంబు నిశ్శబ్దంబుగనున్నది; రాజెట్లున్నాఁడో" యని వేగంబున గుఱ్ఱములందోలి పట్టణద్వారంబునొంది పట్టణంబుఁ బ్రవేశించెను. ౮

సుమన్త్ర మభియాన్తం తం శతశోఽథ సహస్రశః,
క్వ రామఇతి పృచ్ఛన్తః సూతమభ్యద్రవన్నరాః. ౯
తేషాం శశంస గఙ్గాయా మహా మాపృచ్ఛ్య రాఘవమ్,
అనుజ్ఞాతో నివృత్తోఽస్మి ధార్మికేణ మహాత్మనా. ౧౦
తే తీర్ణా ఇతి విజ్ఞాయ బాష్పపూర్ణముఖా జనాః,
అహో ధిగితి నిశ్శ్వస్య హా! రామేతి చ చుక్రుశుః. ౧౧

శుశ్రావ చ వచ స్తేషాం బృన్దం బృన్దం చ తిష్ఠతామ్,

హతాః స్మ ఖలు యే నేహ పశ్యామ ఇతి రాఘవమ్. ౧౨
దానయజ్ఞవివాహేషు సమాజేషు మహత్సు చ,
న ద్రక్ష్యామః పునర్జాతు ధార్మికం రామమన్తరా. ౧౩

కిం సమర్థం జనస్యాస్య కిం ప్రియం కిం సుఖావహమ్,
ఇతి రామేణ నగరం పితృవత్పరిపాలితమ్. ౧౪

వాతాయనగతానాం చ స్త్రీణా మన్వన్తరాపణమ్,
రామశోకాభితప్తానాం శుశ్రావ పరిదేవనమ్. ౧౫
స రాజమార్గమధ్యేన సుమన్త్రః పిహితాననః,
యత్ర రాజా దశరథ స్తదేవోపయయౌ గృహమ్. ౧౬

సోఽవతీర్య రథా చ్ఛీఘ్రం రాజవేశ్మ ప్రవిశ్య చ,
కక్ష్యాః సప్తాభిచక్రామ మహాజనసమాకులాః. ౧౭

అంత జనులు సుమంత్రుఁడు వచ్చుటం జూచి "రాముఁ డెచ్చట" యని యడుగుచు గుంపులుగుంపులుగాఁ బరుగెత్తుచు నతని నెదుర్కొనిరి. ౯

నేను గంగాతీరంబున రాముని వీడ్కొని యతని యనుమతినొంది వచ్చినాను; అని సుమంత్రుఁడు జనులకు బదులుచెప్పెను. ౧౦

జనులు "సీతారామలక్ష్మణులు గంగానదిని దాఁటిపోయిరి" అని యెఱింగి ముఖంబునిండఁ గన్నీళ్లుగాఱ "అయ్యో! దహింపఁబడుదుముగాక" అని నిట్టూర్పులుపుచ్చుచు "అయ్యో రాముఁడా!" అని రాముం దేర్కొనుచు రోదనంబుచేసిరి. ౧౧

అంత నచ్చట నాజనులు గుంపులుగుంపులుగా నిలుచుండి చెప్పుకొను మాటలను సుమంత్రుఁడు వినెను.

మే మిచ్చట రాముం జూడకుండుటచే హతులమైతిమి. ౧౨

దానములుసేయు స్థలములందును గొప్పసభలయందును అయ్యైకార్యంబులఁ జక్కఁగా జరగించుటకై వచ్చియుండు ధార్మికుఁడగు రాముని నింక మన మెప్పుడును జూడఁజాలము. ౧౩

జనుల కేది మంచిది? ఏది ప్రియము? ఏది సుఖముఁగలిగించును? ఇట్లు చక్కఁగా విచారించి రాముఁడు తండ్రి కొడుకులం బోలె జనులం గాపాడు చుండెను. అని జనులు చెప్పుకొనెడుమాటలను సుమంత్రుఁడు వినెను. ౧౪

సుమంత్రుఁ డంత అంగడివీథిం బోవుచు స్త్రీలు రామదుఃఖంబునం బరితపించుచుఁ గిటికీలనుండి తన్నుఁజూచి సేయురోదనంబును వినెను. ౧౫

సుమంత్రుఁడు పరమదుఃఖితులగుజనులం జూడఁజాలక తలవంచుకొని రాజమార్గంబునం బోయి దశరథమహారాజు నివసించుగృహంబునకే పోయెను. ౧౬

అంత నాసుమంత్రుఁడు శీఘ్రంబుగ రథంబు డిగ్గి రాజగృహంబుఁ బ్రవేశించి దుఃఖితుఁడగు రాజుం జూచుటకై వచ్చియున్న పెద్దమనుష్యులచే నిండియుండు తొట్టికట్టు నేడింటి నతిక్రమించి పోయెను. ౧౭

హర్మ్యై ర్విమానైః ప్రాసాదై రవేక్ష్యాథ సమాగతమ్,
హాహాకారకృతా నార్యో రామాదర్శనకర్శితాః. ౧౮

ఆయతై ర్విమలై ర్నేత్రై రశ్రువేగపరిప్లుతైః,
అన్యోన్య మభివీక్షన్తేఽవ్యక్త మార్తతరాః స్త్రియః. ౧౯
తతో దశరథస్త్రీణాం ప్రాసాదేభ్య స్తత స్తతః,
రామశోకాభితప్తానాం మన్దం శుశ్రావ జల్పితమ్. ౨౦
సహ రామేణ నిర్యాతో వినా రామ మిహాఽఽగతః,
సూతః కిన్నామ కౌసల్యాం శోచన్తీం ప్రతివక్ష్యతి. ౨౧

యథా చ మన్యే దుర్జీవ మేవం న సుకరం ధ్రువమ్,
ఆచ్ఛిద్య పుత్త్రే నిర్యాతే కౌసల్యా యత్ర జీవతి. ౨౨

సత్యరూపం తు తద్వాక్యం రాజ్ఞః స్త్రీణాం నిశామయన్,
ప్రదీప్త మివ శోకేన వివేశ సహసా గృహమ్. ౨౩

స ప్రవిశ్యాష్టమీం కక్ష్యాం రాజానం దీనమాతురమ్,
పుత్త్రశోకపరిద్యూన మపశ్య త్పాణ్డురే గృహే. ౨౪

అభిగమ్య తమాసీనం నరేన్ద్ర మభివాద్య చ,
సుమన్త్రో రామవచనం యథోక్తం ప్రత్యవేదయత్. ౨౫

స తూష్ణీమేవ తచ్ఛ్రుత్వా రాజా విభ్రాన్తచేతనః,
మూర్ఛితో న్యపత ద్భూమౌ రామశోకాభిపీడితః. ౨౬

అంత నచ్చటి స్త్రీలు మేడలను ఏడంతస్తుల మేడలను, రాజగృహంబులను ఆరోహించి సుమంత్రుఁడు వచ్చుటం గనుంగొని రాముఁడు లేకుండుటచేఁ బరమదుఃఖితలై హాహాకారంబులు చేసిరి. ౧౮

ఆస్త్రీలు పరమదుఃఖితలై యేమియుఁ దెలియక కన్నీళ్లచేఁ గలంకఁ బాఱిన విశాలనేత్రంబుల నొండొరులం జూచుకొనుచుండిరి. ౧౯

అంత సుమంత్రుఁడు ఆయా ప్రాసాదంబులనుండి దశరథస్త్రీలు రామదుఃఖంబుచేఁ బరితపించుచుఁ దిన్నగాఁ జెప్పుకొనుమాటలను వినెను.

సుమంత్రుఁడు ఇచ్చటనుండి రామునితోఁగూడఁ బోయినాఁడు; ఇప్పుడు రాముని విడిచివచ్చినాఁడే! దుఃఖితయగు కౌసల్య కేమి చెప్పఁగలఁడు? ౨౧

కొడుకు వనంబునకుఁ బోయినను గౌసల్య జీవించియున్నదే ఇది మిక్కిలియుఁ గష్టమయినది; ఇట్టిదుఃఖము గల్గినను జీవించియుండుట సులభసాధ్యముగాదు; ఇది నిశ్చయము. అని దశరథస్త్రీలు చెప్పుకొనిరి. ౨౨

ఆసుమంత్రుఁడు దశరథునిభార్యలు చెప్పుకొన్న సత్యమయిన మాటను వినుచునే శీఘ్రముగా అందఱును దుఃఖితులయియుండుటవలన మండుచున్నట్లు మనసునకు భయంబుగలిగించుచున్న యంతఃపురగృహమును బ్రవేశించెను. ౨౩

ఆసుమంత్రుఁడు అంత నెనిమిదవతొట్టికట్టలోనికిం బోయి యచ్చట ధవళగృహంబున దీనుఁడై దుఃఖితుఁడై పుత్రదుఃఖంబునం గృశించి యున్న దశరథమహారాజుంగ జూచెను. ౨౪

సుమంత్రుఁ డచ్చటఁ గూర్చుండియున్న దశరథమహారాజునొద్దకుఁ బోయి యతనికి నమస్కరించి రాముఁడు తనతో దశరథునకుఁ జెప్పుమని చెప్పినమాటను గ్రమముగాఁ జెప్పెను. ౨౫

పుత్రదుఃఖంబుచేఁ గృశించియున్న యాదశరథమహారాజు ఏమియు బదులుచెప్పక యామాటను విని భ్రాంతమానసుఁడై మూర్ఛనొంది నేలం బడెను.

తతోఽన్తఃపుర మావిద్ధం మూర్ఛితే పృథివీపతౌ,
ఉద్ధృత్య బాహూ చుక్రోశ నృపతౌ పతితే క్షితౌ. ౨౭
సుమిత్రయా తు సహితా కౌసల్యా పతితం పతిమ్,
ఉత్థాపయామాస తదా వచనం చేద మబ్రవీత్. ౨౮
ఇమం తస్య మహాభాగ! దూతం దుష్కరకారిణః,
వనవాసా దనుప్రాప్తం కస్మా న్న ప్రతిభాషసే. ౨౯

అద్యేమ మనయం కృత్వా వ్యపత్రపసి రాఘవ!,
ఉత్తిష్ఠ సుకృతం తేఽస్తు శోకే నస్యా త్సహాయతా. ౩౦

దేవ! యస్యా భయా ద్రామం నానుపృచ్ఛసి సారథిమ్,
నేహ తిష్ఠతి కైకేయీ విస్రబ్ధం ప్రతిభాష్యతామ్. ౩౧

సా తథోక్త్వా మహారాజం కౌసల్యా శోకలాలసా,
ధరణ్యాం నిపపాతాఽశు బాష్పవిప్లుతభాషిణీ. ౩౨
ఏవం విలపతీం దృష్ట్వా కౌసల్యాం పతితాం భువి,
పతిం చావేక్ష్య తా స్సర్వా స్సుస్వరం రురుదుః స్త్రియః. ౩౩

తత స్త మన్తఃపురనాద ముత్థితం
సమీక్ష్య వృద్ధా స్తరుణాశ్చ మానవాః,
స్త్రియశ్చ సర్వా రురుదు స్సమన్తతః
పురం త దాసీ త్పున రేవ సంకులమ్. ౩౪

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే సప్తపఞ్చాశస్సర్గః.

దశరథమహారాజు మూర్ఛనొంది నేలంబడఁగానే యంతఃపురస్త్రీ లంద ఱును బరమదుఃఖితలై చేతులెత్తి రోదనంబు చేసిరి. ౨౭

అప్పుడు కౌసల్య సుమిత్రయుఁ దోడ్పడ నేలంబడిన పెనిమిటిని లేవ నెత్తి యీమాటం జెప్పెను. ౨౮

మహాభాగుఁడవగు దశరథుఁడా! ఎవ్వరికిని జేయనలవిగాని కార్యము చేసినరాముఁడు పంపఁగా నతని వాసస్థానమగు నరణ్యంబుననుండి వచ్చిన దూతయైన సుమంత్రునితో నేల మాటలాడవు? ౨౯

దశరథుఁడా! ఇట్టి క్రమముగా రాము నడవికిఁబంపి యిప్పుడు లజ్జించు చున్నావు! ఇది నీకుఁ దగదు. లెమ్ము; నీకు సత్యపరిపాలనపుణ్యంబుగలుగును. దుఃఖించినం గార్యము లేదు. ౩౦

దశరథమహారాజా! నీ వెవ్వతెభయంబున సుమంత్రుని రామునిసమా చారం బడుగకున్నావో ఆకైకేయి యిచ్చట లేదు; ఇంక నిర్భయముగా మాటలాడుము. అని కౌసల్య దశరథునితోఁ జెప్పెను. ౩౧

దుఃఖముచేఁ జాపలము నొందియున్నది కావున నాకౌసల్య డగ్గుత్తి గదుర నట్లు దశరథమహారాజుతోఁ జెప్పి తత్క్షణంబున నేలంబడెను. ౩౨

ఇట్లు విలపించుచు నేలంబడినకౌసల్యను మూర్ఛిల్లి నేలంబడియున్న దశరథమహారాజునుం జూచి యంతఃపురస్త్రీలందఱును బేరెలుంగున రోదనంబు చేసిరి. ౩౩

అంత నాయంతఃపురస్త్రీ లట్లు రోదనంబు సేయుటంజూచి పట్టణంబు నందలి ముసలివారును, దరుణులును, స్త్రీలును ఇట్లు జనులందఱును రోదనంబు చేసిరి. అట్లు ఆపట్టణం బంతయుం రాముఁడు వనంబునకుఁ బోవునప్పుడు గల్గినట్లు మరల మహాధ్వని గల్గినది. ౩౪

ఇది యేఁబదియేడవ సర్గము.

## అష్టపఞ్చాశస్సర్గః

ప్రత్యాశ్వస్తో యదా రాజా మోహాత్ప్రత్యాగతం పునః,
అథాఽజుహావ తం సూతం రామవృత్తాన్తకారణాత్. ౧

అథ సూతో మహారాజం కృతాఞ్జలి రుపస్థితః,
రామమేవానుశోచన్తం దుఃఖశోకసమన్వితమ్. ౨

వృద్ధం పరమసన్తప్తం నవగ్రహ మివ ద్విపమ్,
వినిశ్శ్వసన్తం ధ్యాయన్త మస్వస్థ మివ కుఞ్జరమ్. ౩

రాజా తు రజసా సూతం ధ్వస్తాఙ్గం సముపస్థితమ్,
అశ్రుపూర్ణముఖం దీన మువాచ పరమార్తవత్. ౪

క్వను వత్స్యతి ధర్మాత్మా వృక్షమూల ముపాశ్రితః,
సోఽత్యన్తసుఖిత స్సూత! కి మశిష్యతి రాఘవః. ౫

దుఃఖస్యానుచితో దుఃఖం సుమన్త్ర! శయనోచితః,
భూమిపాలాత్మజో భూమౌ శేతే కథ మనాథవత్. ౬

యం యాన్త మనుయాన్తి స్మ పదాతిరథకుఞ్జరాః,
స వత్స్యతి కథం రామో విజనం వన మాశ్రితః. ౭

వ్యాలై ర్మృగై రాచరితం కృష్ణసర్పనిషేవితమ్,
కథం కుమారౌ వైదేహ్యా సార్ధం వన ముపస్థితౌ. ౮

సుకుమార్యా తపస్విన్యా సుమన్త్ర! సహ సీతయా,
రాజపుత్రౌ కథం పాదై రవరుహ్య రథా ద్గతౌ. ౯

## ఏఁబదియెనిమిదవ సర్గము

అంత దశరథుఁడు మూర్ఛదేఱినపిమ్మట సుమంత్రునితట్టు తిరిగి రాముని సమాచారంబు నడుగుటకై సుమంత్రుం బిలిచెను. ౧

అంత రామునే పేర్కొని దుఃఖించుచున్నవాఁడును బరమదుఃఖితుఁడును వృద్ధుఁడును గ్రొత్తగాఁ బట్టువడిన యేనుఁగుభంగిఁ బరితపించుచున్న వాఁడును, నిట్టూర్పులు పుచ్చుచు దిగ్భ్రమంబునొంది యేమియుం దోఁచకున్నవాఁడును వ్యాధిగ్రస్తంబగు గజంబుపగిది డస్సియున్నవాఁడు నగు దశరథమహారాజునొద్దఁ జేతులు మొగుడ్చుకొని నిలుచుండెను. ౨,౩

దశరథమహారాజును దనసమీపంబున ధూళిధూసరితాంగుఁడై మొగంబు నిండఁ గన్నీళ్లుగాఱ దుఃఖితుఁడై నిలుచున్నసుమంత్రుం జూచి పరమదీనుఁడై యిట్లని చెప్పెను. ౪

సుమంత్రుఁడా! ధర్మాత్ముఁడును మిక్కిలియు సుఖమనుభవించినవాఁడు నగు నారాముఁడు ఏచెట్టుక్రింద నున్నాఁడు? ఏమి తినుచున్నాఁడు?

సుమంత్రుఁడా! దుఃఖంబనుభవింపందగనివాఁడును మంచిపాన్పుపైఁ బరుండవలసినవాఁడును రాజపుత్రుఁడు నగురాముఁడు అనాథవలె నేలపై నెట్లు పరుండియున్నాఁడు? ౫

ఎవ్వఁడు వెడలఁగాఁ గాలిబంటులును రథంబులును గజంబులును వెంట నడుచునో అట్టి రాముఁ డిప్పుడు జనశూన్యంబగు నరణ్యంబున నెట్లున్నాఁడు? ౬

క్రూరమృగంబులును గృష్ణసర్పంబులును మెండుగాఁగలవనంబున రామలక్ష్మణులును సీతయు నెట్లున్నారు. ౭

సుమంత్రుఁడా! సుకుమారశరీరయును గరుణింపఁదగినదియునగు సీతతోఁగూడ రాజపుత్రులగు రామలక్ష్మణులు రథంబు డిగ్గి కాలినడకచే నెట్లు పోయిరి.

సిద్ధార్థః ఖలు సూత! త్వం యేన దృష్టో మమాఽత్మజౌ,
వనా న్తం ప్రవిశన్తౌ తా వశ్వినా వివ మన్దరమ్. ౧౦

కి ముక్తవాన వచో రామః కి మువాచ చ లక్ష్మణః,
సుమన్త్రి! వన మాసాద్య కి మువాచ చ మైథిలీ. ౧౧
ఆసితం శయితం భు క్తం సూత! రామస్య కీర్తయ,

జీవిష్యామ్యహ మేతేన యయాతి రివ సాధుషు. ౧౨

ఇతి సూతో నరేన్ద్రేణ చోదిత స్సజ్జమానయా,
ఉవాచ వాచా రాజానం సబాష్పపరిరబ్ధయా. ౧౩
అబ్రవీ న్మాం మహారాజ! ధర్మ మే వానుపాలయన్,
అఞ్జలిం రాఘవః కృత్వా శిరసాఽభిప్రణమ్య చ. ౧౪
సూత! మద్వచనా త్తస్య తాతస్య విదితాత్మనః,
శిరసా వన్దనీయస్య వన్ద్యౌ పాదౌ పునఃపునః. ౧౫

సర్వ మన్తఃపురం వాచ్యం సూత! మద్వచనా త్త్వయా,
ఆరోగ్య మవిశేషేణ యథార్హం చాభివాదనమ్. ౧౬

మాతా చ మమ కౌసల్యా కుశలం చాభివాదనమ్,
అప్రమాదం చ వక్తవ్యా బ్రూయా శ్చైనా మిదం వచః. ౧౭
ధర్మనిత్యా యథాకాల మగ్న్యగారపరా భవ,

సుమంత్రుఁడా! అశ్వినీదేవతలు మందరపర్వతంబుఁ బ్రవేశించునట్లు వనమధ్యంబుఁ బ్రవేశించుచున్న నాకొడుకుల రామలక్ష్మణులం జూచినావు కావున నీవు కృతార్థుఁడ వయితివి. ౧౦

సుమంత్రుఁడా! వనంబునకుఁ బోయినపిదప రాముఁ డేమిచెప్పెను? లక్ష్మణుఁ డేమనెను? సీతయుం నేమని చెప్పెను? ౧౧

సుమంత్రుఁడా! రాముఁ డెక్కడఁ గూర్చుండెను? ఎక్కడఁ బరుండెను? ఏమిభుజించెను? నాకు దీని వివరముగాఁ జెప్పుము.

యయాతి స్వర్గంబుననుండి పడునప్పుడు దేవేంద్రుని దనకు సత్పురుష సమాగమంబుఁ గలుగఁజేయుమని ప్రార్థించుకొని సత్పురుషసమాగమంబు నొంది దుఃఖంబు విడిచియుండినట్లు నేను రాముని చరిత్రంబు వినుటచేఁ గొంచెము దుఃఖంబు దీర్చుకొని జీవించియుండెదను, అని దశరథుఁడు సుమంత్రునితోఁ జెప్పెను. ౧౨

సుమంత్రుఁడిట్లు దశరథునిచే నడుగంబడినవాఁడై దశరథమహారాజుం జూచి కన్నీళ్లుగాఱఁ దడఁబడుచు నీమాటం జెప్పెను. ౧౩

దశరథమహారాజా! రాముఁడు ధర్మమును విడునక నీవిషయమై చేతులు మోడ్చి సాష్టాంగముగ నమస్కరించి నాతో నిట్లని చెప్పెను. ౧౪

సుమంత్రుఁడా! నామాటప్రకారము నీవు పరమాత్మవేత్తయుం సమస్త రాజులకును నమస్కరింపఁదగినవాఁడును మహాత్ముఁడు నగు మాతండ్రి దశరథ మహారాజుపాదంబులకు సాష్టాంగముగ నమస్కరింపవలయును. ౧౫

సుమంత్రుఁడా! నీవు నామాటచొప్పున నంతఃపురస్త్రీలకందఱకును ఏకరీతిగా నా యారోగ్యంబుఁ జెప్పి వారివారియోగ్యతకుఁ దగునట్లు నానమస్కారంబు దెలుపవలయు. ౧౬

నాతల్లికౌసల్యకును ఏమఱక నాక్షేమమును నమస్కారమును జెప్పవలయును; మఱియుం నీమాటనుం గూడఁ జెప్పుము. ౧౭

తల్లీ! నీవు ధర్మమును వదలక యగ్న్యాగారములం దప్పక యగ్నిహో

దేవి! దేవస్య పాదౌచ దేవవ త్పరిపాలయ. ౧౮

అభిమానం చ మానం చ త్యక్త్వా వర్తస్వ మాతృషు,

అను రాజాన మార్యాం చ కైకేయీ మమ్బ! కారయ. ౧౯

కుమారే భరతే వృత్తి ర్వర్తితవ్యా చ రాజవత్,
అర్థజ్యేష్ఠా హి రాజానో రాజధర్మ మనుస్మర. ౨౦

భరతః కుశలం వాచ్యో వాచ్యో మద్వచనేన చ,
సర్వా స్వేవ యథాన్యాయం వృత్తిం వర్తస్వ మాతృషు. ౨౧

వక్తవ్య శ్చ మహాబాహు రిక్ష్వాకుకులనన్దనః,

పితరం యౌవరాజ్యస్థో రాజ్యస్థ మనుపాలయ. ౨౨
అతిక్రాన్తవయా రాజా మా స్మైనం వ్యవరోరుధః,

కుమారరాజ్యే జీవ త్వం తస్యైవాజ్ఞాప్రవర్తనాత్. ౨౩

అబ్రవీ చ్చాపి మాం భూయో భృశ మశ్రూణి వర్తయన్,

మాతేవ మమ మాతా తే ద్రష్టవ్యా పుత్త్రగర్ధినీ. ౨౪

త్ర గృహంబున నుపచరించుచు దశరథమహారాజుపాదంబులకు దేవతకుంబోలె సేవ సేయుచుండుము. ౧౮

నాతల్లులయందఱివిషయమయి నీవు కులాభిమానంబును నేను జ్యేష్ఠపత్ని నను గర్వమునుం బరిత్యజించి వర్తింపుచుండుము.

అమ్మా ! దశరథమహారాజునకుం బూజ్యురాలగు కైకేయికిని అనుకూలముగాఁ బ్రవర్తింపుము. ౧౯

రాజునకుంబోలె నీకొడుకు భరతున కుపచారము సేయుము; అతఁడు చిన్నవాఁడని యుపేక్షింపవలదు; రాజులు ధనముచేఁ బెద్దలుగాని వయస్సునంగాదు; కావున భరతుఁడు రాజగుటవలన నతఁడే యందఱికన్నం బెద్దయగు; రాజధర్మమును జ్ఞప్తికిఁ దెచ్చుకొనుము; నీకునుం దెలియును. అని నాతల్లికౌసల్యతోఁ జెప్పుము. ౨౦

నీవు నామాటవలన భరతునకు నాక్షేమంబుఁ దెల్పి "నీవు తల్లులయందఱియందును భేదములేక యథాన్యాయముగాఁ బ్రవర్తింపవలెనని నేను జెప్పినట్లు చెప్పుము. ౨౧

మహాబాహుఁడును ఇక్ష్వాకువంశంబును సంతసింపంజేయువాఁడునగు నాభరతునకు ఈమాటను జెప్పుము.

నీవు ! యువరాజవై మహారాజుండగు దశరథు ననువర్తించియుండుము.

దశరథమహారాజు మిక్కిలియు ముసలివాఁడు; కావున నతఁడు చెప్పినట్లు నేను యౌవరాజ్యంబు వహింపనని యతని నిర్బంధింపకుము. ౨౨

వృద్ధుఁడగు దశరథుని యాజ్ఞ సఫలము కావలసినది. కావున నే నీవు యౌవరాజ్యము నవలంబించి సమస్తభోగంబుల ననుభవింపుచుండుము. అని భరతునితోఁ జెప్పుము. అని రాముఁడు నాతోఁ జెప్పెను. ౨౩

రాముఁడు మరల నన్నుఁజూచి మిక్కిలియుఁ గన్నీళ్లుగాఱ నిట్లని చెప్పెను.

భరతుఁడా ! నీవు నీతల్లివలె పుత్రదుఃఖంబునొందిన నాతల్లి కౌసల్యం జూచుకొనవలయును. అని రాముఁడు నాతోఁ జెప్పెను. ౨౪

దశరథమహారాజా! మహాకీర్తిశాలి యగు రాముఁడు దుఃఖంబున నేత్రంబుల నెఱ్ఱఁదనంబు గదుర నాతో నీమాటలం జెప్పుచుఁ మిగులం గన్నీళ్లు విడిచెను. ౨౫

లక్ష్మణుఁడు మాత్రము మహాకోపంబునొంది నిట్టూర్పులు పుచ్చుచు నిట్లని చెప్పెను.

రాచకొమరుఁడగు శ్రీరాముని నూరు వెడలఁగొట్టుట కేమి కారణము? అతఁడేమి యపరాధము గావించినాఁడు? ౨౬

దశరథమహారాజుమాత్రము తుచ్ఛంబగు కైకేయి యాజ్ఞకు లోఁబడి మే మందఱ మిట్లు బాధపడునట్లు చేయఁగూడని కార్యమునే చేసినాఁడు. ౨౭

రాము నడవికిఁ బంపుట రాజ్యలోభంబుననైనచో దోషమగుట సరే కదా! కైకేయివరంబుల నిచ్చుటకై పంపఁబడినను దోషమే యగుచున్నది. కైకేయివరంబుల నడుగునప్పుడు "నేను రాముని వనంబునకుఁ బంపను" అని దశరథుఁ డేల చెప్పరాదు? ౨౮

ఇట్లు రాముని విడుచుటకుఁ గారణం బేమియుఁ గానరాదు. కావున దశరథుఁడు ఈకార్యమును ప్రభుత్వగర్వంబున యథేచ్ఛగాఁ జేసినాఁడే కాని వేఱుగాదు. ౨౯

మొదట నవివేకంబున నాలోచింపక చేయఁబడినదియయ్యును లోకవిరుద్ధంబు గావున రామనివాసము ఇప్పుడు దశరథునకే యనుతాపమును బుట్టించినది. ౩౦

నాకింక దశరథమహారాజునందు దండ్రియను బుద్ధిలేదు; నాకు స్వామియుం రాజును బంధువును దండ్రియుం రాముఁడే. ౩౧

సమస్తలోకంబులకును బ్రియుండును సమస్తలోకంబులకును మేలు సేయువాఁడునగు రాముని విడిచి యిట్టి పాపకార్యము జేసిన నీయం దెవ్వనికైన నెట్లనురాగ మొందును? ౩౨

సమస్తలోకంబులకును బ్రియుండును ధార్మికుఁడు నగు రాము నడ

నీకు బంపి జనులనందఱ విరోధించుకొని నీ వెట్లు రాజుగా నుండఁగలవు? అని లక్ష్మణుండు నీతోఁ జెప్పుమనెను. 33

దశరథమహారాజా! మంచిమనస్సుగల సీతాదేవిమాత్రము నిట్టూర్పులు పుచ్చుచు నేమియుఁ దోఁచక భూతావిష్టవగిది నూరకుండినది. 34

ఇదివఱ కెన్నఁడును దుఃఖం బనుభవించియెఱుంగనిదియుఁ బతివ్రతయును రాచకొమార్తెయుం నగుసీతాదేవి యాదుఃఖంబున రోదనంబు సేయం దొడఁగినది, కాని నాతో నేమియుఁ జెప్పలేదు. 35

సీతాదేవి ముఖంబు శోషింపఁ బెనిమిటింజూచుచు నేను బయలుదేఱి పోవుటం జూచినంతనే కన్నీళ్లు విడిచినది. 36

అట్లు రాముఁడు లక్ష్మణుం డుపచారంబులు సేయఁగాఁ గన్నీళ్లువిడుచుచుఁ జేతులు మొగుడ్చుకొనియుండెను. అట్లే తపస్వినియగు సీతయుం, రోదనంబు సేయుచు రథంబును నన్నునుం జూచుచుండెను అని సుమంత్రుఁడు దశరథునకుఁ జెప్పెను. 37

ఇది యేఁబదియెనిమిదవ సర్గము

---

## ఏఁబదితొమ్మిదవ సర్గము

[దశరథమహారాజు ఇట్లు మంత్రిశ్రేష్ఠుఁడును సారథియుం నగు నా సుమంత్రుఁడు చెప్పినది విని యతనిం జూచి 'మిగతసమాచారముం జెప్పుము' అనెను.

సుమంత్రుఁడు దశరథునిమాటను విని కన్నీళ్లు విడుచుచు మరల రామునివృత్తాంతమును వివరముగాఁ జెప్ప నారంభించెను.

దశరథమహారాజా! పరాక్రమశాలులగు నా రామలక్ష్మణులు జటలఁ దాల్చి నారచీరలం గట్టుకొని గంగానదిని దాటి ప్రయాగక్షేత్రమునకుం బోయిరి.

అగ్రతో లక్ష్మణో యాతః పాలయ న్రఘునన్దనమ్,

తాం స్తథా గచ్ఛతో దృష్ట్వా నివృత్తోఽస్మ్యవశ స్తదా.|

మమ త్వశ్వా నివృత్తస్య న ప్రావర్తన్త వర్త్మని,
ఉష్ణ మశ్రు ప్రముఞ్చన్తో రామే సమ్ప్రస్థితే వనమ్.

ఉభాభ్యాం రాజపుత్త్రాభ్యా మథ కృత్వాఽహ మఞ్జలిమ్,
ప్రస్థితో రథ మాస్థాయ త ద్దుఃఖ మపి ధారయన్.
గుహేన సార్ధం తత్రైవ స్థితోఽస్మి దివసా న్బహూన్,
ఆశయా యది మాం రామః పున శ్శబ్దాపయేదితి.
విషయే తే మహారాజ! రామవ్యసనకర్శితాః,
అపి వృక్షాః పరిమ్లానా స్సపుష్పాఙ్కురకోరకాః.
ఉపతప్తోదకా నద్యః పల్వలాని సరాంసి చ,
పరిశుష్కపలాశాని వనాన్యుపవనాని చ.

న చ సర్పన్తి సత్త్వాని వ్యాళా న ప్రచరన్తి చ,
రామశోకాభిభూతం త న్నిష్కూజ మభవ ద్వనమ్.

లీనపుష్కరపత్త్రా శ్చ నరేన్ద్ర! కలుషోదకాః,
సన్తప్తపద్మాః పద్మిన్యో లీనమీనవిహఙ్గమాః.

జలజాని చ పుష్పాణి మాల్యాని స్థలజాని చ,
నాద్య భాన్త్యల్పగన్ధీని ఫలాని చ యథాపురమ్,

లక్ష్మణుఁడు రామునకు శుశ్రూష సేయుచు, వారల యిరువురకును ముందు నడచినాఁడు.

నేనప్పు డట్లు ఆసీతారామలక్ష్మణులం జూచియు పరాధీనుండఁగావున వచ్చినాను]

రాముఁడు వనంబునకుఁ బోయినపిమ్మట నేను మరలఁగానే నా గుఱ్ఱంబులు రామదుఃఖంబున వేఁడికన్నీళ్లు విడుచుచు మార్గంబున సరిగా నడవలేదు. ౧

అంత నేను రామలక్ష్మణుల కిద్దఱకును నమస్కరించి రథంబు నెక్కి యాదుఃఖంబునంతయు నణంచుకొని బయలుదేరి వచ్చినాను. ౨

మరల రాముఁ డేమైన నన్నుఁ బిలుచునేమో యను నాసచేత నే నా శృంగిబేరపురంబుననే గుహునితోఁ గూడ మూఁడుదినంబు లుంటిని. ౩

దశరథమహారాజా ! నీదేశమునందు వృక్షంబులును రామదుఃఖంబునఁ బూలతోను మొలకలతోను మొగ్గలతోనుంగూడ నెండియున్నవి. ఇంక మనుష్యులం జెప్పనేల? ౪

నదులలోను నీళ్లు నిలిచిన పల్లములలోను గొలంకులందును నీళ్లు వేఁడిగానున్నవి. వనంబులందును నుద్యానవనంబులందును ఆఁకులు ఎండిపోయియున్నవి. ౫

అడవియందు జంతువులు కదలుటయే లేదు; క్రూరమృగంబులు ఎదుటికివచ్చిన జంతువునుంగూడ భక్షింపకున్నవి; అట్లు రామదుఃఖంబున నడవియంతయు నిశ్శబ్దముంగా నున్నది. ౬

దశరథమహారాజా ! తామరాకులు నీళ్లలోమునింగి నీళ్లు మలినములయి కమలములు వాడువాఱి మీనంబులును నిశ్చలములయి పక్షిసంచారంబు లేక తామరకొలంకులు రూపఱియున్నవి. ౭

జలంబులం బుట్టుపువ్వంబులును స్థలప్రదేశంబులందు జనించుపువ్వంబులును ఫలంబులును మునుపటిసుగంధంబు లేకుండుటచే నెంతమాత్రము ప్రకాశింపకున్నవి. —

అత్రోద్యానాని శూన్యాని ప్రలీనవిహగాని చ,
న చాభిరామా నారామా న్పశ్యామి మనుజర్షభ!. ౯

ప్రవిశన్త మయోధ్యాం మాం న కశ్చి దభినన్దతి,
నరా రామ మపశ్యన్తో నిశ్శ్వసన్తి ముహు ర్ముహుః. ౧౦

దేవ! రాజరథం దృష్ట్వా వినా రామ మిహాఽఽగతమ్,
దుఃఖా దశ్రుముఖ స్సర్వో రాజమార్గగతో జనః. ౧౧
హర్మ్యై ర్విమానైః ప్రాసాదై రవేక్ష్య రథ మాగతమ్,
హాహాకారకృతా నార్యో రామాదర్శనకర్శితాః. ౧౨

ఆయతై ర్విమలై ర్నేత్రై రశ్రువేగపరిప్లుతైః,
అన్యోన్య మభివీక్షన్తేఽవ్యక్త మార్తతరాః స్త్రియః. ౧౩

నామిత్రాణాం న మిత్రాణా ముదాసీనజనస్య చ,
అహ మార్తతయా కిఞ్చి ద్విశేష ముపలక్షయే. ౧౪

అప్రహృష్టమనుష్యా చ దీననాగతురఙ్గమా,
ఆర్తస్వరపరిమ్లానా వినిశ్శ్వసితనిస్వనా. ౧౫
నిరానన్దా మహారాజ! రామప్రవ్రాజనాతురా,
కౌసల్యా పుత్త్రహీనేవ అయోధ్యా ప్రతిభాతి మా. ౧౬

సూతస్య వచనం శ్రుత్వా వాచా పరమదీనయా,
బాష్పోపహతయా రాజా తం సూత మిద మబ్రవీత్. ౧౭

ఇచ్చట నయోధ్యలో నుద్యానవనంబులన్నియు మధురంబులగు పక్షిధ్వనులు లేక పాడుపడియున్నవి.

పురుషశ్రేష్ఠుండవగు దశరథుండా! ఒకయుద్యానవనంబైనను నాకుం జూడ సుందరముగా నుండదయ్యె. ౯

నే నయోధ్యం బ్రవేశించునప్పుడు నన్నుంజూచి యొక్కండైనను సంతోషంబు నొందలేదు.

జనులందఱు నాతో రాముండు రాకుండుటంజూచి దుఃఖంబున మాటి మాటికి నిట్టూర్పులు విడుచుచుండిరి. ౧౦

దశరథమహారాజా! రాముండు లేక వచ్చిన రాజరథంబుం జూచినంతనే రాజమార్గంబుననున్న జనులందఱు దుఃఖమునం గన్నీళ్ళు విడిచిరి. ౧౧

స్త్రీలు మేడలను విమానంబులను బ్రాసాదంబులను నెక్కి రాముండు లేక రథంబుమాత్రము వచ్చినదిచూచి పరమదుఃఖితలై హాహాకారంబులు గావించిరి. ౧౨

స్త్రీలు పరమదుఃఖితలై కన్నీళ్లతో నిండిన విమలంబులగు దీర్ఘనేత్రంబులం జక్కంగాం జూచుటకుం శక్తిలేనివారలై యేమియుం దోంచక పరస్పరముం జూచుకొనుచుండిరి. ౧౩

నాకు రామవివాసనమునకు దుఃఖించువిషయమునం బరస్పరశత్రువుల యందుంగాని పరస్పరస్నేహితులందుం గాని యుదాసీనులందుంగాని యెంత మాత్రము భేద మగపడలేదు. అందఱు నేకరీతిగానే దుఃఖించుచుండిరి. ౧౪

దశరథమహారాజా! అయోధ్య సంతోషంబు లేనిజనులతోను, దుఃఖితము లగు గజాశ్వంబులతోనుంగూడి రోదనధ్వనిగలిగి క్షీణించినదై నిట్టూర్పుల ధ్వనిదక్క నితరధ్వనిలేనిదై రాముం డరణ్యంబునకుం బోవుటవలన సంతోషంబువిడిచి దుఃఖితయయియున్నది. కావున నీయయోధ్య పుత్రహీనయగు కౌసల్యపగిది నగపడుచున్నది. అని సూతుండు దశరథునకుం జెప్పెను.

దశరథమహారాజు సుమంత్రునిమాటనువిని యతనింజూచి దుఃఖముచేం దడంబడుచుం బరమదీనస్వరంబున నిట్లని చెప్పెను. ౧౫

కైకేయ్యా వినియుక్తేన పాపాభిజనభావయా,
మయా న మన్త్రకుశలై ర్వృద్ధై స్సహ సమర్థితమ్. ౧౮

న సుహృద్భి ర్న చామాత్యై ర్మన్త్రయిత్వా న నైగమైః,
మయాయమర్థ స్సమ్మోహాత్ స్త్రీహేతో స్సహసా కృతః.
భవితవ్యతయా నూన మిదం వా వ్యసనం మహత్,
కులస్యాస్య వినాశాయ ప్రాప్తం సూత! యదృచ్ఛయా. ౨౦

సూత! య ద్యస్తి తే కిఞ్చి న్మయా తు సుకృతం కృతమ్,
త్వంప్రాపయాఽఽశు మాంరామం ప్రాణాస్స న్త్వరయ న్తిమామ్.

య ద్యద్యాపి మ మైవాఽఽజ్ఞా నివ ర్తయతు రాఘవమ్,
న శక్ష్యామి వినా రామం ముహూ ర్త మపి జీవితుమ్. ౨౨
అథవాఽపి మహాబాహు ర్గతో దూరం భవిష్యతి,
మా మేవ రథ మారోప్య శీఘ్రం రామాయ దర్శయ. ౨౩
వృ త్తదంష్ట్రో మహేష్వాసః క్వాసౌ లక్ష్మణపూర్వజః,
యది జీవామి సాధ్వేనం పశ్యేయం సీతయా సహ. ౨౪

లోహితాక్షం మహాబాహు మాము క్తమణికుణ్డలమ్,
రామం యది న పశ్యేయం గమిష్యామి యమక్షయమ్. ౨౫
అతో ను కిం దుఃఖతరం సోఽహ మిక్ష్వాకునన్దనమ్,
ఇమామవస్థా మాపన్నో నేహ పశ్యామి రాఘవమ్. ౨౬

హా రామ! రామానుజ! హా! హా వైదేహి! తపస్విని!,
న మాం జానీత దుఃఖేన మ్రియమాణ మనాథవత్. ౨౭

పాపము సేయు కులంబులోఁ బుట్టి యట్టి స్వభావముతోఁ గూడియున్న కైకేయి "నీవు రాము నడవికిం బంపు" మని నన్నడుగఁగానే నేను ఆలోచనములందు సమర్థులగు వృద్ధులతో నాలోచనంబైనను జేయనైతిని. ౧౯

నేను స్నేహితులతోఁగాని మంత్రులతోఁగాని పట్టణవాసిజనులతోఁ గాని యాలోచింపక స్త్రీయందలి మోహంబునఁ దటాలున రామునడవికిం బంపినాను.

సుమంత్రుఁడా! అటు కానేని ఈప్రకారము జరగవలసియుండుటచే దైవమె స్వేచ్ఛగా మాకులమునకు వినాశము గలుగుటకై యిట్టి కష్టమును మాకుఁ గల్గించియుండును. ఇది నిశ్చయము. ౨౦

సుమంత్రుఁడా! నీకు నే నిదివఱ కెప్పుడేని గొంచమైన నుపకారము చేసియుందునేని నీవు శీఘ్రముగా నన్ను రామునొద్దకుఁ దీసికొనిపొమ్ము; నా ప్రాణంబులు శీఘ్రముగాఁ బోవునట్లున్నవి. ౨౧

ఇప్పుడును నాయాజ్ఞ జరగునేని రాముని మరల నిచ్చటికిఁ దీసికొని రమ్ము; రాముని విడిచి నేను గొంచెము సేపైనను జీవించియుండఁజాలను. ౨౨

అటుగాదేని మహాబాహుండగు రాముఁడు చాలదూరము పోవునో యేమో నీవు నన్నే రథంబు నెక్కించుకొనిపోయి రామునొద్ద విడువుము. ౨౩

సుందరములగు దంతములుగలవాఁడును పెద్దవిల్లుగలవాఁడును లక్ష్మణాగ్రజుఁడు నగు రాముఁ డెచ్చట నున్నాఁడు? నేను సీతతోఁగూడ నతనిం జక్కఁగాఁ జూతునేని జీవింపఁగలను. ౨౪

ఎఱ్ఱని కనుఁగొనలుగలవాఁడు మహాబాహుఁడును రత్నకుండలంబులు ధరించినవాఁడు నగు రాముఁ జూడకుందునేని యమలోకంబునకుఁ బోదును.

వృద్ధుఁడగు నేను ఇంతటి దుఃఖంబునొందినప్పుడును, ఇక్ష్వాకువంశ్యుల కానందంబు సేయునట్టి రాముం గన్దొరఁజూడకున్నానే! నా కింతకన్న నేమి దుఃఖమున్నది? ౨౫

అయ్యో రాముఁడా! అయ్యో లక్ష్మణుఁడా! తపస్వినివగు నయ్యో సీతా! నే నిచ్చట ననాథవలె దుఃఖంబునం జచ్చుచున్నానే! ఈసంగతి మీకుం దెలియదుగదా! అని దశరథుఁడు విలపించెను. ౨౬

స తేన రాజా దుఃఖేన భృశ మర్పిత చేతనః,
అవగాఢ స్సుదుష్పారం శోకసాగర మబ్రవీత్. ౨౮
రామశోకమహాభోగ స్సీతావిరహపారగః,
శ్వసితోర్మి మహావర్తో బాష్పఫేనజలావిలః. ౨౯
బాహువిక్షేపమీనౌఘో విక్రన్దితమహాస్వనః,
ప్రకీర్ణకేశశైవాలః కైకేయీబడబాముఖః. ౩౦
మమాశ్రువేగప్రభవః కుబ్జావాక్యమహాగ్రహః,
వరవేలో నృశంసాయా రామప్రవ్రాజనాయతః. ౩౧
యస్మిన్బత నిమగ్నోఽహం కౌసల్యే! రాఘవం వినా,
దుస్తరో జీవతా దేవి! మయాఽయం శోకసాగరః. ౩౨
అశోభనం యోఽహ మిహాద్య రాఘవం
దిదృక్షమాణో న లభే సలక్ష్మణమ్,
ఇతీవ రాజా విలప న్మహాయశాః
పపాత తూర్ణం శయనే సుమూర్ఛితః. ౩౩
ఇతి విలపతి పార్థివే ప్రణష్టే
కరుణతరం ద్విగుణం చ రామహేతోః,
వచన మను నిశమ్య తస్య దేవీ
భయ మగమ త్పున రేవ రామమాతా. ౩౪

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే ఏకోనషష్టితమస్సర్గః.

---

## షష్టితమస్సర్గః

తతో భూతోపసృష్టేవ వేపమానా పునఃపునః,
ధరణ్యాం గతసత్త్వేవ కౌసల్యా సూత మబ్రవీత్. ౧

ఆదశరథమహారాజు పరమదుఃఖితుఁడై యగాధంబగు శోకసముద్రంబున మునింగి కౌసల్యం జూచి యిట్లని చెప్పెను. ౩౧

రాణివగుకౌసల్యా! రామదుఃఖమే వైశాల్యముగాను సీతావిరహంబె పారముగాను నిట్టూర్పులె తరంగంబులుగాను సుళ్లుగాను కన్నీళ్లనురుఁగుగాను విసరుకొనంబడు బాహువులె మత్స్యంబులుగాను రోదనధ్వనియె మహాధ్వనిగాను విరియఁబోసికొనంబడిన తలవెండ్రుకలె పాఁచిగాను కైకేయియె బడబానలంబుగాను మంథరమాటలె మహాగ్రాహంబులుగాను క్రూరులగు కైకేయివరంబె జలసమృద్ధిగాను రామవిలాసనంబె దైర్ఘ్యంబుగాను మహాసముద్రంబుకరణి భయంకరంబై యొప్పుచున్న యీదుఃఖంబును రాముఁడులేనిచో సహించి నేను జీవింపజాలను. ౩౨

నేనిప్పు డచ్చట లక్ష్మణునితోఁగూడిన రామునిం జూడఁగోరియుఁ జూడఁజాలకున్నానే దీనికన్న నమంగళంబు మఱేమియున్నది? అని దశరథమహారాజు విలపించెను.

మహాకీర్తిశాలియగు నాదశరథమహారాజిట్లు విలపించుచు మూర్ఛితుఁడై శయనంబునం బడెను. ౩౩

ఇట్లు దశరథమహారాజు రామదుఃఖంబున ద్విగుణముగా విలపించుచు మూర్ఛనొందఁగానే రామునితల్లియగుకౌసల్య యతనిమాటలను విని రామున కేమి సంభవించునో యని భయంబునొందియుండుటగాక మరల "దశరథునికేమికల్గునో" యని భయంబునొందెను. ౩౪

ఇది యేఁబదితొమ్మిదవసర్గము.

---

## అఱువదియవ సర్గము

అంతఁ గౌసల్య పరమదుఃఖితయై భూతావిష్టపగిది నేలంబొరలుచుఁ బ్రాణంబులు విడిచినదానికైవడి మూర్ఛితయయి కొంతవడికిఁ దేఱి సుమంత్రుం జూచి యిట్లని చెప్పెను. –

నయ మాం యత్ర కాకుత్స్థ స్సీతా యత్ర చ లక్ష్మణః,
తాన్వినా క్షణ మప్యత్ర జీవితుం నోత్సహే హ్యహమ్. ౨

నివర్తయ రథం శీఘ్రం దణ్డకాం నయ మా మపి,
అథ తా న్నానుగచ్ఛామి గమిష్యామి యమక్షయమ్. ౩

బాష్పవేగోపహతయా స వాచా సజ్జమానయా,
ఇదమాశ్వాసయ న్దేవీం సూతః ప్రాఞ్జలి రబ్రవీత్. ౪
త్యజ శోకం చ మోహం చ సమ్భ్రమం దుఃఖజం తథా,
వ్యవధూయ చ సన్తాపం వనే వత్స్యతి రాఘవః. ౫
లక్ష్మణ శ్చాపి రామస్య పాదౌ పరిచర న్వనే,
ఆరాధయతి ధర్మజ్ఞః పరలోకం జితేన్ద్రియః. ౬

విజనేఽపి వనే సీతా వాసం ప్రాప్య గృహే ష్వివ,
విస్రమ్భం లభతేఽభీతా రామే సంన్యస్తమానసా. ౭
నాస్యా దైన్యం కృతం కించి త్సుసూక్ష్మ మపి లక్ష్యతే,
ఉచితేవ ప్రవాసానాం వైదేహీ ప్రతిభాతి మా. ౮
నగరోపవనం గత్వా యథా స్మ రమతే పురా,
తథైవ రమతే సీతా నిర్జనేషు వనేష్వపి. ౯

బాలేవ రమతే సీతాఽబాలచన్ద్రనిభాననా,
రామా రామే హ్యధీనాత్మా విజనేఽపి వనే సతీ. ౧౦

తద్గతం హృదయం హ్యస్యా స్తదధీనం చ జీవితమ్,
అయోధ్యాఽపి భవే త్తస్యా రామహీనా తథా వనమ్, ౧౧

రాముఁడును సీతయుఁ లక్ష్మణుఁడు నెచ్చటనున్నారో అచ్చటికి నన్నుఁ గొనిపొమ్ము; నేను సీతారామలక్ష్మణుల విడిచి క్షణమైన నిచ్చట బ్రతికియుండఁ జాలను. ౨

శీఘ్రముగా రథమును మరలించి నన్నును దండకారణ్యంబునకు గొని పొమ్ము. అట్లు నీవు నన్ను ఆసీతారామలక్ష్మణులయొద్దకుఁ దీసికొనిపోవ కుందువేని నేను యమలోకంబు నొందుదును. అని కౌసల్య సుమంత్రునితోఁ జెప్పెను. ౩

ఆసుమంత్రుఁడు చేమోడ్పుగీలించుకొని బొమ్మ వేగంబునం జేసి తడఁ బడు మాటలచే నతికష్టంబునఁ గౌసల్య నూఱడించుచు నిట్లని చెప్పెను. ౪

నీవు దుఃఖంబును మోహంబును వ్యాకులతను విడువుము. రాముఁడు గొంచెమయినను దుఃఖంబులేక వనంబున సుఖంబుగా నున్నాఁడు. ౫

లక్ష్మణుఁడును ధర్మము నెఱింగినవాఁడు కావున నింద్రియసుఖంబులం దగులక వనంబున రామునిపాదంబులకుం బరిచర్య సేయుచుఁ బరలోకసాధనము సేయుచున్నాఁడు. ౬

సీతాదేవి విజనంబగు వనంబునం దైనను ఇండ్లయందువలె భయంబులేక రామునియందే మనసునుంచి సంతోషంబు నొందియున్నది. ౭

వనవాసదుఃఖము సీతకుఁ గొంచెమయినను గలుగలేదు. కావున సీతాదేవి వనవాసంబులకుఁ దగినదనియే నాకుఁ దోఁచుచున్నది. ౮

సీతాదేవి మున్నిచ్చటఁ నగరోద్యానవనంబున నెట్లు క్రీడించుచుం డునో అదేవిధంబున నిప్పుడు జనసంచారములేని యడవులందును క్రీడించు చున్నది. ౯

పూర్ణచంద్రునకు సాటియగు ముఖముగలదియుఁ బతివ్రతయుఁ మంద గామినియు నగుసీతాదేవి రామునందు మగ్నంబగు మనసుగలదై విజనంబగు వనంబునందును బసిబిడ్డవలె దుఃఖం బెఱుంగక యాడుకొనుచున్నది. ౧౦

సీతాదేవిహృదయమును బ్రాణంబులును రామునియధీనములై కావున రాముఁడు లేనిచో నీయయోధ్య నాబిడకు వనప్రాయంబె యగును. ౧౧

పథి పృచ్ఛతి వైదేహీ గ్రామాం శ్చ నగరాణి చ,
గతిం దృష్ట్వా నదీనాం చ పాదపా న్వివిధా నపి. ౧౨
రామం హి లక్ష్మణం వాపి పృష్ట్వా జానాతి జానకీ,
అయోధ్యా క్రోశమాత్రే తు విహార మివ సంశ్రితా. ౧౩
ఇదమేవ స్మరా మ్యస్యా స్సహసై వోపజల్పితమ్,
కైకేయీ సంశ్రితం వాక్యం నేదానీం ప్రతిభాతి మా. ౧౪

ధ్వంసయిత్వా తు తద్వాక్యం ప్రమాదా త్పర్యుపస్థితమ్,
హ్లాదనం వచనం సూతో దేవ్యా మధుర మబ్రవీత్. ౧౫

అధ్వనా వాతవేగేన సమ్భ్రమేణాఽతపేన చ,
న విగచ్ఛతి వైదేహ్యా శ్చన్ద్రాంశుసదృశీ ప్రభా. ౧౬

సదృశం శతపత్రస్య పూర్ణచన్ద్రోపమప్రభమ్,
వదనం తద్వదాన్యాయా వైదేహ్యా న వికమ్పతే. ౧౭

అలక్తరసరక్తాభా వలక్తరసవర్జితౌ,
అద్యాపి చరణౌ తస్యాః పద్మకోశసమప్రభా. ౧౮

నూపురోద్ఘుష్టహేలేవ ఖేలం గచ్ఛతి భామినీ,
ఇదానీ మపి వైదేహీ తద్రాగా న్న్యస్తభూషణా. ౧౯

మార్గంబునం బోవునప్పుడు సీతాదేవి యయోధ్యకుఁ గోసుదూరంబున విహరించుచుండునట్లు సంతోషంబున గ్రామంబులను బట్టణంబులను నదులను నానావిధంబులగువృక్షంబులనుం జూచి రామునైన లక్ష్మణునైన నడిగి వాని పేర్లం దెలిసికొనును. ౧౨,౩౧

సుమంత్రుఁడు మొదట సీతాదేవి కైకేయిని దూషించి చెప్పిన యొకా నొకమాటను జెప్పనారంభించి "సీత కైకేయినిగుఱించి కటూలున నొకమాటం జెప్పినది" అనునంతవఱకుఁ జెప్పినంతనె "ఇట్టిదుఃఖసమయంబున నీమాటం జెప్పినచోఁ గౌసల్యాదశరథులు మఱియుఁ బీడితులయి ప్రాణంబులు విడుతు రేమో" యని శంకించి "అది నాకిప్పుడు జ్ఞప్తికి రాలేదు" అని మఱుఁగు పఱచెను. ౧౪

సుమంత్రుఁడు ఇట్లు ప్రమాదంబున నోటికివచ్చిన యామాటను మఱుఁగుపఱిచి కౌసల్యాదేవికి సంతోషంబుగల్గునట్లు మధురంబగు మాటం జెప్పెను. ౧౫

ఎచ్చుగా దారినడిచినను గాలిదగిలినను బులులు మొదలగువానింజూచి భయపడినను ఎండతాఁకుడుగలిగినను చంద్రకిరణంబులవంటి సీతాదేవి మేని కాంతి వికారము నొందకున్నది. ౧౬

దారినడుచుట మొదలగునవి సంభవించుచుండినను గమలంబునకు సాటి వచ్చినదియుం నిండుచందురునికాంతి గలదియునగు మధురంబుగా మాట లాడునట్టి యాసీతాదేవిమొగంబు ఎంతమాత్రము వాడకున్నది. ౧౭

లత్తుకరసమువలె నెఱ్ఱనికాంతిగల యాసీతాదేవిపాదములు ఇప్పుడు లత్తుకరసములేకున్నను వనంబులో నెడతెగక తిరుగుచున్నను దామరమొగ్గల కాంతిగల్గి యొంతయు నొప్పుచున్నవి. ౧౮

అడవిలో దారినడచునప్పుడును సీతాదేవి పాదములయందలి యాశచే అందెలుమొదలగు సొమ్ములం దాల్చి నడచునప్పుడు అందెలుధ్వనించుట కను కూలముగా విలాసంబునఁ బోవుచున్నది. ౧౯

గజం వా వీక్ష్య సింహం వా వ్యాఘ్రం వా వన మాశ్రితా,
నాఽఽహారయతి సన్త్రాసం బాహూ రామస్య సంశ్రితా. ౨౨

న శోచ్యా స్తే న చాత్మాన శ్శోచ్యో నాపి జనాధిపః,
ఇదం హి చరితం లోకే ప్రతిష్ఠాస్యతి శాశ్వతమ్. ౨౧

విధూయ శోకం పరిహృష్టమానసా
మహర్షియాతే పథి సువ్యవస్థితాః,
వనేరతా వన్యఫలాశనాః పితు
శ్శుభాం ప్రతిజ్ఞాం పరిపాలయన్తి తే. ౨౨
తథాపి సూతేన సుయుక్తవాదినా
నివార్యమాణా సుతశోకకర్శితా,
న చైవ దేవీ విరరామ కూజితా
త్ప్రియేతి పుత్త్రేతి చ రాఘవేతి చ. ౨౩

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే షష్టితమ స్సర్గః.

---

## ఏకషష్టితమస్సర్గః.

వనం గతే ధర్మపరే రామే రమయతాం వరే,
కౌసల్యా రుదతీ స్వార్తా భర్తార మిద మబ్రవీత్. ౧

యద్యపి త్రిషు లోకేషు ప్రథితం తే మహద్యశః,
సానుక్రోశో వదాన్య శ్చ ప్రియవాదీ చ రాఘవః. ౨

సీతాదేవి రామబాహువులచేఁ బరిపాలింపఁబడుచున్నది గావున నడవిలో నేనుంగునుగాని సింహమునుగాని పెద్దపులినిగాని చూచి భయంబు నొందదు. ౨౦

పితృవచనపరిపాలనరూపంబగు నీచరిత్రము లోకంబున నాచంద్రార్కంబుగా శాశ్వతంబై యుండఁగలదు; కావున నాసీతారామలక్ష్మణులను గూర్చిగాని మనలం గూర్చిగాని దశరథమహారాజును గూర్చిగాని దుఃఖింపఁదగదు. ౨౧

ఆసీతారామలక్ష్మణులు దుఃఖంబుఁ బరిత్యజించి సంతోషంబున మహర్షులయాచారంబు నవలంబించి దండ్రి చేసినప్రతిజ్ఞం బరిపాలించుచున్నారు. అని సుమంత్రుఁడు కౌసల్యకుం జెప్పెను. ౨౨

పుత్రదుఃఖంబునఁ బరితపించుచున్న కౌసల్యాదేవి యట్లు సుమంత్రుఁడు యుక్తవచనంబుల నెంత యూఱడించినను "ప్రియుఁడా! పుత్రుఁడా! రాముఁడా!" అని విడువక యఱచుచునే యుండినది. ౨౩

ఇది యఱువదవసర్గము

---

## అఱువదియొకటవసర్గము

పరమధార్మికుఁడు, నొరుల నానందింపఁజేయువారలలో నుత్తముఁడు నగు రాముఁడు వనంబునకుఁ బోవుటను గుఱించి కౌసల్య రోదనంబు సేయుచుఁ బరమదుఃఖితయయి పెనిమిటింజూచి యిట్లని చెప్పెను. ౧

"దశరథుఁడు దయగలవాఁడు, మహాదాత, ప్రియవాది" అని నీకీర్తి ముల్లోకంబులం బ్రసిద్ధమయియున్నదిసరే, అయినను అంతకన్న నపకీర్తి గల్గించుకార్యముఁ జేసితివి. ౨

కథం నరవరశ్రేష్ఠ! పుత్త్రౌ తౌ సహ సీతయా,
దుఃఖితౌ సుఖసంవృద్ధౌ వనే దుఃఖం సహిష్యతః. 3

సా నూనం తరుణీ శ్యామా సుకుమారీ సుఖోచితా,
కథ ముష్ణంచ శీతంచ మైథిలీ ప్రసహిష్యతే. ౪
భుక్త్వాఽశనం విశాలాక్షీ సూపదంశాన్వితం శుభమ్,
వన్యం నైవార మాహారం కథం సీతోపభోక్ష్యతే. ౫

గీతవాదిత్రనిర్ఘోషం శ్రుత్వా శుభ మనిన్దితా,
కథం క్రవ్యాదసింహానాం శబ్దం శ్రోష్యత్యశోభనమ్. ౬

మహేన్ద్రధ్వజసంకాశః క్వను శేతే మహాభుజః,
భుజం పరిఘసఙ్కాశ ముపధాయ మహాబలః. ౭

పద్మవర్ణం సుకేశాన్తం పద్మనిశ్వాస ముత్తమమ్,
కదా ద్రక్ష్యామి రామస్య వదనం పుష్కరేక్షణమ్. ౮

వజ్రసారమయం నూనం హృదయం మే న సంశయః,
అపశ్యన్త్యా న తం య ద్వై ఫలతీదం సహస్రధా. ౯

య త్త్వయాఽకరుణం కర్మ వ్యపోహ్య మమ బాన్ధవాః,
నిరస్తాః పరిధావన్తి సుఖార్హాః కృపణా వనే. ౧౦

యది పఞ్చదశే వర్షే రాఘవః పునరేష్యతి,

రాజశ్రేష్ఠుఁడవగు దశరథుఁడా! చిన్ననాఁటనుండి సుఖముగాఁ బెరిగిన నాసీతారామలక్ష్మణులు ఇప్పుడు దుఃఖితులై వనంబునందలి కష్టంబెట్లు సహింపఁగలరు? ౩

కొంచెము యౌవనమధ్యంబు నొందినదియుఁ గోమలాంగియు సుఖోచితయునగు నాసీత యడవియందలి శీతోష్ణంబుల నెట్లోర్వఁగలదు? ౪

విశాలంబులగు నేత్రంబులుగల సీతాదేవి యిచ్చట నిదివఱకు మంచి యూరుఁగాయలతోఁ గూడిన మనోహరంబగు నాహారంబుఁ దినుచుండియింక నడవిలో విత్తకపండెడు తృణధాన్యము నెట్లు భుజింపఁగలదు? ౫

ఆనందితయగు సీత మంగళకరంబగు గీతవాద్యంబులధ్వనిని వినుచుండి యింకనరణ్యంబునఁ గ్రూరంబులగు సింహాదిమృగంబుల యమంగళధ్వని నెట్లు వినఁగలదు? ౬

ఉత్సవకాలంబున నింద్రుని ధ్వజంబువలెఁ బ్రజలకందఱకును బరమ సంతోషంబు గలుగఁజేయువాఁడును మహాభుజుఁడును మహాబలుఁడునగు రాముఁడు ఇనుపగుదియవంటి తనభుజంబునే తలగడగాఁ జేసికొని వనంబున నెచ్చటఁ బరుండును. ౭

కమలవర్ణంబును సుందరములయిన వెండ్రుకలకొనలుగలదియుఁ గమలగంధంబుగల నిట్టూర్పులతో నొప్పుచున్నదియుఁ గమలంబులవంటి నేత్రంబులు గలదియు నుత్తమంబునగు రామునిముఖంబు నెప్పుడు చూడఁగలను? ౮

రాముఁడు నన్ను విడిచిపోయినంగూడ నామనసు వేయిపఱియలయి పగులకున్నది కావున నామనసు కఠినమయినది వజ్రముతోఁ జేయఁబడినది. ఇందు సందియము లేదు. ౯

నీవు సుఖార్హులగు సీతారామలక్ష్మణులను బట్టణంబునుండి దఱుమఁగొట్టి వారలు దీనులయి యరణ్యంబునం దిరుగునట్లు చేసినావే! ఇది యెంత మాత్రము దయలేక చేసినకార్యము! ౧౦

రాముఁడు పదునైదవసంవత్సరంబున మఱల నిచ్చటికివచ్చినభర

జహ్యా ద్రాజ్యం చ కోశం చ భరతే నోపభుజ్యతే. ౧౧
భోజయన్తి కిల శ్రాద్ధే కేచి త్స్వానేవ బాన్ధవాన్,
తతః పశ్చా త్సమీక్షన్తే కృతకార్యా ద్విజర్షభాన్. ౧౨

తత్ర యే గుణవన్త శ్చ విద్వాంస శ్చ ద్విజాతయః,
న పశ్చా త్తేఽభిమన్యన్తే సుధా మపి సురోపమాః. ౧౩

బ్రాహ్మణే ష్వపి తృప్తేషు పశ్చా ద్భోక్తుం ద్విజర్షభాః,
నాభ్యుపైతు మలం ప్రాజ్ఞా శ్శృఙ్గచ్ఛేదమివర్షభాః. ౧౪

ఏవం కనీయసా భ్రాత్రా భుక్తం రాజ్యం విశాంపతే,
భ్రాతా జ్యేష్ఠో వరిష్ఠ శ్చ కిమర్థం నావమంస్యతే. ౧౫

న పరేణాఽఽహృతం భక్ష్యం వ్యాఘ్రః ఖాదితు మిచ్ఛతి,
ఏవ మేత న్నరవ్యాఘ్రః పరలీఢం న మన్యతే. ౧౬

హవి రాజ్యం పురోడాశాః కుశా యూపా శ్చ ఖాదిరాః,
నైతాని యాతయామాని కుర్వన్తి పున రధ్వరే. ౧౭

తథా హ్యాత్త మిదం రాజ్యం హృతసారాం సురామివ,
నాభిమన్తు మలం రామో నష్టసోమ మి వాధ్వరమ్. ౧౮

[న చేమాం ధర్షణాం రామ స్సఙ్గచ్ఛే దత్యమర్షణః,

కుఁడు తనచేతిలోనున్న రాజ్యమును కోశమును వదలుట యసంభావితము.

కొందఱు బ్రాహ్మణోత్తములున్నను దా మిచ్చుధనం బంతయుఁ దమ వారికే చేరవలయునను నాసచే శ్రాద్ధంబునఁ దమబంధువులనే భుజింపఁ జేసెదరుగదా! అట్లు శ్రాద్ధంబు ముగించి బ్రాహ్మణోత్తములగువారల కిష్ట పఙ్క్తిలో భోజనం బిడఁగోరెదరు. ౧౨

అందు గుణవంతులును బండితులును దేవతాతుల్యులునగు బ్రాహ్మణోత్తము లెవ్వరుందరో వారలు అట్లు తమ్ము విడిచి గుణహీనులగు బ్రాహ్మణులకు శ్రాద్ధభోజనం బిడి పిమ్మట నిష్టపఙ్క్తిలోఁ దమ కమృతం బిడినను దాని నెంత మాత్రము సమ్మతింపరు. ౧౩

మొదటభుజించినవారలు బ్రాహ్మణులె యయినను ఆఁబోతులు తమ కొమ్ములనఱకుటను సహింపఁ జాలనట్లు వారలు భుజించినపిమ్మట భోజనంబు సేయ సమ్మతింపఁజాలరు. ౧౪

ప్రజానాథుండ వగు దశరథుఁడా! ఇట్లు శ్రేష్ఠభ్రాతయుం గుణంబుల శ్రేష్ఠుఁడు నగు రాముఁడు తమ్మునిచే భోగింపఁబడినరాజ్యంబు నేలగోరును? ౧౫

మఱియొక్కమృగంబు దినఁగా మిగిలినమాంసమును బెద్దపులి దినదు. అట్లుపురుషులలోఁ బెద్దపులివంటివాఁడగు రాముఁడును బరుఁ డనుభవించినదాని నంగీకరింపఁడు. ౧౬

హవిస్సును, ఘృతంబును, పురోడాశంబులును, కుశలును, ఖాదిరంబులు మున్నగుయూపస్తంభములును ఇవి యొకయాగంబున వినియోగింపఁ బడిన పిమ్మట మఱల వానిని మఱియొక యాగంబున వినియోగింపరు. ౧౭

అట్లు రాముఁడు మరల నీరాజ్యం బతనికి వచ్చినను, మఱియొక్కనిచే గ్రహింపఁబడిన సారాంశముగలమద్యంబునుంబోలె, నశించినసోమలతగల యాగమునుంబోలె దాని నెంతమాత్రము నిచ్ఛింపఁజాలఁడు. ౧౮

రాముఁడు కోపము నొందియుండునేని యిట్టియవమానం బతనికి

దారయే త్సాగర మపి స హి క్రుద్ధ శ్శితై శ్శరైః.

త్వాం తు నోత్సహతే హన్తుం మహాత్మా పితృగౌరవాత్,

ససోమార్కగ్రహగణం నభ స్తారావిచిత్రితమ్.
పాతయే ద్యో దివం క్రుద్ధ స్స త్వాం న వ్యతివర్తతే,
ప్రక్షోభయే ద్దారయే ద్వా మహీం శైలశతాచితామ్.]

నైవంవిధ మసత్కారం రాఘవో మర్షయిష్యతి,
బలవానివ శార్దూలో వాలధే రభిమర్శనమ్. ౧౯
నైతస్య సహితా లోకా భయం కుర్యు ర్మహామృధే,
అధర్మం త్విహ ధర్మాత్మా లోకం ధర్మేణ యోజయేత్. ౨౦

నన్వసౌ కాఞ్చనై ర్బాణై ర్మహావీర్యో మహాభుజః,
యుగాన్త ఇవ భూతాని సాగరానపి నిర్దహేత్. ౨౧

స తాదృశ స్సింహబలో వృషభాక్షో నరర్షభః,
స్వయమేవ హతః పిత్రా జలజేనాత్మజో యథా. ౨౨

ద్విజాతిచరితో ధర్మ శ్శాస్త్రదృష్ట స్సనాతనః,
యది తే ధర్మనిరతే త్వయా పుత్రే వివాసితే. ౨౩

గతి రేకా పతి ర్నార్యా ద్వితీయా గతి రాత్మజః,

సంభవింపనే సంభవింపదు. అతండు కోపించినచోఁ దీక్ష్ణంబులగు బాణంబుల మందరపర్వతంబునైనను బగులం జేయును. ౧౯

మహాపరాక్రమశాలియగు రాముఁడు తండ్రియను గౌరవంబున నిన్నుమాత్రము చంపనొల్లఁడు. ౨౦

ఎవ్వఁడు కోపంబునొందునేని చంద్రసూర్యులతోను గ్రహంబులతోను నక్షత్రంబులతోనుంగూడిన యాకాశంబునుగాని స్వర్గంబునుగాని పడఁద్రోయం జాలునో పెక్కుపర్వతంబులతో నొప్పునట్టి భూమండలంబునంతయుం గలఁతనొందించి నిశ్చేష్టముగాఁ జేయునో అట్టి రాముఁడు నీమాట నతిక్రమింపకున్నాఁడు.

బలవంతంబగు పెద్దపులి తనతోఁకనుబట్టి యాడించుటను సహింపనట్లు రాముం డిట్టియవమానంబు నెంతమాత్రము సహింపఁడు. ౨౧

మహాయుద్ధంబునందుఁ బదునాలుగులోకంబులు నొక్కటియయి వచ్చినను రామున కెంతమాత్రము భయంబు సేయంజాలవు; అతఁడు ధర్మాత్ముఁడు గావున ధర్మహీనంబగులోకంబును ధర్మిష్ఠంబుగాఁ జేయుచున్నాఁడు. ౨౨

ఓయి! మహాపరాక్రమశాలియుం మహాబాహుఁడునగు నీరాముఁడు ప్రళయకాలాగ్ని పంచమహాభూతంబుల దహించునట్లు బంగారుబాణంబుల సముద్రములనైనను దహించును. ౨౩

అట్టి పరాక్రమశాలియుం సింహబలుండును వృషభంబునకుంబోలె విశాలనయనంబులుగలవాఁడును బురుషశ్రేష్ఠుఁడునగు రాముని దండ్రివగు నీవే మత్స్యము దనపిల్లలం జంపుకొనునట్లు నశింపఁజేసితివి. ౨౪

పరమధార్మికుఁడగు నీపుత్రుని రాము నడవికిఁ బంపితావే! ఉత్తములగు ద్విజులచే ననుష్ఠింపఁబడినదియుం శాస్త్రచోదితంబును సనాతనంబునగు ధర్మంబు నీకెట్లు గలుగును? ౨౫

దశరథమహారాజా! స్త్రీకిఁ బెనిమిటి ముఖ్యమగునగతి; రెండవది

తృతీయా జ్ఞాతయో రాజం శ్చతుర్థీ నేహ విద్యతే. ౨౪
తత్ర త్వం చైవ మే నాస్తి రామ శ్చ వన మాశ్రితః,
న వనం గన్తు మిచ్ఛామి సర్వథా నిహతా త్వయా. ౨౫

హతం త్వయా రాజ్య మిదం సరాష్ట్రం
హత స్తథాఽఽత్మా సహ మన్త్రిభి శ్చ,
హతా సపుత్రాఽస్మి హతాశ్చ పౌరా
స్సుత శ్చ భార్యా చ తవ ప్రహృష్టౌ. ౨౬

ఇమాం గిరం దారుణశబ్దసంశ్రితాం
నిశమ్య రాజాఽపి ముమోహ దుఃఖితః,
తత స్స శోకం ప్రవివేశ పార్థివ
స్స్వదుష్కృతం చాపి పున స్తదా స్మరన్. ౨౭

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డ ఏకషష్టితమ స్సర్గః

## ద్విషష్టితమస్సర్గః

ఏవం తు క్రుద్ధయా రాజా రామమాత్రా సశోకయా,
శ్రావితః పరుషం వాక్యం చిన్తయామాస దుఃఖితః. ౧
చిన్తయిత్వా స చ నృపో ముమోహ వ్యాకులేన్ద్రియః,
అథ దీర్ఘేణ కాలేన సంజ్ఞా మాప పరన్తపః. ౨

కొడుకు; మూఁడవది జ్ఞాతులు; ఇంక నాలవగతి నీలోకంబున లేదు. ౨౮

ఆమూఁడుగతులందును, నీవు నాచవతికి లోఁబడినవాఁడవు కావున నాకు లేనట్లై; రాముఁడైనచో నడవికిఁ బోయినాఁడు; నీవున్నావు కావున నేను రామునితో నడవికిఁబోవుటకు నసమర్థురాలనైతిని; అట్లు ఇతరబాంధవుల నాశ్రయించుటయుం యుక్తముగాదు; అన్నివిధంబుల నీవు నన్ను నశింపఁ జేసినావు. ౨౯

నీవు అవాంతరదేశంబులతోఁ గూడిన యీకోసలదేశంబునంతయుం నశింపఁ జేసితివి; నీమంత్రులను నిన్నును నశింపఁజేసికొంటివి; నాకొడుకు రాముని నన్నును నాశంబు నొందించితివి; పట్టణంబునందలి జనులు నందఱు నాశంబు నొందఁజేసితివి; నీకొడుకు భరతుఁడును నీభార్య కైకయును మాత్రము సంతోషంబు నొందునట్లు గావించుకొన్నావు. అని కౌసల్య దశరథ మహారాజుతోఁ జెప్పినది ౩౦

అంత దశరథమహారాజు భయంకరంబగు నామాటను విని పరమదుఃఖితుఁడై మూర్ఛనొందెను. అంతఁ గొంతవడికిం దేఱి యాతటి దుఃఖంబునకుఁ గారణభూతంబయిన మున్ను తాను జేసిన పాపకృత్యంబుఁ దలంచుకొని మరల దుఃఖంబునొందెను. ౩౧

ఇది యఱువదియొకటవ సర్గము

---

## అఱువదిరెండవ సర్గము

దశరథమహారాజు ఇట్లు దుఃఖితయుం గోపము నొందినదియునగు కౌసల్యచెప్పిన పరుషవాక్యంబుల నాలకించి పరమదుఃఖితుఁడై చింతించెను. ౧

శత్రువులం దపింపఁజేయునట్టి యాదశరథమహారాజు అట్లు చింతించి వ్యాకులమానసుఁడై మూర్ఛనొంది యంత దీర్ఘకాలంబునకు మూర్ఛ దేఱెను. ౨

స సంజ్ఞా ముపలభ్యైవ దీర్ఘముష్ణం చ నిశ్శ్వసన్,
కౌసల్యాం పార్శ్వతో దృష్ట్వా పున శ్చిన్తా ముపాగమత్. 3

తస్య చిన్తయమానస్య ప్రత్యభా త్కర్మ దుష్కృతమ్,
యద నేన కృతం పూర్వ మజ్ఞానాచ్ఛబ్దవేధినా. ౪

అమనా స్తేన శోకేన రామశోకేన చ ప్రభుః,
ద్వాభ్యామపి మహారాజ శోకాభ్యా మన్వతప్యత. ౫
దహ్యమాన స్స శోకాభ్యాం కౌసల్యామాహ భూపతిః,
వేపమానోఽఞ్జలిం కృత్వా ప్రసాదార్థ మవాఙ్ముఖః. ౬

ప్రసాదయే త్వాం కౌసల్యే! రచితోఽయం మయాఽఞ్జలిః,
వత్సలా చానృశంసా చ త్వం హి నిత్యం పరేష్వపి. ౭

భర్తా తు ఖలు నారీణాం గుణవా న్నిర్గుణోఽపివా.
ధర్మం విమృశమానానాం ప్రత్యక్షం దేవి! దైవతమ్. ౮
సా త్వం ధర్మపరా నిత్యం దృష్టలోకపరావరా,
నార్హసే విప్రియం వక్తుం దుఃఖితాఽపి సుదుఃఖితమ్. ౯

తద్వాక్యం కరుణం రాజ్ఞః శ్రుత్వా దీనస్య భాషితమ్,
కౌసల్యా వ్యసృజ ద్బాష్పం ప్రణాళీవ నవోదకమ్. ౧౦

ఆదశరథుఁడు మూర్ఛదేఱినంతనే వేఁడినిట్టూర్పులుపుచ్చుచు దనపా ర్శ్వంబుననున్న కౌసల్యంజూచి మఱల "నాకు గల్గినపుత్రదుఃఖంబునకుఁ గారణంబగుపాపమును మున్ను నేనేమిగావించితినో" యని చింతించెను. 3

అరణ్యంబునం బొంచియుండి యెచ్చటనైనమృగాదులశబ్దంబు వినఁ బడినచో నామృగంబులు గానరాకున్నను ఆశబ్దంబునే గుఱిగాఁబట్టి బాణంబు వేసి యామృగంబులం జంపునట్టిసామర్థ్యంబుగల యాదశరథమహారాజుమున్ను జ్ఞానంబున నేమిపాపంబును జేసినాఁడో అది యిప్పు డతనికి స్ఫురించినది. ४

దశరథమహారాజు మున్ను దాను జేసినపాపముచేఁ గలిగినదుఃఖము చేతను రామదుఃఖముచేతను ఈరెండుదుఃఖములచేతను బరితపించుచుండెను. ೫

భూమిపతియగు నాదశరథుఁడు ఆరెండుదుఃఖంబులఁ బరితపించుచు గడగడవడంకుచుఁ దలవాంచి చేమోడ్పుగీలించి యతునయార్థమయి కౌసల్యాం జూచి యిట్లని చెప్పెను. ౬

కౌసల్యా! నీవు ప్రసాదంబు నొందుము; నేను జేతులుమొగిడ్చె దాను; నీవు శత్రువులయందునుంగూడ నతిదయగలదానవును మంచిమనసు గలదానవునుగదా! ౭

కౌసల్యా! ధార్మికలగు స్త్రీలకుఁ బెనిమిటిగుణవంతుఁడైనను, నిర్గు ణుఁడైనను అతఁడే ప్రత్యక్షదేవత. ౮

నీ వెల్లప్పుడును ధర్మపరవు; లోకంబునందలి మంచిచెడ్డలం దెలిసిన దానవు; ఇట్టి నీవు ఎంతదుఃఖంబు నొందియున్నను నాకు మహాదుఃఖము గల్గునట్లు ఇట్టియప్రియంబుఁ జెప్పఁదగదు. అని దశరథుఁడు కౌసల్యతోఁ జెప్పెను. ౯

కౌసల్య దుఃఖితుఁడగు దశరథమహారాజుచెప్పిన దుఃఖంబగు నామా టనువిని మేడలపైనుండి వాననీళ్లు నేలంబడుటకై నుంచిన దారువ్యాదికృతంబగు జలమార్గము వాననీళ్లను విడుచునట్లు కన్నీళ్లు విడిచెను ౧౦

సా మూర్ధ్ని బద్ధ్వా రుదతీ రాజ్ఞః పద్మమివాఞ్జలిమ్,
సమ్భ్రమా దబ్రవీ త్త్రస్తా త్వరమాణాక్షరం వచః. ౧౧

ప్రసీద శిరసా యాచే భూమౌ నిపతితాఽస్మి తే,
యాచితాస్మి హతా దేవ! హన్తవ్యాఽహంనహి త్వయా. ౧౨

నైషా హి సా స్త్రీ భవతి శ్లాఘనీయేన ధీమతా,
ఉభయో ర్లోకయో ర్వీర! పత్యా యా సమ్ప్రసాద్యతే. ౧౩

జానామి ధర్మం ధర్మజ్ఞ! త్వాం జానే సత్యవాదినమ్,
పుత్రశోకార్తయా తత్తు మయా కిమపి భాషితమ్. ౧౪

శోకో నాశయతే ధైర్యం శోకో నాశయతే శ్రుతమ్,
శోకో నాశయతే సర్వం నాస్తి శోకసమో రిపుః. ౧౫

శక్య ఆపతిత స్సోఢుం ప్రహారో రిపుహస్తతః,
సోఢు మాపతిత శ్శోక స్సుసూక్ష్మోఽపి న శక్యతే. ౧౬

[ధర్మజ్ఞా శ్శ్రుతిమన్తోఽపి ఛిన్నధర్మార్థసంశయాః,
యతయో వీర! ముహ్యన్తి శోకసమ్మూఢచేతసః.]

వనవాసాయ రామస్య పఞ్చరాత్రోఽద్య గణ్యతే,
యశ్శోకహతహర్షాయాః పఞ్చవర్షోపమో మమ. ౧౭

తం హి చిన్తయమానాయాః శోకోఽయం హృది వర్ధతే,

ఆకౌసల్య ధర్మభీతయయి రోదనంబుసేయుచు దశరథుని చేమోడ్పు చుం గమలంబువలెం జేతులంబట్టి శిరంబునయుంచుకొని సంభ్రమంబునం దొట్రుపడుచు నిట్లని చెప్పెను. ౧౧

దశరథుండా! నీవు ప్రసన్నుండవగుము; నిన్ను శిరసుచే నమస్కరించి యాచించుచున్నాను; నేను భర్తవగు నీచే యాచింపంబడినదాన గావునం బాపిష్ఠురాలనైతిని. కాంబట్టి నీవు నన్నుం జక్కంగాం బ్రహరింపవలయును. ౧౨

పరాక్రమశాలివగుదశరథుండా! ఎవ్వతె స్తుతింపందగినవాండును బుద్ధిమంతుండునగు పెనిమిటిచే ననునయింపంబడునో ఆస్త్రీ రెండులోకంబులందును సౌఖ్యంబు నొందంజాలదు. ౧౩

ధర్మజ్ఞుండవగు దశరథుండా! నేనుధర్మంబు నెఱుంగుదును; నీవు సత్యవాదివనియుం నెఱుంగుదును; అయితే పుత్రదుఃఖంబునంజేసి యాలోచింపక యనుచితంబగుమాటం జెప్పితిని. క్షమింపవలయును. ౧౪

దుఃఖముచే ధైర్యము నశించును; దుఃఖముచే విద్యయు నశించును; అట్లు దుఃఖముచే నన్నియు నశించును. కావున దుఃఖమువంటిశత్రు వెవ్వండును లేదు. ౧౫

శత్రువు తటాలునం గొట్టినచో నాదెబ్బను సహింపవచ్చును; అట్లు తటాలున దుఃఖము సంభవించునేని అది యతిస్వల్పమయినను దాని సహింపవలవిగాదు. ౧౬

పరాక్రమశాలివగు దశరథుండా! ధర్మజ్ఞులును వేదవేత్తలును, ధర్మాధర్మంబులవిషయమయి యెంతమాత్రము సందేహంబు లేనివారలునగు మునీశ్వరులునుంగూడ దుఃఖంబువచ్చునపుడు అజ్ఞానంబు నొందెదరు.

రాముండు వనవాసంబుసేయ నారంభించి యిప్పటికి అయిదురాత్రులయినవి. అవి పరమదుఃఖితనైన నాకు ఇప్పుడు అయిదుసంవత్సరంబులలో సరిగానున్నవి. ౧౮

ఆరామునిం దలంచుకొనంగానే నదీవేగముచే సముద్రజలము వృద్ధి

నదీనామివ వేగేన సముద్రసలిలం మహత్. ౧౭

ఏవం హి కథయన్త్యాస్తు కౌసల్యాయా శ్శుభం వచః,
మన్దరశ్మి రభూ త్సూర్యో రజనీ చాభ్యవర్తత. ౧౮
తథా ప్రసాదితో వాక్యై ర్దేవ్యా కౌసల్యయా నృపః,
శోకేన చ సమాక్రాన్తో నిద్రాయా వశ మేయివాన్. ౨౦

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే ద్విషష్టితమ స్సర్గః.

## త్రిషష్టితమస్సర్గః.

ప్రతిబుద్ధో ముహూర్తేన శోకోపహతచేతనః,
అథ రాజా దశరథ స్స చిన్తా మభ్యపద్యత. ౧
రామలక్ష్మణయో శ్చైవ వివాసా ద్వాసవోపమమ్,
ఆవివేశోపసర్గ స్తం తమ స్సూర్య మివాఽసురమ్. ౨
సభార్యే నిర్గతే రామే కౌసల్యాం కోసలేశ్వరః,
వివక్షు రసితాపాఙ్గాం స్మృత్వా దుష్కృత మాత్మనః. ౩

స రాజా రజనీం షష్ఠీం రామే ప్రవ్రాజితే వనమ్,
అర్ధరాత్రే దశరథ స్సంస్మరన్ దుష్కృతం కృతమ్. ౪
స రాజా పుత్త్రశోకార్తః స్మృత్వా దుష్కృత మాత్మనః,
కౌసల్యాం పుత్త్రశోకార్తా మిదం వచన మబ్రవీత్. ౫

యదాచరతి కల్యాణి! శుభం వా యదివాఽశుభమ్,
తదేవ లభతే భద్రే! కర్తా కర్మజ మాత్మనః. ౬

కొందునట్లు, నామనంబున అదుఃఖము వృద్ధిఁబొందుచున్నది. అని కౌసల్య దశరథునితోఁ జెప్పినది. ౧౯

ఇట్లు కౌసల్య మంగళకరంబగుమాటం జెప్పుచుండఁగానే సూర్యుఁ డస్తమించె. అంత రాత్రియుఁ వచ్చినది. ౧౯

దశరథమహారాజు అట్లు కౌసల్యాదేవి మధురవాక్యంబుల నాశ్వాసింపఁ బరమదుఃఖాక్రాంతుఁడైనను నిదురనొందెను. ౨౦

ఇది యఱువదిరెండవసర్గము.

---

## అఱువదిమూఁడవసర్గము

అంత నా దశరథమహారాజు కొంతవడికి నిద్రమేల్కొని పరమదుఃఖితుఁడై చింతనొందెను. ౧

రామలక్ష్మణుల నడవికిఁ బంపుటచే దేవేంద్రతుల్యుఁడగు నాదశరథుఁడు సూర్యుఁడు రాహువుచే గ్రసింపఁబడునట్లు మహోపద్రవంబు నొందెను. ౨

రాముఁడు భార్యతోఁగూడ వనంబునకుఁ బోయినపిమ్మట కోసల దేశాధిపతి యగుదశరథుఁడు తాను మున్ను చేసిన పాపమును దలంచుకొని దాని నల్లనికడకండ్లుగల కౌసల్యకుఁ జెప్పఁగోరెను. 3

రాముఁ నడవికిఁ బంపినపిమ్మట నాదశరథమహారాజు ఆఱవరాత్రియందు అర్ధరాత్రంబున మున్ను దాను జేసినపాపమును దలంచుకొనుచునుండెను. ౪

పుత్రదుఃఖంబునం బరితపించుచున్న యాదశరథమహారాజు తాను మున్ను చేసినపాపముఁదలంచుకొని తనయట్లు పుత్రదుఃఖంబునొందియున్న కౌసల్యంజూచి యిట్లని చెప్పెను. ౫

మంగళస్వరూపిణివగు కౌసల్యా! మనుష్యుఁడు మంచిదిగాని చెడ్డదిగాని యేకర్మమును జేయునో ఆకర్మమువలన నట్టిఫలమునే పొందును. ౬

గురులాఘవ మర్థానా మారమ్భే కర్మణాం ఫలమ్,
దోషం వా యో న జానాతి స బాల ఇతి హోచ్యతే. ౭

కశ్చి దామ్రవణం ఛిత్త్వా పలాశాం శ్చ నిషిఞ్చతి,
పుష్పం దృష్ట్వా ఫలే గృధ్ను స్స శోచతి ఫలాగమే. ౮

అవిజ్ఞాయ ఫలం యో హి కర్మ త్వే వానుధావతి,
స శోచే త్ఫలవేళాయాం యథా కింశుకసేచకః. ౯

సోఽహ మామ్రవణం ఛిత్త్వా పలాశాం శ్చ న్యషేచయమ్,
రామం ఫలాగమే త్యక్త్వా పశ్చాచ్ఛోచామి దుర్మతిః. ౧౦

లబ్ధశబ్దేన కౌసల్యే! కుమారేణ ధనుష్మతా,
కుమారశ్శబ్దవేధీతి మయా పాప మిదం కృతమ్, ౧౧

త దిదం మేఽనుసమ్ప్రాప్తం దేవి! దుఃఖం స్వయం కృతమ్,
సమ్మోహా దిహ బాలేన యథా స్యా ద్భక్షితం విషమ్. ౧౨

యథాఽన్యః పురుషః కశ్చి త్పలాశై ర్మోహితో భవేత్,
ఏవం మమాఽప్యవిజ్ఞాతం శబ్దవేధ్యమయం ఫలమ్. ౧౩

ఎవ్వఁడు కార్యముల నారంభించునప్పుడు వాని యెచ్చుతక్కువలను గుణదోషంబులను ఎఱుంగఁడో వానినే పండితులు మూఢుఁడని యందురు. ౭

ఎవ్వఁడు పెద్దవిగా సుందరముగానున్న మోదుగపువ్వులం జూచి యందుకుఁ దగినఫలంబె యావృక్షంబునఁ గల్గునని యెంచి ఫలమునం దాసగొని రంగులేనివియుం జిన్నవియునగు పువ్వుంబుగలవి గావున మామిడిచెట్టు ఫలంబును జిన్నవిగానే యుండునను నభిప్రాయంబున మామిడిచెట్లను నఱికి మోదుగచెట్లనే నీళ్లుపోసి పెంచునో అతఁడు ఫలప్రాప్తికాలంబున మోదుగచెట్టునందుఁ దాను దలంచినట్లు మహాఫలంబుగాక దుఃఖంబునొందును. ౮

ఎవ్వఁడు కార్యంబులఫలంబు నెఱుంగక మనసునకు వచ్చినట్లు కార్యములం జేయునో అతఁడు మామిడిచెట్లనఱికి మోదుగచెట్లం బెంచినవాఁడువలె ఫలకాలంబున దుఃఖంబునొందును. ౯

మామిడితోఁపును నఱికి మోదుగచెట్లకు నీళ్లుపోసి పెంచినట్లు దుర్బుద్ధినగు నేను 'వేఁటాడునప్పుడు మృగంబులం జూచి వేయుంటమాని వానిశబ్దములనె గుఱిగాఁబట్టి బాణము వేయుచుంటిని, దానివలన నిప్పుడు ఫలప్రాప్తికాలంబున రాముని విడిచి దుఃఖించుచున్నాను. ౧౦

కౌసల్యా! "ఈ చిన్నవాఁడు 'శబ్దంబునె గుఱిగా పట్టివేయువాఁడు" అని ప్రసిద్ధిగాంచినవాఁడను ధనుష్మంతుఁడ నగు నేను చిన్నప్పుడు ఈపాపముఁ జేసితిని. ౧౧

ప్రపంచంబున బాలుఁ డజ్ఞానంబున విషంబుఁదినునేని యది యతని కెట్లు దుఃఖకరంబగునో అట్లు నే నజ్ఞానంబునఁ జేసిన పాపము ఇప్పుడు నాకు దుఃఖము గలుగఁజేసినది. ౧౨

ఒకానొక పురుషుఁడు పలాశపుష్పంబులు మంచివిగా నుండుటం జూచి వానిఫలములును మంచివిగా నుండునని భ్రమించినట్లు నేను మృగంబని ధ్వనినే గుఱిగాఁబట్టి బాణంబు వేసి వానిం జంపుటవలనం గలుగు లోక

దేవ్యనూఢా త్వ మభవో యువరాజో భవా మ్యహమ్,
తతః ప్రావృడనుప్రాప్తా మదకామవివర్ధనీ. ౧౪

ఉపాస్య హి రసాన్భౌమాం స్తప్త్వా చ జగదంశుభిః,
పరేతాచరితాం భీమాం రవిరావిశతే దిశమ్. ౧౫

ఉష్ణ మన్తర్దధే సద్య స్స్నిగ్ధా దదృశిరే ఘనాః,
తతో జహృషిరే సర్వే భేకసారఙ్గబర్హిణః. ౧౬

క్లిన్నపక్షోత్తరా స్స్నాతాః కృచ్ఛ్రా దివ పతత్రిణః,
వృష్టివాతావధూతాగ్రా న్పాదపా నభిపేదిరే. ౧౭

పతితేనామ్భసా ఛన్నః పతమానేన చాసకృత్,
ఆబభౌ మత్తసారఙ్గ స్తోయరాశి రివాచలః. ౧౮

పాణ్డురారుణవర్ణాని స్రోతాంసి విమలా న్యపి,
సుస్రువు ర్గిరిధాతుభ్య స్సభస్మాని భుజఙ్గవత్. ౧౯

[ఆకులారుణతోయాని స్రోతాంసి విమలా న్యపి,
ఉన్మార్గజలవాహీని బభూవు ర్జలదాగమే.]
తస్మి న్నతిసుఖే కాలే ధనుష్మా నిషుమా న్రథీ,
వ్యాయామకృతసఙ్కల్ప స్సరయూ మన్వగాం నదీమ్. ౨౦

నిపానే మహిషం రాత్రౌ గజం వాఽభ్యాగతం నదీమ్,
అన్యం వా శ్వాపదం కంచి జ్జిఘాంసు రజితేన్ద్రియః. ౨౧

ఖ్యాతింజూచి దానిఫలంబును అట్టి సర్వోత్తమంబుగా నుండునని భ్రమంబు
నొందితిని. ౧౩

కౌసల్యా! నీ కప్పటికి వివాహము కాలేదు. మాతండ్రిగా రుండిరి.
నేను యువరాజుగా నుంటిని. అట్టికాలంబున నాకానొకప్పుడు మదకామం
బుల వృద్ధిఁబొందించునట్టి వర్షాకాలంబు వచ్చినది. ౧౪

సూర్యుఁడు కిరణంబుల భూమియందలి రసంబులను గ్రహించిభూమిని
దపింపఁజేసి ప్రేతములచే నధిష్ఠితంబును భయంకరంబునగు దక్షిణదిక్కు
నొందెను. ౧౫

అప్పుడు వేఁడిమి నశించినది; చల్లని మేఘంబులు చూపట్టినవి; అంతఁ
గప్పలును చాతకపక్షులును నెమిళ్లును సంతోషంబు నొందినవి. ౧౬

పక్షులు రెక్కలమీఁదిభాగములు దడియుటచే స్నానము చేసియున్నట్లు
చూపట్టుచుఁ గష్టంబున వానగాలిచేఁ గదలింపఁబడిన కొమ్మలుగల వృక్షంబు
లపై వ్రాలినవి. ౧౭

మదపుటేనుఁగు నిశ్చలంబై నిరంతరముగాఁ గురియుచున్న వర్షధార
లచేఁ గప్పఁబడుచు నిశ్చలస్తబ్ధతరంగంబగు సముద్రంబుకరణిం జూపట్టు
చుండెను. ౧౮

జలంబులు స్వచ్ఛములయినను జలప్రవాహంబులు గైరికధాతుసంయో
గంబున నొక్కచోఁ దెల్లనివై మఱియొకచో నెఱ్ఱనివై కార్చిచ్చుచేఁ గలిగిన
బూడిదతో సర్పములువలెఁ గుటిలముగాఁ బ్రవహించినవి. ౧౯

స్వచ్ఛములగు జలప్రవాహములు వర్షము గురియుటచేఁ గలంగి బుర
దచే నెఱ్ఱనివై మిట్టప్రదేశంబులందుసుం గూడఁ బాఱుచుండినవి.

అతిసుఖకరంబగు నాకాలంబున నేను వేఁటాడఁగోరి ధనుర్బాణం
బులుదాల్చి రథంబునెక్కి సరయూనదియొద్దకుఁ బోతిని. ౨౦

నేను మూఢుఁడను గావున నచ్చట నీళ్లుత్రాఁగెడిప్రదేశమునం గాచి
యుండి నీళ్లుత్రాగుటకై యేటికివచ్చిన యెనుబోతునుగాని యేనుఁగునుగాని
లేక యితరమగు క్రూరమృగంబునుగాని చంప నిశ్చయించితిని. ౨౧

[తస్మిం స్తత్రాహ మేకాన్తే రాత్రౌ వివృతకార్ముకః,

తత్రాహం సంవృతం వన్యం హతవాం స్తీర మాగతమ్,
అన్యం చాపి మృగం హింస్రం శబ్దం శ్రుత్వాఽభ్యుపాగతమ్,]

అథాన్ధకారే త్వశ్రౌషం జలే కుమ్భస్య పూర్యతః,
అచక్షుర్విషయే ఘోషం వారణస్యేవ నర్దతః. ౨౨
తతోఽహం శర ముద్ధృత్య దీప్త మాశీవిషోపమమ్,
శబ్దం ప్రతి గజప్రేప్సు రభిలక్ష్య త్వపాతయమ్. ౨౩

అముఞ్చం నిశితం బాణ మహ మాశీవిషోపమమ్,
తత్ర వాగుషసి వ్యక్తా ప్రాదు రాసీ ద్వనౌకసః. ౨౪

హా హేతి పతత స్తోయే బాణాభిహతమర్మణః,
తస్మిన్నిపతితే బాణే వా గభూ త్తత్ర మానుషీ. ౨౫
కథ మస్మద్విధే శస్త్రం నిపతేత్తు తపస్విని,
ప్రవివిక్తాం నదీం రాత్రా వుదాహారోఽహ మాగతః. ౨౬
ఇషుణాఽభిహతః కేన కస్య వా కిం కృతం మయా?,

ఋషే ర్హి న్యస్తదణ్డస్య వనే వన్యేన జీవతః. ౨౭
కథంను శస్త్రేణ వధో మద్విధస్య విధీయతే,

జటాభారధర స్యైవ వల్కలాజినవాససః. ౨౮
కో వధేన మమార్థీ స్యాత్? కింవాఽస్యాపకృతం మయా?,

నే నాసరయూనదీతీరంబున నాయవతారప్రదేశంబునందు రాత్రి యేకాంతంబున ధనువు నెక్కుపెట్టి జాగ్రత్తతోనుంటిని.

అచ్చట నేను గుప్తముగానుండి నా వినవచ్చిన శబ్దమును గుఱిపట్టి ఆసరయూతీరమునకువచ్చిన వన్యమృగంబు నొక్కటిని మఱియొక దుష్ట మృగమును జంపినాను.

అంత నంధకారంబునఁ గండ్లు కగపడనిస్థలంబున నేనుఁగు గర్జాధ్వని వలెనున్న నీటిలోఁ గుంభంబును వంచుటంగలుగుశబ్దమును వింటిని. ౨౨

అంత నేను సర్పంబుభంగి వెలుంగుచున్న బాణంబునెత్తి యాగజంబుఁ జంపంగోరినవాఁడనై యాధ్వనివచ్చినజాడ నెఱింగి యింతమాత్రముదూరం బున గజంబుండునని నిశ్చయించి బాణప్రయోగంబుచేసితిని. ౨౩

నే నెట్లు తీక్ష్ణంబగుబాణముం బ్రయోగించితినో ఆచట్టుననుండియే బాణంబుచే మర్మస్థానముచం గొట్టబడి నీటంబడిన యొకానొకముని కుమారకుని "అయ్యో! అయ్యో" అనెడు నఱపు స్పష్టముగా వినవచ్చినది.

బాణంబు వేసినంతనే యచ్చటనుండి యిట్లని మనుష్యవాక్కు విన వచ్చినది. ౨౪

నేను దపస్వినే! నాపై నెట్లు బాణంబుపడినది?

నేను నీళ్లు ముంచుకొనిపోవుటకై రాత్రికాలంబున నెవ్వరును లేనప్పుడు ఏటికివచ్చినాను; న న్నెవ్వఁడు బాణముచేఁ గొట్టినాఁడు! నే నెవ్వని కేమి అపకారముగా వించితిని? ౨౫

పరుల కెంతమాత్రమును హింసచేయక వనంబున ఫలంబులం దినుచుఁ గాలంబును గడుపుచున్న నాయట్టిఋషిని ఆయుధముచే నెట్లు చంపి నాఁడు!

జటలనాధరించి నారచీరలను కృష్ణాజినంబులనుగట్టుకొనియున్న నన్ను జంపి యెవ్వఁడు ప్రయోజనంబు నొందఁగోరినాఁడు! అతనికి నేనేమి యప కారము చేసితిని?

ఏవం నిష్ఫల మారబ్ధం కేవలానర్థసంహితమ్. ౨౯

న కశ్చి త్సాధు మన్యేత యథైవ గురుతల్పగమ్,

నాహం తథాఽనుశోచామి జీవితక్షయ మాత్మనః. ౩౦
మాతరం పితరం చోభా వనుశోచామి మద్వధే,

తదేత న్మిథునం వృద్ధం చిరకాలభృతం మయా. ౩౧
మయి పఞ్చత్వ మాపన్నే కాం వృత్తిం వర్తయిష్యతి,
వృద్ధౌ చ మాతాపితరా వహం చైకేషుణా హతః. ౩౨
కేన స్మ నిహతా స్సర్వే సుబాలేనాకృతాత్మనా,

తాం గిరం కరుణాం శ్రుత్వా మమ ధర్మానుకాఙ్క్షిణః. ౩౩
కరాభ్యాం సశరం చాపం వ్యథితస్యాపతద్భువి,
తస్యాహం కరుణం శ్రుత్వా నిశి లాలపతో బహు. ౩౪
సమ్భ్రాన్త శ్శోకవేగేన భృశ మాసం విచేతనః,

తం దేశ మహ మాగమ్య దీనసత్త్వ స్సుదుర్మనాః. ౩౫
అపశ్య మిషుణా తీరే సరయ్వా స్తాపసం హతమ్,
అవకీర్ణజటాభారం ప్రవిద్ధకలశోదకమ్, ౩౬
పాంసుశోణితదిగ్ధాఙ్గం శయానం శల్యపీడితమ్,

స మా ముద్వీక్ష్య నేత్రాభ్యాం త్రస్త మస్వస్థచేతసమ్. ౩౭
ఇత్యువాచ తతః క్రూరం దిధక్ష న్నివ తేజసా,

ఇట్లు గొప్ప యనర్థమమాత్రము కలుగునట్లు నిష్ఫలంబగు కార్యము సేయఁబడినది.

ఎవ్వరైనను ఇట్లు నన్నుఁ జంపినవాని గురుభార్యతోఁ బోయినవానిని ధిక్కరించునట్లు ధిక్కరింతురు.

నన్నుఁజంపినను నాప్రాణంబుపోయినదని నాకు దుఃఖంబులేదు; నేను జచ్చినవెనుక నాతలిదండ్రులం గాపాడువార లెవ్వరును లేరే యని వారలం దలంచుకొని దుఃఖంచుచున్నాను గాని వేఱుగాదు. 30

బహుకాలముగా నాచేతఁ బోషింపఁబడుచున్నవృద్ధులగు నీదంపతు లిద్దఱును నేను మరణము నొందినపిమ్మట నెట్లు జీవింతురు? 31

మిక్కిలి కఠిన మూర్ఖుఁడును జ్ఞానహీనుఁడు నగు నెవ్వఁడు ఒక్క బాణంబున నన్నును నాతలిదండ్రులను మమ్ముల మువ్వురినిం జంపినాఁడు! అని మునికుమారునిమాట వినవచ్చినది. 32

దుఃఖకరంబగు నాధ్వనిని విన్నంతనే అధర్మభయంబున నామనంబు వ్యథితంబగుటంజేసి నాచేతులనుండి ధనుర్బాణంబులు నేలంబడినవి. 33

నేను రాత్రికాలంబున నట్లు విలపించుచున్న యామునికుమారకుని దీనాలాపంబులు విని సంభ్రాంతుఁడనై పరమదుఃఖంబునొంది విసంజ్ఞుఁడనై తిని. 34

అంత నేను మనంబున దైన్యంబు గదురఁ బరమదుఃఖితుఁడనై యచ్చోటికింబోయి సరయూతీరంబున బాణహతుఁడై నేలంబడి జటలు విరియంబోసికొని కుండనుండి కొంచెము చిందినయుదకము చేఁ దడుపఁబడిదేహంబంతయు నెత్తురును దుమ్మునుంజేరి గ్రమ్ముకొని బాణపీడితుఁడై పడియున్న మునికుమారకుఁ జూచితిని. 35,36

ఆమునికుమారుఁడు భీతుఁడనై దిగులొందియున్న నన్ను దహించువాఁడువలెఁ జూచుచుఁజూపులంజూచి యంత బరుషవచనంబున నిట్లని చెప్పెను. 37

కిం తవాపకృతం రాజ! న్వనే నివసతా మయా. ౩౮
జిహీర్షు రమ్భో గుర్వర్థం య దహం తాడిత స్త్వయా,

ఏకేన ఖలు బాణేన మర్మ ణ్యభిహతే మయి. ౩౯
ద్వౌ వన్ధౌ నిహతౌ వృద్ధౌ మాతా జనయితా చ మే,

తౌ కథం దుర్బలౌ వన్ధౌ మత్ప్రతీక్షౌ పిపాసితౌ. ४౦
చిర మాశాకృతాం తృష్ణాం కష్టాం సన్ధారయిష్యతః,

న నూనం తపసో వాఽ స్తి ఫలయోగ శ్శ్రుతస్య వా. ४౧
పితా యన్మాం న జానాతి శయానం పతితం భువి,

జానన్నపి చ కిం కుర్యా దశ క్తి రపరిక్రమః. ४౨
భిద్యమాన మి వాశ క్త స్త్రాతు మన్యో నగో నగమ్,

పితు స్త్వ మేవ మే గత్వా శీఘ్ర మాచక్ష్వ రాఘవ!. ४౩
న త్వా మనుదహే త్క్రుద్ధో వనం వహ్ని రి వైధితః,

ఇయ మేకపదీ రాజ! న్యతో మే పితు రాశ్రమః. ४४
తం ప్రసాదయ గత్వా త్వం న త్వాం స కుపిత శ్శపేత్,

విశల్యం కురు మాం రాజ! న్మర్మ మే నిశిత శ్శరః. ४౫
రుణద్ధి మృదు సోత్సేధం తీర మమ్బురయో యథా,

దశరథమహారాజా! తలిదండ్రులకొఱకు నీళ్లుదీసికొనిపోవుటకై వచ్చిన నన్ను బాణంబునం గొట్టినావే! వనంబునఁ దపస్సుగావించుకొనుచున్న నేను నీ కట్టియపకార మేమిచేసితిని? ౩౮

నాజీవంబున నొక్కబాణంబు వేసినంతనె నేను జచ్చుటయేగాక వృద్ధులు నంధులు నగు నాతలిదండ్రు లిద్దఱును గూడఁ జచ్చిపోవుదురు. ౩౯

లేవలేనివారలును అంధులును దప్పిగొని నారాకకెదురుచూచుచున్నవారలునగు నాతలిదండ్రులు బహుకాలమువఱకు "చిన్నవాఁడు నీళ్లుదీసికొని వచ్చు" ననియెడు నాసచే దుస్సహంబగుదప్పి నడంచుకొని యుండఁ గలరు. ౪౦

ఎంతపనిచేసినను ఎంత విద్యసంపాదించినను ఏమియు ఫలంబు లేదు; అధికంబగుతపస్సును విద్యయునుంగల నేను ఇప్పుడు మాతండ్రికిఁగూడఁ దెలియనట్లు నేలంబడి పొరలుచున్నానుగదా! ౪౧

నడచుటకునుంగూడ శక్తిలేని నాతండ్రి నే నిట్లు పడియుండుట నెఱింగినను ఏమి సేయఁగలఁడు? గాలిమొదలగువానిచే వృక్షము విఱిగిపడుచుండఁగా మఱియొక్కవృక్షము చూచుచున్నను దానికేమిసాహాయ్యము సేయఁగలదు? ౪౨

దశరథుఁడా! నీవే శీఘ్రముగా నాతండ్రియొద్దకుం బోయి నాసంగతిం జెప్పుము; అంత వృద్ధిఁబొందిన కార్చిచ్చు వనములో దహించునట్లు క్రుద్ధుఁడై నిన్ను దహింపఁడు. లేనిచో దహించును. ౪౩

ఈకాలిత్రోవతోనే పోయిచో నాతండ్రియాశ్రమంబునకుఁ బోఁగలవు, నీవు పోయి ఆయనను బ్రసన్నుం జేయుము. కుపితుఁడై నిన్ను శపింపకుండును. లేనిచో నవశ్యము శపించును. ౪౪

దశరథమహారాజా! నామేనిలోని బాణంబును వెలికి వేయుము; జలప్రవాహము ఉన్నతంబగు నిసుకచేనైన తీరంబును కరఁగఁజేయునట్లు ఈ

సశల్యః క్లిశ్యతే ప్రాణై ర్విశల్యో వినశిష్యతి. ౪౬
ఇతి మా మవిశ చ్ఛిత్త్వా తస్య శల్యాపకర్షణే,

దుఃఖితస్య చ దీనస్య మమ శోకాతురస్య చ. ౪౭
లక్షయామాస హృదయే చిన్తాం మునిసుత స్తదా,

తామ్యమాన స్స మాం కృచ్ఛ్రా దువాచ పరమార్తవత్.౪౮
సీదమానో వివృత్తాఙ్గో వేష్టమానో గతః క్షయమ్,

సంస్తభ్య శోకం ధైర్యేణ స్థిరచిత్తో భవానఘ!. ౪౯
బ్రహ్మహత్యాకృతం పాపం హృదయా దపనీయతామ్,

న ద్విజాతి రహం రాజ! న్మాభూ త్తే మనసో వ్యథా. ౫౦
శూద్రాయా మస్మి వైశ్యేన జాతో జనపదాధిప!,

ఇతీవ వదతః కృచ్ఛ్రా ద్బాణాభిహతమర్మణః. ౫౧
విఘూర్ణతో విచేష్టస్య వేపమానస్య భూతలే,
తస్య త్వానమ్యమానస్య తం బాణ మహ ముద్ధరమ్. ౫౨

స మా ముద్వీక్ష్య సంత్రస్తో జహౌ ప్రాణాం స్తపోధనః,

జలార్ద్రగాత్రం తు విలప్య కృచ్ఛ్రా
న్మర్మవ్రణం సన్తత ముచ్ఛ్వసన్తమ్, ౫౩

తీక్ష్ణబాణంబు నామర్మస్థానంబును హింసించుచున్నది. అని మునికుమారకుఁడు నాతోఁ జెప్పెను. ౪౫

ఈమునికుమారుఁడు బాణంబుతోనే యున్నచో బాధపడును; బాణంబును వెలికి వేయుదునేని మృతిఁబొందును; అని యాబాణంబును వెలికి వేయువిషయమై నాకుఁ జింతగలిగినది. ౪౬

అప్పు డమ్మునికుమారకుఁడు ఇంతటి యకార్యంబుఁ జేసితినే యని దుఃఖితుఁడను బ్రహ్మహత్యగల్గునో యేమో యని దుఃఖపీడితుఁడనగు నా మనసునందలిభావమును దెలిసికొనెను. ౪౭

ఆమునికుమారకుఁ డట్లు పరమబాధనొందుచుఁ బరమార్తియుక్తుఁడై దుఃఖితుఁడై దేహంబంతయుఁ దిరుగుడుపడువాఁడై నేలం బొరలుచు మరణకాలగతుఁడై నన్నుఁజూచి యిట్లని చెప్పెను. ౪౮

నేను ధైర్యముచే దుఃఖంబు నణంచుకొని యున్నాను; అట్లు నీవును గళవళపడకుము; నన్నుఁ జంపుటవలన బ్రహ్మహత్య సంభవించిన దనుసంశయంబును విడువుము. ౪౯

దశరథమహారాజా! నేను బ్రాహ్మణుఁడనుగాను; నీవు మనంబున దుఃఖింపవలదు; శూద్రస్త్రీయందు వైశ్యునికిఁబుట్టిన కరణుఁడనువాఁడను; అని యామునికుమారుఁడు నాతోఁ జెప్పెను. ౫౦

అతికష్టంబున నా కిట్లుచెప్పి మర్మస్థానంబున బాణంబుచే బాధింపఁబడుచున్నవాఁడు కావున నొకప్పుడు దిరుగుడుపడుచు నొకప్పుడు నిశ్చలుఁడై మఱియొక్కప్పుడు నేలం బొరలుచు దేహంబును ముణుచుకొనియున్న యామునికుమారుని దేహమున నాటియుండు బాణంబును వెలికితీసితిని. ౫౧

అంత నా తపోధనుఁడు పరమార్తుఁడై నన్నుం జూచుచునే ప్రాణంబులం బరిత్యజించెను.

మంగళరూపిణివగుకౌసల్యా! అప్పు డిట్టతికష్టంబున రోదనంబు గావించి యంత మాటలాడంజాలక నిట్టూర్పులువుచ్చుచున్నవాని జలముచే

తత స్సరయ్వాం త మహాం శయానం
సమీక్ష్య భద్రేఽస్మి భృశం విషణ్ణః.

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే త్రిషష్టితమస్సర్గః.

---

## చతుష్షష్టితమస్సర్గః.

వధ మప్రతిరూపం తు మహర్షే స్తస్య రాఘవః,
విలప న్నేవ ధర్మాత్మా కౌసల్యాం పున రబ్రవీత్. ౧

తదజ్ఞానా న్మహ త్పాపం కృత్వాఽహం సంకులేన్ద్రియః,
ఏక స్త్వచిన్తయం బుద్ధ్యా కథం ను సుకృతం భవేత్. ౨

తత స్తం ఘట మాదాయ పూర్ణం పరమవారిణా,
ఆశ్రమం త మహం ప్రాప్య యథాఽఽఖ్యాతపథం గతః. 3

తత్రాహం దుర్బలా వన్ధౌ వృద్ధా వపరిణాయకౌ,
అపశ్యం తస్య పితరౌ లూనపక్షా వివ ద్విజౌ. ౪
తన్నిమిత్తాభి రాసీనౌ కథాభి రపరిక్రమౌ,
తా మాశాం మత్కృతే హీనా వుదాసీనా వనాథవత్. ౫

శోకోపహతచిత్త శ్చ భయసంత్రస్తచేతనః,
తచ్చాఽఽశ్రమపదం గత్వా భూయ శ్శోక మహం గతః. ౬

పదశబ్దం తు మే శ్రుత్వా ముని ర్వాక్య మభాషత,

వసిసి జీవస్థానంబున బ్రాణంబుఁబొంది సరయూనదీతీరంబునఁ బడియుండియున్న వాని నాముని కుమారకుంజూచి మిక్కిలియు దుఃఖితుఁడనైతిని. అని దశరథుఁడు కౌసల్యతోఁ జెప్పెను. ౫౩

ఇది యఱువదిమూఁడవసర్గము.

---

## అఱువదినాల్గవ సర్గము

ధర్మాత్ముఁడగు నా దశరథుఁడు అట్లు ఆమహర్షి కుమారుని దానక్రమంబుగాఁ జంపుటనుగుఱించియే విలపించుచుఁ గౌసల్యంజూచి మఱల నిట్లని చెప్పెను. ౧

ఆ ట్లజ్ఞానంబున నామహాపాపంబుగావించి యంత మనంబున దుఃఖంబు నొంది నే నొక్కండనే "ఇంక నాకు మేలుగలుగువిధం బెట్లు?" అని నా బుద్ధిచే నాలోచించితిని. ౨

అంత నే నామునికుమారకుండు చెప్పినట్లె నేయ నిశ్చయించి పరమంబగుజలముచే నిండియున్న యాఘటంబు దీసికొని యతండు చెప్పిన దారిలోఁబోయి యాశ్రమంబుఁ జేరితిని. ౩

ఆయాశ్రమంబున దుర్బలులును గ్రుడ్డివారలును జేయిపట్టితీసికొని పోవు మనిషియుం లేనివారలును ఱెక్కలుదెగిన పక్షులభంగి నున్నవారలును ఆకొడుకునుగుఱించియే యన్యోన్యమాటలు జెప్పుకొనుచు నడవఁజాలరు కావున నొక్కచోఁ గూర్చుండియున్నవారలును నానిమిత్తంబున నాపుత్త్రవిషయ కాశనుగూడ విడువఁబోవువారలును బ్రయత్నశూన్యులును అనాథులునగు నామునికుమారకుని తలిదండ్రులం జూచితిని. ౪,౫

ఆమునికుమారకుం జంపుటచేతనే పరమదుఃఖంబును మహాభయంబునుం బొందియున్న నేను ఆయాశ్రమంబునకుఁ బోయి యాదంపతులఁ జూచినంతనే నాదుఃఖంబు మఱియుం నతిశయించినది. ౬

అయిన నాకాలిచప్పుడు విన్నంతనే యిట్లని చెప్పెను.

కిం చిరాయసి మే పుత్త్ర! పానీయం క్షిప్ర మానయ. ౭

యన్నిమిత్త మిదం తాత! సలిలే క్రీడితం త్వయా,
ఉత్కణ్ఠితా తే మాతేయం ప్రవిశ క్షిప్ర మాశ్రమమ్. ౮

య ద్వ్యలీకం కృతం పుత్త్ర! మాత్రా తే యది వా మయా,
న త న్మనసి కర్తవ్యం త్వయా తాత! తపస్వినా. ౯

త్వం గతి స్త్వగతీనాం చ చక్షు స్త్వం హీనచక్షుషామ్,
సమాసక్తా స్త్వయి ప్రాణాః కిం త్వం నో నాభిభాషసే. ౧౦

ముని మవ్యక్తయా వాచా త మహం సజ్జమానయా,
హీనవ్యఞ్జనయా ప్రేక్ష్య భీతో భీత ఇవాబ్రువమ్. ౧౧
మనసః కర్మచేష్టాభి రభిసంస్తభ్య వాగ్బలమ్,
ఆచచక్షే త్వహం తస్మై పుత్త్రవ్యసనజం భయమ్. ౧౨

క్షత్త్రియోఽహం దశరథో నాహం పుత్త్రో మహాత్మనః,
సజ్జనావమతం దుఃఖ మిదం ప్రాప్తం స్వకర్మజమ్. ౧౩

భగవం! శ్చాపహస్తోఽహం సరయూతీర మాగతః,
జిఘాంసు శ్శ్వాపదం కంచి న్నిపానే చాఽగతం గజమ్. ౧౪

తత శ్శ్రుతో మయా శబ్దో జలే కుమ్భస్య పూర్యతః,
ద్విపోఽయ మితి మత్వాఽయం బాణేనాభిహతో మయా.

నాకొడుకా! ఏల జాగుచేసెదవు? శీఘ్రముగా జలము దీసికొని రమ్ము. ౭

నాయనా! నీవిదివఱకు జలము దీసికొని రాకుండుటవలన నీవు జలంబున నీఁదులాడుచుండినట్లున్నది; నీతల్లి నీవు రానందున దిగులుఁబడియున్నది? శీఘ్రముగా నాశ్రమంబులోనికి రమ్ము. ౮

కొడుకా! నీతల్లిగాని నేనుగాని నీకేమైన నప్రియంబుగావించియుంటి మేని నీవు తపస్వివగుటంజేసి దానిమనంబులో నెంతమాత్రము నుంచవలదు. ౯

మాకు నడచుటకు శక్తిలేకున్నను నీవలన నడచుచున్నాము; అంధుల మగుమాకు నీవే నేత్రము; మాప్రాణంబులు నీయందున్నవి; నీవేల మాతో నిప్పుడు మాటలాడకున్నావు? అని యామౌని చెప్పెను. ౧౦

నేను ఆమునీశ్వరుంజూచి మిక్కిలియుం భయంబునొంది తడఁబడుచుఁ గొన్నియక్షరంబులు వదలుచు నస్పష్టంబగువాక్యంబున నిట్లని చెప్పినాను. ౧౧

నేను వ్యాపారాంతరానుసంధానాదులచే మనసునందలి భయమును నోరు తడఁబడుటను అణంచుకొని ఆమునీశ్వరునకుఁ బుత్రమరణంబును ఇట్లని చెప్పితిని. ౧౨

నేను క్షత్రియుఁడను; నాపేరు దశరథుఁడని యందురు; నేను మహాత్ముఁడవగు నీపుత్రుండనుగాను; పూర్వకర్మమువలన సత్పురుషనిందితంబగు నీదుఃఖం బిప్పుడు వచ్చినది. ౧3

భగవంతుఁడా! నేను ఏటిలో నీళ్ళుత్రాగవచ్చిన దుష్టజంతువునుగాని యేనుంగునుగాని చంపఁగోరి ధనుర్ధరుండనై సరయూతీరంబునకు వచ్చినాఁడను. ౧౪

అంత నేను నీటిలోఁ గుండనుముంచుధ్వనిని విని యాధ్వని ఏనుంగుధ్వనిగానుండునని తలంచి యాధ్వనికే గుఱిఁబెట్టి బాణము వేసితిని. ౧౫

గత్వా నద్యా స్తత స్తీర మపశ్య మిషుణా హృది,
వినిర్భిన్నం గతప్రాణం శయానం భువి తాపసమ్, ౧౬
భగవ! ఞ్ఛబ్ద మాలక్ష్య మయా గజజిఘాంసునా,
విసృష్టోఽమ్భసి నారాచ స్తేన తే నిహత స్సుతః. ౧౭

తత స్త స్యైవ వచనా దుపేత్య పరితప్యతః,
స మయా సహసా బాణ ఉద్ధృతో మర్మత స్తదా. ౧౮

స చోద్ధృతేన బాణేన తత్రైవ స్స్వర్గమాస్థితః,
భవన్తౌ పితరౌ శోచ న్నన్ధా వితి విలప్య చ. ౧౯

అజ్ఞానా ద్భవతః పుత్త్ర స్సహసాఽభిహతో మయా,
శేష మేవం గతే యత్స్యా త్త త్ప్రసీదతు మే మునిః. ౨౦
స తచ్ఛ్రుత్వా వచః క్రూరం మయో క్త మఘశంసినా,
నాశక త్తీవ్ర మాయాస మకర్తుం భగవా నృషిః. ౨౧
స బాష్పపూర్ణ వదనో నిశ్శ్వస న్ఛోకకర్శితః,
మా ముపాచ మహాతేజాః కృతాఞ్జలి ముపస్థితమ్. ౨౨

యద్యేతదశుభం కర్మ న త్వం మే కథయే స్స్వయమ్,
ఫలే న్మూర్ధా స్మ తే రాజ! న్సద్య శ్శతసహస్రధా. ౨౩

క్షత్త్రియేణ వధో రాజన్! వానప్రస్థే విశేషతః,
జ్ఞానపూర్వం కృతస్థ్సానా చ్చ్యావయే దపి వజ్రిణమ్. ౨౪

స ప్తధా తు ఫలే న్మూర్ధా మునౌ తపసి తిష్ఠతి,
జ్ఞానా ద్విసృజత శ్శస్త్రం తాదృశే బ్రహ్మవాదిని. ౨౫

అంత నేను నదిలోనికిం బోయి యమ్మున బాణంబు నాటుటం జేసి ప్రాణంబులు పోయినట్లు నేలంబడియున్న ఋషికుమారుం జూచితిని. ౧౬

భగవంతుఁడా! మాహాత్మ్యముగలవాఁడా! నేను ధ్వనిని గుఱిపట్టి యేనుంగును జంపఁగోరి జలంబుల బాణంబు విడిచితిని; దానిచే నీకొడుకు చచ్చెను. ౧౭

అంత నే నతనియొద్దకుం బోయి యతఁడు బాణవేదనను సహింపఁజాలక దానిం బెఱికివేయుమని చెప్పుటచే నతనిమాటప్రకారము శీఘ్రమున నబ్బాణమును బెఱికివేసితిని. ౧౮

ఆబాణంబుఁ బెఱికినంతనె యతఁడు "నాతలిదండ్రులు గుడ్డివారలే వారల నెవ్వరుపోషింతురు" అని మిమ్ములంగూర్చి దుఃఖించుచు స్వర్గంబు నొందెను. ౧౯

'నే నజ్ఞానంబున నీకొడుకుం జంపినాను; ఇంకఁ జేయవలసిన దేమి యున్నదో దాని నానతిమ్ము' అని ఆఋషితోఁ జెప్పినాను. ౨౦

భగవంతుఁడగు నామహర్షి నేను జెప్పినదుఃఖకరమును భయంకరంబునగు మాటనువిని కోపము నణంచుకొనుటకు శక్తుఁడు కాఁడయ్యె. ౨౧

మహాతేజుఁడగు నామహర్షి దుఃఖితుఁడై ముఖంబునిండఁ గన్నీళ్లుగాఱ నిట్టూర్పులంపుచ్చుచుఁ జేతులు మొగుడ్చుకొని సమీపంబుననున్న నన్నుంజూచి యిట్లని చెప్పెను. ౨౨

దశరథమహారాజా! ఇట్టియమంగళకార్యమును నీవైయే నాకుఁ జెప్పక యుండువిధమున నాకుఁ దెలియునేని యీక్షణమె నీతల లక్షపఱియలుగా విరిసిపోవును. ౨౩

దశరథమహారాజా! రాజగువాఁడు తెలిసి ఎవ్వనినైన అందు విశేషించి వానప్రస్థుం జంపునేని యతఁడు దేవేంద్రుఁడైనను స్వస్థానంబునందుండి చ్యుతుండగును. ౨౪

తపంబుచేసికొనుచున్న బ్రహ్మవేత్తయగుమునినైనఁ దెలిసి యాయుధంబు వేయునట్టివానిశిరసు పెక్కుపఱియలయి పగులును. ౨౫

అజ్ఞానా ద్ధి కృతం యస్మా దిదం తేనైవ జీవసి,
అపి హ్యద్య కులం న స్యా దిక్ష్వాకూణాం కుతో భవాన్. ౨౬

నయ నౌ నృప! తం దేశమితి మాం చాభ్యభాషత,
అద్య తం ద్రష్టు మిచ్ఛావః పుత్రం పశ్చిమదర్శనమ్. ౨౭
రుధిరేణావసిక్తాఙ్గం ప్రకీర్ణాజినవాససమ్,
శయానం భువి నిస్సంజ్ఞం ధర్మరాజవశం గతమ్. ౨౮
అథాహమేక స్తం దేశం నీత్వా తౌ భృశదుఃఖితౌ,
అస్పర్శయమహం పుత్త్రం తం మునిం సహ భార్యయా. ౨౯

తౌ పుత్త్ర మాత్మన స్స్పృష్ట్వా త మాసాద్య తపస్వినౌ,
నిపేతతు శ్శరీరేఽస్య పితా చాస్యేద మబ్రవీత్. ౩౦

నాభివాదయసే మాఽద్య న చ మా మభిభాషసే,
కింను శేషే తు భూమౌ త్వం వత్స! కిం కుపితో హ్యసి. ౩౧

న త్వహం తే ప్రియః పుత్త్ర! మాతరం పశ్య ధార్మిక!,
కింను నాలిఙ్గసే పుత్త్ర! సుకుమార! వచో వద. ౩౨

కస్య వాఽపరరాత్రేఽహం శ్రోష్యామి హృదయంగమమ్,
అధీయానస్య మధురం శాస్త్రం వాఽన్య ద్విశేషతః. ౩౩

కో మాం సన్ధ్యా ముపా స్యైవ స్నాత్వా హుతహుతాశనః,
శ్లాఘయిష్య త్యుపాసీనః పుత్త్రశోకభయార్దితమ్. ౩౪

నీ పితార్థ్యమును అజ్ఞానంబునఁ జేసినావు కావుననే బ్రతికి యున్నావు; తెలిసియే చేసియుందువేని మీయిక్ష్వాకుకులంబంతయుం యీక్షణంబుననే నశించును; ఇంక నీ వెంతమాత్రము? అని యామునిచెప్పెను. ౨౬

దశరథమహారాజా! ఈకాలమునందక్క నిఁక నెప్పటికిని నా కొడుకుం జూడలేము కావున నిప్పుడు నెత్తుటం దోఁగుచుఁ గృష్ణాజినవస్త్రంబు దాలఁగ నేలంబడి నిస్సంజ్ఞుఁడై యమవశంగతుఁడై యున్నపుత్రుంజూడఁ గోరెదము; మమ్ము అచ్చోటికిం గొనిపొమ్ము. అని నాతోఁజెప్పెను. ౨౭,౨౮

అంత నేను బరమదుఃఖితులగు నాదంపతుల నచ్చోటికిం గొనిపోయి వార లంధులు కావున నేనే యామునికిని అతనిభార్యకును వారలకొడుకు కళేబరంబును దాఁకించితిని. ౨౯

ఆమునిదంపతు లిర్వురును దమకొడుకునొద్దకుఁబోయి యతనిం జేతు లారఁ స్పృశించి దుఃఖంబున నతనిదేహముపైఁబడిరి; అంతఁ దండ్రి యిట్లని విలపించెను. ౩౦

బిడ్డఁడా! నన్నుఁజూచి నమస్కారంబు సేయవు; ఏమియుం బలుకవు; ఊరక నేలపైఁ బరుండియున్నావు; నాపై నేమైనఁ గోపము నొంది యున్నావా యేమి? ౩౧

ధార్మికుఁడవగు కొడుకా! నాపై నీకుఁ బ్రీతిలేదేని నన్నుఁ జూడ వలదుపరే; నీతల్లివచ్చియున్నది చూడుము; మమ్ముఁ గౌఁగిలించుకొనకున్నావేమి? మృదుమధురంబగుమాటం జెప్పుము. ౩౨

ఇఁక నెవ్వఁడు అర్ధరాత్రంబున లేచి వేదశాస్త్రంబులనేమి యితరములనేమి చదువుకొనుచుండఁగా మనోహరంబును మధురంబునగు నాధ్వనిని నేను వినఁగలను? ౩౩

ఇఁక నెవ్వఁడు స్నానము చేసి సంధ్యనుపాసించి యగ్నిహోత్రమునందు హోమంబుగావించి నాసమీపంబునం గూర్చుండి పుత్రదుఃఖపీడితుండ నగు నాకు శుశ్రూష సేయఁగలఁడు? ౩౪

కన్దమూలఫలం హృత్వా కో మాం ప్రియమివాతిథిమ్,
భోజయిష్యత్యకర్మణ్య మప్రగ్రహ మనాయకమ్. ౩౫

ఇమా మన్ధాం చ వృద్ధాం చ మాతరం తే తపస్వినీమ్,
కథం వత్స! భరిష్యామి కృపణాం పుత్రగర్ధినీమ్. ౩౬

తిష్ఠ మాం మాగమః పుత్ర! యమస్య సదనం ప్రతి,
శ్వో మయా సహ గన్తాసి జనన్యా చ సమేధితః. ౩౭
ఉభావపి చ శోకార్తా వనాథౌ కృపణౌ వనే,
క్షిప్ర మేవ గమిష్యావ స్త్వయా హీనౌ యమక్షయమ్. ౩౮

తతో వైవస్వతం దృష్ట్వా తం ప్రవక్ష్యామి భారతీమ్,
క్షమతాం ధర్మరాజో మే బిభృయా త్పితరా వయమ్. ౩౯

దాతు మర్హతి ధర్మాత్మా లోకపాలో మహాయశాః,
ఈదృశస్య మమాక్షయ్యా మేకా మభయదక్షిణామ్. ౪౦
అపాపోఽసి యదా పుత్ర! నిహతః పాపకర్మణా,
తేన సత్యేన గచ్ఛాఽఽశు యే లోకా శ్శస్త్రయోధినామ్. ౪౧

యాన్తి శూరా గతిం యాం చ సంగ్రామే ష్వనివర్తినః,
హతా స్త్వభిముఖాః పుత్ర! గతిం తాం పరమాం వ్రజ. ౪౨

యాం గతిం సగర శ్శైబ్యో దిలీపో జనమేజయః,

ఇఁక నెవ్వఁడు నీళ్ళలోని తామరగడ్డ మున్నగుగడ్డలును మిట్టలోఁ బుట్టు చేమగడ్డలు మున్నగువానిని ఫలంబులను గొనితెచ్చి కర్మానుష్ఠానంబు నందసమర్థుండను నీవారాదిసంగ్రహము లేనివాఁడగు గట్టిఁబట్టుకొని నడపించు కొని పోవువాఁడునుంగూడ లేనివాఁడనగు నాకుఁ బ్రియాతిథికింబోలె భోజనంబుఁ బెట్టును? ౩౫

బిడ్డఁడా! దిక్కులేనిదియు నంధురాలును వృద్ధయు దుఃఖితయునను గొడుకునం దధికాశగలదియునగు నీతల్లిని నీవు పోయినవెనుక నే నెట్లు పోషింపఁగలను? ౩౬

కొడుకా! నిలువుము; పోవలదు; రేపు నాతోను దల్లితోనుంగూడి యమునియొద్దకుఁ బోవచ్చును. ౩౭

అడవియందు నీచేత విడువంబడి యనాథులమై దుఃఖితులమై దీనులమై నిమిషమైన నుండఁజాలము; మేమును నీతోఁగూడ యమలోకంబునకు వచ్చెదము. ౩౮

అంత నేను యముంజూచి "నాకుమారుఁడు తలిదండ్రులకుఁ జక్కఁగా శుశ్రూషసేయువాఁడు; ఇతఁడాలస్యంబుగా వచ్చుటకై క్షమింపవలయు" అని యిట్లు ప్రార్థించెదను. ౩౯

ధర్మాత్ముఁడును మహాయశశ్శాలియు నగు యముండు ఇట్టి యనాథుండ నగు నాకు నాశరహితంబగు నీయొక్క యభయదానము నవశ్యము సేయును.

కొడుకా! పాపిష్ఠుఁడగు నీదశరథుఁడు చంపుటచే నీపాపంబు పోయినది; అందువలన సత్యబలంబున యుద్ధంబు సేయువారల కేలోకంబులుగలుగునో నీ వాలోకంబులం బొందుము. ౪౦

కొడుకా! శూరులు యుద్ధంబుల వెనుకకు మఱలక యభిముఖులయి పోరుచుండి హతులై యేగతిం బొందుదురో నీవును బరమంబయిన యగతిని బొందుదువుగాక. ౪౧

చిన్నికొడుకా! సగరుండును శైబ్యుండును దిలీపుండును జనమే

నహుషో దున్దుమారశ్చ ప్రాప్తా స్తాం గచ్ఛ పుత్రక!. ౪౩

యా గతి స్సర్వసాధూనాం స్వాధ్యాయా త్తపసాచ యా,
యా భూమిదస్యాఽహితాగ్నే రేకపత్నీవ్రతస్యచ. ౪౪
గోసహస్రప్రదాతౄణాం యా యా గురుభృతా మపి,
దేహాన్యాసకృతాం యాచ తాం గతిం గచ్ఛ పుత్రక!. ౪౫

నహి త్వస్మిన్కులే జాతో గచ్ఛత్యకుశలాం గతిమ్,
సతు యాస్యతి యేన త్వం నిహతో మమ బాన్ధవః. ౪౬

ఏవం స కృపణం తత్ర పర్యదేవయ తాసకృత్,

తతోఽస్మై కర్తు ముదకం ప్రవృత్త స్సహభార్యయా. ౪౭

స తు దివ్యేన రూపేణ మునిపుత్ర స్స్వకర్మభిః,
స్వర్గ మధ్యారుహ త్క్షిప్రం శక్రేణ సహ ధర్మవిత్. ౪౮
ఆబభాషేచ తౌ వృద్ధౌ సహశక్రేణ తాపసః,
ఆశ్వాస్యచ ముహూర్తం తు పితరౌ వాక్య మబ్రవీత్. ౪౯
స్థాన మస్మి మహా త్ప్రాప్తో భవతోః పరిచారణాత్,
భవన్తా వపి చ క్షిప్రం మమ మూల ముపైష్యతః. ౫౦

జయుండును నహుషుండును దుందుమారుండును నేగతిం బొందిరో నీ వాగతిం బొందుదువుగాక. ౪౩

చిన్నికొడుకా! సత్పురుషులకందఱకును నేగతిగల్గునో వేదాధ్యయనము చేసినవారలును దపంబు సల్పినవారలును నేగతి నధిగమింతురో భూదానముం జేసినవానికిని ఆహితాగ్నికిని ఒకభార్యనే స్వీకరించి యాదిసతోఁ దక్క నితరస్త్రీలయందఱియందును ఎప్పుడును సంభోగాదులు సేయనివానికిని నేగతి ప్రాప్తించునో వేయిగోవు లొసఁగినవార లేగతిం బొందుదురో గురువులం బోషించినవార లేగతిం బొందుదురో గంగాయమునాసంగమాదులయందు కల్పపూర్వకముగా దేహత్యాగముం జేసినవారలకు నేగతి ప్రాప్తమగునో నీవట్టిగతులం బొందుదువుగాక. ౪౪,౪౫

తపోనిష్ఠులగు మావంశంబునం బుట్టినవాఁ డెవ్వఁడును దుర్గతిం బొందఁడు; నాపుత్త్రుఁడవగు నిన్నుఁ జంపినట్టిదశరథమహారాజుమాత్రము దుర్గతిం బొందును. అని యామునికుమారునితండ్రి విలపించెను. ౪౬

అచ్చట నా మునికుమారకునితండ్రి యిట్లు పలుమాఱు రోదనంబుఁ జేసెను.

అంత నతఁడు భార్యంగూడి కుమారునకు సంస్కారంబుగావించి యుదకక్రియలం జేయ నారంభించెను. ౪౭

ధర్మవేత్తయగు నామునికుమారుఁడు దనపుణ్యకర్మఫలంబున దివ్యరూపంబునొంది ఇంద్రుఁడు వెంబడింప రథంబున స్వర్గలోకంబునకుం బోయెను.

ఆమునికుమారుఁడు ఇంద్రునితోఁగూడ వృద్ధులగు నతని తలిదండ్రులం గొంత యూఱడించి యంత నిట్లని చెప్పెను. ౪౮

నేను మీకు శుశ్రూషసేయుచుండుటంజేసి పూజ్యంబగు స్థానము పొందినాఁడను. మీరును ఇఁక శీఘ్రంబుగానే నాయొద్దకు రాఁగలరు. అని యామునికుమారుఁడు తలిదండ్రులతోఁ జెప్పెను. ౫౦

ఏవ ముక్త్వా తు దివ్యేన విమానేన వపుష్మతా,
ఆరురోహ దివం క్షిప్రం మునిపుత్త్రో జితేన్ద్రియః. ౫౧

స కృత్వా తూదకం తూర్ణం తాపస స్సహ భార్యయా,
మా మువాచ మహాతేజాః కృతాఞ్జలి ముపస్థితమ్. ౫౨

అద్యైవ జహి మాం రాజ! న్మరణే నాస్తి మే వ్యథా,
యచ్ఛరేణైకపుత్త్రం మాం త్వ మకార్షీ రపుత్త్రకమ్. ౫౩

త్వయా తు యదవిజ్ఞానా న్నిహతో మే సుత శ్శుచిః,
తేన త్వా మభిశప్స్యామి సుదుఃఖ మతిదారుణమ్. ౫౪
పుత్త్రవ్యసనజం దుఃఖం యదేత న్మమ సామ్ప్రతమ్,
ఏవం త్వం పుత్త్రశోకేన రాజ! న్కాలం కరిష్యసి. ౫౫

అజ్ఞానా త్తు హతో యస్మా త్క్షత్త్రియేణ త్వయా మునిః,
తస్మా త్త్వాం నావిశత్యాశు బ్రహ్మహత్యా నరాధిప!. ౫౬
త్వా మప్యేతాదృశో భావః క్షిప్ర మేవ గమిష్యతి,
జీవితాన్తకరో ఘోరో దాతార మివ దక్షిణా. ౫౭

ఏవం శాపం మయి న్యస్య విలప్య కరుణం బహు,
చితా మారోప్య దేహం త న్మిథునం స్వర్గ మభ్యయాత్. ౫౮
తదేత చ్చిన్తయానేన స్మృతం పాపం మయా స్వయమ్,
తదా బాల్యా త్కృతం దేవి! శబ్దవేధ్యానుకర్షిణా. ౫౯

జితేంద్రియుఁ డగు నాముని కుమారకుఁ డిట్లు తలిదండ్రులకుం జెప్పి. ప్రశస్తంబగు దివ్యవిమానంబు నారోహించి శీఘ్రంబున స్వర్గంబు నొందెను. ౫౧

మహాప్రభావుఁడగు నా తాపసుండు భార్యతోఁగూడఁ బుత్రునకు జలతర్పణంబు గావించి సమీపంబునఁ జేమోడ్పుగీలించి నిలుచున్న నన్నుంజూచి యిట్లని చెప్పెను. ౫౨

దశరథమహారాజా! ఒక్కఁడే కొడుకుగల నాకొడుకును బాణంబుచేఁ జంపి నన్నపుత్రునిఁగాఁ జేసినావు కావున నిప్పుడే నన్నుంగూడఁ జంపుము; నాకు మరణంబు నొందుటకు దుఃఖములేదు. ౫౩

నీవు అజ్ఞానంబున శుద్ధహృదయుండగు నాపుత్రుం జంపితివి కావున నేనే నిప్పుడు నీకు దుఃఖకరంబును భయంకరంబునగు శాపం బొసంగెదను.

దశరథమహారాజా! నా కిప్పు డంత్యకాలమునఁ బుత్రదుఃఖంబుఁ గలిగించితివి గావున నీవిధంబున నీవును, బుత్రదుఃఖంబుచే మృతుండవగుదువు. ౫౫

దశరథమహారాజా! క్షత్రియుండవగు నీవు మునిని దెలియక చంపినావు కావున నీ కందువలన మహాపాతకంబు గలుగదు. ౫౬

ప్రాణక్షయకరంబును భయంకరంబునగు నీస్థితిని నీవు నాకొసంగితివి కావున దక్షిణ నొసంగినవాఁ డా పుణ్యంబునొందునట్లు నీవును ఇట్టిస్థితిని శీఘ్రముగానే పొందఁగలవు. అని యామువి నాతోఁ జెప్పెను. ౫౭

ఇట్లు నాకు శాపంబు నొసంగి యాదంపతు లిర్వురును దుఃఖకరంబుగా రోదనంబుచేసి యుద్దణు నొక్కటిగాఁ జితి నారోహించి స్వర్గంబునొందిరి. ౫౮

కౌసల్యాదేవీ! మున్ను బాల్యంబున శబ్దంబునే గుఱిపట్టి మృగంబు నేయ నభ్యాసంబుసేయుచునప్పుడు నేను జేసినపాపము యిప్పు డట్టియాలోచింపఁగా జ్ఞప్తికివచ్చినది. ౫౯

తస్యాయం కర్మణో దేవి! విపాక స్సముపస్థితః,
అపథ్యైః స్సహ సమ్భుక్తే వ్యాధి రన్నరసే యథా. ౬౦

తస్మా న్మా మాగతం భద్రే! తస్యోదారస్య తద్వచః,
య దహం పుత్త్రశోకేన స న్త్యక్ష్యా మ్యద్య జీవితమ్. ౬౧

చక్షుర్భ్యాం త్వాం నపశ్యామి కౌసల్యే! సాధుమాం స్పృశ,

ఇత్యుక్త్వా స రుదం స్త్రస్తో భార్యా మాహ చ భూమిపః. ౬౨

ఏతన్మే సదృశం దేవి! య న్మయా రాఘవే కృతమ్,
సదృశం త త్తు త స్యైవ య దనేన కృతం మయి. ౬౩

దుర్వృత్త మపి కః పుత్త్రం త్యజే ద్భువి విచక్షణః,
క శ్చ ప్రవ్రాజ్యమానో వా నాసూయే త్పితరం సుతః. ౬౪

యది మాం సంస్పృశే ద్రామ స్సకృ దద్య లభేత వా,
యమక్షయ మనుప్రాప్తాః ద్రక్ష్య న్తే నహి మానవాః. ౬౫

చక్షుషా త్వాం న పశ్యామి స్మృతి ర్మమ విలుప్యతే,
దూతా వై వస్వత స్యైతే కౌసల్యే! త్వరయ న్తి మామ్. ౬౬

కౌసల్యా! అపథ్యభోజనంబుఁ జేసిన వ్యాధివచ్చునట్లు ఆపాపకార్యఫలం
బిప్పుడు ఈదుఃఖరూపంబున సంప్రాప్తమయినది. ౬౦

మంగళరూపిణివగు కౌసల్యా! నే నిప్పుడు పుత్రదుఃఖము తాళఁజా
లక ప్రాణంబు విడువనున్నాను. గావునఁ బూజ్యుఁడగు నాఋషి శాపార్థము
ఇప్పుడు నన్నుఁ బొందినది. ౬౧

కౌసల్యా! నాకుఁ గండ్లు దృష్టితప్పియున్నవి గావున నీవు నాకండ్ల
కగపడకున్నావు; నన్నుఁ జక్కఁగా స్పృశింపుము. అని దశరథమహారాజు
కౌసల్యతోఁ జెప్పెను.

దశరథమహారా జిట్లు చెప్పి రోదనంబుసేయుచు దీనుఁడై మఱల
భార్యంజూచి యిట్లని చెప్పెను. ౬౨

కౌసల్యాదేవీ! నేను నిర్దయుండనై రాముని వనంబునకుఁ దఱిమికొ
ట్టితినే! ఇది పాపిష్ఠుఁడనగు నాకు సరిగానేయున్నది; రాముఁడు నాయా
జ్ఞకు మాఱుపలుకక, యాక్షణంబుననే యరణ్యంబునకుఁ బోయినాఁడే! అది
మాత్రము పరమధార్మికుఁడగు నారామునికిమాత్రమే చెల్లును గాని మఱి
యెవ్వండు నట్టు ధర్మదృష్టితోఁ జేయఁజాలఁడు. ౬౩

ఈభూమిని కొడుకు దుర్మార్గుఁడైనను అతని నెవ్వఁడు పరిత్యజిం
చును? అట్లు తండ్రిచేఁ గొడుకువనంబునకుఁ బంపఁబడినను, అప్పుడు
తండ్రిపైఁ గోపము నొందనిపుత్రుఁ డెవ్వఁడు? ౬౪

రాముఁడు, ఇప్పు డొక్కమాఱిచ్చటికివచ్చి నన్నుఁ దాఁకినంగాని
లేక యిచ్చటికివచ్చినంగాని సంతోషమునొందుదును; మరణంబు నొందిన
పిమ్మట బంధువులం జూడఁజాలముకదా! ౬౫

కౌసల్యా నిన్నుఁ గండ్లతోఁ జూడఁజాలకున్నాను; నాకు స్మృతియుఁ
గూడ నశించుచున్నది; ఈయమదూతలు వేగరమ్మని తొందరసేయు
చున్నారు. ౬౬

అత స్తు కిం దుఃఖతరం య దహం జీవితక్షయే,
న హి పశ్యామి ధర్మజ్ఞం రామం సత్యపరాక్రమమ్. ౬౭

తస్యాదర్శనజ శ్శోక స్సుతస్యాప్రతికర్మణః,
ఉచ్ఛోషయతి మే ప్రాణా న్వారి స్తోక మి వాతపః. ౬౮

న తే మనుష్యా దేవా స్తే యే చారుశుభకుణ్డలమ్,
ముఖం ద్రక్ష్యన్తి రామస్య వర్షే పఞ్చదశే పునః. ౬౯

పద్మపత్రేక్షణం సుభ్రు! సుదంష్ట్రం చారునాసికమ్,
ధన్యా ద్రక్ష్యన్తి రామస్య తారాధిపనిభం ముఖమ్. ౭౦

సదృశం శారదస్యేన్దోః ఫుల్లస్య కమలస్య చ,
సుగన్ధి మమ నాథస్య ధన్యా ద్రక్ష్యన్తి తన్ముఖమ్. ౭౧

నివృత్తవనవాసం త మయోధ్యాం పున రాగతమ్,
ద్రక్ష్యన్తి సుఖినో రామం శుక్రం మార్గగతం యథా. ౭౨

కౌసల్యే! చిత్తమోహేన హృదయం సీదతీవ మే,
వేదయే నచ సంయుక్తా ఞ్ఛబ్దస్పర్శరసా నహమ్. ౭౩

చిత్తనాశా ద్విపద్యన్తే సర్వాణ్యేవేన్ద్రియాణి మే,
క్షీణస్నేహస్య దీపస్య సంసక్తా రశ్మయో యథా. ౭౪

అయ మాత్మభవ శ్శోకో మా మనాథ మచేతనమ్,
సంసాదయతి వేగేన యథా కూలం నదీరయః. ౭౫

నేను మరణకాలంబున ధర్మజ్ఞుఁడును సత్యపరాక్రముఁడునగు రామునిం జూడకున్నానే; నాకింతకన్న మఱివేఱుదుఃఖం బేమియున్నది. ౬౭

అప్రతికర్మండనగు నా రాముని జూడకుండుటచేఁ గలిగినదుఃఖము ఎండ కాంచెపునీటినిఁ బీల్చునట్లు ఇప్పుడు నా ప్రాణంబులం బీల్చుచున్నది. ౬౮

పదునైదవసంవత్సరంబున మరల నెవ్వరు సుందరంబును సుందరంబులగు కుండలములతో నొప్పుచున్నదియునగు రామునిముఖంబు జూతురో వారలు దేవతలుగాని యెంతమాత్రము మనుష్యులుగారు. ౬౯

తామరపూరేకులుంబోలె విశాలసుందరంబులగు కండ్లును సుందరములగు కనుబొమ్మలును సుందరములగు దౌడపండ్లును సుందరమగు ముక్కునుం గలిగి చంద్రబింబంబులబోలె రమణీయంబయియుండునట్టి రామునిముఖంబును బుణ్యవంతులగువారలు చూడఁగలరు. ౭౦

శరదృతువునందలి చంద్రబింబమునకును వికసించినకమలంబునకును సదృశంబును సుగంధియునగు నా నాథుఁడయిన రామునిముఖంబును బుణ్యవంతులగువారలు చూడఁగలరు. ౭౧

వనవాసంబునల్పి మరల నయోధ్యంబొంది మార్గంబువిడిచి యుచ్చమార్గమునొందిన శుక్రుఁడుంబోలె నొప్పుచున్న అరమణీయాకారుండగు రామునింజూచి పరమసుఖంబు నొందుదురు. ౭౨

కౌసల్యా! నామనసు మహాదుఃఖంబు నొందియున్నది. కావున నా హృదయము నశించునట్లున్నది. మఱియు శబ్దస్పర్శరసంబులు ఇంద్రియసన్నికర్షంబునొందినను వానిని నేఁ దెలియఁజాలకున్నాను. ౭౩

తైలంబు ముగిసినపిమ్మట దీపమునందు నిత్యసంబంధముగల కిరణంబులు నశించునట్లు నామనసు నశించుటవలన నింద్రియములన్నియు నాశమునొందుచున్నవి. ౭౪

నదీప్రవాహము తీరమును నశింపఁజేయునట్లు ఈపుత్రదుఃఖంబు అనాథుఁడ నచేతనుఁడ నగునన్ను వేగమున నశింపఁజేయుచున్నది. ౭౫

హా రాఘవ! మహాబాహో! హా మమాఽయాసనాశన!,
హా పితృప్రియ! మే నాథ! హాఽద్య క్వాసి గతస్సుత!. ౭౬

హా కౌసల్యే! నశిష్యామి హా సుమిత్రే! తపస్విని!,
హా నృశంసే! మమామిత్రే! కైకేయి! కులపాంసని!. ౭౭

ఇతి రామస్య మాతుశ్చ సుమిత్రాయాశ్చ సన్నిధౌ,
రాజా దశరథశ్శోచ జ్జీవితాన్త ముపాగమత్. ౭౮
యదా తు దీనం కథయ న్నరాధిపః
ప్రియస్య పుత్రస్య వివాసనాతురః,
గతేఽర్ధరాత్రే భృశదుఃఖపీడిత
స్తదా జహౌ ప్రాణ ముదారదర్శనః. ౭౯

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే చతుష్షష్టితమస్సర్గః.

## పఞ్చషష్టితమస్సర్గః

అథ రాత్ర్యాం వ్యతీతాయాం ప్రాతరే వాపరేఽహని,
వన్దినః పర్యుపాతిష్ఠ న్తత్పార్థివ నివేశనమ్. ౧
సూతాః పరమసంస్కారా మఙ్గళా శ్చోత్తమశ్రుతాః,
గాయకాః స్తుతిశీలా శ్చ నిగద న్తః పృథ క్పృథక్. ౨
రాజానం స్తువతాం తేషా ముదాత్తాభిహితాశిషామ్,
ప్రాసాదాఽభోగవి స్తీర్ణః స్తుతిశబ్దో హ్యవ ర్తత. ౩

తత స్తు స్తువతాం తేషాం సూతానాం పాణివాదకాః,
అపదానాన్యుదాహృత్య పాణివాదా నవాదయన్. ౪

అయ్యో రాముఁడా! మహాబాహుఁడా! నాదుఃఖంబును బోఁగొట్టు వాఁడా! అయ్యో! తండ్రినయిన నాకుఁ బ్రియంబొనరించువాఁడా! నా నాథుఁడా! అయ్యో కొడుకా! ఇప్పు డెచ్చటికిఁ బోతివి? ౨౧

అయ్యో! కౌసల్యా! అయ్యో! శోచనీయవగుసుమిత్రా! అయ్యో! క్రూరురాలవు నాకు శత్రువైనదానవు కులపాంసనివగు కైకేయీ! నేను నాశంబు నొందుచున్నాను! ౨౨

దశరథమహారాజు కౌసల్యాసుమిత్రలసమీపంబున నిట్లు రోదనంబు చేయుచు మరణంబునొందెను. ౨౩

ఉదారదర్శనుఁడగు దశరథమహారాజు ప్రియపుత్రు నరణ్యంబునకుఁ బంపి యాదుఃఖముచేఁ బీడితుఁడై యర్ధరాత్రంబున దుఃఖం బతిశయింప సహింపఁజాలక మరణంబునొందెను. ౨౪

ఇది యఱువదినాలవ సర్గము.

---

## అఱువదియైదవ సర్గము

అంత రాత్రియంతయుఁ గడచినపిమ్మట మఱునాటివేకువను స్తుతిపాఠకులును చక్కఁగా నలంకరించికొనియున్న వంశావళీకీర్తకులును మంగళంబుపఠించువారలును చక్కఁగా గాంధర్వవిద్య దెలిసినవారలును స్తుతిపాఠకులునగు గాయకులును వేఱువేఱ వారివారికృత్యంబులం జేయుచు మరణంబు నొందిన రాజుగల యారాజగృహమును సేవించిరి. ౧,౨

అప్పుడు రాజుం బ్రస్తుతింపుచు నుచ్చైస్స్వరంబుగ నాశీర్వచనంబులు నుడువుచున్నవారల స్తోత్రధ్వని రాజగృహంబులన్నియుం నిండి చెలంగినది. 3

అంత నావంశావళీకీర్తకులు రాజుం బొగడుచుండఁగాఁ దాళంబులు వేయువారలు కొంతసేపు పూర్వరాజులును, ఈదశరథమహారాజును జేసియున్న యద్భుతకార్యంబుల నభివర్ణించి యంత దాళంబుల వాయించుచుండిరి. ౪

తేన శబ్దేన విహగాః ప్రతిబుద్ధా విసస్వనుః,
శాఖాస్థాః పఞ్జరస్థా శ్చ యే రాజకులగోచరాః. ౫
వ్యాహృతాః పుణ్యశబ్దా శ్చ వీణానాం చాపి నిస్వనాః,
ఆశీ ర్గేయం చ గాథానాం పూరయామాస వేశ్మ తత్. ౬

తత శ్శుచిసమాచారాః పర్యుపస్థానకోవిదాః,
స్త్రీవర్షవరభూయిష్ఠా ఉపతస్థు ర్యథాపురమ్. ౭
హరిచన్దనసంపృక్త ముదకం కాఞ్చనై ర్ఘటైః,
ఆనిన్యు స్స్నానశిక్షాజ్ఞా యథాకాలం యథావిధి. ౮

మఙ్గలాలమ్భనీయాని ప్రాశనీయా న్యుపస్కరాన్,
ఉపనిన్యు స్తథా ప్యన్యాః కుమారీబహులాః స్త్రియః. ౯

సర్వలక్షణసమ్పన్నం సర్వం విధివ దర్చితమ్,
సర్వం సుగుణలక్ష్మీవ త్త ద్బభూవాభిహారికమ్. ౧౦

తత్తు సూర్యోదయం యావ త్సర్వం పరిసముత్సుకమ్,
తస్థా వనుపసంప్రాప్తం కింస్విదిత్యుపశఙ్కితమ్. ౧౧

అథ యాః కోసలేన్ద్రస్య శయనం ప్రత్యనన్తరాః,
తాః స్త్రియ స్తు సమాగమ్య భర్తారం ప్రత్యబోధయన్. ౧౨
తథా ప్యుచితవృత్తా స్తా వినయేన నయేన చ,
నహ్యస్య శయనం స్పృష్ట్వా కించి ద ప్యుపలేభిరే. ౧3

రాజగృహంబున నారామవృక్షశాఖలయందును బంజరంబులందునుండు పక్షులన్నియు నాశబ్దంబునకు నిద్ర మేల్కాంచి మధురంబుగా ధ్వనించినవి. ౫

వారలు చెప్పునట్టి పుణ్యశబ్దంబులును, వారలు వాయించు వీణాధ్వనులును, వారలు సేయు నాశీర్వచనధ్వనులును, వారలు గావించుగానంబుల ధ్వానంబులును నారాజగృహంబంతయు వ్యాపించినవి. ౬

అంతఁ బరిశుద్ధాచారులును సేవించుటయందు సమర్థులునగు స్త్రీనపుంసకములగు నంతఃపురపరిచారకులు సేవించిరి. ౭

స్నానవిధిం జక్కఁగా నెఱింగినట్టి భృత్యులు స్నానంబు సేయవలసిన కాలంబున యథాశాస్త్రంబుగాఁ బసుపుచందనముఁ గలపిన యుదకంబును బంగారుకలశంబులం దెచ్చిరి. ౮

మఱికొందఱు వయసుకత్తెలగు వేశ్యలు తైలోద్వర్తనము మొదలగు మంగళానులేపనములను ఔషధములు మొదలగు ప్రాతఃకాలంబునం దినఁదగిన పదార్థములను వస్త్రాభరణకుసుమాదులనుం దెచ్చిరి. ౯

ఆరాజకీయజనులందఱును సమస్తలక్షణంబులతోడం గూడినవారలై యథాశాస్త్రంబుగా నలంకరించికొని సమస్తగుణసంపన్నులై తేజరిల్లుచుండిరి. ౧౦

ఆపురజనులందఱును రాజసేవాసముత్సుకులై సూర్యోదయంబవఱకుఁ గాచియుండి యంతకును రాజు రాకుండుటం జేసి "రాజున కేమి వాటిల్లెనదో" యని శంకనొందియుండిరి. ౧౧

అంత నంతఃపురసంచారయోగ్యలగు స్త్రీలు వచ్చి మహారాజగు దశరథుని మృదువాక్యంబుల మేలుకొలిపిరి. ౧౨

అట్లు మేలుకొలిపినను లేవమిం జేసి యాస్త్రీలు అప్పటికిఁ దగినవ్యాపారంబుల వినయంబుచేతను యుక్తిచేతను మెల్లఁగా దశరథమహారాజుం దాకి యుచ్ఛ్వాసనిశ్వాసంబులు లేకుండుటం గనుఁగొనిరి. ౧౩

తాః స్త్రియ స్స్వప్నశీలజ్ఞా శ్చేష్టాసంచలనాదిషు,

తా వేపథుపరీతా శ్చ రాజ్ఞః ప్రాణేషు శఙ్కితాః. ౧౪
ప్రతిస్రోత స్తృణాగ్రాణాం సదృశం సంచకాశిరే,

అథ సంవేపమానానాం స్త్రీణాం దృష్ట్వా చ పార్థివమ్. ౧౫
య త్త దాశఙ్కితం పాపం తస్య జజ్ఞే వినిశ్చయః,
కౌసల్యా చ సుమిత్రా చ పుత్త్రశోకపరాజితే. ౧౬
ప్రసుప్తే న ప్రబుద్ధ్యేతే యథాకాలసమన్వితే,
నిష్ప్రభా చ వివర్ణా చ సన్నా శోకేన సన్నతా. ౧౭

న వ్యరాజత కౌసల్యా తారేవ తిమిరావృతా,
కౌసల్యాఽనన్తరం రాజ్ఞ స్సుమిత్రా తదనన్తరమ్. ౧౮

న స్మ విభ్రాజతే దేవీ శోకాశ్రులులితాననా,
తే చ దృష్ట్వా తదా సుప్తే ఉభే దేవ్యౌ చ తం నృపమ్. ౧౯
సుప్త మేవోద్గతప్రాణ మన్తఃపుర మదృశ్యత,
తతః ప్రచుక్రుశు ర్దీనా స్సస్వరం తా వరాఙ్గనాః. ౨౦
కరేణవ ఇవారణ్యే స్థాన ప్రచ్యుతయూథపాః,
తాసా మాక్రన్దశబ్దేన సహ సోద్గతచేతనే. ౨౧
కౌసల్యా చ సుమిత్రా చ త్యక్తనిద్రే బభూవతుః,
కౌసల్యా చ సుమిత్రా చ దృష్ట్వా స్పృష్ట్వా చ పార్థివమ్. ౨౨
హా నాథేతి పరిక్రుశ్య పేతతు ర్ధరణీతలే,

నిద్రాలక్షణంబులు చక్కఁగాఁ దెలిసిన స్త్రీలు అప్పుడు దశరథుని యందు చేతులుగాళ్లఁ గదలించుట యుచ్ఛ్వాసంబులు విడుచుట యివి మొదలగు నిద్రాలక్షణంబులలో నేదియుం లేకుండుటం జూచిరి.

అంత నాస్త్రీలు దశరథుఁడు మృతుఁడయ్యెనో యేమో యని సంశయంబునొంది ప్రవాహంబున కెదురున్న తృణంబుల యగ్రంబులువోలె గడగడవడంకిరి. ౧౪

అంత దశరథుంజూచి భయంబునొంది వడంకుచున్నయాస్త్రీలు కొంతసేపునకు దశరథుఁడు మృతినొందెనని నిశ్చయించికొనిరి. ౧౫

కౌసల్యయుం సుమిత్రయుఁ బుత్రదుఃఖంబున నలసి నిదురించినవారలగుటం జేసి మృతినొందినవారలపోల్కి మేలుకొనకుండిరి. ౧౬

కౌసల్యాదేవి కాంతివిహీనయయి తెల్లఁబాఱినదేహముగలదై దుఃఖంబునం గృశించి ఉత్పాతధూమముచేఁ గప్పఁబడిన నక్షత్రంబుపగిదిం బ్రకాశింపకుండినది. ౧౭

ప్రథమపక్షంబున దశరథుఁడు మృతుండగుటవలనఁ గాంతిహీనుండై యుండెను; అతనికివెనుకఁ గౌసల్య కన్నీళ్లుగాఱ నేడ్చియేడ్చియున్నది గావునఁ గాంతిహీనయయియుండెను; ఆబిడవెనుక సుమిత్రయు నట్లె కాంతిహీనయై యుండెను. ౧౮

ఆస్త్రీలు అట్లు నిద్రఁబొందియున్న యాకౌసల్యాసుమిత్రలం జూచి నిద్రవోయి మృతినొందిన దశరథమహారాజునుఁ జూచిరి. ౧౯

అంత నుత్తమలగు నాస్త్రీలు దుఃఖితలయి యరణ్యంబున యూథపముం బాసిన యాఁడేనుంగులపోల్కిం బేరెలుంగున రోదనంబుఁ జేసిరి. ౨౦

వారలరోదనధ్వనిచేతఁ గౌసల్యయుం సుమిత్రయుఁ దటాలున మెలఁకువనొంది నిద్రలేచిరి. ౨౧

అంతఁ గౌసల్యయుం సుమిత్రయుం నిద్రలేచి దశరథుం దాఁకిచూచి మృతుఁడయ్యెనని తెలిసికొని "అయ్యో నాథుఁడా!" అని యాక్రోశించుచు నేలంబడిరి. ౨౨

సా కోసలేన్ద్రదుహితా వేష్టమానా మహీతలే. ౨౩
న బభ్రాజ రజోధ్వస్తా తారేవ గగనా చ్చ్యుతా,

నృపే శాన్తగుణే జాతే కౌసల్యాం పతితాం భువి. ౨౪
అపశ్యం స్తాః స్త్రియ స్సర్వా హతాం నాగవధూ మివ,
తత స్సర్వా నరేన్ద్రస్య కైకేయీప్రముఖాః స్త్రియః. ౨౫
రుదన్త్య శ్శోకసన్తప్తా నిపేతు ర్గతచేతనాః,

తాభి స్స బలవా న్నాదః క్రోశన్తీభి రనుద్రుతః. ౨౬
యేన స్థిరీకృతం భూయ స్తద్గృహం సమనాదయత్,

తచ్చ సన్త్రస్తసంభ్రాన్తం పర్యుత్సుకజనాకులమ్. ౨౭
సర్వత స్తుములాక్రన్దం పరితాపార్తబాన్ధవమ్,
సద్యో నిపతితానన్దం దీనవిక్లబదర్శనమ్. ౨౮
బభూవ నరదేవస్య సద్మ దిష్టాన్త మీయుషః,

అతీత మాజ్ఞాయ తు పార్థివర్షభం
యశస్వినం సమ్పరివార్య పత్న్యః. ౨౯
భృశం రుదన్త్యః కరుణం సుదుఃఖితాః
ప్రగృహ్య బాహూ వ్యలప న్ననాథవత్.
ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే పఞ్చషష్టితమస్సర్గః.

---

షట్షష్టితమస్సర్గః

తమగ్నిమివ సంశాన్త మమ్బుహీన మి వార్ణవమ్,
హతప్రభ మి వాఽఽదిత్యం స్వర్గస్థం ప్రేక్ష్య పార్థివమ్. ౧

కోసలరాజపుత్రియగు నాకౌసల్యాదేవి యట్లు నేలంబొరలుచు దుఃఖముచే గప్పఁబడినదై ఆకాశంబుననుండి నేలంబడిననక్షత్రముపోల్కినదై కాంతిహీనయయియుండెను. ౨౩

అట్లు దశరథుఁడు మృతినొందినపిమ్మట నేలంబడి చంపఁబడిన యాఁడేనుఁగుచందంబుననున్న కౌసల్యాదేవిని అయంతఃపురస్త్రీలందఱుఁ జూచిరి.

అంతఁ గైకేయి మొదలగు దశరథునిభార్యలందఱును దశరథుఁడు మృతినొందినది తెలిసి యచ్చటికివచ్చి పరమదుఃఖితలయి రోదనంబుసేయుచు విసంజ్ఞలయి నేలంబడిరి. ౨౪

అట్లు కైకేయి మొదలగువారలును వచ్చి రోదనంబు సేయఁగానే ఆధ్వనియుఁ గౌసల్యాదుల రోదనధ్వనితోఁగలసి యాగృహంబంతయు వ్యాపించి గొప్పప్రతిధ్వనిని గల్గించినది. ౨౫

మున్నధికోత్సాహంబులోఁ గూడియుండినజనులుగల యారాజగృహంబంతయు దశరథుఁడు మృతినొందినంతనే జనులందఱు భీతులయ్యును సంభ్రాంతులయ్యును నెచ్చోటంజూచినను రోదనశ్శబ్దములుసేయు బంధువులు పరమదుఃఖంబునొంద నెంతమాత్రము సంతోషములేక కొందఱు దీనదృష్టులంజూచుచుండఁ గాంతిహీనమయినది. ౨౬,౨౭

మహాకీర్తిశాలియగు నాదశరథుఁడు మృతుండగుటం దెలిసినంతనే యతనిం బరివేష్టించి పరమదుఃఖితలయి ఒకరిచేతుల నొకరుపట్టుకొని యనాథలుంబోలెఁ బరమదుఃఖంబుగా రోదనంబుగావించిరి.

ఇది యఱువదియైదవసర్గము.

---

## అఱువదియాఱవ సర్గము

మృతుండై చల్లారిన యగ్నిహోత్రంబువలెను నీరులేని సముద్రంబువలెను కాంతిలేనిసూర్యునివలెనైనవాఁడై తేజోవిహీనుఁడైయున్న దశరథమహారాజుం

కౌసల్యా బాష్పపూర్ణాక్షీ వివిధం శోకకర్శితా,
ఉపగృహ్య శిరో రాజ్ఞః కైకేయీం ప్రత్యభాషత. ౨

సకామా భవ కైకేయి! భుఙ్క్ష్వ రాజ్య మకణ్టకమ్,
త్యక్త్వా రాజాన మేకాగ్రా నృశంసే! దుష్టచారిణి!. 3

విహాయ మాం గతో రామో భర్తా చ స్వర్గతో మమ,
విపథే సార్థహీనేవ నాహం జీవితు ముత్సహే. ౪

భర్తారం తం పరిత్యజ్య కా స్త్రీ దైవత మాత్మనః,
ఇచ్ఛే జ్జీవితు మన్యత్ర కైకేయ్యా స్త్యక్తధర్మణః. ౫
న లుబ్ధో బుధ్యతే దోషా న్కిమ్పాక మివ భక్షయన్,
కుబ్జానిమిత్తం కైకేయ్యా రాఘవాణాం కులం హతమ్. ౬

అనియోగే నియుక్తేన రాజ్ఞా రామం వివాసితమ్,
సభార్యం జనక శ్శ్రుత్వా పరితప్స్యత్యహం యథా. ౭

స మా మనాథాం విధవాం నాద్య జానాతి ధార్మికః,
రామః కమలపత్రాక్షో జీవ న్నాశ మితో గతః. ౮

విదేహరాజస్య సుతా తథా సీతా తపస్వినీ,
దుఃఖస్యానుచితా దుఃఖం వనే పర్యుద్విజిష్యతి. ౯

గాంచి కౌసల్యాదేవి పగమదుఃఖితయయి కండ్లనిండఁ గన్నీళ్లుగాఱ దుఃఖంబు పట్టఁజాలక దశరథునిశిరంబు దొడపై నిడికొని కైకేయింజూచి యిట్లునానా విధములుగాఁ బలికెను. ౧,౨

క్రూరురాలవుదుష్టురాలవగుకైకేయీ! ఇంక నీవు కృతార్థురాలవగుము. దశరథమహారాజును జచ్చెఁగదా! ఇంకనొంటిమెయి నకంటకంబగు రాజ్యంబు ననుభవింపుము. ౩

నన్నువిడిచి నాకొడుకురాముఁడడవికేఁబోయెను; నాపెనిమిటియుం మృతుండయ్యె; మహాభయంబగు మార్గంబునఁ దోడుతప్పిన స్త్రీవలె నేనింక దిక్కులేనిదాననై శత్రుబహుళంబగు నీప్రదేశంబున జీవింపనొల్లను. ౪

ధర్మంబును బరిత్యజించియున్నకైకేయి దక్క మఱియెవ్వతె తనకు దేవతయయిన పెనిమిటిని విడిచి జీవించియుండంగోరును? ౫

విషముష్టిపండునుజూచి ఇదియుం నొకఫలమేయని యెంచి దానిం దిను వానికి దానివలనంగలుగు కీడు తెలియనట్లు లుబ్ధునకుఁ దనలోభమువలన రాఁబోవుదోషములు తెలియవు; ఒకకుబ్జబోధించినది విని కైకేయి యూపనొని దానిచేఁగలుగుదోషంబుఁ దెలియక రాఘవవంశమునంతయుం నశింపఁజేసినది.

మున్ను వరంబుల నిచ్చునప్పుడు ఈవరంబులనే యివ్వవలయునను నిశ్చయము లేకున్నను కైకేయిచే భరతాభిషేచన రామవివాసనంబులనే యివ్వవలయునని ఘోరంబుగా నడుగఁబడినవాఁడై దశరథుఁడు రాముని నతని భార్యతోఁగూడ నరణ్యంబునకుఁ బంపుటను విని జనకమహారాజును నావలె దుఃఖింపఁగలఁడు. ౭

బ్రతికియుండినను ఇచ్చట లేకపోవుటచే నష్టప్రాయుండగు ధార్మికుండును దామరసాయతాక్షుండును నైనరాముఁడు ఇప్పుడు అనాథనగు నేను విధవనగుట నెఱుఁగఁడుగదా! ౮

అట్లు శోచనీయయగును జనకమహారాజపుత్త్రియుం దుఃఖంబనుభవింపఁ దగనిదియుం నగుసీత యరణ్యంబునందు దుఃఖితయయి భయంబునొంది యుండఁగలదు. ౯

సీత రాత్రులందు భయంకరంబగు ధ్వనిగలమృగంబులును బక్షులును అఱవఁగా నాధ్వనిని విని భయంపడి రామునింగవుఁగిలించుకొని యుండఁగలదు.

వృద్ధుండును గొడుకులులేనివాఁడునగు నాజనకమహారాజును జనకొమార్తెనుసీతం దలంచుకొని దుఃఖితుఁడై ప్రాణంబులు విడుచును. ౧౧

పతివ్రతనగు నేను ఇప్పుడే ప్రాణంబు విడిచెదను; ఈభర్తదేహము తోఁగూడ నగ్నిహోత్రంబుఁ జొచ్చెదను. అని కౌసల్య రోదనముఁజేసెను.

అంత నంతఃపురాధ్యక్షులగు స్త్రీలు వచ్చి శోచనీయయుఁ బరమదుఃఖితయు రోదనంబు సేయుచున్నదియునగు నాకౌసల్యం దీసికొని దశరథుని కళేబరంబునొద్దనుండి తొలఁగంగొనిపోయిరి. ౧౩

అంత మంత్రులు వసిష్ఠాదులయాజ్ఞచే దశరథునికళేబరంబును తైలద్రోణియందుంచి యాతమీఁద రాచకార్యంబులనన్నింటినిజరిగించుచుండిరి.

ఆమంత్రులు సమస్తధర్మంబులుఁ దెలిసినవారలు కావునఁ బుత్రుండు లేక దశరథునకు సంస్కారముమాత్రము సేయరైరి; అందువలన నాకళేబరమును జెడకుండ రక్షించిరి. ౧౪

మంత్రులు దశరథకళేబరంబును తైలద్రోణియం దుంచుటం జూచినంతనె యాస్త్రీలందఱు "అయ్యో! దశరథుఁడు చచ్చినాఁడే!" అని మరల రోదనంబు గావించిరి. ౧౫

ఆస్త్రీలు దీనలయి చేతులు పైకెత్తి కండ్లనిండఁ గన్నీళ్లుగాఱఁ బరమ దుఃఖితులయి కృపణంబుగా రోదనంబుఁ జేసిరి. ౧౬

అయ్యో దశరథమహారాజా! మొదలే ప్రియవాదియు సత్యసంధుడగురామునిచే విడువఁబడి దుఃఖించుచున్నామే, అట్టిమమ్ములను నీవునుఇట్లేల విడిచిపోతివి? ౧౭

మేము రామునింబాసి పెనిమిటివగునీవును మృతుండవయినపిదప దుష్టురాలును బతిఘ్నియు నగు కైకేయియొద్ద నెట్లుండఁగలము? ౧౮

స హి నాథ స్సదాఽస్మాకం తవ చ ప్రభు రాత్మవాన్,
వనం రామో గత శ్శ్రీమా న్హిత్వా నృపతిశ్రియమ్. ౨౦

త్వయా తేన చ వీరేణ వినా వ్యసనమోహితాః,
కథం వయం నివత్స్యామః కైకేయ్యా చ విదూషితాః?. ౨౧
యయా తు రాజా రామశ్చ లక్ష్మణ శ్చ మహాబలః,
సీతయా సహ స న్త్యక్తా స్సా క మన్యం న హాస్యతి?. ౨౨

తా బాష్పేణ చ సంవీతా శ్శోకేన విపులేన చ,
వ్యవేష్టన్త నిరానన్దా రాఘవస్య వర స్త్రియః. ౨౩
నిశా చన్ద్రవిహీనేవ స్త్రీవ భర్తృవివర్జితా,
పురీ నారాజతాఽయోధ్యా హీనా రాజ్ఞా మహాత్మనా. ౨౪

బాష్పపర్యాకులజనా హాహాభూతకులాఙ్గనా,
శూన్యచత్వరవేశ్మాన్తా న బభ్రాజ యథాపురమ్. ౨౫

గతే తు శోకా త్త్రిదివం నరాధిపే
మహీతలస్థాసు నృపాఙ్గనాసు చ,
నివృత్తచార స్సహసా గతో రవిః
ప్రవృత్తచారా రజనీ హ్యుపస్థితా. ౨౬
ఋతే తు పుత్త్రా ద్దహనం మహీపతే
ర్నరోచయన్తే సుహృద స్సమాగతాః,
ఇతీ వ తస్మి ఞ్ఛయనే న్యవేశయ
న్విచిన్త్య రాజాన మచిన్త్యదర్శనమ్. ౨౭

ఎల్లప్పుడును నీకును మాకును ప్రభుండైనవాఁడును మంచిమనసుగల వాఁడును శ్రీమంతుండునగు నారాముఁడు రాజలక్ష్మిం బరిత్యజించియడవికిఁ బోయెనుగదా! ౨౦

మేము రాముని నిన్నును విడిచి యిట్లు పరమదుఃఖితులమయి కైకేయి వలన నానావిధంబులగు బాధల ననుభవింపుచు ఎట్లు జీవించియుండఁగలము? పెనిమిటిని మహారాజుండ వగు నిన్నునురాముని మహాబలుండగు లక్ష్మణుని సీతనుం గూడఁ బరిత్యజించినట్టి క్రూరురాలగు కైకేయి ఇంక నితరులం బరిత్యజించునని చెప్పనేల? అనియాస్త్రీలు రోదనంబుగావించిరి. ౨౨

ఉత్తమలగు నాదశరథుని భార్యలు బరమదుఃఖితలయి కన్నీళ్లొలుక రోదనంబుసేయుచు నేలం బడి పొరలిరి. ౨౩

చంద్రుఁడులేని రాత్రికైవడి విధవయగు స్త్రీవలె మహాత్ముఁడగు నా దశరథమహారాజు లేకుండుటంజేసి యాయయోధ్యాపట్టణము కాంతిహీనమయి యుండినది. ౨౪

జనులందఱును కన్నీళ్లు గార్చుచుఁ గులస్త్రీలందఱు హాహాకారంబులు సేయుచు మఱిగిల్లు గృహామధ్యప్రదేశంబులు పాడుపడియుం నుండుటంజేసి యాయయోధ్యాపట్టణము పూర్వమువలెఁ బ్రకాశింపకుండినది. ౨౫

ఇట్లు దశరథమహారాజు మృతినొంది, రాజభార్యలందఱు నేలపైఁ బడి పొరలిపొరలి యేడ్చుచుండఁగానే సూర్యుఁ డస్తమించెను. అంతఁ జీకట్లు దిక్కులం బిక్కటిల్ల రాత్రికాలంబు వచ్చినది. ౨౬

అప్పుడుకొందఱు "దశరథునకుసత్పుత్రులున్నను వారలెవ్వరు నిప్పుడు లేరు కావున మన మూరకుండుట యుచితముకాదు. ఎట్లయిన నాయనకు దహనాదిసంస్కారంబుసేయుదము" అని యత్నించిరి. అయినను అప్పటచ్చటి బంధువులు వచ్చి కొడుకులేనప్పుడు దశరథునకు సంస్కారమెంతమాత్రము సేయఁగూడదని చెప్పిరి. ఇట్లు నిశ్చయించి యాయనకళేబరంబును తైలద్రోణియం దునిచిరి. ౨౭

గతప్రభా ద్యౌ రివ భాస్కరం వినా
వ్యపేతనక్షత్రగణేవ శర్వరీ,
పురీ బభాసే రహితా మహాత్మనా
న చాస్రకణ్ఠాఽఽకులమార్గచత్వరా.
నరా శ్చ నార్య శ్చ సమేత్య సఙ్ఘశో
విగర్హమాణా భరతస్య మాతరమ్,
తదా నగర్యాం నరదేవసంక్షయే
బభూవు రార్తా న చ శర్మ లేభిరే.

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే షట్షష్టితమస్సర్గః.

---

## సప్తషష్టితమస్సర్గః

ఆక్రన్దితనిరానన్దా సాస్రకణ్ఠజనాకులా,
అయోధ్యాయా మతితతా సా వ్యతీయాయ శర్వరీ.

వ్యతీతాయా న్తు శర్వర్యా మాదిత్య స్యోదయే తతః,
సమేత్య రాజకర్తార స్సభా మీయు ర్ద్విజాతయః.
మార్కణ్డేయోఽథ మౌద్గల్యో వామదేవ శ్చ కాశ్యపః,
కాత్యాయనో గౌతమ శ్చ జాబాలి శ్చ మహాయశాః.
ఏతే ద్విజా స్సహామాత్యైః పృథ గ్వాచ ముదీరయన్,
వసిష్ఠ మే వాభిముఖా శ్శ్రేష్ఠం రాజపురోహితమ్.
అతీతా శర్వరీ దుఃఖం యా నో వర్షశతోపమా,
అస్మి న్పఞ్చత్వ మాపన్నే పుత్త్రశోకేన పార్థివే.
స్వర్గత శ్చ మహారాజో రామ శ్చారణ్య మాశ్రితః,
లక్ష్మణ శ్చాపి తేజస్వీ రామేణైవ గత స్సహ.

సూర్యుఁడు లేకుండుటంజేసి కాంతిహీనమయియుండు నాకాశంబు భంగి నక్షత్రంబులులేని రాత్రికైవడి మహాత్ముఁడగు దశరథమహారాజు లేకుండుటవలన నాయయోధ్యాపట్టణము మార్గంబులందును జదుకంబులందును జనులు కన్నీళ్లు గార్చుచుండఁ గాంతిహీనమయియుండినది. ౨౮

అప్పుడు దశరథుఁడు మృతినొందిన కాలంబున నాయయోధ్యయందలి పురుషులును స్త్రీలును అచ్చటచ్చట గుంపులు గుంపులుగాఁ జేరి భరతుని తల్లియగు కైకేయిని నిందించుచుఁ బరమదుఃఖితులయి కొంచెమయినను సుఖంబునొందకుండిరి. ౨౯

ఇది యఱువదియాఱవ సర్గము.

## అఱువదియేడవసర్గము

అంత జనులందఱును రోదనంబు సేయుచు నిరానందులై కన్నీళ్లు గార్చుచుండ నారాత్రి దుఃఖంబున నతిదీర్ఘభూతంబయి యెట్టకేలకుఁ గడచినది. ౧

అంత రాత్రి యంతయుఁ గడచి సూర్యోదయంబయినపిదప రాజు నేర్పఱచునట్టి బ్రాహ్మణులు వచ్చి సభ చేరిరి. ౨

మార్కండేయుఁడును మౌద్గల్యుఁడును వామదేవుఁడును గాశ్యపుఁడును గాత్యాయనుఁడును గౌతముఁడును మహాకీర్తిశాలియగు జాబాలియు నీబ్రాహ్మణోత్తములును మంత్రులును రాజపురోహితుఁడును సర్వోత్తముఁడునగు వసిష్ఠుం జూచి వేఱ్వేఱ నిట్లని చెప్పిరి. ౩,౪

దశరథుఁడు పుత్రదుఃఖంబున మరణంబునొందినపిదప నీరాత్రి నూఱు సంవత్సరంబులుం బోలె నతికష్టంబునం గడచినది. ౫

దశరథమహారాజు మరణంబునొందెను. రాముఁడు వనంబునకుఁ బోయెను. తేజస్వియగు లక్ష్మణుఁడును రామునితోఁ గూడ నరణ్యంబునకు బోయెను. ౬

ఉభౌ భరతశత్రుఘ్నౌ కేకయేషు పరన్తపౌ,
పురే రాజగృహే రమ్యే మాతామహనివేశనే.

ఇక్ష్వాకూణా మిహా ద్యైవ కశ్చి ద్రాజా విధీయతామ్,
అరాజకం హి నో రాష్ట్రం న వినాశ మవాప్నుయాత్.

నారాజకే జనపదే విద్యున్మాలీ మహాస్వనః,
అభివర్షతి పర్జన్యో మహీం దివ్యేన వారిణా.
నారాజకే జనపదే బీజముష్టిః ప్రకీర్యతే,
నారాజకే పితుః పుత్రో భార్యా వా వర్తతే వశే.

నారాజకే ధనం చాస్తి నాస్తి భార్యా ప్యరాజకే,
ఇద మత్యాహితం చాన్య త్కుత స్సత్య మరాజకే.

నారాజకే జనపదే కారయన్తి సభాం నరాః,
ఉద్యానాని చ రమ్యాణి హృష్టాః పుణ్యగృహాణి చ.

నారాజకే జనపదే యజ్ఞశీలా ద్విజాతయః,
సత్రా ణ్యన్వాసతే దాన్తా బ్రాహ్మణా స్సంశితవ్రతాః.

నారాజకే జనపదే మహాయజ్ఞేషు యజ్వనః,
బ్రాహ్మణా వసుసంపూర్ణా విసృజ న్త్యాప్తదక్షిణాః.

నారాజకే జనపదే ప్రభూతనటనర్తకాః,

శత్రువులం దపింపఁజేయునట్టి భరతశత్రుఘ్ను లిద్దఱును కేకయ దేశమునందు రమ్యంబగు రాజగృహంబనుపట్టణంబునందు మాతామహునింట నున్నారు. ౭

ఇప్పుడే యిచ్చట ఇక్ష్వాకువంశమునందుఁ బుట్టినవారలలో నొకని రాజుగా నేర్పఱుపవలయును. రాజులేనిపక్షమునందు రాజ్యం బవశ్యము నాశమునొందును. ౮

రాజులేనిదేశమునందు మేఘము మెఱుపులతో నొప్పుచు గర్జనధ్వనులలర దివ్యంబగుజలమును భూమిపై వర్షింపదు. ౯

రాజులేనిదేశమునందు పండినప్పుడు దొంగలు కొట్టుకొనిపోవుదురను భయంబున నెవ్వరును విత్తనములుచల్లరు. అట్లు రాజులేనిదేశంబునందు శిక్షకుఁడు లేకుండుటంజేసి తండ్రికిఁ గొడుకుగాని, పెనిమిటికి భార్యగాని చెప్పినట్టు వినరు. ౧౦

రాజులేనిదేశమునందు ధనంబును దొంగ లపహరింతురు. అట్లు స్త్రీల నీడ్చుకొనిపోవుదురు. భార్యయే యుండదు. ఇదిగాక మఱియొకటి యింతకన్న మహాభయంబున్నది. రాజు లేకుండునేని సత్యంబే నిలువదు. ౧౧

రాజులేనిదేశంబున జనులు సంతుష్టులైయుండరు. దుష్టులు వచ్చి రచ్చసేయుదురను భయంబున సభచేరరు. అట్లు ఛేదించివేయుదురను భయంబున రమ్యంబులగు నుద్యానవనంబుల నిర్మింపరు. అట్లు దొంగలు దాఁగుటకు దుర్గంబులగునను భయంబున దేవస్థానంబుల నిర్మింపరు. ౧౨

రాజులేనిదేశంబున నెల్లప్పుడును యాగంబులు సేయువారలును వేదవేత్తలును దీక్షవ్రతంబులు గలవారలును జితేంద్రియులు నగు బ్రాహ్మణులు మహాయాగంబుల ననుష్ఠింపరు. ౧౩

రాజులేనిదేశమునందు బ్రాహ్మణులు ధనసంపన్నులయినను యాగంబులు సేయునప్పుడు తాము ధనికులని యితరులు తెలిసికొని దోచుకొని పోవుదురను భయంబున భూరిదక్షిణల నొసంగరు. ౧౪

రాజులేనిదేశమునందు దుష్టభయంబునను ప్రోత్సాహమందు లేకుండుట

వలనను దేశంబున కభివృద్ధిఁ గలిగించునట్టి నటనర్తకులతోఁ గూడిన యుత్స
వంబులును సభలును వృద్ధిఁబొందవు. ౧౫

రాజులేనిదేశమునందు క్రయవిక్రయములచే జీవించువారలకుఁగాని
నాయభాగాది వ్యవహారములు గలవారలకుఁగాని యొంతమాత్రము ప్రయో
జనముగలుగదు. మఱియు నితిహాసపురాణకథలం జెప్పువారును గథలు చెప్పి
వినువారివలన ఫలంబు నొందంజాలరు. ౧౬

రాజులేని దేశమునందు దొంగలభయంబువలనఁ గన్యకలు చక్కఁగా
నలంకరించుకొని చెలికత్తెలతోఁగూడ సాయంకాలంబున నాడుకొనుటకై
యుద్యానవనంబులకుం బోరు. ౧౭

రాజులేనిదేశంబునందు దుష్టభయంబునఁ గాముకులగు పురుషులు
స్త్రీలతోఁ గూడ వడిగాఁబోవు రథంబుల నెక్కి విహారార్థమై యడవులకుఁ
బోఁజాలరు. ౧౮

రాజులేనిదేశంబున దొంగల భయమువలనఁ గృషిచేతను గోవులచేతను
జీవించునట్టి ధనవంతులగు వైశ్యులు నిర్భయంబుగా గాలివచ్చుటకై తలుపులు
దెఱచుకొని సుఖంబుగా రాత్రికాలంబులం బరుండరు. ౧౯

రాజులేనిదేశంబునందు ఘంటలు గట్టినవియుఁ బ్రశస్తంబులగు దంత
ములు గలవియు నఱువదిసంవత్సరముల వయసుగలవియునగు నేనుఁగులు రాజ
మార్గంబులం దిరుగుచుండవు. ౨౦

రాజులేనిదేశమునందు ఆయుధంబుల నభ్యసించునప్పుడు విడువక
బాణంబులు వేయుటవలనం గలుగు జ్యానాదంబు వినంబడదు. ౨౧

రాజులేనిదేశంబునందు నానావిధపణ్యంబులు దీసికొని దూరదేశంబు
లకుఁ బోవునట్టి వర్తకులు మార్గంబున క్షేమంబు నొందఁజాలరు. ౨౨

రాజులేనిదేశంబునందు దుష్టులు బాధించుటవలన నొంటిగాఁ దిరుగు
వాఁడును జితేంద్రియుండును తిరుగుచుండఁగా నెచ్చట సాయంకాలమగునో
అచ్చటనె నివాసంబు సేయువాఁడునగు యతి సంచరింపఁడు. ౨౩

రాజులేనిదేశంబునందు యోగక్షేమంబులు గలుగవు. అట్లు నాయకుఁడు లేమిం జేసి సేన యుద్ధంబున శత్రువుల జయింపఁజాలదు. ౨౪

రాజులేనిదేశంబున చోరభయంబువలన జనులు చక్కఁగా నలంకరించుకొని యుత్తమాశ్వంబులను రథంబులను ఆరోహించి విహారార్థమయి బయలు వెడలరు. ౨౫

రాజులేనిదేశంబునందు దుష్టభయంబున శాస్త్రంబులం బండితులగు వారలు ఋష్యాశ్రమంబు లుండువనంబునందు నుద్యానవనంబులందును శాస్త్రార్థంబులు వివరింపుచుండరు. ౨౬

రాజులేనిదేశంబునందు దుష్టులు వచ్చి చెఱుపుదురను భయంబున జనులు పరిశుద్ధులయి దేవతలం బూజించుటకొఱకుఁ బుష్పమాలికలను గుడుములను దక్షిణలను సంపాదింపరు. ౨౭

రాజులేనిదేశంబునందు రాచకొమరులు చందనంబు నగరుగంధంబును బూసికొని వసంతర్తువునందు వృక్షంబులుంబోలెఁ బ్రజలనేత్రంబుల కానందంబు గల్గింపరు. ౨౮

జలంబులేనినదులును బచ్చికలేని వనంబును గోపాలుఁడులేని గోవులును బ్రకాశింపకుండునట్లు రాజులేని రాజ్యం బెంతమాత్ర ప్రకాశింపదు. ౨౯

ఎట్లు రథంబునకు ధ్వజంబు ప్రకాశము గల్గించునో, ఎట్లు అగ్నిహోత్రునకు ధూమంబు గుఱుతుగానుండునో అట్లు మన కందఱకును బ్రకాశము గలుగఁజేయువాఁడగు రాజు ఇప్పుడు మృతినొందెను. ౩౦

రాజులేని దేశంబునందు ఎవ్వండును దనధనమును బదిలముగా నుంచుకొనంజాలఁడు. మత్స్యంబులు ఒకదాని నొకటి భక్షించునట్లు ఒకరి ద్రవ్యము నొకరు అపహరించుకొనుచుందురు. ౩౧

వర్ణాశ్రమమర్యాదలను సరకుసేయక పరలోకభయంబును విడిచి స్వేచ్ఛమెయిం దిరుగునట్టి నాస్తికులును రాజశిక్షచే సత్పురుషులు కాఁగలరు.

ఎట్లు నేత్రము దేహమునకు మంచిని గలుగఁజేయుచుఁ జెడుగులను

తథా నరేన్ద్రో రాష్ట్రస్య ప్రభవ స్సత్యధర్మయోః. 33

రాజా సత్యం చ ధర్మ శ్చ రాజా కులవతాం కులమ్,
రాజా మాతా పితా చైవ రాజా హితకరో నృణామ్. 34

యమో వైశ్రవణ శ్శక్రో వరుణ శ్చ మహాబలః,
విశేష్యన్తే నరేన్ద్రేణ వృత్తేన మహాతా తతః. 35

అహో తమ ఇవేదం స్యా న్న ప్రజాయేత కించన,
రాజా చే న్న భవే ల్లోకే విభజ న్సాధ్వసాధునీ. 36

జీవత్యపి మహారాజే త వైవ వచనం వయమ్,
నాతిక్రమామహే సర్వే వేలాం ప్రాప్యేవ సాగరః. 37

స న స్సమీక్ష్య ద్విజవర్యవృత్తం
నృపం వినా రాజ్య మరణ్యభూతమ్,
కుమార మిక్ష్వాకుసుతం వదాన్యం
త్వమేవ రాజాన మి హాభిషిఞ్చ. 38

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే సప్తషష్టితమస్సర్గః.

---

## అష్టషష్టితమస్సర్గః

తేషాం హి వచనం శ్రుత్వా వసిష్ఠః ప్రత్యువాచ హ,
మిత్రామాత్యగణాన్సర్వా న్బ్రాహ్మణాం స్తా నిదం వచః. 1

ద్రోలఁగించుచు నెల్లప్పుడు నుపకరించునో, అట్లు రాజు రాజ్యంబునందు బాధ లన్నియుఁ దొలఁగించి సత్యధర్మంబుల నిలువఁద్రొక్కును. ౩౩

లోకంబున రాజే సత్యధర్మంబులం బ్రవర్తింపఁ జేయువాఁడు. రాజే సత్కులంబునం బుట్టినవారల సదాచారంబునం బ్రవర్తింపఁజేయువాఁడు. రాజు జనులకు మేలుసేయువాఁడు. కావున దల్లియుఁ దండ్రియు నతఁడే. ౩౪

అందువలన నిట్లు రాజు సర్వప్రకారంబుల రక్షించువాఁడు కావున దండనముమాత్రము సేయు యముఁడును, ధనదానము మాత్రము సేయు కుబేరుఁడును, పాలనముమాత్రము సేయు నింద్రుఁడును, సదాచారంబును మాత్రము నిలుపు వరుణుఁడును రాజునకు దక్కువయగువారలె యగుచున్నారు.

మంచిచెడ్డలను నిర్ణయించుటకు లోకంబున రాజు లేకపోవునేని అయ్యో! ప్రపంచమంతయుఁ జీఁకటి క్రమ్మినట్లుండును. లోకంబున నేదియుఁ గలుగదు. ౩౫

దశరథమహారాజుఁ బ్రతికి యున్నప్పుడె మేము సముద్రంబు చెలియలి కట్టను దాఁటనట్లు నీమాటను ఎంతమాత్రము దాఁటకుంటిమి. ఇంక నిప్పుడు దశరథుండు మృతిఁజెందినపిమ్మట నీమాటను దాఁటమని చెప్పనేల!

బ్రాహ్మణశ్రేష్ఠుఁడవగు వసిష్ఠుఁడా! మేము చెప్పినదంతయు విని రాజు లేకున్నచో రాజ్యం బంతయు వనప్రాయం బగునని యాలోచించి యిక్ష్వాకువంశజుండగు కుమారు నొక్కని మాకు రాజుగా నేర్పఱచి యతని కభిషేకంబు సేయుము. ౩౬

ఇది యఱువదియేడవ సర్గము.

---

## అఱువదియెనిమిదవ సర్గము

వారలమాటలు విని వసిష్ఠమహర్షి ఆమిత్రులను మంత్రులను బ్రాహ్మణులను అందఱినిం జూచి యిట్లని చెప్పెను.

యదసౌ మాతులకులే పురే రాజగృహే సుఖీ,
భరతో వసతి భ్రాత్రా శత్రుఘ్నేన సమన్వితః. ౨
తచ్ఛీఘ్రం జవనా దూతా గచ్ఛన్తు త్వరితై ర్హయైః,
ఆనేతుం భ్రాతరౌ వీరౌ కిం సమీక్షామహే వయమ్. 3

గచ్ఛన్త్వితి తత స్సర్వే వసిష్ఠం వాక్య మబ్రువన్,

తేషాం తద్వచనం శ్రుత్వా వసిష్ఠో వాక్య మబ్రవీత్. ౪
ఏహి సిద్ధార్థ! విజయ! జయ న్తాశోక! నన్దన!,
శ్రూయతా మితి కర్తవ్యం సర్వా నేవ బ్రవీమి వః. ౫

పురం రాజగృహం గత్వా శీఘ్రం శీఘ్రజవై ర్హయైః,
త్యక్తశోకై రిదం వాచ్య శ్శాసనా ద్భరతో మమ. ౬

పురోహిత స్త్వాం కుశలం ప్రాహ సర్వే చ మన్త్రిణః,
త్వరమాణ శ్చ నిర్యాహి కృత్య మాత్యయికం త్వయా. ౭

మా చాస్మై ప్రోషితం రామం మా చాస్మై పితరం మృతమ్,
భవన్త శ్శంసిషు ర్గత్వా రాఘవాణా మిమం క్షయమ్. ౮

కౌశేయాని చ వస్త్రాణి భూషణాని వరాణి చ,
క్షిప్ర మాదాయ రాజ్ఞ శ్చ భరతస్య చ గచ్ఛత. ౯

దత్తపథ్యశనా దూతా జగ్ము స్స్వం స్వం నివేశనమ్,

భరతుఁడు తమ్ముఁడు శత్రుఘ్నునితోఁ గూడ రాజగృహపురంబున మేనమామయింట సుఖంబుగా నున్నాఁడు గావున నిప్పుడు పరాక్రమవంతులగు నాభరతశత్రుఘ్నుల నిర్వురం బిలుచుకొని వచ్చుటకై శీఘ్రముగాఁ బోవంజాలినదూతలు వేగవంతంబులగు గుఱ్ఱంబుల నెక్కి వేగంబునం బోవుదురుగాక. దశరథుఁడే భరతునకు రాజ్యం బిచ్చియున్నాఁడే! మనము విచారింపవలసినది యేమి యున్నది? అని చెప్పెను. ౨, ౩

అంత మంత్రులు మొదలగువారలందఱును "మీరు చెప్పినట్లు దూతలు పోవలసినదే" యని వసిష్ఠునితోఁ జెప్పిరి.

వసిష్ఠమహర్షి యంత వారలు చెప్పినది విని యిట్లని చెప్పెను. ౪

సిద్ధార్థుఁడా! విజయుఁడా! జయంతుఁడా! అశోకుఁడా! నందనుఁడా! మీర లిట్లు రండు. మీర లందఱు నేమిచేయవలయునో దానిం జెప్పెద వినుండు. ౫

మీరలు వేగవంతంబులగు గుఱ్ఱంబుల నెక్కి శీఘ్రంబుగా రాజగృహంబునకుఁబోయి దుఃఖంబు దెలియక భరతుంజూచి నాయాజ్ఞవలన నతనితో నిట్లని చెప్పవలయును. ౬

పురోహితుఁడగు వసిష్ఠుఁడు మంత్రులందఱును నీతో క్షేమంబుఁ జెప్పమన్నారు; నీవొక్క యతిముఖ్యమయిన కార్యమును చేయవలసియున్నది. కావున జాగుసేయక తత్క్షణంబున వెడలిరమ్ము. అని భరతునికిఁ జెప్పుఁడు. ౭

మీరలు పోయి "రాముఁ డడవికిఁ బోయినాఁ" డనిగాని "మీతండ్రి మృతిఁబొందినాఁ" డనిగాని రఘుకులంబునకు వాటిల్లిన యీనాశంబు నెంతమాత్రము భరతునకుఁ జెప్పవలదు. ౮

కేకయరాజునకును భరతునకును గానుక లొసంగుటకుఁ బట్టుబట్టలను మంచిసొమ్ములను శీఘ్రముగాఁ దీసికొని పొండు. అని వసిష్ఠుఁడు దూతల కాజ్ఞాపించెను. ౯

అట్లు చెప్పి బత్తెకర్చుల కిచ్చి పంపఁగానే యాదూతలు వసిష్ఠునాన

నంబున నుత్తమాశ్వంబుల నారోహించి కేకయదేశంబునకుఁ బోవువారలయి, భార్యాపుత్త్రులకుఁ దమప్రయాణంబుఁ జెప్పుటకై తమయిండ్లకుం బోయిరి.

అంత నాదూతలు ప్రయాణంబునకుఁ గావలసిన పాథేయసంగ్రహాది కార్యంబులు చేసికొని మరల వసిష్ఠునొద్దకువచ్చి యతని యనుమతినొంది వేగంబునం బోయిరి. ౧౦

అక్కడ ముందట దక్షిణోత్తరంబుగా నపరతాలపర్వతమున్నది. అందుకుఁ బడమర దక్షిణోత్తరంబుగాఁ బ్రలంబపర్వతం బున్నది. అది వంకరగా నున్నదికావునఁ బూర్వపశ్చిమంబుగాను ఉన్నది. ఆదూతలు మొదట ఆయోధ్యనుండి పశ్చిమాభిముఖులయి కొంతదూరముపోయి యపరతాలపర్వతంబునుదాని దక్షిణంపుఁజివరను అతిక్రమించియంత నపరతాలప్రలంబపర్వతంబుల నడుమ మాలినీతీరమార్గంబునఁ గొంతదవ్వు ఉత్తరంబుగా నరిగి యంతఁ బ్రలంబపర్వతోత్తరభాగంబుననుండి పశ్చిమాభిముఖులయి పోయిరి. ౧౨

ఆదూతలు హస్తినాపురంబునొద్ద గంగానదిని దాఁటి కురుజాంగల దేశంబునడుమం బోవుచుఁ బాంచాలదేశంబు నొంది పశ్చిమాభిముఖులయి పోయిరి. ౧౩

ఆదూతలు ఆపాంచాలదేశంబునందుండు జలపూర్ణంబులగు కొలంకులను నిర్మలంబగు జలంబుగల నదులనుం జూచుచుఁ గార్యవశంబున నెచ్చటను నిలువక శీఘ్రంబుగాఁ బోయిరి. ౧౪

ఆదూతలు వేగంబున నిర్మల మగునదియ్యుం దివ్యంబుతు నానావిధంబులగు పక్షులతో నొప్పుచున్నదియుం జనులచే నిండియున్నదియు నగు శరదండానదియొద్దకుఁ బోయి యచ్చోట నిలువక, యానదిని దాఁటి పోయిరి. ౧౫

ఆదూతలు శరదండానదియుత్తరతీరంబుననున్న దేవతాధిష్ఠానంబుగలిగి భక్తులకోర్కుల ఫలింపఁజేయుటవలన సత్యోపయాచనంబను నన్వర్థనామంబున నొప్పుచున్న పుణ్యవృక్షంబునొంది యందఱిచేతను నమస్కరింపఁదగిన యావృక్షంబునకుఁ బ్రదక్షిణనమస్కారంబులు చేసి కుళింగాపురంబుఁ బ్రవేశించిరి. ౧౬

అభికాలం తతః ప్రాప్య తే బోధిభవనా చ్చ్యుతామ్,
పితృపైతామహీం పుణ్యాం తేరు రిక్షుమతీం నదీమ్. ౧౭

అవేక్ష్యాఞ్జలిపానాం శ్చ బ్రాహ్మణా న్వేదపారగాన్,
యయు ర్మధ్యేన బాహ్లీకాన్ సుదామానం చ పర్వతమ్. ౧౮

విష్ణోః పదం ప్రేక్షమాణా విపాశాంచాపి శాల్మలీమ్.
నదీ ర్వాపీ స్తటాకాని పల్వలాని సరాంసి చ. ౧౯
పశ్యన్తో వివిధాం శ్చాపి సింహవ్యాఘ్రమృగద్విపాన్,
యయుః పథాఽతిమహతా శాసనం భర్తు రీప్సవః. ౨౦

తే శ్రాన్తవాహనా దూతా వికృష్టేన పథా తతః,
గిరివ్రజం పురవరం శీఘ్ర మాసేదు రఞ్జసా. ౨౧

భర్తుః ప్రియార్థం కులరక్షణార్థం
భర్తు శ్చ వంశస్య పరిగ్రహార్థమ్,
అహేడమానా స్త్వరయా స్మ దూతా
రాత్ర్యాన్తు తే తత్పుర మేవ యాతాః. ౨౨

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డేఽష్టషష్టితమస్సర్గః.

అంత నాదూతలు అభికాలంబను గ్రామంబు నొంది యచ్చట బోధిభవనంబను పర్వతంబునం బుట్టినదియుం దశరథవంశ్యులచే ననుభవింపఁ బడిన తీర్థగ్రామంబులు గలదియుఁ బుణ్యంబునగు నిక్షుమతీనదిని దాఁటిరి. ౧౭

ఆదూతలు అచ్చట దోసెఁడు నీళ్లుమాత్రమె యాహారంబుగాఁ గొనుచుఁ దపస్సు చేసికొనుచు నాయిక్షుమతీతీరంబున నున్న వేదపారగులగు బ్రాహ్మణులం జూచి బాహ్లీకదేశంబునకును సుదామపర్వతంబునకును నడిమిదారిఁ బట్టిపోయిరి. ౧౮

ఆదూతలు విష్ణుపదాంకితంబగు పుణ్యస్థానంబును విపాశానదిని తత్తీరస్థంబగు శాల్మలీవృక్షంబునుం జూచుచు నచ్చటచ్చట నదులను నదబావులను జెఱువులను నీళ్లు నిలిచిన పల్లంబులను గొలఁకులను నానావిధంబులగు సింహవ్యాఘ్రగజాదిమృగంబులను గనుఁగొనుచు రాజాజ్ఞచే నతిదూరంబగు మార్గంబుఁ గడచిపోయిరి. ౧౯,౨౦

అంత నాదూతలు బహుదూరంబు నడచుటచేత గుఱ్ఱంబు లలసట నొంద శీఘ్రంబుగా గిరివ్రజంబను నామాంతరముగల కేకయరాజనగరంబు నొందిరి. ౨౧

శీఘ్రంబుగా భరతునిం దీసికొనిపోయి యతనిచే నౌర్ధ్వదైహికంబు సేయించి తమప్రభుండగు దశరథునకు సంతోషంబు గలుగఁజేయుటకును దశరథునియింటివా రందఱును అనాథలుగా నున్నారు గావున భరతు నచ్చటికిఁ జేర్చి వారల సనాథులం జేయుటకును అవిలంబముగా నౌర్ధ్వదైహికము జరగుటవలన దశరథుని వంశమునకుఁ బ్రతిష్ఠ గలుగఁజేయుటకును ఆదూతలు ఎంతమాత్రము జాగుసేయక యతిత్వరతో నస్తమయం బయినను రాత్రికాలంబునందును గొంతదారినడిచి రాత్రికే యారాజగృహనగరంబుఁ జేరిరి.

ఇది యఱువదియెనిమిదవసర్గము.

---

## ఏకోనసప్తతితమస్సర్గః

యామేవ రాత్రిం తే దూతాః ప్రవిశన్తి స్మ తాం పురీమ్,
భరతేనాపి తాం రాత్రిం స్వప్నో దృష్టోఽయ మప్రియః. ౧
వ్యుష్టా మేవతు తాం రాత్రిం దృష్ట్వా తం స్వప్న మప్రియమ్,
పుత్రో రాజాధిరాజస్య సుభృశం పర్యతప్యత. ౨

తప్యమానం సమాజ్ఞాయ వయస్యాః ప్రియవాదినః,
ఆయాసం హి వినేష్యన్త స్సభాయాం చక్రిరే కథాః. ౩

వాదయన్తి తథా శాన్తిం లాసయ న్త్యపి చాపరే,
నాటకాన్యపరే ప్రాహు ర్హాస్యాని వివిధాని చ. ౪

స తై ర్మహాత్మా భరత స్సఖిభిః ప్రియవాదిభిః,
గోష్ఠీహాస్యాని కుర్వద్భి ర్న ప్రాహృష్యత రాఘవః. ౫

త మబ్రవీ త్ప్రియసఖో భరతం సఖిభి ర్వృతమ్,
సుహృద్భిః పర్యుపాసీనః కిం సఖే! నానుమోదసే. ౬

ఏవం బ్రువాణం సుహృదం భరతః ప్రత్యువాచ హ,
శృణు త్వం యన్నిమిత్తం మే దైన్య మేత దుపాగతమ్. ౭
స్వప్నే పితర మద్రాక్షం మలినం ముక్తమూర్ధజమ్,

## అఱువదితొమ్మిదవ సర్గము

ఆదూతలే రాత్రియందు గిరివ్రజపురంబుఁ జేరిరో ఆరాత్రియందే భరతునకు దుఃఖకరంబగు నొక్కదుస్స్వప్నంబు గల్గినది. ౧

అట్లు రాత్రియందుఁ బ్రభాతకాలంబుననే యాదుఃఖస్వప్నంబుఁ గని రాజాధిరాజసుతుఁడగు భరతుఁడు "ఈస్వప్నం బతిశీఘ్రముగా ఫలము నిచ్చునదే" యని మిక్కిలియుఁ బరితపించెను. ౨

భరతుఁ డెందువలననో దుఃఖితుఁడై యున్నాఁడని తెలిసికొని, ప్రియవాదులగు నతనిస్నేహితులు అతనిమనసునందలి దుఃఖంబును బోఁగొట్టుటకై సభయందు నానావిధంబులగు కథలం జెప్పిరి, ౩

భరతునకు దుఃఖశాంతి గలుగుటకై కొందఱు వీణెల వాయించిరి. కొందఱు వేశ్యల నాడించిరి. మఱికొందఱు నాటకంబులం జదివిరి. మఱి కొందఱు నవ్వుగలిగించుమాటలం జెప్పిరి. ౪

మహాత్ముఁడును రఘువంశంబునం బుట్టినవాఁడునగు నాభరతుఁడు ప్రియవాదులగు నాస్నేహితులు సభాయోగ్యంబులయిన హాస్యంబు లెంత చేసినను సంతోషంబు నొందఁడయ్యె. ౫

అప్పుడు స్నేహితులనడుమనున్న భరతుం జూచి యంతరంగ స్నేహితుం డగువాఁ డొక్కఁడు ఇట్లని చెప్పెను.

స్నేహితుఁడవగు భరతుఁడా ! స్నేహితులు నీ కెంతసంతోషకరంబులగు కార్యంబులు చేసినను నీవేల సంతోషంబు నొందకున్నావు? అని ప్రియసఖుండు భరతునితోఁ జెప్పెను. ౬

ఈప్రకారం బాప్రియసఖుఁడు చెప్పినది విని, భరతుఁడు వానిం జూచి యిట్లని బదులు చెప్పెను.

నా కింత దుఃఖంబు గలుగుటకుం దగినకారణంబుఁ జెప్పెదను వినుము. ౭

నేను స్వప్నంబున నాతండ్రి మలినదేహుఁడై తలవెండ్రుకలు విరియఁ

కొని పర్వతశిఖరంబుననుండి కలుషంబగు పేడగుంటలోఁ బడినట్లు చూచి
నాను. ౮

మఱియు నప్పుడు నాతండ్రి ఆ పేడగుంటలోఁ దేలుచు, దోసిలిచే
నూనెం ద్రావుచు వికృతంబుగా మాటిమాటికి నవ్వుచు నుండినట్లు గంటిని. ౯

అంత నతఁడు నువ్వులన్నము భుజించి మాటిమాటికిఁ దలక్రిందుగ
దేహంబంతయుఁ దైలంబుఁ బూసికొని, తైలములోనే మునింగినట్లు చూచి
నాను. ౧౦

మఱియు నే నప్పుడు స్వప్నంబున సముద్రంబెండినట్లును చంద్రుఁడు
నేలపైఁ బడినట్లును లోకమంతయుఁ జీఁకటి క్రమ్మినట్లు ఏమియు నగపడ
కుండినట్లును బట్టపేనుఁగుదంతము తునుకలైనట్లును మండుచున్న యగ్ని
హోత్రంబు తటాలున జల్లాఱినట్లును భూమి పగిలినట్లును నానావిధములగు
వృక్షంబు లెండిపోయినట్లును బర్వతంబు లన్నియు నాశంబు నొంది పొగ
రాఁజుచున్నట్లును గంటిని. ౧౧-౧౩

నల్లని మేను గలవారలును గోరోచనపువన్నె గలవారలునునగు స్త్రీలు
నల్లనిబట్టఁ గట్టుకొని యినుపపీటపైఁ గూర్చుండియున్న నాతండ్రి దశరథ
మహారాజును జూచి నవ్వుచున్నట్లు గంటిని. ౧౪

మఱియు ధర్మాత్ముఁడగు నాతండ్రి దశరథమహారాజు ఎఱ్ఱనిపువ్వుమాలి
కలను ధరించి నల్లనిచందనంబునుఁ బూసికొని వేగంబున గాడిదలు గట్టిన
రథంబు నెక్కి దక్షిణపుదిక్కును బట్టి పోయెను. ౧౫

వికృతంబగు ముఖంబుగలదియు నెఱ్ఱబట్ట కట్టుకొని యున్నదియు
నగు రాక్షసస్త్రీయొక్కతె వికవికనవ్వుచు దశరథమహారాజును ఆకర్షించు
చున్నట్లు గంటిని. ౧౬

ఈ ప్రకారము ఈరాత్రియందు మహాభయంకరంబగు స్వప్నంబుఁ
గంటిని.

అహం రామోఽథవా రాజా లక్ష్మణో వా మరిష్యతి. ౧౭

నరో యానేన య స్స్వప్నే ఖరయుక్తేన యాతి హి,
అచిరా త్తస్య ధూమాగ్రం చితాయాం సంప్రదృశ్యతే. ౧౮

ఏతన్నిమిత్తం దీనోఽహం త న్నవః ప్రతిపూజయే,
శుష్యతీవ చ మే కణ్ఠో న స్వస్థ మివ మే మనః. ౧౯

న పశ్యామి భయస్థానం భయం చైవోపధారయే,
భ్రష్టశ్చ స్వరయోగో మే ఛాయా చోపహతా మమ. ౨౦

జుగుప్సన్నివ చాఽత్మానం న చ పశ్యామి కారణమ్,

ఇమాం హి దుస్స్వప్నగతిం నిశామ్య తా
మనేకరూపామవితర్కితాం పురా. ౨౧
భయం మహ త్తద్ధృదయా న్నయాతి మే
విచిన్త్య రాజాన మచిన్త్యదర్శనమ్.

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే ఏకోనసప్తతితమస్సర్గః.

## సప్తతితమస్సర్గః

భరతే బ్రువతి స్వప్నం దూతా స్తే క్లాన్తవాహనాః,
ప్రవిశ్యాసహ్యపరిఖం రమ్యం రాజగృహం పురమ్. ౧
సమాగమ్య తు రాజ్ఞా చ రాజపుత్త్రేణ చార్చితాః,
రాజ్ఞః పాదౌ గృహీత్వా తు త మూచు ర్భరతం వచః. ౨

ఇట్లు స్వప్నంబు గంటిఁ గావున నాకైనను రామునకైనను నాతండ్రి దశరథునకైనను లక్ష్మణునకైనను మరణంబు గల్గును. ౧౭

స్వప్నంబున నెవ్వఁడు గాడిదలుగట్టినరథంబు నెక్కి పోయినట్లు గనుపడునో అతఁడు శీఘ్రంబున మృతినొంది చితియం దతనిదేహధూమము చూడనగును. ౧౮

ఈకారణమువలన నేను దుఃఖితుఁడనై యుంటినిగాఁబట్టి మిమ్ముల నాదరింపనైతిని. నాకంఠము ఎండుచున్నది. నామనసున నొంతమాత్రము సుఖంబు లేకున్నది. ౧౯

భయంబుగలుగుట కేమియుఁ గారణంబుఁ గానము. అయినను నామనసున కిప్పుడు నిష్కారణముగా భయంబు గలుగుచున్నది. నాకంఠధ్వనియుం నశించినది. నాదేహంబును దెల్లఁబాఱి యున్నది. ౨౦

ఏమో నన్ను నేనే నిందించుకొనుచున్నాను. కారణమేమో తెలియలేదు.

అనేక రూపమయినదియుం నిదివఱ కెప్పుడును దలంపనిదియునగు నీదుస్స్వప్నంబును జూచి బహుసారంబునకున్న దశరథమహారాజుం దలంచుకొని నామనంబునకు మహాభయంబు గలుగుచున్నది. అని భరతుఁడు దుస్స్వప్నవృత్తాంతమును దనప్రియసఖునకుం జెప్పెను. ౨౧

ఇది యఱువదితొమ్మిదవ సర్గము.

---

## డెబ్బదవసర్గము

ఇట్లు భరతుఁడు దుస్స్వప్నవృత్తాంతమును జెప్పుచుండఁగా వే శ్రాంతవాహనులగు నాదూతలు శత్రువులకు దాఁటరాని యగడ్తలుగల రమణీయంబగు నారాజగృహపట్టణంబుఁ బ్రవేశించి కేకయమహారాజును రాజపుత్రుఁడగు యుధాజిత్తు నెదుర్కొని నేయుమన్నవలు గైకొని కేకయమహారాజు పాదంబులకు నమస్కరించి యంత భరతునొద్దకుఁ బోయి యతనితో నిట్లని చెప్పిరి. ౧

పురోహిత స్త్వాం కుశలం ప్రాహ సర్వే చ మన్త్రిణః,
త్వరమాణ శ్చ నిర్యాహి కృత్య మాత్యయికం త్వయా. ౩

ఇమాని చ మహార్హాణి వస్త్రాణ్యాభరణాని చ,
పరిగృహ్య విశాలాక్ష! మాతులస్య చ దాపయ!. ౪

అత్ర వింశతికోట్య స్తు నృపతే ర్మాతులస్య తే,
దశకోట్య స్తు సంపూర్ణా స్తథైవ చ నృపాత్మజ!. ౫

ప్రతిగృహ్య తు తత్సర్వం స్వనురక్త స్సుహృజ్జనే,
దూతా నువాచ భరతః కామై స్సమ్ప్రతిపూజ్య తాన్. ౬

కచ్చి త్సుకుశలీ రాజా పితా దశరథో మమ!,
కచ్చిచ్చారోగతా రామే లక్ష్మణే చ మహాత్మని. ౭

ఆర్యా చ ధర్మనిరతా ధర్మజ్ఞా ధర్మదర్శినీ,
అరోగా చాపి కౌసల్యా మాతా రామస్య ధీమతః!. ౮

కచ్చి త్సుమిత్రా ధర్మజ్ఞా జననీ లక్ష్మణస్య యా,
శత్రుఘ్నస్య చ వీరస్య సాఽరోగా చాపి మధ్యమా!. ౯

ఆత్మకామా సదా చణ్డీ క్రోధనా ప్రాజ్ఞమానినీ,



పురోహితుఁడగు వసిష్ఠుఁడు నీతో క్షేమంబుఁ జెప్పుచున్నాఁడు. ఇట్లు మంత్రులందఱును నీతో క్షేమంబుఁ జెప్పుచున్నారు. నీవు వేగముగా రావలయును. నీవు ఒక యతిముఖ్యమైనకార్యమును జేయవలసి యున్నది. ౩

విశాలంబులగు కండ్లుగల భరతుఁడా! శ్రేష్ఠంబులగు నీవస్త్రంబులను దివ్యాభరణంబులనుఁ దీసి నీమాతామహునకును మేనమామకును ఇప్పించుము. ౪

రాచకొమరుఁడవగు భరతుఁడా! ఇందు నీమాతామహుఁడగు కేకయమహారాజున కివ్వఁదగినవస్త్రాభరణంబులు సరిగా నిఱువదికోటులు వెలగలవి. అట్లే నీమేనమామకు ఇవ్వఁదగినవి తక్కువలేక పదికోటులధనము వెలగలవి. కావున నీవే యివ్వవచ్చును. అని దూతలు భరతునితోఁ జెప్పిరి. ౫

బంధుజనులయందు మిక్కిలియు ననురాగముగల భరతుఁడు వాని నన్నింటిని దీసికొని మాతామహునకును మాతులునకు నొసంగి యాదూతలను యథేష్టధనాదులం దనిపి యంత వారలంజూచి యిట్లని చెప్పెను. ౬

నాతండ్రి దశరథమహారాజు క్షేమంబుగ నున్నాఁడా యేమి! మఱియు రాముఁడును మహాత్ముఁడగు లక్ష్మణుఁడును ఆరోగ్యముగలిగి యున్నారా యేమి ? ౭

బుద్ధిమంతుఁడగు రామునితల్లియుఁ బూజ్యురాలును ధర్మమునం దత్యాసక్తురాలును ధర్మజ్ఞయును ప్రజలయందు గుణమును మాత్రమె గ్రహించునదియు నగు కౌసల్యాదేవియు నారోగ్యంబు గలిగి యున్నదా యేమి! ౮

లక్ష్మణునకును వీరుఁడగు శత్రుఘ్నునకును జననియును ధర్మజ్ఞురాలును మధ్యమాంబయునగు సుమిత్రాదేవి యారోగ్యంబు గలిగియున్నదా యేమి ? ౯

స్వప్రయోజనపరయును భయంకరురాలును గోపిష్ఠురాలును దనకేమియుఁ

జలియకపోయినను దన్నుఁ బండితురాలనుగాఁ దలంచుకొని గర్వించి యున్నదియును నగు నాతల్లి కైకేయి క్షేమంబుగ నున్నదాయేమి ? మఱియు, మీరు తనబంధువుల యొద్దకు వచ్చునప్పుడు ఆబిడ యేమిసమాచారముఁ జెప్పెనది? అని భరతుఁడు దూతల నడిగెను. ౧౦

ఆదూతలు మహాత్ముఁడగు భరతుఁడు చెప్పినమాటను విని యప్పుడా భరతుం జూచి సవినయంబుగా నీమాటం జెప్పిరి. ౧౧

పురుషశ్రేష్ఠుఁడవగు భరతుఁడా ! నీ వెవ్వరికుశలంబుఁ గోరుదువో వారలందఱు క్షేమంబుగ నున్నారు.

పద్మహస్తయగు లక్ష్మి నిన్ను వరించుచున్నది. శీఘ్రముగా రథం బాయత్తంబు సేయింపుము. అని ఆదూతలు భరతునితోఁ జెప్పిరి. ౧౨

భరతుఁడును ఆదూతలు చెప్పినది విని వారలం జూచి యిట్లని చెప్పెను.

నేను "దూతలు వచ్చి నన్ను శీఘ్రముగా రమ్మని పిలుచుచున్నా" రని కేకయమహారాజుతోఁ జెప్పి వచ్చెదను. అని భరతుఁడు దూతలతోఁ జెప్పెను. ౧౩

రాచకొమరుఁడగు భరతుఁడు ఇట్లు దూతలకుం జెప్పి దూతలచేఁ బ్రేరింపఁబడినవాఁడై మాతామహుఁడగు కేకయమహారాజునొద్దకుఁ బోయి యిట్లని చెప్పెను. ౧౪

కేకయమహారాజా! నాతండ్రియొద్దనుండి దూతలువచ్చి నన్నుఁబిలుచుచున్నారు. కావున నేను నాతండ్రియొద్దకుఁ బోయెదను. మరల నీ వెప్పుడు స్మరింతువో అప్పుడు వచ్చెదను. అని భరతుఁడు కేకయమహారాజుతోఁ జెప్పెను. ౧౫

అప్పుడు కేకయమహారాజు భరతుఁడు చెప్పినది విని రఘువంశంబునం బుట్టిన యాభరతునిం గవుఁగిలించుకొని శిరంబు మూర్కొనిమంగళకరంబగు నీమాటం జెప్పెను. ౧౬

శత్రువులం దపింపఁజేయునట్టి భరతుఁడా ! యథేష్టంబుగాఁ బొమ్ము.

మాతరం కుశలం బ్రూయాః పితరం చ పరన్తప!. ౧౭

పురోహితం చ కుశలం యే చాన్యే ద్విజసత్తమాః,
తౌ చ తాత! మహేష్వాసౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ. ౧౮

తస్మై హస్త్యుత్తమాం శ్చిత్రా న్కమ్బలా నజినాని చ,
అభిసత్కృత్య కైకేయో భరతాయ ధనం దదౌ. ౧౯

రుక్మనిష్కసహస్రే ద్వే షోడశాశ్వశతాని చ,
సత్కృత్య కైకయీపుత్త్రం కేకయో ధన మాదిశత్. ౨౦

తథాఽమాత్యా నభిప్రేతా న్విశ్వాస్యాం శ్చ గుణాన్వితాన్,
దదా వశ్వపతిః క్షిప్రం భరతా యానుయాయినః. ౨౧

ఐరావతా నైన్ద్రశిరా న్నాగా న్వై ప్రియదర్శనాన్,
ఖరా ఞ్ఛీఘ్రా న్సుసంయుక్తా న్మాతులోఽస్మై ధనం దదౌ. ౨౨

అన్తఃపురేఽతిసంవృద్ధా న్వ్యాఘ్రవీర్యబలాన్వితాన్.
దంష్ట్రాఽఽయుధా న్మహాకాయా ఞ్ఛున శ్చోపాయనం దదౌ.

స దత్తం కేకయేన్ద్రేణ ధనం త న్నాభ్యనన్దత,
భరతః కైకయీపుత్త్రో గమనత్వరయా తదా. ౨౪

జ్ఞ ననుజ్ఞ నొసంగెదవు. నీచే గైకేయి సత్పుత్రుఁడు గలదైనది. నీతల్లి కైకేయికిని నీతండ్రి దశరథమహారాజునకును క్షేమంబుఁ జెప్పుము. ౧౮

పురోహితుఁడగు వసిష్ఠునితోను మఱియు నితరులగు బ్రాహ్మణశ్రేష్ఠులెవ్వరు గలరో వారలతోను మహాధనుర్ధరులగు నన్నదమ్ములు రామలక్ష్మణులతోను క్షేమంబుఁ జెప్పుము. అని కేకయమహారాజు భరతునితోఁ జెప్పెను.

కేకయమహారాజు ఆభరతునకు సాదరంబుగా నుత్తమ మత్తగజంబులను జిత్రంబులగు కంబళములను శ్రేష్ఠంబులగు నజినంబులను అధికమగు ధనమును నొసంగెను. ౧౯

కేకయమహారాజు కైకేయీకుమారుఁడగు భరతునిం బూజించి యతనికి బంగారుకంఠహారంబులు రెండువేలును బదునాఱువంద లుత్తమాశ్వంబులును అధికంబగు ధనంబును ఇచ్చెను. ౨౦

కేకయమహారాజు మఱియు నాభరతునకు సమర్థులును నమ్మఁదగినవారలును గుణవంతులును యుద్ధంబున నొంతమాత్రమును వెనుదీయక తమప్రభువుతోఁ గూడఁ బ్రాణంబులు విడుచువారలునగు వీరులను సహాయులుగా నొసంగెను. ౨౧

ఆభరతుని మేనమామయగు యుధాజిత్తు ఆతనికి చూపరులకు సంతోషంబుగల్గించునట్టి యిరావత్పర్వతోద్భవంబులగు గజంబులను ఐంద్రశిరపర్వతజాతంబులగు వేసంగులను వేగంబుగలవియు భారములు మోయుంటయందు మిక్కిలియు నభ్యాసంబు గలవియునగు గాడిదలను అధికధనంబును ఇచ్చెను. ౨౨

మఱియు నాయుధాజిత్తుభరతునకు అంతఃపురంబునఁ బెంచఁబడినవియుఁ బెద్దపులులకుం బోలె బలపరాక్రమంబులు గలవియు దంతంబులె యాయుధంబులుగాఁ గలవియు మహాకాయంబులు నగు కుక్కలను గానుకగా నొసంగెను. ౨౩

అప్పుడు కైకేయీకుమారుఁడగు భరతుఁడు ప్రయాణమునందలి తొందరచేతఁ గేకయమహారాజు తన కంతధనం బొసంగినందుకు సంతోషింపఁ డయ్యె. ౨౪

అప్పుడు దూతలు తొందరపడుటవలనను దుస్స్వప్నంబు గనియుండుటవలనను ఏమో యనర్థము సంభవించియున్నదని యతఁడు మనంబున మిక్కిలియుఁ జింతిల్లుచుండెను. ౨౫

శ్రీమంతుఁడగు నాభరతుఁడు జనులచేతను ఏనుఁగులచేతను గుఱ్ఱంబులచేతనుం బరివేష్టింపఁబడియున్న యతివిశాలోన్నతంబగు తనగృహంబుననుండి వెడలి యంత నుత్తమంబగు రాజమార్గంబు నొందెను. ౨౬

అంత మహాబుద్ధిశాలియగు భరతుఁడు ఆరాజమార్గంబు దాఁటి యంతఃపురంబునొద్దకుఁ బోయెను.

అటుపిమ్మట శ్రీమంతుఁడగు భరతుఁడు అడ్డములేక ఆయంతఃపురమునం బ్రవేశించెను. ౨౭

ఆభరతుఁడు శత్రుఘ్నునిం గూడి తాతయగు కేకయమహారాజును మేనమామయగు యుధాజిత్తును వీడ్కొని రథంబు నెక్కి పయనంబై పోయెను. ౨౮

అంత భృత్యులు మంచిచక్రంబులుగల పెక్కునూఱులు రథంబులం దోలుకొని యొంటెలతోను గోవులతోను గుఱ్ఱములతోను సైన్యంబులతోనుం గూడ పయనంబై పోవు భరతుని వెంబడించిరి. ౨౯

మహాత్ముఁడగు భరతుఁడు మాతామహునిసైన్యముచే రక్షింపఁబడుచు శత్రుఘ్నునిం దీసికొని తనకుంబోలెఁ బరాక్రమంబుగల మహావీరులం గూడి స్వర్గంబుననుండి సిద్ధుఁడు వెడలునట్లు గృహంబుననుండి వెడలెను. ౩౦

ఇది డెబ్బదియవసర్గము.

---

## డెబ్బదియొకటవసర్గము

అంత రఘువంశంబునం బుట్టినవాఁడును శ్రీమంతుఁడును గాంతిమంతుఁడును ఇక్ష్వాకువంశంబునఁ బుట్టినవారల సంతోషింపఁజేయువాఁడు.

హ్లాదినీం దూరపారాం చ ప్రత్యక్స్రోతస్తరఙ్గిణీమ్,
శతద్రూమతర చ్ఛ్రీమా న్నదీ మిక్ష్వాకునన్దనః.

ఏలాధానే నదీం తీర్త్వా ప్రాప్య చాపరపర్వటాన్,
శిలా మాకుర్వతీం తీర్త్వా ఆగ్నేయం శల్యకర్తనమ్.
సత్యసన్ధ శ్శుచి శ్శ్రీమా న్ప్రేక్షమాణ శ్శిలావహామ్,
అత్యయా త్స మహాశైలా న్వనం చైత్రరథం ప్రతి.
సరస్వతీం చ గఙ్గాం చ యుగ్మేన ప్రతిపద్య చ,
ఉత్తరా న్వీరమత్స్యానాం భారుణ్డం ప్రావిశ ద్వనమ్.

వేగినీం చ కులిఙ్గాఖ్యాం హ్లాదినీం పర్వతావృతామ్,
యమునాం ప్రాప్య సన్తీర్ణో బల మాశ్వాసయ త్తదా.

శీతీకృత్య తు గాత్రాణి క్లాన్తా నాశ్వాస్య వాజినః,
తత్ర స్నాత్వా చ పీత్వా చ ప్రాయా దాదాయ చోదకమ్.

రాజపుత్త్రో మహారణ్య మనభీక్ష్ణోపసేవితమ్,
భద్రో భద్రేణ యానేన మారుతః ఖ మి వాత్యయాత్.

భాగీరథీం దుష్ప్రతరా మంశుధానే మహానదీమ్,
ఉపాయా ద్రాఘవ స్తూర్ణం ప్రాగ్వటే విశ్రుతే పురే.
స గఙ్గాం ప్రాగ్వటే తీర్త్వా సమాయా త్కుటికోష్ఠికామ్,

నగు నా భరతుండు రాజగృహపట్టణంబుననుండి తూర్పుదిక్కును బట్టిపోవుచు
సుదామనదిం జూచి దానియందంబునకు డెందంబున నానందించుచు దాంటి
యతివిశాలంబగు హ్లాదినియను నదిని దరించి పశ్చిమవాహినియుం బెక్కు
యలలు గలదియు నగు శతద్రూనదినిం దరించెను. ౧,౨

సత్యప్రతిజ్ఞుండును బరిశుద్ధుండును శ్రీమంతుండునగు నా భరతుండు
ఏలాధానగ్రామమున శతద్రూనదిం దరించి యపరపర్వటదేశంబు నొంది శిలా
కర్షణస్వభావమగు శిలావహానదిని దాంటి యాగ్నేయంబను శల్యకర్తనంబను
గ్రామంబులు శిలావహానదినిం జూచుచుం జైత్రరథవనంబుం జూచుకొనుచుకం
బున మహాపర్వతంబుల నతిక్రమించి పోయెను. ౩,౪

ఆభరతుం డంత సరస్వతీనదిని మఱియొకనదిని నొక్కచోటం బొందించి
వీరమత్స్యదేశంబుల కుత్తరంబున నుండు భారుండంబను వనంబుం బ్రవేశిం
చెను. ౫

ఆభరతుండు అతివేగంబుగలదియుం జూపరులకు సంతోషంబు గలిగిం
చునదియుం బర్వతంబులచేఁ బరివేష్టింపఁబడినదియు నగు కుళింగయను నదిని
యమునానదినిం బొంది సంతరించి యంత సైన్యంబును గొంచెము విశ్ర
మింపఁజేసెను. ౬

ఆ కుళింగాయమునాసంగమస్థలంబునందు గుఱ్ఱంబుల యలసటఁదీర్చి,
నీళ్లు వేసి తోమించి తానును అచ్చట స్నానంబుఁజేసి జలంబుఁ ద్రావి యిఁక
ముందు నీళ్లు దొరకవు కావున జలంబు సంగ్రహించుకొని పోయెను. ౭

మంగళాకారుండగు భరతుండు భద్రజాతీయంబగు గజంబు నెక్కి
యెచ్చగా జనసంచారము లేని యామహారణ్యమును వాయువు ఆకాశము
నతిక్రమించునట్లు దాఁటిపోయెను. ౮

అంత భరతుండు ప్రాగ్వటపట్టణంబునందు అంశుధానంబను ప్రదేశ
మున సాధారణముగా దాఁట నలవిగాని గంగానదిని బొందెను. ౯

ఆభరతుండు ప్రాగ్వటంబను పురముసమీపంబున గంగానదిని దాఁటి
కుటికోష్ఠిక యను నదిం బొందెను.

సబల స్తాం స తీర్త్వాఽథ సమాయా ద్ధర్మవర్ధనమ్. ౧౦

తోరణం దక్షిణార్ధేన జమ్బూప్రస్థ ముపాగమత్,

వరూథం చ యయౌ రమ్యం గ్రామం దశరథాత్మజః. ౧౧

తత్ర రమ్యే వనే వాసం కృత్వాఽసౌ ప్రాఙ్ముఖో యయౌ,
ఉద్యాన ముజ్జిహానాయాః ప్రియకా యత్ర పాదపాః. ౧౨

సాలాం స్తు ప్రియకా న్ప్రాప్య శీఘ్రా నాస్థాయ వాజినః,
అనుజ్ఞా ప్యాథ భరతో వాహినీం త్వరితో యయౌ. ౧౩

వాసం కృత్వా సర్వతీర్థే తీర్త్వా చోత్తానికాం నదీమ్,
అన్యా నదీశ్చ వివిధాః పార్వతీయై స్తురఙ్గమైః. ౧౪
హస్తిపృష్ఠక మాసాద్య కుటికా మత్యవర్తత,

తతార చ నరవ్యాఘ్రో లౌహిత్యే స కపీవతీమ్. ౧౫

ఏకసాలే స్థాణుమతీం వినతే గోమతీం నదీమ్,
కలిఙ్గనగరే చాపి ప్రాప్య సాలవనం తదా. ౧౬
భరతః క్షిప్ర మాగచ్ఛ త్సుపరిశ్రాన్తవాహనః,

వనం చ సమతీత్యాఽఽశు శర్వర్యా మరుణోదయే. ౧౭
అయోధ్యాం మనునా రాజ్ఞా నిర్మితాం సందదర్శ హ,

ఆభరతుఁడు సైన్యంబుతోఁగూడ నాకుటికోష్ఠినదిని దాఁటి యంత ధర్మవర్ధనంబను గ్రామముఁ జేరెను. ౧౦

ఆభరతుఁడు తోరణగ్రామంబుఁ జేరి దానికి దక్షిణపుతట్టుగాఁ బోయి జంబూప్రస్థంబను గ్రామంబు నొందెను.

దశరథకుమారుఁడగు భరతుఁడు అంత సుందరంబగు వరూథమను గ్రామంబు నొందెను. ౧౧

అంత భరతుఁడు ఆవరూథగ్రామసమీపంబున నుండు మనోహరంబగు వనంబున వాసంబుఁ జేసి యంతఁ దూర్పుమొగమై యెచ్చుగాఁ గదంబ వృక్షములు గల యుజ్జిహానానగరి యుద్యానవనంబుఁ జేరెను. ౧౨

భరతుఁడు ఉజ్జిహానానగరిచెంతనుండు కదంబవృక్షంబులం జేరినంతనె యింక నంతమీఁద నంతయుం స్వదేశంబుగావున నిర్భయంబుగా మెల్లగా రండని సేనకుం జెప్పి యంత వేగవంతంబులగు గుఱ్ఱంబులుగట్టిన రథంబు నారోహించి వేగంబునం బోయెను. ౧౩

ఆభరతుఁడు సర్వతీర్థమను గ్రామంబున వాసంబుఁగావించి యుత్తానికానదిని ఇంక నితరములగు నదులను బర్వతదేశసంచారయోగ్యంబులగు గుఱ్ఱంబులుగట్టిన రథంబుచేతనె దాఁటి యంతఁ గుటికానదిని మాత్రము ఏనుఁగుపై నుండి దాఁటెను. ౧౪

పురుషశ్రేష్ఠుఁడగు నాభరతుఁడు లౌహిత్యనగరమునందుఁ గపీవతీ నదిని దాఁటెను. ౧౫

భరతుఁడు ఏకసాలగ్రామంబున స్థాణుమతీనదిని దాఁటి వినతనగరంబున గోమతీనదిం దరించి, యంత గుఱ్ఱంబు లలసటనొందుటవలనఁ గళింగనగర సమీపంబుననున్న సాలవనంబునం గొంత విశ్రమించి, యంత శీఘ్రముగాఁ బోయెను. ౧౬

ఆభరతుఁడు రాత్రియందు శీఘ్రంబున నాసాలవనం బతిక్రమించి యంత నరుణోదయకాలంబున వైవస్వతమనువుచే నిర్మింపఁబడిన యయోధ్యానగరముఁ గనెను. ౧౭

తాం పురీం పురుషవ్యాఘ్రి స్సప్తరాత్రోషితః పథి. ౧౮
అయోధ్యా మగ్రతో దృష్ట్వా సారథిం వాక్య మబ్రవీత్,
ఏషా నాతిప్రతీతా మే పుణ్యోద్యానా యశస్వినీ. ౧౯
అయోధ్యా దృశ్యతే దూరా త్సారథే! పాణ్డుమృత్తికా,
యజ్వభి ర్గుణసమ్పన్నై ర్బ్రాహ్మణై ర్వేదపారగైః ౨౦
భూయిష్ఠ మృద్ధైరాకీర్ణా రాజర్షిపరిపాలితా,

అయోధ్యాయాం పురా శబ్ద శ్శ్రూయతే తుములో మహాన్,
సమన్తా న్నరనారీణాం త మద్య న శృణోమ్యహమ్,

ఉద్యానాని చ సాయాహ్నే క్రీడి త్వోపరతై ర్నరైః. ౨౨
సమన్తా త్పరిధావద్భిః ప్రకాశ న్తే మమాన్యథా,

తాన్య ద్యానురుద న్తీవ పరిత్యక్తాని కామిభిః. ౨౩

అరణ్యభూతేవ పురీ సారథే! ప్రతిభాతి మే,
న హ్యత్ర యానై ర్దృశ్యన్తే న గజై ర్న చ వాజిభిః. ౨౪
నిర్యాన్తో వాఽభియాన్తో వా నరముఖ్యా యథాపురమ్,

ఉద్యానాని పురా భాన్తి మత్తప్రముదితాని చ. ౨౫
జనానాం రతిసంయోగే ష్వత్యన్తగుణవన్తి చ,

పురుషశ్రేష్ఠుఁడగు భరతుఁడు అట్లు ఏడురాత్రులు దాఁటి నడచి యంతం దనముందట నున్న యయోధ్యఁజూచి సారథితో నిట్లని చెప్పెను. ౧౮

సారథీ! పుణ్యంబులగు నుద్యానంబులు గలదియు నధికంబగు కీర్తిగల జనులు గలదియుఁ దెల్లనిమృత్తిక గలదియు యాగంబులు సేయువారలును గుణవంతులును వేదవేత్తలును సర్వసమృద్ధులు నగు బ్రాహ్మణులతో నొప్పుచున్నదియు రాజర్షియగు దశరథునిచేఁ బాలింపఁబడుచున్నదియు నగు నీ యయోధ్యాపట్టణము దూరంబుననుండి యగపడుచున్నది. అందలిజనులు అంత సంతోషంబుతో నున్నట్లు తోఁచదు. ౧౯,౨౦

మున్న యయోధ్యయందు నలుప్రక్కలను స్త్రీలను బురుషులును జేయు మహాధ్వని తుములంబుగా వినవచ్చుచుండును. నాకిప్పు డాధ్వని వినరాకున్నది. ౨౧

మున్ను కాముకులగు జనులు రాత్రికాలంబుల నుద్యానవనములకు వచ్చి యథేష్టంబుగాఁ గ్రీడించి ప్రాతఃకాలం బయినంతనె వారివారియిండ్లకుం ద్వరత్వరగాఁ బోవుచుండఁగా నాయుద్యానవనంబు లప్పుడొకవిధంబుగాఁ బ్రకాశించుచుండినవి. ౨౨

ఇప్పు డాయుద్యానవనంబులు కాముకు లెవ్వరును లేకుండుటం జేసి యేడ్చిన ట్లున్నవి. ౨౩

సారథీ! అయోధ్యయంతయు నరణ్యం బయినట్లు నాకగపడుచున్నది.

మునుపువలె జనులలో ముఖ్యులగు వారలు రథంబుల నధిష్ఠించియు, నేనుంగుల నెక్కియు, గుఱ్ఱంబుల నారోహించియు, పట్టణంబుననుండి వెడలువారలు గాని, పట్టణంబుఁ బ్రవేశించువారలుగాని యెవ్వరు నగుపడ లేరు గదా! ౨౪

మున్ను ఉద్యానవనంబులు మదించి మధురంబుగాఁ గూయుచుండు కోయిలలు మొదలగు పక్షులతో నొప్పుచుఁ జక్కఁగాఁ బ్రకాశించి యుండుటం జేసి సంతోషంబు నొందినట్లు చూపట్టుచు సురతక్రీడలకై యేతెంచు

తాన్యేతా న్యద్య పశ్యామి నిరానన్దాని సర్వశః. ౨౬
స్రస్తపర్ణై రనుపథం విక్రోశద్భి రివ ద్రుమైః,
నాద్యాపి శ్రూయతే శబ్దో మత్తానాం మృగపక్షిణామ్. ౨౭
సంరక్తాం మధురాం వాణీం కలం వ్యాహరతాం బహు,
చన్దనాగరుసంపృక్తో ధూపసమ్మూర్ఛితోఽతులః. ౨౮
ప్రవాతి పవన శ్శ్రీమా న్కిన్ను నాద్య యథాపురమ్,
భేరీమృదఙ్గవీణానాం కోణసఙ్ఘట్టితః పునః. ౨౯
కి మద్య శబ్దో విరత స్సదా దీనగతిః పురా,
అనిష్టాని చ పాపాని పశ్యామి వివిధాని చ. 3౦
నిమిత్తా న్యమనోజ్ఞాని తేన సీదతి మే మనః,
సర్వథా కుశలం సూత! దుర్లభం మమ బన్ధుషు. 3౧
తథా హ్యసతి సమ్మోహే హృదయం సీదతీవ మే,

విషణ్ణ శ్శ్రాన్తహృదయ స్త్రస్త స్సంలులితేన్ద్రియః. 3౨
భరతః ప్రవివేశాఽశు పురీ మిక్ష్వాకుపాలితామ్,

ద్వారేణ వైజయన్తేన ప్రావిశచ్ఛ్రాన్తవాహనః. 33
ద్వాః స్థైరుత్థాయ విజయం పృష్ట స్తై స్సహితో యయౌ,

కాముకులకు మిక్కిలియు నుపయుక్తంబులును యొంతయుఁ బ్రకాశించుచుండినవి. ౨౬

అట్టియీయుద్యానవనంబులు ఇప్పుడు దారికి సమీపమున నాకులన్నియు నేల రాలి యెండుచున్నట్లున్న వృక్షంబులతో నిరానందములై యున్నవి.

సూర్యోదయమయినను మృగములును బక్షులును యథేష్టాహారంబుల మదించి మిక్కిలియు మధురంబుగా ధ్వనింపకున్నవి. ౨౭

మునుపువలె చందనధూపసుగంధంబులు గుబాళించుగాలి యిప్పుడేల వీవకున్నది? ౨౮

మున్ను ఎడతెగక గంభీరంబుగా వినవచ్చుచుండు భేరీమృదంగవీణాదుల వాద్యంబులధ్వని యిప్పుడు వినరాకున్న దేమి? ౨౯

అనిష్టసూచకంబులును క్రూరంబులును దర్శనమాత్రంబున దుఃఖంబు గలిగించునవియు నగు నశుభనిమిత్తంబు లనేకంబులు కనుపడుచున్నవి. అందువలన నామనంబునకు దుఃఖంబు గలుగుచున్నది. ౩౦

సారథీ! దుఃఖంబు గలుగుటకుఁ గారణంబు లేకున్నను నామనసునకు దుఃఖంబు గలుగుచున్నది. కావున నేవిధంబుననైనను, నాబంధువులకుఁ గష్టము ప్రాప్తించియుండునని తోఁచుచున్నది. అని భరతుఁడు సారథితోఁ జెప్పెను. ౩౧

అట్లు భరతుఁడు దుఃఖితుఁడును గలుషితహృదయుఁడును భీతుఁడును వ్యాకులతనొందిన యింద్రియంబులు గలవాఁడునై, యిక్ష్వాకువంశజాతులగు రాజులచేఁ బాలితంబగు నాయయోధ్యాపట్టణంబును శీఘ్రంబుగాఁ బ్రవేశించెను. ౩౨

అప్పుడు దూరగమనంబునం జేసి యలసట నొందిన గుఱ్ఱంబులు గల భరతుఁడు వైజయంతంబను ద్వారంబునఁ బట్టణంబుఁ బ్రవేశించెను. అంత నచ్చటనున్న ద్వారపాలురు దిగ్గున లేచి విజయం బడిగి తన్ను వెంబడింప వారలతోఁగూడం బోయెను. ౩౩

స త్వనేకాగ్రహృదయో ద్వార్ స్థం ప్రత్యర్చ్య తం జనమ్. 34
సూత మశ్వపతేః కా న్త మబ్రవీ త్తత్ర రాఘవః,

కి మహం త్వరయాఽఽనీతః కారణేన వినాఽనఘ !. 35
అశుభాశఙ్కి హృదయం శీలం చ పతతీవ మే,

శ్రుతా నో యాదృశాః పూర్వం నృపతీనాం వినాశనే. 36
ఆకారాం స్తా నహం సర్వా నిహ పశ్యామి సారథే !,

సమ్మార్జనవిహీనాని పరుషాణ్యుపలక్షయే. 37
అసంయతకవాటాని శ్రీవిహీనాని సర్వశః,
బలికర్మవిహీనాని ధూపసమ్మోదనేన చ. 38
అనాశితకుటుమ్బాని ప్రభాహీనజనాని చ,
అలక్ష్మీకాని పశ్యామి కుటుమ్బిభవనా న్యహమ్. 39
అపేతమాల్యశోభాని హ్యసమ్మృష్టాజిరాణిచ,
దేవాగారాణి శూన్యాని న చాభా న్తి యథాపురమ్. 40

దేవతార్చాః ప్రవిద్ధా శ్చ యజ్ఞగోష్ఠ్య స్తథావిధాః,
మాల్యాపణేషు రాజ న్తే నాద్య పణ్యాని వా తథా. 41
దృశ్య న్తే వణిజోఽప్యద్య న యథాపూర్వ మత్ర వై,
ధ్యాన సంవిగ్నహృదయా నష్టవ్యాపారయ న్త్రితాః. 42

దేవాయతనచైత్యేషు దీనాః పక్షిగణా స్తథా,

మలినం చాశ్రుపూర్ణాక్షం దీనం ధ్యానపరం కృశమ్. 43

సస్త్రీపుంసం చ పశ్యామి జన ముత్కణ్ఠితం పురే,

ఇత్యేవ ముక్త్వా భరత స్సూతం తం దీనమానసః. ౪౪
తాన్యనిష్టాన్యయోధ్యాయాం ప్రేక్ష్య రాజగృహం యయౌ,

తాం శూన్యశృఙ్గాటకవేశ్మరథ్యాం
రజోఽరుణద్వారకవాటయన్త్రామ్. ౪౫
దృష్ట్వా పురీమిన్ద్రపురప్రకాశాం
దుఃఖేన సంపూర్ణతరో బభూవ,
బహూని పశ్య న్మనసోఽప్రియాణి
యా న్యన్యదా నాస్య పురే బభూవుః. ౪౬
అవాక్ఛిరా దీనమనా న హృష్టః
పితు ర్మహాత్మా ప్రవివేశ వేశ్మ.

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే ఏకసప్తతితమస్సర్గః.

---

## ద్విసప్తతితమస్సర్గః

అపశ్యం స్తు తత స్తత్ర పితరం పితు రాలయే,
జగామ భరతో ద్రష్టుం మాతరం మాతు రాలయే. ౧

అనుప్రాప్తం తు తం దృష్ట్వా కైకేయీ ప్రోషితం సుతమ్,
ఉత్పపాత తదా హృష్టా త్యక్త్వా సౌవర్ణ మాసనమ్. ౨

స ప్రవిశ్యైవ ధర్మాత్మా స్వగృహం శ్రీవివర్జితమ్,
భరతః ప్రతిజగ్రాహ జనన్యా శ్చరణౌ శుభౌ. 3

నింత నీళ్లుగాఱ దుఃఖితులయి చింతించుచుఁ గృశించి తహతహపడుచున్నారు. అని భరతుఁడు సారథితోఁ జెప్పెను. ౪౩

అట్లు భరతుఁడు అయోధ్యాపురియం దాయనిష్ట నిమిత్తంబులం జూచి దుఃఖితుఁడై సారథిం జూచి యీప్రకారము చెప్పి దశరథమహారాజు గృహమునకుం బోయెను. ౪౪

ఆభరతుఁడు పాడుపడియున్న చదుకంబులతోను గృహంబులతోను రాజమార్గంబులతోను చిమ్ముట లేకుండుటవలనఁ బరాగము దగులుటచే నెఱ్ఱనై యుండు ద్వారకవాటదారుబంధంబులతోను బోలుపజెయున్న యమరావతీసమానంబగు నాయయోధ్యాపట్టణంబుఁ జూచి పరమదుఃఖితుఁ డయ్యెను. ౪౫

మహాత్ముఁడగు భరతుఁడు ఇదివఱ కెప్పుడును అయోధ్యాపట్టణంబునందుఁ గలుగని యప్రియంబులఁ బెక్కులం గని తండ్రియొద్దకు వచ్చి వానిని సంతోషంబు లేక పరమదుఃఖితుఁడై తలవాంచి తండ్రియింటికిఁ బోయెను. ౪౬

ఇది డెబ్బదియొకటవసర్గము.

---

## డెబ్బదిరెండవసర్గము

అంత భరతుఁ డచ్చటఁ దండ్రియింటఁ దండ్రిం గానక తల్లిం జూచుటకై తల్లిగారియింటికిం బోయెను. ౧

కైకేయి యప్పుడు దూరదేశంబునకుఁ బోయియుండిన తనకొడుకు భరతుఁడు వచ్చుటను జూచినంతనె పరమసంతోషంబు నొంది కనకమయసింహాసనంబుననుండి లేచెను. ౨

ధర్మాత్ముఁడగు నాభరతుండు కాంతివిహీనంబై యున్న తనతల్లియింటికిం బోయినంతనె మంగళకరంబులగు తనతల్లిచరణంబులకు నమస్కరించెను. ౩

సా తం మూర్ధన్యుపాఘ్రాయ పరిష్వజ్య యశస్వినమ్,
అఙ్కే భరత మారోప్య ప్రష్టుం సముపచక్రమే. ౪

అద్య తే కతిచి ద్రాత్ర్యః చ్యుతస్యాఽఽర్యకవేశ్మనః,
అపి నాధ్వశ్రమ శ్శీఘ్రం రథేనాఽఽపతత స్తవ. ౫

ఆర్యక స్తే సుకుశలీ యుధాజి న్మాతుల స్తవ,
ప్రవాసా చ్చ సుఖం పుత్త్ర! సర్వం మే వక్తు మర్హసి. ౬

ఏవం పృష్ట స్తు కైకేయ్యా ప్రియం పార్థివనన్దనః,
ఆచష్ట భరత స్సర్వం మాత్రే రాజీవలోచనః. ౭

అద్య మే సప్తమీ రాత్రి శ్చ్యుతస్యాఽఽర్యకవేశ్మనః,
అమ్బాయాః కుశలీ తాతో యుధాజి న్మాతులశ్చ మే. ౮

య న్మే ధనం చ రత్నం చ దదౌ రాజా పరన్తపః,
పరిశ్రాన్తం పథ్యభవ త్తతోఽహం పూర్వ మాగతః. ౯

రాజవాక్యహరై ర్దూతై స్త్వర్యమాణోఽహ మాగతః,
య దహం ప్రష్టు మిచ్ఛామి తదమ్బా వక్తు మర్హతి. ౧౦
శూన్యోఽయం శయనీయ స్తే పర్యఙ్కో హేమభూషితః,
న చాయ మిక్ష్వాకుజనః ప్రహృష్టః ప్రతిభాతి మా. ౧౧

ఆకైకేయి యధికంబుగ కీర్తిగలయాభరతుని శిరంబు మూర్కొని యక్కునం గవుఁగిలించుకొని తనతొడపైఁ గూర్చుండఁబెట్టుకొని సమాచారంబుల నడుగ నారంభించెను. ౪

నీవు నీమాతామహునియిల్లు విడిచి యిప్పటి కెన్నిరాత్రులు గడచినవి! నీవు రథంబు నెక్కి యతివేగంబున వచ్చితివే. నీకు మార్గాయాసంబు గలుగలేదా యేమి? ౫

పుత్త్రుఁడా! పూజ్యుఁడగు నీమాతామహుఁడును మేనమామ యుధాజిత్తును క్షేమంబుగ నున్నారా! నీకును దూరదేశంబునందుంట సుఖంబుగనె యుండినదా? అంతయు నాకు సవిస్తరముగాఁ జెప్పుము. అని కైకేయి భరతు నడిగెను. ౬

రాజపుత్త్రుఁడును గమలంబులవంటి కన్నులుగలవాఁడునగు భరతుఁడు ఇట్లు కైకేయిచే సంతోషంబుగా నడుగంబడినవాఁడై యాసమాచారంబంతయుం జెప్పెను. ౭

నేను తాత యిల్లువిడిచి బయలుదేఱి యిప్పటికి ఏడురాత్రులు గడచినవి; నీతండ్రి క్షేమంబుగ నున్నాఁడు; నా మేనమామ యుధాజిత్తును క్షేమంబుగ నున్నాఁడు. ౮

శత్రుపురం దపింపఁ జేయునట్టి కేకయమహారాజు నాకొసంగిన ధనంబులను రత్నంబులను గొనివచ్చు నశ్వగజంబులును జనంబులును మార్గాయాసంబు నొందుటం జేసి వానిని గొంతవిశ్రమింపఁ బుచ్చి నేను ముందుగా వచ్చినాను. ౯

ఇచ్చటనుండి రాజు పంపినసందేశంబుఁ దెచ్చినదూతలు నన్ను వేగిరపఱచుటం జేసి నే నిచ్చటికి వచ్చినాను.

నే నడుగుదానిని నీవు నాకుఁ జెప్పవలయును. ౧౦

బంగారముచే నలంకృతంబగు నీవు పరుండుపర్యంకము పాడుపడి యున్నది. మఱియు దశరథుసంబంధిజనులు సంతోషంబు లేకుండునట్లు తోఁచుచున్నది. ౧౧

రాజా భవతి భూయిష్ఠమిహాఽమ్బాయా నివేశనే,
త మహం నాద్య పశ్యామి ద్రష్టు మిచ్ఛ న్నిహాఽఽగతః. ౧౨

పితు ర్గ్రహీష్యే చరణౌ తం మమాఽఽఖ్యాహి పృచ్ఛతః,
ఆహోస్వి దమ్బ! జ్యేష్ఠాయాః కౌసల్యాయా నివేశనే. ౧౩

తం ప్రత్యువాచ కైకేయీ ప్రియవ ద్ఘోర మప్రియమ్,
అజాన న్తం ప్రజాన న్తీ రాజ్యలోభేన మోహితా. ౧౪

యా గతి స్సర్వభూతానాం తాం గతిం తే పితా గతః,
రాజా మహాత్మా తేజస్వీ యాయజూక స్సతాంగతిః. ౧౫

తచ్ఛ్రుత్వా భరతో వాక్యం ధర్మాభిజనవా ఞ్ఛుచిః,
పపాత సహసా భూమౌ పితృశోకబలార్దితః. ౧౬

హా హతోఽ స్మీతి కృపణాం దీనాం వాచ ముదీరయన్,
నిపపాత మహాబాహు ర్బాహూ విక్షిప్య వీర్యవాన్. ౧౭

తత శ్శోకేన సంవీతః పితు ర్మరణదుఃఖితః,
విలలాప మహాతేజా భ్రాన్తాకులితచేతనః. ౧౮

ఏత త్సురుచిరం భాతి పితు ర్మే శయనం పురా,
శశినేవామలం రాత్రౌ గగనం తోయదాత్యయే. ౧౯

దశరథమహారాజు ఇచ్చట నీయింటనే యెప్పటికి నుండువాఁడని నే నాయనం జూచుటకై యిచ్చటికి వచ్చినాను. ఆయన యిచ్చట లేఁడు. అదేమి? ౧౨

అమ్మా! నేను నాతండ్రిగారి పాదంబులకు నమస్కరింపవలెను. ఆయన యెచ్చట నున్నాఁడు చెప్పుము. లేక నాపెద్దతల్లియగు కౌసల్యయింట నున్నాఁడా యేమి? అని భరతుఁడు కైకేయి నడిగెను. ౧౩

అంతఁ గైకేయి రాజ్యంబునందలి యాసచే మోహంబునొందియున్నది కావున భయంకరంబును మిక్కిలియు నప్రియంబు నగు సమాచారమును ప్రియంబని తలంచి యేమియు నెఱుంగనట్టి యాభరతుం జూచి యిట్లని చెప్పెను. ౧౪

సమస్తప్రాణులును దప్పక యేగతిం బొందుదురో మహాత్ముఁడును తేజస్వియుఁ బెక్కు యాగంబులు చేసినవాఁడును పెద్దలం బూజించువాఁడు నగు నీతండ్రి దశరథమహారాజు ఆట్టిగతిఁ బొందెను. అని కైకేయి భరతునకుం జెప్పినది. ౧౫

ధార్మికుఁడును సత్కులప్రసూతుఁడు నగు భరతుఁడు తండ్రిచావు విన్నంతనె పరమదుఃఖితుఁడై దుఃఖంబు పట్టంజాలక తటాలున నేలం బడెను. ౧౬

మహాబాహుఁడును మహాపరాక్రమశాలియు నగు నాభరతుఁడు "అయ్యో! హతుఁడ నైతినే!" యని దీనంబగుమాటం జెప్పుచు బాహువులు విదిర్చుచు నేలం బడెను. ౧౭

అంత మహాతేజుఁడగు నాభరతుఁడు తండ్రిమరణంబునకుఁ బరమ దుఃఖితుఁడై దుఃఖంబుఁ బట్టఁజాలక హృదయంబు భ్రాంతంబై వ్యాకులత నొంద రోదనంబుఁ జేసెను. ౧౮

శరదృతువునందు రాత్రికాలంబున స్వచ్ఛంబగు నాకాశంబు చంద్రునిచేఁ బ్రకాశించునట్లు మున్ను ఈనాతండ్రి శయనము ఆయనచే మిక్కిలియుఁ బ్రకాశించుచుండినది. ౧౯

తదిదం న విభాత్యద్య విహీనం తేన ధీమతా,
వ్యోమేవ శశినా హీన మప్పుచ్ఛుష్క ఇవ సాగరః. ౨౦

బాష్ప ముత్సృజ్య కణ్ఠేన స్వార్తః పరమపీడితః,
ఆచ్ఛాద్య వదనం శ్రీమ ద్వస్త్రేణ జయతాం వరః. ౨౧

త మార్తం దేవసఙ్కాశం సమీక్ష్య పతితం భువి,
నికృత్త మివ సాలస్య స్కన్ధం పరశునా వనే. ౨౨
మత్తమాతఙ్గసఙ్కాశం చన్ద్రార్కసదృశం భువః,
ఉత్థాపయిత్వా శోకార్తం వచనం చేద మబ్రవీత్. ౨౩
ఉత్తిష్ఠోత్తిష్ఠ కిం శేషే రాజపుత్ర! మహాయశః!,
త్వద్విధా న హి శోచన్తి సన్త స్సదసి సమ్మతాః. ౨౪

దానయజ్ఞాధికారా హి శీలశ్రుతివచోనుగా,
బుద్ధిస్తే బుద్ధిసమ్పన్న! ప్రభేవార్కస్య మన్దిరే. ౨౫

స రుదిత్వా చిరం కాలం భూమౌ విపరివృత్య చ,
జననీం ప్రత్యువాచేదం శోకై ర్బహుభి రావృతః. ౨౬
అభిషేక్ష్యతి రామం ను రాజా యజ్ఞం ను యక్ష్యతే,
ఇత్యహం కృతసఙ్కల్పో హృష్టో యాత్రా మయాసిషమ్. ౨౭

త దిదం హ్యన్యథా భూతం వ్యవదీర్ణం మనో మమ,
పితరం యో నపశ్యామి నిత్యం ప్రియహితే రతమ్. ౨౮

అట్టి యీపాన్పు ఇప్పుడు బుద్ధిమంతుఁడగు నాతండ్రి లేకుండుటం జేసి చంద్రుఁడు లేని యాకాశంబుకైవడి, నీళ్లు లేని సముద్రంబుచాడ్పునఁ గాంతి హీనంబయి యున్నది. అని భరతుఁడు రోదనంబుఁ జేసెను. ౨౦

జయించువారలలో నుత్తముఁడగు నాభరతుఁడు అట్లు గట్టిగా రోదనంబు చేసి కన్నీళ్లు గార్చి శ్రీమంతంబగు ముఖంబుపై వస్త్రంబుఁ గప్పికొని యిట్లు పరమదుఃఖితుఁడై యుండెను. ౨౧

దేవతాసమానుఁడును మదపుటేనుంగుతో సరియయినవాఁడును చంద్రసూర్యులకు సాటివచ్చువాఁడును బరమదుఃఖితుఁడునగు నాభరతుఁడు వనంబున గొడ్డలిచే నఱుకఁబడిన మద్దిచెట్టుబోలె నేలం బడియుండుటఁ జూచి కైకేయి యతని నేలనుండి లేవనెత్తి యీమాటం జెప్పెను. ౨౨,౨౩

అధికంబగు కీర్తిగల రాచకొమరుఁడవగు భరతుఁడా! లెమ్ము లెమ్ము. ఏలపరుండియున్నావు? నీవంటి సభాపూజ్యులగు సత్పురుషు లెంతమాత్రము దుఃఖింపరు. ౨౪

బుద్ధిమంతుఁడవగు భరతుఁడా! దానంబులయందును యాగంబులయందును బాండిత్యంబుగలదియుం సత్స్వభావంబును వేదవాక్యంబులను దాఁటనిదియు నగు నీబుద్ధి మందరపర్వతంబున సూర్యునికాంతివెలుంగునట్లు మిక్కిలియుఁ బ్రకాశించుచుండును. అని కైకేయి భరతునితోఁ జెప్పెను. ౨౫

ఆభరతుఁడు అట్లు బహుకాలము నేలంబొరలుచు రోదనంబుచేసి యనేకవిధదుఃఖంబులం బీడితుఁడై తల్లిం జూచి యిట్లని చెప్పెను. ౨౬

“దశరథుఁడు నన్నుఁ బిలువనంపినాఁడే రామునకేమైనఁ బట్టాభిషేకంబుసేయునా? లేక యాగంబేమయినఁ జేయునా?” అని మనంబునం దలంచుచు నేను సంతోషంబునఁ బయనంబయి వచ్చితిని. ౨౭

అట్టి నాతలంపు ఇప్పుడు వేఱువిధమయినది. ఎల్లప్పుడును నాకు సంతోషముసేయుచు మేలు గావించుచుండునట్టి నాతండ్రిం జూడఁజాలకున్నాను గావున నామనంబు భిన్నమయియున్నది. ౨౮

అమ్బ! కేనాత్యగా ద్రాజా వ్యాధినా మయ్యనాగతే,
ధన్యా రామాదయ స్సర్వే యైర్గ పితా సంస్కృత స్స్వయమ్.

న నూనం మాం మహారాజః ప్రాప్తం జానాతి కీర్తిమాన్,
ఉపజిఘ్రేద్ధి మాం మూర్ధ్ని తాత స్సన్నమ్య సత్వరమ్. 30

క్వ స పాణి స్సుఖస్పర్శ స్తాతస్యాక్లిష్టకర్మణః,
యేన మాం రజసా ధ్వస్త మభీక్ష్ణం పరిమార్జతి. 31

యో మే భ్రాతా పితా బన్ధు ర్యస్య దాసోఽస్మి ధీమతః,
తస్య మాం శీఘ్ర మాఖ్యాహి రామ స్యాక్లిష్టకర్మణః. 32

పితా హి భవతి జ్యేష్ఠో ధర్మ మార్యస్య జానతః,
తస్య పాదౌ గ్రహీష్యామి స హీదానీం గతి ర్మమ. 33

ధర్మవి ద్ధర్మనిత్యశ్చ సత్యసన్ధో దృఢవ్రతః,
ఆర్యః కి మబ్రవీ ద్రాజా పితా మే సత్యవిక్రమః. 34

పశ్చిమం సాధు సందేశ మిచ్ఛామి శ్రోతు మాత్మనః,

ఇతి పృష్టా యథాతత్త్వం కైకేయీ వాక్య మబ్రవీత్. 35

రామేతి రాజా విలపన్ హా సీతే! లక్ష్మణేతి చ,
స మహాత్మా పరం లోకం గతో గతిమతాం వరః. 36

అమ్మా! నేను లేకుండునప్పుడు దశరథమహారాజే వ్యాధిచే మృతిఁ బొందెను. తండ్రికిఁ జేతులార సంస్కారంబు గావించినట్టి రాముఁడు మున్నగువార లందఱును కృతార్థులయిరి. ౨౯

అధికమగు కీర్తిగల దశరథమహారాజు నేను వచ్చియుండుట నెఱుంగఁడు కాఁబోలు. ఇది వాస్తవము. ఎఱుంగునేని శీఘ్రముగావచ్చి నన్ను వంచి నాశిరంబును మూర్కొనును. ౩౦

నాతండ్రి దూరంబుననుండి దుమ్ముచేఁ గప్పఁబడివచ్చిన నన్ను ఏ హస్తంబునఁ దడవునో అట్టి దుఃఖంబు పోఁగొట్టు కార్యంబులు గల నాతండ్రిగారి సుఖస్పర్శంబగు హస్తం బెచ్చట నున్నది? ౩౧

ఎవ్వఁడు నాకు అన్నయుఁ దండ్రియు బంధువునో, మఱియు నెవ్వనికి నేను దాసుఁడనై యున్నానో అట్టిదుఃఖంబుఁబోఁగొట్టుకార్యంబులు గల రామునకు శీఘ్రముగా నేను వచ్చియుండుటం దెల్పుము. ౩౨

ధార్మికుఁడు జ్యేష్ఠభ్రాతను దండ్రివలెనే చూచుకొనవలయును గావున నేను నాజ్యేష్ఠభ్రాతయగు రామునకు నమస్కరించెదను. తండ్రి చనిపోయిన పిమ్మట నింక నతఁడేకదా నాకు గతి. ౩౩

ధర్మజ్ఞుఁడును ధర్మంబుదప్పక నడచువాఁడును సత్యసంధుఁడును అవలంబించిన వ్రతంబును విడువనివాఁడును సత్యపరాక్రముఁడును బూజ్యుఁడు నగు నాతండ్రి దశరథమహారాజు ఏమిచెప్పిపోయెను? ౩౪

దశరథమహారాజు మరణసమయంబున నన్నుగుఱించి యేమిచెప్పి నాఁడో దానిం జక్కఁగా వినఁగోరెదను. అని భరతుఁడు కైకేయి నడిగెను.

ఇట్లు భరతుఁడడుగఁగాఁ గైకేయి యతనికి జరిగినది జరిగినట్లుగా నిట్లని చెప్పెను. ౩౫

ఉత్కృష్టంబగు గతిగలవారలలో శ్రేష్ఠుఁడును మహాత్ముఁడు నగునా దశరథమహారాజు "అయ్యోరాముఁడా! సీతా! లక్ష్మణుఁడా!" అని విలపించుచుఁ బరలోకంబు నొందెను. ౩౬

ఇమాం తు పశ్చిమాం వాచం వ్యాజహార పితా తవ,
కాలధర్మపరిక్షిప్తః పాశై రివ మహాగజః. ౩౭

సిద్ధార్థా స్తేనరా రామ మాగతం సీతయా సహ,
లక్ష్మణం చ మహాబాహుం ద్రక్ష్యన్తి పునరాగతమ్. ౩౮

తచ్ఛ్రుత్వా విషసా దైవ ద్వితీయా ప్రియశంసనాత్,
విషణ్ణవదనో భూత్వా భూయః పప్రచ్ఛ మాతరమ్. ౩౯
క్వ చేదానీం స ధర్మాత్మా కౌసల్యానన్దవర్ధనః,
లక్ష్మణేన సహ భ్రాత్రా సీతయా చ సమం గతః. ౪౦

తథా పృష్టా యథాతత్త్వ మాఖ్యాతు ముపచక్రమే.
మాతాఽస్య సుమహ ద్వాక్యం విప్రియం ప్రియశఙ్కయా.
స హి రాజసుతః పుత్త్ర! చీరవాసా మహావనమ్,
దణ్డకా న్సహ వైదేహ్యా లక్ష్మణానుచరో గతః. ౪౨

తచ్ఛ్రుత్వా భరత స్త్రస్తో భ్రాతు శ్చారిత్రశఙ్కయా,
స్వస్య వంశస్య మాహాత్మ్యా త్ప్రష్టుం సముపచక్రమే. ౪౩

కచ్చి న్న బ్రాహ్మణధనం హృతం రామేణ కస్యచిత్,
కచ్చి న్నాఢ్యో దరిద్రో వా తేనాపాపో విహింసితః. ౪౪

కచ్చి న్న పరదారాన్వా రాజపుత్త్రోఽభిమన్యతే,
కస్మా త్స దణ్డకారణ్యే భ్రూణహేవ వివాసితః. ౪౫

నీ తండ్రి దశరథమహారాజు పాశంబులం గట్టంబడిన మదపుటేనుంగు వలె మృత్యువశుండై విలపించుచు మరణసమయంబున నీమాటను మాత్రము చెప్పెను. ౩౭

ఎవ్వరు మరల సీతతోఁగూడ నిచ్చటికివచ్చి రాముని లక్ష్మణుని జూడఁగలరో వారలు ధన్యులు. అని యీమాటను మాత్రమే నీతండ్రి మరణసమయంబునం జెప్పినాఁడు. అని కైకేయి భరతునితోఁ జెప్పినది. ౩౮

భరతుఁ డిది విని రాముఁడు పట్టణంబున లేఁడను రెండవదుఃఖవార్తను వినుటచే మఱియుం దుఃఖమునొంది మరలఁ దల్లిం బ్రశ్నించెను. ౩౯

ధర్మాత్ముఁడును కౌసల్యకు సంతోషంబును వృద్ధిఁబొందించువాఁడు నగు రాముఁడు తమ్ముని లక్ష్మణుని భార్యను సీతనుంగూడి యిప్పు డెచ్చటికిఁ బోయియున్నాఁడు? అని భరతుఁడు కైకేయి నడిగెను. ౪౦

అట్లు భరతుఁడడుగఁగా కైకేయి భరతున కప్రియంబగు మాటను ప్రియంబను భ్రాంతిచే యథార్థముగా నంతయుం జెప్ప నారంభించెను. ౪౧

పుత్త్రుఁడా! రాజపుత్త్రుఁడగు నారాముఁడు లక్ష్మణుని సీతనుఁ గూడి నారచీరలు గట్టుకొని దండకారణ్యంబునకుఁ బోయెను. అని కైకేయి భరతునకుఁజెప్పెను. ౪౨

భరతుఁడు ఆమాటను విని తనవంశస్థుల సదాచారసంపత్తి దలంచి తనయన్నకు సదాచారలోపము సంభవించెనో యేమోయని శంకించి భీతుఁడై మరల నిట్లని యడుగ నారంభించెను. ౪౩

రాముఁడు బ్రాహ్మణునిధనంబు నపహరింపలేదుగదా? మఱియుం ధనికునిఁగాని దరిద్రునిఁగాని యేపాపమును జేయనివాని నెవ్వని హింసింపలేదు గదా?

రాజపుత్త్రుఁడగు రాముఁడు పరస్త్రీలం గోరఁడుగదా?

రాముఁ డేపాపంబు సేయఁగఁడే; దశరథమహారా జెందువలన సమస్త వేదంబులం దెలిసినవానిఁ జంపినవానింబోలె రాముని దండకారణ్యంబునకుఁ బంపినాఁడు? ౪౪

అథాస్య చపలా మాతా త త్స్వకర్మ యథాతథమ్,
తే నైవ స్త్రీస్వభావేన వ్యాహర్తు ముపచక్రమే. ४६
ఏవ ముక్తా తు కైకేయ్యా భరతేన మహాత్మనా,
ఉవాచ వచనం హృష్టా మూఢా పణ్డితమానినీ. ४२

న బ్రాహ్మణధనం కించి ద్ధృతం రామేణ కస్యచిత్,
కశ్చి న్నాఢ్యో దరిద్రోవా తేనాపాపో విహింసితః. ४७
న రామః పరదారాం శ్చ చక్షుర్భ్యా మపి పశ్యతి,
మయాతు పుత్త్ర! శ్రుత్వైవ రామ స్యై వాభిషేచనమ్. ४९
యాచిత స్తే పితా రాజ్యం రామస్య చ వివాసనమ్,

స స్వవృత్తిం సమాస్థాయ పితా తే త త్తథాఽకరోత్. ५०

రామ శ్చ సహసౌమిత్రిః ప్రేషిత స్సీతయా సహ,

త మపశ్య న్ప్రియం పుత్త్రం మహీపాలో మహాయశాః. ५१
పుత్త్రశోకపరిద్యూనః పఞ్చత్వ ముపపేదివాన్,

త్వయా త్విదానీం ధర్మజ్ఞ! రాజత్వ మవలమ్బ్యతామ్. ५२
త్వత్కృతే హి మయా సర్వమిద మేవంవిధం కృతమ్,
మా శోకం మా చ సన్తాపం ధైర్య మాశ్రయ పుత్త్రక!. ५३
త్వదధీనా హి నగరీ రాజ్యం చైత దనామయమ్,

అంత భరతునితల్లికైకేయి స్త్రీస్వభావంబునంజేసి మనంబున దాఁచంజాలక తనకార్యము నంతయుం యథార్థంబుగాఁ జెప్ప నారంభించెను. ౪౭

కైకేయి మహాత్ముఁడగు భరతుఁడు చెప్పినది విని మూఢురాలును దన కేమియుం దెలియకున్నను దానుఁ బండితురాలనని యహంకరించి యెంతన్న దియుఁ గావున దాను జెప్పునది భరతునకు సంతోషకరంబగునని సంతోషించి యిట్లని చెప్పినది. ౪౮

రాముఁడు ఏ బ్రాహ్మణుని ధనంబు నపహరింప లేదు. మఱియుం ధనికునిఁ గాని దరిద్రునిఁగాని పాపముసేయనివాని నెవ్వనిని హింసింపలేదు. ౪౯

రాముఁడు పరస్త్రీలను కన్నెత్తియైనం జూడఁడు.

పుత్రుఁడా! రామునకుఁ బట్టాభిషేకంబు సేయఁ బ్రయత్నించుటను విని నేనే నీకు రాజ్యంబిమ్మనియుం రాము నడవికిఁ బంపుమనియు నీతండ్రి దశరథుని యాచించితిని. ౫౦

నీతండ్రియగు నాదశరథమహారాజు తనసత్యవ్రతంబు విడువక నాకు వాగ్దత్తముచేసి యున్నట్లు నే నడిగినదాని నట్లె గావించెను. ౫౦

అట్లు దశరథుఁడు రాముని లక్ష్మణునితోను సీతతోనుం గూడ నరణ్యంబునకుఁ బంపెను.

మహాయశుఁడగు నాదశరథమహారాజు అట్లు రాము నడవికిఁ బంపిన పిమ్మటఁ బ్రియపుత్రుఁడగు రాముం గానక పుత్రదుఃఖంబునం బరితపించుచు మరణంబునొందెను. ౫౧

ధర్మజ్ఞుఁడవగు భరతుఁడా! నీవు ఇప్పుడు రాజయి భూమి నేలుము. నీకైయే కదా! నే నిదంతయుం నీప్రకారము గావించినాను. ౫౨

చిన్నికొమరుఁడా! నీవు దుఃఖంబును సంతాపంబునుం బొందక ధైర్యం బవలంబింపుము. ఈయయోధ్యాపట్టణంబును అబాధంబగు నీరాజ్యంబును నీయధీనము గానున్నదిగదా! ౫౩

తత్పుత్ర! శీఘ్రం విధినా విధిజ్ఞై
ర్వసిష్ఠముఖ్యై స్సహితో ద్విజేన్ద్రైః,
సఙ్కల్ప్య రాజాన మదీనసత్త్వ
మాత్మాన ముర్వ్యా మభిషేచయస్వ. ౫౪

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే ద్విసప్తతితమ స్సర్గః.

---

## త్రిసప్తతితమస్సర్గః

శ్రుత్వాతు పితరం వృత్తం భ్రాతరౌచ వివాసితౌ,
భరతో దుఃఖసన్తప్త ఇదం వచన మబ్రవీత్. ౧
కింను కార్యం హతస్యేహ మమ రాజ్యేన శోచతః,
విహీనస్యాథ పిత్రా చ భ్రాత్రా పితృసమేన చ. ౨
దుఃఖే మే దుఃఖ మకరో ర్వ్రణే క్షార మి వాదధాః,
రాజానం ప్రేతభావస్థం కృత్వా రామం చ తాపసమ్. 3

కులస్య త్వ మభావాయ కాళరాత్రి రివాఽగతా,
అఙ్గార ముపగూహ్య స్మ పితా మే నావబుద్ధవాన్. ౪

మృత్యు మాపాదితో రాజా త్వయా మే పాపదర్శిని!,
సుఖం పరిహృతం మోహా త్కులేఽస్మి న్కులపాంసని!. ౫

త్వాం ప్రాప్య హి పితా మేఽద్య సత్యసన్ధో మహాయశాః,
తీవ్రదుఃఖాభిసన్తప్తో వృత్తో దశరథో నృపః. ౬

పుత్త్రుఁడా! అట్లగుటంజేసి శాస్త్రజ్ఞులగు వసిష్ఠుఁడు మొదలయిన బ్రాహ్మణోత్తములం గూడి యదీనపరాక్రముండగు దశరథమహారాజునకు యథాశాస్త్రంబుగా శీఘ్రంబున సంస్కారంబు గావించి సామ్రాజ్యపట్టాభిషిక్తుండ వగుము. అని కైకేయి భరతునితోఁ జెప్పెను. ౨౮

ఇది డెబ్బదిరెండవసర్గము.

---

## డెబ్బదిమూఁడవసర్గము

భరతుఁడు తనతండ్రి మరణంబు నొందుటయు, రామలక్ష్మణులు వనంబునకుఁ బోవుటయు విన్నంతనె పరమదుఃఖితుఁడై యిట్లని చెప్పెను. ౧

తండ్రిని దండ్రివంటియన్నను విడిచి హతుఁడనై దుఃఖించుచున్న నా కింక నిచ్చట రాజ్యంబుచే నేమికార్యమున్నది! ౨

నీవు దశరథమహారాజుం జంపి రామునిం దాపసునిఁగా నడవికిఁ బంపి వ్రణంబుపైఁ గారము పెట్టినట్లు నాకు దుఃఖముపై దుఃఖము గావించి నావు. ౩

నీవు మావంశము నశింపఁ జేయుటకై కాళరాత్రియుం బోలె వచ్చి నావు. మాతండ్రి దశరథమహారాజు, అగ్నిహోత్రమని తెలియక నిన్నుఁ గవుఁగిలించుకొని యిప్పుడు నాశంబు నొందెను. ౪

పాపమునే సేయఁ గోరునట్టి దానవు, వంశమును జెఱుపం బుట్టిన దానవు నగు కైకేయీ! నీచేతనే మాతండ్రి దశరథమహారాజు మరణంబు నొందెను. మావంశంబున నెవ్వరికి నెంతమాత్రము సౌఖ్యంబు లేకుండునట్లు గావించితివి. ౫

మహాయశుఁడును సత్యసంధుఁడు నగు నాతండ్రి దశరథమహారాజు నీవలననేకదా! దుఃఖంబు నోర్వఁజాలక మృతిఁబొందెను. ౬

వినాశితో మహారాజః పితా మే ధర్మవత్సలః,
కస్మా త్ప్రవ్రాజితో రామః కస్మా దేవ వనం గతః. ౭
కౌసల్యా చ సుమిత్రా చ పుత్త్రశోకాభిపీడితే,
దుష్కరం యది జీవేతాం ప్రాప్య త్వాం జననీం మమ. ౮
నను త్వార్యోఽపి ధర్మాత్మా త్వయి వృత్తి మనుత్తమామ్,
వర్తతే గురువృత్తిజ్ఞో యథా మాతరి వర్తతే. ౯

తథా జ్యేష్ఠా హి మే మాతా కౌసల్యా దీర్ఘదర్శినీ,
త్వయి ధర్మం సమాస్థాయ భగిన్యా మివ వర్తతే. ౧౦

తస్యాః పుత్త్రం కృతాఽత్మానం చీరవల్కలవాససమ్,
ప్రస్థాప్య వనవాసాయ కథం పాపే! నశోచసి. ౧౧

అపాపదర్శనం శూరం కృతాఽత్మానం యశస్వినమ్,
ప్రవ్రాజ్య చీరవసనం కింను పశ్యసి కారణమ్. ౧౨

లుబ్ధాయా విదితో మన్యే న తేఽహం రాఘవం ప్రతి,
తథా హ్యనర్థో రాజ్యార్థం త్వయా నీతో మహా నయమ్. ౧౩

అహం హి పురుషవ్యాఘ్రా వపశ్య న్రామలక్ష్మణౌ,
కేన శక్తిప్రభావేన రాజ్యం రక్షితు ముత్సహే. ౧౪
తం హి నిత్యం మహారాజో బలవన్తం మహాబలః,
అపాశ్రితోఽభూ ద్ధర్మాత్మా మేరు ర్మేరువనం యథా. ౧౫
సోఽహం కథ మిమం భారం మహాధుర్యసముద్ధృతమ్,
దమ్యో ధుర మివాఽసాద్య వహేయం కేన చౌజసా. ౧౬

పరమధార్మికుఁడగు నాతండ్రి దశరథమహారాజును ఎందువలనఁ జంపినావు? ఎందువలన రాముని ఊరు వెడలఁగొట్టి వనంబునకుఁ బంపినావు. ౭

నాతల్లియగు నీవలనఁ, గౌసల్యయుం సుమిత్రయుఁ బుత్రదుఃఖంబు నొందినారు. ఇంక వారలు జీవింతురేని యదియె దుర్లభము. ౮

గురుజనుల విషయమయి ప్రవర్తించుకొనవలసినపద్ధతిఁ దెలిసినవాఁడును ధర్మాత్ముఁడునగు రాముఁడును దనతల్లికిఁ జేయుచున్నట్లు ఎంతమాత్రము భేదములు లేక నీకు మిక్కిలియు శుశ్రూషఁ జేయుచుండునుగదా! ౯

అట్టి దీర్ఘకాలమునకు రాఁదగినయర్థము నాలోచించునదియగు నాపెద్దతల్లి కౌసల్యయుఁ, ధర్మంబు నవలంబించి నిన్నుఁ జెల్లెలియట్ల జూచుకొనుచున్నదిగదా! ౧౦

పాపిష్ఠురాలవగు కైకేయీ! అట్టిధార్మికురాలగు కౌసల్యకొడుకునుబుద్ధిమంతుఁడగు రాముని నారచీరలుఁగట్టుకొని యడవికిఁ బోవునట్లుచేసి యెట్లు సంతోషముగా నున్నావు? ౧౧

మనంబున నైనఁ బాపంబు దలంపనివాఁడును శూరుఁడును బుద్ధిమంతుఁడును గీర్తిశాలియునగురాముని నారచీరలు గట్టుకొని యడవికిఁ బోవునట్లు చేసితివే దీని కేమి కారణము? ౧౨

నాకు రామునియందుండు భక్తి లుబ్ధురాలవగు నీకుఁ దెలియనట్లున్నది. అందువలననె నాకు రాజ్యంబు గలుగుటకై నీ విట్టి గొప్ప యనర్థంబుఁ గలిగించితివి. ౧౩

నేను బురుషశ్రేష్ఠులగు రామలక్ష్మణులం జూడకయె యేసామర్థ్యంబున రాజ్యంబుఁ బాలింపఁగలను? ౧౪

అరణ్యంబువలన నితరులకుఁ జొర నలవిగాకుండుటంజేసి యరణ్యంబు మేరుపర్వతంబును రక్షించినదగుచున్నది. ౧౫

గొప్పభారంబు మోయంజాలిన పెద్దయెద్దుచే మోయఁబడిన భారమును లేఁతదూడపై నుంచునట్లు మహాబలుఁడగు దశరథమహారాజుచే వహింపఁబడిన యీరాజ్యభారంబును నాపై మోపిన నేనెట్లు మోయఁగలను? ౧౬

అథ వా మే భవేచ్ఛక్తిర్యోగైర్బుద్ధిబలేన వా,
సకామాం న కరిష్యామి త్వామహం పుత్రగర్ధినీమ్. ౧౭

న మే వికాఙ్క్షా జాయేత త్యక్తుం త్వాం పాపనిశ్చయామ్,
యది రామస్య నావేక్షా త్వయి స్యాన్మాతృవత్సదా. ౧౮

ఉత్పన్నా తు కథం బుద్ధిస్తవేయం పాపదర్శిని,
సాధుచారిత్రవిభ్రష్టే! పూర్వేషాం నో విగర్హితా. ౧౯

అస్మిన్కులే హి పూర్వేషాం జ్యేష్ఠో రాజ్యేఽభిషిచ్యతే,
అపరే భ్రాతరస్తస్మిన్ప్రవర్తన్తే సమాహితాః. ౨౦
న హి మన్యే నృశంసే! త్వం రాజధర్మమవేక్షసే,
గతిం వా న విజానాసి రాజవృత్తస్య శాశ్వతీమ్. ౨౧

సతతం రాజవృత్తే హి జ్యేష్ఠో రాజ్యేఽభిషిచ్యతే,
రాజ్ఞామేతత్సమం తత్స్యాదిక్ష్వాకూణాం విశేషతః. ౨౨

తేషాం ధర్మైకరక్షాణాం కులచారిత్రశోభినామ్,
అద్య చారిత్రశౌణ్డీర్యం త్వాం ప్రాప్య వినివర్తితమ్. ౨౩

తవాపి సుమహాభాగా జనేన్ద్రాః కులపూర్వగాః,
బుద్ధేర్మోహః కథమయం సమ్భూతస్త్వయి గర్హితః. ౨౪

అటుగాక సామాద్యుపాయంబులచేఁ గాని బుద్ధిబలంబునం గాని రాజపుత్రుఁడ నగుటచే రాజ్యంబుఁ బాలించుటకు నాకు శక్తియున్నను గొడుకునందలి యత్యాశచే నిట్టి యనర్థంబు గావించిన నీకోర్కినిమాత్రము నేను సఫలంబు గావింపను. ౧౭

రామునకుఁ దనతల్లియందువలె నెల్లప్పుడును నీయందు గౌరవ ముండుట వలననే ఆయనకుఁ గోపంబు వచ్చునని నిన్నిప్పుడు నేను విడువకున్నాను. రామునకు నీయం దట్టిగౌరవము లేకుండు నేని యీక్షణమే నిన్నుఁ బరిత్యజింతును. ౧౮

పాపములే సేయుదానవు, సదాచారంబు విడిచినదానవు నగు కైకేయీ! మాపూర్వికుల యందఱిచేతను నిందింపఁబడిన యీయాలోచనము నీకెట్లు గలిగినది? ౧౯

మావంశంబున జ్యేష్ఠునకుఁ బట్టాభిషేకము సేయుట సంప్రదాయము. తమ్ము లందఱు ఆయనయందు భక్తితోఁ బ్రవర్తింపుచుండవలయును. ౨౦

క్రూరురాలవగు కైకేయీ! నీవు రాజధర్మమును సరకుసేయుదానవు కావు. రాజులు సాంప్రదాయికపద్ధతి నతిక్రమింపఁగూడదని నీకుఁ దెలియదు. అని తలంచెదను. ౨౧

రాజులయాచారమును జూడఁగా అందఱును జ్యేష్ఠునకే పట్టాభిషేకము సేయుందురని స్పష్టమగును. ఇది రాజుల కందఱకు సమానమె కాని అందును ఇక్ష్వాకువంశపురాజులకు ముఖ్య మయినది. ౨౨

ధర్మమునే నమ్మియుండువారలును సద్వంశముతోను సదాచారముతోనుం గూడినవారలు నగు నాయిక్ష్వాకువంశపురాజులకుం గల 'మావంటిసదాచారసంపన్నులు లేరు' అను గర్వము ఇప్పుడు నీసంబంధమువలన నశించినది.

నీపుట్టింటిరాజులును జ్యేష్ఠునకే పట్టాభిషేకము సేయుచున్నారు. మఱియుం వారలుం మిక్కిలియుం యోగ్యులు. నీ కెందువలన నిట్టి నిందితంబగు చెడుబుద్ధి గలిగినది? ౨౪

నతు కామం కరిష్యామి తవాహం పాపనిశ్చయే!,
త్వయా వ్యసన మారబ్ధం జీవితాన్తకరం మమ. ౨౫

ఏష త్విదానీ మేవాహ మప్రియార్థం తవానఘమ్,
నివర్తయిష్యామి వనా ద్భ్రాతరం స్వజనప్రియమ్. ౨౬

నివర్తయిత్వా రామం చ తస్యాహం దీప్తతేజసః,
దాసభూతో భవిష్యామి సుస్థితే నాన్తరాత్మనా. ౨౭

ఇత్యేవ ముక్త్వా భరతో మహాత్మా
ప్రియేతరై ర్వాక్యగణై స్తుదం స్తామ్,
శోకాతురశ్చాపి ననాద భూయ
స్సింహో యథా పర్వతగహ్వరస్థః. ౨౮

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే త్రిసప్తతితమస్సర్గః

## చతుస్సప్తతితమస్సర్గః

తాం తథా గర్హయిత్వా తు మాతరం భరత స్తదా,
రోషేణ మహతాఽఽవిష్టః పునరేవా బ్రవీద్వచః. ౧
రాజ్యా ద్భ్రంశస్వ కైకేయి! నృశంసే! దుష్టచారిణి!,
పరిత్యక్తా చ ధర్మేణ మా మృతం రుదతీ భవ. ౨

కిన్ను తేఽదూషయ ద్రాజా రామో వా భృశధార్మికః,
యయో ర్మృత్యు ర్వివాస శ్చ త్వత్కృతే తుల్య మాగతౌ. ౩

పాపముసేయ నిశ్చయముగల కైకేయీ! నీకోర్కినిమాత్రము నే నెంతమాత్రము చేయను. నీవు నాకు ప్రాణనాశంబు గలుగునంతటి కష్టంబు గావించినావు. ౨౫

ఇదిగో నేను నీకు దుఃఖము గావించుటకై యిప్పుడే యడవికిం బోయి యనఘుండును బంధుజనులకుం బ్రియుండునగు నాయన్నను రాముం దోడ్కొనివచ్చెదను. ౨౬

అట్లు అడవినుండి యిచ్చటికి రాముం దోడ్కొనివచ్చి నేనుదృఢంబగు నంతఃకరణంబున మహాతేజశ్శాలియగు నారామునకు దాసుండనై యుండెదను. అని భరతుండు కైకేయితోం జెప్పెను. ౨౭

మహాత్ముండగు భరతుండు ఇట్లు కైకేయికి మిక్కిలియుం దుఃఖంబు గలిగించునట్టి మాటలం జెప్పుచు మఱియుం దుఃఖం బినుమడింపం బిట్టెలుంగున రోదనంబుం జేసెను. ౨౮

ఇది డెబ్బదిమూఁడవసర్గము.

---

## డెబ్బదినాలుగవ సర్గము

అప్పుడు భరతుండు తల్లియగు కైకేయిని ఆప్రకారము నిందించి మరల మహాకోపంబు నొంది యిట్లని చెప్పెను. ౧

క్రూరురాలవు, దుష్టకార్యంబులు సేయుదానవునగు కైకేయీ! ధర్మంబును విడిచినావుగదా! నీవు రాజ్యభ్రష్టురాలవునై నేను మృతిం బొందంగా నన్నుం గూర్చి రోదనంబు సేయుచుండుము. ౨

నీవు దశరథమహారాజునకు మరణంబును రామునకు వనవాసంబును ఏకకాలంబున సంభవించునట్లు గావించితివే; దశరథమహారాజుగాని పరమధార్మికుండగు రాముండుగాని నిన్నుంగాని నీగుణస్వభావాదులంగాని యేమి దూషించిరి? ౩

భ్రూణహత్యా మపి ప్రాప్తా కులస్యాస్య వినాశనాత్,
కైకేయి! నరకం గచ్ఛ మాచ భర్తు స్సలోకతామ్. ४

య త్త్వయా హీదృశం పాపం కృతం ఘోరేణ కర్మణా,
సర్వలోక ప్రియం హిత్వా మమా ప్యాపాదితం భయమ్. ౫

త్వత్కృతే మే పితా వృత్తో రామ శ్చారణ్య మాశ్రితః,
అయశో జీవలోకే చ త్వయాఽహం ప్రతిపాదితః. ౬
మాతృరూపే! మమామిత్రే! నృశంసే! రాజ్యకాముకే!,
న తేఽహ మభిభాష్యోఽస్మి దుర్వృత్తే! పతిఘాతిని!. ౭

కౌసల్యా చ సుమిత్రా చ యా శ్చాన్యా మమ మాతరః,
దుఃఖేన మహతాఽఽవిష్టా స్త్వాం ప్రాప్య కులదూషిణీమ్. ౮
న త్వ మశ్వపతేః కన్యా ధర్మరాజస్య ధీమతః,
రాక్షసీ తత్ర జాతాఽసి కులప్రధ్వంసినీ పితుః. ౯
య త్త్వయా ధార్మికో రామో నిత్యం సత్యపరాయణః,
వనం ప్రస్థాపితో దుఃఖా త్పితా చ త్రిదివం గతః. ౧౦

య త్ప్రధానాఽసి త త్పాపం మయి పిత్రా వినాకృతే,
భ్రాతృభ్యాం చ పరిత్యక్తే సర్వలోకస్య చాప్రియే. ౧౧

కౌసల్యాం ధర్మసంయుక్తాం వియుక్తాం పాపనిశ్చయే!,
కృత్వా కం ప్రాప్స్యసే త్వద్య లోకం నిరయగామిని!. ౧౨

కైకేయీ! ఈవంశంబును నశింపఁజేసితివి కావున నీ విప్పుడు భ్రూణహత్యాపాపమును బొందితివి. కాఁబట్టి నరకంబునకుఁ బోదువుగాని భర్తృలోకమును బొందఁజాలవు. ౪

నీవు భయంకరంబగు ప్రయత్నంబు గావించి సమస్తలోకంబులకును బ్రియుఁడగు రాము నడవికిం దఱిమి సంపాదించిన పాపంబు నాకును గొప్ప భయంబుఁ గలిగించినది. ౫

నీవలన నాతండ్రి దశరథమహారాజు మృతిఁబొందెను. రాముఁ డడవికిఁ బోయెను. నాకును ఈలోకంబున గొప్ప యపకీర్తి గలిగినది. ౬

కైకేయీ! నీవు మాతృరూపంబు వహించిన శత్రువవు. క్రూరురాలవు. రాజ్యలుబ్ధవు. దురాచారము గలదానవు. పెనిమిటిం జంపినదానవు. నాతో మాటలాడకుము. ౭

కౌసల్యయు సుమిత్రయు మఱియు నితరలగు నాతల్లులును అంప ఱను వంశంబుఁ జెఱపంబుట్టినట్టి నీవలన నిప్పుడు మహాదుఃఖంబు నొందిరి.

నీవు ఎల్లప్పుడు సత్యపరాయణుఁడును ధార్మికుఁడునగు రాము నడవికిఁ బంపి యీదుఃఖంబున నాతండ్రి దశరథమహారాజు మృతిఁ బొందునట్లు గావించినావు కావున నీవు ధర్మరాజుఁడును బుద్ధిమంతుఁడు నగు కేకయమహారాజునకుఁ బుట్టినదానవు కావు. ఆయనవంశంబుఁ జెఱచుటకై యచ్చట రాక్షసివై పుట్టినావు. ౯,౧౦

నీవు గావించిన పాపకర్మపు ఫలము నాకు సంభవించి నేను దండ్రిచేతను అన్నదమ్ములచేతను విడువఁబడి సమస్తలోకంబులకును అప్రియుండనైతిని. ౧౧

పాపము సేయునిశ్చయముగలదానవు, నరకము నొందుదానవు నగు కైకేయీ ! ధార్మికురాలగు కౌసల్యను బుత్రవియోగము నొందునట్లు చేసి నీవు నరకంబులలో నేలోకంబును బొందఁగలవు! నీపాపంబునకుఁ దగిన నరకంబు మాత్రము లేదు. ౧౨

కిం నావబుధ్యసే క్రూరే! నియతం బన్ధుసంశ్రయమ్,
జ్యేష్ఠం పితృసమం రామం కౌసల్యాయాఽఽత్మసమ్భవమ్. ౧౩

అఙ్గప్రత్యఙ్గజః పుత్త్రో హృదయాచ్చాపి జాయతే,
తస్మాత్ప్రియతమో మాతుః ప్రియత్వాన్న తు బాన్ధవః. ౧౪

అన్యదా కిల ధర్మజ్ఞా సురభి స్సురసమ్మతా.
వహమానౌ దదర్శోర్వ్యాం పుత్త్రౌ విగతచేతసౌ. ౧౫

తా వర్ధదివసే శ్రాన్తౌ దృష్ట్వా పుత్త్రౌ మహీతలే,
రురోద పుత్త్రశోకేన బాష్పపర్యాకులేక్షణా. ౧౬

అధస్తాద్వ్రజత స్తస్య సురరాజ్ఞో మహాత్మనః,
బిన్దవః పతితా గాత్రే సూక్ష్మా స్సురభిగన్ధినః. ౧౭

ఇన్ద్రోఽప్యశ్రునిపాతం తం స్వగాత్రే పుణ్యగన్ధినమ్,
సురభిం మన్యతే దృష్ట్వా భూయసీం తాం సురేశ్వరః. ౧౮
నిరీక్షమాణ శ్శక్ర స్తాం దదర్శ సురభిం స్థితామ్,
ఆకాశే విష్ఠితాం దీనాం రుదన్తీం భృశదుఃఖితామ్. ౧౯
తాం దృష్ట్వా శోకసన్తప్తాం వజ్రపాణి ర్యశస్వినీమ్,
ఇన్ద్రః ప్రాఞ్జలి రుద్విగ్న స్సురరాజోఽబ్రవీ ద్వచః. ౨౦

క్రూరురాలవగు కైకేయీ! కౌసల్యాపుత్రుఁడగు రాముఁడు పరిశుద్ధుఁడనియుం బంధువుల కందఱకుఁ బ్రాణంబువంటివాఁడనియు జ్యేష్ఠపుత్రుఁడగుటచే మా కందఱకుఁ దండ్రివంటివాఁడనియుం నీకుఁ దెలియదా యేమి? ౧౩

పుత్రుఁడు ముఖకంఠవక్షఃకుక్షిహస్తపాదాద్యంగములవలనను నేత్రనాసికాంగుళ్యాది ప్రత్యంగంబులవలనను బుట్టుటయేగాక హృదయంబువలననుం బుట్టును. కావునఁ దల్లికిఁ దనశరీరమువలనను హృదయమువలనను బుట్టువాఁడు కావునఁ బుత్రుఁడు అందఱికన్నను బ్రియుఁడగును. ఇతర బంధువులు సాధారణంబుగాఁ బ్రియులు కాని యట్టిప్రియతములు కాఁజాలరు. కావునఁ దల్లికిఁ బుత్రవియోగమునకన్న వేఱె యధికదుఃఖంబు లేదు. ౧౪

పూర్వము ఒకప్పుడు ధర్మజ్ఞయును దేవతలచేఁ బూజింపఁబడునదియు నగు కామధేనువు భూమియందు నాఁగేటిని మోయుచు దున్నుచు నలసి మూర్ఛఁబొందిన తనకొడుకులను (వృషభంబులను) జూచెను. ౧౫

అట్లు కామధేనువు నడిమధ్యాహ్నమువఱకు దున్ని యలసియున్న తన కొడుకులం (వృషభంబులం) జూచి తనకొడుకులు ఇట్లు శ్రమపడుచున్నారే యని దుఃఖంబు నొంది కండ్లనిండఁ గన్నీళ్లు గాఱ రోదనంబుఁ జేసినది. ౧౬

అప్పుడు ఆ కామధేనువునకుఁ గ్రిందుగాఁ బోవుచున్న మహాత్ముఁడగు దేవేంద్రుని దేహముమీఁద మంచివాసనగల నా కామధేనువు కన్నీళ్ల సూక్ష్మబిందువులు పడినవి. ౧౭

దేవేంద్రుఁడు తనదేహంబుమీఁదఁ బడినసుగంధిబాష్పబిందువులం జూచి శ్రేష్ఠయగు కామధేనువే రోదనంబు సేయుచున్నదని తలంచెను ౧౮

దేవేంద్రుఁడు నాలుగుప్రక్కలం జూచి కామధేనువు ఆకాశంబున దీనయయి పరమదుఃఖితయయి రోదనంబు సేయుచుండుటం గనెను. ౧౯

వజ్రాయుధధరుఁడును దేవతలకుఁ బ్రభుఁడునగు నింద్రుఁడు పరమదుఃఖితయయి యున్న యా కామధేనువుం జూచి దుఃఖితుఁడై, చేమోడ్పు సలించి ఇట్లని చెప్పెను. ౨౦

భయం కచ్చిన్న చాస్మాసు కుతశ్చి ద్విద్యతే మహత్,
కుతో నిమిత్త శ్శోకస్తే బ్రూహి సర్వహితైషిణి!. ౨౧

ఏవ ముక్తా తు సురభి స్సురరాజేన ధీమతా,
ప్రత్యువాచ తతో ధీరా వాక్యం వాక్యవిశారదా. ౨౨

శాన్తం పాపం న వః కించి త్కుతశ్చి దమరాధిప!,

అహం తు మగ్నౌ శోచామి స్వపుత్రౌ విషమే స్థితౌ. ౨౩
ఏతౌ దృష్ట్వా కృశౌ దీనౌ సూర్యరశ్మిప్రతాపితౌ,
బాధ్యమానౌ బలీవర్దౌ కర్షకేణ సురాధిప!. ౨౪

మమ కాయా త్ప్రసూతౌ హి దుఃఖితౌ భారపీడితౌ,
యౌ దృష్ట్వా పరితప్యేఽహం నాస్తి పుత్రసమః ప్రియః. ౨౫

యస్యాః పుత్రసహస్రైస్తు కృత్స్నం వ్యాప్త మిదం జగత్,
తాం దృష్ట్వా రుదతీం శక్రో న సుతా న్మన్యతే పరమ్. ౨౬

సదాఽప్రతిమవృత్తాయా లోకధారణకామ్యయా,
శ్రీమత్యా గుణనిత్యాయా స్స్వభావపరివేషయా. ౨౭
యస్యాః పుత్రసహస్రాణి సాఽపి శోచతి కామధుక్,
కిం పున ర్యా వినా రామం కౌసల్యా వర్తయిష్యతి. ౨౮

మాదేవతలలో నెవ్వరివలన నైనను నీ కేమియు మహాభయంబు గలుగ లేదుగదా? నీ విట్లు దుఃఖించుటకుఁ గారణంబేమి? చెప్పుము అని యింద్రుఁడు కామధేనువు నడిగెను. ౨౧

కామధేనువు ఇట్లు బుద్ధిమంతుఁడగు దేవేంద్రుఁడు చెప్పినమాటను విని యంతఁ గొంచెము ధైర్యంబునొంది మాటలు చెప్పుటయందుఁ బండితుఁడగు దేవేంద్రుం జూచి యిట్లని బదులు చెప్పెను. ౨౨

ఇట్టి యమంగళశ్రవణము ఎప్పటికిని గలుగకుండుఁగాక. మీలో నెవ్వరివలనను నా కేభయంబును లేదు.

దేవేంద్రుఁడా! కర్షకునిచేఁ బీడింపఁబడుచుఁ గృశించి దీనములయి యెండలో బాధపడుచున్న యీయెద్దులం జూచి యివి నాపుత్రులు కావున నా పుత్రులు ఇట్టి కష్టము నొందియున్నారే యని మిక్కిలియు దుఃఖించు చున్నాను గాని వేఱేమియు లేదు. ౨౩, ౨౪

వీరలు నా దేహంబుననుండి పుట్టినవారలు కావున వీరలు భారంబు మోయుచు దుఃఖితులయియుండుటంజూచి పరితపించుచున్నాను. లోకంబున నెచ్చటను బుత్రునకు సరియయిన ప్రియం డెవ్వండును లేఁడు. అని కామధేనువు దేవేంద్రునితోఁ జెప్పినది. ౨౫

ఇంద్రుఁడు ఈ ప్రపంచంబంతయు వ్యాపించియుండు పెక్కువేల పుత్రులుగల యీ కామధేనువుగూడ నిద్దఱుకొడుకులు కష్టపడుటకు రోదనంబు సేయుటంజూచి పుత్రునికన్న నధికం బేదియు లేదని నిశ్చయించుకొనెను. ౨౬

అసదృశంబగు చారిత్రంబుగలిగి యందఱికన్న నధికురాలయి ఎడతెగని సద్గుణంబులుగలదై ఇచ్ఛామాత్రంబున సమస్తంబును సృజింప శక్తయయి లోకరక్షణార్థమయి సంతానపరంపరచేఁ బెక్కువేల పుత్రులం బడసియున్న యట్టి కామధేనువుంగూడ నిద్దఱిపుత్రుల కష్టముంజూచి దుఃఖించుచున్నదే. ఇంక రాముఁ డొక్కఁడే పుత్రుఁడుగల కౌసల్య రామునివిడిచి జీవించుటయే దుర్లభము. దుఃఖించునని చెప్పనేల! ౨౭, ౨౮

ఏకపుత్త్రా చ సాధ్వీ చ వివత్సేయం త్వయా కృతా,
తస్మా త్త్వం సతతం దుఃఖం ప్రేత్య చేహ చ లప్స్యసే. ౨౯

అహం హ్యపచితిం భ్రాతుః పితుశ్చ సకలా మిమామ్,
వర్ధనం యశసశ్చాపి కరిష్యామి న సంశయః. ౩౦
ఆనాయయిత్వా తనయం కౌసల్యాయా మహాబలమ్,
స్వయ మేవ ప్రవేక్ష్యామి వనం మునినిషేవితమ్. ౩౧
న హ్యహం పాపసఙ్కల్పే! పాపే! పాపం త్వయా కృతం,
శక్తో ధారయితుం పౌరై రశ్రుకణ్ఠై ర్నిరీక్షితః. ౩౨

సా త్వ మగ్నిం ప్రవిశ వా స్వయం వా దణ్డకా న్విశ,
రజ్జుం బధాన వా కణ్ఠే నహి తేఽన్యత్పరాయణమ్. ౩౩

అహమప్యవనీం ప్రాప్తే రామే సత్యపరాక్రమే,
కృతకృత్యో భవిష్యామి విప్రవాసితకల్మషః. ౩౪

ఇతి నాగ ఇవారణ్యే తోమరాఙ్కుశచోదితః,
పపాత భువి సంక్రుద్ధో నిశ్శ్వస న్నివ పన్నగః. ౩౫

సంరక్తనేత్ర శ్శిథిలామ్బర స్తదా
విధూతసర్వాభరణః పరన్తపః,
బభూవ భూమౌ పతితో నృపాత్మజ
శ్శచీపతేః కేతు రివోత్సవక్షయే. ౩౬

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే చతుస్సప్తతితమస్సర్గః.

ఒక్కఁడే కొడుకుగలదియుఁ బతివ్రతయు నగు కౌసల్యకొడుకు నడవికిఁబంపి నీవాబిడను కొడుకులేనిదానిం గావించినావు; అందువలన నీవు ఈలోకంబునను బరలోకంబునను ఎల్లప్పుడును దుఃఖంబనుభవింపుచుండుదువు.

నేను నాయన్న రాముని నాతండ్రి దశరథుని ఈవిధంబునం బూజించి యధికమయిన కీర్తిఁబొందెదను; ఇందుకు సంశయము లేదు. ౩౦

నేను కౌసల్యాకుమారుఁ డగు మహాబలు రాముని దోడ్కొనివచ్చి యటుపిమ్మట నేనే మునులు వాసముసేయునడవిలో నుండెదను. ౩౧

పాపముసేయు సంకల్పముగలదానవు, పాపిష్ఠురాలవు నగు కైకేయీ! పట్టణంబునందలిజనులు నన్నుఁ గన్నీళ్లొలుకం జూచుచుండ నేను నీవు చేసిన పాపమును భరించియుండఁజాలను. ౩౨

అట్టిమహాపాతకము చేసినట్టి నీవు అగ్నిహోత్రంబునసైనను బడుము; నీవే దండకారణ్యమునకైనను బొమ్ము; లేక రజ్జువును కంఠమునకుఁ గట్టుకొని యురివోసికొనియయినను బ్రాణంబులు విడువుము; నీ కింక వేఱేగతి యేమియు లేదు. ౩౩

నేనును సత్యపరాక్రముఁడగు రాముఁడు మరల రాజ్యంబునొందిన వెనుక నాపాపంబుఁ బోఁగొట్టుకొని కృతార్థుఁడ నయ్యెదను. అని భరతుఁడు కైకేయితోఁ జెప్పెను. ౩౪

ఇట్లు భరతుఁడు మహాశోకంబునొంది సర్పమువలె నిట్టూర్పులు వుచ్చుచు నడవియందు గజంబు వ్యాధులచేఁ దోమరంబులతోను అంకుశంబులతోను బొడువఁబడి గర్తంబునం బడునట్లు నేలంబడెను. ౩౫

శత్రువులం దపింపఁజేయునట్టి భరతుఁడు కోపంబునఁ గన్నుల నెఱ్ఱదనంబుగదుర వస్త్రంబువీడ నాభరణంబులు చలింప నుత్సవంబయిన పిమ్మట నింద్రధ్వజంబు నేలంబడునట్లు నేలంబడెను. ౩౬

ఇది డెబ్బదినాలవ సర్గము.

## పఞ్చసప్తతితమస్సర్గః

దీర్ఘకాలా త్సముత్థాయ సంజ్ఞాం లబ్ధ్వా చ వీర్యవాన్,
నేత్రాభ్యా మశ్రుపూర్ణాభ్యాం దీనా ముద్వీక్ష్య మాతరమ్. ౧
సోఽమాత్యమధ్యే భరతో జననీ మభ్యకుత్సయత్,
రాజ్యం న కామయే జాతు మన్త్రయే నాపి మాతరమ్. ౨
అభిషేకం న జానామి యోఽభూ ద్రాజ్ఞా సమీక్షితః,

విప్రకృష్టే హ్యహం దేశే శత్రుఘ్నసహితోఽవసమ్. ౩
వనవాసం న జానామి రామస్యాహం మహాత్మనః,
వివాసనం వా సౌమిత్రే స్సీతాయా శ్చ యథాఽభవత్. ౪
తథైవ క్రోశత స్తస్య భరతస్య మహాత్మనః,
కౌసల్యా శబ్ద మాజ్ఞాయ సుమిత్రా మిద మబ్రవీత్. ౫
ఆగతః క్రూరకార్యాయాః కైకేయ్యా భరత స్సుతః,

త మహం ద్రష్టు మిచ్ఛామి భరతం దీర్ఘదర్శినమ్. ౬

ఏవ ముక్త్వా సుమిత్రాం సా వివర్ణా మలినా కృశా,
ప్రతస్థే భరతో యత్ర వేపమానా విచేతనా. ౭

స తు రామానుజ శ్చాపి శత్రుఘ్నసహిత స్తదా,
ప్రతస్థే భరతో యత్ర కౌసల్యాయా నివేశనమ్. ౮
తత శ్శత్రుఘ్నభరతౌ కౌసల్యాం ప్రేక్ష్య దుఃఖితౌ,
పర్యష్వజేతాం దుఃఖార్తాం పతితాం నష్టచేతనామ్. ౯
రుదన్తౌ రుదతీం దుఃఖా త్సమేత్యార్యాం మనస్వినీమ్,

## డెబ్బదియైదవ సర్గము

మహాపరాక్రమశాలియగు భరతుఁడు అంత దీర్ఘకాలంబునకు సంజ్ఞ నొంది లేచి కండ్లునిండఁ గన్నీళ్లుగార్చుచు, దీనయగు తల్లింజూచి యవ్వ దచ్చటికివచ్చిన మంత్రులనడుమఁ దల్లిని నిందించెను. ౧

నే నెంతమాత్రము రాజ్యంబుఁ గోరియుండలేదు; అట్లు రాజ్యంబు నకై తల్లితో నాలోచింపలేదు; నాపట్టాభిషేకంబునకై కైకేయియు దశరథ మహారాజును ఆలోచించినసంగతియు నాకెంతమాత్రము తెలియదు. ౨

నేనును శత్రుఘ్నుఁడును, మిక్కిలి దూరదేశంబున నుంటిమిగదా! మహాత్ముఁడగు రామునకుఁగాని లక్ష్మణునకుఁగాని సీతకుఁగాని వనవాసం బెట్లు గలిగినదో అదియు నాకుఁ దెలియదు. అని భరతుఁడు చెప్పెను. ౪

అంతఁ గౌసల్య య ట్లఱచుచున్న మహాత్ముఁడగు భరతుని కంఠధ్వనిని విని సుమిత్రంజూచి యిట్లని చెప్పెను. ౫

క్రూరంబగు కార్యముచేసిన కైకేయికొడుకు భరతుఁడు వచ్చి యున్నాఁడు.

నేను దీర్ఘాలోచనముగల యాభరతుఁ జూడఁ గోరుచున్నాను. అని కౌసల్య సుమిత్రతోఁ జెప్పెను. ౬

దుఃఖంబునం దెల్లఁబాఱిన దేహముగలదియు మలినాంగియుఁ గృశించి యున్నదియుఁనగు నా కౌసల్య గడగడవడంకుచు మాటిమాటికి మూర్ఛపోవుచు భరతుఁ డుండుచోటికిఁ బోయెను. ౭

అప్పుడు రామునితమ్ముఁడగు భరతుఁడును శత్రుఘ్నునింగూడి కౌసల్యా గృహంబునకుం బోయెను. ౮

అంత భరతశత్రుఘ్నులు దుఃఖార్తయయి నేలంబడి విసంజ్ఞ యయి రోదనంబు సేయుచున్నదానిఁ బూజ్యయగుదాని మంచిమనస్సుగలదానిఁ గౌసల్యంజూచి పరమదుఃఖితులయి యిద్దఱుం జేరి యాబిడం గవుఁగిలించుకొని రోదనంబు చేసిరి. ౯

భరతం ప్రత్యువాచేదం కౌసల్యా భృశదుఃఖితా. ౧౦

ఇదం తే రాజ్యకామస్య రాజ్యం ప్రాప్తమకణ్టకమ్,

సమ్ప్రాప్తం బత కైకేయ్యా శీఘ్రం క్రూరేణ కర్మణా. ౧౧

ప్రస్థాప్య చీరవసనం పుత్త్రం మే వనవాసినమ్,
కైకేయీ కం గుణం తత్ర పశ్యతి క్రూరదర్శినీ. ౧౨
క్షిప్రం మా మపి కైకేయీ ప్రస్థాపయితు మర్హతి,
హిరణ్యనాభో యత్రాస్తే సుతో మే సుమహాయశాః. ౧౩
అథవా స్వయ మే వాహం సుమిత్రానుచరా సుఖమ్,
అగ్నిహోత్రం పురస్కృత్య ప్రస్థాస్యే యత్ర రాఘవః. ౧౪

కామం వా స్వయ మే వాద్య తత్ర మాం నేతు మర్హసి,
యత్రాసౌ పురుషవ్యాఘ్రః పుత్త్రో మే తప్యతే తపః. ౧౫
ఇదం హి తవ విస్తీర్ణం ధనధాన్యసమాచితమ్,
హస్త్యశ్వరథసమ్పూర్ణం రాజ్యం నిర్యాతితం తయా. ౧౬

ఇత్యాదిబహుభి ర్వాక్యైః క్రూరైః స్సమ్భర్త్సితోఽనఘః,
వివ్యథే భరత స్తీవ్రం వ్రణే తుద్యేవ సూచినా. ౧౭

పపాత చరణే తస్యా స్తదా సమ్భ్రాన్తచేతనః,
విలప్య బహుధాఽసంజ్ఞో లబ్ధసంజ్ఞ స్తతః స్థితః. ౧౮

అప్పుడు కౌసల్య పరమదుఃఖితయయి భరతుం జూచి యీమాటం
జెప్పెను. ౧౦

రాజ్యంబుఁగోరియున్న నీకు ఇదిగో ఎంతమాత్రము శత్రుబాధలేని
రాజ్యంబువచ్చినది.

అయ్యో! కైకేయిచేసిన క్రూరకర్మముచేత శీఘ్రముగా నీకు రాజ్యంబు
దొరకినది. ౧౧

క్రూరంబులగుకార్యంబులం జేయునట్టికైకేయి నాకొడుకును నారచీరలు
గట్టుకొని యడవికిఁబోవునట్లు చేసినదే; దానివలన నాదిడ కేమిలాభము? ౧౨

ఇంక శీఘ్రంబుగనే కైకేయి మహాయశుండగు నాకొడుకు బంగారు
కొండ రాముఁడుండుచోటికి నన్నును దఱిమికొట్టఁగలదు. ౧౩

అంతయేల? నేనే సుమిత్రను వెంటఁబెట్టుకొని సుఖముగా దశరథుని
యగ్నిహోత్రంబును గళేబరంబునుం దీసికొని రాముఁ డుండుచోటికిఁ
బోయెదను. ౧౪

పురుషశ్రేష్ఠుఁడగు నాకొడుకు, రాముఁడు ఎచ్చటఁ దపస్సుగావించు
చున్నాఁడో అచ్చటికి నీవైనను నన్నుఁ దీసికొనిపోయి విడిచిపెట్టిరమ్ము.

విశాలంబును ధనధాన్యంబులచేత నిండినదియుం నేనుంగులచేతను
గుఱ్ఱంబులచేతను నిండినదియునగు నీరాజ్యంబంతయుం నీకుఁ గైకేయి యొసంగి
నదిగదా! అని కౌసల్య భరతునితోఁ జెప్పినది. ౧౬

ఏపాపము నెఱుంగనిభరతుఁడు వ్రణంబుపై సూదితోఁ బొడిచినట్లు
ఈప్రకారము కౌసల్య కఠినవాక్యంబుల నిందింపఁగా విని మొదలె దుఃఖితుఁ
డైనవాఁడు కావునఁ బరమదుఃఖితుండయ్యెను. ౧౭

అప్పుడు భరతుఁడు ఏమియుందోఁచక కౌసల్యపాదంబులపైఁబడి
విసంజ్ఞుఁడై పెక్కుభంగుల రోదనంబు గావించి యంత గొంతవడికిఁ
దేఱెను. ౧౮

ఏవం విలపమానాం తాం భరతః ప్రాఞ్జలి స్తదా,
కౌసల్యాం ప్రత్యువాచేదం శోకై ర్బహుభి రావృతామ్.
ఆర్యే! కస్మా దజాన న్తం గర్హసే మా మకిల్బిషమ్,
విపులాం చ మమ ప్రీతిం స్థిరాం జానాసి రాఘవే. ౨౦

కృతా శాస్త్రాఽనుగా బుద్ధి ర్మాభూ త్తస్య కదాచన,
సత్యసన్ధ స్సతాం శ్రేష్ఠో యస్యాఽర్యోఽనుమతే గతః. ౨౧

ప్రేష్యం పాపీయసాం యాతు సూర్యంచ ప్రతి మేహతు,
హన్తు పాదేన గాం సుప్తాం యస్యాఽర్యోఽనుమతే గతః. ౨౨

కారయిత్వా మహ త్కర్మ భర్తా భృత్య మనర్థకమ్,
అధర్మో యోఽస్య సోఽస్యా స్తు యస్యాఽర్యోఽనుమతేగతః. ౨3

పరిపాలయమానస్య రాజ్ఞో భూతాని పుత్త్రవత్,
తత స్తం ద్రుహ్యతాం పాపం యస్యాఽర్యోఽనుమతేగతః. ౨౪

బలిషడ్భాగ ముద్ధృత్య నృపస్యారక్షతః ప్రజాః,
అధర్మో యోఽస్య సోఽస్యా స్తు యస్యాఽర్యోఽనుమతే గతః.

సంశ్రుత్య చ తపస్విభ్య స్సత్రే వై యజ్ఞదక్షిణామ్,
తాం విప్రలపతాం పాపం యస్యాఽర్యోఽనుమతే గతః. ౨౬

అభరతుఁడు చేమోడ్పుగీలించి నానావిధంబులగు దుఃఖంబులచే నీప్రకారము రోదనంబుసేయుచున్న కౌసల్యంజూచి యిట్లని చెప్పెను. ౧౯

పూజ్యురాలవగు కౌసల్యా! రామునందు నాకు స్థిరంబుగా నధికభక్తి గలదని నీకుఁ దెలిసియున్నదిగదా? ఈవృత్తాంతం బెంతమాత్రము నెఱుంగని వాఁడను బాపరహితుండనగు నన్నేల నిందించెదవు? ౨౦

సత్యసంధుండును సత్పురుషులలో నుత్తముండు నగురాముఁ డరణ్యంబునకుఁ బోవుటకు నేను సమ్మతించి యుండుదునేని నేను గురుముఖంబుగా నేర్చిన శాస్త్రానుసారిబుద్ధి నా కెంతమాత్రము లేకపోవుఁగాక. ౨౧

రాముఁ డడవికిఁబోవుటకు నేను సమ్మతించియుండునేని నీచజాతులకు భృత్యుఁడనై యుండుటవలనఁ గలుగుపాపమును సూర్యునికెదురుగాఁ గూర్చుండి మూత్రపురీషోత్సర్జనము సేయువానిపాపంబును నిదురించుచున్న యావును బాదంబునం దన్నిన వానిపాపంబునుఁ బొందుదునుగాక. ౨౨

రాముఁ డడవికిఁబోవుటకు నేను సమ్మతించియుండునేని భృత్యునిచే గొప్పపనిచేయించుకొని యతనికి దబ్బివ్వనట్టి భర్తకుం గల్గుపాపము నాకుఁ గలుగుఁగాక. ౨౩

రాముఁ డడవికిఁ బోవుటకు నేను సమ్మతించియుండునేని ప్రజల నందఱను దనకన్నకొడుకులంబోలె ధర్మంబుగాఁ బాలింపుచున్న రాజునకు ద్రోహముసేయువారలకుం గల్గుపాపంబు నాకుఁ గలుగుఁగాక. ౨౪

రాముఁ డడవికిఁ బోవుటకు నేను సమ్మతించియుండునేని పండిన దానిలో నాఱవపాలు కప్పముఁ దీసికొని ప్రజలను రక్షింపకుండు రాజునకుం గలుగుపాపము నాకుఁ గలుగుఁగాక. ౨౫

రాముఁ డడవికిఁ బోవుటకు నేను సమ్మతించియుండునేని యాగమునందుఁ దపోవంతులగు ఋత్విజులకు యాగదక్షిణ నావల నిచ్చెదనని ప్రతిజ్ఞ చేసి యటువిమ్మట లేదని చెప్పువారలకుం గలుగుపాపము నాకుఁ గలుగుఁగాక.

హా స్త్వశ్వరథసమ్బాధే యుద్ధే శస్త్రసమాకులే,
మాస్మ కార్షీ త్సతాం ధర్మం యస్యాఽర్యోఽనుమతే గతః. ౨౮

ఉపదిష్టం సుసూక్ష్మార్థం శాస్త్రం యత్నేన ధీమతా,
స నాశయతు దుష్టాత్మా యస్యాఽర్యోఽనుమతే గతః. ౨౮

మా చ తం వ్యూఢబాహ్వంసం చన్ద్రార్కసమతేజసమ్,
ద్రాక్షీ ద్రాజ్యస్థ మాసీనం యస్యాఽర్యోఽనుమతేగతః. ౨౯

పాయసం కృసరం ఛాగం వృథా సోఽశ్నాతు నిర్ఘృణః,
గురూంశ్చా ప్యవజానాతు యస్యాఽర్యోఽనుమతే గతః. ౩౦

గాశ్చ స్పృశతు పాదేన గురూ న్పరివదే త్స్వయమ్,
మిత్రే ద్రుహ్యేత సోఽత్యన్తం యస్యాఽర్యోఽమతే గతః.

విశ్వాసా త్కథితం కించి త్పరివాదం మిథః క్వచిత్ ,
వివృణోతు స దుష్టాత్మా యస్యాఽర్యోఽనుమతే గతః. ౩౧

అకర్తా హ్యకృతజ్ఞ శ్చ త్యక్తాఽత్మా నిరపత్రపః,

రాముఁ డడవికిఁ బోవుటకు నేను సమ్మతించియుందు నేని యుద్ధంబున నేనుఁగులను గుఱ్ఱంబులను రథంబులను నారోహించి యిరుతెగలవారునుగలసి పోరుచుందునపుడు శౌర్యంబు వహించి యుద్ధంబు సేయక వెనుకకుఁ దిరిగి పాఱిపోవువానికిం గల్గు పాపము నాకుఁ గలుగుఁగాక. ౨౭

రాముఁ డడవికిఁ బోవుటకు నేను సమ్మతించియుందు నేని బుద్ధిమంతుఁ డగు నాచార్యునిచే నుపదేశింపఁబడిన పరలోకసాధకంబగు రహస్యార్థంబును మఱచినట్టి దుష్టాత్ముని పాపము నాకుఁ గలుగుఁగాక. ౨౮

రాముఁ డడవికిఁ బోవుటకు నేను సమ్మతించియుందు నేని విశాలంబులగు బాహువులును బాహుశిఖరంబులు గలవాఁడును జంద్రసూర్యులకుం బోలెఁ గాంతిగలవాఁడు నగు నారాముఁడు రాజ్యాధిపతియయి నిండుకొలువున సింహాసనంబునం గూర్చుండి యుండునప్పుడు సందర్శించి యాసౌఖ్యం బనుభవించు భాగ్యంబు నాకుఁ గలుగకుండుఁగాక. ౨౯

రాముఁ డడవికిఁ బోవుటకు నేను సమ్మతించియుందు నేని పాయసంబును గృసరంబును ఛాగమాంసంబును దేవతలకుఁగాని పితరులకుఁగాని యతిథులకుఁ గాని నివేదింపక తనంతనె భక్షించినవానికిం గల్గు పాపంబును, దలిదండ్రులు మొదలగుగురుజనంబుల నవమానించినవాని పాపంబును నాకుఁ గలుగుఁగాక. ౩౦

రాముఁ డడవికిఁ బోవుటకు నేను సమ్మతించియుందు నేని గోవులను బాదంబుచేఁ దాఁకినవానికిఁ గల్గుపాపంబును దానైయె గురువులనునిందించిన వానిపాపంబును స్నేహితునకు ద్రోహంబుఁ దలంచినవానిపాపంబును నాకుఁ గలుగుఁగాక. ౩౧

రాముఁ డడవికిఁ బోవుటకు నేను సమ్మతించియుందు నేని స్నేహితుఁ డొకఁడు రహస్యంబున నమ్మకంబుచేఁ దనయపవాదంబును దనతోఁ జెప్పఁ గొనఁగా దాని వెల్లడిచేసినవానిపాపంబు నాకుఁ గలుగుఁగాక. ౩౨

రాముఁ డడవికిఁ బోవుటకు నేను సమ్మతించియుందు నేని కొంచె

లోకే భవతు విద్వేష్యో యస్యాఽర్యోఽనుమతే గతః. 33

పుత్రైర్దారైశ్చ భృత్యైశ్చ స్వగృహే పరివారితః,
స ఏకో మృష్ట మశ్నాతు యస్యాఽర్యోఽనుమతే గతః. 34

అప్రాప్య సదృశాన్ దారా ననపత్యః ప్రమీయతామ్,
అనవాప్య క్రియాం ధర్మ్యాం యస్యాఽర్యోఽనుమతేగతః. 35

మాఽఽత్మన స్సంతతిం ద్రాక్షీ త్స్వేషు దారేషు దుఃఖితః.
ఆయు స్సమగ్ర మప్రాప్య యస్యాఽర్యోఽనుమతే గతః. 36

రాజస్త్రీబాలవృద్ధానాం వధే యత్పాప ముచ్యతే,
భృత్యత్యాగే చ యత్పాపం తత్పాపం ప్రతిపద్యతామ్. 37

లాక్షయా మధుమాంసేన లోహేన చ విషేణ చ,
సదైవ బిభృయా ద్భృత్యా న్యస్యాఽర్యోఽనుమతే గతః. 38

సఙ్గ్రామే సముపోఢే స్మ శత్రుపక్షభయఙ్కరే,
పలాయమానో వధ్యేత యస్యాఽర్యోఽనుమతే గతః. 39

మయిన నపకారము సేయనివాని పాపంబును తన కితరు లెంత యుపకారము చేసినను దానినంతయుం మఱచిపోవువాని పాపంబును ఉరివోసికొనుట మొదలగువానిచేఁ బ్రాణంబులు విడిచి దుర్మరణంబున నొందినవాని పాపంబును పాపంబుచేసి ప్రాయశ్చిత్తంబయినను జేసికొనక సిగ్గులేక తిరుగుచుండువాని పాపంబును బొంది నేను లోకంబున నందఱకును ద్వేషినగుదును గాక. ౩౩

రాముఁ డడవికిఁ బోవుటకు నేను సమ్మతించియుండు నేని తనయింటఁ గొడుకులును భార్యయును భృత్యులును జూచుచుండఁగా వారలను విడిచి మృష్టాన్నంబులఁ గుడుచువానికిం గల్గుపాపంబు నాకుఁ గలుగుఁగాక. ౩౪

రాముఁ డడవికిఁ బోవుటకు నేను సమ్మతించియుండు నేని మంచి భార్యం బొందనేరక ధర్మ్యంబులగు నగ్నిహోత్రాదులు సేయక సంతానంబుఁ గూడ లేక యిట్లు ఈలోకంబునందును బరలోకంబునందును రెంటను జెడి పోదును గాక. ౩౫

రాముఁ డడవికిఁ బోవుటకు నేను సమ్మతించియుండు నేని నేను సంపూర్ణాయుస్సుఁ బొందక దుఃఖితుఁడనై యుందును; మఱియుం నాభార్యయందు నాకు సంతానము గలుగకుండుఁగాక. ౩౬

రాముఁ డడవికిఁ బోవుటకు నేను సమ్మతించియుండు నేని రాజునుగాని స్త్రీనిగాని బాలునిగాని వృద్ధునిగాని చంపినను భృత్యుని బోషింపక విడిచినను ఏపాపంబు గలుగునో ఆపాపము నాకుఁ గలుగుఁగాక. ౩౭

రాముఁ డడవికిఁ బోవుటకు నేను సమ్మతించియుండు నేని యెల్లప్పుడును లత్తుక, మద్యము, మాంసము, లోహము, విషము ఇవి మొదలగు నిషిద్ధ ద్రవ్యంబుల విక్రయించి కుటుంబపోషణము చేసికొనుచుండువానికిఁ గల్గు పాపంబు నాకుఁ గలుగుఁగాక. ౩౮

రాముఁ డడవికిఁ బోవుటకు నేను సమ్మతించి యుండు నేని భయంకరం బగుయుద్ధంబునందు భయంబున వెనుకకుఁ దిరిగి పాఱిపోవుచుఁ జంపఁబడిన వానికిఁ గల్గుపాపంబు నాకుఁ గలుగుఁగాక. ౩౯

కపాలపాణిః పృథివీ మటతాం చీరసంవృతః,
భిక్షమాణో యథోన్మత్తో యస్యార్యోఽనుమతే గతః. ४०

పానే ప్రసక్తో భవతు స్త్రీష్వక్షేషు చ నిత్యశః,
కామక్రోధాభిభూతస్తు యస్యార్యోఽనుమతే గతః. ४౧

మా స్మ ధర్మే మనో భూయా దధర్మం స నిషేవతామ్,
అపాత్రవర్షీ భవతు యస్యార్యోఽనుమతే గతః. ४౨

సఞ్చితా న్యస్య విత్తాని వివిధాని సహస్రశః,
దస్యుభి ర్విప్రలుప్యన్తాం యస్యార్యోఽనుమతే గతః. ४3
ఉభే సన్ధ్యే శయానస్య యత్పాపం పరికల్ప్యతే,
తచ్చ పాపం భవే త్తస్య యస్యార్యోఽనుమతే గతః. ४४

య దగ్నిదాయకే పాపం య త్పాపం గురుతల్పగే,
మిత్రద్రోహే చ యత్పాపం త త్పాపం ప్రతిపద్యతామ్. ४५

దేవతానాం పితౄణాం చ మాతాపిత్రో స్తథైవ చ,
మా స్మ కార్షీ త్స శుశ్రూషాం యస్యార్యోఽనుమతే గతః.

సతాం లోకా త్సతాం కీర్త్యా త్సజ్జుష్టా త్కర్మణ స్తథా,
భ్రశ్యతు క్షిప్ర మ ద్యైవ యస్యార్యోఽనుముతే గతః. ४८

రాముఁడడవికిఁ బోవుటకు సమ్మతించియుందునేని నేను గపాలంబు చాల్చి గడ్డపేలికలం గట్టుకొని యున్మత్తుఁడనుంబోలె నీభూమియంతయుఁ దిరిగి బిచ్చ మెత్తుదునుగాక. ౪౦

రాముఁడడవికిఁ బోవుటకు నేను సమ్మతించియుందునేని ఎల్లప్పుడును గామక్రోధంబులకుఁ లోఁబడి మద్యపానంబు సేయుచు స్త్రీపరవశుఁడనై జూద మాడుచు నుందునుగాక. ౪౧

రాముఁడడవికిఁ బోవుటకు నేను సమ్మతించియుందునేని నాకు ధర్మబుద్ధిలేక యధర్మమునందే ప్రవృత్తిగలుగుఁగాక. మఱియుం యోగ్యులగువారలకుఁ గొంచెమైన నివ్వక యయోగ్యులకె విపరీతముగా దానంబు సేయుచుందునుగాక. ౪౨

రాముఁడడవికిఁ బోవుటకు నేను సమ్మతించియుందునేని నేను నానావిధములుగా సంపాదించిన ధనమంతయుం దొంగలపాలగునుగాక. ౪౩

రాముఁడడవికిఁ బోవుటకు నేను సమ్మతించియుందునేని సూర్యోదయ కాలంబునను సూర్యాస్తమయకాలంబునను నిద్రించినవానికిఁ గలుగుపాపము నాకుఁ గలుగుఁగాక. ౪౪

రాముఁడడవికిఁ బోవుటకు నేను సమ్మతించియుందునేని ఇండ్లపై నిప్పు పెట్టినవానికే పాపంబు గలుగునో గురుభార్యను బొందినవానికే పాపంబు గలుగునో మిత్రద్రోహము చేసినవానికే పాపంబు గలుగునో ఆపాపంబు లన్నియుం నాకుఁ గలుగుఁగాక. ౪౫

రాముఁడడవికిఁ బోవుటకు నేను సమ్మతించియుందునేని దేవతలకుఁ గాని పితృదేవతలకుఁగాని తలిదండ్రులకుఁగాని సేవసేయనివానికిఁ గలుగు పాపంబు నాకుఁ గలుగుఁగాక. ౪౬

రాముఁడడవికిఁ బోవుటకు నేను సమ్మతించియుందు నేని నేను సత్పురుషులచే విడువఁబడుదును గాక. మఱియుం సత్పురుషు లాచరించునట్టి సత్కర్మము లాచరింపక భ్రష్టుఁడ నగుదును గాక. ౪౭

అపాస్య మాతృశుశ్రూషా మనర్థే సోఽవతిష్ఠతామ్,
దీర్ఘబాహు ర్మహావక్షా యస్యార్యోఽనుమతే గతః. ౪౮

బహుపుత్త్రో దరిద్రశ్చ జ్వరరోగసమన్వితః,
సభూయా త్సతతక్లేశీ యస్యార్యోఽనుమతే గతః. ౪౯

ఆశా మాశంసమానానాం దీనానా మూర్ధ్వచక్షుషామ్,
అర్థినాం వితథాం కుర్యా ద్యస్యార్యోఽనుమతే గతః. ౫౦

మాయయా రమతాం నిత్యం పరుషః పిశునోఽశుచిః,
రాజ్ఞో భీత స్త్వధర్మాత్మా యస్యార్యోఽనుమతే గతః. ౫౧

ఋతుస్నాతాం సతీం భార్యా మృతుకాలానురోధినీమ్,
అతివర్తేత దుష్టాత్మా యస్యార్యోఽనుమతే గతః. ౫౨

ధర్మదారా న్పరిత్యజ్య పరదారా న్నిషేవతామ్,
త్యక్తధర్మరతి ర్మూఢో యస్యార్యోఽనుమతే గతః. ౫౩

విప్రలుప్తప్రజాతస్య దుష్కృతం బ్రాహ్మణస్య యత్,
తదేవ ప్రతిపద్యేత యస్యార్యోఽనుమతే గతః. ౫౪

పానీయదూషకే పాపం తథైవ విషదాయకే,
యత్తదేకస్స లభతాం యస్యార్యోఽనుమతే గతః. ౫౫

అజానుబాహుఁడును విశాలమగుఱొమ్ముగలవాఁడు నగు రాముఁ డడవికిఁ బోవుటకు నేను సమ్మతించి యుండుదునేని మాతృశుశ్రూషను జేయక యనర్థంబు నొందుదునుగాక. ౪౫

రాముఁ డడవికిఁ బోవుటకు నేను సమ్మతించియుండునేని నేను బహు పుత్రుల నొంది దరిద్రుఁడనై యందును జ్వరాదిరోగంబులచే బీడింపఁబడుచు నిట్లెల్లప్పుడును దుఃఖపడుచుండఁగలను. ౪౬

రాముఁ డడవికిఁ బోవుటకు నేను సమ్మతించియుందునేని యున్నతాస నంబునం గూర్చుండియున్న తన్నుఁ దలపైకెత్తి చూచుచు నానావిధం బులం బ్రస్తుతింపుచున్న దీనులగు యాచకులయాశను వ్యర్థముచేసినవానికిఁ గలుగు పాపంబు నాకుఁ గలుగుఁగాక. ౫౦

రాముఁ డడవికిఁ బోవుటకు నేను సమ్మతించియుందునేని నేను అధ ర్మిష్ఠుఁడనై కఠినుఁడనై పాపినై రాజభయంబు నొంది మోసముచే జీవింపు చుందునుగాక. ౫౧

రాముఁ డడవికిఁ బోవుటకు నేను సమ్మతించియుందునేని పతివ్రత యగు భార్య ఋతుస్నాతయయి ఋతుకాలనియమంబు ననుసరించి యుం డఁగా నాబిడను విడనాడినవానికిఁ గల్గుపాపము నాకుం గల్గుఁగాక. ౫౨

రాముఁ డడవికిఁ బోవుటకు నేను సమ్మతించియుందునేని ధర్మంబు విడిచి మూఢుఁడై తనభార్యను విడిచి పరస్త్రీలం బొందుచున్నవానికిఁ గలుగు పాపము నాకుఁ గలుగుఁగాక. ౫౩

రాముఁ డడవికిఁ బోవుటకు నేను సమ్మతించియుందునేని భార్యయందు సంతానంబు సంపాదించుకొనక వేశ్యాపరవశుఁడై యుండు బ్రాహ్మణునకుఁ గలుగుపాపము నాకుఁ గలుగుఁగాక. ౫౪

రాముఁ డడవికిఁ బోవుటకు నేను సమ్మతించియుందునేని జలమును దూషించినను ఎవ్వరికైన విషం బిచ్చి చంపినను ఏపాపంబు గలుగునో ఆపాపం బంతయుం నాకొక్కనికె కలుగుఁగాక. ౫౫

బ్రాహ్మణా యోద్యతాం పూజాం విహన్తు కలుషేన్ద్రియః,
బాలవత్సాం చ గాం దోగ్ధుం యస్యాఽర్యోఽనుమతే గతః.

తృష్ణార్తం సతి పానీయే విప్రలమ్భేన యోజయేత్,
లభేత తస్య యత్పాపం యస్యాఽర్యోఽనుమతే గతః. ౫౭

భక్త్యా వివదమానేషు మార్గ మాశ్రిత్య పశ్యతః,
తస్య పాపేన యుజ్యేత యస్యాఽర్యోఽనుమతే గతః. ౫౮

విహీనాం పతిపుత్రాభ్యాం కౌసల్యాం పార్థివాత్మజః,
ఏవ మాశ్వాసయ న్నేవ దుఃఖార్తో నిపపాత హ. ౫౯

తథా తు శపథైః కష్టై శ్శపమాన మచేతనమ్,
భరతం శోకసన్తప్తం కౌసల్యా వాక్య మబ్రవీత్. ౬౦
మమ దుఃఖ మిదం పుత్త్ర! భూయ స్సముపజాయతే,
శపథై శ్శపమానో హి ప్రాణా నుపరుణత్సి మే. ౬౧
దిష్ట్యా నచలితో ధర్మా దాత్మా తే సహలక్ష్మణః,
వత్స! సత్యప్రతిజ్ఞో మే సతాం లోకా నవాప్స్యసి. ౬౨

ఇత్యుక్త్వా చాఙ్క మానీయ భరతం భ్రాతృవత్సలమ్,
పరిష్వజ్య మహాబాహుం రురోద భృశదుఃఖితా. ౬౩

ఏవం విలపమానస్య దుఃఖార్తస్య మహాత్మనః,
మోహాచ్చ శోకసంరోధా ద్బభూవ లులితం మనః. ౬౪

రాముఁ డడవికిఁ బోవుటకు నేను సమ్మతించియుండు నేని బ్రాహ్మణునకుఁ జేయ నిశ్చయింపఁబడిన సత్కారమునకు విఘాతము గావించినవానికిఁ గలుగు పాపమును ఈని పదిదినములు గాకమునుపె యావును బితుకువానికిఁ గలుగు పాపమును నాకుఁ గలుగుఁగాక. ౫౬

రాముఁ డడవికిఁ బోవుటకు నేను సమ్మతించియుండు నేని తనయొద్ద జలముండఁగా దప్పిగొన్నవానికి జలం బీయక మోసపుచ్చినవానికిఁ గలుగు పాపము నాకుఁ గలుగుఁగాక. ౫౭

రాముఁ డడవికిఁ బోవుటకు నేను సమ్మతించియుండు నేని ఇద్దఱు జగడమాడుచుండఁగా నం దొక్కనియందలి స్నేహంబున నతనికి మాత్రము జయోపాయముఁ జెప్పువానికిఁ గలుగు పాపము నాకుఁ గలుగుఁగాక. ౫౮

రాచకొమరుఁడగు భరతుఁడు పెనిమిటికొడుకుల యిద్దఱ చేతను విడువఁబడియుండు కౌసల్యకుఁ దనయందు నమ్మకంబు గలిగించుమాటల నిట్లు చెప్పుచునె పరమదుఃఖితుఁడై నేలం బడెను. ౫౯

కౌసల్య యంత నట్లు దుస్సహంబులగు శపథంబులు చేసి పరమదుఃఖితుఁడై మూర్ఛిల్లి పడియున్న భరతుం జూచి యిట్లని చెప్పెను. ౬౦

పుత్రుఁడా! నీ విట్లు శపథములు సేయుటచేత నాదుఃఖము మఱిమఱి హెచ్చగుచున్నది. నాప్రాణంబులే పోవునట్లున్నవి. ౬౧

భరతుఁడా! భాగ్యవశంబువలన లక్ష్మణుండువలె నీవును ధర్మంబు విడువకున్నావు. ఇట్లు నీవు సత్యప్రతిజ్ఞుఁడవై సత్పురుషులు పొందులోకంబు నొందఁగలవు. అని కౌసల్య భరతునితోఁ జెప్పినది. ౬౨

కౌసల్య ఇట్లు చెప్పి తోఁబుట్టువులయం దతిప్రేమగలవాఁడును మహాబాహుఁడు నగు భరతునిం దనతొడపైఁ గూర్చుండఁబెట్టుకొని కవుఁగిలించి పరమదుఃఖితయయి రోదనంబు చేసినది. ౬౩

ఇట్లు విలపించుచు దుఃఖితుఁడై యున్న మహాత్ముఁడగు భరతుని మనస్సు దుఃఖాతిశయమునను మూర్ఛవలనను జలనంబు నొందినది. ౬౪

లాలప్యమానస్య విచేతనస్య
ప్రణష్టబుద్ధేః పతితస్య భూమౌ,
ముహుర్ముహు ర్నిశ్శ్వసతశ్చ ఘర్మం
సా తస్య శోకేన జగామ రాత్రిః. ౬౫

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే పఞ్చసప్తతితమస్సర్గః.

## షట్సప్తతితమస్సర్గః

త మేవం శోకసన్తప్తం భరతం కైకయీసుతమ్,
ఉవాచ వదతాం శ్రేష్ఠో వసిష్ఠ శ్శ్రేష్ఠవా గృషిః. ౧

అలం శోకేన భద్రం తే రాజపుత్త్ర! మహాయశః!,
ప్రాప్తకాలం నరపతేః కురు సంయాన ముత్తమమ్. ౨

వసిష్ఠస్య వచ శ్శ్రుత్వా భరతో ధారణాం గతః,
ప్రేతకార్యాణి సర్వాణి కారయామాస ధర్మవిత్. 3
ఉద్ధృతం తైలసంరోధా త్సతు భూమౌ నివేశితమ్,
ఆపీతవర్ణవదనం ప్రసుప్త మివ భూపతిమ్. ౪
సంవేశ్య శయనే చాగ్ర్యే నానారత్నపరిష్కృతే,
తతో దశరథం పుత్త్రో విలలాప సుదుఃఖితః. ౫
కిం తే వ్యవసితం రాజ! న్ప్రోషితే మ య్యనాగతే,
వివాస్య రామం ధర్మజ్ఞం లక్ష్మణం చ మహాబలమ్. ౬
క్వ యాస్యసి మహారాజ! హిత్వేమం దుఃఖితం జనమ్,
హీనం పురుషసింహేన రామే ణాక్లిష్టకర్మణా. ౭

అట్లు భరతుఁడు విలపించుచు మూర్ఛిల్లి విసంజ్ఞుఁడై నేలం బడి వేఁడి నిట్టూర్పులు పుచ్చుచు ఇట్లు దుఃఖించుచుండఁగానే యారాత్రియంతయుఁ గడచినది. ౭౫

ఇది డెబ్బదియైదవసర్గము.

## డెబ్బదియాఱవసర్గము

మాటలాడువారలలో శ్రేష్ఠుఁడును మంచిమాటలు గలవాఁడు నగు వసిష్ఠమహర్షి ఇట్లు పరమదుఃఖితుఁడై యున్న కైకేయికొడుకైన భరతుని జూచి ఇట్లని చెప్పెను. ౧

మహాకీర్తిశాలివగు భరతుఁడా! దుఃఖంబు విడువుము. నీకు మంగళము గలుగుఁగాక. దశరథమహారాజునకుఁ జేయవలసిన యంత్యక్రియం జేయుము. అని వసిష్ఠుఁడు భరతునకుఁ జెప్పెను. ౨

ధర్మవేత్తయగు భరతుఁడు వసిష్ఠునిమాటను విని కొంతధైర్యంబునొంది తండ్రికిఁ జేయవలసిన ప్రేతకార్యము లన్నింటిని గావించెను. ౩

భరతుఁడు తైలద్రోణియందుండి యెత్తి నేలం బెట్టఁబడి ముఖంబునఁ బసుపువన్నె గదుర నిద్రవోయినట్లున్న దశరథమహారాజు కళేబరంబును నానావిధమణులచే నలంకృతంబయిన యుత్తమశయనంబున నునిచి యంతఁ బరమదుఃఖితుఁడై రోదనంబు చేసెను. ౪,౫

దశరథమహారాజా! నేను దూరదేశమున నుండునప్పుడు ధర్మజ్ఞుఁడగు రాముని మహాబలుఁడగు లక్ష్మణునిమనసుతో నేమియుంచుకొని వనంబునకుఁ బంపినావు? నీ యభిప్రాయ మేమి? ౬

దశరథమహారాజా! అందఱకును సుఖకరంబులగు కార్యములు చేయు నట్టి పురుషశ్రేష్ఠుఁడగు రాముని విడిచి పరమదుఃఖితులమయియున్న మమ్ము విడిచి నీ వెచ్చటికిఁ బోయెదవు? ౭

యోగక్షేమం తు తే రాజన్! కోఽస్మి న్కల్పయితా పురే,
త్వయి ప్రయాతే స్వ స్తాత! రామే చ వన మాశ్రి తే. ౮
విధవా పృథివీ రాజన్! త్వయా హీనా న రాజతే,
హీన చన్ద్రేవ రజనీ నగరీ ప్రతిభాతి మా. ౯

ఏవం విలపమానం తం భరతం దీనమానసమ్,
అబ్రవీ ద్వచనం భూయో వసిష్ఠ స్తు మహామునిః. ౧౦
ప్రేతకార్యాణి యాన్యస్య క ర్తవ్యాని విశాంపతేః,
తా న్యవ్యగ్రం మహాబాహో! క్రియన్తా మవిచారితమ్. ౧౧

తథేతి భరతో వాక్యం వసిష్ఠ స్యాభిపూజ్య తత్,
ఋత్విక్పురోహితాచార్యాం స్త్వరయామాస సర్వశః. ౧౨
యే త్వగ్నయో నరేన్ద్రస్య చాగ్న్యగారా ద్బహిష్కృతాః,
ఋత్విగ్భి ర్యాజకై శ్చైవ తేఽహ్రియన్త యథావిధి. ౧౩
శిబికాయా మథాఽఽరోప్య రాజానం గతచేతసమ్,
బాష్పకణ్ఠా విమనస స్త మూహుః పరిచారకాః. ౧౪

హిరణ్యం చ సువర్ణం చ వాసాంసి వివిధాని చ,
ప్రకిరన్తో జనా మార్గం నృపతే రగ్రతో యయుః. ౧౫

చన్దనాగరునిర్యాసాన్ సరళం పద్మకం తథా,
దేవదారూణి చాఽఽహృత్య క్షేపయన్తి తథాఽపరే. ౧౬
గన్ధా నుచ్చావచాం శ్చాన్యాం స్తత్ర గత్వాఽథ భూమిపమ్,
తత స్సంవేశయామాసు శ్చితామధ్యే త మృత్విజః. ౧౭

నాయనా! దశరథమహారాజా! నీవు మృత్యువశుఁడవైతివి. రాముఁడడవికిఁ బోయెను. ఇంక నీరాజ్యంబునకు నెవ్వరు యోగక్షేమంబులు సేయుదురు? ౮

దశరథమహారాజా! నీవు లేకుండుటవలన నీభూమి విధవయయి ప్రకాశింపకున్నది. నీవు లేకుండుటవలన నీ పట్టణము చంద్రుఁడులేని రాత్రివలె నున్నది. అని భరతుఁడు విలపించెను. ౯

అంత వసిష్ఠమహాముని యట్లు విలపించుచు దీనచేతసుఁడైయున్న భరతుంజూచి మరల నిట్లని చెప్పెను. ౧౦

మహాబాహుఁడవగు భరతుఁడా! దశరథమహారాజున కిప్పుడు ప్రేతకార్యంబు లేమి సేయవలయునో ఆలస్యంబు సేయక వానినన్నింటిని గావింపుము. అని వసిష్ఠుఁడు భరతునకుఁ జెప్పెను. ౧౧

భరతుఁడు వసిష్ఠుఁడు చెప్పినందుకు అలాగేయనిచెప్పి ఋత్విజులను పురోహితుల నాచార్యులను శీఘ్రముగా రావింపుఁడని త్వరపఱచెను. ౧౨

లోపల శవంబుండుటవలన బైట నుంచఁబడియున్న యగ్నిహోత్రంబులను ఋత్విజులను పురోహితులను దెచ్చిరి. ౧౩

అంతఁ బరిచారకులు మృతుఁడయిన దశరథమహారాజు కళేబరంబును బల్లకియం దుంచి పరమదుఃఖితులయి కన్నీళ్లు గార్చుచు మోసికొని పోయిరి. ౧౪

జనులు వెండినాణెములను బంగారునాణెములను నానావిధములగు వస్త్రములను మార్గంబున వెదఁజల్లుచు దశరథమహారాజునకు ముందు నడచిరి. ౧౫

అట్లు మఱికొందఱు చందనాగరుచూర్ణంబులను గుగ్గిలమును చల్లుచు ధూపంబులు వేయుచు పద్మచూర్ణమును దేవదారుచూర్ణంబును మఱియు నానావిధంబులగు గంధద్రవ్యంబులను జల్లుచుండిరి. అంత నచ్చటికిఁ బోయిన పిదప ఋత్విజులు దశరథమహారాజు కళేబరంబును చితిపైఁ బరుండఁ బెట్టిరి. ౧౬,౧౭

తథా హుతాశనం దత్త్వా జేపు స్తస్య త మృత్విజః,
జగుశ్చ తే యథాశాస్త్రం తత్ర సామాని సామగాః. ౧౮

శిబికాభి శ్చ యానై శ్చ యథార్హం తస్య యోషితః,
నగరా న్నిర్యయు స్తత్ర వృద్ధైః పరివృతా స్తదా. ౧౯

ప్రసవ్యం చాపి తం చక్రుః ఋత్విజోఽగ్నిచితం నృపమ్,
స్త్రియ శ్చ శోక సంతప్తాః కౌసల్యాప్రముఖా స్తదా. ౨౦

క్రౌఞ్చీనా మివ నారీణాం నినాద స్తత్ర శుశ్రు వే,
ఆర్తానాం కరుణం కాలే క్రోశ న్తీనాం సహస్రశః. ౨౧
తతో రుదన్త్యో వివశా విలప్య చ పునఃపునః,
యానేభ్య స్సరయూతీర మవతేరు ర్వరాఙ్గనాః. ౨౨

కృతోదకం తే భరతేన సార్ధం
నృపాఙ్గనా మన్త్రిపురోహితా శ్చ,
పురీం ప్రవి శ్యాశ్రు పరీత నేత్రా
భూమౌ దశాహం వ్యనయన్త దుఃఖమ్. ౨౩
ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే షట్సప్తతితమస్సర్గః.

---

## సప్తసప్తతితమస్సర్గః

తతో దశాహేఽతిగతే కృతశౌచో నృపాత్మజః,
ద్వాదశేఽహాని సమ్ప్రాప్తే శ్రాద్ధకర్మాణ్యకారయత్. ౧

బ్రాహ్మణేభ్యో దదౌ రత్నం ధన మన్నం చ పుష్కలమ్,

అట్లు భరతుఁడు దశరథమహారాజున కగ్నిహోత్రము నొసంగినపిదప ఋత్విజులు పైతృమేధికమంత్రంబులం బఠించిరి. అందు సామగులు యథాశాస్త్రంబుగా సామగానములు చేసిరి. ౧౮

అప్పుడు వృద్ధులు పరివేష్టింప నాదశరథునిభార్యలు యథాయోగ్యంబుగాఁ బల్లకీలను రథంబులను ఆరోహించి పట్టణంబుననుండి వెడలియచ్చటికే తెంచిరి. ౧౯

అప్పుడు ఋత్విజులును దుఃఖితలయియున్న కౌసల్యాదిస్త్రీలును భరతుఁడును పెక్కుయాగంబులు చేసిన దశరథమహారాజునకు అప్రదక్షిణంబునుం గావించిరి. ౨౦

అంత నప్పుడు కౌసల్యమొదలగుస్త్రీలు దుఃఖితలయి వేయివిధంబులఁ గ్రౌంచపక్షులుంబోలె మనోహరస్వరంబున రోదనంబు గావించిరి. ౨౧

అంత నుత్తమవనితలగు నాకౌసల్యాదిస్త్రీలు అట్లు రోదనంబుసేయుచుఁ బరవశలయి మాటిమాటికి విలపించి రథాదివాహనంబుల నారోహించి సరయూనదికి వచ్చిరి. ౨౨

రాజభార్యలును మంత్రులును బురోహితులును భరతునితోఁగూడ దశరథమహారాజునకు నుదకదానంబు గావించి పట్టణంబుఁ బ్రవేశించి కన్నీళ్లొలుక రోదనంబుగావింపుచు నేలపై శయనింపుచు నిట్లు పదిదినంబులు నియమంబున నుండి ఆశౌచంబుఁ గడపిరి.

ఇది డెబ్బదియాఱవసర్గము.

---

## డెబ్బదియేడవసర్గము

అంత పదిదినములు గడచినపిదప భరతుఁడు ఆశౌచంబు దీర్చుకొని పదునొకండవదినంబునం జేయవలసిన శ్రాద్ధకార్యంబులను బండ్రెండవనాటి శ్రాద్ధకార్యంబులను గావించెను. ౧

భరతుఁ డప్పుడు బ్రాహ్మణులకు మణులను ధనమును అన్నమును

వాసాంసి చ మహార్హాణి రత్నాని వివిధాని చ. ౨

బాస్తికం బహుశుక్లంచ గాశ్చాపి శతశ స్తదా,
దాసీదాసం చ యానం చ వేశ్మాని సుమహాన్తి చ. ౩
బ్రాహ్మణేభ్యో దదౌ పుత్రో రాజ్ఞ స్తస్యౌర్ధ్వదైహికమ్,

తతః ప్రభాతసమయే దివసేఽథ త్రయోదశే. ౪
విలలాప మహాబాహు ర్భరత శ్శోకమూర్ఛితః,
శబ్దాపిహితకణ్ఠ స్తు శోధనార్థ ముపాగతః. ౫
చితామూలే పితు ర్వాక్య మిద మాహ సుదుఃఖితః,

తాత! యస్మి న్నిసృష్టోఽహం త్వయా భ్రాతరి రాఘవే. ౬
తస్మి న్వనం ప్రవ్రజితే శూన్యే త్యక్తోఽస్మ్యహం త్వయా,

యస్యా గతి రనాథాయాః పుత్త్రః ప్రవ్రాజితో వనమ్. ౭
తా మమ్బాం తాత! కౌసల్యాం త్యక్త్వా త్వం క్వగతో నృప!,

దృష్ట్వా భస్మారుణం తచ్చ దగ్ధాస్థిస్థానమణ్డలమ్. ౮
పితు శ్శరీరనిర్వాణం నిష్టన న్విషసాద సః,

స తు దృష్ట్వా రుదన్ దీనః పపాత ధరణీతలే. ౯
ఉత్థాప్యమాన శ్శక్రస్య యన్త్రధ్వజ ఇవ చ్యుతః,
అభిపేతు స్తత స్సర్వే తస్యామాత్యా శ్శుచివ్రతమ్. ౧౦
అన్తకాలే నిపతితం యయాతి మృషయో యథా,

ఉత్తమవస్త్రంబులను మఱియు నానావిధంబులగు నుత్తమపదార్థంబులను బుష్కలంబుగా నొసంగెను. ౨

భరతుఁడు మఱియు నప్పుడు ఛాగంబులసమూహమును వెండిని గోవులను దాసీజనంబులను దాసజనంబులను వాహనంబులను విశాలంబులగు గృహంబులను దశరథునిపరలోకక్రియ నుద్దేశించి బ్రాహ్మణులకుఁ బుష్కలంబుగా నొసంగెను. ౩

అంతఁ బదుమూఁడవదినంబు ప్రాతఃకాలంబున భరతుఁడు అస్థిసంచయనార్థమయి దహనప్రదేశంబునకువచ్చి పరమదుఃఖితుఁడయి పేరెలుంగున రోదనంబుఁ జేసెను. ౪,౫

అట్లు భరతుఁడు పరమదుఃఖితుండై తండ్రిచితియొద్ద నీమాటలం జెప్పుకొనుచు రోదనంబు చేసెను.

నాయనా ! నీవు నన్ను ఎవ్వరికప్పగించి పోవలయునో అట్టినాయన్న రాముఁడును అడవికిఁ బోయినాఁడే! ఇట్లు నన్ను దిక్కులేనిచోట విడిచి పోతివి. ౬

మహారాజుఁడవగు నాయనా! అనాథయగు కౌసల్యకొడుకును రాముని వనంబునకుఁ బంపి ఆబిడను దిక్కులేనిదానిఁగాఁ జేసితివే! నీవుగూడ నాబిడను విడిచి యెచ్చటికిఁ బోతివి? అని భరతుఁడు రోదనంబుఁ జేసెను. ౭

ఆభరతుఁ డట్లు కాలి యెఱ్ఱఁగానున్నదియు, దగ్ధములయిన యస్థులు గలదియు, మండలాకారమయినదియు, తండ్రిశరీరమును దగ్ధముగావించినదియు నగు నాచితిం జూచి గట్టిగా నఱచుచు రోదనంబుఁ జేసెను. ౮

భరతుఁ డట్లు దీనుఁడై రోదనంబుసేయుచు ఇంద్రధ్వజము పగ్గములచేఁ బైకెత్తఁబడుచుఁ గొంచెము తప్పి జాఱి నేలం బడునట్లు నేలం బడెను.

అంత నాభరతుని మంత్రులు మొదలగువారలు భరతుఁడు పడుటను జూచి యతనిలేవనెత్తుటకై పుణ్యక్షయంబునం బడినయయాతిని లేవనెత్తుటకు ఋషులుంబోలె నతనితోఁగూడ వ్రాలిరి. ౧౦

శత్రుఘ్న శ్చాపి భరతం దృష్ట్వా శోక పరిప్లుతమ్. ౧౧
విసంజ్ఞో న్యపత ద్భూమౌ భూమిపాల మనుస్మరన్,
ఉన్మత్త ఇవ నిశ్చేతా విలలాప సుదుఃఖితః. ౧౨
స్మృత్వా పితు ర్గుణాఙ్గాని తాని తాని తథాతథా,
మన్థరా ప్రభవ స్తీవ్రః కైకేయీగ్రాహసంకులః. ౧౩
వరదానమయోఽక్షోభ్యోఽమజ్జయ చ్ఛోకసాగరః,
సుకుమారం చ బాలం చ సతతం లాలితం త్వయా. ౧౪
క్వ తాత! భరతం హిత్వా విలపన్తం గతో భవాన్,

నను భోజ్యేషు పానేషు వస్త్రేష్వాభరణేషు చ. ౧౫
ప్రవారయసి నస్సర్వాం స్తన్నః కోఽన్యః కరిష్యతి,

అవదారణకాలే తు పృథివీ నావదీర్యతే. ౧౬
యా విహీనా త్వయా రాజ్ఞా ధర్మజ్ఞేన మహాత్మనా,

పితరి స్వర్గ మాపన్నే రామే చారణ్య మాశ్రితే. ౧౭
కిం మే జీవితసామర్థ్యం ప్రవేక్ష్యామి హుతాశనమ్,

హీనో భ్రాత్రా చ పిత్రా చ శూన్యామిక్ష్వాకుపాలితామ్. ౧౮
అయోధ్యాం న ప్రవేక్ష్యామి ప్రవేక్ష్యామి తపోవనమ్,

తయో ర్విలపితం శ్రుత్వా వ్యసనం చాన్వవేక్ష్య తత్. ౧౯
భృశ మార్తతరా భూయ స్సర్వ ఏవానుగామినః,

శత్రుఘ్నుఁడును భరతుఁడట్లు దుఃఖితుఁడై నేలం బడుటను జూచి తండ్రిం దలంచుకొని పరమదుఃఖితుఁడై మైమఱచి నేలం బడెను. ౧౧

ఆశత్రుఘ్నుఁడు అయ్యో తండ్రిగుణంబులను అవయవంబులను దలంచుకొని పరమదుఃఖితుఁడై మైమఱచి యున్మత్తునియట్లు రోదనంబు చేసెను. ౧౨

మంథరవలనం బుట్టినదియుఁ గైకేయి యను మొసలిగలదియు వరదానమను జలముగలదియుం తీవ్రంబును నక్షోభ్యంబునగు దుఃఖసముద్రంబున మునింగినాము. ౧౩

నాయనా! నీచేత నెల్లప్పుడు నుపలాలింపఁబడుచున్నవాఁడును సుకుమారశరీరుఁడును బాలుఁడునగు భరతుఁడు రోదనంబుసేయుచుండఁగా నీ వతని విడచి యెచ్చటికిఁ బోయియున్నావు? ౧౪

ఆర్యా! భోజ్యపదార్థములయందును పానద్రవ్యములయందును వస్త్రంబులయందును ఆభరణములయందును మీ కెద్ది యిష్టమో దాని దీసికొనుఁ డని నిర్బంధముగా మా కిష్టమయినదాని మేమే దీసికొనునట్లు చేయుచుందువుగదా! అట్లు మా కింక నెవ్వరు చేయుదురు? ౧౫

ధర్మజ్ఞుఁడవు మహాత్ముఁడవు రాజవు నగు నిన్ను విడిచియుఁ బగిలిపోకున్నది. కావున నీభూమి ప్రళయకాలమునందును బగులదని తోఁచుచున్నది. ౧౬

తండ్రివగు నీవు మృతిఁబొంది రాముఁడును వనంబునకుఁ బోయిన పిదప నాకు జీవించియుండుటకు సామర్థ్యంబు లేదు. అగ్నిహోత్రంబుఁజొచ్చియయినం బ్రాణంబులు విడిచెదను. ౧౭

ఇట్లు అన్నను దండ్రిని విడిచి పాడువడియున్న యిక్ష్వాకుపరిపాలితం బగు నయోధ్యాపట్టణంబును నే నెంతమాత్రము ప్రవేశింపను. తపోవనంబు నకుఁ బోయి తపంబు చేసికొనెదను. అని శత్రుఘ్నుఁడు రోదనంబుచేసెను. ౧౮

ఆభరతశత్రుఘ్ను లట్లు రోదనంబు సేయుటను ఆదుఃఖంబునుం జూచి వారి వెంబడివచ్చినవార లందఱు మరల మహాదుఃఖంబు నొంది విలపించిరి. ౧౯

తతో విషణ్ణౌ విక్రాన్తౌ శత్రుఘ్నభరతా వుభౌ. ౨౦
భరణ్యాం సంవ్యవేష్టేతాం భగ్నశృఙ్గావివర్షభౌ,
తతః ప్రకృతిమాన్వైద్యః పితు రేషాం పురోహితః. ౨౧
వసిష్ఠో భరతం వాక్య ముత్థాప్య త మువాచ హ,

త్రయోదశోఽయం దివసః పితు ర్వృత్తస్య తే విభో!. ౨౨
సావశేషాస్థినిచయే కి మిహ త్వం విలమ్బసే,

త్రీణి ద్వంద్వాని భూతేషు ప్రవృత్తా న్యవిశేషతః. ౨౩
తేషు చాపరిహార్యేషు నైవం భవితు మర్హసి,

సుమన్త్రశ్చాపి శత్రుఘ్న ముత్థాప్యాభిప్రసాద్య చ. ౨౪
శ్రావయామాస తత్త్వజ్ఞ స్సర్వభూతభవాభవమ్,

ఉత్థితౌ చ నరవ్యాఘ్రౌ ప్రకాశేతే యశస్వినౌ. ౨౫
వర్షాతపపరిక్లిన్నౌ పృథ గిన్ద్రధ్వజా వివ,
సాశ్రూణి పరిమృద్నన్తౌ రక్తాక్షౌ దీనభాషిణౌ. ౨౬
అమాత్యా స్త్వరయన్తి స్మ తనయౌ చాపరాః క్రియాః.

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే సప్తసప్తతితమ స్సర్గః.



అంత నాభరతశత్రుఘ్నులు ఇర్వురును దుఃఖితులయి విలపించి విలపించి యలసటనొంది కొమ్ములు విఱిగిన వృషభంబులువలె నేలంబడి పొరలిరి. ౨౦

అంతఁ బ్రశస్తంబగు స్వభావంబుగలవాఁడును సర్వజ్ఞుఁడును దశరథ మహారాజపురోహితుఁడునగు వసిష్ఠుఁడు నేలం బొరలుచున్న భరతుని లేవనెత్తి యిట్లని చెప్పెను. ౨౧

ప్రభుఁడవగు భరతుఁడా! నీతండ్రి చనిపోయి యిది పదుమూఁడవ దినము. ఇంకను అస్థిసంచయనము కొఱఁతపడియున్నది. అట్లుండఁగా నీవిచ్చట జాగుసేయుచున్నా వేల? ౨౨

క్షుత్పిపాసలు, శోకమోహములు, జరామరణములు ఇవి మూఁడును సమస్తప్రాణులకును గలవు. ఇవి లేనిప్రాణి యేదియులేదు. అనివార్యములగు వీనిని గుఱించి నీయట్టివాఁడు మూఢునియట్లు దుఃఖింపఁదగదు. అని వసిష్ఠుఁడు భరతునకుం జెప్పెను. ౨౩

అంత సమస్త తత్త్వంబుల నెఱింగినట్టి సుమంత్రుఁడు శత్రుఘ్నుని లేవనెత్తి మంచిమాటం దేర్చి "సమస్తభూతములకును జన్మమరణంబులు స్వాభావికంబులు వానిని వారింప నలవిగాదు కావున నిప్పుడు దుఃఖించుటచే నేమియు నుపయోగంబు లేదు" అని బోధించెను. ౨౪

ప్రశస్తంబగు కీర్తిగల పురుషశ్రేష్ఠులగు భరతశత్రుఘ్నులులేచి వర్షాతపంబులకు గాసిలియున్న యింద్రధ్వజంబులువలెఁ బ్రకాశించుచుండిరి. ౨౫

అంత మంత్రులును కన్నీళ్లు తుడుచుకొనుచు నెఱ్ఱనికన్నులతో దీనస్వరంబున మాటలాడుచున్న భరతశత్రుఘ్నులను శీఘ్రముగా నపరక్రియలం జేయుండని వేగిరపఱచిరి. ౨౬

ఇది డెబ్బదియేడవసర్గము.

---

## అష్టసప్తతితమస్సర్గః

అథ యాత్రాం సమీహన్తం శత్రుఘ్నో లక్ష్మణానుజః,
భరతం శోకసన్తప్త మిదం వచన మబ్రవీత్. ౧

గతి ర్యః సర్వభూతానాం దుఃఖే కిం పున రాత్మనః,
సరామ స్సత్త్వసమ్పన్నః స్త్రియా ప్రవ్రాజితో వనమ్. ౨

బలవా న్వీర్యసమ్పన్నో లక్ష్మణో నామ యోఽప్యసౌ,
కిం న మోచయతే రామం కృత్వా స్మ పితృనిగ్రహమ్. ౩

పూర్వ మేవ తు నిగ్రాహ్య స్సమవేక్ష్య నయానయౌ,
ఉత్పథం య స్సమారూఢో రాజా నార్యా వశంగతః. ౪

ఇతి సమ్భాషమాణే తు శత్రుఘ్నే లక్ష్మణానుజే,
ప్రాగ్ద్వారేఽభూ త్తదా కుబ్జా సర్వాభరణభూషితా. ౫

లిప్తా చన్దనసారేణ రాజవస్త్రాణి బిభ్రతీ,
వివిధం వివిధై స్తై స్తై ర్భూషణై శ్చ విభూషితా. ౬

మేఖలాదామభి శ్చిత్రై రన్యై శ్చ శుభభూషణైః,
బభాసే బహుభి ర్బద్ధా రజ్జుబద్ధేవ వానరీ. ౭

## డెబ్బదియెనిమిదవసర్గము

అటువిమ్మట లక్ష్మణుని తమ్ముఁడగు శత్రుఘ్నుఁడు గృహంబునకుఁ బోయినవెనుక రామునియొద్దకుఁ బోఁగోరుచున్న దుఃఖితుఁడగు భరతుం జూచి యిట్లని చెప్పెను. ౧

దుఃఖంబు గలుగునప్పుడు సమస్తప్రాణులకును దుఃఖంబుఁ బోఁగొట్టి క్షేమంబు గలుగఁజేయుంజాలినట్టి రాముఁడు తనకష్టంబుఁ బోఁగొట్టుకొనఁ జాలునని చెప్పనేల? అట్టిమహాబలశాలియగు రాముఁడు ఒకస్త్రీచేత నడవికిఁ బంపఁబడినాఁడు ! ౨

రాముఁడు సరే యపకీర్తిభయంబునఁ దండ్రిమాటకు లోఁబడియుండును గాక! మహాబలపరాక్రమశాలియగువాఁడు లక్ష్మణుఁడని యొక్కఁడున్నాఁడే? ఆతఁడయినను దండ్రిని నిగ్రహించి రామునివనంబునకుఁ బంపకుండునట్లు ఎందులకుఁ జేయలేదు ? ౩

దుష్టురాలగు కైకేయి చెప్పినమాటను విని దుర్మార్గంబునం బ్రవృత్తుఁడై యున్న దశరథమహారాజును న్యాయాన్యాయంబులం బరిశీలించి యిట్టి యనర్థము సంభవించుటకుమున్నె నిగ్రహింపవలసియుండెను. అని శత్రుఘ్నుఁడు భరతునితోఁ జెప్పెను. ౪

లక్ష్మణుని తమ్ముఁడగు శత్రుఘ్నుఁడు ఇట్లు మాటలాడుచుండఁగానే మంథర అప్పుడు సమస్తాభరణాలంకృతయయి, దైవవశంబున నాభరతశత్రుఘ్నులున్న యింటితూర్పుతట్టు వాకిలియొద్దకు వచ్చెను. ౫

అప్పుడు మంథర యుత్తమంబగు చందనంబుఁ బూసికొని రాజయోగ్యంబులగు వస్త్రంబులు ధరించి నానావిధంబులగు నయ్యెభూషణంబులు ధరించి యెంతయుం నొప్పుచుండినది. ౬

మంథర మఱియుం నానావర్ణంబులగు మొలనూల్లచేతను మఱియుఁ బెక్కుభూషణంబులచేతం గట్టఁబడి త్రాటం గట్టినకోఁతివలెఁ బ్రకాశించుచుండినది. ౭

తాం సమీక్ష్య తదా ద్వాఃస్థా స్సుభృశం పాపకారిణీమ్,
గృహీత్వాఽకరుణాం కుబ్జాం శత్రుఘ్నాయ న్యవేదయత్. ౮
యస్యాః కృతే వనే రామో న్యస్తదేహ శ్చ వః పితా,
సేయం పాపా నృశంసా చ తస్యాః కురు యథామతి. ౯

శత్రుఘ్న శ్చ తదాజ్ఞాయ వచనం భృశదుఃఖితః,
అన్తఃపురచరా న్సర్వా నిత్యువాచ ధృతవ్రతః. ౧౦

తీవ్రముత్పాదితం దుఃఖం భ్రాతౄణాం మే తథా పితుః,
యయా సేయం నృశంసస్య కర్మణః ఫల మశ్నుతామ్. ౧౧

ఏవ ముక్త్వా తు తేనాఽఽశు సఖీజనసమావృతా,
గృహీతా బలవత్కుబ్జా సా తద్గృహ మనాదయత్. ౧౨

తత స్సుభృశసన్తప్త స్తస్యా స్సర్వ స్సఖీజనః,
క్రుద్ధ మాజ్ఞాయ శత్రుఘ్నం విపలాయత సర్వశః. ౧౩
ఆమన్త్రయత కృత్స్నశ్చ తస్యా స్సర్వసఖీజనః,
యథాఽయం సముపక్రాన్తో నిశ్శేషా న్నః కరిష్యతి. ౧౪

సానుక్రోశాం వదాన్యాం చ ధర్మజ్ఞాం చ యశస్వినీమ్,
కౌసల్యాం శరణం యామ సా హి నోఽస్తు ధ్రువా గతిః. ౧౫

స చ రోషేణ తామ్రాక్ష శ్శత్రుఘ్న శ్శత్రుతాపనః,
విచకర్ష తదా కుబ్జాం క్రోశన్తీం ధరణీతలే. ౧౬

అప్పుడు ద్వారపాలకులు మహాపాపిష్ఠురాలును నిర్దయురాలునగు నా మంథరం జూచి దానిం బట్టుకొని శత్రుఘ్నున కప్పగించిరి. ౮

ఎవ్వతెవలన రాముఁ డడవికిఁబోయెనో మీతండ్రి దశరథమహారాజును మృతుఁడయ్యెనో అట్టి పాపిష్ఠురాలును, క్రూరురాలును ఈమంథరే. ఈబిడకు నీమనసునకు వచ్చినటు శిక్ష చేయుము. అని ద్వారపాలకులు శత్రుఘ్నునకుఁ జెప్పిరి. ౯

వ్రతనియమంబు గలశత్రుఘ్నుఁడు ద్వారపాలకులు చెప్పినమాటను విని పరమదుఃఖితుఁడై యంతఃపురంబున నున్నవారల నందఱం జూచి యిట్లని చెప్పెను. ౧౦

ఎవ్వతెవలన నాయన్నలకును తండ్రికిని ఇట్టు తీవ్రదుఃఖంబు గలిగినదో అట్టి యీమంథర తనక్రూరకార్యమునకుం గల్గుఫలము నిప్పు డనుభవించుఁగాక! అని శత్రుఘ్నుఁడు చెప్పెను. ౧౧

అంత శత్రుఘ్నుఁ డిట్టు చెప్పి చెలికత్తెలచేఁ బరివేష్టింపఁబడియున్న మంథరను బలాత్కారంబునం బట్టుకొనఁగానే యాబిడ యాగృహంబంతయుం ధ్వనించునట్లు గట్టిగా నఱచినది. ౧౨

అంత నామంథరచెలికత్తె లందఱు శత్రుఘ్నుఁడు క్రుద్ధుఁడై యుండుటం జూచి పరమదుఃఖితలయి నానావిధంబులం బాఱిరి. ౧౩

ఆమంథరచెలికత్తె లందఱు నిట్లని యాలోచించుకొనిరి.

ఈశత్రుఘ్నుని యారంభంబుఁ జూడఁగా నితఁడు మనల నందఱ నిశ్శేషంబుగా వధించునట్లున్నది. ౧౪

దయగలదియును మధురముగా మాటలాడునదియు ధర్మజ్ఞయుం మహాకీర్తిశాలినియునగు కౌసల్యను శరణుఁ జొత్తము. ఆబిడయే మనలం గాపాడ గలదు. అని యామంథర చెలికత్తెలు పరస్పరము నాలోచించుకొనిరి. ౧౫

అంత శత్రుకులం దపింపఁ జేయునట్టి శత్రుఘ్నుఁడు కోపంబునఁ గన్నుల నెఱ్ఱఁదనంబు గదుర రోదనంబుసేయుచున్న మంథరను నేలం బడవైచి యీడ్చుకొనిపోయెను. ౧౬

శత్రుఘ్నుఁ డట్లు మంథరం బట్టి యీడ్వఁగానే యప్పు డామంథర యొడలిపైనున్న నానావిధంబులగు భూషణంబులు నేలపై రాలినవి. ౧౭

అప్పుడు ఆభూషణంబులు రాలియుండుటంజేసి కాంతిమంతంబగు రాజగృహంబంతయుం శరదృతువునందు స్వచ్ఛనక్షత్రంబులతోఁ గూడియుండు నాకాశంబువలె మిక్కిలియుఁ బ్రకాశించినది. ౧౮

పురుషశ్రేష్ఠుఁడును బలవంతుఁడునగు నాశత్రుఘ్నుఁడు పరమకోపంబున బలాత్కారముచే నామంథరం బట్టుకొని యాబిడను విడిపింప వచ్చిన కైకేయి నదలించి పరుషంబులగు మాటలం దిరస్కరించెను. ౧౯

కైకేయి శత్రుఘ్నుఁడు చెప్పినపరుషవచనంబులకుం బరమదుఃఖిత యయి శత్రుఘ్నుఁ డేమిసేయునోయని మిక్కిలియుఁ భయము నొంది తన కొడుకును భరతుని శరణు చొచ్చినది. ౨౦

అంత భరతుఁ డాకైకేయిపాటుం జూచి శత్రుఘ్నుఁడు క్రుద్ధుఁడై యుండుట నెఱింగి యతనిం జూచి "సమస్తప్రాణులయందును స్త్రీలం జంప రాదు; కావున ఓర్పు దెచ్చుకొనుము" అని యీమాటం జెప్పెను. ౨౧

ధార్మికుఁడగు రాముఁడు మాతృఘాతకుఁడని నన్ను నిందింపకుండునేని నేనే పాపిష్ఠురాలును దుష్టురాలు నగు నీకైకేయిం జంపివేయుదును. అతఁ డట్లు సేయఁడు. నాముఖమైనం జూడఁడు. ౨౨

రాముఁడు ఈమంథరనైనను మనము చంపినట్లు వినునేని ధర్మాత్ముఁడు కావున స్త్రీవధ గావించితిమని నీతోఁగాని నాతోఁగాని యెంతమాత్రము మాటలాడఁడు ఇది నిశ్చయము. అని భరతుఁడు శత్రుఘ్నునకుఁ జెప్పెను.

లక్ష్మణునితమ్ముఁడగు శత్రుఘ్నుఁడు భరతునిమాటను విని యంతఁ గోపంబు చాలించి యామంథరను విడిచిపెట్టెను. ౨౪

అంత నామంథర కైకేయి పాదంబులఁబడి పరమదుఃఖితయయి నిట్టూర్పు వుచ్చుచు రోదనంబుచేసెను. ౨౫

శత్రుఘ్నవిక్షేపవిమూఢసంజ్ఞాం
సమీక్ష్య కుబ్జాం భరతస్య మాతా,
శనై స్సమాశ్వాసయ దార్తరూపాం
క్రౌఞ్చీం విలగ్నా మివ వీక్షమాణామ్. ౨౬

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డేఽష్టసప్తతితమస్సర్గః.

---

## ఏకోనాశీతితమస్సర్గః

తతః ప్రభాతసమయే దివసే చ చతుర్దశే,
సమేత్య రాజకర్తారో భరతం వాక్య మబ్రువన్. ౧
గతో దశరథ స్స్వర్గం యో నో గురుతరో గురుః,
రామం ప్రవ్రాజ్య వై జ్యేష్ఠం లక్ష్మణం చ మహాబలమ్. ౨
త్వ మద్య భవ నో రాజా రాజపుత్ర! మహాయశః!,
సఙ్గత్యా నాపరాధ్నోతి రాజ్యమేతదనాయకమ్. ౩

అభిషేచనికం సర్వ మిద మాదాయ రాఘవ!,
ప్రతీక్షతే త్వాం స్వజన శ్శ్రేణయ శ్చ నృపాత్మజ!. ౪

రాజ్యం గృహాణ భరత! పితృపైతామహం ధ్రువమ్,
అభిషేచయ చాత్మానం పాహి చాస్మా న్నరర్షభ!. ౫

అభిషేచనికం భాణ్డం కృత్వా సర్వం ప్రదక్షిణమ్,
భరత స్తం జనం సర్వ మి త్యువాచ ధృతవ్రతః. ౬

భరతునితల్లియగు కైకేయి శత్రుఘ్నుఁడు పట్టి యీడ్చుటచే మూర్ఛితయయి వలలోఁ దగులుకొని భయంబున నలుదిక్కులం జూచుచున్న క్రౌంచపక్షివలెఁ బరమదుఃఖితయయి రోదనంబు సేయుచున్న మంథరం జూచి యాబిడను మెల్లమెల్లఁగా నాశ్వాసించెను. ౨౬

ఇది డెబ్బదియెనిమిదవసర్గము.

## డెబ్బదితొమ్మిదవ సర్గము

అంత బదునాల్గవదినంబు ప్రాతఃకాలంబున రాజునకుఁ బట్టాభిషేకము సేయువార లందఱు వచ్చి భరతుం జూచి యిట్లని చెప్పిరి. ౧

మనకుఁ బరమగురువైన దశరథమహారాజు జ్యేష్ఠపుత్రుఁడగు రాముని, మహాబలుఁడగు లక్ష్మణుని వనంబునకుం బంపి తాను మృతిఁ బొందెను. ౨

మహాబలశాలివయిన రాజపుత్రుఁడవగు భరతుఁడా! ఇప్పుడు నీవు మాకు రాజవగుము. ఈరాజ్యం బింతవఱకు ననాయకంబయ్యె, దైవయోగంబున జనులు పరస్పరము హింసించుకొనకున్నారుగాని వేఱుగాదు; కావున జాగు సేయక నీవు పట్టాభిషిక్తుండ వగుము. ౩

రాచకొమరుఁడవగు భరతుఁడా! పట్టాభిషేకమునకు గావలసిన పదార్థంబుల నన్నింటిని దీసికొని మంత్రులు మున్నగువారలును, పట్టణంబున నుండుజనులును నీ కెదురుసూచుచున్నారు. ౪

పురుషశ్రేష్ఠుఁడవగు భరతుఁడా! తండ్రితాతలనాఁటనుండి పరంపరాక్రమంబున వచ్చినదియు స్థిరంబునగు రాజ్యంబును గ్రహించి, పట్టాభిషేకంబు గావించుకొని మా బోంట్ల నందఱం గాపాడుము. అని రాజాభిషేకము సేయువారలు భరతునికిం జెప్పిరి. ౫

భరతుఁడు తననియమంబు వదలక పట్టాభిషేకంబునకై సంపాదింపఁబడియున్న పదార్థంబుల నన్నింటికిని బ్రదక్షిణంబుఁ గావించి, రాజాభిషేకకర్తలగు నాపురుషుల నందఱం జూచి యిట్లని చెప్పెను. ౬

జ్యేష్ఠస్య రాజతా నిత్య ముచితా హి కులస్య నః,
నైవం భవన్తో మాం వక్తు మర్హన్తి కుశలా జనాః. ౭

రామః పూర్వో హి నో భ్రాతా భవిష్యతి మహీపతిః,
అహం త్వరణ్యే వత్స్యామి వర్షాణి నవ పఞ్చ చ. ౮
యుజ్యతాం మహతీ సేనా చతురఙ్గమహాబలా,
ఆనయిష్యామ్యహం జ్యేష్ఠం భ్రాతరం రాఘవం వనాత్. ౯

అభిషేచనికం చైవ సర్వ మేత దుపస్కృతమ్,
పురస్కృత్య గమిష్యామి రామహేతో ర్వనం ప్రతి. ౧౦

తత్రైవ తం నరవ్యాఘ్ర మభిషిచ్య పురస్కృతమ్,
ఆనేష్యామి తు వై రామం హవ్యవాహ మివాధ్వరాత్. ౧౧

న సకామాం కరిష్యామి స్వా మిమాం మాతృగన్ధినీమ్,
వనే వత్స్యా మ్యహం దుర్గే రామో రాజా భవిష్యతి. ౧౨

క్రియతాం శిల్పిభిః పన్థా స్సమాని విషమాణి చ,
రక్షిణశ్చానుసంయాన్తు పథి దుర్గవిచారకాః. ౧౩

ఏవం సమ్భాషమాణం తం రామహేతో ర్నృపాత్మజమ్,
ప్రత్యువాచ జన స్సర్వ శ్శ్రీమద్వాక్య మనుత్తమమ్. ౧౪
ఏవం తే భాషమాణస్య పద్మా శ్రీ రుపతిష్ఠతామ్,

మావంశంబున జ్యేష్ఠుఁడు రాజగుటయే కదా యుక్తము ! అట్లుండుట వలన సమస్తమును దెలిసినట్టి మీరు నన్నుఁ జూచి యిట్టిమాట లాడం దగదు. ౭

మాకు జ్యేష్ఠభ్రాతయగు రాముఁడే రాజు కావలయును. నేను అతనికి బదులుగాఁ బదునాలుగుసంవత్సరంబులు వనంబున నుండెదను. ౮

నేను వనంబునకుఁ బోయి నాజ్యేష్ఠభ్రాతయగు రాముని దోడ్కొని వచ్చెదను. చతురంగబలంబులతోఁ గూడిన గొప్పసేనను రావింపుఁడు. దానితోఁ గూడఁ బోయెదను. ౯

ఇప్పుడు పట్టాభిషేకంబునకై సంపాదించియున్న పట్టాభిషేకోపయుక్త ద్రవ్యంబుల నన్నింటిని, రామపట్టాభిషేకంబునకై నాతోఁ గూడం దీసికొని వనంబునకుఁ బోయెదను. ౧౦

పూజ్యుఁడును బురుషశ్రేష్ఠుఁడు నగురామునకు ఆవనంబుననె పట్టాభిషేకంబు గావించి, యాగశాలనుండి యగ్నిహోత్రంబును గృహంబునకుఁ గొనివచ్చునట్లు, ఆయనను వనంబునుండి యిచ్చటికిఁ దోడ్కొని వచ్చెదను. ౧౧

తల్లియనే పేరుమాత్రముగల యాకైకేయికోర్కెనిమట్టును నేనెంత మాత్రము సఫలము గావింపను. నేను గహనంబగు నరణ్యంబున నుండెదను. రాముఁడు రాజు కాఁగలఁడు. ౧౨

శిల్పులు, విషమస్థలంబుల సమములుగాఁ జేసి మార్గంబు సేయున నాజ్ఞాపింపుడు. మఱియు మార్గంబున దుర్గమప్రదేశంబులు దెలిసిన రక్షకపురుషులును వెంబడింతురుగాక. అని భరతుఁడు రాజాభిషేకకర్తలగు వారితోఁ జెప్పెను. ౧౩

రాజాభిషేకకర్తలగు జనులు ఇట్లు రామునియం దతిభక్తితో మాటలాడుచున్నయాభరతుం జూచి పరమార్థంబగు నీమాటం జెప్పిరి. ౧౪

నీవు జ్యేష్ఠుఁడగు రామునికి రాజ్యంబీయవలయునని కోరుచున్నావే,

య స్త్వం జ్యేష్ఠే నృపసుతే పృథివీం దాతు మిచ్ఛసి. ౧౫

అనుత్తమం తద్వచనం నృపాత్మజ
ప్రభాషితం సంశ్రవణే నిశమ్య చ,
ప్రహర్షజా స్తం ప్రతి బాష్పబిన్దవో
నిపేతు రార్యాననేత్రసమ్భవాః. ౧౬
ఊచు స్తే వచన మిదం నిశమ్య హృష్టా
స్సామాత్యా స్సపరిషదో వియాతశోకాః,
పన్థానం నరవర ! భక్తిమా జ్జనశ్చ
వ్యాదిష్ట స్తవ వచనా చ్చ శిల్పివర్గః. ౧౭

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే ఏకోనాశీతితమస్సర్గః.

## అశీతితమస్సర్గః

అథ భూమిప్రదేశజ్ఞా స్సూత్రకర్మవిశారదాః.
స్వకర్మాభిరతా శ్శూరాః ఖనకా యన్త్రకా స్తథా. ౧
కర్మాన్తికాః స్థపతయః పురుషా యన్త్రకోవిదాః,
తథా వర్ధకయ శ్చైవ మార్గిణో వృక్షతక్షకాః. ౨
కూపకారా స్సుధాకారా వంశకర్మకృత స్తథా,
సమర్థా యే చ ద్రష్టారః పురత స్తే ప్రతస్థిరే. ౩

అట్టిధర్మిష్ఠంబులగు మాటలు చెప్పుచున్న నీకుఁ బద్మాలయయగు లక్ష్మీప్రసన్న యయి నీయొద్ద నెల్లప్పుడు నుండుఁగాక! అని రాజాభిషేకకర్తలగు పురుషులు భరతునితోఁ జెప్పిరి. ౧౫

రామునిం దోడ్కొని రావలయునను ప్రతిజ్ఞ విషయమయి రాచకొమరుఁడగు భరతుఁడు చెప్పిన యుత్తమంబగు మాటను విని పూజ్యులగు రాజాభిషేకకర్తలు మున్నగువారలు పరమసంతోషంబు నొంది యానంద బాష్పంబు లొలికించిరి. ౧౬

అంత నారాజాభిషేకకర్తలును, మంత్రులును, మఱియు నితరులును సభికులును భరతునిమాటను విని దుఃఖంబు విడిచి పరమసంతుష్టులయి భరతుం జూచి, "పురుషశ్రేష్ఠుఁడా! నీయాజ్ఞచొప్పున రాజభక్తిగల రక్షకులను మార్గమున నుండుఁడనియు, మార్గంబు సరిసేయుఁడనియు శిల్పులను దిట్టము చేసినాము" అని యీమాటం జెప్పిరి. ౧౭

ఇది డెబ్బదితొమ్మిదవ సర్గము.

---

## ఎనుబదవ సర్గము

అంత సర్వభూప్రదేశంబుల స్వభావంబు దెలిసినవారలును, అగాధంబునగు వాపీకూపంబులనుండి జలంబుఁ జేఁదుట కుపయుక్తంబులగు సూత్రంబులు సేయువారలును, దమకార్యంబునం దతిజాగ్రత్తగల శూరులయిన రక్షకపురుషులును, ద్రవ్వువారలును, యంత్రంబులు సేయువారలును, కూలిపనివాండ్రును, శిల్పులును, అధ్యక్షులగు రాజపురుషులును, యంత్రకార్యంబుల సమర్థులగువారలును, వడ్లవాండ్రును, మార్గం బేర్పరచువాండ్రును, మార్గంబున కడ్డముగానుండు వృక్షంబుల నఱికివేయువారలును, బావులు త్రవ్వువారలును, సున్నంబుఁ బూయువారలును, వెదుళ్లతోఁ బుటికెలు చేటలు మొదలగువానిని జేయువారలును, సమర్థులును బెక్కుమార్గమార్గంబుఁ జూచి యనుభవంబు గల వారలందఱును ముందుగాఁ బోయిరి.

స తు హర్షా త్త ముద్దేశం జనౌఘో విపులః ప్రయాన్,
అశోభత మహావేగ స్సముద్ర ఇవ పర్వణి. ౪

తే స్వవారం సమాస్థాయ వర్త్మకర్మణి కోవిదాః,
కరణై ర్వివిధోపేతైః పురస్తా త్సంప్రతస్థిరే. ౫

లతావల్లీ శ్చ గుల్మాం శ్చ స్థాణూ నశ్మన ఏవచ,
జనా స్తే చక్రిరే మార్గం ఛిన్దన్తో వివిధా న్ద్రుమాన్. ౬

అవృక్షేషు చ దేశేషు కేచి ద్వృక్షా నరోపయన్,
కేచిత్కుఠారై ష్టంకై శ్చ దాత్రై శ్ఛిన్ద న్క్వచి త్క్వచిత్. ౭

అపరే వీరణ స్తమ్బా న్బలినో బలవ త్తరాః,
విధమ న్తి స్మ దుర్గాణి స్థలాని చ తత స్తతః. ౮

అపరేఽపూరయ న్కూపా న్పాంసుభి శ్శ్వభ్ర మాయతమ్,
నిమ్నభాగాం స్తథా కేచి త్సమాం శ్చక్రు స్సమ న్తతః. ౯

బబన్ధు ర్బంధనీయాం శ్చ క్షోద్యా న్సంచుక్షుదు స్తదా,
బిభిదు ర్భేదనీయాం శ్చ తాం స్తా న్దేశా న్నరా స్తదా. ౧౦

అచిరే ణైవ కాలేన పరివాహా న్బహూదకాన్,
చక్రు ర్బహువిధాకారా న్సాగరప్రతిమా న్బహూన్. ౧౧

అసంఖ్యాంబగు నామార్గము సరిసేయు జనులసమూహము, రామునిం జూడఁగల్గునను సంతోషంబున వేగంబున వనంబులకుఁ బోవుచుండునపుడు పూర్ణిమయం దధికవేగంబుగల సముద్రంబువలెఁ బ్రకాశించెను. ౪

మార్గంబు బాగుపఱచుటయందు సమర్థులగు నావనివాండ్రు, ఒక్కొక పనివారు ఒక్కొకగుంపుగాఁ జేరి నానావిధసాధనంబులం దీసికొని ముందుగాఁ బోయిరి. ౫

వారలు లతలను, గుల్మంబులను, ఎండిపోయిన స్తంభాకారంబులయి యుండు వృక్షములను, నానావిధవృక్షములను ఛేదించి, గహనంబగు నరణ్యంబున మార్గంబు కలుగఁ జేసిరి. ౬

కొందఱు వృక్షంబులేని స్థలంబులందు వృక్షంబులు నాటిరి. కొందఱు దారికడ్డమువచ్చు వృక్షంబులు మున్నగువానిని గొడ్డళ్లచేతను, గడ్డపాఱల చేతను, అంపములచేతను ఛేదించిరి. ౭

బలవంతులగు మఱికొందఱు ఛేదింపనలవిగాక దట్టముగా మొలిచి యున్నయవురుగడ్డిని దహించి, పోనలవిగాని ప్రదేశంబుల సమములుగాఁ జేసిరి. ౮

మఱికొందఱు దారి కడ్డముగా నుండు బావులను, పెద్దపెద్దరంధ్రములను మట్టిపోసి పూడ్చిరి. అంతఁ గొందఱు పల్లపునేలలను మట్టిపోసి సమప్రదేశంబులు గావించిరి. ౯

అప్పుడు వారలు, అప్యోదేశంబులందు నదులు మొదలగువానికి సేతువులుగట్టిరి. చూర్ణముసేయఁదగిన మార్గమునందలి పొడిఱాళ్లను జూర్ణము గావించిరి. చెఱువులు మొదలగువానిజలంబు పోవుటకై వానికట్టలం బగులఁగొట్టిరి. ౧౦

వారలు అతిశీఘ్రంబున, నల్పప్రవాహంబుల ననేకములకుఁ గట్టలు గట్టి, యవి యధికజలంబు గలిగి సముద్రంబునకు సాటియయి యుండునట్లు నానావిధంబులం గావించిరి. ౧౧

నిర్జలేషు చ దేశేషు ఖానయామాసు రుత్తమాన్,
ఉదపానా న్బహువిధా న్వేదికాపరిమణ్డితాన్. ౧౨

ససుధాకుట్టిమతలః ప్రపుష్పితమహీరుహః,
మత్తోద్ఘుష్టద్విజగణః పతాకాభి రలఙ్కృతః. ౧౩
చన్దనోదకసంసిక్తో నానాకుసుమభూషితః,
బహ్వశోభత సేనాయాః పన్థా స్సురపథోపమః. ౧౪

ఆజ్ఞాప్యాథ యథాఽఽజ్ఞప్తి యుక్తా స్తేఽధికృతా నరాః,
రమణీయేషు దేశేషు బహుస్వాదుఫలేషు చ. ౧౫
యో నివేశ స్త్వభిప్రేతో భరతస్య మహాత్మనః,
భూయ స్తం శోభయామాసు ర్భూషాభి ర్భూషణోపమమ్. ౧౬

నక్షత్రేషు ప్రశస్తేషు ముహూర్తేషు చ తద్విదః,
నివేశా న్స్థాపయామాసు ర్భరతస్య మహాత్మనః. ౧౭

బహుపాంసుచయా శ్చాపి పరిఖాపరివారితాః,
తత్రేన్ద్రకీలప్రతిమాః ప్రతోలీవరశోభితాః. ౧౮
ప్రాసాదమాలావితతా స్సౌధప్రాకారసంవృతాః,
పతాకాశోభితా స్సర్వే సునిర్మితమహాపథాః. ౧౯
విసర్పద్భి రివాఽఽకాశే విటఙ్కాగ్రవిమానకైః,
సముచ్ఛ్రితై ర్నివేశా స్తే బభు శ్శక్రపురోపమాః. ౨౦

జాహ్నవీం తు సమాసాద్య వివిధద్రుమకాననామ్,
శీతలామలపానీయాం మహామీనసమాకులామ్. ౨౧

వారలు, నిర్జలప్రదేశములందు మనుష్యులకును ఏనుగులకు నుపయోగ మగునట్లు, నానావిధములగు నడబావులను ద్రవ్వి నేళ్లు దీసికొనివచ్చునప్పు డలసట దీర్చుకొనుటకై యచ్చటచ్చట వేదికలును నిర్మించిరి. ౧౨

అంత నానేనామార్గము సున్నముతో గట్టనచేసిన నేలగలదై, చక్కఁగాఁ బుష్పించినవృక్షంబులతో నొప్పుచు మదించి మధురంబుగాఁ గూయుచుండు పక్షులుగలదై యచ్చటచ్చటఁ బతాకలచే నలంకృతమై, సుగంధిచందనజలముచేఁ దడుపఁబడినదై, నానావిధపుష్పపహారాలంకృతమై దేవమార్గముంబోలె నెంతయుఁ బ్రకాశించుచుండినది. ౧౩,౧౪

మార్గంబుచేయఁబడినపిదప, అచ్చట నధికృతులగు రాజపురుషులు శిబిరనిర్మాణమునకై యందఱు చేరి యాలోచించి, పెక్కురుచ్యఫలంబులు గల రమణీయప్రదేశములందు మహాత్ముఁడగు భరతుని మనంబునకు ఏది యభిమతంబుగా నుండునో, అట్టిమార్గాలంకారభూతంబులగు ప్రదేశములకు గనకకలశాదులచే మఱియు నలంకరించిరి. ౧౫,౧౬

జ్యోతిశ్శాస్త్రవేత్త లగువారలు ప్రశస్తంబగు నక్షత్రంబులందు మంచిముహూర్తములను, మహాత్ముఁడగు భగతుఁడు విడియుంటకు అయ్యైస్థలంబుల శిబిరంబులు స్థాపించిరి. ౧౭

మార్గంబునందలి యాశిబిరము లన్నియుం మంచియిసుకనేలలు గలవై, చుట్టు నగడ్తలచేఁ బరివేష్టితము లయి, ఇంద్రకీలపర్వతంబునకు సాటియైనవై మంచివీథులు గలిగి, దేవాలయంబులతోఁ గూడి, సున్నముఁ బూసి తెల్లఁగానుండు ప్రాకారములచేఁ బరివృతములయి, పతాకాలంకృతములయి, సుందరములగు రాజవీథులతో నొప్పుచు, నత్యున్నతంబు లగుటచే నాకాశంబు నొరయుచున్నట్లున్న విటంకాగ్రంబులగు మేడలతోఁగూడి, దేవేంద్ర పట్టణసదృశంబులయి యెంతయుం బ్రకాశించుచుండినవి. ౧౮-౨౦

నానావిధవృక్షంబులుగల యడవులతోఁ గూడినదియు, స్వచ్ఛమయిన చల్లని నీళ్లుగలదియుం మహామీనంబులతో నిండినదియుం నగు గంగానదివఱకు

సచన్ద్రతారాగణమణ్డితం యథా
నభః క్షపాయా మమలం విరాజతే,
నరేన్ద్రమార్గ స్స తథా వ్యరాజత
క్రమేణ రమ్య శ్శుభశిల్పినిర్మితః. ౨౨

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డేఽశీతితమస్సర్గః.

ఏ కా శీ తి త మ స్స ర్గః

తతో నాన్దీముఖీం రాత్రిం భరతం సూతమాగధాః,
తుష్టువు ర్వాగ్విశేషజ్ఞా స్స్తవై ర్మఙ్గళసంహితైః. ౧

సువర్ణకోణాభిహతః ప్రాణదద్యామదున్దుభిః,
దధ్ము శ్శంఖాంశ్చ శతశో నాదాం శ్చోచ్చావచస్వరాన్. ౨

స తూర్యఘోష స్సుమహా న్దివ మాపూరయ న్నివ,
భరతం శోకస న్తప్తం భూయ శ్శోకై రరన్ధ్రయత్. ౩
తతః ప్రబుద్ధో భరత స్తం ఘోషం సన్నివ ర్త్య చ,
నాహం రాజేతి చా ప్యుక్త్వా శత్రుఘ్న మిద మబ్రవీత్. ౪

పశ్య శత్రుఘ్న! కైకేయ్యా లోక స్యాపకృతం మహత్,
విసృజ్య మయి దుఃఖాని రాజా దశరథో గతః. ౫

సాళిబిరములు ప్రకాశించుచుండినవి. అటువెనుక నసాధ్యమగుంటజేసి శిబిరంబులు స్థాపింపఁబడెరి. ౨౧

రాత్రియందు, నక్షత్రంబులతోను జంద్రునితోనుం గూడిన యాకాశంబు ప్రకాశించునట్లు, సుందరంబును సమర్థులగు శిల్పులచే నిర్మితమునగు నాభరతునిమార్గంబు మిక్కిలియుఁ బ్రకాశించుచుండినది. ౨౨

ఇది యెనుబదవసర్గము.

---

## ఎనుబదియొకటవసర్గము

అంత నభ్యుదయయుక్తంబగు నపరరాత్రియందు, మాటలం బండితులగు వందిమాగధులు మంగళయుక్తంబులగు స్తోత్రంబుల భరతుం బ్రస్తుతించిరి. ౧

జాములు దెలుపుటకై యుంచియున్న భేరి, కనకదండముచే వాయింపఁబడినదై మిక్కిలియుం ధ్వనించినది.

అంత వేలువేలుగా శంఖంబులు పూరించిరి. నానావిధధ్వనులగు కాహళ్యాదివాద్యంబుల వాయించిరి. ౨

ఆ వాద్యధ్వని, మిక్కిలియుఁ బెద్దదై యాకాశం బంతయుం నిండి వెలంగుచు, దుఃఖితుండగు భరతునకు మఱియుం మహాదుఃఖంబు గావించెను. ౩

అంత నా ధ్వనికి భరతుఁడు మేల్కని, "నేను రాజును గాను. రాజును బోగడునట్లునన్నుఁ బొగడరాదు. ఈమంగళవాద్యంబుల వాయింపవలదు" అని చెప్పి, యాధ్వని నిలిపించి శత్రుఘ్నునిం జూచి యిట్లని చెప్పెను. ౪

శత్రుఘ్నుఁడా! కైకేయి లోకంబునకు ఎంతగొప్ప యపకారము చేసినదో చూడుము.

దశరథమహారాజు దుఃఖంబుల నన్నింటిని నన్ననుభవించునట్లు చేసి మృతిఁ బొందినాఁడు. ౫

తస్యైషా ధర్మరాజస్య ధర్మమూలా మహాత్మనః,
పరిభ్రమతి రాజశ్రీ ర్నౌరివాకర్ణికా జలే. ౬

యో హి న స్సుమహా న్నాథ స్సోఽపి ప్రవ్రాజితో వనమ్,
అనయా ధర్మ ముత్సృజ్య మాత్రా మే రాఘవ స్స్వయమ్. ౭

ఇత్యేవం భరతం ప్రేక్ష్య విలప న్త మచేతనమ్,
కృపణం రురుదు స్సర్వా స్ససర్వరం యోషిత స్తదా. ౮
తథా తస్మి న్విలపతి వసిష్ఠో రాజధర్మవిత్,
సభా మిక్ష్వాకునాథస్య ప్రవివేశ మహాయశాః. ౯
శాతకుమ్భమయీం రమ్యాం మణిరత్నసమాకులామ్,
సుధర్మా మివ ధర్మాత్మా సగణః ప్రత్యపద్యత. ౧౦

స కాఞ్చనమయం పీఠం సుఖా స్తరణసంవృతమ్,
అధ్యా స్త సర్వవేదజ్ఞో దూతా ననుశశాస చ. ౧౧

బ్రాహ్మణా న్క్షత్రియా న్వైశ్యా నమాత్యా న్గణవల్లభాన్,
క్షిప్ర మానయతావ్యగ్రాః కృత్య మాత్యయికం హి నః. ౧౨

సరాజభృత్యం శత్రుఘ్నం భరతం చ యశస్వినమ్,
యుధాజితం సుమన్త్రం చ యే చ తత్ర హితా జనాః. ౧౩

తతో హాలహాలాశబ్దో మహా న్సముదపద్యత,
రథై రశ్వై ర్గజై శ్చాపి జనానా ముపగచ్ఛతామ్. ౧౪

తతో భరత మాయాన్తం శతక్రతు మి వామరాః,
ప్రత్యనన్ద న్ప్రకృతయో యథా దశరథం తథా. ౧౫
హ్రద ఇవ తిమినాగసంవృతః
స్తిమితజలో మణిశంఖశర్కరః,
దశరథసుతశోభితా సభా
సదశరథేవ బభౌ యథా పురా. ౧౬

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే ఏకాశీతితమస్సర్గః.

---

## ద్వ్యశీతితమస్సర్గః

తా మార్యగణసంపూర్ణాం భరతః ప్రగ్రహాం సభామ్,
దదర్శ బుద్ధిసమ్పన్నః పూర్ణచన్ద్రాం నిశా మివ. ౧

ఆసనాని యథాన్యాయ మార్యాణాం విశతాం తదా,
వస్త్రాఙ్గరాగప్రభయా ద్యోతితా సా సభోత్తమా. ౨

సా విద్వజ్జనసంపూర్ణా సభా సురుచిరా తదా,
అదృశ్యత ఘనాపాయే పూర్ణచన్ద్రేవ శర్వరీ. 3

రాజ్ఞ స్తు ప్రకృతీ స్సర్వా స్సమగ్రాః ప్రేక్ష్య ధర్మవిత్,
ఇదం పురోహితో వాక్యం భరతం మృదు చాబ్రవీత్. ౪

అంత జనులు వచ్చుచున్న యాభరతుంజూచి, దేవతలు దేవేంద్రునిం గొనియాడునట్లు దశరథునింబోలెఁ గొనియాడిరి. ౧౫

పెద్దపెద్దమత్స్యంబులతోను నీటియేనుంగులతోనుంగూడి నిశ్చలజలంబై మణులు శంఖంబులునై యిసుకగాఁ గల్గియున్న సముద్రంబునందలి మడుంగు వలె, దశరథుని గొడుకులయిన భరతశత్రుఘ్నులతోను వసిష్ఠునితోను మంత్రులు మున్నగువారలతోను ఒప్పుచున్న యారాజసభ, మున్ను దశరథుఁ డుండినపుడు వలెనె యెంతయుం బ్రకాశించు చుండినది. ౧౬

ఇది యెనుబదియొకటవసర్గము.

---

## ఎనుబదిరెండవసర్గము

బుద్ధిమంతుఁడగు భరతుఁడు, పూజ్యులగు వసిష్ఠాదులతోఁగూడిన సభను, పూర్ణచంద్రుఁడు బృహస్పత్యాదియుక్తంబగు రాత్రిం జూచునట్లు పరమ సంతోషంబునం జూచెను. ౧

అప్పుడు పూజ్యులగు సభికులు సభం బ్రవేశించి, వారివారి యోగ్యతకుఁ దగినట్లు ఆసనంబులపైఁ గూర్చుండునప్పుడు వారు ధరించియున్న వస్త్రంబులకాంతిచేతను, చందనాద్యంగరాగకాంతిచేతను ఆసభ యెంతయుం బ్రకాశించినది. ౨

అప్పుడు భరతునకుఁ బట్టాభిషేకము జరుగునని చక్కఁగాఁ నలంకరించికొని వచ్చియున్న పండితులతో నిండి మనోహరంబైయున్న ఆసభ శరదృతువునందు నిండుచంద్రునితోఁ గూడినరాత్రివలె మిక్కిలియు నొప్పుచుండినది. ౩

ధర్మవేత్తయగు నావసిష్ఠుఁడు, నానాదేశపురాణులును, ముఖ్యముగా రావలసిన జనులును అందఱు వచ్చియుండుటంజూచి మృదువాక్యంబున భరతుం జూచి యిట్లని చెప్పెను. ౪

తాత! రాజా దశరథ స్స్వర్గతో ధర్మ మాచరన్,
ధనధాన్యవతీం స్ఫీతాం ప్రదాయ పృథివీం తవ. ౫
రామ స్తథా సత్యధృతి స్సతాం ధర్మ మనుస్మరన్,
నాజహా త్పితు రాదేశం శశీ జ్యోత్స్నా మి వోదితః. ౬

పిత్రా భ్రాత్రా చ తే దత్తం రాజ్యం నిహతకణ్టకమ్,
తద్భుఙ్క్ష్వ ముదితామాత్యః క్షిప్ర మే వాభిషేచయ. ౭

ఉదీచ్యా శ్చ ప్రతీచ్యా శ్చ దాక్షిణాత్యా శ్చ కేవలాః,
కోట్యాపరాన్తా స్సాముద్రా రత్నా న్యభిహరన్తు తే. ౮

త చ్ఛ్రుత్వా భరతో వాక్యం శోకే నాభిపరిప్లుతః,
జగామ మనసా రామం ధర్మజ్ఞో ధర్మకాఙ్క్షయా. ౯

స బాష్పకలయా వాచా కలహంసస్వరో యువా,
విలలాప సభామధ్యే జగర్హే చ పురోహితమ్. ౧౦

చరితబ్రహ్మచర్యస్య విద్యాస్నాతస్య ధీమతః,
ధర్మే ప్రయతమానస్య కో రాజ్యం మద్విధో హరేత్. ౧౧

కథం దశరథా జ్జాతో భవే ద్రాజ్యాపహారకః,
రాజ్యం చాహం చ రామస్య ధర్మం వక్తు మి హార్హసి. ౧౨

జ్యేష్ఠ శ్శ్రేష్ఠశ్చ ధర్మాత్మా దిలీపనహుషోపమః,
లబ్ధు మర్హతి కాకుత్స్థో రాజ్యం దశరథో యథా. ౧౩

అనార్యజుష్ట మస్వర్గ్యం కుర్యాం పాప మహం యది,
ఇక్ష్వాకూణా మహం లోకే భవేయం కులపాంసనః. ౧౪
యద్ధి మాత్రా కృతం పాపం నాహం తదపి రోచయే,
ఇహస్థో వనదుర్గస్థం నమస్యామి కృతాఞ్జలిః. ౧౫

రామమేవానుగచ్ఛామి రాజా స ద్విపదాం వరః,

త్రయాణా మపి లోకానాం రాజ్య మర్హతి రాఘవః. ౧౬

తద్వాక్యం ధర్మసంయుక్తం శ్రుత్వా సర్వే సభాసదః,
హర్షా న్ముముచు రశ్రూణి రామే నిహితచేతసః. ౧౭
యది త్వార్యం న శక్ష్యామి వినివర్తయితుం వనాత్,
వనే త త్రైవ వత్స్యామి యథాఽఽర్యో లక్ష్మణ స్తథా. ౧౮

సర్వోపాయం తు వర్తిష్యే వినివర్తయితుం బలాత్,
సమక్ష మార్యమిశ్రాణాం సాధూనాం గుణవర్తినామ్. ౧౯

విష్టికర్మాన్తికా స్సర్వే మార్గశోధకరక్షకాః,
ప్రస్థాపితా మయా పూర్వం యాత్రాఽపి మమ రోచతే. ౨౦

దశరథునకుఁ బుట్టినవాఁడు తనయన్నకు రావలసిన రాజ్యంబు నపహరించునా? ఈరాజ్యంబును రామునిది. నేనును రామునివాఁడనే. ఈవిషయమందు నీవు ధర్మంబుఁ జెప్పవలయును. ౧౨

జ్యేష్ఠుఁడు నుత్తముఁడును ధర్మాత్ముఁడును దిలీపనహుషాది సదృశుఁడును ఇట్లు సమస్త సద్గుణసంపన్నుఁడగు రాముఁడె దశరథునియట్లు రాజ్యంబు నొందఁదగి యున్నాఁడు. ౧౩

ఇట్లు దుష్టులు చేయఁదగినదియు నరకప్రదంబునగు పాపంబు సేయుదునేని నేను ఇక్ష్వాకువంశంబుఁ జెఱుప బుట్టినవాఁడ నగుదును. ౧౪

నాతల్లి కైకేయిచేసిన యధర్మంబునకు నేనెంతమాత్రము లోఁబడను.

నేను ఇచ్చటనుండియే గహనంబగు నరణ్యంబున నున్న రామునకుఁ జేమోడ్పు గీలించి నమస్కారంబుఁ జేసెదను. ౧౫

నేనును రామునే యనుసరించుచుండెదను. పురుషశ్రేష్ఠుఁడగు నా రాముఁడే రాజుకాని మఱెవ్వరును గారు.

రాముఁడు ఈ రాజ్యమునకు మాత్రమే కాదు. ముల్లోకములకును గూడ రాజు గాఁదగును. అని భరతుఁడు వసిష్ఠమహామునితోఁ జెప్పెను. ౧౬

సభికు లందఱును ధర్మయుక్తంబగు నామాటను విని పరమసంతుష్టులయి రామాసక్తమానసులయి ఆనందబాష్పంబు లొలికించిరి. ౧౭

నే నెంతప్రార్థించినను బూజ్యుఁడగు రాముఁడు వనంబు విడిచి యిచ్చటికి రాకయుండునేని పూజ్యుఁడగు లక్ష్మణునితోఁగూడ నేనును అచ్చటనె వనంబున నుండెదను. ౧౮

సత్పురుషులును గుణవంతులు నగు మీసమక్షముననె రాముని వనంబుననుండి తోడ్కొనివచ్చుటకు నాచేతనైనంతవఱకు సమస్తోపాయంబులం గావించెదను. ౧౯

నేను మున్నె వెట్టికి వచ్చినవారలను కూలికిఁ బనిచేయువారలను మార్గంబును సరిచేసి రక్షింపుచుండుటకై పంపియున్నాను. ఇంక నేను బోవలయును. అని భరతుఁడు చెప్పెను. ౨౦

ఏవ ముక్త్వా తు ధర్మాత్మా భరతో భ్రాతృవత్సలః,
సమీపస్థ మువాచేదం సుమన్త్రం మన్త్రకోవిదమ్. ౨౧

తూర్ణ ముత్థాయ గచ్ఛ త్వం సుమన్త్ర! మమ శాసనాత్,
యాత్రా మాజ్ఞాపయ క్షిప్రం బలం చైవ సమానయ. ౨౨

ఏవ ముక్త స్సుమన్త్రస్తు భరతేన మహాత్మనా,
హృష్ట స్తదాఽఽదిశ త్సర్వం యథాసందిష్ట మిష్టవత్. ౨౩

తాః ప్రహృష్టాః ప్రకృతయో బలాధ్యక్షా బలస్య చ,
శ్రుత్వా యాత్రాం సమాజ్ఞప్తాం రాఘవస్య నివర్తనే. ౨౪
తతో యోధాఙ్గనా స్సర్వా భర్తౄ న్సర్వా న్గృహే గృహే,
యాత్రాగమన మాజ్ఞాయ త్వరయన్తి స్మ హర్షితాః. ౨౫

తే హయై ర్గోరథై శ్శీఘ్రై స్స్యన్దనై శ్చ మహాజవైః,
సహ యోధై ర్బలాధ్యక్షా బలం సర్వ మచోదయన్. ౨౬

సజ్జం తు తద్బలం దృష్ట్వా భరతో గురుసన్నిధౌ,
రథం మే త్వరయస్వేతి సుమన్త్రం పార్శ్వతోఽబ్రవీత్. ౨౭

భరతస్య తు తస్యాఽజ్ఞాం ప్రతిగృహ్య చ హర్షితః,
రథం గృహీత్వా ప్రయయౌ యుక్తం పరమవాజిభిః. ౨౮
స రాఘవ స్సత్యధృతిః ప్రతాపవా
న్బ్రువ న్సుయుక్తం దృఢసత్యవిక్రమః,
గురుం మహాఽరణ్యగతం యశస్వినం
ప్రసాదయిష్య న్భరతోఽబ్రవీ త్తదా. ౨౯

ధర్మాత్ముఁడును జ్యేష్ఠభ్రాతయందలి భక్తిగలవాఁడు నగు భరతుఁడు, వసిష్ఠాదులతో నీప్రకారము చెప్పి తనసమీపంబుననున్న యాలోచనలం బండితుఁడగు సుమంత్రుం జూచి యిట్లని పలికెను. ౨౧

సుమంత్రుఁడా! నీవు నాయాజ్ఞచే శీఘ్రముగా లేచిపోయి పయనము కావలె నని యాజ్ఞాపించి సైన్యంబును దెమ్ము. అని భరతుఁడు సుమంత్రున కాజ్ఞాపించెను. ౨౨

సుమంత్రుఁడు మహాత్ముఁడగు భరతుఁడు చెప్పినది విని పరమసంతుష్టుఁడై తనకోర్కి కనురూపంబుగా భరతుఁడు గావించినయాజ్ఞను సైనికులకుం జెప్పెను. ౨౩

ప్రజలును సేనాధ్యక్షులును భరతుఁడు రాముని బిలిచికొని వచ్చుటకై పయనంబగుట కాజ్ఞాపించెనని యాలకించి పరమసంతుష్టు లయిరి. ౨౪

అంతఁ బ్రతిగృహమునందును సైనికులభార్య లందఱును రాముని యొద్దకుఁ బ్రయాణంబు సిద్ధించెనని తెలిసి సంతుష్టలయి తమతమభర్తలను శీఘ్రముగాఁ బొండని వేగిరపఱచిరి. ౨౫

ఆసేనాధ్యక్షులు గుఱ్ఱంబులు వడిగాఁ బోవునెద్దులబండ్లు మహావేగంబులగు రథంబులు యోధులు మొదలగు సైన్యంబు నంతయును నాయత్తంబు గావించిరి. ౨౬

భరతుఁడు సైన్యం బంతయును నాయత్తంబగుటఁ జూచి వసిష్ఠసన్నిధానంబున "వేగంబ నారథంబుఁ దె" మ్మని తనపార్శ్వభాగంబున నున్న సుమంత్రున కాజ్ఞాపించెను. ౨౭

సుమంత్రుఁడు భరతునాజ్ఞను శిరసావహించి సంతోషంబు నొంది యుత్తమాశ్వంబులం బూన్చి రథంబుఁ దెచ్చెను. ౨౮

అప్పుడు రఘువంశజాతుఁడును మహాధైర్యుఁడును మహాప్రతాపుఁడును మహాపరాక్రమశాలియు నగు భరతుఁడు, పరమయుక్తంబుగా మాటలాడి మహారణ్యంబున నున్న యశస్వియగు రామునిఁ బ్రసన్నుం జేయఁ దలఁచి యిట్లని చెప్పెను. ౨౯

తూర్ణం సముత్థాయ సుమన్త్ర! గచ్ఛ
బలస్య యోగాయ బలప్రధానాన్,
ఆనేతు మిచ్ఛామి హి తం వనస్థం
ప్రసాద్య రామం జగతో హితాయ. ౩౦
ససూతపుత్త్రో భరతేన సమ్య
గాజ్ఞాపిత స్సంపరిపూర్ణ కామః,
శశాస సర్వా న్ప్రకృతిప్రధానా
న్బలస్య ముఖ్యాంశ్చ సుహృజ్జనం చ. ౩౧
తత స్సముత్థాయ కులేకులే తే
రాజన్య వైశ్యా వృషలా శ్చ విప్రాః,
అయూయుజ న్నుష్ట్ర ఖరా న్రథాంశ్చ
నాగా న్హయాంశ్చైవ కులప్రసూతాన్. ౩౨
ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే ద్వ్యశీతితమస్సర్గః.

## త్ర్యశీతితమస్సర్గః

తత స్సముత్థితః కాల్య మాస్థాయ స్యన్దనోత్తమమ్,
ప్రయయౌ భరత శ్శీఘ్రం రామదర్శనకాఙ్క్షయా. ౧
అగ్రతః ప్రయయు స్తస్య సర్వే మన్త్రిపురోధసః,
అధిరుహ్య హయై ర్యుక్తా న్రథా న్సూర్యరథోపమాన్. ౨
నవనాగసహస్రాణి కల్పితాని యథావిధి,
అన్వయు ర్భరతం యాన్త మిక్ష్వాకుకులనన్దనమ్. ౩

షష్టి రథసహస్రాణి ధన్వినో వివిధాయుధాః,
అన్వయు ర్భరతం యాన్తం రాజపుత్త్రం యశస్వినమ్. ౪

సుమంత్రుఁడా! నీవు శీఘ్రంబున లేచి సేనాధ్యక్షులయొద్దకుఁబోయి సైన్యంబులం గూర్చునట్లు చేయుము. నేను లోకహితంబుకొఱకు వనంబునకుఁబోయి రామునిఁ బ్రసన్నుంజేసి తోడ్కొని రావలయును. అని భరతుఁడు చెప్పెను. ౩౦

సుమంత్రుఁడు అట్లు భరతునిచే నాజ్ఞాపింపఁబడినవాఁడై తనకోర్కులన్నియుం ఫలించుటచేఁ బరమసంతోషంబు నొంది ప్రజలలో ముఖ్యులగు వారలకును సేనానాయకులకును సుహృజ్జనులకును అందఱకును బయనమయి రావలయునని భరతాజ్ఞం దెలిపెను. ౩౧

అంతఁ బ్రతిగృహంబునందును బ్రాహ్మణులును క్షత్రియులును వైశ్యులును శూద్రులును కొందఱు ఒంటెలను గొందఱు గర్దభంబులను గొందఱు రథంబులను గొందఱు గజంబులను గొంద ఱుత్తమాశ్వంబులనుఆరోహించి పయనంబయిరి. ౩౨

ఇది యెనుబది రెండవ సర్గము.

## ఎనుబదిమూఁడవసర్గము

అంత భరతుఁడు ఉషఃకాలంబుననె లేచి యుత్తమంబగు రథంబు నారోహించి రామునిం జూచు కౌతుకంబున శీఘ్రంబుగాఁ బోయెను. ౧

మంత్రులు పురోహితు లందఱు సూర్యరథంబునకుసాటివచ్చుచున్న, యశ్వయుక్తంబులగు రథంబుల నారోహించి భరతునకు ముందు నడచిరి. ౨

భరతునియాజ్ఞచొప్పున నయోధ్యయందలి యేనుంగులలోఁ దొమ్మిది వేలయేనుంగులు ఇక్ష్వాకువంశమునకు సంతోషంబుగల్గించునట్టి భరతుని వెంబడించి నడచినవి. ౩

అఱువదివేల రథికులును మఱియుం నానావిధాయుధధరులగు యోధులును యశస్వియగు రాజకుమారుఁడు నగు భరతునివెంట నడచిరి. ౪

శతం సహస్రాణ్యశ్వానాం సమారూఢాని రాఘవమ్,
అన్వాయు ర్భరతం యాన్తం సత్యసన్ధం జితేన్ద్రియమ్. ౫
కైకేయీ చ సుమిత్రా చ కౌసల్యా చ యశస్వినీ,
రామానయనసంహృష్టా యయు ర్యానేన భాస్వతా. ౬

ప్రయాతా శ్చార్యసఙ్ఘాతా రామం ద్రష్టుం సలక్ష్మణమ్,
తస్యైవ చ కథా శ్చిత్రాః కుర్వాణా హృష్టమానసాః. ౭

మేఘశ్యామం మహాబాహుం స్థిరసత్త్వం దృఢవ్రతమ్,
కదా ద్రక్ష్యామహే రామం జగత శ్శోకనాశనమ్. ౮

దృష్ట ఏవ హి న శ్శోక మపనేష్యతి రాఘవః,
తమ స్సర్వస్య లోకస్య సముద్య న్నివ భాస్కరః. ౯

ఇత్యేవం కథయన్త స్తే సమ్ప్రహృష్టాః కథా శ్శుభాః,
పరిష్వజానా శ్చాన్యోన్యం యయు ర్నాగరికా జనాః. ౧౦
యే చ తత్రాపరే సర్వే సమ్మతా యే చ నైగమాః,
రామం ప్రతి యయు ర్హృష్టా స్సర్వాః ప్రకృతయ స్తథా. ౧౧

మణికారా శ్చ యే కేచి త్కుమ్భకారా శ్చ శోభనాః,
సూత్రకర్మకృత శ్చైవ యే చ శస్త్రోపజీవినః. ౧౨

మాయూరకాః క్రాకచికా రోచకా వేధకా స్తథా,
దన్తకారా స్సుధాకారా స్తథా గన్ధోపజీవినః. ౧౩
సువర్ణకారాః ప్రఖ్యాతా స్తథా కమ్బళధావకాః,
స్నాపకోచ్ఛాదకా వైద్యా ధూపకా శ్శౌణ్డికా స్తథా. ౧౪
రజకా స్తున్నవాయాశ్చ గ్రామఘోషమహత్తరాః,
శైలూషా శ్చ సహ స్త్రీభి ర్యయుః కైవర్తకా స్తథా. ౧౫

సమాహితా వేదవిదో బ్రాహ్మణా వృత్తసమ్మతాః,
గోరథై ర్భరతం యాన్త మనుజగ్ము స్సహస్రశః. ౧౬
సువేషా శ్శుద్ధవసనా స్తామ్రమృష్టానులేపనాః,
సర్వే తే వివిధై ర్యానై శ్శనై ర్భరత మన్వయుః. ౧౭

ప్రహృష్టముదితా సేనా సాఽన్వయా త్కైకయీసుతమ్,
భ్రాతు రానయనే యాన్తం భరతం భ్రాతృవత్సలమ్. ౧౮

తే గత్వా దూర మధ్వానం రథయానాశ్వకుఞ్జరైః,
సమాసేదు స్తతో గఙ్గాం శృఙ్గిబేరపురం ప్రతి. ౧౯
యత్ర రామసఖో వీరో గుహో జ్ఞాతిగణై ర్వృతః,
నివసత్యప్రమాదేన దేశం తం పరిపాలయన్. ౨౦

ఉపేత్య తీరం గఙ్గాయా శ్చక్రవాకై రలఙ్కృతమ్,
వ్యవాతిష్ఠత సా సేనా భరతస్యానుయాయినీ. ౨౧

నిరీక్ష్యానుగతాం సేనాం తాం చ గఙ్గాం శివోదకామ్,
భరత స్సచివా న్సర్వా నబ్రవీ ద్వాక్యకోవిదః. ౨౨

నివేశయత మే సైన్య మభిప్రాయేణ సర్వతః,
విశ్రాన్తాః ప్రతరిష్యామ శ్శ్వ ఇదానీ మిమాం నదీమ్. ౨౩

దాతుం చ తావ దిచ్ఛామి స్వర్గతస్య మహీపతేః,
ఔర్ధ్వదేహనిమిత్తార్థ మవతీర్యోదకం నదీమ్. ౨౪

తస్యైవం బ్రువతోఽమాత్యా స్తథే త్యుక్త్వా సమాహితాః,
న్యవేశయం స్తాం ఛన్దేన స్వేన స్వేన పృథక్పృథక్. ౨౫

నివేశ్య గఙ్గా మను తాం మహానదీం
చమూం విధానైః పరిబర్హశోభినీమ్,
ఉవాస రామస్య తదా మహాత్మనో
విచిన్తయానో భరతో నివర్తనమ్. ౨౬

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే త్ర్యశీతితమస్సర్గః.

---

## చతురశీతితమస్సర్గః

తతో నివిష్టాం ధ్వజినీం గఙ్గా మన్వాశ్రితాం నదీమ్,
నిషాదరాజో దృష్ట్వైవ జ్ఞాతీ న్సన్త్వరితోఽబ్రవీత్. ౧

మహతీయ మితః స్సేనా సాగరాభా ప్రదృశ్యతే,
నాస్యాన్త మధిగచ్ఛామి మనసాఽపి విచిన్తయన్. ౨
యథా తు ఖలు దుర్బుద్ధి ర్భరత స్స్వయ మాగతః,

స ఏష హి మహాకాయః కోవిదారధ్వజో రథే, ౩

బన్ధయిష్యతి వా దాశా నథవాఽస్మా న్వధిష్యతి,

అథ దాశరథిం రామం పిత్రా రాజ్యా ద్వివాసితమ్. ౪
సమ్పన్నాం శ్రియ మన్విచ్ఛం స్తస్య రాజ్ఞ స్సుదుర్లభామ్,
భరతః కైకయీపుత్రో హన్తుం సమధిగచ్ఛతి. ౫

భర్తా చైవ సఖా చైవ రామో దాశరథి ర్మమ,
తస్యార్థకామా స్సన్నద్ధా గఙ్గాఽనూపే ప్రతిష్ఠత. ౬

తిష్ఠన్తు సర్వే దాశాశ్చ గఙ్గా మన్వాశ్రితా నదీమ్,
బలయుక్తా నదీరక్షా మాంసమూలఫలాశనాః. ౭

నావాం శతానాం పఞ్చానాం కైవర్తానాం శతం శతమ్,
సన్నద్ధానాం తథా యూనాం తిష్ఠన్త్వి త్యభ్యచోదయత్. ౮

యదాఽదుష్టస్తు భరతో రామస్యేహ భవిష్యతి,
సేయం స్వస్తిమతీ సేనా గఙ్గా మద్య తరిష్యతి. ౯

ఇత్యుక్త్వోపాయనం గృహ్య మత్స్యమాంసమధూని చ,
అభిచక్రామ భరతం నిషాదాధిపతి ర్గుహః. ౧౦
త మాయాన్తం తు సంప్రేక్ష్య సూతపుత్రః ప్రతాపవాన్,
భరతాయాఽచచక్షేఽథ వినయజ్ఞో వినీతవత్. ౧౧

ఏష జ్ఞాతిసహస్రేణ స్థపతిః పరివారితః,
కుశలో దణ్డకారణ్యే వృద్ధో భ్రాతు శ్చ తే సఖా. ౧౨

తస్మా త్పశ్యతు కాకుత్స్థ! త్వాం నిషాదాధిపో గుహః,
అసంశయం విజానీతే యత్ర తౌ రామలక్ష్మణౌ. ౧౩

ఏత త్తు వచనం శ్రుత్వా సుమన్త్రా ద్భరత శ్శుభమ్,
ఉవాచ వచనం శీఘ్రం గుహః పశ్యతు మా మితి. ౧౪

లబ్ధ్వాఽభ్యనుజ్ఞాం సంహృష్టో జ్ఞాతిభిః పరివారితః,
ఆగమ్య భరతం ప్రహ్వో గుహో వచన మబ్రవీత్. ౧౫
నిష్కుట శ్చైవ దేశోఽయం వంచితా శ్చాపి తే వయమ్,
నివేదయామ స్తే సర్వే స్వకే దాసకులే వస. ౧౬

అ స్తి మూలం ఫలం చైవ నిషాదై స్సముపాహృతమ్,
ఆర్ద్రం చ మాంసం శుష్కంచ వన్యం చోచ్చావచం మహత్.

ఆశంసే స్వాశితా సేనా వత్స్యతీమాం విభావరీమ్,
అర్చితో వివిధైః కామై శ్శ్వ స్ససైన్యో గమిష్యసి. ౧౭

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే చతురశీతితమస్సర్గః.

నిషాదప్రభుఁడగు నీగుహుఁడు బంధుజనం బెచ్చుగాఁ గలవాఁడు. వృద్ధుఁడు. దండకారణ్యంబునందు సంచరించుటయందు మిక్కిలియుం సమర్థుఁడు. నీయన్న రామునకు స్నేహితుఁడును. ౧౨

భరతుఁడా! అందువలన నీవు నిషాదాధీశ్వరుఁడగు నీగుహునకు దర్శనం బియ్యవలయును. వనరామలక్ష్మణు లెచ్చట నున్నారో ఆసంగతి యితనికి నిస్సంశయంబుగాఁ దెలిసియుండును' అని సుమంత్రుఁడు భరతునకుఁ జెప్పెను. ౧౩

భరతుఁడు సుమంత్రుఁడు చెప్పిన మంగళకరంబగు మాటను వినినంతనె "శీఘ్రంబుగా గుహుని నాయొద్దకు రానిమ్ము" అని సుమంత్రునితోఁ జెప్పెను. ౧౪

గుహుఁడు ఇట్టనుజ్ఞ నొంది సంతుష్టుఁడై బంధువులంగూడి లోనికిం బోయి భరతుం జూచి సమ్రుఁడై యిట్లని చెప్పెను. ౧౫

ఈనాదేశము నీయింటిపెరటివంటిదే కదా! నీరాక దెలియకపోవుటచే మేమందఱమును మోసపోతిమి. మాకుఁ దెలిసియుండునేని నీకుఁ జేయవలసిన ప్రత్యుత్థానాదులు గావింతుము. ఇప్పుడును నీదాసుల మయిన మాయింట నుండి పోవలసినదని మేమందఱమును ప్రార్థించుచున్నాము. ౧౬

మూలంబులును ఫలంబులును ఆర్ద్రమాంసంబును ఎండినమాంసంబును మఱియు నానావిధంబులయిన నీవారంబులు మొదలగు వనధాన్యంబులును సిద్ధంబు గావించికొని యున్నాము. ౧౭

ఈసేనయంతయు మాయింటఁ జక్కఁగా భుజించి యీరాత్రియంతయు నుండఁగలదు. నీవును, మేము గావించు నానావిధపూజలం గైకొని రేపు సైన్యసమేతుఁడవై పోవచ్చునని ప్రార్థించుచున్నాను. అని గుహుఁడు భరతునితోఁ జెప్పెను. ౧౮

ఇది యెనుబదినాలవసర్గము.



## ప ఞ్చా శీ తి త మ స్స ర్గః

ఏవ ముక్త స్తు భరతో నిషాదాధిపతిం గుహమ్,
ప్రత్యువాచ మహాప్రాజ్ఞో వాక్యం హేత్వర్థసంహితమ్. ౧

ఊర్జితః ఖలు తే కామః కృతో మమ గురో స్సఖే!
యో మే త్వ మీదృశీం సేనా మేకోఽభ్యర్చితు మిచ్ఛసి. ౨

ఇత్యుక్త్వా తు మహాతేజా గుహం వచన ముత్తమమ్,
అబ్రవీ ద్భరత శ్శ్రీమా న్నిషాదాధిపతిం పునః. ౩

కతరేణ గమిష్యామి భరద్వాజాశ్రమం గుహ!
గహనోఽయం భృశం దేశో గఙ్గానూపో దురత్యయః. ౪

తస్య తద్వచనం శ్రుత్వా రాజపుత్రస్య ధీమతః,
అబ్రవీ త్ప్రాఞ్జలి ర్వాక్యం గుహో గహనగోచరః. ౫
దాశా స్త్వాఽనుగమిష్యన్తి ధన్విన స్సుసమాహితాః.
అహం చానుగమిష్యామి రాజపుత్ర! మహాయశః. ౬

కచ్చి న్న దుష్టో వ్రజసి రామస్యాక్లిష్టకర్మణః,
ఇయం తే మహతీ సేనా శఙ్కాం జనయతీవ మే. ౭

తమేవమభి భాషన్త మాకాశ ఇవ నిర్మలః,
భరత శ్శ్లక్ష్ణయా వాచా గుహం వచన మబ్రవీత్. ౮

## ఎనుబదిరెండవసర్గము

మహాపండితుఁడగు భరతుఁడు నిషాదాధీశ్వరుఁడగు గుహుఁడు చెప్పినది విని యతనిం జూచి సహేతుకంబుగా సప్రయోజనంబుగా నీమాటం జెప్పెను. ౧

నా యన్నయగు రాముని స్నేహితుఁడవగు గుహుఁడా! నీవు ఒక్కఁడవె యాయింతటిసేనకునుం బూజసేయఁ గోరుచున్నావే. ఈమాటవలన నే నీ కోర్కెకన్న నధికముగా మాకుఁ బూజగావించినవాఁడ వగుచున్నావు. అని భరతుఁడు గుహునితోఁ జెప్పెను. ౨

మహాతేజుఁడును శ్రీమంతుఁడు నగుభరతుఁడు ఇట్లు నిషాదాధీశ్వరుఁడగు గుహునితో నుత్తమంబగు మాటం జెప్పి మరల నతనిం జూచి యిట్లని చెప్పెను. ౩

గుహుఁడా! భరద్వాజాశ్రమంబున కేమార్గంబునఁ బోవలెను! ఈదేశంబు మిగుల దుష్ప్రవేశంబయి యున్నది. ఈగంగాజలంబులం దరించుటయె మిక్కిలియుఁ గష్టము. అని భరతుఁడు గుహునితోఁ జెప్పెను. ౪

అడవులందుఁ దిరుగునట్టి గుహుఁడు రాచకొమరుఁడును బుద్ధిమంతుఁడు నగు భరతునిమాటను విని చేతులు మొగిడ్చి యిట్లని చెప్పెను. ౫

మహాయశుఁడవు రాజపుత్త్రుఁడవగు భరతుఁడా! మా వెంబడివారలు ధనుర్ధరులయి మిక్కిలియుం జెచ్చరికతో నీవెంబడి రాఁగలరు. నేనును నీవెంబడి వచ్చెదను. నీకు మార్గచింత యక్కఱలేదు. ౬

నీవు ఎవ్వరికిని దుఃఖంబు గల్గింపని కార్యంబులే చేయునట్టి రామునకు ద్రోహంబుసేయుటకై పోవువాఁడవు కావుగదా! నీతోఁగూడ వచ్చిన యింత గొప్పసేనం జూడఁగా నాకుఁ గొంచెము సందేహము గలుగుచున్నది. అని గుహుఁడు భరతునితోఁ జెప్పెను. ౭

ఆకాశంబువలె నిర్దోషుఁడై యున్న భరతుఁడు ఈవిధంబునం జెప్పుచున్న గుహుం జూచి మృదువాక్యంబున నిట్లని చెప్పెను. ౮

మాభూ త్స కాలో యత్కష్టం న మాం శఙ్కితు మర్హసి,
రాఘవ స్సహి మేభ్రాతా జ్యేష్ఠః పితృసమో మతః. ౯

తం నివ ర్తయితుం యామి కాకుత్ స్థం వనవాసినమ్,
బుద్ధి రన్యా న తే కార్యా గుహా! సత్యం బ్రవీమి తే. ౧౦

స తు సంహృష్టవదన శ్శ్రుత్వా భరతభాషితమ్,
పున రే వాబ్రవీద్వాక్యం భరతం ప్రతి హర్షితః. ౧౧
ధన్య స్త్వం న త్వయా తుల్యం పశ్యామి జగతీతలే,
అయత్నా దాగతం రాజ్యం య స్త్వం త్యక్తు మిహేచ్ఛసి. ౧౨

శాశ్వతీ ఖలు తే కీ ర్తి ర్లోకా ననుచరిష్యతి,
య స్త్వం కృచ్ఛ్రగతం రామం ప్రత్యానయితు మిచ్ఛసి. ౧౩

ఏవం సమ్భాషమాణస్య గుహాస్య భరతం తదా,
బభౌ నష్టప్రభ స్సూర్యో రజనీ చాభ్యవ ర్తత. ౧౪
సన్నివేశ్య స తాం సేనాం గుహేన పరితోషితః,
శత్రుఘ్నేన సహశ్రీమా ఞ్శయనం సముపాగమత్. ౧౫

రామచిన్తామయ శ్శోకో భరతస్య మహాత్మనః,
ఉపస్థితో హ్యనర్హస్య ధర్మప్రేక్షస్య తాదృశః. ౧౬

అ న్తర్దాహేన దహన స్సన్తాపయతి రాఘవమ్,
వనదాహాభిస న్తప్తం గూఢోఽగ్ని రివ పాదపమ్. ౧౭

నేను రామునకు ద్రోహము చేయుదు నని నీకు సందేహము కలిగినదే! ఇట్టి కష్టకాల మింక సంభవింపకుండుఁగాక! నీవు నాయందు సందేహం బుంచ వలదు. రాముఁడు నాకు జ్యేష్ఠభ్రాత కావునఁ దండ్రి వంటివాఁడే కదా! ౯

గుహుఁడా! అడవియందున్న రాముని మరలించి తోడ్కొనివచ్చుటకై పోవుచున్నాను. నీవు వేఱువిధమునం దలంపవలదు. నీకు సత్యముఁ జెప్పు చున్నాను. అని భరతుఁడు గుహునితోఁ జెప్పెను. ౧౦

ఆ గుహుఁడు భరతుఁడు చెప్పినమాటను విని ప్రసన్నవదనుఁడై పరమ సంతుష్టుఁడై భరతుం జూచి మరల నిట్లని చెప్పెను. ౧౧

అప్రయత్నంబుగాఁ బ్రాప్తంబయిన రాజ్యంబును గూడ విడువం గోరు చున్నావే, నీవె పుణ్యవంతుఁడవు. నీయట్టి ధార్మికుని భూలోకంబున నెచ్చట నేని నే నిదివఱకుఁ జూడలేదు. ౧౨

నీవు కష్టంబు నొందియున్న రాముని మరలఁ దోడ్కొనివచ్చి సుఖింపఁ జేయం గోరుచున్నావు కావున నీకీర్తి శాశ్వతంబుగా సమస్తలోకంబులందును వ్యాపించి యుండఁగలదు. అని గుహుఁడు భరతునితోఁ జెప్పెను. ౧౩

అప్పుడు గుహుఁ డిట్లు భరతునితో మాటలాడుచుండఁగానె సూర్యుఁ డస్తమించెఁ; నంత రాత్రియు వచ్చినది. ౧౪

అంత శ్రీమంతుఁడగు భరతుఁడు, సేనను ఆయాస్థలంబుల విడియ నియమించి గుహునిచే సంతోషింపఁజేయఁబడినవాఁడై శత్రుఘ్నుఁడును దానును బవ్వళించిరి. ౧౫

ఆగర్భ శ్రీమంతుఁడు కావున దుఃఖంబనుభవింపఁ దగనివాఁడును ధర్మ బుద్ధిగలవాఁడు నగు భరతుఁడు ఎంత ధైర్యశాలియయినను, అపరిమితంబగు రామ నిమిత్తంబయిన దుఃఖంబు సహింపఁజాలక మిక్కిలియుం వగచు చుండెను. ౧౬

సమీపంబున నుండు నడవి దహింపఁబడుచుండఁగా నావేఁడిమికి సంతప్తమగుచున్న వృక్షంబును, అగ్నిహోత్రము పైకిఁ గానరాకయే తపింపఁ

ప్రసృత స్సర్వగాత్రేభ్య స్స్వేదం శోకాగ్నిసమ్భవమ్,
యథాసూర్యాంశుసన్తప్తో హిమవాన్ ప్రసృతో హిమమ్. ౧౮

ధ్యాననిర్దరశైలేన వినిశ్శ్వసితధాతునా,
దైన్యపాదపసంఘేన శోకాయాసాధిశృఙ్గిణా. ౧౯
ప్రమోహానన్తసత్త్వేన సన్తాపౌషధివేణునా,
ఆక్రాన్తో దుఃఖశైలేన మహతా కైకయీసుతః. ౨౦

వినిశ్శ్వసన్వై భృశదుర్మనా స్తతః
ప్రమూఢసంజ్ఞః పరమాపదం గతః,
శమం న లేభే హృదయజ్వరార్దితో
నరర్షభో యూథహతో యథర్షభః. ౨౧
గుహేన సార్ధం భరత స్సమాగతో
మహానుభావ స్సజన స్సమాహితః,
సుదుర్మనా స్తం భరతం తదా పునః
గుహ స్సమాశ్వాసయ దగ్రజం ప్రతి. ౨౨

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే పఞ్చాశీతితమస్సర్గః.

## షడశీతితమస్సర్గః

ఆచచక్షేఽథ సద్భావం లక్ష్మణస్య మహాత్మనః,
భరతాయాప్రమేయాయ గుహో గహనగోచరః.

జేయునట్లు శోకాగ్ని లోపలనుండియే భరతుని మిక్కిలియుఁ దపింపఁజేయుచుండినది. ౧౭

సూర్యునికిరణంబు వేఁడిమికి హిమవత్పర్వతంబుననుండి మంచునీళ్లు కాఱునట్లు, భరతుని యన్ని యవయవంబులనుండియు దుఃఖాగ్నిచేఁ జెమట నీళ్లు గాఱినవి. ౧౮

కైకేయి కొడుకయిన భరతుఁడు ధ్యానంబె పెనుఱాళ్లుగా, నిట్టూర్పులె నానావిధంబులగు ధాతువులుగా, దైన్యమె వృక్షసమూహముగా, దుఃఖము నాయాసము మనోవ్యథయును నె శిఖరంబులుగా, మోహమె లెక్కలేని మృగములుగా, సంతాపమె యోషధులును వెదుళ్లునుగాఁ బర్వతాకారంబయి యొప్పుచున్న మహాదుఃఖంబు నొంది పరితపించుచుండెను. ౧౯,౨౦

పురుషశ్రేష్ఠుఁడగు భరతుఁడు, అట్లు పరమదుఃఖితుఁడై నిట్టూర్పులు పుచ్చుచు, మూర్ఛం బొందుచు నిట్లు పరమాపదం బొంది మనోజ్వరంబున బాధపడుచు, సహింపఁజాలక గుంపుదప్పిన వృషభంబుకరణిం బరితపించుచుండెను. ౨౧

అట్లు మహానుభావుఁడగు భరతుఁడు పరిచారకజనసహితుఁడై, యేకాగ్రచిత్తుఁడై గుహునితోఁ గూడ నుండెను. గుహుఁడు భరతుని దుఃఖంబుఁ జూచి తానును బరమదుఃఖితుఁడై, రాముని విషయమయి మాటలు చెప్పుచు భరతుని నాశ్వాసించెను. ౨౨

ఇది యెనుబదియైదవసర్గము.

---

## ఎనుబదియాఱవసర్గము

అంత వనంబున నుండునట్టి గుహుఁడు, గొలందిలేని మాహాత్మ్యంబు గల భరతునకు మహాత్ముఁడగు లక్ష్మణుని శ్రేష్ఠభ్రాతృభక్తిరూప మయిన సత్స్వభావంబుఁ జెప్ప నారంభించెను. ౧

తం జాగ్రతం గుణై ర్యుక్తం శరచాపాసిధారిణమ్,
భ్రాతృగుప్త్యర్థ మత్యన్త మహం లక్ష్మణ మబ్రవమ్. ౨

ఇయం తాత! సుఖా శయ్యా త్వదర్థ ముపకల్పితా,
ప్రత్యాశ్వసిహి శేష్వాస్యాం సుఖం రాఘవనన్దన! 3

ఉచితోఽయం జన స్సర్వో దుఃఖానాం త్వం సుఖోచితః,
ధర్మాత్మం! స్తస్య గుప్త్యర్థం జాగరిష్యామహే వయమ్. ౪

నహి రామాత్ప్రియతరో మమాస్తి భువి కశ్చన,
మోత్సుకోఽభూ ర్బ్రవీ మ్యేతదప్యసత్యం తవాగ్రతః. ౫

అస్య ప్రసాదాదాశంసే లోకేఽస్మి న్సుమహద్యశః,
ధర్మావాప్తిం చ విపులా మర్థావాప్తిం చ కేవలామ్. ౬

సోఽహం ప్రియసఖం రామం శయానం సహ సీతయా,
రక్షిష్యామి ధనుష్పాణి స్సర్వై స్స్వైః జ్ఞాతిభి స్సహ. ౭

నహి మేఽవిదితం కించి ద్వనేఽస్మిం శ్చరత స్సదా,
చతురఙ్గం హ్యపి బలం ప్రసహేమ వయం యుధి. ౮

ఏవమస్మాభి రుక్తేన లక్ష్మణేన మహాత్మనా,
అనునీతా వయం సర్వే ధర్మ మేవానుపశ్యతా. ౯

అన్నను రక్షించుటకై, ధనుర్బాణంబులను ఖడ్గంబును ధరించి, కంటిపై ఱెప్పయయినను వేయక మేలుకొనియున్న గుణవంతుఁడగు లక్ష్మణునిం జూచి నే నిట్లని చెప్పితిని. ౨

రఘువంశంబునం బుట్టినవారలకు సంతోషంబు గలుగఁజేయునట్టి లక్ష్మణుఁడా! సుఖకరంబగు నీపాన్పు నీకొఱకై యేర్పఱుపఁబడినది. నీవు దీనిపై సుఖంబుగాఁ బరుండి యలసట దీర్చుకొనుము. ౩

ధర్మాత్ముఁడవగు లక్ష్మణుఁడా! మేమందఱమును దుఃఖం బనుభవింపం దగినవారలమే. నీవు సుఖంబునకుమాత్రము తగినవాఁడవు కావున నిద్రింపుము. రాముని సంరక్షణమునకై మే మందఱమును మేలుకొని యుండెదము. ౪

ఈ భూలోకంబున రామునికన్నఁ బ్రియుండు నా కెవ్వఁడును లేఁడు కావున, నీవు రామరక్షణార్థమయి మేలుకొని యుండవలసినదిలేదు. నీయెదుట నేను దీనిగుఱించి యసత్యం బాడుదునా? ౫

ఈ రాముని యనుగ్రహంబున నె నేను ఈలోకంబున గొప్పకీర్తిని, అధికమయిన పరలోకసాధనభూతంబగు ధర్మంబును, మఱియుం న్యాయప్రాప్తంబగు ధనాదికంబును బొందవలె నని కోరుచున్నాను. ౬

అట్లు కావున నేను ధనుస్సు ధరించి, నా బంధువుల యందఱితోఁ గూడ, సీతాదేవిం గూడి పరుండి నిద్రించుచున్న నా ప్రియమిత్రు రాముని రక్షింపుచుండెదను. ౭

ఎల్లప్పుడును ఈ యడవిలో నే తిరుగుచున్నవాఁడను గావున, నీవనంబు నందుఁ నాకుఁ దెలియని కందువ లేవియుం లేవు. యుద్ధంబున, మేము చతురంగ సైన్యంబు వచ్చినను సరకుసేయము. అని నేను లక్ష్మణునితోఁ జెప్పినాను. ౮

మేము చెప్పినది విని మహాత్ముఁడును ధర్మమును మాత్రమె చూచువాఁడు నగు లక్ష్మణుఁడు మమ్మందఱను ఈ ప్రకారముగా మంచిమాటల ననునయించెను. ౯

కథం దాశరథౌ భూమౌ శయానే సహ సీతయా,
శక్యా నిద్రా మయా లబ్ధుం జీవితం వా సుఖాని వా. ౧౦

యో న దేవాసురై స్సర్వై శ్శక్యః ప్రసహితుం యుధి,
తం పశ్య గుహ! సంవిష్టం తృణేషు సహ సీతయా. ౧౧

మహతా తపసా లబ్ధో వివిధై శ్చ పరిశ్రమైః,
ఏకో దశరథ స్యైష పుత్ర స్సదృశలక్షణః. ౧౨

అస్మి న్ప్రవ్రాజితే రాజా న చిరం వర్తయిష్యతి,
విధవా మేదినీ నూనం క్షిప్రమేవ భవిష్యతి. ౧౩

వినద్య సుమహానాదం శ్రమేణోపరతాః స్త్రియః,
నిర్ఘోషోపరతం తాత! మన్యే రాజనివేశనమ్. ౧౪

కౌసల్యా చైవ రాజా చ తథైవ జననీ మమ,
నాశంసే యది జీవేయు స్సర్వే తే శర్వరీ మిమామ్. ౧౫

జీవే దపి హి మే మాతా శత్రుఘ్నస్యాన్వవేక్షయా,
దుఃఖితా యా తు కౌసల్యా వీరసూ ర్వినశిష్యతి. ౧౬

అతిక్రాన్త మతిక్రాన్త మనవాప్య మనోరథమ్,
రాజ్యే రామ మనిక్షిప్య పితా మే వినశిష్యతి. ౧౭

దశరథమహారాజకుమారుఁడగు రాముఁడు సీతతోఁగూడ నేలఁబరుండి యుండఁగా నేను బ్రతికియుండుటయె బహుకష్టముగా నున్నదే! ఇంక నిద్రగాని, ఇతరసుఖంబులనుగాని పొందుట కెట్లలవియగును? ౧౦

గుహుఁడా! దేవాసుర లందఱుం జేరి యొక్క పెట్టున వచ్చినను, యుద్ధంబున నెవ్వనిపరాక్రమంబు సహింప నలవిగాదో! అట్టిమహాపరాక్రమ శాలియగు రాముఁ డిప్పుడు భార్యతోఁగూడ పచ్చికనేలపైఁ బరుండి యున్నాఁడు. చూడుము. ౧౧

ఈరాముఁడు దశరథునిచే మహాతపస్సుచేసి పెక్కువ్రతంబులు యాగంబులు గావించి పొందఁబడిన పుత్త్రుఁడు. తండ్రియంబోలె సమస్త సద్గుణంబులు గలవాఁడు. ౧౨

రాముఁడు వనంబునకు వచ్చినపిదప నింక దశరథమహారాజు బహుకాలము జీవింపఁజాలఁడు. ఇంక శీఘ్రముగనే భూమి విధవ కాఁగలదు. ఇది నిశ్చయము. ౧౩

నాయనా! అంతఃపురస్త్రీలు మహాధ్వని గల్గునట్లు, రోదనంబు గావించి యంత నలసి యూరకుండఁగలరు. అట్లు రాజగృహంబు నిశ్శబ్దంబయి యుపరతంబయి యుండఁగలదు. అని తలంచెదను. ౧౪

కౌసల్యయుం దశరథుఁడును నాతల్లి సుమిత్రయుం వీర లింక నెంత మాత్రము జీవింపరు. అట్లు జీవించియుండిరేని యీరాత్రిమాత్రము జీవించి యుందురుగాని యాపై జీవింపఁజాలరు. ౧౫

నాతల్లి సుమిత్రగూడ రెండవకొడుకు శత్రుఘ్నునిం జూచుచు బ్రతికి యుండగలదు. దుఃఖితయగు వీరునిఁ గన్నతల్లి కౌసల్యమాత్రము నాశము నొందక తప్పదు. ౧౬

అతిక్రమించిపోయినది! అతిక్రమించిపోయినది! అంతయుం వ్యర్థమయినది! నాతండ్రి దశరథమహారాజు రాజ్యమునందు రాముఁ నుంచక తన కోర్కి నొందకయె నాశము నొందుచున్నాఁడే! ౧౭

సిద్ధార్థాః పితరం వృత్తం తస్మిన్కాలే హ్యుపస్థితే,
ప్రేతకార్యేషు సర్వేషు సంస్కరిష్యన్తి భూమిపమ్. ౧౮

రమ్యచత్వరసంస్థానాం సువిభక్తమహాపథాం,
హర్మ్యప్రాసాదసమ్పన్నాం సర్వరత్నవిభూషితామ్. ౧౯
గజాశ్వరథసంబాధాం తూర్యనాదవినాదితాం,
సర్వకల్యాణసంపూర్ణాం హృష్టపుష్టజనాకులామ్. ౨౦
ఆరామోద్యానసమ్పూర్ణాం సమాజోత్సవశాలినీం,
సుఖితా విచరిష్యన్తి రాజధానీం పితుర్మమ. ౨౧

అపి సత్యప్రతిజ్ఞేన సార్ధం కుశలినా వయం,
నివృత్తే సమయే హ్యస్మిన్ సుఖితాః ప్రవిశేమహి. ౨౨

పరిదేవయమానస్య తస్యైవం సుమహాత్మనః,
తిష్ఠతో రాజపుత్రస్య శర్వరీ సాఽత్యవర్తత. ౨౩
ప్రభాతే విమలే సూర్యే కారయిత్వా జటా ఉభౌ,
అస్మిన్ భాగీరథీతీరే సుఖం సన్తారితౌ మయా. ౨౪

జటాధరౌ తౌ ద్రుమచీరవాససౌ
మహాబలౌ కుఞ్జరయూథపోపమౌ,
వరేషుచాపాసిధరౌ పరన్తపౌ
వ్యపేక్షమాణౌ సహ సీతయా గతౌ. ౨౫

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే షడశీతితమస్సర్గః.

తండ్రియగు దశరథమహారాజు మృతిబొందినప్పుడు ఆయనకు అన్త్య కాలంబులందు సమస్తసంస్కారంబులు గావించునట్టి భరతశత్రుఘ్నులు కృతార్థులు. ౧౭

రమణీయంబులగు చతుష్పథంబులు గలదియుఁ జక్కఁగా నేర్పఱుపఁబడిన రాజమార్గంబులు గలదియు మేడలును దేవాలయములును ఎచ్చుగాఁ గలదియు సమస్తములయిన యుత్తమద్రవ్యంబులచే నలంకృతంబును ఏనుంగులచేతను గుఱ్ఱంబులచేతను రథంబులచేతను నిండినదియు నానావిధవాద్యధ్వనుల నొప్పుచున్నదియు సమస్తమంగళసంయుతంబును సంతుష్టులును ధనాఢ్యులు దృష్టులునగుజనులచే నిండినదియుఁ దోఁటలు నుద్యానవనంబులును మెండుగాఁ గలదియు నానావిధోత్సవంబులు గలదియునగు నాతండ్రి రాజధానియయిన యయోధ్యాపురియందు సుఖంబునొందు భాగ్యంబు గలవారలు విహరింపుచుండఁగలరు. ౧౮-౨౧

మేమును ఈపదునాలుగు సంవత్సరంబులును గడచినపిమ్మట సత్యప్రతిజ్ఞుఁడగు రామునితోఁ గూడ క్షేమంబున సుఖితులమై యయోధ్యానగరంబుఁ బ్రవేశింపఁగలమా? అని లక్ష్మణుఁడు మాతోఁ జెప్పెను. ౨౨

మహాత్ముఁడగు రాజపుత్త్రుండయిన లక్ష్మణుఁడు ఇట్లువిలపించుచుండఁగానే యారాత్రి కడచినది. ౨౩

అంత స్వచ్ఛంబుగా సూర్యుఁ డుదయించినపిదప, ఈగంగానది గట్టునసే రామలక్ష్మణు లిద్దఱును జటలు గావించుకొనిరి. అంత నేను వారలను సుఖంబుగా గంగను దాఁటించితిని. ౨౪

మహాబలశాలులును గజరాజంబులతో సమానులును శత్రువులం దపింపఁజేయువారలు నగు నారామలక్ష్మణులు జటలు ధరించి నారచీరం గట్టుకొని యుత్తమంబులగు ధనుర్బాణంబులును ఖడ్గంబులును ధరించి మిక్కిలియుఁ జెచ్చరికతో సీతంగూడి పోయిరి. అని గుహుఁడు భరతునితోఁ జెప్పెను.

ఇది యెనుబదియాఱవ సర్గము.

---

# సప్తాశీతితమస్సర్గః

గుహాస్య వచనం శ్రుత్వా భరతో భృశ మప్రియం,
ధ్యానం జగామ తత్రైవ యత్ర తచ్ఛ్రుత మప్రియమ్. ౧

సుకుమారో మహాసత్త్వ స్సింహస్కన్ధో మహాభుజః,
పుణ్డరీకవిశాలాక్ష స్తరుణః ప్రియదర్శనః. ౨
ప్రత్యాశ్వస్య ముహూర్తం తు కాలం పరమదుర్మనాః,
పపాత సహసా తోత్రై ర్హృదివిద్ధ ఇవ ద్విపః. ౩

తదవస్థం తు భరతం శత్రుఘ్నోఽనన్తరస్థితః,
పరిష్వజ్య రురోదోచ్చై ర్విసంజ్ఞ శ్శోకకర్శితః. ౪

తత స్సర్వా స్సమాపేతు ర్మాతరో భరతస్య తాః
ఉపవాసకృశా దీనా భర్తృవ్యసనకర్శితాః. ౫

తాశ్చ తం పతితం భూమౌ రుదన్త్యః పర్యవారయన్,
కౌసల్యా త్వనుసృత్యైనం దుర్మనాః పరిషస్వజే. ౬

వత్సలా స్వం యథా వత్స ముపగూహ్య తపస్వినీ,
పరిపప్రచ్ఛ భరతం రుదన్తీ శోకలాలసా. ౭
పుత్ర! వ్యాధి ర్న తే కచ్చి చ్ఛరీరం పరిబాధతే,
అద్య రాజకులస్యాస్య త్వదధీనం హి జీవితమ్. ౮

## ఎనుబదియేడవసర్గము

భరతుఁడు గుహుఁడు చెప్పినదుఃఖకరంబగు మాటను విని, ఆరామ లక్ష్మణులు జటలను ధరించి యరణ్యమునకుఁ బోయిరనువిషయమును గుఱించియే తనకోర్కి యీడేరునో యీడేరదో యని మిక్కిలియుఁ జింత నొందెను. ౧

సుకుమారశరీరుఁడును, మహాబలుఁడును, సింహంబునకుంబోలె నున్నతంబులగు భుజశిఖరంబులు గలవాఁడును, మహాబాహుఁడును, పుండరీకంబులుంబోలె విశాలసుందరంబులగు నయనంబులవాఁడును, యౌవనవంతుఁడును, ప్రియదర్శనుఁడు నగు భరతుఁడు పరమదుఃఖితుఁడై కొంచెముసేపు దుఃఖంబు నణఁచికొనియుండి యంత సహింపంజాలక బరిగోలల నధికంబుగాఁబొడువంబడిన యేనుంగుభంగిఁ దటాలున నేలంబడెను. ౨, ౩

సమీపంబుననున్న శత్రుఘ్నుఁడు అట్టియవస్థ నొందియున్న భరతుం గవుఁగిలించుకొని పరమదుఃఖితుఁడై, విసంజ్ఞుఁడై పెద్దెలుంగున రోదనంబుఁ జేసెను. ౪

అంత నుపవాసముచేసిచేసి కృశించినవారలును దీనలును భర్తృదుఃఖంబునం బరితపించుచున్నవారలు నగు నాభరతునితల్లు లందఱును అచ్చటికి వచ్చిరి. ౫

వారలును నేలంబడియున్నభరతుం బరివేష్టించి రోదనంబుచేసిరి.

అందుఁ గౌసల్యామాత్రము పరమదుఃఖిత యయి భరతునిసమీపంబునకుఁ బోయి కవుఁగిలించికొనినది. ౬

శోచనీయ యగు కౌసల్య గోవుతనదూడనుంబోలె భరతుంగవుఁగిలించుకొని పరమదుఃఖితయయి రోదనంబుసేయుచు భరతుని నిట్లని యడిగెను. ౭

కొడుకా! నీదేహంబున కేమైన వ్యాధికలిగియున్నదా యేమి?

ఇప్పుడు మాప్రాణమంతయుం నీయధీనముగా నున్నది. ౮

త్వాం దృష్ట్వా పుత్ర! జీవామి రామే సభ్రాతృకే గతే,
వృత్తే దశరథే రాజ్ఞి నాథ ఏక స్త్వమద్య నః.

కచ్చిన్ను లక్ష్మణే పుత్ర! శ్రుతం తే కించిదప్రియమ్,
పుత్రే వాఽప్యేకపుత్రాయాః సహభార్యే వనం గతే. ౧౦

స ముహూర్తం సమాశ్వస్య రుదన్నేవ మహాయశాః,
కౌసల్యాం పరిసాంత్వ్యేదం గుహం వచనమబ్రవీత్. ౧౧
భ్రాతా మే క్వావసద్రాత్రౌ క్వ సీతా క్వ చ లక్ష్మణః,
అస్వపచ్ఛయనే కస్మిన్ కిం భుక్త్వా గుహ! శంస మే. ౧౨

సోఽబ్రవీద్భరతం హృష్టో నిషాదాధిపతిర్గుహః,
యద్విధం ప్రతిపేదే చ రామే ప్రియహితేఽతిథౌ. ౧౩

అన్నముచ్చావచం భక్ష్యాః ఫలాని వివిధాని చ,
రామాయాభ్యవహారార్థం బహు చోపహృతం మయా. ౧౪

తత్సర్వం ప్రత్యనుజ్ఞాసీద్రామ స్సత్యపరాక్రమః,
న తు తత్ప్రత్యగృహ్ణాత్స క్షత్రధర్మమనుస్మరన్. ౧౫

న హ్యస్మాభిః ప్రతిగ్రాహ్యం సఖే! దేయం తు సర్వదా,
ఇతి తేన వయం రాజ! న్ననునీతా మహాత్మనా. ౧౬

కొడుకా! రాముఁడు లక్ష్మణునితోఁగూడ వనంబునకుఁ బోయి దశరథ మహారాజు మరణంబు నొందినపిదప నిన్నుఁజూచి జీవించియున్నాను గాని వేఱుగాదు. ఇప్పుడు మాకందఱకు నీవొక్కఁడవె నాథుఁడవు. ౯

కొడుకా! లక్ష్మణుని విషయమయిఁగాని, భార్యతోఁగూడ నడవికేఁ బోయిన యేకపుత్త్రునగు నాకొడుకు రామునివిషయమయిఁగాని నీ కెవ్వరైన దుఃఖవార్తం జెప్పిరా యేమి? అని కౌసల్య భరతు నడిగెను. ౧౦

మహాయశుఁడగు నా భరతుఁడు కొంచెముసేపునకుఁ దేఱి రోదనంబు సేయుచునే కౌసల్య నాశ్వాసించి గుహునిం జూచి యీమాటం జెప్పెను.

గుహుఁడా! నాయన్న రాముఁడు రాత్రియం దెచ్చటనుండెను? లక్ష్మణుఁ డెచ్చట నుండెను? సీతాదేవి యెచ్చట నుండెను? మఱియు వార లేమి భుజించిరి? ఎచ్చట నిద్రించిరి? దీని నంతయుం నాకుఁ జెప్పుము. అని భరతుఁడు గుహునితోఁ జెప్పెను. ౧౨

నిషాదేశ్వరుఁడగు గుహుఁడు భరతునకు రామునందు మిక్కిలియుం భక్తి యున్నదనియుఁ దనకు రామవృత్తాంతంబుఁ జెప్పుభాగ్యంబు గల్గెననియుం సంతోషంబు నొంది రాముఁ డేమేమిచేసెనో ప్రియుఁడును హితుఁడ వగునతిథియయిన రామునకుఁ దా నేమేమి గావించెనో దాని నంతయుం భరతు నకుం జెప్ప నారంభించెను. ౧౩

నేను రాముని భోజనంబునకై నానావిధంబగు నన్నంబును భక్ష్యములును నానావిధంబులగు ఫలంబులును మఱియుఁ జోష్యలేహ్యాదు లనేకంబులును దెచ్చినాను. ౧౪

సత్యపరాక్రముఁడగు రాముఁడు వాని నన్నిటిని మరల నన్నే దీసికొమ్మనెను. తనదైన క్షత్త్రియధర్మంబుఁ దలంచుకొని దానిలో నెంత మాత్రము ప్రతిగ్రహింపనే లేదు. ౧౫

భరతుఁడా! మహాత్ముఁడగు రాముఁడు "చెలికాఁడా! మేము క్షత్త్రియులము కావునఁ బ్రతిగ్రహింపఁగూడదు. దానమును మాత్రమే చేయవలసినది." అని మాకు సమాధానముఁ జెప్పెను. ౧౬

లక్ష్మణేన సమానీతం పీత్వా వారి మహాయశాః,
ఔపవాస్యం తదాఽకార్షీ ద్రాఘవ స్సహ సీతయా. ౧౭
తత స్తు జలశేషేణ లక్ష్మణోఽప్యకరో త్తదా,
వాగ్యతా స్తే త్రయ స్సన్ధ్యాం సముపాసత సంహితాః. ౧౮

సౌమిత్రి స్తు తతః పశ్చాదకరో త్స్వా స్తరం శుభమ్,
స్వయమానీయ బర్హీంషి క్షిప్రం రాఘవకారణాత్. ౧౯
తస్మిన్సమావిశ ద్రామ స్స్వా స్తరే సహ సీతయా,
ప్రక్షాళ్య చ తయోః పాదా వపచక్రామ లక్ష్మణః. ౨౦

ఏత త్తదిఙ్గుదీమూలమిదమేవ చ త త్తృణమ్,
యస్మిన్రామశ్చ సీతా చ రాత్రిం తాం శయితా వుభౌ. ౨౧
నియమ్య పృష్ఠే తు తలాఙ్గుళిత్రవాన్
శరైస్సుపూర్ణావిషుధీ పర న్తపః,
మహ ద్ధను స్సజ్య ముపోహ్య లక్ష్మణో
నిశామతిష్ఠ త్పరితోఽస్య కేవలమ్. ౨౨
తత స్త్వహం చోత్తమచాపబాణధృత్
స్థితోఽభవం తత్ర స యత్ర లక్ష్మణః,
అతన్ద్రిభి ర్జ్ఞాతిభిరాత్తకార్ముకై
ర్మహేన్ద్రకల్పం పరిపాలయం స్తదా. ౨౩

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే సప్తాశీతితమస్సర్గః.

## అష్టాశీతితమస్సర్గః

తచ్ఛ్రుత్వా నిపుణం సర్వం భరత స్సహ మన్త్రిభిః,
ఇఙ్గుదీమూలమాగమ్య రామశయ్యామవేక్ష్య తామ్. ౧

మహాయశుఁడగు రాముఁడు అప్పుడు లక్ష్మణుఁడు దెచ్చియిచ్చిన జలంబుఁ ద్రావి, సీతయుఁ దానును ఉపవాసముండిరి. ౧౭

అంత నప్పుడు లక్ష్మణుఁడును రాముఁడు ద్రావి మిగిలినజలంబు ద్రావెను. వారలు ముగ్గురును, మౌనంబు వహించి యేకాగ్రచిత్తులయి సంధ్య నుపాసించిరి. ౧౮

అటువెనుక లక్ష్మణుఁడు తానే శీఘ్రముగాఁ బోయి దర్భలం దెచ్చి రామునికొఱకుఁ జక్కఁగా శయనంబు నేర్పఱిచెను. ౧౯

రాముఁడును సీతయును ఆదర్భశయనంబునం బవ్వళించిరి. లక్ష్మణుఁడు సీతారాములపాదంబులను గంగాతీరంబున నడచుటచే నంటుకొనిన బురద పోవునట్లు కడిగి యవ్వలికిఁ బోయి దూరంబునం గాచియుండెను. ౨౦

రాముఁడును సీతయు నిర్వురు నారాత్రియంతయు నీగారచెట్టుక్రింద నీదర్భలపైననే పరుండియుండిరి. ౨౧

శత్రువులం దపింపఁజేయునట్టి లక్ష్మణుఁడు, తలంబును హస్తకవచమును ధరించి బాణంబులచే నిండిన నమ్ములపొదులను వీపునం గట్టికొని ఎక్కుపెట్టిన గొప్పధనువు హస్తమునం దాల్చి కొంచెమయినను గంటిపై ఱెప్పవేయక రామునిచుట్టుం దిరుగుచుఁ గాచియుండెను. ౨౨

అంత నప్పుడు నేను ధనుర్బాణంబులధరించి ధనుర్ధరులగు బంధువులతోఁగూడినవాఁడనై లక్ష్మణుఁడున్నచోటనె యుమఱిక దేవేంద్రసమానుఁ డగు రాముం బరిపాలింపుచు నుంటిని. అని గుహుఁడు భరతునకుం జెప్పెను. ౨౩

ఇది యెనుబదియేడవసర్గము.

---

## ఎనుబదియెనిమిదవ సర్గము

భరతుఁడు మంత్రులతోఁగూడ గుహుఁడు చెప్పినమాట నంతయుఁ జక్కఁగా విని యాగారచెట్టుక్రిందికి వచ్చి సీతారామశయ్యం జూచి తల్లుల

అబ్రవీ జ్జననీ స్సర్వా ఇహ తేన మహాత్మనా,
శర్వరీ శయితా భూమావిదమస్య విమర్దితమ్. ౨
మహాభాగకులీనేన మహాభాగేన ధీమతా,
జాతో దశరథేనోర్వ్యాం న రామ స్స్వప్తు మర్హతి. ౩

అజినో త్తరసం స్తీర్ణే వరా స్తరణసంచయే,
శయిత్వా పురుషవ్యాఘ్రః కథం శేతే మహీతలే. ౪

ప్రాసాదాగ్రవిమానేషు వలభీషు చ సర్వదా,
హైమరాజతభౌమేషు వరా స్తరణశాలిషు.' ౫
పుష్పసంచయచిత్రేషు చన్దనాగరుగన్ధిషు,
పాణ్డురాభ్రప్రకాశేషు శుకసఙ్ఘరుతేషు చ. ౬
ప్రాసాదవరవర్యేషు శీతవత్సు సుగన్ధిషు,
ఉషిత్వా మేరుకల్పేషు కృతకాఞ్చనభిత్తిషు. ౭
గీతవాదిత్రనిర్ఘోషై ర్వరాభరణనిస్వనైః,
మృదఙ్గవరశబ్దై శ్చ సతతం ప్రతిబోధితః. ౮
వన్దిభిర్వన్దితః కాలే బహుభి స్సూతమాగధైః,
గాథాభిరనురూపాభి స్స్తుతిభి శ్చ పర న్తపః. ౯

అశ్రద్ధేయ మిదం లోకే న సత్యం ప్రతిభాతి మా,
ముహ్యతే ఖలు మే భావ స్స్వప్నోఽయ మితి మే మతిః.౧౦

యందఱం బిలిచి "ఇచ్చట మహాత్ముఁడగు రాముఁడు రాత్రిఁ బరుండిన స్థలము. ఇది యతఁడు పరుండుటచే మర్దితంబయిన శయనము" అని చెప్పెను.

మహాభాగ్యవంతుఁడగు నిక్ష్వాకువు సత్కులంబునఁ బుట్టినవాఁడును, మహాభాగ్యశాలియు, బుద్ధిమంతుఁడు నగు దశరథమహారాజుకడుపునం బుట్టిన రాముఁడు నేలం బరుండి నిద్రింపఁదగఁడు. 3

పురుషశ్రేష్ఠుఁడగు రాముఁడు ఇంతవఱకు పైన మేలయిన చర్మము పఱచినవియు సమూల్యంబులగు ననేకాస్తరణంబులు గలవియు నగు వరార్హపర్యంకంబులం బరుండి యిప్పుడు నేలపై నెట్లు పరుండును? ౪

శత్రువులం దపింపఁజేయునట్టి రాముఁడు విమానాకారంబులగు ప్రాసాదశిఖరంబులందును మేడమీఁది గృహంబులందును గాంచనమయంబులును రజతమయంబులు నగు నేలలుగలవియు నుత్తమంబులగు నాస్తరణంబుల నొప్పుచున్నవియు నానావిధపుష్పంబులు చల్లఁబడియుండునవియుఁ జందనాగరుధూపంబుల సుగంధంబు గుబాళించుచున్నవియుఁ దెల్లని మేఘంబుభంగి భాసిల్లునవియు మనోహరంబులగు చిలుకలపలుకులతో నొప్పుచున్నవియుఁ జల్లఁగా నుండునవియు మంచివాసనగలవియు బంగారుగోడలు గలవి కావున మేరుపర్వతంబుంబోలె నున్నవియు నగు నుత్తమప్రాసాదంబులందునుబరుండి నానావిధగీతంబులచేతను వీణాదివాద్యధ్వనులచేతను పరిచారికల మేఖలానూపురాద్యాభరణ ధ్వనులచేతను నిద్రమేల్కొని ప్రాతఃకాలంబున స్తుతిపాఠకులును సూతులును మాగధులు ననేకులు సేయు నానావిధస్తోత్రంబులు వినుచు నానందించుచుండెనే! ఇంక నడవి నేలలం బరుండి క్షుద్రమృగంబుల భయంకరారావంబులకు మేల్కొని యేకాకియయి యెట్లుండును? ౫-౯

ఇట్లు రాముఁడు నేలం బరుండుట మొదలగుదానియందు నా కెంతమాత్రము నమ్మకము గలుగలేదు. ఇదంతయు సత్యముగా జరుగుచున్నదని నాకుఁ దోఁచలేదు. నా మనసున కేమయిన భ్రమంబు గలిగినదేమో. లేక నా కిట్లు స్వప్నమే యయినదో! ౧౦

న నూనం దైవతం కించి త్కాలేన బలవ త్తరమ్,
యత్ర దాశరథీ రామో భూమా వేవ శయీత సః. ౧౧
విదేహరాజస్య సుతా సీతా చ ప్రియదర్శనా,
దయితా శయితా భూమౌ స్నుషా దశరథస్య చ. ౧౨

ఇయం శయ్యా మమ భ్రాతు రిదం హి పరివ ర్తితం,
స్థణ్డిలే కఠినే సర్వం గాత్రై ర్విమృదితం తృణమ్. ౧౩
మన్యే సాభరణా సుప్తా సీతాఽస్మి ఞ్ఛయనో త్తమే,
తత్ర తత్ర హి దృశ్య న్తే సక్తాః కనకబిన్దవః. ౧౪

ఉత్తరీయ మిహాఽసక్తం సువ్యక్తం సీతయా తదా,
తథా హ్యేతే ప్రకాశ న్తే సక్తాః కౌశేయత న్తవః. ౧౫

మన్యే భర్తు స్సుఖా శయ్యా యేన బాలా తపస్వినీ,
సుకుమారీ సతీ దుఃఖం న విజానాతి మైథిలీ. ౧౬

హా హన్తాఽస్మి నృశంసోఽహం య త్సభార్యః కృతే మమ,
ఈదృశీం రాఘవ శ్శయ్యా మధిశేతే హ్యనాథవత్. ౧౭

సార్వభౌమకులే జాత స్సర్వలోకస్య సమ్మతః,
సర్వలోకప్రియ స్త్యక్త్వా రాజ్యం సుఖ మను త్తమమ్. ౧౮
కథ మిన్దీవరశ్యామో రక్తాక్షః ప్రియదర్శనః,
సుఖభాగీ న దుఃఖార్హ శ్శయితో భువి రాఘవః. ౧౯

కాలమునకన్న దైవ మెంతమాత్రము బలిష్ఠము కాదు. కాలమే బలిష్ఠము. అట్టి దశరథమహారాజుకొడుకు రాముఁడు నేలపైఁ బరుండుచున్నాఁడే! ౧౧

జనకమహారాజుకొమార్తెయు దశరథమహారాజుకోడలును రాముని ప్రియురాలును జూపరులకు సంతోషంబు గలిగించునదియు నగు సీతాదేవియు నేలపైఁ బరుండినదే! ౧౨

ఇది సాయన్నగారి పాన్పు. ఇదిగో ఆయనకఠినంబగు నేలయందు శ్రమవశంబునఁ బొరలుటచే శయ్యారూపంబగు దర్భలన్నియు నలఁగియున్నవి. ౧౩

ఈ గొప్పపాన్పునందు సీతాదేవి మార్గశ్రమంబున నాభరణంబులు విడువక యాభరణంబులతోనే పరుండినదని తలంచెదను. కావుననే యచ్చటచ్చట బంగారుపొడి యంటుకొనియున్నది. ౧౪

అప్పుడు సీతాదేవి యుత్తరీయము మీదస్థలందుఁ దగిలియుండెననుట స్పష్టము. ఏలయనఁగా నచ్చటచ్చటఁ దగులుకొనియుండు పట్టుపోఁగులు ఎంతయుఁ బ్రకాశించుచున్నవి. ౧౫

శోచనీయయుఁ బతివ్రతయునగు సీతాదేవి బాలయుఁ గోమలాంగియు నయ్యు నేలపై నిట్టిశయనంబునం బరుండి దుఃఖం బెఱుఁగకున్నది. కావున పతివ్రతలకు ఎచ్చటనైనను భర్తతోఁగూడఁ బరుండుటయె సుఖకర మని తలంచెదను. ౧౬

నానిమిత్తమయి రాముఁడు భార్యతోఁగూడ ననాథయుంబోలె నిట్టి కఠినశయనంబునందుఁ బరుండినాఁడు. కావున నేను మిక్కిలియుఁ బాపిష్ఠుఁడనైతిని! అయ్యో! ౧౭

చక్రవర్తులవంశంబునం బుట్టినవాఁడును సమస్తలోక సమ్మతుఁడును సమస్తజనులకుఁ బ్రియుఁడును ఇందీవరశ్యామలదేహుఁడును రక్తాంగనయనుఁడును జూపరులకు సంతోషంబు గలిగించువాఁడును ఇట్లు జన్మంబునను గుణంబులను సౌందర్య సౌకుమార్యాదులవలనను సుఖంబు నొందుటకె తగినవాఁడును దుఃఖానర్హుఁడునగు రాముఁడు సుఖకరంబగు నుత్తమరాజ్యంబు విడిచి నేలపై నెట్లు పరుండియుండెను? ౧౮,౧౯

ధన్యః ఖలు మహాభాగో లక్ష్మణ శ్శుభలక్షణః,
భ్రాతరం విషమే కాలే యో రామ మనువర్తతే.

సిద్ధార్థా ఖలు వైదేహీ పతిం యాఽనుగతా వనం,

వయం సంశయితా స్సర్వే హీనా స్తేన మహాత్మనా.

అకర్ణధారా పృథివీ శూన్యేవ ప్రతిభాతి మా,
గతే దశరథే స్వర్గం రామే చారణ్య మాశ్రితే.

నచ ప్రార్థయతే కశ్చి న్మనసాపి వసున్ధరామ్,
వనేఽపి వసత స్తస్య బాహువీర్యాభిరక్షితామ్.

శూన్యసంవరణారక్షా మయన్త్రితహయద్విపాం,
అపావృతపురద్వారాం రాజధానీ మరక్షితామ్.
అప్రహృష్టబలాం న్యూనాం విషమస్థా మనావృతాం,
శత్రవో నాభిమన్యన్తే భక్ష్యాన్విషకృతా నివ.

అద్యప్రభృతి భూమౌ తు శయిష్యేఽహం తృణేషు
ఫలమూలాశనో నిత్యం జటాచీరాణి ధారయన్.
తస్యార్థ ముత్తరం కాలం నివత్స్యామి సుఖం వనే,
తం ప్రతిశ్రవ మాముచ్య నాస్య మిథ్యా భవిష్యతి.

వస న్తం భ్రాతు రర్థాయ శత్రుఘ్నో మాఽనువత్స్యతి

మహాభాగుఁడును శుభలక్షణంబులు గలవాఁడు నగు లక్ష్మణుఁడు అన్న యగు రాముని ఆపత్కాలమునందు అనుసరించియున్నాఁడు కావున నతండు పుణ్యవంతుఁడు. ౨౦

సీతాదేవి పెనిమిటిని వెంబడించి యడవికిఁ బోయినది కావున సాధ్వి కృతార్థయయినది.

మనము అట్టిమహాత్ముఁడగు రాముని బాసియున్నాము. అతఁడు ఇంక మనల నంగీకరించునో అంగీకరింపఁడో యని సందేహముగా నున్నది. ౨౧

దశరథమహారాజు స్వర్గంబు నొంది రాముఁడును వనంబునకుఁ బోయినపిదప నీభూమి యనాథయయి కర్ణధారుఁడులేని యోడపగిది నాకుఁ దోఁచుచున్నది. ౨౨

ఇట్లు రాజ్యం బంతయు నసాయకంబయినను, రాముఁడు వనంబునందు న్నను అతని బాహుపరాక్రమంబునకు భయపడి ఇరుగుపొరుగురాజు లెవ్వ రును రామునిరాజ్యంబు నాక్రమింప మనసునందునైనను దలంపరు. ౨౩

ప్రాకారరక్షకులు లేనిదియు సన్నద్ధంబులుగాని గుఱ్ఱంబులును గజం బులును గలదియు తెఱవఁబడిన ద్వారంబులు గలదియు దుఃఖితంబులగు సైన్యంబు గలదియు నిట్లు దుర్దశ నొంది రక్షణములేక యున్న యయోధ్యా పట్టణమును శత్రురాజులు రామభయంబున విషంబు గలిసిన పిండివంటలం బోలె నిచ్ఛింపకున్నారు. ౨౪,౨౫

నేను ఇదిమొదలు ఫలమూలంబులనే దినుచు నారచీరలు గట్టుకొని జటాధారుఁడనై యిట్లు నేలపైననె తృణంబులు పఱచుకొని పరుండెదను.

రాముఁడు చేసినప్రతిజ్ఞను నే నవలంబించి యిదివఱకుఁ గడచినది పోను ఇంక నుండవలసిన కాలం బంతయు సుఖంబుగా వనంబున నుండెదను. రాముని ప్రతిజ్ఞ యెంతమాత్రము అసత్యము కానేరదు. ౨౭

అన్నయగు రామునినిమిత్తమై వనంబుననున్న నాతోఁగూడ శత్రు ఘ్నుఁడు నుండును.

లక్ష్మణేన సహ భ్రాత్రా హ్యయోధ్యాం పాలయిష్యతి. ౨౮

అభిషేక్ష్యన్తి కాకుత్స్థ మయోధ్యాయాం ద్విజాతయః,

అపి మే దేవతాః కుర్యు రిమం సత్యం మనోరథమ్. ౨౯
ప్రసాద్యమాన శ్శిరసా మయా స్వయం
బహుప్రకారం యది నాభిపత్స్యతే,
తతోఽనువత్స్యామి చిరాయ రాఘవం
వనే వస న్నార్హతి మా ముపేక్షితుమ్.

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డేఽష్టాశీతితమస్సర్గః.

---

## ఏకోననవతితమస్సర్గః

వ్యుష్య రాత్రిం తు తత్రైవ గఙ్గాకూలే స రాఘవః,
భరతః కాల్య ముత్థాయ శత్రుఘ్న మిద మబ్రవీత్.
శత్రుఘ్నోత్తిష్ఠ కిం శేషే నిషాదాధిపతిం గుహం,
శీఘ్ర మానయ భద్రం తే తారయిష్యతి వాహినీమ్.

జాగర్మి నాహం స్వపిమి తమేవార్యం విచిన్తయన్,
ఇత్యేవ మబ్రవీ ద్భ్రాతా శత్రుఘ్నోఽపి ప్రచోదితః.

ఇతి సంవదతో రేవ మన్యోన్యం నరసింహయోః,
ఆగమ్య ప్రాఞ్జలిః కాలే గుహో భరత మబ్రవీత్.

కచ్చిత్సుఖం నదీతీరేఽవాత్సీః కాకుత్స్థ! శర్వరీం,
కచ్చిత్తే సహసైన్యస్య తావత్సర్వ మనామయమ్.

గుహస్య వచనం శ్రుత్వా తత్తు స్నేహా దుదీరితం,
రామస్యానువశో వాక్యం భరతోఽపీద మబ్రవీత్.
సుఖా నశ్శర్వరీ రాజన్! పూజితా శ్చాపి తే వయం,

గఙ్గాం తు నౌభి ర్బహ్వీభి ర్దాశా స్సన్తారయన్తు నః.

తతో గుహ స్సత్త్వరితం శ్రుత్వా భరతశాసనం,
ప్రతి ప్రవిశ్య నగరం తం జ్ఞాతిజన మబ్రవీత్.
ఉత్తిష్ఠత ప్రబుధ్యధ్వం భద్ర మస్తు చ వ స్సదా,
నావ స్సమనుకర్షధ్వం తారయిష్యామ వాహినీమ్.

తే తథోక్తా స్సముత్థాయ త్వరితా రాజశాసనాత్,
పఞ్చనావాం శతా న్యాశు సమానిన్యు స్సమన్తతః.
అన్యా స్స్వస్తికవిజ్ఞేయా మహాఘుంటాధరా వరాః,
శోభమానాః పతాకాభి ర్యుక్తవాహా స్సుసంహతాః.

తత స్స్వస్తికవిజ్ఞేయాం పాణ్డుకంబళసంవృతామ్,
సనన్దిఘోషాం కల్యాణీం గుహో నావ ముపాహరత్.

భరతుఁడా! నదీతీరంబున నీరాత్రి నీవు సుఖంబుగానే యుండినదా? నీకేమి నీసైన్యంబునకేమి యేమియుం బాధ గలుగలేదుగదా? అని గుహుఁడు భరతునితోఁ జెప్పెను. ౫

రామాధీనుఁడగు భరతుఁడు గుహుఁడు స్నేహంబునం బలికినమాటను విని యతనిం జూచి యిట్లని చెప్పెను. ౬

నిషాదరాజుఁడవగు గుహుఁడా! మాకు రాత్రి సుఖంబుగానే యుండినది. మఱియు మమ్ము నానావిధంబులం బూజించితివి.

చెంబడివారలు ఓడల ననేకంబులు దెచ్చి మమ్మందఱను ఈగంగానదిని మాత్రము దాఁటింపవలయును. అని భరతుఁడు గుహునితోఁ జెప్పెను. ౭

గుహుఁడు భరతుఁడు త్వరపడి యాజ్ఞాపించినమాటను విని మరలఁ బట్టణంబుఁ బ్రవేశించి తన బంధువులం జూచి యిట్లని చెప్పెను. ౮

మేల్కొనుఁడు. లెండు. మీ కెప్పుడును మంగళంబు గలుగుఁగాక. ఓడలు దీసికొనిరండు. భరతాదులను ఏఱు దాఁటింతము. అని గుహుఁడు బంధువులతోఁ జెప్పెను. ౯

అంత వారలు గుహునిమాటను విని రాజాజ్ఞవలన లేచి త్వరితంబుగాఁ బోయి యచ్చటచ్చటనుండి యయిదునూఱులయోడలం దీసికొనివచ్చిరి. ౧౦

మఱియు నాయయిదువందలయోడలెగాక గొప్పగంటలుగట్టినవియు నుత్తమంబులును ధ్వజంబులం బ్రకాశించుచున్నవియు పైన మూయఁబడి కిటికీలుంచి యుండుటచే యుక్తమయిన వాయుసంచారంబుగలవియుఁ జీలలు మొదలగునవి గొట్టి దృఢముగా నిర్మింపఁబడినవియు నగు స్వస్తికంబులను నోడలనుం దీసికొనివచ్చిరి. ౧౧

అంత గుహుఁడు స్వస్తికంబను పేరుగల యుత్తమంబులగు నోడలలో నొక్క తెల్లకంబళితోఁ గప్పఁబడిన తలప్రదేశముగలదియు గంటలధ్వనులతో నొప్పుచున్నదియు సుందరంబు నగు నోడం దెచ్చెను. ౧౨

తా మారురోహ భరతశ్శత్రుఘ్నశ్చ మహాబలః,

కౌసల్యా చ సుమిత్రా చ యా శ్చాన్యా రాజయోషితః. ౧౩
పురోహిత శ్చ తత్పూర్వం గురవో బ్రాహ్మణా శ్చ యే,
అనన్తరం రాజదారా స్తథైవ శకటాపణాః. ౧౪
ఆవాస మాదీపయతాం తీర్థం చాప్యవగాహతామ్,
భాణ్డాని చాదదానానాం ఘోష స్త్రిదివ మస్పృశత్. ౧౫

పతాకిన్య స్తు తా నావ స్స్వయం దాశై రధిష్ఠితాః,
వహన్త్యో జన మారూఢం తదా సమ్పేతు రాశుగాః. ౧౬
నారీణా మభిపూర్ణా స్తు కాశ్చిత్కాశ్చిచ్చ వాజినామ్,
కాశ్చి దత్ర వహన్తి స్మ యానయుగ్యం మహాధనమ్. ౧౭

తా స్స్మ గత్వా పరం తీర మవరోప్య చ తం జనమ్,
నివృత్తాః కాణ్డచిత్రాణి క్రియన్తే దాశబన్ధుభిః. ౧౮

స వైజయన్తా స్తు గజా గజారోహప్రచోదితాః,
తరన్త స్స్మ ప్రకాశన్తే సధ్వజా ఇవ పర్వతాః. ౧౯
నావ స్త్వారురుహు శ్చాన్యే ప్లవై స్తేరు స్తథా పరే,
అన్యే కుమ్భఘటై స్తేరురన్యే తేరు శ్చ బాహుభిః. ౨౦
సా పుణ్యా ధ్వజినీ గఙ్గాం దాశై స్సన్తారితా స్వయమ్,
మైత్రే ముహూర్తే ప్రయయౌ ప్రయాగవన ముత్తమమ్. ౨౧

ఆశ్వాసయిత్వా చ చమూం మహాత్మా
నివేశయిత్వా యథోపజోషమ్,

ద్రష్టుం భరద్వాజ మృషిప్రవర్య
మృత్విగ్వృత స్సన్భరతగ ప్రతస్థే.
స బ్రాహ్మణస్యాఽఽశ్రమ మభ్యుపేత్య
మహాత్మనో దేవపురోహితస్య,
దదర్శ రమ్యోటజవృక్షషణ్డం
మహద్వనం విప్రవరస్య రమ్యమ్.

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే ఏకోననవతితమస్సర్గ

---

నవతితమస్సర్గః

భరద్వాజాశ్రమం దృష్ట్వా క్రోశా దేవ నరర్షభః,
బలం సర్వ మవస్థాప్య జగామ సహ మన్త్రిభిః.
పద్భ్యామేవ హి ధర్మజ్ఞో న్యస్తశస్త్రపరిచ్ఛదః,
వసానో వాససీ క్షౌమే పురోధాయ పురోధసమ్.
తత స్సందర్శనే తస్య భరద్వాజస్య రాఘవః,
మన్త్రిణ స్తా నవస్థాప్య జగామానుపురోహితమ్.

వసిష్ఠ మథ దృష్ట్వైవ భరద్వాజో మహాతపాః,
సఞ్చచాలాఽసనా త్తూర్ణం శిష్యా నర్ఘ్యమితి బ్రువన్.
సమాగమ్య వసిష్ఠేన భరతేనాభివాదితః,
అబుధ్యత మహాతేజా స్సుతం దశరథస్య తమ్.
తాభ్యా మర్ఘ్యం చ పాద్యం చ దత్త్వా పశ్చా త్ఫలాని
ఆనుపూర్వ్యాచ్చ ధర్మజ్ఞః పప్రచ్ఛ కుశలం కులే.

లచేఁ బ్రేరితుఁడై ఋషిశ్రేష్ఠుఁడును అధికవయస్కుఁడు నగు భరద్వాజ మహర్షిం జూచుటకై పోయెను. ౨౨

ఆ భరతుఁడు సమస్త వేదవేత్తయును మహానుభావుఁడును దేవపురోహితుఁడును బ్రాహ్మణోత్తముఁడు నగు భరద్వాజమహర్షి యాశ్రమంబు నొద్దకుఁ బోయి యచ్చట రమణీయంబులగు పర్ణశాలలును నానావిధ వృక్షంబులును గల రమణీయంబగు గొప్పవనముం జూచెను. ౨౩

ఇది యెనుబదితొమ్మిదవసర్గము.

---

## తొంబదవసర్గము

పురుషశ్రేష్ఠుఁడును ధర్మజ్ఞుఁడునగు భరతుఁడు క్రోసుదూరంబు ముందుగానే భరద్వాజమహర్షి యాశ్రమంబుఁ జూచి సైన్యంబునంతయుం నిలిపి ఆయుధంబులను ఆభరణంబులను విడిచి పట్టువస్త్రంబులను గట్టుకొని పురోహితుని ముందిడుకొని మంత్రులం గూడి యాశ్రమంబునకుఁ బోయెను. ౧,౨

అంత భరతుఁడు భరద్వాజాశ్రమంబుఁ బ్రవేశించినపిదప మంత్రులనుం గూడ నిలిపి పురోహితుఁడగు వసిష్ఠునితోఁ గూడఁ దాను భరద్వాజుం జూడఁ బోయెను. ౩

అంత మహాతపస్వియగు భరద్వాజమహాముని వసిష్ఠమహర్షింజూచి "యర్ఘ్యంబు దె"మ్మని చెప్పుచు శీఘ్రంబున నాసనంబున నుండి లేచెను. ౪

మహాప్రభావుఁడగు నాభరద్వాజుఁడు వసిష్ఠునితోఁ జేరి యంత భరతుఁ డభివాదనంబుఁ జేసినపిదప నతఁడు దశరథపుత్రుఁడని యెఱింగెను. ౫

అంత ధర్మజ్ఞుఁడగు నా భరద్వాజుఁడు క్రమంబున వసిష్ఠమహర్షికిని భరతునకును అర్ఘ్యపాద్యంబు లొసంగి ఫలంబుల నిచ్చి యంతట నందఱు క్షేమంబేకదా? యని యడిగెను. ౬

అయోధ్యాయాం బలే కోశే మిత్రేష్వపి చ మన్త్రిషు,
జానన్ దశరథం వృత్తం న రాజాన ముదాహరత్. ౭

వసిష్ఠో భరత శ్చైనం పప్రచ్ఛతు రనామయమ్,
శరీరేఽగ్నిషు వృక్షేషు శిష్యేషు మృగపక్షిషు. ౮

తథేతి తత్ప్రతిజ్ఞాయ భరద్వాజో మహాతపాః,
భరతం ప్రత్యువాచేదం రాఘవస్నేహబన్ధనాత్. ౯

కిమిహాఽగమనే కార్యం తవ రాజ్యం ప్రశాసతః,
ఏత దాచక్ష్వ మే సర్వం నహి మే శుధ్యతే మనః. ౧౦
సుషువే య మమిత్రఘ్నం కౌసల్యాఽఽనన్దవర్ధనమ్,
భ్రాత్రా సహ సభార్యో య శ్చిరం ప్రవ్రాజితో వనమ్. ౧౧
నియుక్తః స్త్రీనియుక్తేన పిత్రా యోఽసౌ మహాయశాః,
వనవాసీ భవేతీహ సమాః కిల చతుర్దశ. ౧౨
కచ్చి న్న తస్యాపాపస్య పాపం కర్తు మిహేచ్ఛసి,
అకణ్టకం భోక్తుమనా రాజ్యం తస్యానుజస్య చ. ౧౩

ఏవ ముక్తో భరద్వాజం భరతః ప్రత్యువాచ హ,
పర్యశ్రునయనో దుఃఖా ద్వాచా సంసజ్జమానయా. ౧౪

మఱియు నయోధ్యయందును సైన్యంబునందును బొక్కసమునందును అన్నియుం క్షేమంబెగదా? స్నేహితులును మంత్రులును క్షేమముగనున్నారా? అని యడిగెను. ౭

భరద్వాజుఁడు దశరథమహారాజు మృతిఁ బొందెనని యెఱింగినవాఁడు కావున దశరథమహారాజు సమాచార మెత్తలేదు. ౮

అంతవసిష్ఠుఁడును భరతుఁడును "దేహమునందు ఆరోగ్యముగా నున్నదా? అగ్నిహోత్రములు చక్కఁగాజరుగుచున్నవా? వృక్షంబులు చక్కఁగా నున్నవా? శిష్యులు క్షేమంబుగానున్నారా? వనంబునందలిమృగంబులును బక్షులును క్షేమంబుగా నున్నవా?" యని భరద్వాజు నడిగిరి. ౯

మహాతపశ్శాలియగు భరద్వాజుఁడు వసిష్ఠభరతులకు అన్నిటను క్షేమమె యని చెప్పి యంత రామునియందలి స్నేహంబున భరతుం జూచి యిట్లని చెప్పెను. ౧౦

నీవు రాజ్యంబుఁ బాలించువాఁడవు. ఇప్పు డిచ్చటి కేల వచ్చితివి? నాకు సవిస్తరముగాఁ జెప్పుము. నామనంబునకు సంశయము గలుగుచున్నది.

కౌసల్యాదేవి శత్రువులను సంహరించువాఁడును సమస్తజంతువులకును బరమానందంబు గలిగించువాఁడు నగు నెవ్వనిం గన్నదో, యెవ్వఁడు భార్యతోను దమ్మునితోనుంగూడ బహుకాల మరణ్యంబున నుండుటకుఁ బాఁపబడెనో, మఱియుం నేమహాయశునిఁ దండ్రి దశరథుఁడు భార్యయాజ్ఞకు లోఁబడి "నీ విప్పుడె పోయి పదునాలుగుసంవత్సరంబు లడవిలోనుండు" మని యాజ్ఞాపించెనో, అట్టి పాపరహితుఁడగు రామునకును అతనితమ్ముఁడు లక్ష్మణునకును నీవు ఎదురులేక యెల్లప్పుడును రాజ్యంబు ననుభవింపఁ గోరి ఏమియు నపకారంబు సేయంగోరవుగదా? అని భరద్వాజుఁడు భరతునితోఁ జెప్పెను. ౧౧-౧౩

భరతుఁడు భరద్వాజమహర్షి చెప్పినమాటను విని యిట్టిమాటలు విన వలసివచ్చెనుగదా యని దుఃఖితుఁడై కండ్లునిండఁ గన్నీళ్లు గాఱ మాటలు దొట్రుపడ భరద్వాజమహామునిం జూచి యిట్లని చెప్పెను. ౧౪

హతోఽస్మి యది మా మేవం భగవా నపి మన్యతే,
మత్తో న దోష మాశఙ్క్యే నైవం మా మనుశాధి హి. ౧౫

న చైత దిష్టం మాతా మే య దవోచ న్మద న్తరే,
నాహ మేతేన తుష్ట శ్చ న తద్వచన మాదదే. ౧౬

అహం తు తం నరవ్యాఘ్ర ముపయాతః ప్రసాదకః,
ప్రతినేతు మయోధ్యాం చ పాదౌ తస్యాభివన్దితుమ్. ౧౭
త్వం మా మేవం గతం మత్వా ప్రసాదం కర్తు మర్హసి,
శంస మే భగవ! న్రామః క్వ సమ్ప్రతి మహీపతిః. ౧౮

వసిష్ఠాదిభి రృత్విగ్భి ర్యాచితో భగవాం స్తతః,
ఉవాచ తం భరద్వాజః ప్రసాదా ద్భరతం వచః. ౧౯

త్వయ్యేత త్పురుషవ్యాఘ్ర! యుక్తం రాఘవవంశజే,
గురువృత్తి ర్దమ శ్చైవ సాధూనాం చానుయాయితా. ౨౦

జానే చైత న్మనఃస్థం తే దృఢీకరణ మ స్త్వితి,
అపృచ్ఛం త్వాం తథాఽత్యర్థం కీర్తిం సమభివర్ధయన్. ౨౧

జానే చ రామం ధర్మజ్ఞం ససీతం సహ లక్ష్మణమ్,

అసౌ వసతి తే భ్రాతా చిత్రకూటే మహాగిరౌ. ౨౨
శ్వ స్తు గన్తాసి తం దేశం వసాద్య సహ మన్త్రిభిః,

భగవంతుఁడవగు నీవును నన్ను దోషినిగా నే తలంతువేని నేను హతుఁడనైతిని. నాయందు దోషం బుండునట్లు నా కెంతమాత్రము సందేహము లేదు. సర్వజ్ఞుండవగు నీ వి ట్లూనదీయరాదు. ౧౫

నేను లేనప్పుడు నాతల్లి కైకేయి గావించినకార్యము; నేను గోరినది కాదు. దానిచే నాకు సంతోషంబును గలుగలేదు. నేను దానికి సమ్మతింపను లేదు. ౧౬

నేను బురుషశ్రేష్ఠుఁడగు నారాముని ప్రసన్నుం గావించికొని యతని పాదంబులపైఁ బడి యతని నయోధ్యకుఁ గొనిపోవుటకై వచ్చినాను. ౧౭

భగవంతుఁడవగు భరద్వాజుఁడా! నేను వచ్చినకారణంబు నెదనుంచి నన్ను ననుగ్రహింపవలయు. భూనాయకుఁడగురాముఁ డిప్పు డెచ్చట నున్నాఁడు? నాకుఁ జెప్పుము. అని భరతుఁడు భరద్వాజునితోఁ జెప్పెను. ౧౮

భగవంతుఁడగు భరద్వాజమహర్షి వసిష్ఠవామదేవాదిఋత్విజులు భరతునివిషయమయి యనుగ్రహింపుమని ప్రార్థింపఁ బ్రసన్నుఁడైయాభరతుంజూచి యీమాటం జెప్పెను. ౧౯

పురుషశ్రేష్ఠుఁడవగుభరతుఁడా! జ్యేష్ఠానువర్తనంబును ఇంద్రియనిగ్రహంబును సత్పురుషుల ననుసరించుటయు, ఇవన్నియు రఘువంశంబునం బుట్టిన నీకుఁ దగియున్నవి. ౨౦

నేను నీమనసులో నున్న యీసంగతిని యోగదృష్టిం దెలిసికొనియె యున్నాను. అయినను అది దృఢీకృతంబగుటకును, నీకు జ్యేష్ఠభ్రాత్రనువర్తనంబునం గలుగు కీర్తిని మిక్కిలియు వృద్ధిఁబొందించుటకును ని న్నట్లడిగితిని.

ధర్మజ్ఞుఁడగు రాముఁడును సీతాదేవియు లక్ష్మణుఁడును ఎచ్చట నున్నారో ఆసంగతియు నాకుఁ దెలిసియున్నది. ౨౧

నీయన్న రాముఁడు చిత్రకూటంబను మహాపర్వతంబున నున్నాఁడు.

ఆచిత్రకూటపర్వతంబునకు రేపు పోఁగలవు. ఇప్పు డిచ్చట మంత్రులతోఁ గూడ నుండుము.

ఏతన్మే కురు సుప్రాజ్ఞ! కామం కామార్థకోవిద!. ౨౩

తత స్తథేత్యేవ ముదారదర్శనః
ప్రతీతరూపో భరతోఽబ్రవీ ద్వచః,
చకార బుద్ధిం చ తదా తదాశ్రమే
నిశానివాసాయ నరాధిపాఽఽత్మజః. ౨౪

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే నవతితమస్సర్గః.

---

## ఏకనవతితమస్సర్గః.

కృతబుద్ధిం నివాసాయ తత్రైవ స ముని స్తదా,
భరతం కైకయీపుత్ర మాతిథ్యేన న్యమన్త్రయత్. ౧

అబ్రవీ ద్భరత స్త్వేనం "న న్విదం భవతా కృతమ్,
పాద్య మర్ఘ్యం తథాఽఽతిథ్యం వనే యదుపపద్యతే. ౨

అథోవాచ భరద్వాజో భరతం ప్రహస న్నివ,

జానే త్వాం ప్రీతిసంయుక్తం తుష్యే స్త్వం యేన కేనచిత్. ౩

సేనాయా స్తు తవైత స్యాః కర్తు మిచ్ఛామి భోజనమ్,
మమ ప్రీతి ర్యథా రూపా త్వ మర్హో మనుజర్షభ!. ౪
కిమర్థం చాపి నిక్షిప్య దూరే బల మిహాగతః,
కస్మాన్నేహోపయాతోఽసి సబలః పురుషర్షభ!. ౫

భరతః ప్రత్యువాచేదం ప్రాఞ్జలి స్తం తపోధనమ్,
ససైన్యో నోపయాతోఽస్మి భగవ౯! భగవద్భయాత్. ౬

రాజ్ఞా చ భగవన్నిత్యం రాజపుత్త్రేణ వా సదా,
యత్నతః పరిహర్తవ్యా విషయేషు తపస్వినః. ౭

వాజిముఖ్యా మనుష్యాశ్చ మత్తాశ్చ వరవారణాః,
ప్రచ్ఛాద్య భగవ౯! భూమిం మహతీ మనుయాన్తి మామ్. ౮

తే వృక్షా నుదకం భూమి మాశ్రమే షూటజాం స్తథా,
న హింస్యు రితి తేనాహ మేక ఏవ సమాగతః. ౯

ఆనీయతా మిత స్సేనే త్యాజ్ఞప్తః పరమర్షిణా,
తత స్తు చక్రే భరత స్సేనాయా స్సముపాగమమ్. ౧౦
అగ్నిశాలాం ప్రవిశ్యాథ పీత్వాఽపః పరిమృజ్య చ,
ఆతిథ్యస్య క్రియాహేతో ర్విశ్వకర్మాణ మాహ్వయత్. ౧౧

ఆహ్వయే విశ్వకర్మాణ మహం త్వష్టార మేవ చ,
ఆతిథ్యం కర్తు మిచ్ఛామి తత్ర మేసంవిధీయతామ్. ౧౨

ఆహ్వయే లోకపాలాం స్త్రీ౯ దేవాం ఛక్రముఖాం స్తథా,
ఆతిథ్యం కర్తు మిచ్ఛామి తత్ర మే సంవిధీయతామ్. ౧౩

భరతుఁడు అందులకుఁ జేమోడ్పుగీలించి యాభరద్వాజమహామునిం జూచి యిట్లని చెప్పెను.

భగవంతుఁడవగు భరద్వాజుఁడా! నీకుఁ గోపంబు గలుగునను భయంబున సైన్యంబుఁ దీసికొని రాలేదు. ౬

భగవంతుఁడా! రాజుగాని రాజపుత్రుఁడుగాని ప్రయాణకాలంబునఁ దమదేశంబులఁ దపోధను లుండు మార్గంబు దప్పించి వారలకు సేనాదులచే బాధగలుగకుండునట్లు వేఱుమార్గంబునం బోవలయును. ౭

భగవంతుఁడా! అశ్వోత్తమంబులును మనుష్యులును మదపుటేనుంగులును ఇట్లు అనంతసైన్యంబు అతివిశాలంబుగా భూమిం నావరించి నన్ను వెంబడించి వచ్చుచున్నది. ౮

అవన్నియుం నిచ్చటికి వచ్చినపక్షంబున నాశ్రమంబునందలి వృక్షంబులను సరస్సులను భూమిని బర్ణశాలలను నశింపఁ జేయకపోవని యాకారణంబున నే నొక్కఁడనె వచ్చినాను. అని భరతుఁడు భరద్వాజునితోఁ జెప్పెను. ౯

అంత, "సేన నిచ్చటికి రావింపుము" అని భరద్వాజమహర్షి యాజ్ఞాపింప భరతుఁడు సేన నయ్యాశ్రమంబునకు రావించెను. ౧౦

అంత భరద్వాజమహాముని యగ్నిహోత్రగృహంబునకుఁ బోయి ముమ్మా ఱాచమించి రెండుమాఱులు పెదవులు తుడిచికొని యాతిథ్యసన్నాహంబునకై విశ్వకర్మం బిలిచెను. ౧౧

నేను దక్షణంబునసె మహాగృహాదుల నిర్మించునట్టి విశ్వకర్మం బిలుచుచున్నాను. భరతునకు నతనిసేనకును నాతిథ్యంబు సేయఁగోరియున్నాను. దానికిఁగా విశ్వకర్మ గృహాదుల నిర్మించుఁగాక. ౧౨

అట్లు యమ వరుణ కుబేరుల మువ్వుర దిక్పాలకులను, దేవేంద్రాదిదేవతలనుం బిలిచెదను. భరతునకును అతని సేనకును నాతిథ్యంబు గావింప వలెనని యున్నాను. దానికి వార లందఱుఁ దోడ్పడియుండురుగాక. ౧౩

ప్రాక్స్రోతసశ్చ యా నద్యః ప్రత్యక్స్రోతసఏవ చ,
పృథివ్యా మన్తరిక్షే చ సమాయాన్త్వద్య సర్వశః. ౧౪

అన్యాః స్రవన్తు మైరేయం సురా మన్యాస్సునిష్ఠితామ్,
అపరాశ్చోదకం శీత మిక్షుకాణ్డరసోపమమ్. ౧౫

ఆహ్వయే దేవగన్ధర్వా న్విశ్వావసుహాహాహూహూన్,
తథైవాప్సరసో దేవీ ర్గన్ధర్వీశ్చాపి సర్వశః. ౧౬

ఘృతాచీ మథ విశ్వాచీం మిశ్రకేశీ మలమ్బుసామ్,
నాగదన్తాం చ హేమాం చ హిమా మద్రికృతస్థలామ్. ౧౭
శక్రం యాశ్చోపతిష్ఠన్తి బ్రహ్మాణం యాశ్చ యోషితః,
సర్వా స్తుమ్బురుణా సార్ధ మాహ్వయే సపరిచ్ఛదాః. ౧౮

వనం కురుషు యద్దివ్యం వాసో భూషణపత్రవత్,
దివ్యనారీఫలం శశ్వత్తత్కౌబేర మిహైవ తు చ. ౧౯

ఇహ మే భగవాన్ సోమో విధత్తా మన్న ముత్తమమ్,
భక్ష్యం భోజ్యంచ చోష్యం చ లేహ్యంచ వివిధం బహు. ౨౦

విచిత్రాణిచ మాల్యాని పాదపప్రచ్యుతాని చ,
సురాదీని చ పేయాని మాంసాని వివిధాని చ. ౨౧

ఏవం సమాధినా యుక్త స్తేజసాఽప్రతిమేన చ,
శిక్షాస్వరసమాయుక్తం తపసా చాబ్రవీ న్మునిః. ౨౨

భూమియందును అంతరిక్షంబునందును తూర్పుకట్టుగాఁ బాఱునవి గాని పడమరకట్టుగాఁ బ్రవహించునవిగాని నదు లెన్నిగలవో అవన్నియుం నొక్కమాఱుగానే యిచ్చటికి నిప్పుడు వచ్చుఁగాక. ౧౪

కొన్నినదులు జలంబునకు బదులుగా ఖర్జూరాదులతోఁ జేసిన మైరే యంబను మద్యంబు నొసంగుఁగాక కొన్ని మంచిసుర నొసఁగుఁగాక. మఱికొన్ని నదులు చెఱకురసంబువంటి చల్లని జలంబుల నొసంగుఁగాక.

మఱియుం గానంబు సేయుటకై దేవగంధర్వజాతులగు విశ్వావసువును హాహాయనువానిని హూహూ యనువానిని గంధర్వజాతులగు నప్సరసలను దేవజాతులగు నప్సరసలను అందఱను బిలిచెదను. ౧౬

మఱియు ఘృతాచి, విశ్వాచి, మిశ్రకేశి, యలంబుస, నాగదంత, హేమపర్వతంబుననుండు హిమ వీరలుమున్నగునప్సరసలఁ బిలుచుచున్నాను.

ఏయప్సరసలు దేవేంద్రుం గొలిచియుందురో, ఎవ్వరు బ్రహ్మదేవునిం గొలిచియుందురో వారల నందఱను వారినృత్తగీతాద్యుపకరణంబులతోను వారిగానశిక్షకుఁడగు తుంబురువుతోడం గూడ రావించెదను ౧౮

మంచివస్త్రాభరణంబులె పత్రంబులుగా నుత్తమవనితలే ఫలంబులుగాఁ గల్గి, యుత్తరకురుదేశంబునఁ జెన్నొందుచున్న దేవతార్హంబగు కుబేరుని చైత్రరథవనంబును ఇచ్చటికే తెంచుఁగాక. ౧౯

భగవంతుఁడగు చంద్రుఁడు ఇచ్చట నానిమిత్తమయి భక్ష్యభోజ్య చోష్యలేహ్యంబులను చతుర్విధాన్నంబులను ఒక్కొకటి వేర్వేఱ ననేక విధంబులుగా నుత్తమంబగు నన్నంబు యథేష్టంబుగాఁ గల్పించుఁగాక. ౨౦

మఱియు నోషధీశుఁడగు నాచంద్రుఁడు చెట్లనుండి యప్పుడుకోసిన నానావిధపుష్పమాలికలను, నానావిధపానద్రవ్యంబులను, నానావిధమాంసంబులను ఒసంగుఁగాక. అని యాభరద్వాజుఁడు సంకల్పించెను. ౨౧

యోగబలంబును అప్రతిమంబగు ప్రభావంబును మహాతపస్సునుం గల యమ్మునీంద్రుఁడు శిక్షలయందుఁ జెప్పఁబడిన స్వరంబులతో నీమాటలం జెప్పెను. ౨౨

మనసా ధ్యాయత స్తస్య ప్రాఙ్ముఖస్య కృతాఞ్జలేః,
ఆజగ్ము స్తాని సర్వాణి దైవతాని పృథక్పృథక్. ౨౩

మలయం దర్దురం చైవ తత స్స్వేదనుదోఽనిలః,
ఉపస్పృశ్య వవౌ యుక్త్యా సుప్రియాత్మా సుఖ శ్శివః. ౨౪

తతోఽభ్యవ ర్తన్త ఘనా దివ్యాః కుసుమవృష్టయః,
దివ్యదున్దుభిఘోష శ్చ దిక్షు సర్వాసు శుశ్రువే. ౨౫
ప్రవవు శ్చోత్తమా వాతా ననృతు శ్చాప్సరోగణాః,
జగు శ్చ దేవగన్ధర్వా వీణాః ప్రముముచు స్స్వరాన్. ౨౬
స శబ్దో ద్యాం చ భూమిం చ ప్రాణినాం శ్రవణాని చ,
వివేశోచ్చారిత శ్శ్లక్ష్ణ స్సమో లయగుణాన్వితః. ౨౭

తస్మి న్నుపరతే శబ్దే దివ్యే శ్రోత్రసుఖే నృణామ్,
దదర్శ భారతం సైన్యం విధానం విశ్వకర్మణః. ౨౮
బభూవ హి సమా భూమి స్సమన్తా త్పఞ్చయోజనా,
శాద్వలై ర్బహుభి శ్ఛన్నా నీలవైదూర్యసన్నిభైః. ౨౯
తస్మి న్బిల్వాః కపిత్థా శ్చ పనసా బీజపూరకాః,
ఆమలక్యో బభూవు శ్చ చూతా శ్చ ఫలభూషణాః. ౩౦

ఉత్తరేభ్యః కురుభ్య శ్చ వనం దివ్యోపభోగవత్,
ఆజగామ నదీ దివ్యా తీరజై ర్బహుభి ర్వృతా. ౩౧

చతుశ్శాలాని శుభ్రాణి శాలా శ్చ గజవాజినామ్,

ఆభరద్వాజమహాముని యిట్లు తూర్పుమొగంబై చేమోడ్పుగీలించి మనంబున ధ్యానింపుచుండఁగానే యాదేవత లందఱు వేఱువేఱ నయ్యాశ్రమంబునకు వచ్చి చేరిరి. ౨౩

అంత వాయువు మలయదుర్దురపర్వతములమీఁదుగా వచ్చి చెమటనీళ్ల నార్పుచు మంచి సువాసనతో నెల్లరకును సుఖంబు గల్గునట్లుగా మంగళకరంబుగా వీచుచుండెను. ౨౪

అంత దేవతలు స్వర్గంబుననుండి పుష్పవర్షంబులు సాంద్రంబుగాఁ గురిపించిరి. సమస్తదిక్కులందును స్వర్గభేరీధ్వనులు వినంబడుచుండెను. ౨౫

మిక్కిలియు సుఖకరంబుగా వాయువు వీచినది. అప్సరసలు ఆడిరి. దేవగంధర్వులు పాడిరి. మఱియు వీణెలు వాయించిరి. ౨౬

నృత్తగీతవాద్యంబులచేఁ బుట్టిన యాధ్వని, యతికోమలంబై శ్రుతిసామ్యంబునను లయగుణంబునను ఒప్పుచు నాకాశంబు భూమియు వ్యాపించి శ్రవణానందకరంబై చెలంగినది. ౨౭

శ్రవణానందకరంబగు నాదివ్యధ్వని నిలిచినంతనె భరతునిసైనికులు విశ్వకర్ముని నిర్మాణవైచిత్ర్యంబుఁ జూడం గనిరి. ౨౮

భూమి యెటుచూచినను అయిదామడలవఱకు ఎంతమాత్రమును మిట్టపల్లము లేక నీలవైడూర్యమణులవంటి పచ్చికచేఁ గప్పఁబడినదిగా నైనది. ౨౯

ఆప్రదేశంబున మంచిఫలంబులుగల బిల్వవృక్షంబులును వెలగచెట్టును బనసవృక్షంబులును మాతులుంగవృక్షంబులును ఉసిరిగచెట్టును మామిడిచెట్టును ఉండినవి. ౩౦

ఉత్తరకురుదేశంబుననుండి దివ్యభోగద్రవ్యంబులుగల చైత్రరథవనంబును వచ్చినది. దివ్యనదులును దీరంబులఁ బెక్కువృక్షంబులతో నొప్పుచు నచ్చట నావిర్భవించినవి. ౩౧

స్వచ్ఛంబులగు నాలుగిండ్ల బవంతులును మేడలును రాజగృహంబు

హర్మ్యప్రాసాదసమ్బాధా స్తోరణాని శుభాని చ. ౩౨

సితమేఘనిభం చాపి రాజవేశ్మ సుతోరణమ్,
దివ్యమాల్యకృతాకారం దివ్యగన్ధసముక్షితమ్. ౩౩
చతురశ్ర మసమ్బాధం శయనాసనయానవత్,
దివ్యై స్సర్వరసై ర్యుక్తం దివ్యభోజనవస్త్రవత్. ౩౪
ఉపకల్పితసర్వాన్నం ధౌతనిర్మలభాజనమ్,
క్లృప్తసర్వాసనం శ్రీమ త్స్వాస్తీర్ణశయనోత్తమమ్. ౩౫

ప్రవివేశ మహాబాహు రనుజ్ఞాతో మహర్షిణా,
వేశ్మ తద్రత్నసంపూర్ణం భరతః కైకయీసుతః. ౩౬

అనుజగ్ము శ్చ తం సర్వే మన్త్రిణ స్సపురోహితాః,
బభూవు శ్చ ముదా యుక్తా దృష్ట్వా తం వేశ్మసంవిధిమ్. ౩౭

తత్ర రాజాసనం దివ్యం వ్యజనం ఛత్రమేవ చ,
భరతో మన్త్రిభి స్సార్ధ మభ్యవర్తత రాజవత్. ౩౮

ఆసనం పూజయామాస రామాయాభిప్రణమ్య చ,
వాలవ్యజన మాదాయ న్యషీద త్సచివాసనే. ౩౯

ఆనుపూర్వ్యా న్నిషేదు శ్చ సర్వే మన్త్రిపురోహితాః,
తత స్సేనాపతిః పశ్చా త్ప్రశాస్తా చ నిషేదతుః. ౪౦

లును ఏనుంగులుంగట్టు గృహంబులును గుఱ్ఱంబులుంగట్టు గృహంబులును మంగళ తోరణంబులును ఆవిర్భవించినవి. 32

మఱియు శరత్కాలమేఘంబుంబోలె ధవళంబును మంచిద్వారంబులు గలదియుఁ దెల్లనిపుష్పమాలికలచే నలంకరింపఁబడినదియు దివ్యగంధంబు చల్లఁబడినదియుఁ జతురశ్రాకారంబును విశాలంబును నానావిధంబులగు పాన్పులును ఆసనంబులును వాహనంబులును గలదియు సమస్తదివ్యరసంబులతో నిండినదియు నానావిధములయిన యన్నంబులతోఁగూడినదియుఁ జక్కఁగాఁ గడుగఁబడి నిర్మలంబులయియుండు భోజనపాత్రంబులతో నొప్పుచున్నదియు వేయువేలుఁ జక్కఁగా చేర్పఁబడిన భోజనస్నానాద్యాసనంబులు గలదియు నుత్తమాస్తరణాస్తీర్ణంబగు నుత్తమశయనంబుతోఁ గూడినదియు నగు గొప్పరాజగృహంబు నొకటి యావిర్భవించినది. 33-35

మహాబాహుండగు కైకేయికొడుకు భరతుఁడు భరద్వాజమహర్షిచే నాజ్ఞాపితుండై నానావిధోత్తమద్రవ్యసంయుతంబగు నాగృహంబుఁ బ్రవేశించెను. 36

అంతఁ బురోహితులును మంత్రులందఱును భరతుని వెంబడించి ప్రవేశించిరి. వార లాశ్చర్యకరంబగు నాగృహసంవిధానంబుఁ జూచి మహాసంతోషంబు నొందిరి. 37

భరతుఁడు అచ్చటనుండు దివ్యసింహాసనంబునకు వింజామరమునకును శ్వేతచ్ఛత్రంబునకును రాజునకుంబోలె మంత్రులతోఁ గూడఁ బ్రదక్షిణంబు చేసెను. 38

అప్పుడు భరతుఁడు రాముం దలంచుకొని నమస్కరించి యాయన గూర్చుండఁదగిన యాసింహాసనంబుఁ బూజించి తాను చామరంబుఁ బట్టుకొని మంత్రులు గూర్చుండఁదగిన యొకయాసనంబునఁ గూర్చుండెను. 39

అంత మంత్రులును పురోహితులును యథాక్రమంబుగాఁ గూర్చుండిరి. అటుపిమ్మట సేనానాయకుఁడును, అతనికిఁ బిమ్మట శిబిరనాయకుఁడును గూర్చుండిరి. 40

తత స్తత్ర ముహూర్తేన నద్యః పాయసకర్దమాః,
ఉపాతిష్ఠన్త భరతం భరద్వాజస్య శాసనాత్. ౪౧

తాసా ముభయతః కూలం పాణ్డుమృత్తికలేపనాః,
రమ్యా శ్చావసథా దివ్యా బ్రహ్మణ స్తు ప్రసాదజాః. ౪౨

తే నైవ చ ముహూర్తేన దివ్యాఽభరణభూషితాః,
ఆగు ర్వింశతిసాహస్రా బ్రహ్మణా ప్రహితాః స్త్రియః. ౪౩
సువర్ణమణిముక్తేన ప్రవాళేన చ శోభితాః,
ఆగు ర్వింశతిసాహస్రాః కుబేరప్రహితాః స్త్రియః. ౪౪

యాభి ర్గృహీతః పురుష స్సోన్మాద ఇవ లక్ష్యతే,
ఆగు ర్వింశతిసాహస్రా నన్దనా దప్సరోగణాః. ౪౫

నారద స్తుమ్బురు ర్గోపః ప్రవరా సూర్యవర్చసః,
ఏతే గన్ధర్వరాజానో భరతస్యాగ్రతో జగుః. ౪౬
అలమ్బుసా మిశ్రకేశీ పుణ్డరీకాఽథ వామనా,
ఉపానృత్యం స్తు భరతం భరద్వాజస్య శాసనాత్. ౪౭

యాని మాల్యాని దేవేషు యాని చైత్రరథే వనే,
ప్రయాగే తాన్యదృశ్యన్త భరద్వాజస్య తేజసా. ౪౮

బిల్వా మార్దఙ్గికా ఆస న్ఛమ్యా గ్రాహా విభీతకాః,
అశ్వత్థా నర్తకా శ్చాస న్భరద్వాజస్య తేజసా. ౪౯

అంత నప్పుడు స్వల్పకాలంబుననే భరద్వాజమహర్షి యాజ్ఞవలన క్షీరాన్నమే బురదగాఁ గలయేఱులు భరతునిముందటం బ్రవహింప నారంభించినవి. ౪౧

ఆనదుల రెండుగట్టులందును, భరద్వాజమహర్షి యనుగ్రహంబువలన, తెల్లనిపాలగారతోఁ గూడిన రమణీయంబులును దివ్యంబులు నగు గృహంబులు నావిర్భవించినవి. ౪౨

ఆక్షణంబుననే బ్రహ్మదేవునిచనుపున దివ్యాభరణాలంకృతలగు నిరువది వేలమంది యప్సరసలు వచ్చిరి. ౪౩

అంతేఁ గుబేరునిపనుపున సువర్ణాభరణంబులచేతను రత్నమయభూషణంబులచేతను ముక్తాఫలమయాభరణంబులచేతను బ్రవాళభూషణంబులచేతను అలంకృతలగు నిరువది వేలమంది యప్సరసలు వచ్చిరి. ౪౪

పురుషుఁ డెవ్వరిచేఁ గవుఁగిలింపఁబడినచో నున్మాదంబు నొందినట్లు పరవశుఁ డగునో అట్టియుత్తమలగు నప్సరసలు ఇరువదివేలమంది నందనవనంబుననుండి దేవేంద్రునిపనుపున నేతెంచిరి. ౪౫

నారదుఁడును దుంబురుఁడును గోపుఁడు నను నీగంధర్వరాజులు సూర్యసమానతేజంబున వెలుంగుచు భరతునిముందటం బాడిరి. ౪౬

అంత భరద్వాజమహర్షి యాజ్ఞవలన నలంబుసయుం మిశ్రకేశియుఁ బుండరీకయుం వామనయుం నను నీ యప్సరసలు భరతునిముందట నృత్తంబు గావించిరి. ౪౭

దేవేంద్రుని నందనవనంబునను గుబేరునిచైత్రరథవనంబునను ఏయే పుష్పంబులు గలవో అవన్నియు భరద్వాజప్రభావంబువలనఁ బ్రయాగక్షేత్రంబున నావిర్భవించియుండినవి. ౪౮

భరద్వాజమహర్షి యాజ్ఞవలన బిల్వవృక్షములు మృదంగంబులు వాయించినవి. తాండ్రచెట్లు తాళంబులు వాయించినవి. అశ్వత్థవృక్షంబులు నృత్తంబు గావించినవి. ౪౯

తత స్సరళతాలా శ్చ తిలకా నక్తమాలకాః,
ప్రహృష్టాస్తత్ర సమ్పేతుః కుబ్జా భూత్వాఽథ వామనాః. ౫౦

శింశుపామలకీజమ్బ్వో యా శ్చాన్యాః కాననేషు తాః,
మాలతీ మల్లికా జాతి ర్యా శ్చాన్యాః కాననే లతాః. ౫౧
ప్రమదా విగ్రహం కృత్వా భరద్వాజాశ్రమేఽవదన్,

సురా స్సురాపాః పిబత పాయసం చ బుభుక్షితాః. ౫౨
మాంసాని చ సుమేధ్యాని భక్ష్యన్తాం యావ దిచ్ఛథ,

ఉచ్ఛాద్య స్నాపయన్తి స్మ నదీతీరేషు వల్గుషు. ౫౩
అప్యేకమేకం పురుషం ప్రమదా స్సప్త చాష్ట చ,
సంవాహన్త్య స్సమాపేతు ర్నార్యో రుచిరలోచనాః. ౫౪
పరిమృజ్య తథాఽన్యోన్యం పాయయన్తి వరాఙ్గనాః,

హయాన్ గజాన్ ఖరా నుష్ట్రాం స్తథైవ సురభే స్సుతాన్.
అభోజయ న్వాహనపా స్తేషాం భోజ్యం యథావిధి,

ఇక్షూ న్మధు చ లాజాం శ్చ భోజయన్తి స్మ వాహనాన్. ౫౬
ఇక్ష్వాకువరయోధానాం చోదయన్తో మహాబలాః,

నాశ్వబన్ధోఽశ్వ మాజానా న్నగజం కుఞ్జరగ్రహః. ౫౭
మత్తప్రమత్తముదితా చమూ స్సా తత్ర సంబభౌ,

అంత భరద్వాజప్రభావమువలన సరళవృక్షములును దాళవృక్షములును బొట్టుగుచెట్లును గానుగుచెట్లును కుబ్జవామనరూపంబులం దాల్చి తిరుగుచుండినవి. ౫౦

మఱియు నబ్భరద్వాజాశ్రమంబున శింశుపావృక్షములును ఉసిరిక చెట్లును జంబూవృక్షంబులును మఱియు నడవియందుఁ గల యితరవృక్షములును సన్నజాజి మల్లె జాజి మొదలగు నడవియందలి లతలును స్త్రీరూపంబులు దాల్చి భరతసైనికులకు నిట్లని చెప్పినవి. ౫౧

జనులారా! సారివారి కెంత కావలయునో అంత సారాయి త్రాగువారలు సారాయి త్రాగుఁడు. భుజింపఁగోరువారలు యథేచ్ఛంబుగాఁ బాయసంబుఁ గ్రోలుఁడు. పరిశుద్ధంబులగు నీమాంసంబులను భక్షింపుఁడు. అని యా స్త్రీరూపంబు దాల్చిన వృక్షంబులు చెప్పినవి. ౫౨

ఒక్కొక్క పురుషునికి ఏడెనిమిదిమంది స్త్రీలు చేరి నలుగువెట్టి రమణీయంబులగు నదీతీరంబుల స్నానము సేయించిరి. ౫౩

సుందరంబులగు కండ్లుగల స్త్రీలు అంతఁ బాదసంవాహనంబు సేయుటకై వచ్చి యాపురుషుల దేహమందలి తడియొత్తి వారలచేఁ బరస్పరము సురాపానంబు సేయించిరి. ౫౪

అంత భరద్వాజప్రభావంబున నేర్పడిన వాహనపాలకులు, గుఱ్ఱంబులకును ఏనుంగులకును గాడిదలకును ఒంటెలకును ఎద్దులకును యథాశాస్త్రముగా వానివానికిఁ దగినయాహారంబుల నొసంగిరి. ౫౫

బలవంతులగు వాహనపాలకులు భరతభటులయేనుంగులు మొదలగు వాహనంబులం బ్రేరేపించుచు వానికి చెఱుకుగడలను దేనియగలసిన పేలాలను దినఁబెట్టిరి. ౫౬

గుఱ్ఱపువాఁడు తనగుఱ్ఱము సమాచారము నే మఱచెను. ఏనుఁగువాఁడును దనయేనుంగును విచారింపఁడయ్యె. ఆసైనికు లందఱును మదించి మద్యపానంబున దేహంబు మఱచి స్రక్చందనవనితాదిసమస్తభోగంబులఁ బరమసంతుష్టులయి యుండిరి. ౫౭

తర్పితా స్సర్వకామై స్తే రక్తచన్దనరూషితాః. ౫౮
అప్సరోగణసంయుక్తా స్సైన్యా వాచ ముదైరయన్,

నైవాయోధ్యాం గమిష్యామో నగమిష్యామ దణ్డకాన్. ౫౯
కుశలం భరతస్యాస్తు రామ స్యాస్తు తథా సుఖమ్,

ఇతి పాదాతయోధా శ్చ హస్త్యశ్వారోహబన్ధకాః. ౬౦
అనాథా స్తం విధిం లబ్ధ్వా వాచ మేతా ముదైరయన్,

సమ్ప్రహృష్టా వినేదు స్తే నరా స్తత్ర సహస్రశః. ౬౧
భరతస్యానుయాతార స్స్వర్గోఽయ మితి చాబ్రువన్,

నృత్యన్తి స్మ హసన్తి స్మ గాయన్తి స్మ చ సైనికాః. ౬౨
సమన్తా త్పరిధావన్తి మాల్యోపేతా స్సహస్రశః,

తతో భుక్తవతాం తేషాం తదన్న మమృతోపమమ్. ౬౩
దివ్యా నుద్వీక్ష్య భక్ష్యాం స్తా నభవ ద్భక్షణే మతిః,

ప్రేష్యా శ్చేట్య శ్చ వధ్వా శ్చ బలస్థా శ్చ సహస్రశః. ౬౪
బభూవు స్తే భృశం దృప్తా స్సర్వే చాహతవాససః,

కుఞ్జరా శ్చ ఖరోష్ట్రా శ్చ గోఽశ్వా శ్చ మృగపక్షిణః ౬౫
బభూవు స్సుభృతా స్తత్ర నాన్యో హ్యన్య మకల్పయత్,

అట్టి సైనికులు సమస్తభోగంబులను అనుభవించుచు రక్తచందనాలం
కృతులయి యొక్కొకరు పెక్కుమంది యప్సరసలఁ గూడి పరమసంతుష్టు
లయి యీమాటం జెప్పిరి. ౫౮

మేము అయోధ్యకును బోము. దండకారణ్యంబునకును బోము. ఇచ్చ
టనె యుండెదము. భరతునకు క్షేమంబు గలుగుఁగాక. రాముండును సుఖ
పడుఁగాక. ౫౯

ఇట్టు పదాతులును గజసాదులును అశ్వసాదులును ఏనుఁగులను
గుఱ్ఱంబులను గట్టుట మొదలగు పని సేయువారలును భరద్వాజమహర్షి గావించిన
సత్కారంబు నొంది ప్రమత్తులయి తమకు నాథుఁడు లేఁడనుకొని స్వతం
త్రులపగిది నీమాటం జెప్పిరి. ౬౦

భరతుని వెంబడివచ్చిన సైనికులచ్చట వేయువేలుగాఁ బరమసంతుష్టు
లయి గట్టిగా నఱచుచు "ఇదే స్వర్గము. ఇంతకన్న వేఱుస్వర్గ ముండదు" అని
చెప్పిరి. ౬౧

ఆసైనికు లందఱు మంచిపువ్వుమాలికలు ధరించి గుంపులు గుంపులుగా
నృత్తంబు సేయుచును నవ్వుచును బాటలు పాడుచును నలుప్రక్కలకుం
బరుగులెత్తుచు నుండిరి. ౬౨

అంత వారలు అమృతంబువంటి యీయన్నంబును యథేష్టంబుగాఁ
దినియు దివ్యంబులగు నందలిభక్ష్యంబులంజూచి దినిన చెందక మరలం దిన
సాగిరి. ౬౩

ఆసేనయందలి పరిచారికలును దాసీలును సైనికాంగనలును మఱియు
నందున్నవార లందఱును నూతనవస్త్రంబులు గట్టుకొని పరమగర్వితులయి
యుండిరి. ౬౪

ఆసేనయందు ఏనుంగులును గాడిదలును ఒంటెలును గోవులును గుఱ్ఱము
లును మృగంబులును బక్షులును భరద్వాజమహర్షిప్రభావంబునం గలిగిన
పదార్థంబులచే మిక్కిలియుఁ దృప్తిఁజెందినవి. ఏరియుం నెవ్వఁడును వేఱే.

నా శుక్లవాసా స్తత్రాఽసీ త్క్షుధితో మలినోఽపివా. ౬౬
రజసా ధ్వస్తకేశో వా నరః కశ్చి దదృశ్యత,

ఆజైశ్చాపి చ వారాహై ర్నిష్ఠానవరసంచయైః. ౬౭
ఫలనిర్యూహసంసిద్ధై స్సూపై ర్గన్ధరసాన్వితైః,

పుష్పధ్వజవతీః పూర్ణా శ్శుక్లస్యాన్నస్య చాభితః. ౬౮
దదృశు ర్విస్మితా స్తత్ర నరా లౌహీ స్సహస్రశః,

బభూవు ర్వనపార్శ్వేషు కూపాః పాయసకర్దమాః. ౬౯
తాశ్చ కామదుఘా గావః ద్రుమా శ్చాస న్మధుశ్చ్యుతః,

వాప్యో మైరేయపూర్ణాశ్చ మృష్టమాంసచయై ర్వృతాః. ౭౦
ప్రతప్తపిఠరై శ్చాపి మార్గమాయూరకౌక్కుటైః,

పాత్రీణాం చ సహస్రాణి స్థాలీనాం నియుతాని చ. ౭౧
న్యర్బుదాని చ పాత్రాణి శాతకుమ్భమయాని చ,
స్థాల్యః కుమ్భ్యః కరమ్భ్యశ్చ దధిపూర్ణా స్సుసంస్కృతాః. ౭౨

యౌవనస్థస్య గౌరస్య కపిత్థస్య సుగన్ధినః,
హ్రదాః పూర్ణా రసాలస్య దధ్న శ్శ్వేతస్య చాపరే. ౭౩
బభూవుః పాయస స్యాన్యే శర్కరాయాశ్చ సంచయాః,

మఱియే ఆహారంబునుం జేయ లేదు. అందఱు భరద్వాజుని చేతనే తృప్తిం బొందింపఁబడిరి. ౬౫

ఆసేనయందు ఒక్కఁడైనను నల్లనిబట్టలు గట్టుకొనిగాని యాఁకలి గొనిగాని మఱికిదగిలిగాని యుండ లేదు. అందఱును దెల్లనివస్త్రములు ధరించి మృష్టాన్నంబుఁ గుడిచి పరమతృప్తులయి స్వచ్ఛదేహులయియుండిరి. ఎవ్వఁడును మఱికిదగిలిన వెంట్రుకలతో నుండ లేదు. అందఱకును అభ్యంగస్నానమయి యుండినది. ౬౬

ఆసైనికులందఱు మేఁకమాంసములతోను బందిమాంసములతోను ఉత్తమంబులగు వ్యంజనంబులతోను శర్కరకలిపి సంస్కరింపఁబడిన ఫలరసముల తోను సుగంధరసంబులతోఁ గూడిన సూపములతోను మంచి తెల్లనియన్నము తోను నిండి యసంఖ్యంబులుగా నున్నలోహపాత్రలం జూచి యత్యాశ్చర్యంబు నొందిరి. ౬౭,౬౮

అప్పు డరణ్యంబునయందు బావులన్నియుఁ బరమాన్నంబుతో నిండినవైనవి. అచ్చటియావులు ఎంతకోరినను అంత పాలుపితుకునవిగా నుండినవి. అచ్చటివృక్షంబు లన్నియుఁ దేనియలు గాఱ్చుచుండినవి. ౬౯

అచ్చటి నడబావులు మద్యంబుతో నిండి యుండలాదు; చక్కఁగా వండఁబడిన మృగమాంసము మయూరమాంసము కోడిమాంసము మొదలగు నుత్తమమాంసంబులచేఁ బరివేష్టింపఁ బడియుండినవి. ౭౦

వేలకొలఁది యన్నపాత్రలును లక్షలకొలఁది వ్యంజనపాత్రలును కోటులకొలఁది బంగారుభోజనపాత్రలును శుంఠి మొదలగునవి వేసిచక్కఁగా సంస్కరింపఁబడిన పెరుఁగుతో నిండిన పాత్రంబులును జిన్నపాత్రంబులును నోరు వెడల్పుగల పెద్దపాత్రలును ఉండినవి. ౭౧, ౭౨

కొన్నిసరస్సులు అంతప్రాఁతవియు నంత క్రొత్తవియుఁగాని తెల్లని వెలఁగపండువాసనగల మంచిమజ్జిగతో నిండియుండినవి. కొన్ని శుంఠి పిప్పలి మిరియాలు మొదలగునవి వేసి తాళింపుచేసిన పెరుఁగుతో నిండియుండినవి.

కల్కాం శ్చూర్ణకషాయాం శ్చ స్నానాని వివిధాని చ. ౭౪
దదృశు ర్భాజనస్థాని తీర్థేషు సరితాం నరాః,

శుక్లానంశుమతశ్చాపి ద న్తధావనసంచయాన్. ౭౫
శుక్లాం శ్చన్దనకల్కాం శ్చ సముద్గేష్వవతిష్ఠతః,
దర్పణా న్పరిమృష్టాం శ్చ వాససాం చాపి సఞ్చయాన్. ౭౬
పాదుకోపానహాం చైవ యుగ్మాని చ సహస్రశః,
ఆంజనీః కఙ్కతా న్కూర్చాం చ్ఛస్త్రాణి చ ధనూంషి చ. ౭౭
మర్మత్రాణాని చిత్రాణి శయనా న్యాసనాని చ,
ప్రతిపానహ్రదా న్పూర్ణా న్ఖరోష్ట్రగజవాజినామ్. ౭౮
అవగాహ్య సుతీర్థాం శ్చ హ్రదాన్ సోత్పలపుష్కరాన్,
ఆకాశవర్ణప్రతిమాన్ స్వచ్ఛతోయాన్సుఖప్లవాన్. ౭౯
నీలవైదూర్యవర్ణాంశ్చ మృదూ న్యవససంచయాన్,
నిర్వాపార్థాన్ పశూనాం తే దదృశు స్తత్ర సర్వశః. ౮౦

వ్యస్మయ న్త మనుష్యా స్తే స్వప్నకల్పం తదద్భుతమ్,
దృష్ట్వాఽఽతిథ్యం కృతం తాదృ గ్భరతస్య మహర్షిణా. ౮౧

ఇత్యేవం రమమాణానాం దేవానా మివ నన్దనే,
భరద్వాజాశ్రమే రమ్యే సా రాత్రి ర్వ్యత్యవర్తత. ౮౨

మఱికొన్ని స్వచ్ఛమయిన పెరుఁగుతోఁ బూర్ణంబులయి యుండినవి. కొన్ని పాయసపూర్ణంబులయినవి. శర్కరతోఁ గూడిన యపూపంబులు రాసులు రాసులుగా నుండినవి. ౭౩

ఆసైనికులు నదీతీరంబులందుఁ బాత్రంబుల నుంచఁబడియున్న యామలక్యాదికల్కంబులను గంధచూర్ణంబులను అట్లు నానావిధస్నానద్రవ్యంబులనుం జూచిరి. ౭౪

అచ్చట నాసైనికులు నిర్మలములై కూర్చములతోఁ గూడిన దంతకాష్ఠంబులను సంపుటంబులం దుంచఁబడియున్న తెల్లనిచందనంబులను జక్కఁగాఁ దుడువఁబడిన నిర్మలములయియున్న అద్దంబులను వస్త్రసమూహంబులను బెక్కువేల పావకోళ్లజతలను చెప్పుజోళ్లను గాలుకబరణులను దువ్వెనలను మీసములఁ జక్కఁజేయు చిన్నదువ్వెనలను ఖడ్గాద్యాయుధంబులను ధనుస్సులను గవచంబులను నానావిధంబులగు శయనంబులను ఆసనంబులను గాడిదలు నొంటెలు నేనుఁగులు గుఱ్ఱంబులుఁ ద్రాగుటకై యేర్పరుపఁబడిన నీళ్లు నిండియున్న గుంటలను నల్లకలువలను గమలంబులను గలిగి యాకాశమువలె స్వచ్ఛములయిన నీళ్లు గలిగి యవగాహించి స్నానముసేయఁదగిన మంచి రేవులతో నొప్పుచు స్నానంబు సేయువారలకు సౌఖ్యంబు గలిగించునట్టి సరస్సులను నీలవైడూర్యంబులకుంబోలె వన్నెగల్గి మృదువులయియున్న పశువులకై సంపాదింపఁబడిన తృణసమూహంబులను వీని నన్నింటివినిం జూచిరి. ౭౫-౮౦

ఆసైనికులు, భరద్వాజమహామునిభరతునకుఁ గావించిన స్వప్నసదృశంబగు అత్యాశ్చర్యకరంబు నగు నిదివఱ కెన్నఁడైన విన్నదియుఁ గన్నదియుఁ గాని యనిర్వాచ్యంబగు విందుం జూచి మిక్కిలియు నాశ్చర్యంబు నొందిరి.

నందనవనంబునందు దేవతలు క్రీడించునట్లు, రమణీయంబగు నబ్భరద్వాజాశ్రమంబున నీప్రకారము ఆభరతునిసైనికులు, నానావిధక్రీడలం దేలుచుండఁగానే యారాత్రి గడచినది. ౮౧

ప్రతిజగ్ముశ్చ తా నద్యో గన్ధర్వాశ్చ యథాగతమ్,
భరద్వాజ మనుజ్ఞాప్య తాశ్చ సర్వా వరాఙ్గనాః. ౮౩
తథైవ మత్తా మదిరోత్కటా నరా
స్తథైవ దివ్యాగరుచన్దనోక్షితాః,
తథైవ దివ్యా వివిధా స్స్రగుత్తమాః
పృథక్ప్రకీర్ణా మనుజైః ప్రమర్దితాః. ౮౪
ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే ఏకనవతితమస్సర్గః.

## ద్వినవతితమస్సర్గః

తత స్తాం రజనీ ముష్య భరత స్సపరిచ్ఛదః,
కృతాతిథ్యో భరద్వాజం కామాదభిజగామ హ. ౧
తమృషిః పురుషవ్యాఘ్రం ప్రాఞ్జలిం ప్రేక్ష్య చాఽగతమ్,
హుతాగ్నిహోత్రో భరతం భరద్వాజోఽభ్యభాషత. ౨

కచ్చి దత్ర సుఖా రాత్రి స్తవాస్మద్విషయే గతా,
సమగ్ర స్తే జనః కచ్చిదాతిథ్యే శంస మేఽనఘ!. ౩

త మువాచాఞ్జలిం కృత్వా భరతోఽభిప్రణమ్య చ,
ఆశ్రమా దభినిష్క్రాన్త మృషి ముత్తమతేజసమ్. ౪

సుఖోషితోఽస్మి భగవ! న్సమగ్రబలవాహనః,
తర్పిత స్సర్వకామైశ్చ సామాత్యో బలవ త్త్వయా. ౫

అంత నానదులును దేవగంధర్వులును ఆయుత్తమస్త్రీలును అందఱును భరద్వాజమహామునిని వీడ్కొని వచ్చినరీతినే తమతమనెలవులకుం బోయిరి.

తెల్లవాఱిన పిమ్మటనుం గూడ మనుష్యులు ఆప్రకారంబుననే మద్యమదంబుచే మోహితులయి, యదేప్రకారంబున దివ్యాగరుచందనాలంకృతులయి యుండిరి. మఱియుం దివ్యంబులగు పుష్పమాలికలును అదేప్రకారంబున నచ్చటచ్చట వెదచల్లంబడి నలిఁగిపోయి యుండినవి. ౯౪

ఇది తొంబదియొకటవసర్గము.

---

## తొంబదిరెండవసర్గము

అంత భరతుఁడు సపరివారుఁడై యాతిథ్యంబు వడసి రాముం జూచు కోర్కెచే భరద్వాజమహామునియొద్దకుఁ బోయెను. ౧

భరద్వాజమహర్షి యగ్నిహోత్రకార్యం బయినపిమ్మటఁ దనయొద్దకు వచ్చి చేమోడ్పు గీలించి నిలువఁబడియున్న పురుషశ్రేష్ఠుఁడగు నాభరతుం జూచి యిట్లని చెప్పెను. ౨

పాపరహితుండవగు భరతుఁడా! నీవు మాయాశ్రమంబున నీరాత్రి సుఖంబుగానే యుండినదానవేమి? నేను గావించిన యాతిథ్యంబునకు నీసైనికులందఱుఁ దప్తులయి యున్నారాయేమి? ఇది నాకుఁ జెప్పుము. అని భరద్వాజుఁడు భరతునితోఁ జెప్పెను. ౩

భరతుఁడు, ఈప్రకారము చెప్పి తనవెంబడి నాశ్రమంబు వెడలివచ్చిన మహాప్రభావుఁడగు నాభరద్వాజమహర్షికిఁ జేమోడ్పుగీలించి నమస్కరించి యిట్లని చెప్పెను. ౪

భగవంతుఁడవగు భరద్వాజుఁడా! నేనును నామంత్రులును నాసైనికులును గజంబులు మొదలగు వాహనంబులును సమస్తకామంబులచేతను దృప్తిఁ బొందియున్నాము. ౫

అపేతక్లమసన్తాపాః సుభిక్షాః స్సుప్రతిశ్రయాః,
అపి ప్రేష్యా నుపాదాయ సర్వే స్మసుసుఖోషితాః. ౬

ఆమన్త్రయేఽహం భగవన్! కామం త్వా మృషిసత్తమ!,
సమీపం ప్రస్థితం భ్రాతు ర్మైత్రేణేక్షస్వ చక్షుషా. ౭

ఆశ్రమం తస్య ధర్మజ్ఞ! ధార్మికస్య మహాత్మనః,
ఆచక్ష్వ కతమో మార్గః కియా నితి చ శంస మే. ౮

ఇతి పృష్ట స్తు భరతం భ్రాతృదర్శనలాలసమ్,
ప్రత్యువాచ మహాతేజా భరద్వాజో మహాతపాః. ౯

భరతార్ధతృతీయేషు యోజనే ష్వజనే వనే,
చిత్రకూటో గిరి స్తత్ర రమ్యనిర్దరకాననః. ౧౦

ఉత్తరం పార్శ్వ మాసాద్య తస్య మన్దాకినీ నదీ,
పుష్పితద్రుమసఞ్ఛన్నా రమ్యపుష్పితకాననా. ౧౧

అనన్తరం తత్సరిత శ్చిత్రకూట శ్చ పర్వతః,
తయోః పర్ణకుటీ తాత! తత్ర తౌ వసతో ధ్రువమ్. ౧౨
దక్షిణే నైవ మార్గేణ సవ్యదక్షిణ మేవ వా,
గజవాజిరథాకీర్ణాం వాహినీం వాహినీపతే!. ౧౩
వాహయస్వ మహాభాగ! తతో ద్రక్ష్యసి రాఘవమ్,

మాపరిచారకుల నారంభించి, మేమందఱమును గతశ్రమములమయి గతసంతాపులమయి మంచిభక్ష్యంబులఁ దిని మంచిగృహంబుల మిక్కిలియుం సుఖంబుగా నుంటిమి. ౬

భగవంతుఁడవు ఋషిశ్రేష్ఠుఁడవు నగుభరద్వాజుఁడా! నిన్ను వినయంబున వీడ్కొనెదను. నేను నాయన్నసమీపంబునకుఁ బోవుచున్నాను. నన్ను స్నేహదృష్టిం జూడుము. ౭

ధర్మజ్ఞుఁడవగు భరద్వాజుఁడా! ధార్మికుఁడును మహాత్ముఁడునగు నారాముఁడుండు నాశ్రమంబు నాకుఁ జెప్పుము. అది యిచ్చటి కెంతదూరము? అచ్చటికిఁ బోవుమార్గ మెద్ది? ఇదంతయుం సవిస్తరముగాఁ జెప్పుము. అని భరతుఁడు భరద్వాజునితోఁ జెప్పెను. ౮

మహాతేజుఁడును మహాతపశ్శాలియు నగు భరద్వాజమహాముని భరతుఁడు చెప్పినది విని యన్నం జూచుటకుఁ దొందరపడుచున్న భరతుం జూచి యిట్లని చెప్పెను. ౯

భరతుఁడా! నిర్జనంబగు వనంబునందు రెండున్నరామడ దూరంబు పోయిన వెనుక సుందరంబులగు నెత్తంబులును వనంబులునుం గల చిత్రకూటంబను నొక్కపర్వతం బున్నది. ౧౦

ఆచిత్రకూటపర్వతంబున కుత్తరపార్శ్వంబునఁ దీరంబులఁ బుష్పితవృక్షంబులు గలదియుఁ జక్కఁగాఁ బుష్పించియుండు వనంబులు గలదియు నగు మందాకినియను నొక్కనది యున్నది. ౧౧

నాయనా! ఆమందాకినీనదికిఁ బ్రక్కనె చిత్రకూటపర్వతమున్నది. అందు రామలక్ష్మణులకర్ణశాల. ఆపర్ణశాలయందు వా రున్నారు. నిశ్చయము.

సేనానాయకుఁడవు మహాభాగుఁడవగు భరతుఁడా! నీ విచ్చటనుండి దక్షిణదిక్కుగాఁ బోవుమార్గంబునంగాని నిర్ఋతిదిక్కునఁ బోవుమార్గంబునం గాని యేది సేననడచుటకు యుక్తముగా నున్నదో ఆమార్గంబున రథగజతురంగ సమూహాసంయుతంబగు సైన్యంబుఁ గొనిపొమ్ము. అంత రాముం జూడఁగలవు. అని భరద్వాజుఁడు భరతునితోఁ జెప్పెను. ౧౩

ప్రయాణ మితి తచ్ఛ్రుత్వా రాజరాజస్య యోషితః. ౧౪
హిత్వా యానాని యానార్హా బ్రాహ్మణం పర్యవారయన్,

వేపమానా కృశా దీనా సహ దేవ్యా సుమిత్రయా. ౧౫
కౌసల్యా తత్ర జగ్రాహ కరాభ్యాం చరణౌ మునేః,

అసమృద్ధేన కామేన సర్వలోకస్య గర్హితా. ౧౬
కైకేయీ తస్య జగ్రాహ చరణౌ సవ్యపత్రపా,

తం ప్రదక్షిణ మాగమ్య భగవన్తం మహామునిమ్. ౧౭
అదూరా ద్భరత స్సైవ తస్థౌ దీనమనా స్తదా,

తతః పప్రచ్ఛ భరతం భరద్వాజో దృఢవ్రతః. ౧౮

విశేషం జ్ఞాతు మిచ్ఛామి మాతౄణాం తవ రాఘవ!,

ఏవ ముక్త స్తు భరతో భరద్వాజేన ధార్మికః. ౧౯
ఉవాచ ప్రాఞ్జలి ర్భూత్వా వాక్యం వచనకోవిదః,

యా మిమాం భగవన్! దీనాం శోకానశనకర్శితామ్. ౨౦
పితు ర్హి మహిషీం దేవీం దేవతా మివ పశ్యసి,
ఏషా తం పురుషవ్యాఘ్రం సింహ విక్రాన్తగామినమ్. ౨౧
కౌసల్యా సుషువే రామం ధాతార మదితి ర్యథా,

అస్యా వామభుజం శ్లిష్టా యైషా తిష్ఠతి దుర్మనాః. ౨౨

ఇట్లు ప్రయాణవార్త విని, దశరథమహారాజభార్యలు కౌసల్యమొదలగు వారలు వాహనంబులు విడువఁదగనివారలయ్యు వాహనంబులు డిగ్గినమస్కారంబు సేయుటకై భరద్వాజమహర్షిం బరివేష్టించిరి. ౧౪

అందుఁ బుత్రదుఃఖంబునం గృశించి దీనయయి యున్న కౌసల్యాదేవి గడగడవడంకుచు, సుమిత్రతోఁ గూడ భరద్వాజమహాముని పాదంబులఁ జేతులం బట్టుకొని నమస్కారము చేసెను. ౧౫

అంత నిష్ఫలమయిన కోరికఁ గోరి సమస్తలోకంబులకును నిందిత యయిన కైకేయి యింతటి యకార్యంబు గావించి తన్నేమందురో యని సిగ్గు గదుర నమ్మునీంద్రునిపాదంబులకు నమస్కరించెను. ౧౬

అప్పుడా కైకేయి దీనయయి కౌసల్యాదులంబోలె భరద్వాజునెదుట నిలువ మొగంబులేక భగవంతుఁడగు నమ్మహామునిం బ్రదక్షిణించుసాకున, భరతుని సమీపంబునకు వచ్చియుండినది. ౧౭

అంత దృఢవ్రతుఁడగు భరద్వాజమహాముని భరతుం జూచి యిట్లని యడిగెను. ౧౮

భరతుఁడా! నీతల్లులలో వారివారిపేళ్లు మొదలగునవి తెలియం గోరెదఁ జెప్పుము. అని భరద్వాజుఁడు భరతు నడిగెను.

మాటలు చెప్పుటయందుఁ బండితుఁడగు భరతుండు బుద్ధిమంతుఁడగు భరద్వాజమహాముని చెప్పినమాటను విని చేమోడ్పు గీలించి యీమాటఁ జెప్పెను. ౧౯

భగవంతుఁడవగు భరద్వాజుఁడా! ఇదిగో దుఃఖితయయి దుఃఖంబు చేతను భోజనంబులేమిచేతను గృశించి దేవతయుంబోలె నున్నదే; ఈబిడ నాతండ్రి కగ్రభార్య. ఈబిడపేరు కౌసల్య. పురుషశ్రేష్ఠుఁడును సింహంబు వలెఁ బరాక్రమయుక్తంబుగా నడచువాఁడునగు శ్రీరాముఁడు ఈబిడకుమారుఁడే. ౨౦,౨౧

దుఃఖితయయి యడవియందు రాలినపూలుగల కొండగోఁగుకొమ్మవలె

కర్ణికారస్య శాఖేవ శీర్ణపుష్పా వనాన్తరే,
ఏతస్యా స్తు సుతౌ దేవ్యాః కుమారౌ దేవవర్ణినౌ. ౨౩
ఉభౌ లక్ష్మణశత్రుఘ్నౌ వీరౌ సత్యపరాక్రమౌ,
యస్యాః కృతే నరవ్యాఘ్రౌ జీవనాశ మితో గతౌ. ౨౪
రాజా పుత్రవిహీన శ్చ స్వర్గం దశరథో గతః,
క్రోధనా మకృతప్రజ్ఞాం దృప్తాం సుభగమానినీమ్. ౨౫
ఐశ్వర్యకామాం కైకేయీ మనార్యా మార్యరూపిణీమ్,
మ మైతాం మాతరం విద్ధి నృశంసాం పాపనిశ్చయామ్. ౨౬
యతో మూలం హి పశ్యామి వ్యసనం మహ దాత్మనః,

ఇత్యుక్త్వా నరశార్దూలో బాష్పగద్గదయా గిరా. ౨౭
నిశశ్వాస స తామ్రాక్షః క్రుద్ధో నాగ ఇవ శ్వసన్,

భరద్వాజో మహర్షి స్తం బ్రువన్తం భరతం తథా. ౨౮
ప్రత్యువాచ మహాబుద్ధి రిదం వచన మర్థవత్,
న దోషేణావగన్తవ్యా కైకేయీ భరత! త్వయా. ౨౯
రామప్రవ్రాజనం హ్యేత త్సుఖోదర్కం భవిష్యతి,
దేవానాం దానవానాం చ ఋషీణాం భావితాత్మనామ్. ౩౦
హితమేవ భవిష్యద్ధి రామప్రవ్రాజనా దిహ,

అభివాద్య తు సంసిద్ధః కృత్వా చైనం ప్రదక్షిణమ్. ౩౧
ఆమన్త్ర్య భరత సైన్యం యుజ్యతా మి త్యచోదయత్,

దీనయయి యీకౌసల్యయొడమచేయిం బట్టుకొనియున్నదే; యీయావిడ సుమిత్ర. అశ్వినీదేవతలతో సమానులును సత్యపరాక్రములు నగు లక్ష్మణశత్రుఘ్నులిర్వురును ఈయవిడకొడుకులు. ౨౨-౨3

ఎవ్వతెనిమిత్తమయి పురుషశ్రేష్ఠులగు రామలక్ష్మణులు మహారణ్యంబునకుఁ బోయి జీవనాశంబు నొందినట్లయిరో దశరథమహారాజును గొడుకులను విడిచి స్వర్గంబు నొందెనో మఱియు నెవ్వతెవలన నాకిట్టి మహాదుఃఖంబు సంభవించెనో అట్టికోపస్వభావురాలును బుద్ధిలేనిదియు సౌందర్యంబు గలదානననిగర్వించియున్నదియు నైశ్వర్యంబుఁ గోరునదియు దుష్టురాలును యోగ్యురాలువలెఁ జూపట్టునదియుఁ గ్రూరురాలును బాపంబుసేయు స్వభావంబు గలదియు నగు నాతల్లి కైకేయి యీయావిడ. అని భరతుఁడు భరద్వాజునితోఁ జెప్పెను. ౨౪-౨౬

పురుషశ్రేష్ఠుఁడగు నాభరతుఁడు కన్నుల నెఱ్ఱఁదనంబును దగ్గుత్తికయును గదుర నీప్రకారము చెప్పి కోపంబునొందిన సర్పంబుకరణి నిట్టూర్పులు విడుచుచు నుండెను. ౨౭

మహాబుద్ధిశాలియగు భరద్వాజమహాముని యట్లు చెప్పుచున్న యాభరతుంజూచి అర్థంబుగల యీమాటం జెప్పెను. ౨౮

భరతుఁడా! నీవు కైకేయియందు దోషంబున్నదని తలంపవలదు. ౨౯

రాము నడవికిఁ బంపుటవలన నికముందుఁ జాలసుఖంబులు గలుగును.

ఇప్పుడు రాముఁడవికిఁ బంపుటవలన, దేవతలకును దానవులకును పరమాత్మవేత్తలగు ఋషులకును హితమే కలుగఁగలదు. కావున దైవప్రేరితయయి కైకేయి యట్లు చెప్పినది కాని వేఱుకాదు. అని భరద్వాజమహాముని భరతునితోఁ జెప్పెను. 3౦

భరతుఁడు భరద్వాజమహర్షికి నమస్కరించి యాశీర్వాదంబు గొని యాయనకుఁ బ్రదక్షిణంబు గావించి సైన్యంబుఁ బిలిచి ప్రయాణంబునకు సన్నాహంబు గావింపుఁ డని యాజ్ఞాపించెను. 3౧

తతో వాజిరథాన్ యుక్తాన్ దివ్యాన్ హేమపరిష్కృతాన్. ౩౨
అధ్యారోహ త్ప్రియాణార్థీ బహూ న్బహువిధో జనః,
గజకన్యా గజా శ్చైవ హేమకక్ష్యాః పతాకినః. ౩౩
జీమూతా ఇవ ఘర్మాన్తే సఘోషా స్సమ్ప్రతస్థిరే,

వివిధాన్యపి యానాని మహాన్తి చ లఘూని చ. ౩౪
ప్రయయు స్సుమహార్హాణి పాదై రేవ పదాతయః,
అథ యానప్రవేకైస్తు కౌసల్యాప్రముఖాః స్త్రియః. ౩౫
రామదర్శనకాఙ్క్షిణ్యః ప్రయయు ర్ముదితా స్తదా,
చన్ద్రార్కతరుణాభాసాం నియుక్తాం శిబికాం శుభామ్. ౩౬
ఆస్థాయ ప్రయయౌ శ్రీమా న్భరత స్సపరిచ్ఛదః,
సా ప్రయాతా మహాసేనా గజవాజిరథాకులా. ౩౭
దక్షిణాం దిశ మావృత్య మహామేఘ ఇవోత్థితః,
వనాని తు వ్యతిక్రమ్య జుష్టాని మృగపక్షిభిః. ౩౮
గఙ్గాయాః పరవేలాయాం గిరిష్వపి నదీషు చ.

సా సమ్ప్రహృష్టద్విపవాజియోధా
విత్రాసయ న్తీ మృగపక్షిసఙ్ఘాన్,
మహ ద్వనం త త్ప్రతిగాహమానా
రరాజ సేనా భరతస్య తత్ర. ౩౯

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే ద్వినవతితమ స్సర్గః.

---

త్రిణవతితమస్సర్గః

తయా మహత్యా యాయిన్యా ధ్వజిన్యా వనవాసినః,
అర్దితా యూథపా మత్తా సయూథా స్సమ్ప్రదుద్రువుః. ౧

అంత సేనయందలిజనులు పయనమయి నానావిధంబులుగా బంగారముచే నలంకరింపఁబడిన దివ్యంబులయిన గుఱ్ఱపుబండ్ల నెక్కిరి. ౩౨

అంత నాఁడేనుంగులును మగయేనుంగులును బంగారముతోఁ జేయఁబడిన నడిమిత్రాటితోను టెక్కెంబులతోను గూడినవై వర్షాకాలంబున మేఘంబులవలె గర్జించుచు బయలుదేఱినవి. ౩౩

పెద్దవియుఁ జిన్నవియు నానావిధములయిన యుత్తమములగు వాహనములు బయలుదేఱినవి. పదాతులు పాదంబులనే నడచుచుఁ బోయిరి. ౩౪

అంత నప్పుడు కౌసల్య మొదలగు స్త్రీలును, రాముం జూడఁగలుగనని సంతుష్టలయి యుత్తమంబులగు వాహనంబుల నారోహించి పోయిరి. ౩౫

శ్రీమంతుఁడగు భరతుఁడు చంద్రసూర్యుల కాంతివంటి కాంతిగలదియు మంగళకరంబునగు సజ్జీకృతంబయిన పల్లకి నెక్కి పరివారసమేతుఁడై పోయెను. ౩౬

ఏనుంగులును గుఱ్ఱంబులును రథంబులును మెండుగా నిండియున్న యామహాసేన గంగానదిదక్షిణపుగట్టునందు ఉత్తరదిక్కునుండి దక్షిణదిక్కునకు వచ్చుమహామేఘంబుకరణి, దక్షిణదిక్కు నావరించి పర్వతంబులందును నదులందును మృగంబులతోను బక్షులతోనుం గూడిన వనంబుల నతిక్రమించి పోయినది. ౩౭, ౩౮

అప్పుడు ఏనుంగులును గుఱ్ఱంబులును భటులును మిక్కిలియు సంతోషంబునొంది యుండుటం జేసి యాభరతునిసేన యమ్మహావనంబునందు సింహనాదంబులచే మృగపక్షులను వెఱపించుచు నెంతయు నొప్పుచుండినది. ౩౯

ఇది తొంబదిరెండవసర్గము.

---

## తొంబదిమూఁడవసర్గము

అట్లు పోవుచున్న యాగొప్పసేనం జూచి యడవులందుండు వసించిన గజయూథపంబులు భయపడి గజయూథంబులతోఁ బరుగెత్తినవి. ౧

ఋశ్యాః పృషతసఙ్ఘాశ్చ రురవశ్చ సమన్తతః,
దృశ్యన్తే వనరాజీషు గిరిష్వపి నదీషు చ. ౨

స సమ్ప్రితస్థే ధర్మాత్మా ప్రీతో దశరథాత్మజః,
వృతో మహాత్యా నాదిన్యా సేనయా చతురఙ్గయా. 3
సాగరౌఘనిభా సేనా భరతస్య మహాత్మనః,
మహీం సంఛాదయామాస ప్రావృషి ద్యామి వామ్బుదః. ౪
తురంగౌఘైరవతతా వారణైశ్చ మహాజవైః,
అనాలక్ష్యా చిరం కాలం తస్మిన్కాలే బభూవ భూః. ౫
స యాత్వా దూర మధ్వానం సుపరిశ్రాన్తవాహనః,
ఉవాచ భరత శ్శ్రీమా న్వసిష్ఠం మన్త్రిణాం వరమ్. ౬
యాదృశం లక్ష్యతే రూపం యథా చైవ శ్రుతం మయా,
వ్యక్తం ప్రాప్తాః స్మ తం దేశం భరద్వాజో య మబ్రవీత్. ౭

అయం గిరి శ్చిత్రకూట ఇయం మన్దాకినీ నదీ,
ఏతత్ప్రకాశతే దూరా న్నీలమేఘనిభం వనమ్. ౮
గిరే స్సానూని రమ్యాణి చిత్రకూటస్య సమ్ప్రతి,
వారణై రవమృద్యన్తే మామకైః పర్వతోపమైః. ౯
ముఞ్చన్తి కుసుమాన్యేతే నగాః పర్వతసానుషు,
నీలా ఇవాతపాపాయే తోయం తోయధరా ఘనాః. ౧౦

కిన్నరాచరితం దేశం పశ్య శత్రుఘ్న! పర్వతమ్,
మృగై స్సమన్తా దాకీర్ణం మకరై రివ సాగరమ్. ౧౧
ఏతే మృగగణా భాన్తి శీఘ్రవేగాః ప్రచోదితాః,

అడవులయందును పర్వతంబులయందును నదులయందును అంతటను ఎలుంగుగొడ్డులను దేహమునందుం జుక్కలుగలజింకలను జుక్కలులేక పెద్ద శరీరంబును వికటంబులగు కొమ్ములును గల జింకలనుం జూచుచుం బోయిరి. ౨

ధర్మాత్ముఁడు దశరథపుత్త్రుఁడునగు భరతుఁడు సంతుష్టుఁడై మహాధ్వనితోఁ గూడిన గొప్పసైన్యముచేఁ బరివేష్టితుఁడై పోయెను. ౩

మహాత్ముఁడగు భరతుని సముద్రంబువంటి గొప్పసేన వర్షాకాలంబున మేఘం బాకాశము నావరించునట్లు భూమి నావరించి నడచినది. ౪

అప్పుడు భూమి అధికవేగంబుగల గుఱ్ఱంబులచేతను ఏనుగులచేతను గప్పఁబడినదై బహుకాలమువఱకుఁ గానరాకయె యుండినది. ౫

శ్రీమంతుఁడగు భరతుఁడు అట్లు వాహనంబు లలసటనొందఁ గొంతదూరంబు పోయి మంత్రిశ్రేష్ఠుఁడగు వసిష్ఠుం జూచి యిట్లనిచెప్పెను ౬

మనము మొదట నెట్టు ఊహించితిమో నే నెట్టు వినియున్నానో భరద్వాజమహాముని యెట్లు మనకుఁ జెప్పెనో ఆట్టిప్రదేశమునకు వచ్చినాము. ఇది స్పష్టము. చూడు. ౭

ఇదిగో! ఈపర్వతమె చిత్రకూటపర్వతము. ఇదే మందాకిని యనునది. ఇదిగో దూరంబున నల్లని మేఘంబువంటి వనంబును గనుపట్టుచున్నది. ౮

ఇదిగో! చూడు కొండలవంటి నాయేనుంగులు ఇప్పుడు సుందరంబులగు చిత్రకూటపర్వతము నెత్తములనే త్రొక్కి మర్దించుచున్నవి. ౯

వర్షాకాలంబున నల్లని మేఘంబులు నీళ్లు విడుచునట్లు ఈపొగడచెట్లు కొండనెత్తములందుఁ బుష్పంబుల విడుచుచున్నవి చూడుము. అని వసిష్ఠునితోఁ జెప్పెను. ౧౦

శత్రుఘ్నుఁడా! సముద్రంబు మొసళ్లచే నిండియుండునట్లు మృగంబులచే నిండిన కిన్నరసంచారము గల యీచిత్రకూటపర్వతముం జూడుము.

శరదృతువునందు వర్షము గురిసి తేలికగా నుండు మేఘంబులు,

వాయుప్రవిద్ధా శ్శరది మేఘరాజి రివామ్బరే. ౧౨

కుర్వన్తి కుసుమాపీడాన్ శిరస్సు సురభీ నమీ,
మేఘప్రకాశైః ఫలకై ర్దాక్షిణాత్యా యథా నరాః. ౧౩

నిష్కూజ మివ భూత్వేదం వనం ఘోరప్రదర్శనమ్,
అయోధ్యేవ జనాకీర్ణా సమ్ప్రతి ప్రతిభాతి మా. ౧౪

ఖురై రుదీరితో రేణు ర్దివం ప్రచ్ఛాద్య తిష్ఠతి,
తం వహత్యనిల శ్శీఘ్రం కుర్వ న్నివ మమ ప్రియమ్. ౧౫

స్యన్దనాం స్తురగోపేతా న్సూతముఖ్యై రధిష్ఠితాన్,
ఏతాన్సంపతత శ్శీఘ్రం పశ్య శత్రుఘ్న! కాననే. ౧౬
ఏతా న్విత్రాసితా న్పశ్య బర్హిణః ప్రియదర్శనాన్,
ఏతమావిశత శ్శీఘ్ర మధివాసం పతత్రిణః. ౧౭

అతిమాత్ర మయం దేశో మనోజ్ఞః ప్రతిభాతి మా,
తాపసానాం నివాసోఽయం వ్యక్తం స్వర్గపథో యథా. ౧౮

మృగా మృగీభి స్సహితా బహవః పృషతా వనే,
మనోజ్ఞరూపా దృశ్యన్తే కుసుమై రివ చిత్రితాః. ౧౯

వాయుప్రేరితంబులయి యాకాశంబున నతివేగంబుగాఁ బోవునట్లు ఈజింకలు మనసైనికులచేఁ దఱుమఁబడినవై యతివేగంబుగాఁ బరుగెత్తుచున్నవి చూడుము.

దాక్షిణాత్యులు మేఘంబువంటి వెండ్రుకలను పలకలుగాఁ దీర్చి యందుఁ బువ్వంబులు దాల్చునట్లు, ఈవృక్షంబులును మేఘసమానంబగు శిఖరంబునఁ బువ్వంబులు దాల్చియున్నవి. ౧౩

భయంకరంబగు నీయరణ్యంబు మున్ను మనుష్యుల చప్పుడే లేనిదిగా నుండియుండవచ్చును. ఇప్పుడు నాకిది జనులచే నిండిన యయోధ్యానగరంబు పగిదిం గాన్పించుచున్నది. ౧౪

గుఱ్ఱంబులు మొదలగువాని పాదఘట్టనమువలన లేఁచిన పరాగంబు ఏమియుఁ గానరానట్లు, అరణ్యంబంతయుఁ (ఆకాశం బంతయు) నావరించుచున్నది. అట్లుండిన నాకు రామాశ్రమంబుఁ జూడనలవిగాదు కావునవాయుదేవుండు నాకు సంతోషంబు సేయుటకుంబోలె శీఘ్రంబుగ నాపరాగముం బాఱఁదోలుచున్నాఁడు. ౧౫

శత్రుఘ్నుఁడా! ఉత్తములగు సారథులు రామదర్శనకౌతుకంబున నడవియందు గుఱ్ఱపురథంబులను శీఘ్రముగాఁ దోలుచున్నారు చూడుము. ౧౬

మంచిఱెక్కలుగలవియుఁ జూపరులకు సంతోషంబు గలిగించునవియుం నగునీమయూరంబులు ఈరథంబులధ్వనికి భయమువడి శీఘ్రంబునఁ దమనెలవులం జేరుచున్నవి చూడుము. ౧౭

ఈమార్గము మిక్కిలియు మనోహరముగా నున్నది. నాకు స్వర్గమార్గంబో యని తోఁచుచున్నది. కావున నిచి ఋషు లుండుస్థలం బనుట స్పష్టము. ౧౮

అడవియందుఁ దెల్లచుక్కలుగల జింక లనేకంబులు ఆఁడుజింకలం గూడి, మేనం బువ్వంబులు చల్లఁబడియుండునట్లు మనోహారంబుగాఁ జూపట్టుచున్నవి చూడుము. ౧౯

సాధు సైన్యాః ప్రతిష్ఠన్తాం విచిన్వన్తు చ కాననే,
యథా తౌ పురుషవ్యాఘ్రౌ దృశ్యేతే రామలక్ష్మణౌ. ౨౦
భరతస్య వచ శ్శ్రుత్వా పురుషా శ్శస్త్రపాణయః,
వివిశు స్తద్వనం శూరా ధూమంచ దదృశు స్తతః. ౨౧
తే సమాలోక్య ధూమాగ్ర మూచు ర్భరత మాగతాః,

నామనుష్యే భవత్యగ్ని ర్వ్యక్త మత్రైవ రాఘవౌ. ౨౨

అథవాఽత్ర నరవ్యాఘ్రౌ రాజపుత్రౌ పరన్తపౌ,
మన్యే రామోపమా స్సన్తి వ్యక్త మత్ర తపస్వినః. ౨౩

తచ్ఛ్రుత్వా భరత స్తేషాం వచనం సాధుసమ్మతమ్,
సైన్యా నువాచ సర్వాం స్తా నమిత్రబలమర్దనః. ౨౪
యత్తా భవన్త స్తిష్ఠన్తు నేతో గన్తవ్య మగ్రతః,
అహా మేవ గమిష్యామి సుమన్త్రో గురు రేవ చ. ౨౫

ఏవ ముక్తా స్తత స్సర్వే తత్ర తస్థు స్సమన్తతః,
భరతో యత్ర ధూమాగ్రం తత్ర దృష్టిం సమాదధాత్. ౨౬
వ్యవస్థితా యా భరతేన సా చమూ
ర్నిరీక్షమాణాఽపి చ ధూమ మగ్రతః,
బభూవ హృష్టా న చిరేణ జానతీ
ప్రియస్య రామస్య సమాగమం తదా. ౨౭

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే త్రిణవతితమస్సర్గః.

పురుషశ్రేష్ఠులగు సారామలక్ష్మణు లగపడునట్లు సైనికులు పోయి యరణ్యంబున నంతయుఁ జక్కఁగా వెదకుదురుగాక! అని భరతుఁడు చెప్పెను.

భరతుని మాటను విని శూరులగు పురుషులు కొందఱు ఆయుధపాణులయి యాయడవిం బ్రవేశించి యంతం గొంతవడికి ధూమంబుఁ బొడగనిరి.

అట్లు వారలు ధూమశిఖం బొడగాంచి మరల భరతునొద్దకు వచ్చి యిట్లని చెప్పిరి.

మనుష్యులులేని ప్రదేశమునందు అగ్ని యుండదు. కావున నిచ్చటనే రామలక్ష్మణు లున్నారు స్పష్టము. ౨౨

ఒకవేళఁ బురుషశ్రేష్ఠులును, శత్రువులం దపింపఁజేయువారలు నగు రామలక్ష్మణులు లేకున్నను ఇచ్చట రామునితో సమానులగు మునులయినను ఉన్నారు. ఇందు సందియము లేదు; అని తలంచెదము. అని యాపురుషులు భరతునకుఁ జెప్పిరి. ౨౩

శత్రుసైన్యంబులను మర్దించునట్టి భరతుఁడు వారలు చెప్పినసాధుసమ్మతం బగు మాటను విని సైనికుల నందఱం జూచి యిట్లని చెప్పెను. ౨౪

మీరలు ఇచ్చటనె నిశ్శబ్దంబుగా నుండుఁడు. ఇంతకుఁ బైని మీరు రావలదు. నేనును సుమంత్రుఁడును వసిష్ఠుఁడును మాత్రమె పోయెదము. అని భరతుఁడు సైనికుల కాజ్ఞాపించెను. ౨౫

ఆసైనికు లందఱు ఇట్లాజ్ఞాపింపఁబడినవారలై యచ్చటనే యుండిరి.

అంత భరతుఁడు ఆధూమశిఖ కనుపడినస్థలంబును నిదానించి చూచెను.

అప్పుడు భరతునిచే నివ్వారింపఁబడిన సైనికులును ఇంక శీఘ్రంబుననె ప్రియుండగు రాముఁ జూడఁగల్గునని యెఱింగి సంతుష్టులయి విడువక యాధూమశిఖనే చూచుచుండిరి. ౨౬

ఇది తొంబదిమూఁడవసర్గము.

# చతుర్నవతితమస్సర్గః

దీర్ఘకాలోషిత స్తస్మి న్గిరౌ గిరివనప్రియః,
వైదేహ్యాః ప్రియ మాకాఙ్క్షన్స్వంచ చిత్తం విలోభయన్. ౧
అథ దాశరథి శ్చిత్రం చిత్రకూట మదర్శయత్,
భార్యా మమరసఙ్కాశ శ్శచీ మివ పురన్దరః. ౨

న రాజ్యా ద్భ్రంశనం భద్రే! న సుహృద్భి ర్వినా భవః,
మనో మే బాధతే దృష్ట్వా రమణీయ మిమం గిరిమ్. 3

పశ్యేమ మచలం భద్రే! నానాద్విజగణాయుతమ్,
శిఖరైః ఖ మివోద్విద్ధై ర్ధాతుమద్భి ర్విరాజితమ్. ౪

కేచి ద్రజతసఙ్కాశాః కేచి త్క్షతజసన్నిభాః,
పీతమాఞ్జిష్ఠవర్ణాశ్చ కేచి న్మణివరప్రభాః. ౫
పుష్యార్కకేతకాభాశ్చ కేచిజ్జ్యోతీరసప్రభాః,
విరాజన్తేఽచలేన్ద్రస్య దేశా ధాతువిభూషితాః. ౬

నానామృగగణద్వీపితరక్ష్వృక్షగణై ర్వృతః,
అదుష్టై ర్భాత్యయం శైలో బహుపక్షిసమాయుతః. ౭

## తొంబదినాలవసర్గము

అంత నచ్చట దేవసమానుఁడును పర్వతంబులందును అరణ్యంబులందును ప్రీతిగలవాఁడు నగు రాముఁడు, ఆచిత్రకూటపర్వతంబున నొకమాసంబువఱకు వాసముచేసి భరతుఁడు వచ్చినదినంబున సీతాదేవికి సంతోషంబు సేయఁగోరి తనమనంబునకును గొంచెము వినోదంబు గలిగించుటకై దేవేంద్రుఁడు శచీదేవికిం బోలెఁ దనభార్యయగు సీతాదేవికిఁ జిత్రంబగు నాచిత్రకూటపర్వతంబు నందలి విశేషంబులం జూపెను. ౧,౨

మంగళరూపిణివగు సీతా! రమణీయంబగు నీచిత్రకూటపర్వతంబుఁ జూచుచుండుటవలన రాజ్యభ్రంశంబుగాని స్నేహితుల విడిచివచ్చుటగాని నామనంబున కించమాత్రము దుఃఖంబు సేయకున్నవి. ౩

మంగళరూపిణివగు సీతా! ఈపర్వతము నానావిధ పక్షులతోఁగూడి ధాతుమంతంబులయి యాకాశంబు నొరయుచున్న యత్యున్నతంబులయియున్న శిఖరంబులచే నలంకృతంబయి యున్నది చూడుము. ౪

పర్వతోత్తమంబగు నీచిత్రకూటంబు నానావిధ ధాతువులతోఁ గూడిన దగుటం జేసి యిందు గొన్ని ప్రదేశంబులు రజతంబువంటివిగాను గొన్ని నెత్తురువలె నెఱ్ఱనివిగాను గొన్ని పీతంబులుగాను గొన్ని చిత్రవర్ణంబులుగాను గొన్ని యింద్రనీలమణివర్ణంబులుగాను గొన్ని పుష్యరాగవర్ణంబులుగాను గొన్ని స్ఫటికవర్ణంబులుగాను గొన్ని మొగిలిపూవన్నెగలవిగాను గొన్ని నక్షత్రకాంతిగలవిగాను గొన్ని పాదరసప్రభలుగాను నెంతయుం నొప్పుచున్నవి చూడుము. ౫,౬

ఈచిత్రకూటపర్వతంబు మునులసన్నిధానంబునం జేసి యతిశాంతంబులయి యుండునట్టి నానావిధంబులగు జింకలును బెద్దపులులును చిఱుతపులులును నెలుఁగుగొడ్డులును నానావిధంబులగు పక్షులునుం గల్గి యొంతయు నొప్పుచున్నది చూడుము. ౭

ఆమ్రజమ్బ్వసనై ర్లోధ్రైః ప్రియాళైః పనసై ర్ధవైః,
అఙ్కోలై ర్భవ్యతినిశై ర్బిల్వతిన్దుకవేణుభిః. ౮
కాశ్మర్యరిష్టవరుణై ర్మధూకై స్తిలకై స్తథా,
బదర్యామలకై ర్నీపై ర్వేత్రధన్వనబీజకైః. ౯
పుష్పవద్భిః ఫలోపేతై శ్ఛాయావద్భి ర్మనోరమైః,
ఏవ మాదిభి రాకీర్ణ శ్శ్రియం పుష్యత్యయం గిరిః. ౧౦

శైలప్రస్థేషు రమ్యేషు పశ్యేమాన్ రోమహర్షణాన్,
కిన్నరాన్ ద్వన్ద్వశో భద్రే! రమమాణా న్మనస్వినః. ౧౧

శాఖావసక్తాన్ ఖడ్గాంశ్చ ప్రవరాణ్యమ్బరాణి చ,
పశ్య విద్యాధరస్త్రీణాం క్రీడోద్దేశా న్మనోరమాన్. ౧౨

జలప్రపాతై రుద్భేదై ర్నిష్యన్దై శ్చ క్వచి త్క్వచిత్,
స్రవద్భిర్భా త్యయం శైల స్స్రవ న్మద ఇవ ద్విపః. ౧౩

గుహాసమీరణో గన్ధా న్నానాపుష్పభవా న్వహన్,
ఘ్రాణతర్పణ మభ్యేత్య కం నరం న ప్రహర్షయేత్. ౧౪

యదీహ శరదోఽనేకా స్త్వయా సార్ధ మనిన్దితే!,
లక్ష్మణేన చ వత్స్యామి న మాం శోకః ప్రధక్ష్యతి. ౧౫
బహుపుష్పఫలే రమ్యే నానాద్విజగణాయుతే,
విచిత్రశిఖరే హ్యస్మి న్రతవా నస్మి భామిని!. ౧౬

ఈచిత్రకూటపర్వతంబు చక్కఁగాఁ బుష్పించి ఫలవంతంబులయి మనోహరంబులై యున్నమామిడిచెట్లును నేరేడుచెట్లును వేఁగిసచెట్లును లొద్దుగుచెట్లును మోరటిచెట్లును పనసచెట్లును చంద్రచెట్లును ఊడుగుచెట్లును మంచితివాసపుచెట్లును బిల్వవృక్షంబులును తుమ్మికివృక్షములును వెదుళ్లును గుమ్ముడుచెట్లును వేఁపవృక్షములును ఉలిమిరివృక్షములును ఇప్పవృక్షములును బొట్టుగుచెట్లును రేఁగుచెట్లును ఉసిరికవృక్షములును మంకెనచెట్లును వేములును గెలుచ ఏఱుమద్దివృక్షములును దాడిమీవృక్షంబులును ఇవి మొదలగు ననేక వృక్షంబులతో నిండి మిక్కిలియుఁ గాంతిమంతంబయి వఱలుచున్నది చూడుము. ౮-౧౦

మంగళరూపిణివగు సీతా! సుందరంబులగు కొండనెత్తములందు దర్శన మాత్రంబుననే గగుర్పు నొందించునట్టి కిన్నరులు దంపతులుదంపతులుగా బరస్పరబద్ధానురాగులయి క్రీడించు చున్నారు. చూడుము. ౧౧

విద్యాధరులు వృక్షశాఖలందు ఖడ్గంబులను నుత్తమంబులగు వస్త్రంబుల నుంచియున్నారు చూడుము. మఱియు మనోహరంబులగు వారలు క్రీడించుస్థలంబులం జూడుము. ౧౨

జలంబులు స్రవించుచున్న సెలయేఱులచేతను భూమిని భేదించివచ్చునట్టి యూటలచేతను ఈచిత్రకూటపర్వతంబు మదమును స్రవించుచున్న యేనుంగుకైవడిం బ్రకాశించుచున్నది. ౧౩

గుహనుండి వచ్చునట్టి యీవాయువు నానావిధంబులగు పూవుల తావుల గుబాళించుచు ఘ్రాణేంద్రియంబునకు మిక్కిలియుం సౌఖ్యంబు గల్గించుచున్నదే; దీని కెవ్వఁడు సంతోషింపఁడు? ౧౪

నిందితురాలవు కానట్టి సీతాదేవీ! ఇచ్చట నిన్నును లక్ష్మణునిం గూడి యనేకసంవత్సరంబు లున్నను నాకెంతమాత్రమును దుఃఖము దోఁచదు. ౧౫

సీతాదేవీ! పెక్కు పుష్పంబులును పెక్కుఫలంబులును గల్గి నానావిధపక్షులచే నతిరమణీయంబై యతిసుందరంబులగు శిఖరంబులతో నొప్పుచున్న యీపర్వతంబునందు నామనస్సు మిక్కిలియుం నానందించి యున్నది.

అనేన వనవాసేన మయా ప్రాప్తం ఫలద్వయమ్,
పితు శ్చానృణతా ధర్మే భరతస్య ప్రియం తథా. ౧౭
వైదేహి! రమసే కచ్చి చ్చిత్రకూటే మయా సహ,
పశ్యన్తీ వివిధా న్భావా న్మనోవాక్కాయసంయతాన్. ౧౮

ఇద మేవామృతం ప్రాహూ రాజ్ఞి! రాజర్షయః పరే,
వనవాసం భవార్థాయ ప్రేత్య మే ప్రపితామహాః. ౧౯

శిలా శ్శైలస్య శోభన్తే విశాలా శ్శతశోఽభితః,
బహులా బహులై ర్వర్ణై ర్నీలపీతసితారుణైః. ౨౦

నిశి భాన్త్యచలేన్ద్రస్య హుతాశనశిఖా ఇవ,
ఓషధ్య స్స్వప్రభాలక్ష్మ్యా భ్రాజమానా స్సహస్రశః. ౨౧

కేచి త్క్షయనిభా దేశాః కేచి దుద్యానసన్నిభాః,
కేచిదేకశిలా భాన్తి పర్వతస్యాస్య భామిని!. ౨౨

భిత్త్వేవ వసుధాం భాతి చిత్రకూట స్సముత్థితః.
చిత్రకూటస్య కూటోఽసౌ దృశ్యతే సర్వత శ్శుభః. ౨౩

కుష్ఠపున్నాగస్థగరభూర్జపత్రోత్తరచ్ఛదాన్,
కామినాం స్వాస్తరా న్పశ్య కుశేశయదలాయుతాన్. ౨౪
మృదితా శ్చాపవిద్ధాశ్చ దృశ్యన్తే కమలస్రజః,
కామిభిర్వనితే! పశ్య ఫలాని వివిధాని చ. ౨౫

నే నిప్పుడు వనవాసంబు సేయుటచేతఁ దండ్రిఋణంబుఁ దీర్చుకొనుటయుం భరతుఁడు సంతోషించుటయుం రెండుఫలంబులు నాకుఁగలిగినవి. ౧౭

సీతాదేవీ! ఇచ్చట మనోవాక్కాయంబులను మూఁడిటిని వశీకరించునట్టి నానావిధంబులగు మలయానిలకోకిలాలాపకుసుమఫలంబులు మొదలగు భావంబుల ననుభవింపుచు నీచిత్రకూటంబున నాతో నుండుట నీకు సంతోషముగా నున్నదా యేమి? ౧౮

రాణివగు సీతా! నామహాత్ములు మొదలగు మనుపటిరాజర్షులు దేహమును విడిచినపిదప సంసారనాశంబునకై యీవనవాసంబునే ముఖ్యసాధనంబుగాఁ జెప్పిరి. ౧౯

నలుపుఁ బసుపుఁ దెలుపు నెఱుపు మొదలగు నానావిధవర్ణంబులతోఁ గూడిన విశాలంబులగు శిలలు చిత్రకూటపర్వతంబున నంతటను వేనవేలుగాఁ బ్రకాశించుచున్నవి. ౨౦

పర్వతరాజంబగు నీచిత్రకూటపర్వతంబునందలి మహౌషధులు వేనవేలుగా రాత్రికాలంబులందు నిజకాంతిం దేజరిల్లుచు నగ్నిజ్వాలలుం బోలె నెంతయుం బ్రకాశించుచున్నవి. ౨౧

సీతా! ఈచిత్రకూటపర్వతంబునఁ గొన్ని ప్రదేశంబులు గృహంబులవలెఁ గొన్ని యుద్యానవనంబులపగిదిఁ గొన్ని విశాలంబగు నొక్కటే శిలగాను బ్రకాశించుచున్నవి. ౨౨

చిత్రకూటపర్వతంబు భూమిని భేదించి పైకుద్గమించియున్నదో యనందగి యొప్పుచున్నది. ఈచిత్రకూటశిఖరం బంతయుం రమణీయంబుగా నున్నది. ౨౩

నల్లకలువలును బున్నాగపుష్పంబులును బుత్రజీవిగ్రాలును భూర్జపత్రంబులును గమలదళంబులును బఱచియున్న కాముకులశయనంబులం జూడుము.

సీతా! కాముకులచే మర్దింపఁబడి పాఱవేయఁబడిన కమలమాలికలును నానావిధపుష్పంబులును కనఁబడుచున్నవి చూడుము. ౨౫

పశ్యావకసారాం నలినీమత్యేతీవోత్తరాన్కురూన్,
పర్వత శ్చిత్రకూటోఽసౌ బహుమూలఫలోదకః. ౧౬

ఇమం తు కాలం వనితే! విజహ్రివాం
స్త్వయా చ సీతే! సహ లక్ష్మణేన చ,
రతిం ప్రపత్స్యే కులధర్మవర్ధినీం
సతాం పథి స్వై ర్నియమైః పరైః స్థితః. ౧౭

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే చతుర్నవతితమస్సర్గః.

---

## పఞ్చనవతితమస్సర్గః

అథ శైలా ద్వినిష్క్రమ్య మైథిలీం కోసలేశ్వరః,
అదర్శయచ్ఛుభజలాం రమ్యాం మన్దాకినీం నదీమ్.

అబ్రవీ చ్చ వరారోహాం చారుచన్ద్రనిభాననామ్,
విదేహరాజస్య సుతాం రామో రాజీవలోచనః.

విచిత్రపులినాం రమ్యాం హంససారససేవితామ్,
కమలై రుపసమ్పన్నాం పశ్య మన్దాకినీం నదీమ్.

నానావిధై స్తీరరుహై ర్వృతాం పుష్పఫలద్రుమైః.

పెక్కుమూలంబులును ఫలంబులును జలంబులును గల యీచిత్రకూట పర్వతంబు అలకాపట్టణంబును సౌగంధికసరస్సును ఉత్తరకురుదేశంబులనుం గూడ నతిశయించుచున్నది. ౧౬

సీతాదేవీ! నేను శ్రేష్ఠంబులగునియమంబుల సాధుమార్గంబవలంబించి మాకుల ధర్మం బేర్పడ నిచ్చట నీతోను లక్ష్మణునితోనుం గూడ విహరింపుచు నీ పదునాలుగు సంవత్సరంబులును గడపి యంత సంతుష్టుండ నయ్యెదను. అని రాముఁడు సీతాదేవికిఁ జిత్రకూటపర్వతంబునందలి చిత్రంబులం జూపుచుఁ జెప్పెను. ౧౭

ఇది తొంబదినాలవసర్గము.

---

## తొంబదియైదవసర్గము

అట్లు రాముఁడు సీతాదేవికిఁ బర్వతంబునందలి విచిత్రంబులం జూపి యంత స్వచ్ఛంబులగు జలంబులు గల్గి రమణీయంబై యున్న మందాకినీ నదిం జూపెను. ౧

కమలంబులవంటి కన్నులుగల రాముఁడు శరదృతువునందలి చంద్రుం బోలిన ముఖంబుగలదియుం సుందరంబులగు పిఱుందులుగలదియుం నగు జనక మహారాజుపుత్రియయిన సీతాదేవిం జూచి మనంబున సంతోషంబు నిండార నిట్లని చెప్పెను. ౨

నానావిధములగు నిసుకదిబ్బలుగలదియుం హంససారసశోభితంబును దామరసపుష్పంబుల నొప్పుచున్నదియుం రమణీయంబునగు నీ మందాకినీనదిం జూడుము. ఇది నీపిఱుందులంబోలు నిసుకదిబ్బలును నూపురధ్వనుల ననుకరించు హంసకూజితంబులును గరచరణవదనంబులకు సరివచ్చు కమలంబులును గల్గి యుండుటచే నీయట్లు ఎంతయుం నొప్పుచున్నది. ౩

ఈమందాకినీనది, తీరంబులందు నానావిధంబులగు పుష్పవృక్షంబులును

రాజ స్త్రీం రాజరాజస్య నళినీ మివ సర్వతః. ౪

మృగయూథనిపీతాని కలుషాంభాంసి సామ్ప్రతమ్,
తీర్థాని రమణీయాని రతిం సఞ్జనయ న్తి మే. ౫

జటాజినధరాః కాలే వల్కలో త్తరవాససః,
ఋషయ స్త్వవగాహ న్తే నదీం మన్దాకినీం ప్రియే. ౬

ఆదిత్యముపతిష్ఠ న్తే నియమాదూర్ధ్వబాహవః,
ఏతే పరే విశాలాక్షి! మునయ స్సంశిత వ్రతాః. ౭

మారుతోద్ధూతశిఖరైః ప్రనృ త్త ఇవ పర్వతః,
పాదపైః పత్రపుష్పాణి సృజద్భిరభితో నదీమ్. ౮

క్వచి న్మణినికాశోదాం క్వచిత్పులినశాలినీం,
క్వచిత్సిద్ధజనాకీర్ణాం పశ్య మన్దాకినీం నదీమ్. ౯

నిర్ధూతాన్వాయునా పశ్య వితతాన్పుష్పసంచయాన్,
పోప్లూయమానా నపరా న్పశ్య త్వం జలమధ్యగాన్. ౧౦

తాం శ్చాతివల్గువచసో రథాఙ్గాహ్వయనా ద్విజాః,
అధిరోహ న్తి కల్యాణి! నిష్కూజ న్త శ్శుభా గిరః. ౧౧

ఫలవృక్షంబులును గల్గి కుబేరుని సౌగంధికసరస్సికైవడి సెంతయుం బ్రకాశించు చున్నది చూడుము. ౪

జింకలగుంపులు నీళ్లు ద్రాగి వచ్చుటచే నిప్పుడు కలంగియున్న రమణీయంబులగు రేవులం జూడఁజూడ నా కెంతయుం సంతోషంబు గలుగు చున్నది. ౫

ప్రియురాలా! జటలుం గృష్ణాజినంబులును దాల్చినవారలును వల్కలంబులం గట్టుకొనువారలునగు ఋషులు, నియతకాలంబున ఈమందాకినీనది యందు అవగాహనస్నానము సేయుచున్నారు చూడుము. ౬

విశాలనయనవగు సీతా! ఇదిగో తీక్ష్ణంబగు నియమముగల మఱికొందఱు మునులు నియమంబునఁ జేతులు పైకిఁ జాఁచి సూర్యునిగూర్చియుపస్థానము సేయుచున్నారు. ౭

నర్తనముసేయఁబోవువాఁడు చేతుల పుష్పంబులం జల్లునట్లు ఈపర్వతము గాలికిం గదలువృక్షంబులచే నదిచుట్టును బుష్పంబులను బత్రంబులనుం జల్లుచున్నది చూడుము. ౮

ఈమందాకినీనది యొకానొకచో ముత్తెములంబోలు జలములు గలదై యొక్కచోట నిసుకదిన్నెలతో నొప్పుచు నొక్కచో స్నానముసేయవచ్చిన సిద్ధజనులచే నిండి యెంతయుం రమణీయంబుగాఁ జూపట్టుచున్నది చూడుము.

గాలికి రాలినపుష్పములు కొన్ని తీరములం బడియున్నవి చూడుము. కొన్ని జలంబులం బడి కదలుచున్నవి చూడుము. అట్లు ఈమందాకినీనది కొంతదూరము పుష్పములచేఁ గప్పఁబడి కొంతదూరము లేకుండుటచేఁ బ్రియునిచే సగ మపహరింపఁబడిన వస్త్రముగల నారీమణికైవడిం గనుపట్టు చున్నది. ౧౦

మంగళస్వరూపిణివగు సీతా! మనోహరంబులగు ధ్వనులుగల చక్రవాకపక్షులు మధురంబగు రతికాలికస్వనంబులు గూయుచు రత్యర్థము అపుష్పరాసుల నారోహించుచున్నవి చూడుము. ౧౧

దర్శనం చిత్రకూటస్య మన్దాకిన్యాశ్చ శోభనే,
అధికం పురవాసాచ్చ మన్యే చ తవ దర్శనాత్. ౧౨

విధూతకలుషై స్సిద్ధై స్తపోదమశమాన్వితైః,
నిత్యవిక్షోభితజలాం విగాహస్వ మయాసహ. ౧౩

సఖీవచ్చ విగాహస్వ సీతే! మన్దాకినీం నదీమ్,
కమలాన్యవమజ్జన్తీ పుష్కరాణి చ భామిని!. ౧౪

త్వం పౌరజనవద్వ్యాళా నయోధ్యామివ పర్వతమ్,
మన్యస్వ వనితే! నిత్యం సరయూవ దిమాం నదీమ్. ౧౫

లక్ష్మణ శ్చాపి ధర్మాత్మా మన్నిదేశే వ్యవస్థితః,
త్వం చానుకూలా వైదేహి! ప్రీతిం జనయథో మమ. ౧౬

ఉపస్పృశం స్త్రిషవణం మధుమూలఫలాశనః,
నాయోధ్యాయై న రాజ్యాయ స్పృహయేఽద్య త్వయా సహ.

ఇమాం హి రమ్యాం గజయూథశాలినీం
నిపీతతోయాం గజసింహవానరైః,
సుపుష్పితైః పుష్పధరై రలఙ్కృతాం
న సోఽస్తి యస్స్యా దగతక్లమ స్సుఖీ. ౧౮

మంగళరూపిణివగు సీతాదేవి! ఏకాంతభోగస్థానం బగుటవలన ఈ చిత్రకూటంబుఁ జూచుచుండుట, అయోధ్యానగరవాసంబుకన్నను నా కధిక ముగాఁ దోఁచుచున్నది. మన్మథోద్దీపనం బగుటవలన నీమందాకినిం జూచుట నిన్నుఁ జూచుటకన్నను అధికముగా నున్నది. ౧౩

ఈమందాకినీనిష్కల్మషులును దపస్సు నింద్రియనిగ్రహమును శాంతి యుఁ గలసిద్ధులు ఎల్లప్పుడుఁ స్నానముసేయుటచేఁ గలంగిన జలంబులతో నొప్పుచున్నది. అట్టిపుణ్యనదియందు నాతోఁ గూడ జలక్రీడ గావింపుము.

సీతాదేవీ! స్తనజఘనంబులదాఁకుడుచే నెఱ్ఱదామరపూలును దెల్లదామర పూలును జలంబుల మునుంగునట్లు గావించుచుఁ కేళికౌతుకవతివై నాతోఁ గూడ మందాకినీనదిలో జలక్రీడ గావింపుము. ౧౪

సీతాదేవి! నీ వింక నవివిధమృగంబులనే పట్టణవాసిజనులనుగాను ఈ చిత్రకూటపర్వతంబునే యయోధ్యానగరంబుగాను ఈమందాకినీనదినే సరయూ నదినిగాను భావించుకొనుము. ౧౫

సీతాదేవి! ధర్మాత్ముఁడగు లక్ష్మణుఁడును నీవును నాయాజ్ఞాప్రకారము గావింపుచు నా కనుకూలముగా నాకు మిక్కిలియు సంతోషము సేయుచున్నారు. ౧౬

ఇట్లు మూఁడుకాలంబులను స్నానంబుసేయుచు తేనెయు మూలంబు లును ఫలంబులను ఆహారంబుగాఁ గొనుచు నీతోఁగూడ నుండువేని అయోధ్యను గాని రాజ్యంబునుగాని యిచ్ఛింపను. ౧౭

రమణీయంబును మృగయూథంబుల నొప్పుచున్నదియు నాశ్రమ మహిమచే విగతవైరంబులగు గజ సింహాది క్రూరమృగంబులచే ననోన్యసహి తంబుగాఁ ద్రావంబడు జలంబులు గలదియుఁ జక్కఁగాఁ బుష్పించినవృక్ష ములచే నలంకృతము నగు నీమందాకినీనదియందు స్నానము గావించియుఁ గతాయాసుఁడై సుఖంబు నొందనివాఁ డెవ్వఁడును లేఁడు. అని రాముఁడు సీతాదేవికిం జెప్పెను. ౧౮

ఇతీవ రామో బహుసఙ్గతం వచః
ప్రియాసహాయః సరితం ప్రతి బ్రువన్,
చచార రమ్యం నయనాఞ్జనప్రభం
స చిత్రకూటం రఘువంశవర్ధనః. ౧౮

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే పఞ్చనవతితమస్సర్గః.

## షణ్ణవతితమస్సర్గః

తాం తథా దర్శయిత్వా తు మైథిలీం గిరినిమ్నగామ్,
నిషసాద గిరిప్రస్థే సీతాం మాంసేన ఛన్దయన్. ౧

ఇదం మేధ్య మిదం స్వాదు నిష్టప్త మిద మగ్నినా,
ఏవ మాస్తే స ధర్మాత్మా సీతయా సహ రాఘవః. ౨

తథా తత్రాఽసత స్తస్య భరతస్యోపయాయినః,
సైన్యరేణు శ్చ శబ్ద శ్చ ప్రాదురాస్తాం నభ స్స్పృశౌ. ౩
ఏతస్మి న్నన్తరే త్రస్తా శ్శబ్దేన మహతా తతః,
అర్దితా యూథపా మత్తా స్సయూథా దుద్రువు ర్దిశః. ౪
స తం సైన్యసముద్ధూతం శబ్దం శుశ్రావ రాఘవః,
తాం శ్చ విప్రద్రుతా న్సర్వా న్యూథపా నన్వవైక్షత. ౫
తాం శ్చ విద్రవతో దృష్ట్వా తం చ శ్రుత్వా చ నిస్వనమ్,
ఉవాచ రామ స్సౌమిత్రిం లక్ష్మణం దీప్తతేజసమ్. ౬

హన్త లక్ష్మణ! పశ్యేహ సుమిత్రా సుప్రజా స్త్వయా,
భీమ స్తనితగమ్భీర స్తుముల శ్శ్రూయతే స్వనః. ౭

రఘువంశంబును వృద్ధిబొందించునట్టి రాముఁడు ప్రియాసహితుఁడై యిట్లు మందాకినీనదిం గుఱించి మనోహరంబులగుమాటలం జెప్పుచు రమణీయం బును గాటుకవలె నల్లనిదియునగు చిత్రకూటపర్వతమునందు విహరించెను. ౧౯

ఇది తొంబదియైదవసర్గము.

---

## తొంబదియాఱవసర్గము

రాముండు అట్లు సీతాదేవికి మందాకినీనదిసౌందర్యంబుఁ జూపి యంతఁగొండనెత్తమునందుఁ గూర్చుండి సీతాదేవికి నానావిధమాంసంబులం దినిపించెను. ౧

"ఈమాంసము పరిశుద్ధము. ఇది రుచిగలది. ఇది చక్కఁగాఁ బక్వమయినది" ఇట్లు ధర్మాత్ముఁడగు రాముఁడు సీతాదేవికి మధురంబులగు మాటలంజెప్పుచుండెను. ౨.

అట్లచ్చట నారాముఁడు కూర్చుండియుండఁగా భరతునిసైన్యముల త్రొక్కుడుచేఁ గలిగిన పరాగంబును శబ్దంబును నింగి ముట్టి చెలంగినవి. ౩

ఈసమయమునందే ఆశబ్దంబునకు వెఱచి భయపీడితంబులయి మత్తగజంబులు గజయూథంబులతోఁ గూడ దిక్కులకుం బాఱినవి. ౪

రాముఁడు సైన్యధ్వనిని వినెను. ఆధ్వనికి భయపడి పరుగెత్తుచున్న మదపుటేనుంగులనుం జూచెను. ౫

రాముఁడు భయంబునం బరుగెత్తుచున్న యాయేనుంగులనుం జూచి యమ్మహాధ్వనియుం నాలకించి కాంతిమంతుఁడగు సుమిత్రాపుత్రుఁడయిన లక్ష్మణుంజూచి యిట్లని చెప్పెను. ౬

ఆ! ఇది యేమి! లక్ష్మణుఁడా! ఈతట్టుచూడుము. సుమిత్ర నీవలనమంచి పుత్రుఁడు గలదైనది. భయంకరమగు మేఘగర్జనమువంటి మహాధ్వని యొక్కటి వినవచ్చుచున్నది. ౭.

గజయూథాని వాఽరణ్యే మహిషా వా మహావనే,
విత్రాసితా మృగా స్సింహా స్సహసా ప్రద్రుతా దిశః. ౮

రాజా వా రాజమాత్రో వా మృగయా మటతే వనే,
అన్యద్వా శ్వాపదం కించి త్సౌమిత్రే! జ్ఞాతు మర్హసి. ౯

సుదుశ్చరో గిరి శ్చాయం పక్షిణా మపి లక్ష్మణ!,
సర్వ మేత ద్యథాతత్త్వ మచిరాత్ జ్ఞాతు మర్హసి. ౧౦

స లక్ష్మణ స్సన్త్వరిత స్సాల మారుహ్య పుష్పితమ్,
ప్రేక్షమాణో దిశ స్సర్వాః పూర్వాం దిశ ముదైక్షత. ౧౧
ఉదఙ్ముఖః ప్రేక్షమాణో దదర్శ మహతీం చమూమ్,
రథాశ్వగజసమ్బాధాం య త్తై ర్యుక్తాం పదాతిభిః. ౧౨

తా మశ్వగజసమ్పూర్ణాం రథధ్వజవిభూషితామ్,
శశంస సేనాం రామాయ వచనం చేద మబ్రవీత్. ౧౩

అగ్నిం సంశమయ త్వార్య స్సీతా చ భజతాం గుహామ్,
సజ్యం కురుష్వ చాపం చ శరాం శ్చ కవచం తథా. ౧౪

తం రామః పురుషవ్యాఘ్రో లక్ష్మణం ప్రత్యువాచ హ,
అఙ్గావేక్షస్వ సౌమిత్రే! కస్యేమాం మన్యసే చమూమ్. ౧౫

ఏవ ముక్త స్తు రామేణ లక్ష్మణో వాక్య మబ్రవీత్,

మహారణ్యంబునందు ఏనుంగులుగాని యెనుబోతులుగాని మృగంబులుగాని సింహములుగాని సమస్తమృగంబులును భయంబునొంది నలుదిక్కులకుం బాఱుచున్నవి. ౮

రాజుగాని రాజతుల్యుఁడుగాని యెవ్వఁడేని వేఁటాడుచున్నాఁడా? లేక ఏదైన నొకగొప్ప క్రూరజంతువు వచ్చియున్నదా? లక్ష్మణుఁడా! దీనిం దెలిసికొనుము. ౯

లక్ష్మణుఁడా! పక్షులకుఁ గూడ నీచిత్రకూటపర్వతంబున సంచరింప నలవి గాదు. ఎందువలన నీశబ్దము గలిగినదో చక్కఁగాఁ జూచి శీఘ్రమున యథార్థముఁ దెలిసికొనుము. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౧౦

అంత నాలక్ష్మణుఁడు వేగంబున నొకపుష్పితవృక్షము నారోహించి యన్నిదిక్కులం జూచుచుఁ దూర్పుదిక్కునం జూచెను. ౧౧

అంత నాలక్ష్మణుఁడు ఉత్తరపుతట్టు తిరిగి చూడఁగా రథాశ్వగజంబులతో నిండినదియుం సన్నద్ధులగు పదాతులతోఁ గూడినదియుం నగు గొప్పసేన యగపడెను. ౧౨

లక్ష్మణుఁడు అట్టుగుఱ్ఱంబులతోను ఏనుంగులతోను నిండినదియుంనానావిధ ధ్వజాలంకృతంబు నగు గొప్పసేన యొకటి వచ్చుచున్నదని రామునకుం జెప్పి యంత నీమాటనుం జెప్పెను. ౧౩

ఇంక నగ్నిహోత్రంబును జల్లార్చి సీతను గుహాలోనికిం బంపుము. ధనువు సజ్యంబు గావించుకొనుము. బాణంబులను గ్రహింపుము. కవచంబు దొడుగుము. అని లక్ష్మణుఁడు రామునితోఁ జెప్పెను. ౧౪

అంతఁ బురుషశ్రేష్ఠుఁడగు రాముఁడు లక్ష్మణుం జూచి యిట్లనిచెప్పెను.
అయ్యా! లక్ష్మణుఁడా! చక్కఁగాఁ జూడుము. ఈసేన యెవ్వనిదిగా నీకుఁ దోఁచుచున్నది? అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౧౫

అంత లక్ష్మణుఁడు రాముఁడు చెప్పినమాటను విని కోపంబున నగ్ని

దిధక్షన్నివ తాం సేనాం రుషితః పావకో యథా. ౧౬

సమ్పన్నం రాజ్య మిచ్ఛంస్తు వ్యక్తం ప్రాప్యాభిషేచనమ్,
ఆవాం హన్తుం సమభ్యేతి కైకేయ్యా భరత స్సుతః. ౧౭

ఏష వై సుమహాఞ్ఛ్రీమా న్విటపీ సమ్ప్రకాశతే,
విరాజత్యుద్గతస్కన్ధః కోవిదారధ్వజో రథే. ౧౮

[అసౌ హి సుమహాస్కన్ధో విటపీ చ మహాద్రుమః,
విరాజతే మహాసైన్యే కోవిదారధ్వజో రథే.]
భజన్త్యేతే యథాకామమశ్వానారుహ్య శీఘ్రగాన్,

ఏతే భ్రాజన్తి సంహృష్టా గజానారుహ్య సాదినః. ౧౯

గృహీతధనుషౌ చావాం గిరిం వీర! శ్రయావహై,
అథ వేహైవ తిష్ఠావ స్సన్నద్ధావుద్యతాయుధౌ. ౨౦

అపి నౌ వశమాగచ్ఛేత్ కోవిదారధ్వజో రణే.

అపి ద్రక్ష్యామి భరతం యత్కృతే వ్యసనం మహత్. ౨౧
త్వయా రాఘవ! సమ్ప్రాప్తం సీతయా చ మయా తథా,
యన్నిమిత్తం భవా న్రాజ్యా చ్చ్యుతో రాఘవ! శాశ్వతాత్.
సమ్ప్రాప్తోఽయ మరి ర్వీర! భరతో వధ్య ఏవ మే,

భరతస్య వధే దోషం నాహం పశ్యామి రాఘవ!. ౨౩

మహోగ్రుఁడువలె మండిపడి యాసేనను దహించుకైవడిఁ జూచుచుం జూచుచు నిట్లని చెప్పెను. ౧౬

కైకేయీకొడుకు భరతుఁడు తండ్రివరముచొప్పునఁ బట్టాభిషిక్తుఁడై యంతటితోఁ దనివి నొందక నిష్కంటకమగురాజ్యముం గోరి మనలం జంప నిచ్చటికి వచ్చుచున్నాఁడు. ఇది స్పష్టము. ౧౭

ఇదిగో! మిక్కిలియుం గొప్పదియు శ్రీమంతంబునగు వృక్షము ధ్వజంబు నగుపడుచున్నవి. ఉన్నతమయిన స్కంధముగల కాంచనపుచెట్టు ధ్వజము రథంబున వెలుంగుచున్నది. ౧౮

గొప్పస్కంధము గలదియుఁ గొమ్ములుగలదియు నగు కాంచనపుచెట్టు ధ్వజము మహాసేనయందు రథంబున వెలుంగుచున్నది.

ఈయాశ్వికులు వేగగమనంబులగు గుఱ్ఱంబుల నెక్కి సంతోషంబున నిచ్చటికి వచ్చుచున్నారు.

ఈగజసాదులు ఏనుంగులమీఁదఁ గూర్చుండి మిక్కిలియుం సంతుష్టులయి వెలుంగుచున్నారు. ౧౯

పరాక్రమశాలివగు రాముఁడా! మనము ధనుస్సుం జేకొని పర్వతము నాశ్రయించెదము. అటు గాదేని, సన్నద్ధులమయి యాయుధంబులు ధరించి యిచ్చటనె యుండెదము. ౨౦

ఇంకఁ గోవిదారధ్వజుండగుభరతుఁడు యుద్ధంబునమనచేతులఁజిక్కఁ బోవుచున్నాఁడుగదా!

రాముఁడా! ఎవ్వనినిమిత్తమయి నీవును సీతయు నేనును ఇట్టిమహాదుఃఖము నొందితిమో అట్టిభరతు నిప్పుడు యుద్ధంబునం జూడఁగలనుగదా!

వీరుఁడవగు రాముఁడా! ఎవ్వనినిమిత్తమయి నీవు శాశ్వతంబగు రాజ్యంబును విడువవలసివచ్చినదో ఆట్టి భరతుఁడు వచ్చినాఁడు. ఇతఁడు నాకు వధ్యుఁడు; సందియము లేదు. ౨౧

రాముఁడా! భరతుని వధించుటయందు నేదోషంబు నాకగపడలేదు.

పూర్వాపకారిణాం త్యాగే న హ్యధర్మో విధీయతే,
పూర్వాపకారీ భరత స్త్యక్తధర్మశ్చ రాఘవ!. ౨౪
ఏతస్మి న్నిహతే కృత్స్న మనుశాధి వసున్ధరామ్,

అద్య పుత్రం హతం సఙ్ఖ్యే కైకేయీ రాజ్యకాముకా. ౨౫
మయా పశ్యే త్సుదుఃఖార్తా హస్తిభగ్న మివ ద్రుమమ్,

కైకేయీం చ వధిష్యామి సానుబన్ధాం సబాన్ధవామ్. ౨౬
కలుషేణాద్య మహతా మేదినీ పరిముచ్యతామ్,

అద్యేమం సంయతం క్రోధ మసత్కారం చ మానద!. ౨౭
మోక్ష్యామి శత్రుసైన్యేషు కక్షే ష్వివ హుతాశనమ్,

అ ద్యైత చ్చిత్రకూటస్య కాననం నిశితై శ్శరైః. ౨౮
ఛింద ఞ్ఛత్రుశరీరాణి కరిష్యే శోణితోక్షితమ్,
శరై ర్నిర్భిన్నహృదయా న్కుఞ్జరాం స్తురగాం స్తథా. ౨౯
శ్వాపదాః పరికర్షన్తు నరాం శ్చ నిహతా న్మయా,

శరాణాం ధనుష శ్చాహ మనృణోఽస్మి మహామృధే. 30
ససైన్యం భరతం హత్వా భవిష్యామి న సంశయః.

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే షణ్ణవతితమస్సర్గః.



## స ప్త న వ తి త మ స్స ర్గః

సుసంరబ్ధం తు సౌమిత్రిం లక్ష్మణం క్రోధమూర్ఛితమ్,
రామస్తు పరిసాన్త్వాథ వచనం చేద మబ్రవీత్.
కి మత్ర ధనుషా కార్య మసినా వా సచర్మణా,
మహేష్వాసే మహాప్రాజ్ఞే భరతే స్వయ మాగతే.

పితు స్సత్యం ప్రతిశ్రుత్య హత్వా భరత మాగతమ్,
కిం కరిష్యామి రాజ్యేన సాపవాదేన లక్ష్మణ!.

యద్ద్రవ్యం బాన్ధవానాం వా మిత్రాణాం వా క్షయే భవేత్
నాహం తత్ప్రతిగృహ్ణీయాం భక్షా న్విషకృతా నివ.

ధర్మ మర్థం చ కామం చ పృథివీం చాపి లక్ష్మణ!,
ఇచ్ఛామి భవతా మర్థే ఏతత్ప్రతిశృణోమి తే.
భ్రాతౄణాం సంగ్రహార్థం చ సుఖార్థం చాపి లక్ష్మణ!,
రాజ్యమప్యహమిచ్ఛామి సత్యేనాఽఽయుధ మాలభే.

నేయం మమ మహీ సౌమ్య! దుర్లభా సాగరామ్బరా,
నహీచ్ఛేయ మధర్మేణ శక్రత్వ మపి లక్ష్మణ!.

య ద్వినా భరతం త్వాం చ శత్రుఘ్నం చాపి మానద!,
భవేన్మమ సుఖం కించి ద్భస్మ తత్కురుతాం శిఖీ.

మన్యేఽహ మాగతోఽయోధ్యాం భరతో భ్రాతృవత్సలః,
మమప్రాణా త్ప్రియతరః కులధర్మ మనుస్మరన్.
శ్రుత్వా ప్రవ్రాజితం మాం హి జటావల్కలధారిణమ్,
జానక్యాసహితం వీర! త్వయా చ పురుషర్షభ!. ౧౦
స్నేహే నాఽక్రాన్తహృదయ శ్శోకే నాఽకులితేన్ద్రియః,
ద్రష్టు మభ్యాగతో హ్యేష భరతో నాన్యథాఽఽగతః. ౧౧
అమ్బాం చ కైకయీం రుష్య పరుషం చాప్రియం వదన్,
ప్రసాద్య పితరం శ్రీమా న్రాజ్యం మే దాతు మాగతః. ౧౨

ప్రాప్తకాలం యదేషోఽస్మా న్భరతో ద్రష్టు మిచ్ఛతి,

అస్మాసు మనసాఽప్యేష నాప్రియం కించి దాచరేత్. ౧౩

విప్రియం కృతపూర్వం తే భరతేన కదా ను కిమ్,
ఈదృశంవా భయం తేఽద్య భరతం యోఽత్ర శఙ్కసే. ౧౪

నహి తే నిష్ఠురం వాచ్యో భరతో నాప్రియం వచః,
అహం హ్యప్రియ ముక్త స్స్యాం భరతస్యాప్రియే కృతే. ౧౫
కథంను పుత్రాః పితరం హన్యుః కస్యాంచి దాపది,
భ్రాతా వా భ్రాతరం హన్యా త్సౌమిత్రే! ప్రాణ మాత్మనః.

యది రాజ్యస్య హేతో స్త్వ మిమాం వాచం ప్రభాషసే,
వక్ష్యామి భరతం దృష్ట్వా రాజ్య మస్మై ప్రదీయతామ్. ౧౬

తోఁబుట్టువులయం దధికప్రేమగలవాఁడును నాకుఁ బ్రాణంబుకన్నం బ్రియుఁడునగు భరతుఁడు కులధర్మంబు దలంచుకొని "ఎల్లప్పుడును మామ యింటనె యుండఁగూడదు. పితృశుశ్రూష సేయవలె" ననియయోధ్యకువచ్చి యుండును. అంత నేను దండ్రియాజ్ఞచే జటావల్కలంబులు ధరించి నీతోను సీతతోనుం గూడ నడవికి వచ్చుటను విని మనయం దధికస్నేహము గలవాఁ డగుటచేతఁ బరమదుఃఖితుఁడై మనలంజూడ వచ్చినాఁడుగాని వేఱుగాదు. అని నాకుం దోఁచుచున్నది. ౯-౧౦

శ్రీమంతుఁడగు భరతుఁడు పరమకుపితుఁడై తల్లియగు కైకేయితో నిష్ఠురంబులు నప్రియంబులు నగు వాక్యంబు లాడి తండ్రిని బ్రార్థించి ప్రసన్నుఁ గావించి నాకు రాజ్యం బొసంగుటకై యిచ్చటికి వచ్చియున్నాఁడు. ౧౨

ఈభరతుఁ డిప్పుడు మనలం జూడవచ్చుట యీసమయమునకుఁ దగి నదిగానే యున్నది.

ఈభరతుఁడు మనసునసైనను మనకుఁ గొంచమేనియు నపకారము సేయం దలఁపఁడు. ౧౩

ఇంతకు మును యెప్పుడేని భరతుఁడు నీ కపకారము గావించియున్నాఁడా? లేక ఇట్టిభయమును గలిగించునట్టి మాటనైనను జెప్పియున్నాఁడా? ఏల యిప్పు డిచ్చట భరతునియందు సందేహించుచున్నావు? ౧౪

నీవు భరతుం జూచి యెంతమాత్రము పరుషవచనము గానియప్రియ వాక్యముఁగాని చెప్పవలదు అతనిఁ జెప్పిన నన్నుఁ జెప్పినట్లె యగును. ౧౫

లక్ష్మణుఁడా! ఏదోయొకయాపదరాఁగానే కొడుకులు తమప్రాణ ఘాతుఁడగు తండ్రినిగాని, అట్లు తోఁబుట్టువునుగాని యెట్లుచంపుకొందురు? ఇట్టి యనుచితవచనంబు లాడెదవేల? ౧౬

నీవు రాజ్యంబు గావలెనను కోర్కెచే నిట్లు భరతుని హింసింపవలెనని చెప్పుదువేని భరతుఁడు రాఁగానే యతనింజూచి "అప్పా!నీవు రాజ్యమును లక్ష్మణున కిచ్చివేయుము. అతఁడు రాజ్యంబు గావలెనని కోరుచున్నాఁడు" అని చెప్పెదను. ౧౭

ఉచ్యమానోఽపి భరతో మయా లక్ష్మణ! తత్త్వతః,
రాజ్య మస్మై ప్రయచ్ఛేతి బాఢ మి త్యేవ వక్ష్యతి. ౧౮

త థోక్తో ధర్మశీలేన భ్రాత్రా తస్య హితే రతః,
లక్ష్మణః ప్రవివేశేవ స్వాని గాత్రాణి లజ్జయా. ౧౯
త ద్వాక్యం లక్ష్మణ శ్శ్రుత్వా వ్రీళితః ప్రత్యువాచ హ,
త్వాం మన్యే ద్రష్టు మాయాతః పితా దశరథ స్స్వయమ్.

వ్రీళితం లక్ష్మణం దృష్ట్వా రాఘవః ప్రత్యువాచ హ,
ఏష మన్యే మహాబాహు రి హాస్మాన్ ద్రష్టు మాగతః. ౨౧

అథవా నౌ ధ్రువం మన్యే మన్యమానః సుఖోచితౌ,
వనవాస మనుధ్యాయ గృహాయ ప్రతినేష్యతి. ౨౨

ఇమాం వాఽప్యేష వైదేహీ మత్యన్తసుఖసేవినీమ్,
పితా మే రాఘవ శ్శ్రీమా న్వనా దాదాయ యాస్యతి. ౨౩
ఏతౌ తౌ సమ్ప్రకాశేతే గోత్రవన్తౌ మనోరమౌ,
వాయువేగసమౌ వీర! జవనౌ తురగోత్తమౌ. ౨౪

స ఏష సుమహాకాయః కమ్పతే వాహినీముఖే,
నాగ శ్శత్రుంజయో నామ వృద్ధ స్తాతస్య ధీమతః. ౨౫
న తు పశ్యామి తచ్ఛత్రం పాణ్డురం లోకసత్కృతమ్,
పితు ర్దివ్యం మహాబాహో! సంశయో భవతీవ మే. ౨౬

లక్ష్మణుండా! "నీవు రాజ్యమును లక్ష్మణున కి"మ్మని నేను మాటమాత్రము చెప్పినంతనే భరతుండు తత్క్షణంబున "అట్లే యిచ్చెద" నని చెప్పును. వేఱొండు మాటనండు. అని రాముండు లక్ష్మణునితోం జెప్పెను. ౧౮

రామహితంబుకొఱకే యన్నిమాటలుం జెప్పినట్టి లక్ష్మణుండు రాముం డిట్లు చెప్పినమాటలను విని యంత లజ్జితుండై తలవంచుకొని యుండెను. ౧౯

లక్ష్మణుండు రామునిమాటను విని లజ్జితుండై ప్రస్తావంబు దప్పింపందలంచి "మనతండ్రి దశరథుండే నిన్నుం జూచుటకై యిచ్చటికి వచ్చుచున్నాండు" అని తలంచెదను అని చెప్పెను. ౨౦

రాముండు లక్ష్మణుండు లజ్జనొందినాండని యెఱింగి యిట్లనిచెప్పెను.

మహాబాహుండగు నీదశరథుండు మనలం జూచుటకై యిచ్చటికి వచ్చినాండని తలంచెదను. ౨౧

లేక దశరథుండు మనము సుఖం బనుభవింపందగినవార మనియుం, వనవాసంబు కష్టం బనియుం దలంచి మనల నింటికిం దీసికొనిపోవుటకై వచ్చి యుండునని తలంచెదను. ౨౨

శ్రీమంతుండగు నాతండ్రి దశరథుండు మిక్కిలియుం సుఖితురాలగు నీసీతాదేవినైనను అడవినుండి యింటికిం దోడ్కొని పోంగలండు. ౨౩

పరాక్రమశాలివగు లక్ష్మణుండా! మంచికులంబునం బుట్టినవియుం సుందరంబులును వాయువునకుంబోలె వేగంబుగలవియు నగు రాజోపవాహ్యంబులయిన యాయుత్తమాశ్వంబులు రెండును ఎంతయుం నొప్పుచున్నవి చూడుము.

మహాకాయంబు నత్యున్నతంబునగు నాయనగారి శత్రుంజయంబను పట్టపేనుంగును ఇదిగో సేనాముఖంబున వచ్చుచున్నది. ౨౫

మహాబాహుండవగు లక్ష్మణుండా! సమస్తజనపూజితంబును దివ్యంబు నగు నాయనగారి శ్వేతచ్ఛత్రము మాత్ర మగపడకున్నది; కావున నాయన విషయమందు నాకు సందేహము గలుగుచున్నది. ౨౬

వృక్షాగ్రా దవరోహ త్వం కురు లక్ష్మణ! మద్వచః,
ఇతీవ రామో ధర్మాత్మా సౌమిత్రిం త మువాచ హ. ౨౭
అవతీర్య తు సాలాగ్రా త్తస్మా త్స సమితింజయః,
లక్ష్మణః ప్రాఞ్జలి ర్భూత్వా తస్థౌ రామస్య పార్శ్వతః. ౨౮

భరతేనాపి సందిష్టా సమ్మర్దో న భవే దితి.
సమన్తా త్తస్య శైలస్య సేనా వాస మకల్పయత్. ౨౯
అధ్యర్ధ మిక్ష్వాకుచమూ ర్యోజనం పర్వతస్య సా,
పార్శ్వే న్యవిశ దావృత్య గజవాజిరథాకులా. ౩౦

సా చిత్రకూటే భరతేన సేనా
ధర్మం పురస్కృత్య విధూయ దర్పమ్,
ప్రసాదనార్థం రఘునన్దనస్య
విరాజతే నీతిమతా ప్రణీతా. ౩౧

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే సప్తనవతితమస్సర్గః.

## అష్టనవతితమస్సర్గః

నివేశ్య సేనాం తు విభుః పద్భ్యాం పాదవతాం వరః,
అభిగన్తుం స కాకుత్స్థ మియేష గురువర్తకమ్. ౧

నివిష్టమాత్రే సైన్యే తు యథోద్దేశం వినీతవత్,
భరతో భ్రాతరం వాక్యం శత్రుఘ్న మిద మబ్రవీత్. ౨

లక్ష్మణుఁడా! నీవు చెట్టుమీఁదనుండి దిగుము. నేను చెప్పినట్లువినుము. ధర్మస్వభావుఁడగు రాముఁడు లక్ష్మణునితో నీప్రకారమునం జెప్పెను.

శత్రుసైన్యంబుల జయించుటయందు సమర్థుఁడగు నాలక్ష్మణుఁడు అంతఁ జెట్టుమీఁదనుండి దిగి చేమోడ్పుగీలించి రాముని పార్శ్వభాగంబునం గొలిచియుండెను. ౨౮

రామాశ్రమంబునకు బాధగలుగఁగూడదని భరతుం డాజ్ఞాపించుటం జేసి యాసేన చిత్రకూటపర్వతముచుట్టును మండలాకారంబున విడిసెను. ౨౯

గజవాజిరథసంపూర్ణమగు నాయిక్ష్వాకుసైన్యము ఒకటియుం నూటామడ దూరము చిత్రకూటపర్వతపార్శ్వభాగమునందు మండలాకారంబున విడిసినది. ౩౦

ధర్మంబు నవలంబించి గర్వంబు వదలి రామునిఁ బ్రసన్నుంజేయుటకై వచ్చినట్టినీతిమంతుఁడగు భరతునిచేఁ దేఁబడిన సైన్యమంతయుఁ జిత్రకూటపర్వతమునకు సమీపంబునం బ్రకాశించుచుండినది. ౩౧

ఇది తొంబదియేడవసర్గము.

## తొంబదియెనిమిదవసర్గము

అట్టిపరమధార్మికుఁడగు రామునొద్దకు నడచిపోవు భాగ్యంబు గలుగుటచేఁ బాదంబులుగలవారలలో నుత్తముఁడగు నాభరతుఁడు సేనను విడియు నాజ్ఞాపించి యంతఁ బిత్రాజ్ఞానువర్తియగు రామునొద్దకుఁ బాదంబులతో నడచి పోఁగోరెను. ౧

అంత నయ్యోగ్యస్థలంబుల సేనవిడిసినవెనుక భరతుఁడు వినీతవేషధరుండయి తమ్ముని శత్రుఘ్నుం బిలిచి యీమాటం జెప్పెను. ౨

క్షిప్రం వన మిదం సౌమ్య! నరసంఘై స్సమంతతః,
లుబ్ధై శ్చ సహితై రేభిః త్వ మన్వేషి తు మర్హసి. ౩

గుహో జ్ఞాతిసహస్రేణ శరచాపాసిధారిణా,
సమన్వేషతు కాకుత్స్థా వస్మి న్పరివృత స్స్వయమ్. ౪

అమాత్యై స్సహ పౌరై శ్చ గురుభి శ్చ ద్విజాతిభిః,
వనం సర్వం చరిష్యామి పద్భ్యాం పరివృత స్స్వయమ్. ౫

యావ న్న రామం ద్రక్ష్యామి లక్ష్మణం వా మహాబలమ్,
వైదేహీం చ మహాభాగాం న మే శాన్తి ర్భవిష్యతి. ౬

యావ న్న చన్ద్రసంకాశం ద్రక్ష్యామి శుభ మాననమ్,
భ్రాతుః పద్మపలాశాక్షం న మే శాన్తి ర్భవిష్యతి. ౭

యావ న్న చరణౌ భ్రాతుః పార్థివవ్యఞ్జనాన్వితౌ,
శిరసా ధారయిష్యామి న మే శాన్తి ర్భవిష్యతి. ౮

యావ న్న రాజ్యే రాజ్యార్హః పితృపైతామహే స్థితః,
అభిషేకజలక్లిన్నో న మే శాన్తి ర్భవిష్యతి. ౯

సిద్ధార్థః ఖలు సౌమిత్రి ర్య శ్చన్ద్రవిమలోపమమ్,
ముఖం పశ్యతి రామస్య రాజీవాక్షం మహాద్యుతి. ౧౦

కృతకృత్యా మహాభాగా వైదేహీ జనకాత్మజా,
భర్తారం సాగరాన్తాయాః పృథివ్యా యాఽనుగచ్ఛతి. ౧౧

సుభగ శ్చిత్రకూటోఽసౌ గిరిరాజోపమో గిరిః,

సౌమ్యుఁడవగు భరతుఁడా! నీ విప్పుడు ఈబోయవాండ్రను భటుల
తోనుంగూడి శీఘ్రముగా నీవనంబంతయుం వెదకుము. ౩

గుహుఁడు ధనుర్బాణఖడ్గంబులం దాల్చిన బంధువుల వేవురంగూడి
యీచిత్రకూటపర్వతంబంతయు రామలక్ష్మణులను వెదకునుగాక! ౪

నేనును మంత్రులను పౌరులను గురువులను బ్రాహ్మణులనుంగూడి వనం
బంతయుఁ బాదంబులతోనే తిరిగెదను. ౫

రామునింగాని మహాబలుఁడగు లక్ష్మణునింగాని మహాభాగయగు సీతా
దేవినింగాని చూచువఱకు నాకు దుఃఖశాంతి గలుగదు. ౬

చంద్రబింబసమానంబును దామరపూఱేకులంబోలె విశాలసుందరంబు
లగు నేత్రంబులుగలదియుఁ సుందరంబునగు రాముని ముఖంబుఁ జూచువఱకు
నాకు దుఃఖశాంతి గలుగదు. ౭

వజ్రధ్వజారవిందాంకుశకలశాదిరాజలక్షణలక్షితంబులగు రాముని
పాదంబులను శిరసుపైధరించుకొనువఱకు నాకు దుఃఖశాంతి గలుగదు. ౮

రాజ్యార్హుఁడగు రాముఁడు పట్టాభిషేకజలముచేఁ దడుపఁబడి పితృపై
తామహంబగు రాజ్యంబు నవలంబించువఱకు నాకు దుఃఖశాంతిగలుగదు. ౯

నిర్మలంబగు చంద్రబింబముతో సమానంబును కమలంబులంబోలు
కండ్లుగలదియుఁ మహాతేజంబునగు రామునిముఖంబుఁ జూచుచున్నలక్ష్మణుం
డెంతయుఁ గృతార్థుఁడుగదా! ౧౦

సముద్రపర్యంతం బగు భూమికి నాథుఁడగు రాముని వెంబడిఁ బోవుట
చేత మహాభాగయుఁ జనకమహారాజపుత్రియునగు సీతాదేవి కృతార్థయయి
నది. ౧౧

కుబేరుఁడు నందనవనంబునందుంబోలె రాముఁ డీపర్వతంబునందు

యస్మిన్వసతి కాకుత్స్థః కుబేర ఇవ నన్దనే. ౧౨

కృతకార్య మిదం దుర్గం వనం వ్యాళనిషేవితమ్,
య దధ్యాస్తే మహాతేజా రామ శ్శస్త్రభృతాం వరః. ౧౩

ఏవ ముక్త్వా మహాతేజా భరతః పురుషర్షభః,
పద్భ్యా మేవ మహాబాహుః ప్రవివేశ మహ ద్వనమ్. ౧౪

స తాని ద్రుమజాలాని జాతాని గిరిసానుషు,
పుష్పితాగ్రాణి మధ్యేన జగామ వదతాం వరః. ౧౫
స గిరే శ్చిత్రకూటస్య సాల మాసాద్య పుష్పితమ్,
రామాశ్రమగతస్యాగ్నే ర్దదర్శ ధ్వజ ముచ్ఛ్రితమ్. ౧౬
తం దృష్ట్వా భరత శ్శ్రీమా న్ముమోహ సహ బాన్ధవః,
అత్ర రామ ఇతి జ్ఞాత్వా గతః పార మి వామ్భసః. ౧౭

స చిత్రకూటే తు గిరౌ నిశామ్య
రామాశ్రమం పుణ్యజనోపపన్నమ్,
గుహేన సార్ధం త్వరితో జగామ
పున ర్నివే శ్యైవ చమూం మహాత్మా. ౧౮

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డేఽష్టనవతితమస్సర్గః.

---

## ఏకోనశతతమస్సర్గః

నివిష్టాయాం తు సేనాయా ముత్సుకో భరత స్తదా,
జగామ భ్రాతరం ద్రష్టుం శత్రుఘ్న మనుదర్శయన్. ౧

వాసము సేయుచున్నాఁడు. కావున హిమవత్పర్వతసమానంబగు నీచిత్రకూటపర్వతంబును మిక్కిలియుం భాగ్యవంతంబు. ౧౨

మహాతేజుఁడును ఆయుధధారులలో నుత్తముఁడు నగు రాముఁడు వాసము సేయుచున్నాఁడు కావున దుష్టమృగాకీర్ణంబును దుర్గమంబునగు నీయరణ్యంబును కృతార్థము. అని భరతుఁడు శత్రుఘ్నునితోఁ జెప్పెను. ౧౩

మహాతేజుఁడును మహాబాహుఁడును బురుషశ్రేష్ఠుఁడునగు భరతుఁడు ఈప్రకారముగ శత్రుఘ్నునితోఁ జెప్పి యంతఁ బాదంబులతోనే యమ్మహారణ్యంబుఁ బ్రవేశించెను. ౧౪

మాటలం జెప్పుటయందు సమర్థుఁడగు భరతుఁడు పర్వతసానువులం దుండునట్టి పుష్పితాగ్రంబులగు వృక్షంబులనడుమం బోయెను. ౧౫

ఆభరతుఁడువోయి చిత్రకూటపర్వతమునందలి యొకపుష్పితవృక్షంబుఁ జేరఁగానే రామాశ్రమంబునందలి యగ్నిహోత్రంబుపొగ యగపడినది. ౧౬

శ్రీమంతుఁడగు భరతుఁడు ఆధూమముంజూచి 'రాముఁడిచ్చటనే యున్నాఁ' డని యెఱింగి బంధువులుం దాను సంతోషపరవశులైరి. అప్పుడు భరతుఁడు సముద్రంబునం బడినవాఁడు గట్టునకు వచ్చినట్లుండెను. ౧౭

మహాత్ముఁడగుభరతుఁడు చిత్రకూటపర్వతంబున సత్పురుషోపపన్నంబగు రాముని యాశ్రమంబుఁ జూచి రాముని వెదకవచ్చినసైనికులం గూడ నిలువ నియమించి గుహసహితుఁడై వేగంబునం బోయెను. ౧౮

ఇది తొంబదియెనిమిదవసర్గము.

## తొంబదితొమ్మిదవ సర్గము

అట్లు సైన్యమును విడియ నియమించినపిమ్మట భరతుఁడు రామదర్శనోత్సుకుఁడయి శత్రుఘ్నునకు రామాశ్రమచిహ్నంబులం జూపుచు రాముం జూచుటకై పోయెను. ౧

ఋషిం వసిష్ఠం సన్దిశ్య మాతౄ ర్మే శీఘ్ర మానయ,
ఇతి త్వరిత మగ్రే స జగామ గురువత్సలః. ౨
సుమన్త్ర స్త్వపి శత్రుఘ్న మదూరా దన్వపద్యత,
రామదర్శనజ స్తర్షో భరతస్యేవ తస్య చ. ౩
గచ్ఛన్నే వాథ భరత స్తాపసాలయసంస్థితామ్,
భ్రాతుః పర్ణకుటీం శ్రీమా నుటజం చ దదర్శహ. ౪

శాలాయా స్త్వగ్రత స్తస్యా దదర్శ భరత స్తదా,
కాష్ఠాని చావభగ్నాని పుష్పాణ్యుపచితాని చ. ౫

స లక్ష్మణస్య రామస్య దదర్శాఽఽశ్రమ మీయుషః,
కృతం వృక్షే ష్వభిజ్ఞానం కుశచీరైః క్వచి త్క్వచిత్. ౬

దదర్శ చ వనే తస్మి న్మహత స్సంచయా న్కృతాన్,
మృగాణాం మహిషాణాం చ కరీషై శ్శీతకారణాత్. ౭
గచ్ఛ న్నేవ మహాబాహు ర్ద్యుతిమా న్భరత స్తదా,
శత్రుఘ్నం చాబ్రవీ ద్ధృష్ట స్తా నమాత్యాం శ్చ సర్వశః. ౮

మన్యే ప్రాప్తాః స్మ తం దేశం భరద్వాజో య మబ్రవీత్,
నాతిదూరే హి మన్యేఽహం నదీం మన్దాకినీ మితః. ౯

ఉచ్చై ర్బద్ధాని చీరాణి లక్ష్మణేన భవే దయమ్,
అభిజ్ఞానకృతః పన్థా అకాలే గన్తు మిచ్ఛతా. ౧౦

గురుభక్తుఁడగు నాభరతుఁడు వసిష్ఠమహర్షిం జూచి "నీవు నాతల్లులం దీసికొనిరమ్ము" అని చెప్పి తాను ముందుగా వేగంబునం బోయెను. ౧

సుమంత్రుఁడును శత్రుఘ్నుని వెనువెంబడింబోయెను. రాముని జూడవలె ననుకోర్కి భరతశత్రుఘ్నులకుంబోలె వశనికిం గల్గియుండినది. ౨

అంత శ్రీమంతుఁడగుభరతుఁడు కొంతదూరము పోయి తాపసగృహమువలె నున్న రాముని పర్ణశాలను, చూడవచ్చినవారలతో సుఖముగాఁ గూర్చుండుటకై యేర్పఱుపఁబడిన పర్ణమంటపమునుం జూచెను. ౪

అప్పుడు భరతుఁడు ఆపర్ణశాలకుముందు రాత్రి మంటవేయుటకై సంపాదింపఁబడియున్నకట్టెలను బూజార్థమయి యుంచఁబడిన పుష్పంబులనుం జూచెను. ౫

భరతుఁడు మఱియు రామలక్ష్మణులు ఆశ్రమంబున మార్గంబు చక్కఁగాఁ దెలియుటకై యచ్చటచ్చట వృక్షములయందు దర్భలచేతను వల్కలంబులచేతను ఉంచుకొనిన గుఱుతులం జూచెను. ౬

ఆభరతుఁడు అచ్చట వనంబున శీతనివారణార్థమయి చేర్చిపెట్టియున్న మృగమహిషంబుల యెండినపేడకడుల గొప్పరాసులనుం జూచెను. ౭

అప్పుడు మహాబాహుఁడును గాంతిమంతుఁడు నగుభరతుఁడు పోవుచు వానినంతయుంజూచి సంతుష్టుఁడై శత్రుఘ్నుని అమంత్రుల నందఱనుంగూర్చి యిట్లని చెప్పెను. ౮

భరద్వాజమహర్షి చెప్పిన ప్రదేశమునకు వచ్చినామని తలంచుచున్నాను. మందాకినీనదిగూడ నిచ్చటికి సమీపంబుననె యున్నదని తోఁచుచున్నది. ౯

ఎందుకో నారచీరపేలికలను పైనివృక్షంబులం గట్టియున్నారు. ఇది లక్ష్మణుఁడు సాయంకాలాదిసమయములందు ఫలజలాద్యాహారణార్థమయిపోయి రావలసినప్పుడు దారి చక్కఁగాఁ దెలియుటకై గుఱుతులం బెట్టినమార్గముగా నుండును. కావున నీమార్గంబుననె పోయెదము. ౧౦

ఇదం చోదాత్తదన్తానాం కుఞ్జరాణాం తరస్వినామ్,
శైలపార్శ్వే పరిక్రాన్త మనేకశ్య మభిగర్జతామ్. ౧౧

యమేవాధాతు మిచ్ఛన్తి తాపసా స్సతతం వనే,
తస్యాసౌ దృశ్యతే ధూమ స్సఙ్కులఙ్ కృష్ణవర్త్మనః. ౧౨

అత్రాహం పురుషవ్యాఘ్రం గురుసంస్కారకారిణమ్,
ఆర్యం ద్రక్ష్యామి సంహృష్టో మహర్షి మివ రాఘవమ్. ౧౩

అథ గత్వా ముహూర్తన్తు చిత్రకూటం స రాఘవః,
మన్దాకినీ మనుప్రాప్త స్తం జనం చేద మబ్రవీత్. ౧౪
జగత్యాం పురుషవ్యాఘ్ర! ఆస్తే వీరాసనే రతః,
జనేన్ద్రో నిర్జనం ప్రాప్య ధిఙ్మే జన్మ సజీవితమ్. ౧౫

మత్కృతే వ్యసనం ప్రాప్తో లోకనాథో మహాద్యుతిః,
సర్వా న్కామా న్పరిత్యజ్య వనే వసతి రాఘవః. ౧౬
ఇతి లోకసమాక్రుష్టః పాదే ష్వద్య ప్రసాదయన్,
రామస్య నిపతిష్యామి సీతాయా లక్ష్మణస్య చ. ౧౭

ఏవం సంవిలపం స్తస్మి న్వనే దశరథాత్మజః,
దదర్శ మహతీం పుణ్యాం పర్ణశాలాం మనోరమామ్. ౧౮
సాలతాలాశ్వకర్ణానాం పర్ణైర్బహుభి రావృతామ్,
విశాలాం మృదుభి స్తీర్ణాం కుశై ర్వేది మి వాధ్వరే. ౧౯
శక్రాయుధనికాశై శ్చ కార్ముకై ర్భారసాధనైః,

ఇచ్చట బలవంతంబులగు నేనుంగులు కోపంబునఁ బరస్పరము మహా దంతంబులం బొడుచుకొనుచు గర్జించుచు సంరంభంబున సంచరించినవని గుఱుతులచేఁ దెలియవచ్చుచున్నది. ౧౧

అడవియందు ఋషులు హోమార్థమయి ఎల్లప్పుడును దేనిం గాపాడుచుందురో అట్టి యగ్నిహోత్రమునుండి దట్టమయినపొగ వెడలివచ్చుచున్నది. చూడుము. ౧౨

ఈయాశ్రమమునందే యుత్తమోపదేశంబులు సేయు మహర్షివలె నున్నపురుషశ్రేష్ఠుఁడును బూజ్యుఁడునగు రాముని బరమసంతోషంబునం జూడఁగలను. అని భరతుఁడు శత్రుఘ్నాదులతోఁ జెప్పెను. ౧౩

అంత నాభరతుఁడు మఱికొంతదూరము పోయి మందాకినీనదిం బొంది యాశత్రుఘ్నాదులం జూచి యిట్లని చెప్పెను. ౧౪

జనాధిపుఁడును బురుషశ్రేష్ఠుఁడునగు రాముఁడు నిర్జనంబగు వనము నొంది నేలపై వీరాసనంబునఁ గూర్చుండియున్నాఁడే! ఇంక నాప్రాణంబును జన్మంబును ఎందుకు! ౧౫

లోకనాథుఁడును గాంతిమంతుఁడు నగురాముఁడు నానిమిత్తమయి మహాకష్టముం బొంది సమస్తకామంబుల విడిచి యరణ్యంబున నున్నాఁడే !.

ఇట్లు నానావిధంబుగా లోకులచేనిందింపఁబడుచున్న నేను రామునిఁ బ్రసన్నుం జేయుటకై రాముని పాదంబులకును సీతాదేవిపాదంబులకును లక్ష్మణుండు విఘ్నము సేయకున్నేని యతని పాదములకును నమస్కారములం జేసెదను. ౧౬

దశరథమహారాజపుత్త్రుఁడగు భరతుఁడు అట్లు వనంబుల విలపించుచు మద్ది యినుమద్ది తాటిచెట్ల పత్త్రంబులచేఁ గప్పఁబడినదియు, విశాలంబును యాగవేదికయుంబోలె మృదుదర్భలచే నాస్తీర్ణంబును ఇంద్రాయుధంబులకు సరివచ్చునవియు, నూఱుపలముల యెత్తుగలవియు బంగారముతోఁ బూయఁబడిన పృష్ఠప్రదేశంబులుగలవియు, మహాసారంబులు శత్రుబాధకంబులునగు నుత్తమధనుస్సులచే నొప్పుచున్నదియు, ప్రదీప్తవదనంబులును సూర్యకిరణం

రుక్మపృష్ఠై ర్మహాసారై శ్శోభితాం శత్రుబాధకైః. ౨౦

అర్కరశ్మిప్రతీకాశై ర్ఘోరైస్తూణీగతై శ్శరైః,
శోభితాం దీప్తవదనై స్సర్పై ర్భోగవతీ మివ. ౨౧

మహారజతవాసోభ్యా మసిభ్యాం చ విరాజితామ్,
రుక్మబిన్దువిచిత్రాభ్యాం చర్మభ్యాం చాపి శోభితామ్. ౨౨

గోధాఙ్గులిత్రై రాసక్తై శ్చిత్రైః కాఞ్చనభూషితైః,
అరిసంఘై రనాధృష్యాం మృగై స్సింహగుహా మివ. ౨౩

ప్రాగుదక్ప్రవణాం వేదిం విశాలాం దీప్తపావకామ్,
దదర్శ భరత స్తత్ర పుణ్యాం రామనివేశనే. ౨౪

నిరీక్ష్య స ముహూర్తం తు దదర్శ భరతో గురుమ్,
ఉటజే రామ మాసీనం జటామణ్డలధారిణమ్. ౨౫

తం తు కృష్ణాజినధరం చీరవల్కలవాససమ్,
దదర్శ రామ మాసీన మభితః పావకోపమమ్. ౨౬

సింహస్కన్ధం మహాబాహుం పుణ్డరీకనిభేక్షణమ్,
పృథివ్యా స్సాగరాన్తాయా భర్తారం ధర్మచారిణమ్. ౨౭

ఉపవిష్టం మహాబాహుం బ్రహ్మాణ మివ శాశ్వతమ్,
స్థణ్డిలే దర్భసంస్తీర్ణే సీతయా లక్ష్మణేన చ. ౨౮

తం దృష్ట్వా భరత శ్శ్రీమాన్ దుఃఖశోకపరిప్లుతః,
అభ్యధావత ధర్మాత్మా

బులుంబోలె వెలుంగుచున్నవియునగు తూణీరగతంబులయిన బాణంబులచే సర్పంబులచే భోగవతికైవడి నెంతయుం గ్రాలుచున్నదియుం, బంగారుతోఁ జేయఁబడిన యొరలుగల దివ్యఖడ్గంబులతోఁ గూడినదియుం, నలంకారార్థమై యచ్చటచ్చట బంగారముచే నలంకరింపఁబడియున్న డాలువాలులచే భూషింపఁ బడినదియుం, సువర్ణశోభితంబులయిన యల్లెత్రాటిదెబ్బ దగులకుండుటకై చేతికిఁ గట్టుకొనునట్టి యుడుముతోలుతోఁ జేయఁబడిన కవచంబులతోను అంగుళికవ చంబులతోనుం గూడినదియుం, మృగంబులకు సింహగుహయుంబోలె శత్రు సంఘంబులకుం జొరరానిదియుఁ బవిత్రంబును మనోహరంబునగు పర్ణశాలం జూచెను. ౧౮-౨౩

భరతుఁ డాపర్ణశాలయందు విశాలంబును మండుచున్నయగ్నిహోత్రము గలదియుఁ బుణ్యంబును ఈశాన్యభాగంబునందుఁ బల్లమయినదియునగు నగ్ని వేదికం జూచెను. ౨౪

అంత నాభరతుఁడు నాలుగుప్రక్కలం జూచి పర్ణశాలయందుఁ గూర్చుండియుండిన జటామండలధరుండగు తనయన్నను రాముం గనెను. ౨౫

సింహంబులకుంబోలె నున్నతంబులగు భుజశిఖరంబులు గలవాఁడును మహాబాహుఁడును బుండరీకములుంబోలె విశాలసుందరంబులగు కన్నులుగల వాఁడును అట్లు మహాచక్రవర్తిచిహ్నంబులతోఁ గూడినవాఁడయ్యు సమస్త భూమండలంబునకును నాయకుఁడు గాఁదగినవాఁడయ్యు ధర్మంబు నాచరించు టకై జటామండలధరుఁడై నారచీరం గట్టుకొని కృష్ణాజినంబు నుత్తరీయంబు గాఁదాల్చి దర్భాస్తీర్ణంబగు నేలపై లక్ష్మణుఁడు గొలువ శాశ్వతుండగు బ్రహ్మ దేవుఁడుంబోలె సీతతోఁగూడ వీరాసనంబునం గూర్చుండి మహాతపం బాచ రించుచున్నవాఁడును అగ్నిహోత్రుఁడుంబోలె నెట్టివారికిని నలవిగానివాఁడు నగు రాముని భరతుఁడు సందర్శించెను. ౨౬-౨౮

ధర్మాత్ముఁడును శ్రీమంతుఁడు నగుభరతుఁడు అట్టి రాముంజూచి పరమ దుఃఖితుఁడై యతనియొద్దకుఁ బరుగెత్తిపోయెను.

భరతః కైకయీసుతః. ౨౯

దృష్ట్వైవ విలలాపార్తో బాష్పసన్దిగ్ధయా గిరా,
అశక్నువన్ ధారయితుం ధైర్యా ద్వచన మబ్రవీత్. ౩౦

య స్సంసది ప్రకృతిభి ర్భవే ద్యుక్త ఉపాసితుమ్,
వన్యై ర్మృగై రుపాసీన స్సోఽయ మా స్తే మమాగ్రజః. ౩౧

వాసోభి ర్బహుసాహస్రై ర్యో మహాత్మా పురోచితః,
మృగాజినే సోఽయ మిహ ప్రవ స్తే ధర్మమాచరన్. ౩౨

అధారయ ద్యో వివిధా శ్చిత్రా స్సుమనస స్సదా,
సోఽయం జటాభార మిమం వహతే రాఘవః కథమ్. ౩౩

యస్య యజ్ఞై ర్యథోద్దిష్టై ర్యుక్తో ధర్మస్య సంచయః,
శరీరక్లేశసంభూతం సధర్మం పరిమార్గతే. ౩౪

చన్దనేన మహార్హేణ యస్యాఙ్గ ముపసేవితమ్,
మలేన త స్యాఙ్గ మిదం కథ మార్యస్య సేవ్యతే. ౩౫

మన్నిమి త్త మిదం దుఃఖం ప్రాప్తో రామ స్సుఖోచితః,
ధి గ్జీవితం నృశంసస్య మమ లోకవిగర్హితమ్. ౩౬

ఇత్యేవం విలప న్దీనః ప్రస్విన్నముఖపఙ్కజః,
పాదా వప్రాప్య రామస్య పపాత భరతో రుదన్. ౩౭

దుఃఖాభితప్తో భరతో రాజపుత్రో మహాబలః,

కైకేయికొడుకైన భరతుఁడు రాముఁడుండువిధంబును జూచినంతనె పరమదుఃఖితుఁడై దుఃఖంబు నణఁచుకొనంజాలక యెట్టకేలకుఁ గొంతధైర్యంబు నవలంబించి దుఃఖమున మాటలు దొట్రుపడ నీమాటం జెప్పెను. ౨౯,౩౦

సభయందు యోగ్యులగు సభికులచే సేవింపఁదగినట్టి నాయన్నయీ రాముఁ డిప్పుడు అడవియందలి మృగంబులచే సేవింపఁబడుచున్నాఁడు! ౩౧

ఏమహాత్ముఁడు మున్ను మిక్కిలివెలగలయుత్తమవస్త్రంబులకుం దగియుండెనో అట్టిరాముఁ డిప్పుడు ధర్మము నాచరించుటకై కృష్ణాజినంబులం దాల్చియున్నాఁడు! ౩౨

ఎవ్వఁడు మున్ను నానావిధంబులగు నుత్తమపుష్పంబుల శిరస్సునందు ముడుచుకొనుచుండెనో అట్టిరాముఁ డిప్పుడు జటాభారంబు ధరించుచున్నాఁడేల! ౩౩

నానావిధయాగంబులు యథావిధిం గావించుటచే ధర్మసంగ్రహంబు చేయఁదగినట్టి రాముఁ డిప్పుడు వానప్రస్థులుంబోలె శరీరక్లేశంబుచే ధర్మంబు నాచరించుచున్నాఁడు! ౩౪

ఎవ్వనిదేహము నిరంతరమును ఉత్తమంబగుచందనముచే నొప్పుచుండె నదో అట్టిపూజ్యుఁడగు రామునిశరీర మిప్పుడు మంటితోఁ గూడియున్నదేల? ౩౫

సుఖార్హుఁడగు రాముఁడు నానిమిత్తమయి యిట్టిమహాదుఃఖముఁ బొందినాఁడు; కావున నిట్లు సమస్తజనులచేతను నిందింపఁబడుచున్న నాప్రాణంబుండి యేమిప్రయోజనము? అని భరతుఁడు విలపించెను. ౩౬

భరతుఁడు దుఃఖితుఁడై ముఖకమలంబునం జెమటగార నిట్లు రోదనంబు సేయుచు కన్నీళ్లు గాఱుటం జేసి రామునిపాదంబులం గానక నేలంబడెను. ౩౭

మహాబలుఁడును రాజకొమరుఁడు నగుభరతుఁడు పరమదుఃఖితుఁ

ఉక్త్వాఽఽర్యేతి సకృద్దీనం పునర్నోవాచ కించన. ౩౮

బాష్పాపిహితకణ్ఠశ్చ ప్రేక్ష్య రామం యశస్వినమ్,
ఆర్యేత్యేవాథ సంక్రుశ్య వ్యాహర్తుం నాశక త్తదా. ౩౯

శత్రుఘ్నశ్చాపి రామస్య వవన్దే చరణౌ రుదన్,
తా వుభౌ స సమాలిఙ్గ్య రామోఽప్యశ్రూ ణ్యవ ర్తయత్. ౪౦

తత స్సుమన్త్రేణ గుహేన చైవ
సమీయతూ రాజసుతావరణ్యే,
దివాకరశ్చైవ నిశాకరశ్చ
యథాఽమ్బరే శుక్రబృహస్పతిభ్యామ్. ౪౧
తా న్పార్థివా న్వారణయూథపాభా
న్సమాగతాం స్తత్ర మహత్యరణ్యే,
వనౌకస స్తేఽపి సమీక్ష్య సర్వేఽ
ప్యశ్రూ ణ్యముఞ్చ న్ప్రవిహాయ హర్షమ్. ౪౨
ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే ఏకోనశతతమస్సర్గః.

## శ త త మ స్స ర్గః

జటిలం చీరవసనం ప్రాఞ్జలిం పతితం భువి,
దదర్శ రామో దుర్దర్శం యుగాన్తే భాస్కరం యథా. ౧

కథంచి దభివిజ్ఞాయ వివర్ణవదనం కృశమ్,
భ్రాతరం భరతం రామః పరిజగ్రాహ బాహునా.

దగుటవలన "ఆర్యుఁడా" అని యొక్కమాటు చెప్పి యంత నేమియుం బలుకం
జాలక యూరకుండెను. ౩౮

అప్పుడు భరతుఁడు కీర్తిశాలియగు రాముం జూచి "భ్రాతుఁడా!"
అని యొక్కమాటు పిలిచి యంత దుఃఖాతిశయంబునం జేసి యటుపై
మాటాడం జాలఁడయ్యె. ౩౯

శత్రుఘ్నుఁడును రోదనంబుసేయుచు రామునిపాదంబులకు నమస్క-
రించెను. రాముఁడు భరతశత్రుఘ్నుల నిర్వురను గవుఁగిలించికొని కన్నీళ్లు
విడిచెను. ౪౦

అంత నరణ్యంబున రామలక్ష్మణులు చంద్రసూర్యులు బృహస్పతితోను
శుక్రునితోనుం జేరునట్లు సుమంత్రునితోను గుహునితోనుం జేరిరి. ౪౧

అచ్చట నరణ్యంబునందు ఋషు లందఱు ఆశ్రమారణ్యంబునందుఁ
గలిసిన రాజపుత్రులస్థితిం జూచి సంతోషంబు విడిచి పరమదుఃఖితులయి
కన్నీళ్లు గార్చిరి. ౪౨

ఇది తొంబదితొమ్మిదవసర్గము.

---

## నూఱవసర్గము

శాకచీరలుగట్టుకొని జటలుధరించి ప్రళయకాలంబునందలి సూర్యుఁ
డుంబోలె దుర్దర్శుండై చేమోడ్పు గీలించి నేలం బడినభరతుని రాముఁడు
చూచెను. ౧

అంత రాముఁడు వివర్ణముఖుఁడును బరమకృశుండు నగు భరతునిం
గొంతవడికి గుఱుతుపట్టి బాహువులం గ్రుచ్చి లేవనెత్తెను.

ఆఘ్రాయ రామ స్తం మూర్ధ్ని పరిష్వజ్య చ రాఘవః,
అఙ్కే భరత మారోప్య పర్యపృచ్ఛ త్సమాహితః. ౩
క్వను తేఽభూ త్పితా తాత! య దరణ్యం త్వ మాగతః,
నహి త్వం జీవత స్తస్య వన మాగన్తు మర్హసి. ౪

చిరస్య బత పశ్యామి దూరా ద్భరత మాగతమ్,
దుష్ప్రతీక మరణ్యేఽస్మిన్ కిం తాత! వన మాగతః. ౫

కచ్చి ద్ధారయతే తాత! రాజా య త్త్వ మిహాఽఽగతః,

కచ్చి న్న దీన స్సహసా రాజా లోకా న్తరం గతః. ౬
కచ్చి త్సౌమ్య! న తే రాజ్యం భ్రష్టం బాలస్య శాశ్వతమ్,

కచ్చి చ్ఛుశ్రూషసే తాత! పితరం సత్యవిక్రమమ్. ౭

కచ్చి ద్దశరథో రాజా కుశలీ సత్యసఙ్గరః,
రాజసూయాశ్వమేధానా మాహర్తా ధర్మనిశ్చయః. ౮

స కచ్చి ద్బ్రాహ్మణో విద్వాన్ ధర్మనిత్యో మహాద్యుతిః,
ఇక్ష్వాకూణా ముపాధ్యాయో యథావత్తాత! పూజ్యతే. ౯

సా తాత కచ్చి త్కౌసల్యా సుమిత్రా చ ప్రజావతీ,
సుఖినీ కచ్చి దార్యా సా దేవీ నన్దతి కైకయీ. ౧౦

రఘువంశమునందుఁబుట్టినట్టి రాముఁడు భరతుని శిరంబున మూర్కొని కవుఁగిలించికొని తొడపైఁ గూర్చుండఁజేసి సమాహితుఁడై యిట్లని యడిగెను.

నాయనా ! నీ వడవికి వచ్చినావే ! నీతండ్రి దశరథమహారాజెచ్చటికిఁ బోయినాఁడు? అతఁడు బ్రతికియుండఁగా నీవు అడవికి రాఁగూడదు గదా ! ౪

బహుకాలమునకుఁగా బహుదూరంబునఁ గేకయనగరంబునుండి వచ్చిన భరతుం జూడఁగంటిని; సంతోషము; దేహము చాలామారియుండుటచే గురుతుపట్టుట కష్టముగా నున్నది. నాయనా ! అడవికేల వచ్చినావు ? ౫

నాయనా ! నీవిచ్చటికివచ్చితివే ! దశరథమహారాజు బ్రతికియుండు నేని నిన్ను వదలఁడే ! ఇప్పుడు జీవించి యున్నాఁడాయేమి ?

దశరథమహారాజు దుఃఖంబున మృతుండు గాకయున్నాఁడాయేమి ?

సౌమ్యుఁడవగు భరతుఁడా ! నీవు బాలుండవుగానున్నావు కావున అశక్తిచే శాశ్వతంబగు నీరాజ్యము నష్టమయినదాయేమి ?

నాయనా ! సత్యపరాక్రముఁడగు తండ్రియయిన దశరథమహారాజు నను శుశ్రూషసేయుచున్నావాయేమి ? ౭

సత్యప్రతిజ్ఞుండును పెక్కురాజసూయాశ్వమేధ మహాయాగంబులు గావించినవాఁడునుఁ బరమధార్మికుండునగు దశరథమహారాజు క్షేమముగా నున్నవాఁడాయేమి ? ౮

నాయనా ! బ్రహ్మవేత్తయుఁ బండితుఁడును బరమధార్మికుఁడును అధికమయిన బ్రహ్మవర్చస్సుగలవాఁడును ఇక్ష్వాకువంశంబునం బుట్టినవారలకుఁ గులగురుండు నగువసిష్ఠమహామునిని మునుపటివలెఁ బూజించుచున్నావాయేమి ? ౯

నాయనా! దుఃఖితయగుకౌసల్య సుఖముగా నున్నదాయేమి? సత్పుత్రయగు సుమిత్ర సుఖముగా నున్నదా ? క్రూరాల్యరాలును రాణియునగుకైకేయి సంతోషంబున నున్నదాయేమి ? ౧౦

కచ్చి ద్వినయసమ్పన్నః కులపుత్రో బహుశ్రుతః,
అనసూయు రనుద్రష్టా సత్కృత స్తే పురోహితః. ౧౧

కచ్చి దగ్నిషు తే యుక్తో విధిజ్ఞో మతిమా నృజుః,
హుతం చ హోష్యమాణం చ కాలే వేదయతే సదా. ౧౨

కచ్చి ద్దేవా న్పితౄ న్మాతౄ ర్గురూ న్పితృసమా నపి,
వృద్ధాం శ్చ తాత! వైద్యాంశ్చ బ్రాహ్మణాం శ్చాభిమన్యసే. ౧౩

ఇష్వస్త్రవరసమ్పన్న మర్థశాస్త్రవిశారదమ్,
సుధన్వాన ముపాధ్యాయం కచ్చి త్త్వం తాత! మన్యసే. ౧౪

కచ్చి దాత్మసమా శ్శూరా శ్శ్రుతవన్తో జితేన్ద్రియాః,
కులీనా శ్చేఙ్గితజ్ఞా శ్చ కృతా స్తే తాత! మన్త్రిణః. ౧౫

మన్త్రో విజయమూలం హి రాజ్ఞాం భవతి రాఘవ!,
సుసంవృతో మన్త్రధరై రమాత్యై శ్శాస్త్రకోవిదైః. ౧౬

కచ్చి న్నిద్రావశం నైషీః కచ్చి త్కాలే ప్రబుద్ధ్యసే,
కచ్చిచ్చాపరరాత్రేషు చిన్తయస్యర్థనైపుణమ్. ౧౭

కచ్చి న్మన్త్రయసే నైకః కచ్చి న్న బహుభి స్సహ,
కచ్చి త్తే మన్త్రితో మన్త్రో రాష్ట్రం న పరిధావతి. ౧౮

వినయవంతుఁడును సత్కుల ప్రసూతుఁడును విద్యావంతుఁడును అసూయలేనివాఁడును వసిష్ఠోపదిష్టంబులగు వర్థంబులం జక్కఁగాఁ దెలుపఁగలవాఁడును నీపురోహితుఁడునగు వసిష్ఠపుత్త్రుని సుయజ్ఞుం బూజించుచున్నావాయేమి ? ౧౧

శాస్త్రజ్ఞుఁడును బుద్ధిమంతుఁడును గపటంబులేనివాఁడును అగ్నిహోత్రములయందు నియుక్తుండయిన నీపురోహితుఁడు సుయజ్ఞుఁడు అయ్యైకాలంబుల హోమములు గావించినసంగతిని హోమముచేయవలసినదానిని నీకుఁ దెలుపుచున్నాఁడాయేమి ? ౧౨

నాయనా ! నీవు దేవతలను దండ్రులను దల్లులను గురువులను దండ్రితో సమానులగు జ్ఞాతులను ముసలివారలను బండితులను బ్రాహ్మణులను బూజించుచున్నావాయేమి ? ౧౩

నాయనా ! ఉత్తమబాణంబులును దివ్యాస్త్రంబులునుం గలవాఁడును నీతిశాస్త్రమునందుఁ బండితుండునగు సుధన్వుఁడను ధనుర్వేదాచార్యుని బహుమానించుచున్నావాయేమి ? ౧౪

నీకు సమానులును శూరులును విద్యావంతులును జితేంద్రియులును సత్కులప్రసూతులును ముఖంబు జూచినంతనె హృదయాభిప్రాయంబు నెఱుంగునట్టివారలు నగువారలు మంత్రులుగాఁ జేసికొంటివాయేమి ? ౧౫

భరతుఁడా ! నీతిశాస్త్రంబునఁ బండితులును ఆలోచనమును దాఁచువారలునగు మంత్రులతో బహురహస్యముగాఁ జేయఁబడు నాలోచనము రాజులకు జయంబు గల్గించును. ౧౬

నిద్రకు లోఁబడవుగదా ! యుక్తకాలంబున మేలుకొనుచున్నావుగదా ! మఱియుం నర్థరాత్రంబులందు నేకాంతంబునఁ గార్యంబులంగుఱించి యాలోచించుచున్నావాయేమి ? ౧౭

నీవు ఒక్కఁడవై యాలోచింపవుగదా? పెక్కుమందితో నాలోచింపవుగదా ? మఱియుం నీ వాలోచించినమంత్రము రాజ్యంబునం దెవ్వరికిని దెలియదుగదా ? ౧౮

కచ్చి దర్థం వినిశ్చిత్య లఘుమూలం మహోదయమ్,
క్షిప్ర మారభసే కర్తుం న దీర్ఘయసి రాఘవ!. ౧౯

కచ్చి త్తు సుకృతా న్యేవ కృతరూపాణి వా పునః,
విదు స్తే సర్వకార్యాణి న కర్తవ్యాని పార్థివాః. ౨౦

కచ్చి న్న తర్కై ర్యుక్త్యా వా యే చాప్యపరికీర్తితాః,
త్వయా వా తవ వాఽమాత్యై ర్బుధ్యతే తాత! మన్త్రితమ్.

కచ్చి త్సహస్రా న్మూర్ఖాణా మేక మిచ్ఛసి పణ్డితమ్,
పణ్డితో హ్యర్థకృచ్ఛ్రేషు కుర్యా న్నిశ్శ్రేయసం మహత్. ౨౨

సహస్రా ణ్యపి మూర్ఖాణాం య ద్యుపా స్తే మహీపతిః,
అథవా ప్యయుతా న్యేవ నా స్తి తేషు సహాయతా. ౨౩
ఏకో ఽప్యమాత్యో మేధావీ శూరో దక్షో విచక్షణః,
రాజానం రాజమాత్రం వా ప్రాపయే న్మహతీం శ్రియమ్. ౨౪

కచ్చి న్ముఖ్యా మహత్స్వేవ మధ్యమేషు చ మధ్యమాః,
జఘన్యా శ్చ జఘన్యేషు భృత్యాః కర్మసు యోజితాః. ౨౫

అమాత్యానుపధాతీతా న్పితృపైతామహాం శ్ఛుచీన్,
శ్రేష్ఠాం శ్ఛ్రేష్ఠేషు కచ్చి త్త్వం నియోజయసి కర్మసు. ౨౬

కచ్చి న్నోగ్రేణ దణ్డేన భృశ ముద్వేజిత ప్రజమ్,
రాష్ట్రం తవానుజాన న్తి మన్త్రిణః కైకయీసుత!. ౨౭

భరతుఁడా ! స్వల్పప్రయత్నంబుచేత సిద్ధించునదియు మహాఫలంబు గలదియు నగు కార్యంబు సేయ నిశ్చయించి శీఘ్రముగా దాని నారంభింతువు గదా ? ఆలస్యము సేయవుగదా ? ౧౯

సామంతులగు రాజులకు నీచక్కఁగాఁ జేయఁబడిన కార్యములుగాని కృతప్రాయములై ఫలోన్ముఖములగు కార్యములుగాని మాత్రమే తెలియును గదా ? నీవు చేయవలసిన కార్యములు ఎంతమాత్రము తెలియవుగదా ? ౨౦

నాయనా ! నీవుగాని నీమంత్రులుగాని యాలోచించినట్టిమంత్రమును ఇతరులు ఊహాలచేఁగాని యుక్తిచేఁగాని యితరములగు నింగితాదులచేఁగాని యెంతమాత్రము దెలిసికొనఁ జాలరుగదా ? ౨౧

నీవు వేయిమంది మూర్ఖులను విడిచియైనఁ బండితు నొక్కని సంపాదింతువుగదా ? సంకటము గల్గినప్పుడు పండితుఁడు మిక్కిలియు మేలుగావించును. ౨౨

రాజు, మూర్ఖులను వేనవేలుగానైనను, లేక పదివేలు పదివేలుగానైనను సంగ్రహించినను వారలవలన నెంతమాత్రము నుపయోగము లేదు. ౨౩

బుద్ధిమంతుఁడును శూరుఁడును విచారమునందు సమర్థుఁడును బండితుఁడు నగు మంత్రి యొక్కఁడున్నం జాలు. అతఁడు రాజునకుగాని రాజుతటివానికిఁగాని గొప్పయైశ్వర్యంబు గలిగించును. ౨౪

ఉత్తమభృత్యుల నుత్తమకార్యంబులందును మధ్యమభృత్యుల మధ్యమ కార్యంబులందును అధమభృత్యుల నధమకార్యంబులందును ఇట్లు క్రమముగా నియోగించుచున్నావాయేమి ? ౨౫

నీవు చక్కఁగాఁ బరీక్షింపఁబడినవారలును దండ్రితాతలనుండి క్రమముగా నున్నవారలును బరిశుద్ధులును నుత్తములు నగు మంత్రులను గొప్పగొప్ప కార్యంబులందు నియోగింతువాయేమి ? ౨౬

భరతుఁడా ! నీవు జనులకుఁ దీక్ష్ణమగు శిక్షలు చేయుచు రాజ్యంబును బీడించుచుండఁగా నీమంత్రులు నిన్ను నివారింతురుగదా ? ౨౭

కచ్చి త్త్వాం నావజానన్తి యాజకాః పతితం యథా,
ఉగ్రప్రతిగ్రహీతారం కామయాన మివ స్త్రియః. ౨౭

ఉపాయకుశలం వైద్యం భృత్యసందూషణే రతమ్,
శూర మైశ్వర్యకామం చ యో న హన్తి స వధ్యతే. ౨౮

కచ్చి ద్ధృష్ట శ్చ శూర శ్చ మతిమా న్ధృతిమా ఞ్ఛుచిః,
కులీన శ్చానురక్త శ్చ దక్షస్సేనాపతిః కృతః. 3౦

బలవన్త శ్చ కచ్చి త్తే ముఖ్యా యుద్ధవిశారదాః,
దృష్టాపదానా విక్రాన్తా స్త్వయా సత్కృత్య మానితాః. 3౧

కచ్చి ద్బలస్య భక్తం చ వేతనం చ యథోచితమ్,
సమ్ప్రాప్తకాలం దాతవ్యం దదాసి న విలమ్బసే. 3౨
కాలాతిక్రమణా చ్చైవ భక్తవేతనయో ర్భృతాః,
భర్తుః కుప్యన్తి దుష్యన్తి సోఽనర్థ స్సుమహా న్స్మృతః. 33

కచ్చిత్సర్వేఽనురక్తా స్త్వాం కులపుత్త్రాః ప్రధానతః,

దుర్దానములచే ద్రవ్యము సంపాదించి యాగముసేయ నిశ్చయించునట్టి పతితుని యాజకులు నిందించునట్లు, బలాత్కారముగా గ్రహించునట్టి కాముకుని స్త్రీలు దూషించునట్లు తీక్ష్ణములగు పన్నులు విధించి దానిచే ధనము సంపాదించునట్టి నిన్నుఁ బ్రజలు నిందింపకున్నారుగదా? ౨౮

సామాద్యుపాయంబులందు బండితుఁడును రాజనీతి చక్కఁగాఁ దెలిసినవాఁడును యోగ్యులగు నంతరంగభృత్యులపై లేనిదోషంబులు చెప్పి వారలఁ దొలఁగించుచుండువాఁడును శూరుఁడును బ్రభుత్వంబుఁ గోరువాఁడు నగు పురుషుని రాజువధింపకుండునేని అతఁడు రాజును దప్పక వధించును. అట్టి పురుషుఁడు నీయొద్ద లేఁడు గదా? ౨౯

నీవలనఁ బెక్కు సత్కారంబులంబొంది సంతుష్టుఁడైనవాఁడును వ్యవహారంబులందుఁ బ్రగల్భుఁడును శూరుఁడును ఆయాసమయంబులకుఁ దగినట్లు నానావిధవ్యూహంబులు గూర్పంజాలినవాఁడును ఆపత్కాలమునందు మిక్కిలియుం ధైర్యముగలవాఁడును స్వామివిషయమునయి యొంశమాత్రము కపటములేనివాఁడును సత్కులప్రసూతుఁడును నీయందధికానురాగంబు గలవాఁడును గార్యంబుల సమర్థుఁడు నగువాని సేనాపతిం గావించుకొంటివా యేమి? ౩౦

మహాబలశాలులును యుద్ధంబులందు సమర్థులును బెక్కుమార్లు రణరంగంబున విజయంబు గొని పేరు వహించినవారలును శూరులునగు ప్రధానవీరులను జక్కఁగా సమ్మానించుచున్నావా యేమి? ౩౧

సైనికులకు ఆయాకాలంబుల నియ్యవలసిన బత్తెమును సంబళమును యథాయోగ్యముగా జాగుసేయక యిచ్చుచున్నావుగదా? ౩౨

భటులు సంబళముచేతనే జీవించువారలు కావున బత్తెము సంబళము నివ్వవలసిన కాల మతిక్రమించినచోఁ బ్రభువుపైఁ గోపంబునొంది కీడుగావింపఁ జాతురు. అది మిక్కిలియుం గొప్పయనర్థము. ౩౩

ప్రధానభూతులగు క్షత్రియు లందఱు నీయందు బద్ధానురాగులై

కచ్చి త్ప్రాణినాం స్త వార్థేషు సన్త్యజన్తి సమాహితాః. 34

కచ్చి జ్జానపదో విద్వా న్దక్షిణః ప్రతిభానవాన్,
యథోక్తవాదీ దూత స్తే కృతో భరత! పణ్డితః. 35

కచ్చి దష్టాదశాన్యేషు స్వపక్షే దశపఞ్చ చ,
త్రిభిస్త్రిభి రవిజ్ఞాతై ర్వేత్సి తీర్థాని చారకైః. 36

కచ్చిద్వ్యపాస్తానహితా న్ప్రతియాతాంశ్చ సర్వదా,
దుర్బలా ననవజ్ఞాయ వర్తసే రిపుసూదన!. 37

కచ్చి న్న లోకాయతికా న్బ్రాహ్మణాం స్తాత! సేవసే,
అనర్థకుశలా హ్యేతే బాలాః పణ్డితమానినః. 38

ధర్మశాస్త్రేషు ముఖ్యేషు విద్యమానేషు దుర్బుధాః,
బుద్ధి మాన్వీక్షికీం ప్రాప్య నిరర్థం ప్రవదన్తి తే. 39

యున్నారా యేమి? వారలు మనఃపూర్తిగా నీకుఁగా దమప్రాణంబులు విడుదునంతటి భక్తిగలిగియున్నారా? ౩౪

భరతుఁడా! నీదేశంబుననే పుట్టినవాఁడును, బరాభిప్రాయంబు దెలిసికొనం జాలినవాఁడును, సమర్థుఁడును, నవనవోన్మేషయుక్తంబగు నధికబుద్ధిగలవాఁడును, తనకుఁ జెప్పిపంపినమాటలను విడువక చెప్పువాఁడును, యుక్తాయుక్తంబులు దెలిసినవాఁడు నగు పురుషుని దూతగాఁ జేసికొంటివిగదా? ౩౫

నీవు నీశత్రువులలోఁ జేరిన మంత్రులు పురోహితులు యువరాజులు సేనాపతి దౌవారికులు అంతర్వంశికులు కారాగారాధికృతులు ధనాధ్యక్షులు కార్యనియోజకులు ప్రాడ్వివాకులు సేనానాయకులు నగరాధ్యక్షులు కర్మాంతికులు సభాధికృతులు ధర్మాధికారులు దండపాలురు దుర్గపాలురు, రాష్ట్రాంతపాలకులు అను నీపదునెనిమిదితీర్థములకును ఒక్కొకనికిని ముగ్గురు ముగ్గురుచారుల నుంచి వారలుసేయు రహస్యప్రయత్నముల నన్నింటిని దెలిసికొనుచున్నావాయేమి? అట్లు నీరాజ్యంబునను ఎల్లప్పుడును నీసన్నిధానంబుననే యుండునట్టి మంత్రిపురోహిత యువరాజులు దక్కఁ దక్కిన పదునైదుతీర్థములను ప్రత్యేకప్రత్యేకముగా ముగ్గురుముగ్గురు చారులచేఁ జక్కఁగా విచారించుకొనుచున్నావుగదా? ౩౬

శత్రువులం జంపునట్టి భరతుఁడా! నీచేఁ దఱుమఁగొట్టఁబడిన శత్రువులు కొంతకాలమునకు మరల వచ్చినప్పుడు దుర్బలులని వారల నలక్ష్యము సేయక వారలవిషయమయి యెచ్చరికతో నుందువా యేమి? ౩౭

నాయనా! నాస్తికులగు బ్రాహ్మణులను సేవింపవుగదా? వీరలు అజ్ఞానులు. తమ కేమియుఁ దెలియకపోయినను బండితులమని గర్వించియుండు వారలు. దుర్బోధనలు చేసి ధర్మలోపము అధర్మాచరణము మొదలగు పెక్కనర్థములు గల్గింతురు. ౩౮

దుర్బుద్ధులగు నాస్తికులు ప్రధానములును సజ్జనాదరణీయములు నగు ధర్మశాస్త్రము లుండఁగా వానిని విడిచి కేవలశుష్కతర్కంబు నవలంబి నిష్ప్రయోజనములగు మాటలు చెప్పుదురు. ౩౯

వీరై రధ్యుషితాం పూర్వ మస్మాకం తాత! పూర్వకైః,
సత్యనామాం దృఢద్వారాం హ స్త్యశ్వరథసంకులామ్. ౪౦
బ్రాహ్మణైః క్షత్త్రియై ర్వైశ్యై స్స్వకర్మనిరతై స్సదా,
జితేన్ద్రియై ర్మహోత్సాహై ర్వృతామార్యై స్సహస్రశః. ౪౧
ప్రాసాదై ర్వివిధాకారై ర్వృతాం వైద్యజనాకులామ్,
కచ్చి త్సముదితాం స్ఫీతా మయోధ్యాం పరిరక్షసి. ౪౨

కచ్చిచ్చైత్యశతై ర్జుష్ట స్సునివిష్టజనాకులః,
దేవస్థానైః ప్రపాభి శ్చ తటాకై శ్చోపశోభితః. ౪౩
ప్రహృష్టనరనారీక స్సమాజోత్సవశోభితః,
సుకృష్టసీమా పశుమా న్హింసాభిః పరివర్జితః. ౪౪
అదేవమాతృకో రమ్యశ్శ్వాపదైః పరివర్జితః,
పరిత్యక్తో భయై స్సర్వైః ఖనిభి శ్చోపశోభితః. ౪౫
వివర్జితో నరైః పాపై ర్మమ పూర్వై స్సురక్షితః,
కచ్చి జ్జనపద స్స్ఫీతః సుఖం వసతి రాఘవ!. ౪౬

కచ్చి త్తే దయితా స్సర్వే కృషిగోరక్షజీవినః,
వార్తాయాం సంశ్రిత స్తాత! లోకో హి సుఖ మేధతే. ౪౭

తేషాం గుప్తిపరీహారైః కచ్చి త్తే భరణం కృతమ్,
రక్ష్యా హి రాజ్ఞా ధర్మేణ సర్వే విషయవాసినః. ౪౮

కచ్చిత్ స్త్రియ స్సాన్త్వయసి కచ్చి త్తాశ్చ సురక్షితాః,

నాయనా! మహాపరాక్రమశాలులగు మన పూర్వీకులచేఁ బరిపాలింపఁబడినదియు, యథార్థమయిన యయోధ్యయను పేరుగలదియు, దృఢంబులగు బహిరంతర్ద్వారంబులుగలదియు, గజహయములచే సంపూర్ణంబును స్వకర్మనిరతులును జితేంద్రియులు నుత్సాహవంతులును బూజ్యులు నగు బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు పెక్కండ్రచే నిండియుండునదియు, నానావిధాకారంబులగు రాజగృహంబులచే నలంకృతంబును బండితజనులచే నిండినదియు, సంతుష్టులగు జనులుగలదియు, సమస్తసంపత్సమృద్ధంబు నగు నయోధ్యాపురిం బరిపాలించుచున్నావు గదా? ౪౦-౪౨

భరతుఁడా! అశ్వమేధాది మహాయాగంబులు చేయుటంజేసి వాని చిహ్నంబులతోఁగూడిన పెక్కుస్థలంబులు గలదియు సుప్రతిష్ఠితులగు జనులచే నిండినదియు దేవాలయప్రపాతటాకాదులచే నలంకృతంబును సంతుష్టులగు స్త్రీపురుషులు గలదియు సమాజోత్సవాలంకృతంబును జక్కఁగా దున్నఁబడిన భూమిగలదియు గోవృషభాదిపశుసంపన్నంబును హింసావర్జితంబును నదుల పాఱుదలచే సంపూర్ణసస్యంబును రమణీయంబును క్రూరమృగంబులు లేనిదియుఁ జోరాదిభయరహితంబులు, అమూల్యరత్నస్వర్ణాదిఖనిశోభితంబును బాపజనరహితంబును మనపూర్వీకులచే సురక్షితంబు నగు దేశంబాతయు సమృద్ధంబయి సుఖంబుగ నున్నదాయేమి? ౪౩-౪౭

నాయనా! కృషిగోరక్షణాదులచే జీవించునట్టి వైశ్యులందఱు నీకు అభిమతముగా నడుచుకొన్నారాయేమి? వారలు అనుకూలురై వర్తకము చేయుచుందురేని జనులకు సౌఖ్యము గలుగును. ౪౮

నీ వా వైశ్యులకు అభీష్టంబుల నొందించుచు అనిష్టంబుల నివారించుచు సౌఖ్యంబు సేయుచున్నావాయేమి? రాజు ధర్మంబునఁ దనదేశముననుండు జనుల నందఱను దప్పక రక్షింపవలయును. అందు విశేషించి వర్తకుల రక్షింపవలయును. ౪౯

అంతఃపురస్త్రీలను మంచిమాటలచే సంతోషింపఁజేయుచున్నావుగదా?

కచ్చి న్న శ్రద్దధాస్యాసాం కచ్చిద్గుహ్యం న భాషసే.

కచ్చి న్నాగవనం గుప్తం కచ్చి త్తే సంతి ధేనుకాః,
కచ్చి న్న గణికాశ్వానాం కుఞ్జరాణాం చ తృప్యసి.

కచ్చి ద్దర్శయసే నిత్యం మనుష్యాణాం విభూషితమ్,
ఉత్థాయోత్థాయ పూర్వాహ్ణే రాజపుత్త్ర! మహాపథే.

కచ్చి న్న సర్వే కర్మాన్తాః ప్రత్యక్షా స్తేఽవిశఙ్కయా,
సర్వే వా పున రుత్సృష్టా మధ్యమేవాత్ర కారణమ్.

కచ్చి త్సర్వాణి దుర్గాణి ధనధాన్యాయుధోదకైః,
యన్త్రైశ్చ పరిపూర్ణాని తథా శిల్పిధనుర్ధరైః.

ఆయ స్తే విపులః కచ్చి త్కచ్చి దల్పతరో వ్యయః,
అపాత్త్రేషు న తే కచ్చి త్కోశో గచ్ఛతి రాఘవ!.

దేవతార్థే చ పిత్ర్యర్థే బ్రాహ్మణాభ్యాగతేషు చ,
యోధేషు మిత్త్రవర్గేషు కచ్చి ద్గచ్ఛతి తే వ్యయః.
కచ్చి దార్యో విశుద్ధాత్మా క్షారిత శ్చోరకర్మణా,
అపృష్ట శ్శాస్త్రకుశలై ర్న లోభా ద్వధ్యతే శుచిః.

వారలకుఁ బరపురుషసంభాషణాదులు సంభవింపకుండునట్లు రక్షణము సేయుం
చున్నావుగదా? వారలమాటలను నమ్మవుగదా? వారలకు రహస్యమును జెప్పవు
గదా? ౪౯

ఏనుంగుల యుత్పత్తిస్థానమగు నరణ్యమునుఁ జక్కఁగా రక్షించుకొను
చున్నావుగదా? అడవియేనుంగులను వశీకరించునట్టి యాఁడేనుంగులు నీయొద్ద
నున్నవిగదా? మఱియు నాఁడేనుంగులను ఏనుంగులను గుఱ్ఱంబులను
సంగ్రహించుటయందుఁ దృప్తినొందవుగదా? ౫౦

రాచకొమరుఁడవగు భరతుఁడా! నీవు ప్రతిదినంబునందును బ్రాతః
కాలంబున లేచి యలంకృతుఁడవయి సభయందు జనులకు దర్శనం బొసంగుదువు
గదా? ౫౧

పనివాండ్రు నిన్నుఁ జూచుటకు భయపడుచుండురుగదా? వారలకు
కార్యహాని గలుగును గావున ఎంతమాత్రమును దర్శన మివ్వకయే యుండఁ
గూడదు ఎల్లప్పుడును దర్శనము నిచ్చుచుండిన నిర్భయులగుదురు గావున
నిదియుఁ గూడదు. కావునఁ, బనిపడినప్పుడు అరుదుగా దర్శన మివ్వవలెను.
అట్లు సేయుచుందువాయేమి? ౫౨

కోటలన్నియు ధనధాన్యజలంబులతోను నానావిధాయుధంబులతోను
యంత్రంబులతోను సంపూర్ణంబులయి శిల్పులచేతను ధనుర్ధరులచేతను నిండి
యున్నవిగదా? ౫౩

భరతుఁడా! నీవచ్చుబడి యధికముగా నున్నదిగదా? సెలవు మిక్కిలియుఁ
గొంచెముగాఁ జేయుచున్నావుగదా? నటవిటగాయకాదిదుష్టపాత్రములకు
ఎచ్చుగా ధనము నివ్వకుందువుగదా? ౫౪

నీ సెలవంతయును దేవతలు పితృదేవతలు బ్రాహ్మణులు అతిథులు
యోధులు మిత్రులు వీరికొఱకు వినియుక్తమగుచున్నదిగదా? ౫౫

పరిశుద్ధహృదయుఁడును గరణత్రయంబునను బరిశుద్ధుఁడు నగు ప్రాజ్ఞుఁ
డయిన పురుషునిమీఁద దొంగతనము మోపిదీసికొనివచ్చినప్పుడు అతనిఁ
బండితులచేత నడిగించి శోధింపక లంచమునందలి యాశచే వధింపవుగదా? ౫౬

గృహీత శ్చైవ పృష్ట శ్చ కాలే దృష్ట స్సకారణః,
కచ్చి న్న ముచ్యతే చోరో ధనలోభా న్నరర్షభ!. ౫౭

వ్యసనే కచ్చి దాఢ్యస్య దుర్గతస్య చ రాఘవ!,
అర్థం విరాగాః పశ్యన్తి తవామాత్యా బహుశ్రుతాః. ౫౮

యాని మిథ్యాభిశస్తానాం పత న్త్యస్రాణి రాఘవ!,
తాని పుత్రా న్పశూన్ఘ్నన్తి ప్రీత్యర్థ మనుశాసతః. ౫౯

కచ్చి ద్వృద్ధాం శ్చ బాలాం శ్చ వైద్యముఖ్యాం శ్చ రాఘవ!,
దానేన మనసా వాచా త్రిభిరేతై ర్బుభూషసే. ౬౦

కచ్చి ద్గురూం శ్చ వృద్ధాం శ్చ తాపసా న్దేవతాతిథీన్,
చైత్యాం శ్చ సర్వా న్సిద్ధార్థా న్బ్రాహ్మణాం శ్చ నమస్యసి. ౬౧
కచ్చి దర్థేన వా ధర్మ మర్థం ధర్మేణ వా పునః,
ఉభౌ వా ప్రీతిలోభేన కామేన చ న బాధసే. ౬౨

కచ్చి దర్థం చ కామం చ ధర్మం చ జయతాం వర!,
విభజ్య కాలే కాలజ్ఞ! సర్వా న్వరద! సేవసే, ౬౩

కచ్చి త్తే బ్రాహ్మణా శ్శర్మ సర్వశాస్త్రార్థకోవిదాః,
ఆశంస న్తే మహాప్రాజ్ఞ! పౌరజానపదై స్సహ. ౬౪

పురుషశ్రేష్ఠుఁడవగు భరతుఁడా ! దొంగిలించుకొని పాఱిపోవునప్పుడు దొంగిలించిన ద్రవ్యముతోఁ బట్టుకొనఁబడి పండితులచే శోధింపఁబడి దొంగ యని నిశ్చయింపఁబడినవాని లంచము దీసుకొని విడువవుగదా ! ౫౭

భరతుఁడా ! బుద్ధిమంతులగు నీమంత్రులు, ధనికునకు దరిద్రునకును వ్యవహారము వచ్చినప్పుడు వారలవ్యవహారమును ధనాశ విడిచి నిష్పక్షపాతముగాఁ జూతురుగదా ? ౫౮

భరతుఁడా ! తప్పునేరము మోపఁబడినవారిని జక్కఁగా విచారింపక రాజు దండించునేని వారల కండ్లనుండి కాఱుకన్నీళ్లు, అట్లు అలక్ష్యముగాఁ దనమనస్సుంతోఁ ప్రకారము దండించునట్టి రాజుయొక్క కొడుకులను బశువులను అట్లు సమస్తసంపదలను నశింపఁజేయును. ౫౯

భరతుఁడా ! వృద్ధులను బాలురను బండితులను ధనరత్నాదుల నొసంగుట స్నేహముఁ జూపుట మంచిమాటలు చెప్పుట ఈ మూఁడుపాయంబులచేతను వశీకరించుకొందువా యేమి ? ౬౦

గురువులను వృద్ధులను దపస్సులను దేవతలను అతిథులను జతుష్పథవృక్షంబులను గర్మఠులగు బ్రాహ్మణులను నమస్కరింపుచుందువా యేమి ? ౬౧

ధర్మమును విడిచి యర్థమును మాత్రమె యార్జింపవుగదా ? అట్లు అర్థమునుమాత్ర మార్జింపుచు ధర్మార్జనంబు విడువవుగదా ? సుఖేచ్ఛచేఁ గాని కామేచ్ఛచేఁగాని ధర్మార్థంబుల రెంటిని విడువవుగదా ? ౬౨

జయశీలురలో నుత్తముఁడవు కాలజ్ఞుఁడవు వరప్రదుఁడవునగు భరతుఁడా! ధర్మార్థకామంబుల మూఁడింటిని విభజించి తత్తదుచితకాలంబును అనఁగాఁ బూర్వాహ్ణంబున ధర్మంబును, అపరాహ్ణంబున నర్థంబునను, సాయంకాలంబునఁ గామంబును సేవింపుచున్నావా యేమి ? ౬౩

మహాపండితుఁడవగు భరతుఁడా! సమస్తశాస్త్రవేత్తలగు బ్రాహ్మణులును, బట్టణంబులను గ్రామంబులను నివసించుజనులును నీసుఖంబు గోరుచుందురు గదా. ౬౪

నాస్తిక్య మనృతం క్రోధం ప్రమాదం దీర్ఘసూత్రతామ్,
అదర్శనం జ్ఞానవతా మాలస్యం పఞ్చవృత్తితామ్. ౬౫
ఏకచిన్తన మర్థానా మనర్థజ్ఞైశ్చ మన్త్రణమ్,
నిశ్చితానా మనారమ్భం మన్త్రస్యాపరిరక్షణమ్. ౬౬
మఙ్గళాద్యప్రయోగం చ ప్రత్యుత్థానం చ సర్వతః,
కచ్చిత్త్వం వర్జయస్యేతా న్రాజదోషాం శ్చతుర్దశ. ౬౭

దశపఞ్చచతుర్వర్గా న్సప్తవర్గం చ తత్త్వతః,
అష్టవర్గం త్రివర్గం చ విద్యా స్తిస్రశ్చ రాఘవ!. ౬౮
ఇన్ద్రియాణాం జయం బుద్ధ్వా షాడ్గుణ్యం దైవమానుషమ్,
కృత్యం వింశతివర్గం చ తథా ప్రకృతిమణ్డలమ్. ౬౯
యాత్రాదణ్డవిధానం చ ద్వియోనీ సన్ధివిగ్రహౌ,
కచ్చిదేతా న్మహాప్రాజ్ఞ! యథావ దనుమన్యసే. ౭౦
మన్త్రిభి స్త్వం యథోద్దిష్టై శ్చతుర్భి స్త్రిభి రేవ వా,
కచ్చి త్సమస్తై ర్వ్యస్తైశ్చ మన్త్రం మన్త్రయసే మిథః. ౭౧
కచ్చిత్తే సఫలా వేదాః కచ్చిత్తే సఫలాః క్రియాః,
కచ్చిత్తే సఫలా దారాః కచ్చిత్తే సఫలం శ్రుతమ్. ౭౨

కచ్చిదే షైవ తే బుద్ధి ర్యథోక్తా మమ రాఘవ!,
ఆయుష్యా చ యశస్యా చ ధర్మకామార్థసంహితా. ౭౩

నాస్తికత అబద్ధమాడుట మహాకోపము గలిగియుండుట ఏమఱి యుండుట యాలస్యముగాఁ బనిసేయుట జ్ఞానవంతుల లక్ష్యముసేయకుండుట మత్తత యింద్రియపరవశత మంత్రు లెందుకని తానొక్కఁడే కార్యంబుల నాలోచించుట యేమియుఁ దెలియనివారలతో నాలోచించుట యాలోచ నంబునఁ జేయ నిశ్చయింపఁబడినవాని నారంభింపకుండుట యాలోచితాంశమును బయలుపఱచుట ప్రాతఃకాలంబున నద్దంబుఁ జూచుట మొదలగు మంగళ ప్రయోగంబులఁ జేయకుండుట యేకకాలంబున సమస్తశత్రువులతోను యుద్ధంబు సేయుట యను పదునాల్గురాజదోషంబులు విడుతువాయేమి ? ౧౮

మహాపండితుఁడవగు భరతుఁడా ! నీవు దశవర్గమును పంచవర్గమును జతుర్వర్గంబును సప్తవర్గంబును అష్టవర్గంబును త్రివర్గంబును మూఁడువిద్యలను ఇంద్రియవశీకరణంబును, షడ్గుణంబులను దైవంబును మానుషంబును భేద కార్యంబును వింశతివర్గంబును బ్రకృతిమండలంబులను జక్కఁగాఁ దెలిసికొని విడువవలసినవానివిడిచి యంగీకరింపవలసినవాని నంగీకరింతువాయేమి! ౧౯,౨౦

నీవు శాస్త్రోక్త లక్షణలక్షితులగు మంత్రుల నలువురఁగాని ముప్వురఁ గాని యుంచుకొని రహస్యముగా నాలోచించి యంత వారలలో నొక్కొ కరితో నాలోచించి వారివారియభిప్రాయంబు దెలిసికొందువా యేమి ! ౨౧

నీ వధ్యయనించిన వేదములు అగ్నిహోత్రాద్యనుష్ఠానములచే సఫల ములుగా నున్నవాయేమి ? నీవు సంపాదించిన ధనములు దానభోగములచే సఫలములాయేమి ? నీభార్యలు రతిచేతను సంతానముచేతను సఫలలా యేమి ? నీవు విన్నశాస్త్రములు సత్స్వభావము సదాచారముఁ గలుగుటచే సఫలములు గా నున్నవాయేమి ? ౨౨

భరతుఁడా ! దీర్ఘాయుఃప్రదంబును యశస్కరంబును ధర్మకామార్థ ప్రదంబు నగు నిప్పుడు చెప్పఁబడిన బుద్ధి నా కుండునట్లు నీకు నున్నదా యేమి ? 23

యాం వృత్తిం వర్తతే తాతో యాం చ నః ప్రపితామహాః,
తాం వృత్తిం వర్తసే కచ్చి ద్యా చ సత్పథగా శుభా. ౭౪

కచ్చి త్స్వాదు కృతం భోజ్య మేకో నాశ్నాసి రాఘవ!,
కచ్చి దాశంసమానేభ్యో మిత్రేభ్య స్సమ్ప్రయచ్ఛసి. ౭౫
రాజా తు ధర్మేణ హి పాలయిత్వా
మహామతి ర్దణ్డధరః ప్రజానామ్,
అవాప్య కృత్స్నం వసుధాం యథావ
దిత శ్చ్యుత స్స్వర్గ ముపైతి విద్వాన్. ౭౬

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే శతతమస్సర్గః.

## ఏకోత్తరశతతమస్సర్గః

రామస్య వచనం శ్రుత్వా భరతః ప్రత్యువాచ హ,
కిం మే ధర్మా ద్విహీనస్య రాజధర్మః కరిష్యతి. ౧

శాశ్వతోఽయం సదా ధర్మః స్థితోఽస్మాసు నరర్షభ!,
జ్యేష్ఠపుత్రే స్థితే రాజ! న్న కనీయా న్నృపో భవేత్. ౨

స సమృద్ధాం మయా సార్ధ మయోధ్యాం గచ్ఛ రాఘవ!,
అభిషేచయ చాత్మానం కులస్యాస్య భవాయ నః. 3

రాజానం మానుషం ప్రాహు ర్దేవత్వే సమ్మతో మమ,
యస్య ధర్మార్థసహితం వృత్త మాహు రమానుషమ్. ౪

మనతండ్రి దశరథుఁడే వృత్తి నవలంబించియున్నాఁడో, మఱియు మన తాతముత్తాత లేవృత్తి నవలంబించి యుండిరో, ఏది సత్పూరుషయుక్తంబును అనిందితంబునై యుండునో అట్టివృత్తిని నీ వవలంబించియున్నావా యేమి ?

భరతుఁడా ! మధురాన్నమును నీ వొక్కఁడవే భుజింపవుగదా స్నేహితులకు అభీష్టంబుల నొసంగుచుందువుగదా ? 24

రాజు పండితుఁడై మహాబుద్ధిశాలియై ప్రజల శిక్షించుభారంబు వహించి యథాన్యాయముగా భూమిం బాలించునేని యతఁడు ఈ లోకంబున సమస్తభూనాథుఁడై సకలసుఖంబుల ననుభవించి యంతంబున స్వర్గంబు నొందును. అని రాముఁడు భరతునితోఁ జెప్పెను. 26

ఇది నూఱవసర్గము.

---

## నూటొక్కటవసర్గము

భరతుఁడు రాముని వచనమును విని త్వత్సేవారూపమైన పరమధర్మము నుండి విడువఁబడిన నాకు రాజ్యపరిపాలనరూపధర్మ మేమి చేయంగలదని చెప్పెను. 1

పురుషశ్రేష్ఠుఁడవగు రాముఁడా ! మన పూర్వీకులయందు శాశ్వతమైన ఈధర్మ మెల్లప్పుడు కలదు. రాజవగు రాముఁడా ! పెద్దకొడుకుండఁగా జిన్నకొడుకు రాజుగానుండుట లేదు. 2

రఘుకులతిలకుఁడవగు రాముఁడా! నాతోఁగూడ సర్వసంపత్సమృద్ధంబగు నయోధ్యాపట్టణమును బొంది మనవంశమునకు మంగళము గలుగుటకొఱకు నిన్నభిషేకించికొనుము. 3

దేవత్వప్రాపకంబగు తపశ్చరణంబు వదిలి రాజ్యాభిషేకమున నాకేమి పురుషార్థంబని శంకింపవలదు. తపశ్చరణము చేత క్లేశద్వారముగ దేవత్వము, రాజ్యపరిపాలనము చే భోగద్వారముగ దేవత్వము సిద్ధించుచున్నది. 4

కేకయస్థే చ మయి తు త్వయి చారణ్య మాశ్రితే,
దివ మార్యో గతో రాజా యాయజూక స్సతాం మతః. ౫

నిష్క్రాన్తమాత్రే భవతి ససీతే సహలక్ష్మణే,
దుఃఖశోకాభిభూత స్తు రాజా త్రిదివ మభ్యగాత్. ౬
ఉత్తిష్ఠ పురుషవ్యాఘ్ర క్రియతా ముదకం పితుః,
అహం చాయం చ శత్రుఘ్నః పూర్వ మేవ కృతోదకౌ. ౭

ప్రియేణ కిల దత్తం హి పితృలోకేషు రాఘవ!,
అక్షయ్యం భవతీత్యాహు ర్భవాం శ్చైవ పితుః ప్రియః. ౮

త్వామేవ శోచం స్తవ దర్శనేప్సు
స్త్వయ్యేవ సక్తా మనివ ర్త్య బుద్ధిమ్,
త్వయా విహీన స్తవ శోకరుగ్ణ
స్త్వాం సంస్మర న్నస్తమితః పితా తే. ౯
ఇతి శ్రీమదయోధ్యాకాణ్డ ఏకోత్తరశతతమస్సర్గః.

## ద్వ్యుత్తరశతతమస్సర్గః

తాం శ్రుత్వా కరుణాం వాచం పితు ర్మరణసంహితామ్,
రాఘవో భరతే నోక్తాం బభూవ గతచేతనః. ౧
తం తు వజ్ర మి వోత్సృష్ట మాహవే దానవారిణా,
వాగ్వజ్రం భరతే నోక్త మమనోజ్ఞం పర న్తపః. ౨
ప్రగృహ్య బాహూ రామో వై పుష్పితాగ్రో యథా ద్రుమః,

తండ్రి జీవించి యుండఁగా నా కెట్లు రాజ్యాభిషేకాధికారమని తలంతువేమో; నేను కేకయరాజు పట్టణంబుననుండఁగా నీ వరణ్యంబునకుఁ బోయినపిదప యా యజ్ఞాకుఁడును సత్పురుషులలో మేటియును బూజ్యుఁడునగు తండ్రి దశరథమహారాజు స్వర్గంబునొందెను. ౫

నీవు సీతాలక్ష్మణులంగూడి బయలు దేఱఁగానే దశరథమహారాజు దుఃఖశోకములచేఁ గొట్టువడినవాఁడై స్వర్గస్థుఁడాయెను. ౬

పురుషశ్రేష్ఠుఁడవగు రాముఁడా! నీవింక శీఘ్రంబుగా లేచి తండ్రికి జలతర్పణాదిక్రియలం గావింపుము. నేనును, నీశత్రుఘ్నుఁడును మును పె అంతయుఁ గావించినాము. ౭

రాముఁడా! తండ్రికి ప్రియుఁడగు పుత్రుఁడు చేసిన జలతర్పణాదులే పితృలోకంబున మహాఫలప్రదం బగునని పెద్దలు చెప్పుదురు గదా? అట్లు నీవు దశరథమహారాజునకు ప్రియపుత్రుఁడవు కాఁబట్టి శీఘ్రముగా నాయనకు నపరక్రియలం జేయుము. ౮

నీ తండ్రి దశరథమహారాజు నిన్ను విడిచి నీవిరహంబుసహింపఁ జాలక, నిన్నుంజూడం గోరుచు నిన్ను గుఱించియె దుఃఖించుచు, నీయందు నాటుకొన్న మనస్సును నివర్తింప నశక్తుఁడై పరమదుఃఖితుఁడై నిన్నే ధ్యానించుచు మృతిఁబొందెను. అని భరతుఁడు రామునితోఁ జెప్పెను. ౯

ఇది నూటొక్కటవ సర్గము.

---

## నూటరెండవసర్గము

రాముఁడు భరతుఁడు చెప్పిన పితృమరణవృత్తాంతమును విని పరమ దుఃఖితుఁడై దుఃఖంబు సహింపంజాలక మూర్ఛిల్లెను. ౧

శత్రువులం దపింపఁజేయునట్టి రాముఁడు, యుద్ధంబున దేవేంద్రునిచేఁ బ్రయోగింపఁబడిన వజ్రాయుధముంబోలె దుస్సహంబగు భరతుఁడు చెప్పిన దుఃఖవార్తను విని పరమదుఃఖితుఁడై చేతులు జోడించుకొని

వనే పరశునా కృత్త స్తథా భువి పపాత హ. ३

తథా నిపతితం రామం జగత్యాం జగతీపతిమ్,
కూలఘాతపరిశ్రాన్తం ప్రసుప్త మివ కుఞ్జరమ్. ४
భ్రాతర స్తే మహేష్వాసం సర్వత శ్శోకకర్శితమ్,
రుద న్త స్సహ వైదేహ్యా సిషిచు స్సలిలేన వై. ५

స తు సంజ్ఞాం పున ర్లబ్ధ్వా నేత్రాభ్యా మస్ర ముత్సృజన్,
ఉపాక్రామత కాకుత్స్థః కృపణం బహు భాషితుమ్. ६
స రామ స్స్వ ర్గతం శ్రుత్వా పితరం పృథివీపతిమ్,
ఉవాచ భరతం వాక్యం ధర్మాత్మా ధర్మసంహితమ్. ७
కిం కరిష్యామ్య యోధ్యాయాం తాతే దిష్టాం గతిం గతే,
క స్తాం రాజవరా ద్ధీనా మయోధ్యాం పాలయిష్యతి. ८

కిం ను తస్య మయా కార్యం దుర్జాతేన మహాత్మనః,
యో మృతో మమ శోకేన మయా చాపి న సంస్కృతః. ९

అహో భరత! సిద్ధార్థో యేన రాజా త్వయాఽనఘ!,
శత్రుఘ్నేన చ సర్వేషు ప్రేతకృత్యేషు సత్కృతః. ౧౦

నిష్ప్రధానా మనేకాగ్రాం నరేన్ద్రేణ వినాకృతామ్,
నివృత్తవనవాసోఽపి నాయోధ్యాం గన్తు ముత్సహే. ౧౧

సమాప్తవనవాసం మా మయోధ్యాయాం పరన్తప!,

అరణ్యంబున గొడ్డలిచే నఱకంబడిన పుష్పించినవృక్షము నేలంబడునట్లు పర
వశుఁడై భూమిపయింబడెను. ౩

అంత నట్లు యిసుకదిబ్బ నంతయుం స్వేచ్ఛమెయి విచ్చల్లి అలసి నిద్రించు మత్తమాతంగంబుచాడ్పున మూర్ఛాపరవశుఁడై నేలం బడియున్న వాఁడును మహాధనుర్ధరుఁడునుఁ బరమదుఃఖితుఁడగు రాముం జూచి, భరత లక్ష్మణశత్రుఘ్నులును సీతాదేవియుం మహాదుఃఖంబు నొంది రోదనంబు సేయుచు మూర్ఛఁదేరుటకై చల్లనిసలిలబిందువులచే రాముం దడిపిరి. ౪,౫

అంత రాముఁడు కొంతవడికి మూర్ఛదేఱి కన్నులనిండ కన్నీళ్లు గాఱఁ బరమదుఃఖితుఁడై యిట్లని చెప్పం దొడంగెను. ౬

ధర్మాత్ముఁడగు రాముఁడు తండ్రి మృతిఁ బొందుటను విని భరతుం జూచి ధర్మ్యంబగు నీమాటం జెప్పెను. ౭

అయ్యో! నే నేమిసేయుదును? దశరథమహారాజు అయోధ్యాపట్టణంబున మృతిఁబొందినాఁడే! యింక నట్టిమహారాజు పోయినవెనుక నయోధ్యం బాలింపఁజాలినవాఁ డెవ్వఁ డున్నాఁడు? ౮

దశరథుఁడు దుష్టుఁడగు నా దుఃఖముచేతనే మృతిఁబొందెను. నే నతనికి సంస్కారంబైనను కాలంబునఁ గావింపనయితిని. అట్టిమహాత్మునకు దుష్ట పుత్రుఁడగు నే నుండుటవలన నేమి ప్రయోజనము? ౯

కాలంబునఁ దండ్రికిఁ బ్రేతకార్యంబులు గావింపకుండుటవలనం గలుగు మహాపాపంబులేని భరతుఁడా! నీవును శత్రుఘ్నుఁడును యుక్తకాలంబున దశరథునకు శ్రద్ధమెయి సమస్తప్రేతకార్యంబులం గావించినారు కావున మీ రిద్దఱుఁ గృతార్థుల రైతిరి. ౧౦

దశరథుఁడు మృతిఁబొందుటచే ప్రధానబాధరహితమై వ్యాకులమై అలంకారంబుచెడియున్న యయోధ్యాపట్టణంబునకు వనవాస మతిక్రమించి నప్పటికిని నేను బోవను. ౧౧

శత్రువులం దపింపఁ జేయునట్టి భరతుఁడా! నాయన మృతిఁబొంది

కోను శాసిష్యతి పున స్తాతే లోకాన్తరం గతే. ౧౨

పురా ప్రేష్య సువృత్తం మాం పితా యాన్యాహ సాన్త్వయన్,
వాక్యాని తాని శ్రోష్యామి కుత శ్రోత్రసుఖా న్యహమ్. ౧౩

ఏవ ముక్త్వా స భరతం భార్యా మభ్యేత్య రాఘవః,
ఉవాచ శోకస న్తప్తః పూర్ణచన్ద్రనిభాననామ్. ౧౪
సీతే! మృత స్తే శ్వశురః పిత్రా హీనోఽసి లక్ష్మణ!,
భరతో దుఃఖ మాచష్టే స్వర్గతం పృథివీపతిమ్. ౧౫

తతో బహుగుణం తేషాం బాష్పం నేత్రేష్వజాయత,
తథా బ్రువతి కాకుత్స్థే కుమారాణాం యశస్వినామ్. ౧౬
తత స్తే భ్రాతర స్సర్వే భృశ మాశ్వాస్య రాఘవమ్,
అబ్రువన్ జగతీభర్తుః క్రియతా ముదకం పితుః. ౧౭

సా సీతా శ్వశురం శ్రుత్వా స్వర్గలోకగతం నృపమ్,
నేత్రాభ్యా మశ్రుపూర్ణాభ్యా మశకన్నేక్షితుం పతిమ్. ౧౮

సాన్త్వయిత్వా తు తాం రామో రుదన్తీం జనకాత్మజామ్.
ఉవాచ లక్ష్మణం తత్ర దుఃఖితో దుఃఖితం వచః. ౧౯

ఆనయేఙ్గుదిపిణ్యాకం చీర మాహర చోత్తరం,
జలక్రియార్థం తాతస్య గమిష్యామి మహాత్మనః. ౨౦

సీతా పురస్తా ద్వ్రజతు త్వమేనామభితో వ్రజ,
అహం పశ్చా ద్గమిష్యామి గతి ర్హ్యేషా సుదారుణా. ౨౦

తతో నిత్యానుగ స్తేషాం విదితాత్మా మహామతిః,
మృదు ర్దాన్త శ్చ శాన్త శ్చ రామే చ దృఢభక్తిమాన్. ౨౨
సుమన్త్ర స్తై ర్నృపసుతైః సార్ధ మాశ్వాస్య రాఘవమ్,
అవాతారయ దాలమ్బ్య నదీం మన్దాకినీం శివామ్. ౨౩

తే సుతీర్థాం తతః కృచ్ఛ్రా దుపాగమ్య యశస్వినః,
నదీం మన్దాకినీం రమ్యాం సదా పుష్పితకాననామ్. ౨౪
శీఘ్రస్రోతస మాసాద్య తీర్థం శివ మకర్దమమ్,
సిషిచు స్తూదకం రాజ్ఞే తత ఏత త్తే భవ త్వితి. ౨౫

ప్రగృహ్య చ మహీపాలో జలపూరిత మఞ్జలిమ్,
దిశం యామ్యా మభిముఖో రుద న్వచన మబ్రవీత్ ౨౬
ఏత త్తే రాజశార్దూల విమలం తోయ మక్షయమ్,
పితృలోకగత స్యాద్య మద్దత్త ముపతిష్ఠతు. ౨౭

తతో మన్దాకినీతీరా త్ప్రత్యుత్తీర్య స రాఘవః,
పితు శ్చకార తేజస్వీ నివాపం భ్రాతృభి స్సహ. ౨౮
ఐఙ్గుదం బదరీమిశ్రం పిణ్యాకం దర్భసంస్తరే,
న్యస్య రామ స్సుదుఃఖార్తో రుద న్వచన మబ్రవీత్. ౨౯

సీత ముందు నడచుగాక! అటువెనుక నీవుపొమ్ము. నేను మీవెంట వచ్చుచున్నాను. ఇప్పుడు మనము మరణనిమిత్తకస్నానాదులు సేయఁ బోవుచున్నాము. కాఁబట్టి స్త్రీలును బాలురును ముందు పోవలయును. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౨౧

అంత వారలయొక్క కులక్రమాగతుఁడును, అనుచరుండును, పరమాత్మజ్ఞానముగలవాఁడును, మహాబుద్ధిశాలియును, మృదుస్వభావుఁడును, జితేంద్రియుఁడును, శాంతుఁడును, రామునియందు దృఢమయిన భక్తిగలవాఁడునగు సుమంత్రుఁడు భరతలక్ష్మణశత్రుఘ్నులను రాముని నోదార్చి వారలను దిన్నఁగా మందాకినీనదికిఁ దీసుకొనిపోయెను. ౨౨,౨౩

మహాయశశ్శాలులగు సాసీతారామలక్ష్మణులు సుందరమైన రేవులం గలదియుం రమణీయంబును దీరంబులం బుష్పితారణ్యంబులుగలదియుం శీఘ్రప్రవాహముగలదియు నగు మందాకినీనదిం జేరి స్నానంబుగావించి అందు బురదలేని యొకసుందరమయిన రేవునందు "నాయనా! యీజలము నీకుఁ దృప్తిగలిగించుగాక" అని సభక్తికంబుగా నుడువుచు తండ్రియగు దశరథమహారాజునకు నుదకంబు విడిచిరి. ౨౪.౨౫

అంత రాముఁడు దోసిలినిండ జలంబుపట్టుకొని దక్షిణదిక్కుకట్టుగాఁ దిరిగి రోదనముసేయుచు నిట్లని చెప్పెను. ౨౬

రాజశ్రేష్ఠుఁడవగు దశరథుఁడా! పితృలోకగతుఁడవగు నీకు నే నిప్పుడొసంగెడు నిర్మలోదకము అక్షయమై పొలుచుగాక! అని రాముండు చెప్పెను. ౨౭

అంతఁ దేజస్వియగురాముఁడు తమ్ములతో మందాకినీనదీతీరంబువిడిచి ఆవలికిపోయి అచ్చట తండ్రికి సపిండీకరణము గావించెను. ౨౮

రాముఁడు గారగానుగపిండిని రేగుపండ్లతో కలిపి ముద్దలుచేసి దర్భలు పరిచినస్థలంబుపై నునిచి పరమదుఃఖితుఁడై రోదనంబుసేయుచు నీమాటం జెప్పెను. ౨౯

ఇదం భుఙ్క్ష్వ మహారాజ! ప్రీతో యదశనా వయమ్,
యదన్నః పురుషో భవతి తదన్నా స్తస్య దేవతాః. ౩౦

తత స్తేనైవ మార్గేణ ప్రత్యుత్తీర్య నదీతటాత్,
ఆరురోహ నరవ్యాఘ్రో రమ్యసానుం మహీధరమ్. ౩౧
తతః పర్ణకుటీద్వార మాసాద్య జగతీపతిః,
పరిజగ్రాహ బాహుభ్యా ముభౌ భరతలక్ష్మణౌ. ౩౨
తేషాం తు రుదతాం శబ్దా త్ప్రతిశ్రుత్కోఽభవ ద్గిరౌ,
భ్రాతౄణాం సహ వైదేహ్యా సింహానా మివ నర్దతామ్. ౩౩

మహాబలానాం రుదతాం కుర్వతా ముదకం పితుః,
విజ్ఞాయ తుములం శబ్దం త్రస్తా భరతసైనికాః. ౩౪
అబ్రువం శ్చాపి రామేణ భరత స్సఙ్గతో ధ్రువమ్,
తేషా మేవం మహా ఞ్ఛబ్ద శ్శోచతాం పితరం మృతమ్. ౩౫

అథ వాసా న్పరిత్యజ్య తం సర్వేఽభిముఖా స్స్వనమ్,
అప్యేకమనసో జగ్ము ర్యథాస్థానం ప్రధావితాః. ౩౬
హయై రన్యే గజై రన్యే రథై రన్యే స్వలఙ్కృతైః,
సుకుమారా స్తథైవాన్యే పద్భి రేవ నరా యయుః. ౩౭

అచిరప్రోషితంరామం చిరవిప్రోషితం యథా,
ద్రష్టుకామో జన స్సర్వో జగామ సహసాఽఽశ్రమమ్. ౩౮
భ్రాతౄణాం త్వరితా స్తత్ర ద్రష్టుకామా స్సమాగమమ్,

దశరథమహారాజా! మా కిచ్చట నీ ఇంగుదీపిణ్యాకమే ఆహారము కాఁబట్టి దీనినే నీ కిప్పుడు సమర్పించినాను. సంతోషంబుతో నారగింపుము. పురుషుఁడు తాను దేని నాహారముగాఁ గొనునో దానినే తన దేవతలకును సమర్పించవలసినది. అని రాముఁడు చెప్పెను. ౩౦

అంతఁ బురుషశ్రేష్ఠుఁడగు రాముఁడు ఆదారిననే ఏటిగట్టునుండి పోయి రమణీయములయిన సానుప్రదేశములుగలపర్వతప్రదేశంబు నొందెను.

అంత రాముఁడు పర్ణశాలాద్వారంబు జేరఁగానే భరతలక్ష్మణుల నిద్దఱను బాహువులచేత కవుఁగలించుకొనెను. ౩౨

ఆరామలక్ష్మణభరతశత్రుఘ్నులు సీతయుఁ జేయు రోదనధ్వనివలన సింహగర్జనధ్వనులవలనంబోలె ఆచిత్రకూటపర్వతమునందు గొప్పప్రతిధ్వని కలిగినది. ౩౩

భరతుని సైనికులు బలవంతులగు రామాదులు తండ్రికి అపరక్రియలం జేయుచు రోదనంబు సేయఁగా నాతుములధ్వని విని భయమును జెందిరి. ౩౪

“భరతుఁడు రామునితోఁ జేరినట్లున్నది. ఇది నిశ్చయము. వారలందఱు పితృమరణమును గుఱించి దుఃఖించుచున్నారు. ఆధ్వని గొప్పగా వినవచ్చుచున్నది” అని యీభరతసైనికులు చెప్పుకొనిరి. ౩౫

అంత నాభరతసైనికులందఱు నొకటియై ఆధ్వని పుట్టినదిక్కునుబట్టి అతివేగంబునం బఱుగెత్తిపోయిరి. ౩౬

కొందఱు గుఱ్ఱంబుల నెక్కియుం గొందఱు మాతంగంబుల నారోహించియుం మఱికొందఱు చక్కఁగా నలంకరింపఁబడిన రథంబుల నెక్కియుఁ బోయిరి. ఉత్సాహవంతులగు మఱికొందఱు కాలినడకం జనిరి. ౩౭

ఆజనులందఱు రాముఁడు వనంబునొంది కొంతకాలంబె యయినప్పటికిని బహుకాలవియోగమును నొందినవారలువలె రామునిం జూచుటయందు అత్యాతురతగలవారలై అతివేగంబున రాముని యాశ్రమంబునకు బోయిరి.

అప్పుడు వారలు రామలక్ష్మణభరతశత్రుఘ్నులసమాగమంబుఁ జూడఁ

యయు ర్బహువిధై ర్యుక్తైః ఖురనేమిస్వనాకులైః. ౩౯

సా భూమి ర్బహుభి ర్యానైః ఖురనేమిసమాహతా,
ముమోచ తుములం శబ్దం ద్యౌరివాభ్రసమాగమే. ౪౦

తేన విత్రాసితా నాగాః కరేణుపరివారితాః,
ఆవాసయన్తో గన్ధేన జగ్ము రన్యద్వనం తతః. ౪౧

వరాహా వృకసంఘాశ్చ మహిషా స్సర్పవానరాః,
వ్యాఘ్రా గోకర్ణగవయా విత్రేసుః పృషతై స్సహ. ౪౨
రథాఙ్గసాహ్వా నత్యూహా హంసాః కారణ్డవాః ప్లవాః,
తథా పుంస్కోకిలాః క్రౌఞ్చా విసంజ్ఞా భేజిరే దిశః. ౪౩

తేన శబ్దేన విత్రస్తై రాకాశం పక్షిభి ర్వృతమ్,
మనుష్యై రావృతా భూమి రుభయం ప్రబభౌ తదా. ౪౪

తత స్తం పురుషవ్యాఘ్రం యశస్విన మరిన్దమమ్,
ఆసీనం స్థణ్డిలే రామం దదర్శ సహసా జనః. ౪౫

విగర్హమాణః కైకేయీం సహితో మన్థరా మపి,
అభిగమ్య జనో రామం బాష్పపూర్ణముఖోఽభవత్. ౪౬
తాన్నరా న్బాష్పపూర్ణాక్షా న్సమీక్ష్యాథ సుదుఃఖితాన్,
పర్యష్వజత ధర్మజ్ఞః పితృవ న్మాతృవ చ్చ సః. ౪౭

గోరి నానావిధవాహనంబుల నారోహించి ఖురనేమిస్వనంబులు నెలంగ నతివేగంబునం బోయిరి. ౩౯

అప్పుడు వేగంబున నడచు నానావిధరథాదియానంబుల ఖురనేమి ఘాతంబునంజేసి వర్షాకాలంబున మేఘంబులచే నాకాశంబునందుంబోలె భూమియందు మహాధ్వని గలిగినది. ౪౦

అంత నాధ్వనికి భయపడి మత్తగజంబులన్నియుం నాఁడేనుంగులం గూడి యావనంబునిడిచి మఱియొకవనంబునకుం బోయినవి. అప్పుడు గజంబులు పోయినప్పటికిని అదివఱకుఁ గలిగిన మదజలసంబాధంబునంజేసి యావనంబునందంతయుం సుగంధంబు గుబాళించుచుండినది. ౪౧

పందులు తోడేళ్లు దున్నపోతులు సర్పములు కోఁతులు గురుపోతులు పులులు జింకలు మొదలగు మృగంబులన్నియుం భయంబునం బాఱినవి. ౪౨

చక్రవాకంబులు నీరుకోడులు హంసలు కారండవములు కొంగలు కోవిలంబులు క్రౌంచములు మొదలగుసమస్తపక్షులును భయవిహ్వాలంబులై దిక్కులకుం బాఱినవి. ౪౩

అట్లు ఆధ్వనికి భయపడి పక్షులన్నియుం నాకాశంబున విహ్వాలంబులయి సంచరించినవి; భరతసైనికులు భూమినంతయుం వ్యాపించియుండిరి. అట్లు ఆకాశభూములు రెండును ఎంతయుఁ బ్రకాశించినవి. ౪౪

అంత నాజనులు అట్లు వేగంబునంబోయి పర్ణశాలామధ్యంబున నేలం గూర్చుండియున్నవాఁడును శత్రువుల నడంగఁద్రొక్కంజాలినవాఁడును మహాయశశ్శాలియుఁ బురుషశ్రేష్ఠుఁడునగు రాముని సందర్శించిరి. ౪౫

వారలందఱు నొక్కటిగాఁజేరి రామునొద్దకుఁ బోయి కైకేయీమంథరలను దూఱుచు గన్నీళ్లొలికించుచు రాము నెదుట నిలుచుండిరి. ౪౬

అంత ధర్మాత్ముఁడగు రాముఁడు పరమదుఃఖితులయి కన్నీళ్లొలికించుచున్న యాజనులంజూచి పురుషులను దండ్రులంబోలె స్త్రీలను దల్లులవలె సగౌరవంబుగాఁ గవుఁగిలించుకొనెను. ౪౭

స తత్ర కాంశ్చి త్పరిషస్వజే నరా
న్నరా స్తు కేచి త్తు త మభ్యవాదయన్,
చకార సర్వా న్సవయస్య బాన్ధవా
న్యథార్హ మాసాద్య తదా నృపాత్మజః. ౪౭
స తత్ర తేషాం రుదతాం మహాత్మనాం
భువం చ ఖం చానునినాదయ న్స్వనః,
గుహా గిరీణాం చ దిశశ్చ సన్తతం
మృదఙ్గఘోష ప్రతిమః ప్రశుశ్రువే. ౪౮

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే ద్వ్యుత్తరశతతమస్సర్గః.

## త్ర్యుత్తరశతతమస్సర్గః

వసిష్ఠః పురతః కృత్వా దారా న్దశరథస్య చ,
అభిచక్రామ తం దేశం రామదర్శనతర్షితః. ౧
రాజపత్న్యశ్చ గచ్ఛన్త్యో మన్దం మన్దాకినీం ప్రతి,
దదృశు స్తత్ర తత్తీర్థం రామలక్ష్మణసేవితమ్. ౨

కౌసల్యా బాష్పపూర్ణేన ముఖేన పరిశుష్యతా,
సుమిత్రా మబ్రవీ ద్దీనా యాశ్చాన్యా రాజయోషితః. 3
ఇదం తేషా మనాథానాం క్లిష్ట మక్లిష్టకర్మణామ్,
వనే ప్రాక్కేవలం తీర్థం యే తే నిర్విషయీకృతాః. ౪

ఇత స్సుమిత్రే! పుత్త్ర స్తే సదా జల మతన్ద్రితః,
స్వయం హరతి సౌమిత్రి ర్మమ పుత్రస్య కారణాత్. ౫

జఘన్య మపి తే పుత్రః కృతవా న్నతు గర్హితః,

అప్పుడు రాముఁడు కొందఱిని కవుఁగిలించుకొనెను. కొందఱు రామునకు నమస్కారము గావించిరి. రాముఁడు స్నేహితులను అందఱను వారివారి యోగ్యతకుఁ దగినట్లు గౌరవించెను. ౪౦

అచ్చట మహాత్ములగు సారామాదుల రోదనధ్వని భూమియందును ఆకాశంబునందును బర్వతగుహాలయందును దిక్కులందును బ్రతిధ్వనులు సెలంగ ధ్వనియుంబోలె గంభీరంబై వినవచ్చుచుండినది. ౪౧

ఇది నూటరెండవసర్గము.

## నూటమూఁడవసర్గము

అంత వసిష్ఠమహాముని దశరథునిభార్యలను దోడ్కొని రామదర్శన కౌతుకంబున రామాదులుండు ప్రదేశంబునకు వచ్చుచుండెను. ౧

కౌసల్య మున్నగురాజభార్యలు మందగమనంబున మందాకినీనదికిం బోవుచు రామలక్ష్మణులచే సేవింపఁబడిన ఆమందాకినీనదియందలి రేవును జూచిరి. ౨

అంతఁ గౌసల్య కండ్లనిండఁ గన్నీళ్లు గాఱ నోరెండఁ బరమదుఃఖిత యయి సుమిత్రను ఇతరులగు రాజభార్యలనుం జూచి యిట్లని చెప్పెను. ౩

దేశమునుండి వెడలఁగొట్టఁబడిన యనాథులును యితరులకు దుఃఖకరంబులుకాని కార్యములు చేయువారునగు సీతారామలక్ష్మణులు అడవియందు స్నానము సేయుస్థలం బిది. నిశ్చయము. ౪

సుమిత్రా! నీకొడుకైన లక్ష్మణుఁడు నాకొడుకు రామునినిమిత్తమై యేమరుపాటులేక యెల్లప్పుడును యీస్థలంబుననుండి జలమును కొనిపోవును. ౫

నీకొడుకు యిట్టినీచకార్యము చేయుటవలన నిందితుం డెంతమా

భ్రాతు ర్యదర్థసహితం సర్వం త ద్విహితం గుణైః. ౬

అద్యాయ మపి తే పుత్త్రః క్లేశానా మతథోచితః,
నీచానర్థసమాచారం సజ్జం కర్మ ప్రముఞ్చతు. ౭

దక్షిణాగ్రేషు దర్భేషు సా దదర్శ మహీతలే,
పితు రిఙ్గుదిపిణ్యాకం న్యస్త మాయతలోచనా. ౮

తం భూమౌ పితు రార్తేన న్యస్తం రామేణ వీక్ష్య సా,
ఉవాచ దేవీ కౌసల్యా సర్వా దశరథస్త్రియః. ౯

ఇద మిక్ష్వాకునాథస్య రాఘవస్య మహాత్మనః,
రాఘవేణ పితు ర్దత్తం పశ్య తైత ద్యథావిధి. ౧౦

తస్య దేవసమానస్య పార్థివస్య మహాత్మనః,
నైత దౌపయికం మన్యే భుక్తభోగస్య భోజనమ్. ౧౧

చతురన్తాం మహీం భుక్త్వా మహేన్ద్రసదృశో విభుః,
కథమిఙ్గుదిపిణ్యాకం స భుఙ్క్తే వసుధాధిపః. ౧౨

అతో దుఃఖతరం లోకే న కించి త్ప్రతిభాతి మా,
యత్ర రామః పితు ర్దద్యా దిఙ్గుదీక్షోద మృద్ధిమాన్. ౧౩

రామేణేఙ్గుదిపిణ్యాకం పితు ర్దత్తం సమీక్ష్య మే,

కథం దుఃఖేన హృదయం న స్ఫోటతి సహస్రధా. ౧౪
శ్రుతిస్తు ఖల్వియం సత్యా లౌకికీ ప్రతిభాతి మా,
యదన్నః పురుషో భవతి తదన్నా స్తస్య దేవతాః. ౧౫

ఏవ మార్తాం సపత్న్యస్తా జగ్ము రాశ్వాస్య తాం తదా,
దదృశు శ్చాశ్రమే రామం స్వర్గచ్యుత మి వామరమ్. ౧౬

సర్వభోగైః పరిత్యక్తం రామం సమ్ప్రేక్ష్య మాతరః,
ఆర్తా ముముచు రశ్రూణి సస్వరం శోకకర్శితాః. ౧౭

తాసాం రామ స్సముత్థాయ జగ్రాహ చరణా ఞ్ఛుభాన్,
మాతౄణాం మనుజవ్యాఘ్ర స్సర్వాసాం సత్యసఙ్గరః. ౧౮
తాః పాణిభి స్సుఖస్పర్శై ర్మృద్వఙ్గులితలై శ్శుభైః,
ప్రమమార్జూ రజః పృష్ఠా ద్రామ స్యాయతలోచనాః. ౧౯

సౌమిత్రి రపి తా స్సర్వా మాతౄ స్సమ్ప్రేక్ష్య దుఃఖితః,
అభ్యవాదయ తాస క్తం శనై రామా దన న్తరమ్. ౨౦
యథా రామే తథా తస్మి న్సర్వా వవృతిరే స్త్రియః,
వృత్తిం దశరథా జ్జాతే లక్ష్మణే శుభలక్షణే. ౨౧

సీతాఽపి చరణాం స్తాసా ముపసఙ్గృహ్య దుఃఖితా,
శ్వశ్రూణా మశ్రుపూర్ణాక్షీ సా బభూవా గ్రతః స్థితా. ౨౨
తాం పరిష్వజ్య దుఃఖార్తాం మాతా దుహితరం యథా,
వనవాసకృశాం దీనాం కౌసల్యా వాక్య మబ్రవీత్. ౨౩

జూచియుం నామనస్సు దుఃఖంబుచే వేయివ్రక్కలుగాఁ బగులకున్న దేల? ౧౪

పురుషుఁడు చేని నాహారముగా గొనుచున్నాఁడో యతని దేవతలకును అదే యాహారము అను సత్యార్థప్రతిపాదకమగు లోకప్రసిద్ధంబునగు నీశ్రుతిమాత్రము నాబుద్ధికి స్ఫురించుచున్నది. అని కౌసల్య దశరథునిభార్యలతోఁ జెప్పినది. ౧౫

ఆదశరథునిభార్యలందఱు అట్లు దుఃఖితలై రోదనంబు సేయుచున్న కౌసల్యను మంచిమాటలం దేల్చి యాబిడం దీసుకొనిపోయి యాశ్రమంబున స్వర్గముననుండివచ్చిన దేవతవలె నున్నరాముని జూచిరి. ౧౬

కౌసల్య మొదలగుతల్లులు రాముఁడు సమస్తభోగంబులను విడిచి అరణ్యంబున నుండుటనుజూచి పరమదుఃఖితులై మహాధ్వని కలుగునట్లు రోదనంబు సేయుచు కన్నీళ్లు విడిచిరి. ౧౭

అంత పురుషశ్రేష్ఠుఁడును సత్యప్రతిజ్ఞుఁడు నగురాముఁడు లేచి సవినయంబుగా తల్లులకందఱకును సాష్టాంగనమస్కారములు గావించెను. ౧౮

వెడందకన్నులుగల కౌసల్యాదులును తమకు సాష్టాంగముగ నమస్కరించిన రాముని వీపుపైనుండు దుమ్మును మృదువులైన వ్రేళ్లుగల సుఖస్పర్శంబులగు సుందరహస్తంబులచేఁ దుడిచిరి. ౧౯

లక్ష్మణుఁడును తల్లులనందఱం జూచి దుఃఖితుఁడై రాముఁడు నమస్కరించియయినపిమ్మట దానును సభక్తికముగా నమస్కారముం గావించెను. ౨౦

ఆదశరథభార్యలందఱు రాముని నాదరించినవిధంబుననే దశరథపుత్రుండును మంగళకరంబులగు లక్షణంబులతోఁ గూడినవాఁడునగు లక్ష్మణునిం గూడ నాదరించిరి. ౨౧

అంత సీతాదేవియుం దుఃఖంబునఁ గన్నీళ్లొలికించుచు అత్తలకు నమస్కరించి వారలముందట నిలువఁబడి యుండినది. ౨౨

కౌసల్యాదేవి వనవాసంబునం జేసి కృశగాత్రయై దీనయై పరమదుఃఖితయయియున్నసీతను తల్లికొమార్తెను కవుఁగిలించుకొన్నట్లు కవుఁగిలించుకొని యిట్లని చెప్పెను. ౨౩

విదేహరాజస్య సుతా స్నుషా దశరథస్యచ,
రామపత్నీ కథం దుఃఖం సంప్రాప్తా విజనే వనే. ౨౪

పద్మ మాతపస న్తప్తం పరిక్లిష్ట మి వోత్పలమ్,
కాఞ్చనం రజసా ధ్వ స్తం క్లిష్టం చన్ద్ర మివాంబుదైః. ౨౫
ముఖం తే ప్రేక్ష్య మాం శోకో దహ త్యగ్నిరి వాఽఽశ్రయమ్,
భృశం మనసి వైదేహి! వ్యసనారణిసమ్భవః. ౨౬

బ్రువన్త్యా మేవ మార్తాయాం జనన్యాం భరతాగ్రజః,
పాదావాసాద్య జగ్రాహ వసిష్ఠస్య చ రాఘవః. ౨౭

పురోహితస్యాగ్నిసమస్య వై తదా
బృహస్పతే రిన్ద్ర ఇవామరాధిపః,
ప్రగృహ్య పాదౌ సుసమృద్ధతేజస
స్సహైవ తేనోపవివేశ రాఘవః. ౨౮
తతో జఘన్యం సహితై స్స్వమన్త్రిభిః
పురప్రధానై శ్చ తథైవ సైనికైః,
జనేన ధర్మజ్ఞతమేన ధర్మవా
నుపోపవిష్టో భరత స్తదాఽగ్రజమ్. ౨౯
ఉపోపవిష్ట స్తు తదా స వీర్యవాం
స్తపస్వివేషేణ సమీక్ష్య రాఘవమ్,
శ్రియా జ్వలన్తం భరతః కృతాఞ్జలి
ర్యథా మహేన్ద్రః ప్రయతః ప్రజాపతిమ్. ౩౦
కి మేష వాక్యం భరతోఽద్య రాఘవం
ప్రణమ్య సత్కృత్య చ సాధు వక్ష్యతి,

జనకమహారాజుకూఁతురును, దశరథమహారాజుకోడలును, రామునిభార్యయు నగు నీసీతాదేవి నిర్జనంబగు నరణ్యంబున నిట్లు దుఃఖింపవలసివచ్చినదేల! ౨౪

సీతాదేవీ! ఎండకు వాడిన కమలంబువలె నలంగిన కలువయుంబోలె దుమ్ముచేఁ గప్పఁబడిన బంగారముంబోలె మేఘావృతంబగు చంద్రబింబము పగిది గాంతిహీనంబయియున్న నీముఖంబుఁ జూచుటచేఁ గట్టెలు మున్నగువానిని నగ్ని దహించునట్లు నన్ను దుఃఖంబు మిక్కిలియు దహించుచున్నది. అని కౌసల్యాదేవి సీతంజూచి చెప్పినది. ౨౫, ౨౬

ఇట్లు కౌసల్యాదేవి దుఃఖితయయి చెప్పుచుండఁగా భరతాగ్రజుఁడగు రాముఁడు కౌసల్యయొద్దకుఁబోయి యాబిడకును వసిష్ఠమహామునికిని నమస్కారము గావించెను. ౨౭

అప్పుడు రాముఁడు దేవేంద్రుఁడు బృహస్పతికి నమస్కరించునట్లు అగ్నిహోత్రంబునకు సరివచ్చువాఁడును మహాప్రభావుఁడు నగు వసిష్ఠమహామునికి నమస్కారంబు గావించి యాయనతోఁగూడనే కూర్చుండెను. ౨౮

అంత నారామవసిష్ఠులు కూర్చుండినపిమ్మట ధార్మికుఁడగు భరతుఁడు మంత్రులను బురప్రధానులను సైనికులను బరమధార్మికులగు జనులనుంగూడి రామునకు సమీపంబునం గూర్చుండెను. ౨౯

మహాపరాక్రమశాలియగు భరతుఁడు అట్లు రాముని సమీపంబునం గూర్చుండి తపస్వివేషంబునను మహాకాంతిం దేజరిల్లుచున్న రాముని దివ్యరూపంబుఁ బొడగని యతనియెదుట బ్రహ్మదేవునియెదుట దేవేంద్రుఁడుంబోలెఁ జేమోడ్పుగీలించియుండెను. ౩౦

"ఇఁక నీభరతుఁడు రామునకు నమస్కారంబుగావించి సత్కారపూర్వకంబుగా నేమిచెప్పును?" అని యప్పు డచ్చటనున్న జనుల కందఱకుఁ

ఇతీవ తస్యార్యజనస్య తత్త్వతో
బభూవ కౌతూహల ముత్తమం తదా. 30
స రాఘవ స్సత్యధృతి శ్చ లక్ష్మణో
మహానుభావో భరత శ్చ ధార్మికః,
వృతాః సుహృద్భి శ్చ విరేజు రధ్వరే
యథా సదస్యై స్సహితా స్త్రయోఽగ్నయః. 31
ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే త్ర్యుత్తరశతతమస్సర్గః.

## చతురుత్తరశతతమస్సర్గః

తం తు రామ స్సమాజ్ఞాయ భ్రాతరం గురువత్సలమ్,
లక్ష్మణేన సహ భ్రాత్రా ప్రష్టుం సముపచక్రమే. 1

కి మేత దిచ్ఛేయ మహం శ్రోతుం ప్రవ్యాహృతం త్వయా,
యస్మా త్త్వ మాగతో దేశ మిమం చీరజటాజినీ. 2

కి న్నిమిత్త మిమం దేశం కృష్ణాజినజటాధరః,
హిత్వా రాజ్యం ప్రవిష్ట స్త్వం తత్సర్వం వక్తు మర్హసి. 3

ఇత్యుక్తః కైకయీపుత్రః కాకుత్స్థేన మహాత్మనా,
ప్రగృహ్య బలవ ద్భూయః ప్రాఞ్జలి ర్వాక్య మబ్రవీత్. 4

ఆర్యం తాతః పరిత్యజ్య కృత్వా కర్మ సుదుష్కరమ్,
గత స్స్వర్గం మహాబాహుః పుత్రశోకాభిపీడితః. 5

స్త్రియా నియుక్తః కైకేయ్యా మమ మాత్రా పరన్తప!,
చకార సుమహా త్పాప మిద మాత్మయశోహరమ్.

సా రాజ్యఫల మప్రాప్య విధవా శోకకర్శితా,
పతిష్యతి మహాఘోరే నిరయే జననీ మమ.

తస్య మే దాసభూతస్య ప్రసాదం కర్తు మర్హసి,
అభిషిఞ్చస్వ చాద్యైవ రాజ్యేన మఘవా నివ.
ఇమాః ప్రకృతయ స్సర్వా విధవా మాతర శ్చ యాః,
త్వత్సకాశ మనుప్రాప్తాః ప్రసాదం కర్తు మర్హసి. ౯

తదానుపూర్వ్యా యుక్తం చ యుక్తం చాత్మని మానద!,
రాజ్యం ప్రాప్నుహి ధర్మేణ సకామా న్సుహృదః కురు. ౧౦

భవత్వవిధవా భూమి స్సమగ్రా పతినా త్వయా,
శశినా విమలేనేవ శారదీ రజనీ యథా. ౧౧
ఏభి శ్చ సచివై స్సార్థం శిరసా యాచితో మయా,
భ్రాతు శ్శిష్యస్య దాసస్య ప్రసాదం కర్తు మర్హసి. ౧౨
తదిదం శాశ్వతం పిత్ర్యం సర్వం ప్రకృతిమణ్డలమ్,
పూజితం పురుషవ్యాఘ్ర! నాతిక్రమితు మర్హసి. ౧౩

ఏవ ముక్త్వా మహాబాహు స్సబాష్పః కైకయీసుతః,
రామస్య శిరసా పాదౌ జగ్రాహ విధివ త్పునః. ౧౪

తం మత్త మివ మాతఙ్గం నిశ్వస న్తం పునఃపునః,
భ్రాతరం భరతం రామః పరిష్వజ్యేద మబ్రవీత్. ౧౫
కులీన స్సత్త్వసమ్పన్న స్తేజస్వీ చరితవ్రతః,
రాజ్యహేతోః కథం పాప మాచరే త్త్వద్విధో జనః. ౧౬

న దోషం త్వయి పశ్యామి సూక్ష్మ మప్యరిసూదన!,
న చాపి జననీం బాల్యా త్త్వం విగర్హితు మర్హసి. ౧౭

కామకారో మహాప్రాజ్ఞ! గురూణాం సర్వదాఽనఘ!,
ఉపపన్నేషు దారేషు పుత్రేషు చ విధీయతే. ౧౮

వయ మస్య యథా లోకే సంఖ్యాతా స్సౌమ్య! సాధుభిః,
భార్యాః పుత్రా శ్చ శిష్యా శ్చ త్వ మనుజ్ఞాతు మర్హసి. ౧౯

వనే వా చీరవసనం సౌమ్య! కృష్ణాజినామ్బరమ్,
రాజ్యే వాఽపి మహారాజో మాం వాసయితు మీశ్వరః. ౨౦

యావ త్పితరి ధర్మజ్ఞ గౌరవం లోకసత్కృతమ్,
తావ ద్ధర్మభృతాం శ్రేష్ఠ! జనన్యా మపి గౌరవమ్. ౨౧
ఏతాభ్యాం ధర్మశీలాభ్యాం వనం గచ్ఛేతి రాఘవ!,
మాతాపితృభ్యా ముక్తోఽహం కథ మన్య త్సమాచరేత్. ౨౨
త్వయా రాజ్యమయోధ్యాయాం ప్రాప్తవ్యం లోకసత్కృతమ్,
వస్తవ్యం దణ్డకారణ్యే మయా వల్కలవాససా. ౨3

అంత రాముఁడు అట్లు నిట్టూర్పులు విడుచుచు మత్తమాతంగసదృశుఁడగు తమ్ముని భరతునిం గవుఁగిలించుకొని యీమాటం జెప్పెను. ౧౫

సత్కులప్రసూతుఁడును బలవంతుఁడును శూరుఁడును జెక్కు మహావ్రతంబుల నాచరించినవాఁడు నగు నీవంటిసత్పురుషుఁడు తుచ్ఛం బగు రాజ్యముకొఱకై యిట్టిపాపకార్య మెట్లు చేయును? ౧౬

భగవాంద్రంజంపునట్టి భరతుఁడా! నీయందు నే నెంతమాత్రము కపటమున్నట్టుఁ దలంపుకొనను. నీవు చిన్నతనమువల్లఁ బూజ్యురాలగు తల్లిని దూషించుచున్నావు. అది నీకు యుక్తముకాదు. ౧౭

పాపరహితుఁడవును మహాప్రాజ్ఞుఁడవు నగు భరతుఁడా! ఎల్లప్పుడును గురుజనంబులు శక్తులైయున్న తమ దారాపుత్రులయందు నిచ్చవచ్చినట్లు నియమించుట సహజము. ౧౮

సౌమ్యుఁడవగు భరతుఁడా! లోకమునందు సాధువులచేత భార్యాపుత్రులు శిష్యులును ఎట్లెన్నఁబడుదురో మనమును నీదశరథుని కట్టివార మని నీవు తెలియంగవలయును. ౧౯

సౌమ్యుఁడవగునోయి భరతుఁడా! నిగ్రహానుగ్రహసమర్థుఁడగు దశరథుఁడు కృష్ణాజినము గట్టుబట్టగాను, నారచీరయుత్తరీయముగాను గల నన్నడవియందుఁగాని సుఖార్హంబగు రాజ్యమందుఁగాని వసించుచుండున ట్లొనర్పుటకు సమర్థుఁడు. ౨౦

ధర్మవేత్తలలో నేటివగు భరతుఁడా! ధర్మజ్ఞుఁడగు తండ్రియందులోకస్తుత్యంబగు గౌరవం బెంతటిదో దల్లియందు నంతటిగౌరవా ముంచవలెను.

ఓభరతుఁడా! ధర్మాత్ములగు మనతలిదండ్రులచే నీ వరణ్యంబునకుఁ బొమ్మని యాజ్ఞాపింపఁబడిన నే నిప్పుడు వేరువిధంబుగ నెట్లు సేయవచ్చును?

భరతుఁడా! నీవయోధ్యం జేరి శ్లాఘ్యంబగురాజ్యంబుఁ బరిపాలింపుచుండవలెను. నేను నారచీర ధరించికొని దండకారణ్యమునందు వాసముం జేయుచుండవలెను. ౨౩

ఏవం కృత్వా మహారాజో విభాగం లోకసన్నిధౌ,
వ్యాదిశ్య చ మహాతేజా దివం దశరథో గతః. ౨౪
స చ ప్రమాణం ధర్మాత్మా రాజా లోకగురు స్తవ,
పిత్రా దత్తం యథాభాగముపభోక్తుం త్వ మర్హసి. ౨౫
చతుర్దశ సమాస్సౌమ్య! దణ్డకారణ్యమాశ్రితః,
ఉపభోక్ష్యే త్వహం దత్తం భాగం పిత్రా మహాత్మనా. ౨౬

యదబ్రవీ న్మాం నరలోకసత్కృతః
పితా మహాత్మా విబుధాధిపోపమః,
తదేవ మన్యే పరమాత్మనో హితం
న సర్వలోకేశ్వరభావ మప్యహమ్. ౨౭

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే చతురుత్తరశతతమస్సర్గః.

---

పఞ్చోత్తరశతతమస్సర్గః

తతః పురుషసింహానాం వృతానాం తై స్సుహృద్గణైః,
శోచతామేవ రజనీ దుఃఖేన వ్యత్యవర్తత. ౧
రజన్యాం సుప్రభాతాయాం భ్రాతర స్తే సుహృద్వృతాః,
మన్దాకిన్యాం హుతం జప్యం కృత్వా రామ ముపాగమన్. ౨
తూష్ణీం తే సముపాసీనా న కశ్చి త్కించి దబ్రవీత్,
భరత స్తు సుహృన్మధ్యే రామం వచన మబ్రవీత్. 3

సాన్త్వితా మామికా మాతా దత్తం రాజ్య మిదం మమ,
త ద్దదామి త వైవాహం భుఙ్క్ష్వ రాజ్య మకణ్టకమ్. ౪

మహాపరాక్రమశాలియు మహారాజును నగు తండ్రి దశరథుఁడు ప్రజలసమక్షమునం దిట్లువిభాగ మేర్పరచియాజ్ఞయొసంగి స్వర్లోకంబునొందెను.

లోకగురుఁడును ధర్మాత్ముఁడును రాజు నగు నాదశరథుఁడు నీకుం బ్రమాణంబుగావున నీవు యథాభాగంబుగఁ దండ్రిచే నియ్యఁబడిన రాజ్యము ననుభవించుటకుం దగుదువు. ౨౧

సౌమ్యుఁడవగు భరతుఁడా! నేను దండకారణ్యంబునఁ బదునాలుగు సంవత్సరంబు లుండి మహాత్ముఁడైన మనతండ్రి యగు దశరథమహారాజుచేత నియ్యఁబడినభాగము ననుభవింపఁగలవాఁడను. ౨౮

సకలజనంబులకు స్తోత్రపాత్రుఁడును, ఇంద్రునితో సమానుఁడును మహానుభావుఁడు నగు నాతండ్రి దేనిని యాజ్ఞాపించి యున్నాఁడో అదియే నాకు ముఖ్యముగా శ్రేయస్కరముగాని సమస్తలోకములం బరిపాలించుటయైనను నాకు శ్రేయస్కరమును హితమునుగాదని రాముఁడుచెప్పెను.

ఇది నూటనాలుగవసర్గము.

---

## నూటయైదవసర్గము

అట్లు పురుషశ్రేష్ఠులగు నారామలక్ష్మణభరతులు స్నేహితులతోడంగూడి దుఃఖించుచుండఁగానే యారాత్రి గడచినది. ౧

అంత రాత్రిగడచి సూర్యోదయం బయినపిమ్మట ఆతోఁబుట్టువులు వారలస్నేహితులును మందాకినీనదియందు వారలు ప్రాతఃకాలజపహోమంబులం గావించుకొని రాముని సమీపంబుఁ జేరిరి. ౨

అప్పుడు వారలందఱు ఊరక కూర్చుండియుండిరి. ఒకఁడును ఒకమాటయైనను చెప్పఁడయ్యె. అంత భరతుఁడు మాత్రము సుహృన్మధ్యంబునం రామునిం జూచి యీమాటం జెప్పెను. ౩

నీవు నాతల్లిని గౌరవించినావు. నాకు యీరాజ్యంబు నొసంగితివి. ఇఁక నేను ఆరాజ్యమును మరల నీకే యిచ్చెదను అంగీకరించి యేవిధమైన శత్రుబాధయుం లేకుండుటవలన నతిసుఖకరంబగు నీరాజ్యంబునంతయును యథేచ్ఛముగ ననుభవింపుము. ౪

మహతే వామ్బువేగేన భిన్నస్సేతు ర్జలాగమే,
దురావారం త్వదన్యేన రాజ్యఖణ్డ మిదం మహత్. ౫

గతిం ఖర ఇవాశ్వస్య తార్క్ష్యస్యేవ పతత్రిణః,
అనుగన్తుం న శక్తిర్మే గతిం తవ మహీపతే!. ౬

సుజీవం నిత్యశస్తస్య యః పరైరుపజీవ్యతే,
రామ! తేన తు దుర్జీవం యః పరానుపజీవతి. ౭

యథా తు రోపితో వృక్షః పురుషేణ వివర్ధితః,
హ్రస్వకేణ దురారోహో రూఢస్కన్ధో మహాద్రుమః. ౮
స యదా పుష్పితో భూత్వా ఫలాని న విదర్శయేత్,
సతాం నానుభవేత్ప్రీతిం యస్య హేతోః ప్రరోపితః. ౯
ఏషోపమా మహాబాహో! తమర్థం వేత్తు మర్హసి,
యది త్వమస్మా నృషభో భర్తా భృత్యాన్న శాధి హి. ౧౦

శ్రేణయ స్త్వాం మహారాజ! పశ్యన్త్వగ్ర్యాశ్చ సర్వశః,
ప్రతపన్త మివాదిత్యం రాజ్యే స్థిత మరిన్దమమ్. ౧౧

తవానుయానే కాకుత్స్థ! మత్తా నర్దన్తు కుఞ్జరాః,
అన్తఃపురగతా నార్యో నన్దన్తు సుసమాహితాః. ౧౨

వర్షాకాలంబున మహాజలవేగముచేఁ దెగిన నీటికట్టం గట్టుటకు నెవరికియుం నలవికాదుగదా! అట్లు యీగొప్పరాజ్యమును వహించుట మిక్కిలియుం కష్టము. అందుకు నీవు తక్క మఱియెవ్వఁడును సమర్థుఁడు కాఁడు. ౫

భూనాయకుఁడవగు రాముఁడా! గుఱ్ఱమువలె గాడిదె నడువంజాలదు. సాధారణపక్షి గరుత్మంతుఁడుంబోలె నాకాశంబున నెగురంజాలదు. అట్లు నీగమనము ననుసరించుటకు నాకు శక్తిలేదు. ౬

రాముఁడా! ఎవ్వనిచేత పెక్కుజనులం జీవించుచున్నారో అతనిబ్రతుకు మంచిది. ఇతరుల నాశ్రయించి జీవించువానిబ్రతుకు మాత్రము మిక్కిలియుం నీచమయినది. ౭

మహాబాహుఁడవగు రాముఁడా! ఒకానొకపురుషుఁడు విత్తనము నాటి నీళ్లుపోసి పెంచి కష్టపడఁగా నావృక్షము కొంతకాలమునకు పొట్టివాండ్ర కారోహింప నశక్యమగునట్లు మహాస్కంధాదులతోఁగూడి పెద్ద వృక్షమై కాలంబునఁ బుష్పించి ఫలంబు లొసంగకుండునేని దాని నాటిన వాని కభీష్టసిద్ధిగాక దానికిఁ జేసిన కష్టంబంతయుం వ్యర్థంబగునుగదా! ఇదియుంప మానము. అట్లు అధికుఁడవయ్యు మాకు భర్తవయ్యు నీవు పట్టాభిషేకం బంగీకరించి భృత్యులమగు మమ్ముం బాలింపవేని, ఆవృక్షమును బెంచినవానికష్టము వ్యర్థమైనట్లు నీవలన రాజ్యపాలనాదులగునని కోరి నిన్ను జిన్ననాటనుండి యెంతో కష్టంబునం బెంచిన నీతండ్రి దశరథుని పాటంతయుం వ్యర్థమగునని యెఱుంగుము. ౮-౧౦

మహారాజుఁడవగు రాముఁడా! శత్రువుల నడంగఁద్రొక్కఁజాలిననీవు రాజ్యంబునఁ బట్టాభిషిక్తుఁడవయి సూర్యుఁడుంబోలె వెలుంగుచుండఁగాఁ బౌరులు దనివిదీర నిన్నుఁజూచి సంతసింపఁగలరు. ౧౧

రాముఁడా! మదపుటేనుంగులు నీవెంబడివచ్చుచు సంతోషంబునఁ గర్జించుచుండునుగాక! మఱియుం నంతఃపురస్త్రీలందఱును దుఃఖంబును విడిచిసంతోషింతురుగాక! ౧౨

తస్య సాధ్విత్యమన్యన్త నాగరా వివిధా జనాః,
భరతస్య వచ శ్శ్రుత్వా రామం ప్రత్యనుయాచతః. ౧౩
తమేవం దుఃఖితం ప్రేక్ష్య విలపన్తం యశస్వినమ్,
రామః కృతాత్మా భరతం సమాశ్వాసయదాత్మవాన్. ౧౪

నాఽఽత్మనః కామకారోఽస్తి పురుషోఽయమనీశ్వరః,
ఇతశ్చేతరతశ్చైనం కృతాన్తః పరికర్షతి. ౧౫
సర్వే క్షయాన్తా నిచయాః పతనాన్తాః సముచ్ఛ్రయాః,
సంయోగా విప్రయోగాన్తా మరణాన్తం చ జీవితమ్. ౧౬

యథా ఫలానాం పక్వానాం నాన్యత్ర పతనాద్భయమ్,
ఏవం నరస్య జాతస్య నాన్యత్ర మరణాద్భయమ్. ౧౭

యథాఽగారం దృఢస్థూణం జీర్ణం భూత్వాఽవసీదతి,
తథైవ సీదన్తి నరా జరామృత్యువశం గతాః. ౧౮
అత్యేతి రజనీ యా తు సా న ప్రతినివర్తతే,
యాత్యేవ యమునా పూర్ణా సముద్రముదకాకులమ్. ౧౯
అహోరాత్రాణి గచ్ఛన్తి సర్వేషాం ప్రాణినామిహ,
ఆయూంషి క్షపయన్త్యాశు గ్రీష్మే జలమివాంశవః. ౨౦

ఆత్మానమనుశోచ త్వం కిమన్యమనుశోచసి,
ఆయుస్తే హీయతే యస్య స్థితస్య చ గతస్య చ. ౨౧

నానావిధములగు పౌరజనులందఱు అట్లు రామునిఁ బ్రార్థించుచున్న భరతుని మాటను విని సాధువాదంబులం బ్రశంసించిరి. ౧౩

బుద్ధిమంతుఁడును ధైర్యవంతుఁడునగు రాముఁడు అట్లు తన ప్రార్థన నంగీకరింపకుండుటవలన దుఃఖితుఁడై రోదనంబు సేయుచున్న కీర్తిమంతుఁడగు భరతుంజూచి యిట్లని యూఱడించెను. ౧౪

పురుషుఁడు స్వతంత్రుఁడు కాఁడు కావున యిచ్ఛచొప్పున నడచుటకు లేదు; పురుషుని దైవము ఇటు అటు ఆకర్షించుచున్నది. ౧౫

ధనసంచయములు ఎంతగూర్చినను ఎట్లయినను తుదకు నాశముఁ బొందకమానదు. ఉన్నతస్థానమును బొందినవారలు పతనమును బొందవలసినదే కాని వేఱుగాదు. భార్యాపుత్రమిత్రాదులసంబంధము ఎంతకాలమునకుఁ గాని విరహము నొందింపకమానదు. అట్లు జననము నొందినవాఁడు అవశ్యము మరణము నొందును. ౧౬

చక్కఁగఁ బండినఫలమునకు చెట్టునుండి తునిసిపడుటకన్న వేఱు భయము లేనట్లు జననము నొందినవానికి మరణంబు నొందుటకన్న వేఱుభయము లేదు. ౧౭

దృఢస్తంభంబులు గలగృహంబు జీర్ణమయి నశించునట్లు మనుష్యులును జరామృత్యువశంగతులయి నాశము నొందుదురు. ౧౮

గడచినరాత్రి మరల నెంతమాత్రము రాదు; ఏటిప్రవాహము సముద్రమునుబొంది మరల రాదుగదా! ౧౯

వేసంగికాలంబున సూర్యునికిరణంబులు జలమును బీల్చునట్లు గడచి పోవునట్టి యహోరాత్రములు ప్రాణులయాయుస్సును నశింపఁజేయుచున్నవి. ౨౦

నీవు లేచినను వంగినను నీయాయుస్సు క్షీణించుచున్నదే! నిన్నుఁ జూచియే నీవు దుఃఖించుకొనుము; నీగతియె యిట్లుండ నితరులఁజూచి దుఃఖింపనేల? ౨౧

సహైవ మృత్యు ర్వ్రజతి సహ మృత్యుర్నిషీదతి,
గత్వా సుదీర్ఘ మధ్వానం సహమృత్యు ర్నివర్తతే. ౨౨

గాత్రేషు వళయః ప్రాప్తా శ్శ్వేతా శ్చైవ శిరోరుహాః,
జరయా పురుషో జీర్ణః కిం హి కృత్వా ప్రభావయేత్. ౨౩

నన్ద న్త్యుదిత ఆదిత్యే నన్ద న్త్యస్తమితే రవౌ,
ఆత్మనో నావబుధ్యన్తే మనుష్యా జీవితక్షయమ్. ౨౪

హృష్య న్త్యృతుముఖం దృష్ట్వా నవం నవమి హాగతమ్,
ఋతూనాం పరివర్తేన ప్రాణినాం ప్రాణసంక్షయః. ౨౫

యథా కాష్ఠం చ కాష్ఠం చ సమేయాతాం మహార్ణవే,
సమేత్య చ వ్యపేయాతాం కాల మాసాద్య కంచన. ౨౬
ఏవం భార్యా శ్చ పుత్రా శ్చ జ్ఞాతయ శ్చ వసూని చ,
సమేత్య వ్యవధావ న్తి ధ్రువో హ్యేషాం వినాభవః. ౨౭

నాత్ర కశ్చి ద్యథాభావం ప్రాణీ సమభివర్తతే,
తేన తస్మి న్న సామర్థ్యం ప్రేతస్యా స్త్యనుశోచతః. ౨౮

యథా హి సార్థం గచ్ఛన్తం బ్రూయా త్కశ్చి త్పథి స్థితః,
అహ మ ప్యాగమిష్యామి పృష్ఠతో భవతా మితి. ౨౯

మనుష్యుఁడు పోవునప్పుడు మృత్యువును గూడనే పోవుచున్నది; కూర్చుండునప్పుడు కూడనే కూర్చుండును, అట్టి మనుష్యుఁడు బహుదూరము పోయివచ్చినను మృత్యువు కూడనే పోయివచ్చును; కావున మృత్యువును దప్పించుకొన నలవిగాదు. ౨౨

దేహమంతయుం ముడతలు పడినవి; వెండ్రుకలన్నియుం దెల్లనైనవి; ఇట్లు ముసలితనమునొంది పరవశుఁడైనవిమ్మటఁ బురుషుఁ డేమియుం బాయముచేయఁ గలఁడు? కావున యౌవనముననే యాత్మవిచారము చేయవలసినది. ౨౩

మనుష్యులు సూర్యుఁడుదయింపఁగానే యర్థార్జనసమయము వచ్చినది గదా యని సంతోషమునొందెదరు; సూర్యుఁడస్తమించినపుడు కామోప భోగకాలము వచ్చినదిగదా యని సంతోషించెదరు; ఎవ్వరును అట్లు సూర్యో దయాస్తమయములచేఁ దమ యాయుస్సు నశించుచున్నదని యెఱుంగరు. ౨౪

ఋతువులు అతిక్రమింప నతిక్రమింప: ప్రాణులకు ఆయుస్సు నశించు చున్నది; ఇది దెలియక ఒకఋతువుపోయి క్రొత్తక్రొత్తఋతువువచ్చినప్పు డంతయుం దుఃఖించుటను మాని సంతోషంబు నొందుచున్నారు. ౨౫

మహాసముద్రంబున రెండుకొయ్యలు ఒకటి నొకటి చేరియుం గొంత కాలమునకు విడిపడునట్లు భార్యలును బుత్రులును బంధువులును ధనాదులును అందఱును గొంతకాలము ఒకరితో నొకరుసంబంధించి యటుపిమ్మటవిడిపడుదురు; వీరలకు సంబంధములేకుండుట నిత్యముగాని సంబంధ మెంతమాత్రము నిత్యము గాదు. ౨౬,౨౭

ఈలోకంబున నేప్రాణియుం దన యిచ్చచొప్పున నడచుకొనుటకు శక్తుఁడుకాఁడు. కావున మృతిబొందినవానింగుఱించి యెంత దుఃఖించినను వాని మరల బ్రతికింప నలవిగాదు. ౨౮

దారిం బోవుచున్న బాటసారులగుంపుంజూచి పయినమయి దారిలో నున్నవాఁడు "నేనును మీవెంబడివచ్చెదను" అనిచెప్పి వారల వెంబడించి

ఏవం పూర్వై ర్గతో మార్గః పితృపైతామహో ధ్రువః,

త మాపన్నః కథం శోచే ద్యస్య నాస్తి వ్యతిక్రమః. ౩౦

వయసః పతమానస్య స్రోతసో వాఽనివర్తినః,
ఆత్మా సుఖే నియోక్తవ్య స్సుఖభాజః ప్రజాః స్మృతాః. ౩౧

ధర్మాత్మా సశుభైః కృత్స్నైః క్రతుభి శ్చాప్తదక్షిణైః,
ధూతపాపో గత స్స్వర్గం పితా నః పృథివీపతిః. ౩౨
భృత్యానాం భరణా త్సమ్య క్ప్రజానాం పరిపాలనాత్,
అర్థాదానా చ్చ ధర్మేణ పితా న స్త్రిదివం గతః. ౩౩

కర్మభి స్తు శుభై రిష్టైః క్రతుభి శ్చాప్తదక్షిణైః,
స్వర్గం దశరథః ప్రాప్తః పితా నః పృథివీపతిః. ౩౪
ఇష్ట్వా బహువిధై ర్యజ్ఞై ర్భోగాం శ్చావాప్య పుష్కలాన్,
ఉత్తమం చాయు రాసాద్య స్వర్గతః పృథివీపతిః. ౩౫
ఆయు రుత్తమ మాసాద్య భోగా నపి చ రాఘవః,
స న శోచ్యః పితా తాత! స్వర్గత స్సత్కృత స్సతామ్. ౩౬
స జీర్ణం మానుషం దేహం పరిత్యజ్య పితా హి నః,
దైవీ మృద్ధి మనుప్రాప్తో బ్రహ్మలోకవిహారిణీమ్. ౩౭

తం తు నైవంవిధః కశ్చి త్ప్రాజ్ఞ శ్శోచితు మర్హతి,
త్వద్విధో యద్విధ శ్చాపి శ్రుతవా న్బుద్ధిమత్తరః. ౩౮

పోవునట్లు, ఇంతకుమున్ను పూర్వీకులచే నవలంబింపఁబడి తండ్రితాతలనాఁటి నుండి వచ్చినమార్గమునే యనుసరింపవలెను. దాని నెంతమాత్రము విడువరాదు. ౨౯

అట్టి తిరుగులేని పూర్వీకులమార్గము ననుసరించి యేల దుఃఖింపవలెను? ౩౦

ప్రవాహమువలె వయస్సు తిరుగులేక గడచిపోవుచుండును గావునఁ బరలోకసుఖహేతువగు ధర్మంబు నాచరించుచుండవలయును. అట్లు ధర్మాచరణము సేయువారలే మనుష్యులనంబడుదురు. తక్కినవారలు మృగములు. ౩౧

ధర్మాత్ముఁడగు మనతండ్రి దశరథమహారాజు సమస్తక్రతువులును సంపూర్ణదక్షిణలతోఁ గావించి యాపరమపుణ్యంబుచే స్వర్గంబునొందినాఁడు.

మనతండ్రి దశరథమహారాజు చక్కఁగా భృత్యులఁ బోషించుటవలనను ప్రజలం బాలించుటవలనను ధనంబు నొసంగుటవలనను ధర్మంబునఁ బన్నుదీసికొనుటవలనను స్వర్గంబునొందెను. ౩౩

మనతండ్రి దశరథమహారాజు నానావిధసత్కర్మములు గావించియు సంపూర్ణదక్షిణలతో యాగంబులు చేసియు స్వర్గంబునొందెను. ౩౪

దశరథమహారాజు పెక్కుయాగంబులు గావించి పుష్కలముగా దివ్యభోగంబుల ననుభవించి పెద్దకాలము జీవించి స్వర్గమునొందెను. ౩౫

నాయనా! పెద్దకాలము జీవించి నానావిధదివ్యభోగంబులం బుష్కలంబుగా ననుభవించి సత్పురుషులచే గౌరవింపఁబడి స్వర్గంబునొందిన మనతండ్రిగూర్చి యెంతమాత్రము దుఃఖింపరాదు. ౩౬

మనతండ్రి దశరథమహారాజు జీర్ణమయిన మనుష్యదేహమును విడిచి దేవదేహమునుబొంది బ్రహ్మలోకంబున విహరించుచున్నాఁడుగదా! అతనికి దుఃఖింపనేల? ౩౭

నీవు సమస్తశాస్త్రంబులం దెలిసినవాఁడవు; మిక్కిలియు బుద్ధిమంతుఁడవు; నీయట్టిపండితుఁడెవ్వఁడును దశరథమహారాజుంగుఱించి యెంతమాత్రము దుఃఖింపఁడు. ౩౮

ఏతే బహువిధాః శ్లోకా విలాపరుదితే తథా,
వర్జనీయా హి ధీరేణ సర్వావస్థాసు ధీమతా.
స స్వస్థో భవ మా శోచే ర్యాత్వా చావసతాం పురీమ్,
తథా పిత్రా నియుక్తోఽసి వశినా వదతాం వర!.

యత్రాహ మపి తే నైవ నియుక్తః పుణ్యకర్మణా,
తత్రైవాహం కరిష్యామి పితు రార్యస్య శాసనమ్.

న మయా శాసనం తస్య త్యక్తుం న్యాయ్య మరిందమ!
తత్త్వయాఽపి సదా మాన్యః స వై బన్ధు స్సనః పితా

తద్వచః పితురే వాహం సమ్మతం ధర్మచారిణః,
కర్మణా పాలయిష్యామి వనవాసేన రాఘవ!.
ధార్మికేణానృశంసేన నరేణ గురువర్తినా,
భవితవ్యం నరవ్యాఘ్ర! పరలోకం జిగీషతా.

ఆత్మాన మనుతిష్ఠ త్వం స్వభావేన నరర్షభ!,
నిశామ్యతు శుభం వృత్తం పితు ర్దశరథస్య నః.

ఇత్యేవ ముక్త్వా వచనం మహాత్మా
పితు ర్నిదేశ ప్రతిపాలనార్థమ్,
యవీయసం భ్రాతర మర్థవ చ్చ
ప్రభు ర్ముహూర్తా ద్విరరామ రామః.

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే షడుత్తరశతతమస్సర్గః

ఏడ్చుట కన్నీళ్లు విడుచుట అట్టి బహువిధదుఃఖంబులను సమస్తావస్థలయందును ధీరుండును బుద్ధిమంతుఁడును నగువాఁడు విడువవలయును. ౩౯

మాటలు చెప్పువారలలో శ్రేష్ఠుఁడవగు భరతుఁడా! నీవు నెమ్మదినొందియుండుము; దుఃఖింపవలదు; పోయి యయోధ్యాపట్టణంబుఁ బాలింపుము; అట్టి జితేంద్రియుండగు మనతండ్రి నీ కాజ్ఞ యొసంగియున్నాఁడు. ౪౦

పుణ్యకర్ముండగు మనతండ్రి దశరథమహారాజు ఏ కార్యమునందు నన్నాజ్ఞాపించియున్నాఁడో నేనును పూజ్యుండగు తండ్రియాజ్ఞను శిరసావహించి యాకార్యంబు గావించెదను. ౪౧

శత్రువుల నడంగఁద్రొక్కఁజాలిన భరతుఁడా! దశరథమహారాజు శాసనంబు నతిక్రమించుట నాకు యుక్తము కాదు; అట్టి నీవును ఆయనయాజ్ఞ నెల్లప్పుడును బూజింపవలయును; ఆయన మనకు అందఱిబంధువులకన్న నెచ్చు బంధువు; తండ్రి. ౪౨

భరతుఁడా! అందువలన నేను బదునాలుగుసంవత్సరంబులు వనంబుననుండి యట్టి పరమధార్మికుఁడగు తండ్రియాజ్ఞను సార్థకంబు గావించెదను.

పురుషశ్రేష్ఠుఁడవగుభరతుఁడా! పరలోకంబున సుఖంబు నొందఁగోరువాఁడు ధార్మికుఁడుగాను దయగలవాఁడుగాను గుర్వాజ్ఞాప్రకారము నడచుకొనువాఁడుగాను ఉండవలయును. ౪౪

పురుషశ్రేష్ఠుఁడవగు భరతుఁడా! నీవు మనతండ్రియగుదశరథుని సదాచారవంతయు మనంబున నుంచుకొని రాజ్యంబుఁ బాలింపుము. అని రాముఁడు భరతునితోఁ జెప్పెను. ౪౫

ఈప్రకారంబున మహాత్ముఁడును మహాసమర్థుండు నగురాముఁడు తన తమ్ముఁడగు భరతునింజూచి తండ్రియాజ్ఞ నవశ్యము పాలింపవలె ననునర్థము వచ్చునట్టు ఉత్తమంబగుమాటలం జెప్పి యంత నూరకుండెను. ౪౬

ఇది నూటయైదవ సర్గము.

---

## షడుత్తరశతతమస్సర్గః

ఏవ ముక్త్వా తు విరతే రామే వచన మర్థవత్,
తతో మన్దాకినీతీరే రామం ప్రకృతివత్సలమ్. ౧
ఉవాచ భరత శ్చిత్రం ధార్మికో ధార్మికం వచః,

కోహి స్యా దీదృశో లోకే యాదృశ స్త్వ మరిన్దమ. ౨
న త్వాం ప్రవ్యథయే ద్దుఃఖం ప్రీతిర్వా నప్రహర్షయేత్,

సమ్మతశ్చాసి వృద్ధానాం తాంశ్చ పృచ్ఛసి సంశయాన్. ౩

యథా మృత స్తథా జీవ న్యథా సతి తథా సతి,
య స్యైష బుద్ధిలాభస్స్యా త్పరితప్యేత కేన సః. ౪

పరావరజ్ఞో యశ్చ స్యా త్తథా త్వం మనుజాధిప!,
స ఏవం వ్యసనం ప్రాప్య న విషీదితు మర్హతి. ౫

అమరోపమస త్త్వ స్త్వం మహాత్మా సత్యసఙ్గరః,
సర్వజ్ఞస్సర్వదర్శీ చ బుద్ధిమాంశ్చాసి రాఘవ!. ౬

న త్వామేవంగుణై ర్యుక్తం ప్రభవాభవకోవిదమ్,
అవిషహ్యతమం దుఃఖ మాసాదయితు మర్హతి. ౭
ప్రోషితే మయి యత్పాపం మాత్రా మత్కారణా త్కృతమ్,
క్షుద్రయా తదనిష్టం మే ప్రసీదతు భవా న్మమ. ౮

## నూటయాఱవసర్గము

అట్లు రాముఁడు మహార్థంబగు మాటం జెప్పి ముగించిన పిమ్మట ధార్మికుఁడగు భరతుఁడు మందాకినీతీరంబున స్వభావంబున నె భక్తవత్సలుండగు రాముం జూచి మిక్కిలి యుక్తియుక్తంబగుటచే నాశ్చర్యకరంబును ధర్మిష్ఠంబునగు నీమాటం జెప్పెను. ౧

శత్రువుల నడంగఁద్రొక్కం జాలినట్టి రాముఁడా! నీయట్టివాఁడు లోకంబున నెవ్వఁడును లేఁడు; నీవు దుఃఖంబువచ్చినను దుఃఖింపవు; సంతోషంబు వచ్చినప్పుడును సంతోషింపవు. ౨

సర్వజ్ఞుండవు గావున వృద్ధులు కూడ నిన్నుఁ బూజింతురు. అయినను నీవు వారలను గౌరవించుటకై వారల నడిగి సందేహంబులు దీర్చుకొనుచున్నావు. ౩

చచ్చినవానియందు ఎట్లు ద్వేషం బుంచరో, అట్లు బ్రతికియున్నవానియందును ద్వేషం బుంచకుండుట; లేనివస్తువునందు రాగం బుంచకుండునట్లు ఉన్నవస్తువునం దనురాగం బుంచకుండుట; ఇట్టిబుద్ధి యెవనికిఁ గలుగునో అతఁడు దేనికిని ఎంతమాత్రము పరితపింపఁడు. ౪

నరాధిపుఁడవగు రాముఁడా! ఆత్మానాత్మలం దెలిసినవాఁడు ఎట్టికష్టంబులనొందియుం దుఃఖింపరాదు; అట్లు నీవు ఆత్మానాత్మజ్ఞుఁడవు గావున దుఃఖంబు నొందవు. ౫

దేవతుల్యుఁడవగు రాముఁడా! నీవు సత్త్వగుణసంపన్నుండవు; మహాధైర్యుండవు సత్యప్రతిజ్ఞుండవు; సర్వజ్ఞుండవు; సర్వదర్శివి; మిక్కిలియు బుద్ధిమంతుఁడవు. ౬

ఇట్టి సద్గుణంబులతో నొప్పువాఁడవును ఉత్పత్తివినాశంబులు దెలిసినవాఁడవునగు నీవు ఇట్టి దుస్సహంబగు కష్టమునొందుట సరిగాదు. ౭

నేను దేశాంతరంబుననుండఁగా దుష్టురాలగు నాతల్లి నానిమిత్తమయి గావించినపాపకార్యము నాకిష్టముగాదు; కావున నీవు నాపైఁగోపంబు సేయకుము; అనుగ్రహింపవలయును. ౮

ధర్మబన్ధేన బద్ధోఽస్మి తేనేమాం నేహ మాతరమ్,
హన్మి తీవ్రేణ దణ్డేన దణ్డార్హాం పాపకారిణీమ్. ౯

కథం దశరథా జ్జాత శ్శుద్ధాభిజనకర్మణః,
జానన్ ధర్మ మధర్మిష్ఠం కుర్యాం కర్మ జుగుప్సితమ్. ౧౦

గురుః క్రియావా న్వృద్ధశ్చ రాజా ప్రేతః పితేతిచ,
తాతం న పరిగర్హేయం దైవతం చేతి సంసది. ౧౧

కో హి ధర్మార్థయో ర్హీన మీదృశం కర్మ కిల్బిషమ్,
స్త్రియాః ప్రియం చికీర్షు స్స న్కుర్యా ద్ధర్మజ్ఞ! ధర్మవిత్. ౧౨
అన్తకాలే హి భూతాని ముహ్యన్తీతి పురా శ్రుతిః,
రాజ్ఞైవం కుర్వతా లోకే ప్రత్యక్షం సా శ్రుతిః కృతా. ౧౩

సాధ్వర్థమభిసన్ధాయ క్రోధా న్మోహాచ్చ సాహసాత్,
తాతస్య యదతిక్రాన్తం ప్రత్యాహరతు త ద్భవాన్. ౧౪

పితు ర్హి సమతిక్రాన్తం పుత్రో యస్సాధు మన్యతే,
త దపత్యం మతం లోకే విపరీత మతోఽన్యథా. ౧౫
తదపత్యం భవా నస్తు మా భవాన్ దుష్కృతం పితుః,
అభిపత్తా కృతం కర్మ లోకే ధీరవిగర్హితమ్. ౧౬
కైకేయీం మాం చ తాతం చ సుహృదో బాన్ధవాం శ్చ నః,
పౌరజానపదా న్సర్వాం స్త్రాతు సర్వ మిదం భవాన్. ౧౭
క్వ చారణ్యం క్వచ క్షాత్రం క్వజటాః క్వ చ పాలనమ్,
ఈదృశం వ్యాహతం కర్మ న భవా న్కర్తు మర్హతి. ౧౮

ఏషహి ప్రథమో ధర్మః క్షత్రియ స్యాభిషేచనం,
యేన శక్యం మహాప్రాజ్ఞ! ప్రజానాం పరిపాలనమ్. ౧౯
క శ్చ ప్రత్యక్ష ముత్సృజ్య సంశయస్థ మలక్షణమ్,
ఆయతిస్థం చరే ద్ధర్మం క్షత్రబన్ధు రనిశ్చితమ్. ౨౦

అథ క్లేశజ మేవ త్వం ధర్మం చరితు మిచ్ఛసి,
ధర్మేణ చతురో వర్ణా న్పాలయన్ క్లేశ మాప్నుహి. ౨౧

చతుర్ణా మాశ్రమాణాం హి గార్హస్థ్యం శ్రేష్ఠ మాశ్రమమ్,
ప్రాహు ర్ధర్మజ్ఞ! ధర్మజ్ఞా స్తం కథం త్యక్తు మర్హసి. ౨౨

శ్రుతేన బాలః స్థానేన జన్మనా భవతో హ్యహమ్,
స కథం పాలయిష్యామి భూమిం భవతి తిష్ఠతి. ౨౩

హీనబుద్ధిగుణో బాలో హీనః స్థానేన చాప్యహమ్,
భవతా చ వినాభూతో న వర్తయితు ముత్సహే. ౨౪

ఇదం నిఖిల మవ్యగ్రం రాజ్యం పిత్ర్య మకణ్టకమ్,
అనుశాధి స్వధర్మేణ ధర్మజ్ఞ! సహ బాన్ధవైః. ౨౫

ఇహైవ త్వాఽభిషిఞ్చన్తు సర్వాః ప్రకృతయ స్సహ,
ఋత్విజ స్సవసిష్ఠాశ్చ మన్త్ర విన్మన్త్రకోవిదాః. ౨౬
అభిషిక్త స్త్వ మస్మాభి రయోధ్యాం పాలనే వ్రజ,

మహాపండితుఁడవగు రామా! ప్రజాపరిపాలనంబునకు మూలమయిన పట్టాభిషేకమే క్షత్రియునకుఁ బ్రథమధర్మము. ౧౯

క్షత్రియుం డెవ్వఁడు త్యాగభోగప్రదంబగుటచేఁ బ్రత్యక్షఫలంబగు ప్రజాపాలనరూపధర్మంబును విడిచి సందేహాగతంబును లక్షణంబు లేకుండుటచే నిరూపింప నలవిగానిదియుఁ గాలాంతరఫలప్రదంబును బ్రమాణరహితంబునగు తాపసధర్మంబు నాచరించును? ౨౦

ఇంక మిక్కిలియుఁ శ్రమముం గలిగించు ధర్మము నే యాచరింపవలయు నని నీకుఁ గోర్కియుండునేని ధర్మంబున బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రుల నాలుగువర్ణంబులను తత్తద్ధర్మంబుల నతిక్రమింపకుండునట్లు పాలింపుము; ఇది మిక్కిలియు శ్రమకరమయిన ధర్మము. ౨౧

ధర్మజ్ఞుఁడవగు రామా! ధర్మవేత్తలు నాలుగాశ్రమంబులలోను గృహస్థాశ్రమమే శ్రేష్ఠమని చెప్పుదురుగదా! అట్టి గృహస్థాశ్రమంబు నెట్లు విడిచిపెట్టుదువు? ౨౨

నేను విద్యచేతను స్థానంబునను జన్మంబునను అన్నిఁటను నీకన్నం జిన్నవాఁడను; అట్టి నేను జ్యేష్ఠుండవు నీవుండఁగా భూమి నెట్లు పాలింపఁగలను? ౨౩

నేను బాలుండనుమాత్రమె కాను; హీనబుద్ధిని; హీనస్థితి నున్నవాఁడను; నీవును నన్ను విడిచినచో జీవింపఁజాలను; ఇంక నెట్లు రాజ్యంబుఁ బాలింతును? ౨౪

ధర్మజ్ఞుఁడవగు రామా! నీవు నిజధర్మంబు నవలంబించి బంధువులం గూడి యకంటకంబగు నీపిత్ర్యరాజ్యంబునంతయుఁ జక్కఁగాఁ బాలింపుము. ౨౫

జనులందఱును, వసిష్ఠుఁడు మొదలగు మంత్రకోవిదులగు ఋత్విజులును ఇచ్చటనే నీకు సమంత్రకంబుగాఁ బట్టాభిషేకంబు గావింతురుగాక!

లోకంబుల నంతయుఁ జయించినపిదప దేవతలచేఁ బట్టాభిషిక్తుండయిన

విజిత్య తరసా లోకాన్మరుద్భి రివ వాసవః. ౨౭

ఋణాని త్రీణ్యపాకుర్వ న్సుహృద స్సాధు నిర్వహన్,
సుహృద స్తర్పయ న్కామై స్త్వ మే వాత్రానుశాధి మామ్. ౨౮

అద్యాఽర్య! ముదితా స్సన్తు సుహృద స్తేఽభిషేచనే,
అద్య భీతాః పలాయన్తాం దుర్హృద స్తే దిశో దశ. ౨౯

ఆక్రోశం మమ మాతుశ్చ ప్రమృజ్య పురుషర్షభ!,
అద్య తత్ర భవన్తం చ పితరం రక్ష కిల్బిషాత్. 3౦

శిరసా త్వాఽభియాచేఽహం కురుష్వ కరుణాం మయి,
బాన్ధవేషుచ సర్వేషు భూతే ష్వివ మహేశ్వరః. 3౧

అథైత త్పృష్ఠతః కృత్వా వనమేవ భవా నితః,
గమిష్యతి గమిష్యామి భవతా సార్ధ మ ప్యహమ్. 3౨
తథాపి రామో భరతేన తామ్యతా
ప్రసాద్యమాన శ్శిరసా మహీపతిః,
నచైవ చక్రే గమనాయ సత్త్వవా
న్మతిం పితు స్తద్వచనే ప్రతిష్ఠితః. 33
తదద్భుతం స్థైర్య మవేక్ష్య రాఘవే
సమం జనో హర్ష మవాప దుఃఖితః,
న యాత్యయోధ్యా మితి దుఃఖితోఽభవత్
స్థిరప్రతిజ్ఞత్వ మవేక్ష్య హర్షితః. 3౪

యింద్రుఁడువలె నీవు మాచే నభిషిక్తుఁడవై ప్రజలం బాలించుపొంటె నయోధ్యాపురికిం బొమ్ము. ౨౭

దేవర్షిపితృఋణంబుల మూఁడింటిని దీర్చుకొని శత్రువులను సంహరింపుచు స్నేహితులకు సమస్తాభీష్టంబుల నొసంగి సంతోషంబు గల్గించుచు అట్లు రాజ్యంబును నన్నును నీవే పాలింపవలయును. ౨౮

పూజ్యుఁడవగు రాముఁడా! ఇప్పుడే నీపట్టాభిషేకమయినవిమ్మట నీస్నేహితులందఱు సంతోషింతురుగాక! ఇప్పుడే నీశత్రువులందఱు భయంబున దశదిశలకుం బాఱిపోవుదురుగాక! ౨౯

పురుషశ్రేష్ఠుఁడవగు రాముఁడా! నాతల్లి గావించినదుష్కార్యమును సరిచేసి పూజ్యుఁడగు మనతండ్రికిఁ బాపంబు గలుగకుండునట్లు నీవు గావింప వలయును. ౩౦

నిన్ను సాష్టాంగముగ నమస్కరించి ప్రార్థించుచున్నాను; మహేశ్వరుండు ప్రాణులయందుంబోలె నీవు నాయందును బంధువులయందఱియందును అనుగ్రహంబు సేయవలయును. ౩౧

ఇంక నీవు నెంత ప్రార్థించినను వినక వనమునకే పోదువేని నేనును నీవెంబడి వనంబునకు వచ్చెదను. అని భరతుఁడు రామునితోఁ జెప్పెను. ౩౨

మహాధైర్యశాలియగు రాముఁడు భరతుం డతివినయంబున నెంతప్రార్థించినను దండ్రియాజ్ఞం బాలించుటయందు స్థిరుఁడై యయోధ్యకుఁ బోవ నిచ్ఛింపఁడయ్యె. ౩౩

జనులందఱు అత్యద్భుతంబగు రాముని స్థైర్యంబులఁ జూచి యేకకాలంబున సంతోషంబును దుఃఖంబునుం బొందిరి; అయోధ్యకు రాఁడని దుఃఖమునొందిరి; స్థిరప్రతిజ్ఞుండని సంతోషంబునొందిరి. ౩౪

తమృత్విజో నైగమయూథవల్లభా
స్తదా విసంజ్ఞాశ్రుకలాశ్చ మాతరః,
తథా బ్రువాణం భరతం ప్రతుష్టువుః
ప్రణమ్య రామం చ యయాచిరే సహ. 3౫

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే షడుత్తరశతతమస్సర్గః.

---

## సప్తోత్తరశతతమస్సర్గః

పునరేవం బ్రువాణం తం భరతం లక్ష్మణాగ్రజః,
ప్రత్యువాచ తత శ్శ్రీమాన్ జ్ఞాతిమధ్యేఽభిసత్కృతః. ౧

ఉపపన్న మిదం వాక్యం యత్త్వ మేవ మభాషథాః,
జాతః పుత్రో దశరథా త్కైకేయ్యాం రాజసత్తమాత్. ౨
పురా భ్రాతః పితా నస్స మాతరం తే సముద్వహన్,
మాతామహే సమాశ్రౌషీ ద్రాజ్యశుల్క మనుత్తమమ్. 3

దైవాసురే చ సంగ్రామే జనన్యై తవ పార్థివః,
సమ్ప్రహృష్టో దదౌ రాజా వర మారాధితః ప్రభుః. ౪
తత స్సా సమ్ప్రతిశ్రావ్య తవ మాతా యశస్వినీ,
అయాచత నరశ్రేష్ఠం ద్వౌ వరౌ వరవర్ణినీ. ౫
తవ రాజ్యం నరవ్యాఘ్ర! మమ ప్రవ్రాజనం తథా,

తౌ చ రాజా తదా తస్యై నియుక్తః ప్రదదౌ వరౌ. ౬

తేన పిత్రాఽహ మప్యత్ర నియుక్తః పురుషర్షభ!,

అప్పు డట్లు యంత్రయంత్రంబుగా రామునకుఁ జెప్పుచున్న భరతుం జూచి ఋత్విజులును పౌరముఖ్యులును కన్నీళ్లచేఁ దడఁబడుమాటలుగల తలులును మిక్కిలియుఁ బ్రస్తుతించిరి; అంత వారలందఱు రామునకు నమస్కారంబు గావించి సవినయంబుగాఁ బ్రార్థించిరి. ౩౪

ఇది నూటయాఱవసర్గము.

---

## నూటయేడవసర్గము

అంత శ్రీమంతుఁడగు లక్ష్మణునియన్న రాముఁడు భరతునిచేఁ బూజితుండై బంధుమధ్యంబున మరల నీప్రకారంబునం జెప్పుచున్న భరతుంజూచి యిట్లని బదులుచెప్పెను. ౧

నీవుచెప్పినమాట రాజశ్రేష్ఠుండగు దశరథమహారాజునకుఁ గైకేయియందు జన్మించినట్టి సత్పుత్రుండవగు నీకు యోగ్యముగ నేయున్నది. ౨

మున్ను మనతండ్రి దశరథమహారాజు నీతల్లిని కైకేయిని వివాహమాడునప్పుడు నీతాతయగు కేకయమహారాజునకుఁ గైకేయికిఁ బుట్టినవానికే రాజ్యంబు నొసంగెదనని వాగ్దానంబు గావించెను. ౩

ప్రభుండగుదశరథమహారాజు, మఱియుం దేవాసురయుద్ధంబునందు నీతల్లి గావించినసేవకు సంతోషించి యాబిడకు రెండువరంబు లొసంగెను.

పురుషశ్రేష్ఠుండవగు భరతుఁడా! అంత యశస్వినియు నుత్తమవనితయు నగు నీతల్లి కైకేయి పురుషశ్రేష్ఠుండగు దశరథమహారాజుచే శపథము చేయించి యీరెండువరంబులకును ఒకదానికి నీకు రాజ్యంబును, రెండవదానికి నాకు వనవాసమును అడిగెను. ౪

అప్పుడు దశరథమహారాజు అబిడయిష్టప్రకారము ఆరెండువరంబుల నొసంగెను. ౫

పురుషశ్రేష్ఠుండవగు భరతుఁడా! అట్లు తండ్రియగుదశరథమహారాజు

చతుర్దశ వనే వాసం వర్షాణి వరదానికమ్. ౮

సోఽహం వన మిదం ప్రాప్తో నిర్జనం లక్ష్మణాన్వితః,
సీతయా చాప్రతిద్వన్ద్వ స్సత్యవాదే స్థితః పితుః. ౯

భవా నపి తథే త్యేవ పితరం సత్యవాదినమ్,
కర్తు మర్హసి రాజేన్ద్ర! క్షిప్ర మే వాభిషేచనాత్. ౯
ఋణా న్మోచయ రాజానం మత్కృతే భరత! ప్రభుమ్,
పితరం చాపి ధర్మజ్ఞం మాతరం చాభినన్దయ. ౧౦

శ్రూయతే హి పురా తాత! శ్రుతి ర్గీతా యశస్వినా,
గయేన యజమానేన గయే ష్వేవ పితౄ న్ప్రతి. ౧౧
పున్నామ్నో నరకా ద్యస్మా త్పితరం త్రాయతే సుతః,
తస్మా త్పుత్ర ఇతి ప్రోక్తః పితౄ న్యత్పాతి వా సుతః. ౧౨

ఏష్టవ్యా బహవః పుత్రా గుణవన్తో బహుశ్రుతాః,
తేషాం నై సమవేతానా మపి కశ్చి ద్గయాం వ్రజేత్. ౧౩

ఏవం రాజర్షయ స్సర్వే ప్రతీతా రాజనన్దన!,
తస్మా త్త్రాహి నరశ్రేష్ఠ! పితరం నరకా త్ప్రభో!. ౧౪

అయోధ్యాం గచ్ఛ భరత! ప్రకృతీ రనురఞ్జయ,
శత్రుఘ్నసహితో వీర! సహ సర్వై ర్ద్విజాతిభిః. ౧౫
ప్రవేక్ష్యే దణ్డకారణ్య మహ మప్యవిలమ్బయన్,
ఆభ్యాం తు సహితో రాజన్! వైదేహ్యా లక్ష్మణేన చ. ౧౬

నీకు రాజ్యంబు నొసంగి నన్ను వరదానము చొప్పునఁ బదునాలుగు సంవత్స
రంబు లడవి నుండుమని యాజ్ఞాపించెను. ౭

అట్లు నేను తండ్రిమాటను శిరసావహించి యాయన సత్యవచనంబుఁ గాపాడుటకై యెవ్వరు చెప్పినను నిలువక లక్ష్మణుని సీతనుం గూడి నిర్జనంబగు నీవనంబునకు వచ్చినాను. ౮

రాజశ్రేష్ఠుండగు భరతుఁడా! నీవును తండ్రియాజ్ఞ చొప్పున శీఘ్రంబునం బట్టాభిషేకము గావించుకొని తండ్రిమాటను సత్యము గావింపవలెను. ౯

భరతుఁడా! నీవు నామాట విని మహారాజుండగు దశరథుని కైకేయీ ఋణవిముక్తుం గావించి ధర్మజ్ఞుండగు నాయనకును, నీతల్లికిని సంతోషంబు గలుగఁ జేయుము. ౧౦

నాయనా! మున్ను గయాఖ్యక్షేత్రంబునఁ బితృయజనంబు గావింపుచు మహాత్ముండగు గయుండు నుడివిన గాథను వినుచున్నాముగదా! ౧౧

తండ్రిని "పుత్" అను పేరుగల నరకమునం బడనీక రక్షించుటవలనను తండ్రిపేర నిష్టాపూర్తాదులు గావించి పరలోకంబునఁ దండ్రికి సుఖంబు గలిగించి రక్షించుటవలనను కొడుకునకుఁ బుత్రుఁడను పేరు గలిగినది. ౧౨

గుణవంతులును విద్యావంతులునగు పెక్కుపుత్రులం బొందవలెనని కోరవలెను. పెక్కుపుత్రులున్నయెడ వారలలో నొక్కఁడైన నాగయాక్షేత్రంబునకుఁ బోవును. అని గయుండు గాథం జెప్పెను. ౧౩

రాజపుత్రుండవు సమర్థుండవు పురుషశ్రేష్ఠుండవునగు భరతుఁడా! ఇట్లు రాజర్షులందఱును అనుష్ఠించుచున్నారు. అందువలన మనతండ్రియగు దశరథ మహారాజునకు నరకము గలుగకుండునట్లు గావింపుము. ౧౪

పరాక్రమశాలివగు భరతుఁడా! నీ వయోధ్యకుం బోయి శత్రుఘ్నుని వసిష్ఠుండు మున్నగు బ్రాహ్మణోత్తములం గూడి జనులం బాలింపుము. ౧౫

రాజవగు భరతుఁడా! ఇంక నేనును ఆలస్యము సేయక ఈసీతాలక్ష్మణుల నిర్వురం గూడి దండకారణ్యంబునకుఁ బోయెదను. ౧౬

త్వం రాజా భరత! భవ స్వయం నరాణాం
వన్యానా మహ మపి రాజరా ణ్మృగాణామ్,
గచ్ఛ త్వం పురవర మద్య సమ్ప్రహృష్ట
స్సంహృష్ట స్త్వహ మపి దణ్డకా న్ప్రవేక్ష్యే. ౧౭
ఛాయాం తే దినకరభాః ప్రబాధమానాం
వర్షత్రం భరత! కరోతు మూర్ధ్ని శీతామ్,
ఏతేషా మహ మపి కాననద్రుమాణాం
ఛాయాం తా మతిశయినీం సుఖీ శ్రయిష్యే. ౧౮
శత్రుఘ్నః కుశలమతి స్తు తే సహాయ
స్సౌమిత్రి ర్మమ విదితః ప్రధానమిత్రమ్,
చత్వార స్తనయవరా వయం నరేన్ద్రం
సత్యస్థం భరత! చరామ మా విషాదమ్. ౧౯

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే సప్తోత్తరశతతమస్సర్గః.

---

## అష్టోత్తరశతతమస్సర్గః

ఆశ్వాసయన్తం భరతం జాబాలి ర్బ్రాహ్మణోత్తమః,
ఉవాచ రామం ధర్మజ్ఞం ధర్మాపేత మిదం వచః. ౧

సాధు రాఘవ! మాభూ త్తే బుద్ధి రేవం నిరర్థికా,
ప్రాకృతస్య నరస్యేవ హ్యార్యబుద్ధే ర్మనస్వినః. ౨
కః కస్య పురుషో బన్ధుః కి మాప్యం కస్య కేనచిత్,
యదేకో జాయతే జన్తు రేక ఏవ వినశ్యతి. ౩

తస్మా న్మాతా పితా చేతి రామ! సజ్జేత యో నరః,

భరతుఁడా! నీవు మనుష్యులకందఱకు రాజగుము. నేను వనంబున నుండు మృగంబుల కంతయు రాజుగా నుండెదను. నీవు శీఘ్రంబున నయోధ్యకుం బొమ్ము. నేను ఇప్పుడె దండకారణ్యంబునకుఁ బోయెదను. ౧౭

భరతుఁడా! శ్వేతచ్ఛత్రము నీశిరసున సూర్యకిరణంబులం బాఱఁదోలునట్టి చల్లనినీడం గావించుగాక! నేనును సర్వోత్తమమయిన యీయడవి వృక్షంబులనీడ నాశ్రయించి సుఖంబున నుండెదను. ౧౮

నీకు సహాయుఁడు మిక్కిలియును బుద్ధిశాలి శత్రుఘ్నుండున్నాఁడు. నాకును ముఖ్యస్నేహితుండు లక్ష్మణుఁడున్నాఁడు. మనము నలువురమును అన్యోన్యసాహాయ్యంబున మనతండ్రియగు దశరథమహారాజుమాటను సత్యంబు గావింతము. దుఃఖంబు నొందకుము. అని రాముఁడు భరతునకుం జెప్పెను. ౧౯

ఇది నూటయేడవసర్గము.

---

## నూటయెనిమిదవసర్గము

బ్రాహ్మణశ్రేష్ఠుండగు జాబాలి, యట్లు భరతు నాశ్వాసించుచున్న సకలధర్మజ్ఞుండగు రాముం జూచి చార్వాకమతము నాశ్రయించి యధర్మిష్ఠంబగు నీమాటం జెప్పెను. ౧

రాముఁడా! మూఢునకుంబోలె మహాబుద్ధిశాలివి. మహాధైర్యశాలివగు నీకు ఇట్టి నిష్ప్రయోజన మయినబుద్ధి గలుగకుండుఁగాక! ౨

ఎవ్వని కెవ్వఁడు బంధువు? దేనిచేత నెవ్వని కేమికార్యమున్నది? పుట్టినప్పుడును ఎవ్వరును కూడఁబుట్టలేదు. చచ్చునప్పుడును ఎవ్వరును కూడఁ జావరు. 3

రాముఁడా! అట్లుండుటవలన నెవ్వఁడు తల్లియని తండ్రియని మిక్కి-

ఉన్మత్త ఇవ స జ్ఞేయో నాస్తి కశ్చిద్ధి కస్యచిత్. ౪

యథా గ్రామాన్తరం గచ్ఛన్నరః కశ్చిత్క్వచిద్వసేత్,
ఉత్సృజ్య చ తమావాసం ప్రతిష్ఠేతాపరేఽహని ౫
ఏవమేవ మనుష్యాణాం పితా మాతా గృహం వసు,
ఆవాసమాత్రం కాకుత్స్థ! సజ్జన్తే నాత్ర సజ్జనాః. ౬

పిత్ర్యం రాజ్యం పరిత్యజ్య స నార్హసి నరోత్తమ!,
ఆస్థాతుం కాపథం దుఃఖం విషమం బహుకణ్టకమ్. ౭

సమృద్ధాయామయోధ్యాయామాత్మానమభిషేచయ,
ఏకవేణీధరా హి త్వాం నగరీ సమ్ప్రతీక్షతే. ౮

రాజభోగాననుభవ మహార్హాన్పార్థివాత్మజ!,
విహర త్వమయోధ్యాయాం యథా శక్రస్త్రివిష్టపే. ౯

న తే కశ్చిద్దశరథస్త్వం చ తస్య న కశ్చన,
అన్యో రాజా త్వమప్యన్యస్తస్మాత్కురు యదుచ్యతే. ౧౦

బీజమాత్రం పితా జన్తోః శుక్లం రుధిరమేవ చ,
సంయుక్తమృతుమన్మాత్రా పురుషస్యేహ జన్మ తత్. ౧౧

లియుం శ్రద్ధతో ప్రవర్తించుచున్నవాఁడు పిచ్చివాఁడు. ఒకరికొకరికి నెంతమాత్రము సంబంధము లేదు. ౪

రామచంద్రా! ఎట్లు ఒకానొకఁడు గ్రామాంతరంబునకుఁ బోవునప్పుడు విశ్రమార్థం బొకచోట నిలిచియున్నట్టి ఆదినమంతయునుండి మఱునాఁడు దానివిడిచిపోవునో విడిచిపోయిన పిమ్మట ఆ స్థలముతో వానికెంతమాత్రము సంబంధము లేదో. అట్లు తల్లిదండ్రి గృహము ధనము అంతయు మనుష్యులకు వాసస్థానములు. వానియందుఁ జేరియుండువఱకును సంబంధముగలదు. విడిచిన పిమ్మట తలంచుకొనుటయైన ననావశ్యకము. అట్లుండఁ దల్లిదండ్రి ప్రీత్యర్థము వ్రతాదులు గావించుట వ్యర్థమని చెప్పనేల? ౫, ౬

పురుషశ్రేష్ఠుఁడవగు రామచంద్రా! ఇట్టి సద్బుద్ధిశాలివగు నీవు పిత్ర్యం బగు రాజ్యమును విడిచి దుఃఖకరంబును అనుచితంబును మిక్కిలియుం నుపద్రవంబుల కలదియునగు నీదుర్గమమార్గంబు ననలంబించుట యొంతమాత్రము సరిగాదు. ౭

సర్వసమృద్ధమయిన యయోధ్యాపట్టణంబునకుఁ బోయి పట్టాభిషేకంబుఁ జేసికొనుము. అయోధ్య ఏకవేణీధరయయి పతివ్రత భర్తనుంబోలె నిన్నెదురుచూచుచున్నది. ౮

రాజకుమారుండవగు రామచంద్రా! నీవు సర్వోత్తమములగు రాజభోగంబుల ననుభవించుచు స్వర్గమున దేవేంద్రుఁడుంబోలె నయోధ్యాపట్టణంబున విహరింపుము. ౯

నీకు దశరథునితో నేవిధమయిన సంబంధమును లేదు. నీతో దశరథునకును ఏవిధమయిన సంబంధమును లేదు. నీవు ఒకరాజవు. అతం డొకరాజు. మీయిద్దఱకు నేమియు సంబంధము లేదు. కావున నేను చెప్పునది చేయుము. ౧౦

జంతువునకుఁ దండ్రి యంత గొప్పకారణము కాఁడు. స్వల్పకారణమె. ఋతుకాలమునందు మాతృయోనియందు మిళితమయిన శుక్లశోణితములే ప్రధానకారణము. దానివలననె యీలోకంబునఁ బురుషుఁడు జన్మించుచున్నాఁడు. ౧౧

గత స్స నృపతి స్తత్ర గన్తవ్యం యత్ర తేన వై,
ప్రవృత్తి రేషా మర్త్యానాం త్వం తు మిథ్యా విహన్యసే. ౧౨

అర్థధర్మపరా యే యే తాం స్తాం ఛోచామి నేతరాన్,
తే హి దుఃఖ మిహ ప్రాప్య వినాశం ప్రేత్య భేజిరే. ౧౩

అష్టకా పితృదైవత్య మి త్యయం ప్రసృతో జనః,
అన్నస్యోపద్రవం పశ్య మృతో హి కి మశిష్యతి. ౧౪

యది భు క్త మి హాన్యేన దేహ మన్యస్య గచ్ఛతి,
దద్యా త్ప్రవసత శ్శ్రాద్ధం న తత్ప థ్యశనం భవేత్. ౧౫

దానసంవననా హ్యేతే గ్రన్థా మేధావిభిః కృతాః,
యజస్వ దేహి దీక్షస్వ తప స్తప్యస్వ స న్త్యజ. ౧౬

స నా స్తి పర మి త్యేవ కురు బుద్ధిం మహామతే!,
ప్రత్యక్షం య త్త దాతిష్ఠ పరోక్షం పృష్ఠతః కురు. ౧౭

స తాం బుద్ధిం పురస్కృత్య సర్వలోకనిదర్శినీమ్,

రాజ్యం త్వం ప్రతిగృహ్ణీష్వ భరతేన ప్రసాదితః. ౧౮

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డేఽష్టోత్తరశతతమస్సర్గః.

## నవోత్తరశతతమస్సర్గః

జాబాలేస్తు వచశ్శ్రుత్వా రామ స్సత్యాత్మనాం వరః,
ఉవాచ పరయా భక్త్యా స్వబుద్ధ్యా చావిపన్నయా. ౧
భవాన్మే ప్రియకామార్థం వచనం యదిహోక్తవాన్,
అకార్యం కార్యసఙ్కాశ మపథ్యం పథ్యసన్నిభమ్. ౨

నిర్మర్యాదస్తు పురుషః పాపాచారసమన్వితః,
మానం న లభతే సత్సు భిన్నచారిత్రదర్శనః. ౩

కులీన మకులీనం వా వీరం పురుషమానినమ్,
చారిత్ర మేవ వ్యాఖ్యాతి శుచిం వా యది వాఽశుచిమ్. ౪

అనార్య స్త్వార్యసఙ్కాశ శ్శౌచా ద్ధీన స్తథా శుచిః,
లక్షణ్యవదలక్షణ్యో దుశ్శీల శ్శీలవా నివ, ౫
అధర్మం ధర్మవేషేణ యదీమం లోకసఙ్కరమ్,
అభిపత్స్యే శుభం హిత్వా క్రియావిధివివర్జితమ్. ౬
కశ్చేతయానః పురుషః కార్యాకార్యవిచక్షణః,
బహుమంస్యతి మాం లోకే దుర్వృత్తం లోకదూషణమ్. ౭
కస్య ధాస్యా మ్యహం వృత్తం కేనవా స్వర్గ మాప్నుయామ్,
అనయా వర్తమానో హి వృత్త్యా హీనప్రతిజ్ఞయా. ౮

నిశ్చయంబు నవలంబించి భరతుని ప్రార్థనను విని రాజ్యంబు నంగీకరింపుము. అని జాబాలి రామునకుం జెప్పెను. ౧౮

ఇది నూటయెనిమిదవసర్గము.

---

## నూటతొమ్మిదవసర్గము

సర్వబుద్ధులలో నుత్తముండగు రాముండు జాబాలిచెప్పినమాటను విని తనకుంగల వైదికశ్రద్ధను విడువక బుద్ధిం జలనంబునొందక ఇట్లని చెప్పెను.

నీవు నాకుఁ బ్రియంబులగు పట్టాభిషేకాదులందుఁ గోర్కి గలుగుట కై చెప్పినమాట యుక్తమువలె నగుపడుచున్నదిగాని మిక్కిలి నయుక్తము. హితమువలెనే యున్నదిగాని మిక్కిలియుం గీడుదెచ్చునది. ౨

మర్యాదారహితుండును, పాపిష్ఠమయిన యాచారముగలవాఁడును, వేదవిరుద్ధమయిన యాచారమును విధించునట్టిమతంబు నవలంబించినవాఁడు నగు పురుషుని సత్పురుషు లెంతమాత్రము గౌరవింపరు. ౩

మంచికులంబునం బుట్టుటనుగాని దుష్టకులంబునం జన్మించుటనుగాని పరాక్రమశాలి యగుటనుగాని భయశీలుఁ డగుటనుగాని పరిశుద్ధుఁడగుటను గాని అపరిశుద్ధుండగుటనుగాని యాచారమే తెలుపును. ౪

నేను దుష్టుండనై యోగ్యుండనుంబోలె నపరిశుద్ధుండనై శుద్ధుండనుంబోలె, దుష్టలక్షణంబులుగలవాఁడనై మంచిలక్షణంబులు గలవాఁడనుంబోలె, దుస్స్వభావంబుగలవాఁడనై సత్స్వభావంబుగలవాఁడనుంబోలె మంగళకరంబగు ధర్మంబువిడిచి వైదికక్రియావిధులను వర్జించి లోకసంకరకారణంబగు నీవు చెప్పినయధర్మంబు నవలంబింతునేని అట్టిదురాచారుండను లోకదూషకుండ నగునన్ను లోకంబునందుఁ గార్యాకార్యంబులు దెలిసినవాఁడును జ్ఞానవంతుఁడునగు పురుషుం డెవ్వఁడు సన్మానించును? ౫-౭

నేను శాస్త్రప్రతిజ్ఞనువిడిచి నీవు చెప్పినట్లు ఈయధర్మిష్ఠాచారంబు నవలంబింతునేని యటుపిమ్మట నామాట నెవ్వరు విందురు? నాకును ఏయుపాయంబున స్వర్గంబు గల్గును? ౮

కామవృత్త స్త్వయం లోకః కృత్స్నః సముపవర్తతే,
యద్వృత్తా స్సన్తి రాజాన స్తద్వృత్తా స్సన్తి హి ప్రజాః. ౯

సత్య మే వానృశంసం చ రాజవృత్తం సనాతనమ్,
తస్మా త్సత్యాత్మకం రాజ్యం సత్యే లోకః ప్రతిష్ఠితః. ౧౦

ఋషయ శ్చైవ దేవా శ్చ సత్య మేవ హి మేనిరే,
సత్యవాదీ హి లోకేఽస్మి న్పరమం గచ్ఛతి క్షయమ్. ౧౧
ఉద్విజన్తే యథా సర్పాన్నరా దనృతవాదినః,
ధర్మ స్సత్యం పరో లోకే మూలం స్వర్గస్య చోచ్యతే. ౧౨
సత్యమేవేశ్వరో లోకే సత్యం పద్మా శ్రితా సదా,
సత్యమూలాని సర్వాణి సత్యా న్నాస్తి పరం పదమ్. ౧౩

దత్త మిష్టం హుతం చైవ తప్తాని చ తపాంసి చ,
వేదా స్సత్యప్రతిష్ఠానా స్తస్మా త్సత్యపరో భవేత్. ౧౪

ఏకః పాలయతే లోక మేకః పాలయతే కులమ్,
మజ్జత్యేకో హి నిరయ ఏక స్స్వర్గే మహీయతే. ౧౫

సోఽహం పితు ర్నియోగం తు కిమర్థం నానుపాలయే,
సత్యప్రతిశ్రవ స్సత్యం సత్యేన సమయీకృతః. ౧౬

నైవ లోభా న్న మోహా ద్వా న హ్యజ్ఞానా త్తమోన్వితః,
సేతుం సత్యస్య భేత్స్యామి గురో స్సత్యప్రతిశ్రవః. ౧౭

నే నట్టిధర్మంబు నవలంబింతునేని జనులందఱు యథేచ్ఛముగా సంచరించుచు నధర్మమార్గంబు నవలంబించి చెడిపోవుదురు. రాజు ఏయాచారము నవలంబించునో ఆయాచారము నేకదా జనులుగూడ నవలంబింతురు! ౯

దయయె ప్రధానముగాఁగల శాశ్వతంబగు రాజధర్మము సత్యరూపము గావున రాజ్యమంతయు సత్యస్వరూపమయినది. ఆసత్యమునందే లోకమంతయుఁ బ్రతిష్ఠితమయినది. నేనట్టిసత్యము నెట్లువదలుదును? ౧౦

ఋషులును దేవతలును సత్యమునే పరమోత్కృష్టముగాఁ జెప్పిరి. ఈలోకంబున సత్యవాది యగువాఁడు పరమపదంబు నొందు. ౧౧

జనులు అబద్ధమాడువానిం జూచి సర్పమును జూచినట్లు భయపడుదురు. సత్యమే పరమధర్మము. నిజమే స్వర్గమునకును గారణమని చెప్పుదురు.

ఈశ్వరుఁడును సత్యస్వరూపుఁడే; లక్ష్మియును సత్యమునే యెల్లప్పుడు నాశ్రయించియుండును; సమస్తమునకు సత్యమే మూలాధారము; సత్యమున కన్నను అధిక మేదియును లేదు. ౧౩

దానములును యాగములును హోమములును దపస్సులును వీనికన్నిఁటికిని సత్యమేయాధారము; వేదములకును సత్యమే యాధారము; కావున సత్యమును వదలఁగూడదు. ౧౪

లోకంబున నొకఁడు లోకంబుఁ బాలించును; ఒకఁడు కులమును బాలించును; ఒకఁడు నరకంబునంబడును; ఒకఁడు స్వర్గంబునఁ దేజరిల్లుచుండును. అట్లు సత్యవంతుఁడును అసత్యవంతుఁడును దత్తత్ఫలంబులం బొందుదురు. ౧౫

సత్యప్రతిజ్ఞుండను, సత్యముగ వనవాసంబు గావించెదనని శపథము గావించినవాఁడనగు నేను సత్యస్వరూపమయిన తండ్రియాజ్ఞను ఎట్లుగావింపకుందును? ౧౬

సత్యప్రతిజ్ఞుండగు నేను రాజ్యలోభంబునంగాని చిత్తభ్రమంబునం గాని యజ్ఞానంబునంగాని తమోగుణంబునొందిగాని యేదియెట్లయినను నాతండ్రి దశరథమహారాజు సత్యంబును భేదింపను. ౧౭

అసత్యసన్ధస్య సతశ్చలస్యాస్థిరచేతసః,
నైవ దేవా న పితరః ప్రతీచ్ఛన్తీతి నశ్శ్రుతమ్. ౧౮

ప్రత్యగాత్మమిమం ధర్మం సత్యం పశ్యామ్యహం స్వయమ్,
భారస్సత్పురుషాచీర్ణస్తదర్థమభిమన్యతే. ౧౯

క్షాత్రం ధర్మమహం త్యక్ష్యే హ్యధర్మం ధర్మసంహితమ్,
క్షుద్రైర్నృశంసైర్లుబ్ధైశ్చ సేవితం పాపకర్మభిః. ౨౦

కాయేన కురుతే పాపం మనసా సమ్ప్రధార్య చ,
అనృతం జిహ్వయా చాహ త్రివిధం కర్మపాతకమ్. ౨౧

భూమిః కీర్తిర్యశో లక్ష్మీః పురుషం ప్రార్థయన్తి హి,
స్వర్గస్థం చానుపశ్యన్తి సత్యమేవ భజేత తత్. ౨౨

శ్రేష్ఠం హ్యనార్యమేవ స్యాద్యద్భవానవధార్య మామ్,
ఆహ యుక్తికరైర్వాక్యైరిదం భద్రం కురుష్వ హ. ౨౩

కథం హ్యహం ప్రతిజ్ఞాయ వనవాసమిమం గురోః,
భరతస్య కరిష్యామి వచో హిత్వా గురోర్వచః. ౨౪
స్థిరా మయా ప్రతిజ్ఞాతా ప్రతిజ్ఞా గురుసన్నిధౌ,
ప్రహృష్యమాణా సా దేవీ కైకేయీ చాభవత్తదా. ౨౫

వనవాసం వసన్నేవం శుచిర్నియతభోజనః,
మూలైః పుష్పైః ఫలైః పుణ్యైః పితౄన్ దేవాంశ్చ తర్పయన్.

అసత్యంబుఁ జెప్పువాఁడును జపలుండును అస్థిరహృదయుండునగు వాఁడు హవ్యకవ్యంబు లొసంగినను, దేవతలుగాని పితరులుగాని యంగీకరింప రని మేము వినియున్నాము. ౧౮

సత్యరూపంబగు నీధర్మము ఆత్మస్వరూపమని నాయభిప్రాయము; కావున నే సత్పురుషు లాచరించినట్లు ఈజటావల్కలాదిభారమును అంగీకరించి యున్నాను. ౧౯

క్షుద్రులును క్రూరులును లుబ్ధులును పాపులునగువారలచే సేవింపఁ బడునట్టిక్షత్రియధర్మమును నేను విడిచెదను; అందు ధర్మము మిక్కిలియుం స్వల్పము; అధర్మ మధికము. ౨౦

మనుష్యుఁడు మొదలు మనసున నిశ్చయించుకొనును; అపిమ్మట దేహముచేఁ జేయును; నాలుక నబద్ధమాడును; ఇట్లు మానసిక కాయికవాచికము లని పాపము మూఁడువిధములు. ౨౧

భూమియుఁ గీర్తియుం లక్ష్మియుం సత్యవంతుఁడగు పురుషునే పొందవల యునని కోరుచుండును. అతఁడు స్వర్గస్థుఁడైనను ఆతనియందే దృష్టియుంచి యుండును. కావున సత్యమునే యవలంబింపవలయును. ౨౨

నీవు ఉత్తమంబనియెంచి "ఇది మంగళకరము; దీనిం జేయుము" అని యుక్తియుక్తంబుగా నాకుఁ జెప్పితివే; ఈమాట యెంతమాత్రము యుక్తమయినదిగాదు. ౨౩

నేను తండ్రియొద్ద వనవాసంబు జేసెదనని ప్రతిజ్ఞచేసి యిప్పుడు తండ్రిమాటను విడిచి భరతునిమాట యెట్లుచేయుదును? ౨౪

నేను నాతండ్రిసన్నిధానంబున స్థిరమయినప్రతిజ్ఞ చేసినాను; అప్పు డందుకుఁ గైకేయీదేవియు మిక్కిలియు సంతోషంబునొందినది. అట్టిదాని నిప్పుడు విడుచుట సరిగాదు. ౨౫

నాకుఁ గార్యాకార్యంబులు దెలియును. నేను శ్రద్ధతోఁ గృత్రిమ బుద్ధిఁబరిత్యజించి పరిశుద్ధుండనై స్వల్పాహారుండనై వనవాసంబు గావింపుచు

సస్తుష్టపఙ్క్తిరగ్రోఽహం లోక యాత్రాం ప్రవ ర్తయే,
అకుహ శ్శ్రద్దధానస్స న్కార్యాకార్యవిచక్షణః. ౨౭
కర్మభూమి మిమాం ప్రాప్య క ర్తవ్యం కర్మ యచ్ఛుభమ్,
అగ్ని ర్వాయు శ్చ సోమశ్చ కర్మణాం ఫలభాగినః. ౨౮

శతం క్రతూనా మాహృత్య దేవరా ట్త్రిదివం గతః,
తపాంస్యుగ్రాణి చాస్థాయ దివం యాతా మహర్షయః. ౨౯

అమృష్యమాణః పున రుగ్రతేజా
నిశమ్య తం నా స్తిక వాక్యహేతుమ్,
అథాబ్రవీ త్తం నృపతే స్తనూజో
విగర్హమాణో వచనాని తస్య. ౩౦
సత్యం చ ధర్మం చ పరాక్రమం చ
భూతానుకమ్పాం ప్రియవాదితాం చ,
ద్విజాతిదేవాతిథిపూజనం చ
పన్థాన మాహు స్త్రిదివస్య స న్తః. ౩౧
తే నైవ మాజ్ఞాయ యథావదర్థ
మేకోదయం సమ్ప్రతిపద్య విప్రాః,
ధర్మం చర న్త స్సకలం యథావ
త్కాఙ్క్షన్తి లోకాగమ మప్రమత్తాః. ౩౨
నిన్దా మ్యహం కర్మ పితుః కృతం త
ద్యస్త్వా మగృహ్ణా ద్విషమస్థబుద్ధిమ్,
బుద్ధ్యాఽన యైవం విధయా చర న్తం
సునా స్తికం ధర్మపథా దపేతమ్. ౩౩

త్రములగు మూలంబులచేతను పుష్పంబులచేతను ఫలంబులచేతను పితృదేవతలను దేవతలను దృప్తిగావింపుచు సంతుష్ట సర్వేంద్రియుండనై కాలంబు గడపెదను.

జనులు కర్మభూమి నుండువఱకుఁ గర్మము నవశ్యము జేయవలయును. అట్లు అగ్నియును వాయువును జంద్రుఁడును గర్మభూమియం దుండునప్పుడు కర్మములు గావించి అగ్నిత్వ, వాయుత్వ, చంద్రత్వములం బొందిరి. ౨౮

దేవేంద్రుఁడు నూఱుయాగంబులు సేయుటవలన స్వర్గాధిపత్యంబు నొందెను. మహర్షులును భయంకరంబగు తపస్సు గావించి స్వర్గంబు నొందిరి. అని రాముఁడు జాబాలికిం జెప్పెను. ౨౯

అంత భయంకరతేజుండగు దశరథమహారాజపుత్రుండు రాముండు ఆజాబాలి చెప్పిన నాస్తిక వాక్యంబునందలి కుయుక్తిం దలంచి సహింపంజాలక యతనిమాటలను నిందింపుచు మరల నతనిం జూచి యిట్లని చెప్పెను. ౩౦

సత్యము ధర్మము పరాక్రమము భూతదయ ప్రియభాషణము దేవతార్చనము బ్రాహ్మణపూజ అతిథిసత్కారము ఇవన్నియుం స్వర్గమునకు మార్గమని సత్పురుషులు చెప్పుదురు. ౩౧

కావుననె బ్రాహ్మణోత్తములందఱు యథార్థముగ నీయర్థముఁ దెలిసి యందఱు నైకమత్యంబున నేమఱక స్వస్వవర్ణాశ్రమ విహితంబులగు ధర్మముల నన్నింటిని యథాశాస్త్రంబుగ నాచరింపుచు స్వర్గాదిదివ్యలోకంబులం బొందఁ గోరుచున్నారు. ౩౨

ఇట్లు వేదవిరుద్ధంబగు బుద్ధిగలవాఁడవు, వైదికవేషంబు ధరించి యంతరంగంబున మహానాస్తికుండవై నాస్తికమతంబు బోధించువాఁడవు, ధర్మమార్గంబు వదలినవాఁడవునగు నిన్ను దగ్గఱకుఁ దీసినట్టి నాతండ్రి గూడ నిందనీయుఁ డగుచున్నాఁడు.

యథాహి చోర స్స తథాహి బుద్ధ
స్తథాగతం నాస్తిక మత్ర విద్ధి,
తస్మాద్ధి య శ్శఙ్క్యతమః ప్రజానాం
న నాస్తికే నాభిముఖో బుధ స్స్యాత్. ౩౪

త్వత్తో జనాః పూర్వతరే వరా శ్చ
శుభాని కర్మాణి బహూని చక్రుః,
జిత్వా సదేమం చ పరం చ లోకం
తస్మా ద్ద్విజా స్స్వస్తి హుతం కృతం చ. ౩౫
ధర్మే రతా స్సత్పురుషై స్సమేతా
స్తేజస్వినో దానగుణ ప్రధానాః,
అహింసకా వీతమలా శ్చ లోకే
భవన్తి పూజ్యా మునయః ప్రధానాః. ౩౬
ఇతి బ్రువన్తం వచనం సరోషం
రామం మహాత్మాన మదీనస త్త్వమ్,
ఉవాచ తథ్యం పున రాస్తికంచ
సత్యం వచ స్సానునయం చ విప్రః. ౩౭
న నాస్తికానాం వచనం బ్రవీమ్యహం
న నాస్తికోఽహం నచ నాస్తి కించన,
సమీక్ష్య కాలం పునరాస్తికోఽభవం
భవేయ కాలే పునరేవ నాస్తికః. ౩౮

సచాపి కాలోఽయ ముపాగత శ్శనై
ర్యథా మయా నాస్తికవాగుదీరితా,

బుద్ధుఁడు దొంగవంటివాఁడుగదా! నాస్తికునకును బుద్ధునకును ఎంత మాత్రము భేదములేదు. కావున, నాస్తికుని జనులు కనిపెట్టి యుండవలెను. పండితుఁడగువాఁడు నాస్తికునియెదుట నిలువరాదు. ౩౪

నీకు మునుపటివారలును, నీకన్న నుత్తములునగువార లనేకులు శుభకర్మంబు లనేకంబులం గావించి ఇహాపరలోకంబుల రెంటినిజయించి సర్వోత్కర్షంబున నాకాశంబునందు చంద్రనక్షత్రాదిరూపంబున వెలుంగుచున్నారు. అందువలన ద్విజులు యాగాదిశుభకర్మంబులం గావింతురు. ౩౫

మిక్కిలిగాఁ ధార్మికులును సత్పురుషులతో మాత్రము సహవాసము సేయువారలును తేజశ్శాలులును పరమదాతలును అహింసకులును నిర్మలులు నగు మునిశ్రేష్ఠులు లోకమునకెంతయుఁ బూజనీయులు. అని రాముండు జాబాలితోఁ జెప్పెను. ౩౬

అంత జాబాలి యిట్లు సరోషంబుగాఁ జెప్పుచున్నమహాత్ముండును మహాబలుండునగు రాముంజూచి వినయంబుగ ననునయింపుచు సమస్తశాస్త్రసమ్మతంబును ఆస్తికమతబోధకంబును సత్పురుష సమ్మతంబును యథార్థంబు నగు నీమాటం జెప్పెను. ౩౭

నేను నాస్తికమతంబుఁ జెప్పలేదు. నేనును నాస్తికుండను గాను. పరలోకము మొదలగునది లేదని నాయభిప్రాయము గాదు. నాస్తికు లెవ్వరైనను నాస్తికయుక్తులు చెప్పునపుడు వానినన్నింటిని నేను ఖండించుచుందును. మఱియు మహాధర్మసంకటకాలము వచ్చినపుడుమాత్రం బెట్లయినను కార్యంబు కావలయునని నాస్తికమతోపన్యాసము గావింతునుగాని వేఱుగాదు. ౩౮

రాముఁడా! ఇప్పుడు అట్టిమహాధర్మసంకటకాలము వచ్చినది కావున నేను నాస్తికవాక్యంబులాడితిని. నిన్నుఁ బ్రసన్నుంగావించి యయోధ్యకు

నివర్తనార్థం తవ రామ కారణా
త్ప్రసాదనార్థం చ మయైతదీరితమ్. ౩౯
ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే నవోత్తరశతతమస్సర్గః.

---

## దశోత్తరశతతమస్సర్గః

క్రుద్ధమాజ్ఞాయ రామం తు వసిష్ఠః ప్రత్యువాచ హ,
జాబాలి రపి జానీతే లోకస్యాస్య గతాగతిమ్. ౧

నివర్తయితు కామ స్తు త్వా మేత ద్వాక్య ముక్తవాన్,
ఇమాం లోకసముత్పత్తిం లోకనాథ! నిబోధ మే. ౨

సర్వం సలిల మే వాసీ త్పృథివీ యత్ర నిర్మితా,
తత స్సమభవ ద్బ్రహ్మా స్వయమ్భూః దైవతై స్సహ. ౩
స వరాహ స్తతో భూత్వా ప్రోజ్జహార వసున్ధరామ్,
అసృజచ్చ జగ త్సర్వం సహపుత్రైః కృతాత్మభిః. ౪

ఆకాశప్రభవో బ్రహ్మా శాశ్వతో నిత్య అవ్యయః,
తస్మాన్మరీచి స్సంజజ్ఞే మరీచేః కాశ్యప స్సుతః. ౫

వివస్వా న్కాశ్యపా జ్జజ్ఞే మను ర్వైవస్వతః స్మృతః,
స తు ప్రజాపతిః పూర్వ మిక్ష్వాకుస్తు మనో స్సుతః. ౬
యస్యేయం ప్రథమం దత్తా సమృద్ధా మనునా మహీ,

మరలింపవలెనని చెప్పితినిగాని పేరుగాను. అని జాబాలి రామునకుఁ జెప్పెను.

ఇది నూటతొమ్మిదవసర్గము.

---

## నూటపదియవసర్గము

అంత వసిష్ఠుఁడు రాముఁడు జాబాలినాస్తికవచనంబులకుఁ గోపంబు నొందినాఁడని తెలిసికొని రాముం జూచి యిట్లని చెప్పెను.

జాబాలియును జనులు పరలోకంబు నొందుదురనియుఁ బుణ్యాంతంబున మరల నీలోకంబునకు వత్తురనియుఁ దెలియును. నాస్తికుండుగాఁడు. ౧

అతఁడు నిన్ను ఎట్లయినను అయోధ్యకు వచ్చునట్లు చేయవలయు ననియే యీమాటం జెప్పినాఁడు.

లోకనాథుఁడవగు రాముఁడా! నేను లోకోత్పత్తిప్రకారము నంతయుఁ జెప్పెదను; వినుము. ౨

భూమిని సృజించినపిదప భూమిపై నంతయుం జలము నిండియుండెను. అందు బ్రహ్మదేవుఁడును దేవగణములును జన్మించిరి. ౩

అంత విష్ణుదేవుఁడు వరాహరూపంబున నవతరించి భూమి నుద్ధరించెను.

అంత నాబ్రహ్మదేవుఁడు పండితులగు తనపుత్రులను మరీచ్యాదులం గూడి ప్రపంచంబంతయుం సృజించెను. ౪

పరబ్రహ్మంబువలన శాశ్వతుండును నిత్యుండును నాశరహితుండునగు బ్రహ్మదేవుఁడు పుట్టెను. ఆబ్రహ్మదేవునివలన మరీచి జన్మించెను. మరీచికిఁ గశ్యపుఁడు పుట్టెను. ౫

కశ్యపునకు సూర్యుఁడు జన్మించెను. సూర్యునకు వైవస్వతమనువు సంభవించెను. ఈవైవస్వతమనువే మొదటి ప్రజాపతి. ఇతనికి ఇక్ష్వాకువు పుట్టెను.

వైవస్వతమనువు ఇక్ష్వాకువునకు సర్వసమృద్ధంబగు నీభూమి నొసఁగెను.

త మిక్ష్వాకు మయోధ్యాయాం రాజానం విద్ధి పూర్వకమ్. ౭
ఇక్ష్వాకోస్తు సుతః శ్రీమా న్కుక్షి రే వేతి విశ్రుతః,
కుక్షే రథాత్మజో వీరో వికుక్షి రుదపద్యత. ౮
వికుక్షే స్తు మహాతేజా బాణః పుత్రః ప్రతాపవా౯,
బాణస్య తు మహాబాహు రనరణ్యో మహాయశాః. ౯

నానావృష్టి ర్బభూవాస్మి న్న దుర్భిక్షం సతాం వరే,
అనరణ్యే మహారాజే తస్కరో నాపి కశ్చన. ౧౦

అనరణ్యా న్మహాబాహుః పృథూ రాజా బభూవ హ,
తస్మా త్పృథో ర్మహారాజ స్త్రిశఙ్కు రుదపద్యత. ౧౧
స సత్యవచనా ద్వీర స్సశరీరో దివం గతః,

త్రిశఙ్కో రభవ త్సూను ర్ధున్ధుమారో మహాయశాః. ౧౨
ధున్ధుమారాన్మహాతేజా యువనాశ్వో వ్యజాయత,
యువనాశ్వసుతః శ్రీమా న్మాన్ధాతా సమపద్యత. ౧౩
మాన్ధాతు స్తు మహాతేజా స్సుసన్ధి రుదపద్యత,
సుసన్ధే రపి పుత్రౌ ద్వౌ ధ్రువసన్ధిః ప్రసేనజిత్. ౧౪
యశస్వీ ధ్రువసన్ధే స్తు భరతో రిపుసూదనః,
భరతా త్తు మహాబాహు రసితో నామ జాయత. ౧౫
యస్యైతే ప్రతిరాజాన ఉదపద్యన్త శత్రవః,
హైహయా స్తాలజఙ్ఘాశ్చ శూరా శ్చ శశిబిన్దవః. ౧౬
తాంస్తు సర్వా న్ప్రతివ్యూహ్య యుద్ధే రాజా ప్రవాసితః,

స చ శైలవరే రమ్యే బభూవాభిరతో మునిః. ౧౭

ద్వే చాస్య భార్యే గర్భిణ్యౌ బభూవతు రితి శ్రుతిః,
ఏకా గర్భవినాశాయ సపత్న్యై సగరం దదౌ. ౧౮

భార్గవ శ్చ్యవనో నామ హిమవన్త ముపాశ్రితః,

త మృషిం సముపాగమ్య కాళిన్దీ త్వభ్యవాదయత్. ౧౯

స తా మభ్యవద ద్విప్రో వరేప్సుం పుత్రజన్మని,

పుత్ర స్తే భవితా దేవి! మహాత్మా లోకవిశ్రుతః. ౨౦
ధార్మికశ్చ సుశీలశ్చ వంశకర్తాఽరిసూదనః,

కృత్వా ప్రదక్షిణం హృష్టా మునిం త మనుమాన్య చ. ౨౧
పద్మపత్రసమానాక్షం పద్మగర్భసమప్రభమ్,
తత స్సా గృహ మాగమ్య దేవీ పుత్రం వ్యజాయత. ౨౨

సపత్న్యా తు గర స్తస్యై దత్తో గర్భజిఘాంసయా,
గరేణ సహ తే నైవ జాత స్స సగరోఽభవత్. ౨౩

స రాజా సగరో నామ య స్సముద్ర మఖానయత్,
ఇష్ట్వా పర్వణి వేగేన త్రాసయన్త మిమాః ప్రజాః. ౨౪

అసమఞ్జ స్తు పుత్రోఽభూ త్సగరస్యేతి నశ్శ్రుతమ్,
జీవన్నేవ స పిత్రా తు నిరస్తః పాపకర్మకృత్. ౨౫

ఆయసితుఁడు రమణీయంబగు హిమవత్పర్వతంబునకుఁబోయి యచ్చట విరక్తుఁడై మునివృత్తి నవలంబించియుండెను. ౧౬

ఈయసితునిభార్యలిద్దఱును గర్భమునొందిరని వినికి.

అందొకభార్య సవతిగర్భము నశించుటకై యాబిడకు విషముగలసిన భక్ష్యము దినఁబెట్టెను. ౧౭

భృగువంశజాతుఁడగు చ్యవనమహర్షి యాహిమవత్పర్వతంబున నుండెను.

విషభక్ష్యంబుదినియున్న యసితునిభార్య కాళింది యనునది, యా చ్యవనమహర్షియొద్దకుఁ బోయి యాయనకు నమస్కారము గావించెను. ౧౯

ఆచ్యవనుఁడు కొడుకు పుట్టవలెనని వరంబు గోరుచున్న యాకాళిందిం జూచి యిట్లని చెప్పెను.

కాళిందీ! మహాత్ముఁడును లోకప్రసిద్ధుఁడును బరమధార్మికుఁడును సదాచారసంపన్నుఁడును వంశకర్తయు శత్రుసంహర్తయు నగు పుత్త్రుఁడు నీకుఁ గలుగును. అని చ్యవనుఁడు కాళిందీదేవికిఁ జెప్పెను. ౨౦

అంత నాకాళింది పరమసంతుష్టయయి యాచ్యవనమహామునికిఁ బ్రదక్షిణనమస్కారములు చేసి యాయనయొద్ద సెలవుదీసికొని యింటికివచ్చి తామరపూరేకులవంటి కన్నులుగలవాఁడును బ్రహ్మదేవునకు సరివచ్చువాఁడునగు కొడుకుం గనెను. ౨౧

ఆకాళిందికి గర్భమును జంపునిమిత్తమయి సవతి విషంబిడి యుండినది గదా! ఇమ్మహాత్ముఁడగుపుత్త్రుఁడు ఆవిషంబుతోఁగూడఁ బుట్టుటంజేసి సగరుఁ డనఁబడెను. ౨౩

ఆసగరుఁడు అశ్వమేధయాగంబులు చేసి నష్టమయిన యశ్వమును వెదకునిమిత్తమయి పర్వకాలంబున నతివేగంబున గర్జించుచుఁ జూపరులకు భయంబు గలిగించునట్టి యీసముద్రంబుఁ ద్రవ్వించెను. ౨౪

సగరునకు అసమంజుఁడను పుత్త్రుఁ డుండినట్లు విఖ్యాతము. అతఁడు పాపకర్మంబులం జేయుటవలన నతని సగరుఁ డరణ్యంబునకుఁ దఱిమెను.

అంశుమా నితి పుత్రోఽభూ దసమఞ్జస్య వీర్యవాన్,
దిలీపోఽంశుమతః పుత్రో దిలీపస్య భగీరథః. ౨౬
భగీరథా త్కకుత్స్థ స్తు కాకుత్స్థా యేన విశ్రుతాః,
కకుత్స్థస్య తు పుత్రోఽభూ ద్రఘు ర్యేన తు రాఘవాః. ౨౭

రఘో స్తు పుత్ర స్తేజస్వీ ప్రవృద్ధః పురుషాదకః,
కల్మాషపాద స్సౌదాస ఇత్యేవం ప్రథితో భువి. ౨౮

కల్మాషపాదపుత్రోఽభూ చ్ఛఙ్ఖణ స్త్వితి విశ్రుతః,
య స్తు తద్వీర్య మాసాద్య సహాసైన్యో వ్యనీనశత్. ౨౯
శఙ్ఖణస్య తు పుత్రోఽభూ చ్ఛూర శ్శ్రీమా న్సుదర్శనః,
సుదర్శనస్యాగ్నివర్ణ హ్యగ్నివర్ణస్య శీఘ్రగః. 3౦

శీఘ్రగస్య మరుః పుత్రో మరోః పుత్రః ప్రశుశ్రుకః,
ప్రశుశ్రుకస్య పుత్రోఽభూ దమ్బరీషో మహాద్యుతిః. 3౧
అమ్బరీషస్య పుత్రోఽభూ న్నహుష స్సత్యవిక్రమః,
నహుషస్య చ నాభాగః పుత్రః పరమధార్మికః. 3౨
అజ శ్చ సువ్రత శ్చైవ నాభాగస్య సుతా వుభౌ,
అజ స్యైవ చ ధర్మాత్మా రాజా దశరథ స్సుతః. 33
తస్య జ్యేష్ఠోఽసి దాయాదో రామ ఇత్యభివిశ్రుతః,

తద్గృహాణ స్వకం రాజ్య మవేక్షస్వ జనం నృప!. 3౪

ఇక్ష్వాకూణాం హి సర్వేషాం రాజా భవతి పూర్వజః,
పూర్వజే నావరః పుత్రో జ్యేష్ఠో రాజ్యేఽభిషిచ్యతే. 3౫

అసమంజునకుఁ బరాక్రమవంతుఁడగు నంశుమంతుఁడు జన్మించెను. అంశుమంతునిపుత్రుఁడు దిలీపుఁడు, దిలీపునకు భగీరథుఁడు పుట్టెను. ౨౬

భగీరథునకుఁ గకుత్స్థుం డుద్భవించెను. అతనిచేతనే మీరలు కాకుత్స్థులైతిరి. అకకుత్స్థునకు రఘువు పుట్టెను. అరఘువుచేతనే మీకు రాఘవులను పేరు వచ్చినది. ౨౭

రఘువునకుఁ దేజస్వియగు నొకపుత్రుఁడు గలిగెను. అతఁడు ప్రవృద్ధుఁడనియుఁ బురుషాదకుం డనియుఁ గల్మాషపాదుఁ డనియుం సౌదాసుండనియు లోకంబున వినుతికెక్కెను. ౨౮

కల్మాషునకు శంఖణుఁడను పుత్రుఁడును పుట్టెను. ఆశంఖణుఁడు కల్మాషపాదునిచేతనే ససైన్యంబుగాఁ జంపఁబడెను. ౨౯

శంఖణునకు శూరుఁడును శ్రీమంతుఁడు నగు సుదర్శనుఁడు పుట్టెను. సుదర్శనునకు అగ్నివర్ణుఁ డుద్భవించెను. అగ్నివర్ణునకు శీఘ్రగుఁడు జన్మించెను ౩౦

శీఘ్రగునకు మరువు పుట్టెను. మరువునకుఁ బ్రశుశ్రుకుఁడు పుట్టెను. ప్రశుశ్రుకునకు శ్రీమంతుఁడగు నంబరీషుఁడు పుట్టెను. ౩౧

అంబరీషునకు సత్యపరాక్రమఁడగు నహుషుఁడు పుట్టెను. నహుషునకుఁ బరమధార్మికుఁడగు నాభాగుఁడు జన్మించెను. ౩౨

నాభాగునకు అజుఁడనియుఁ సువ్రతుఁడనియుం నిద్దఱుకొడుకులు జన్మించిరి. అజునకు ధర్మాత్ముఁడగు దశరథమహారాజు కలిగెను. ౩౩

అదశరథమహారాజునకు దాయభాగార్హుఁడగు జ్యేష్ఠపుత్రుఁడు రాముఁడనువాఁ డున్నాఁడు.

రాముఁడా! నీ వట్లు జ్యేష్ఠపుత్రుఁడవు కావున నీవె రాజు కాఁదగినవాఁడవు. కాఁబట్టి నీరాజ్యంబు దీసికొని జనులం బాలించుకొనుము. ౩౪

ఇక్ష్వాకుకులంబునఁ జ్యేష్ఠపుత్రుఁడు రాజగుటయె మర్యాద. జ్యేష్ఠుఁడుండగాఁ గనిష్ఠుఁడు పట్టాభిషేకంబు నొందఁ నర్హుఁడు గాఁడు. జ్యేష్ఠునకే

న రాఘవాణాం కులధర్మ మాత్మన
స్సనాతనం నాద్య విహంతు మర్హసి,
ప్రభూతరత్నా మనుశాధి మేదినీం
ప్రభూతరాష్ట్రాం పితృవ న్మహా యశః. 3౬

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే దశో త్తరశతతమస్సర్గః.

## ఏ కా ద శో త్త ర శ త త మ స్స ర్గః

వసిష్ఠ స్తు తదా రామ ముక్త్వా రాజపురోహితః,
అబ్రవీ ద్ధర్మసంయుక్తం పునరేవాపరం వచః. ౧

పురుషస్యేహ జాతస్య భవన్తి గురవ స్త్రయః,
ఆచార్య శ్చైవ కాకుత్స్థ! పితా మాతా చ రాఘవ!. ౨

పితా హ్యేనం జనయతి పురుషం పురుషర్షభ!,
ప్రజ్ఞాం దదాతి చాచార్య స్తస్మా త్స గురు రుచ్యతే. 3

సోఽహం తే పితు రాచార్య స్తవ చైవ పర న్తప!,
మమ త్వం వచనం కుర్వ న్నాతివర్తే స్సతాం గతిమ్. ౪

ఇమా హి తే పరిషద శ్శ్రేణయ శ్చ ద్విజా స్తథా,
ఏషు తాత! చర ధర్మం నాతివర్తే స్సతాం గతిమ్. ౫

వృద్ధాయా ధర్మశీలాయా మాతు ర్నార్హ స్యవర్తితుమ్,
అస్యా స్తు వచనం కుర్వ న్నాతివర్తే స్సతాం గతిమ్. ౬

పట్టాభిషేకము గావింపవలయును. ౩౫

మహాకీర్తిశాలివగు రామూండా! అట్టిపరమధార్మికుండవగు నీవు జ్యేష్ఠపుత్రుండు రాజగుటయను నాసవుల కులధర్మమును విడువరాదు. నీతండ్రియుం బోలె సమస్తరత్నసంపూర్ణంబును అనంతగ్రామాదిసంయుతంబు నగు భూమిని బాలింపుము. అని వసిష్ఠుండు రామునితోం జెప్పెను. ౩౬

ఇది నూటపదియవ సర్గము.

---

## నూటపదునొకండవసర్గము

రాజపురోహితుండగు వసిష్ఠుండు అట్లు రామునకుం జెప్పి మరల నతనిం జూచి యుక్తంబగు నీమాటం జెప్పెను. ౧

కకుత్స్థవంశంబునం బుట్టినట్టి రామూండా! పురుషునకు ఆచార్యుండును దండ్రియును దల్లియును వీరలు మువ్వురును గురువులగుచున్నారు. ౨

పురుషశ్రేష్ఠుండవగు రామూండా! తండ్రియుం దల్లియుం బురుషుం బుట్టించువారలు కావున వారలతనికి గురువులు ఆచార్యుం డతనికి జ్ఞానము నొసంగును గావున గురుం డనంబడును. ౩

శత్రువులం దపింపంజేయునట్టి రామూండా! నేను నీతండ్రికిని నీకును ఆచార్యుండను గావున నీవు నామాటప్రకారము చేయుందువేని సన్మార్గమును వదలినవాండవు కావు. ౪

నాయనా! ఈబ్రాహ్మణులును పౌరజనులును క్షత్రియులును వైశ్యులును నీవారలు నిన్ను సేవించుచున్నవారలు. వీరలం బాలించుట యనెడు ధర్మం బనుష్ఠింతువేని సత్పురుషమార్గమును వదలినవాండవు కావు. ౫

వృద్ధురాలును బరమధార్మికురాలు నగు తల్లికి శుశ్రూష సేయకుండుట యెంతమాత్రము యుక్తముకాదు. కావున ఈవిడమాటచొప్పున నడచుకొందువేని సన్మార్గమును వదలినవాండవు కావు. ౬

భరతస్య వచః కుర్వ న్యాచమానస్య రాఘవ!,
ఆత్మానం నాతివర్తే స్త్వం సత్యధర్మపరాక్రమ!. ౭

ఏవం మధుర ముక్తస్సన్ గురుణా రాఘవ స్స్వయమ్,
ప్రత్యువాచ సమాసీనం వసిష్ఠం పురుషర్షభః. ౮
య న్మాతాపితరౌ వృత్తం తనయే కురుత స్సదా,
న సుప్రతికరం తత్తు మాత్రా పిత్రా చ యత్కృతమ్. ౯
యథాశక్తిప్రదానేన స్నాపనోచ్ఛాదనేన చ,
నిత్యం చ ప్రియవాదేన తథా సంవర్ధనేన చ. ౧౦

సహి రాజా జనయితా పితా దశరథో మమ,
ఆజ్ఞాతం య న్మయా తస్య న త న్మిథ్యా భవిష్యతి. ౧౧

ఏవ ముక్తస్తు రామేణ భరతః ప్రత్యనన్తరమ్,
ఉవాచ పరమోదార స్సూతం పరమదుర్మనాః. ౧౨
ఇహ మే స్థండిలే శీఘ్రం కుశా నాస్తర సారథే!,
ఆర్యం ప్రత్యుపవేక్ష్యామి యావ న్మే న ప్రసీదతి. ౧౩

అనాహారో నిరాలోకో ధనహీనో యథా ద్విజః,

రాముఁడా! నీవు యాచకుల యభీష్టము నెఱవేర్చుటయందు బద్ధదీక్షులగు రాఘవులవంశంబునం బుట్టినవాఁడవు. సత్యధర్మంబులం దప్పనివాఁడవు. అట్టినీవు యాచించుచున్న భరతునిమాట నంగీకరింతువేని నీధర్మస్వభావంబును వదలినవాఁడవు కావు. అని వసిష్ఠమహాముని రామునకుం జెప్పెను. ౮

పురుషశ్రేష్ఠుఁడగు రాముఁడు ఇట్లు ఆచార్యుఁడగు వసిష్ఠుఁడు చెప్పిన మధురవచనమును విని యతనిం జూచి యిట్లని బదులు చెప్పెను. ౯

తలిదండ్రులు మొదలఁ గొడుకుపుట్టుటకై గావించిన వ్రతోపవాసాదులకును మఱియుం గొడుకు పుట్టినవెనుక అతనికి స్తన్యము అన్నము వస్త్రములు మొదలగువాని యథాశక్తి నొసంగుచు నలుగుపెట్టి స్నానంబు సేయించుచు నెల్లప్పుడుఁ బ్రియవచనంబు లాడుచు నతని బెంచుట మొదలుగా వార లతనికిఁ గావించిన యుపకారంబులకును బదులు సేయనలవి కాదు. కావున ధర్మసాధనంబగు నీదేహంబునకుఁ గారణము కాఁబట్టి తలిదండ్రులె యాచార్యునకన్న నధికులు. ౧౦

నాతండ్రి దశరథమహారాజు నన్నుఁ బుట్టించినవాఁడు కావున నే నతనికిఁ గావించిన ప్రతిజ్ఞ యెంతమాత్రము నబద్ధము కాఁగూడదు. అట్లు నేను దల్లివిషయమయి ప్రతిజ్ఞ చేయలేదు. కావునఁ దల్లిమాట నతిక్రమించుట యనునదియుం సంభవింపదు. అని రాముఁడు చెప్పెను. ౧౧

పరమోదారుఁడగు భరతుఁడు రాముఁడు చెప్పిన మాటను విని పరమదుఃఖితుఁడై తనసమీపంబున నున్న సుమంత్రుం జూచి ఇట్లనిచెప్పెను. ౧౨

సుమంత్రుఁడా! శీఘ్రముగా నా కిచ్చట నేలపై దర్భలం బఱచి పెట్టుము. రాముఁడు నాకుఁ బ్రసన్నుఁడగునంతవఱకు నతని కడ్డముఁ బరుండి యుండెదను. ౧౩

అప్పుదీసికొన్నవాఁడు మఱల నివ్వకపోవుటవలన అప్పిచ్చిన బ్రాహ్మ

శేష్యే పురస్తా చ్ఛాలాయా యావ న్న ప్రతియాస్యతి. ౧౪

సతు రామ మవేక్షన్తం సుమన్త్రం ప్రేక్ష్య దుర్మనాః,
కుశో త్తర ముపస్థాప్య భూమా వేవాఽస్థిత స్స్వయమ్. ౧౫

త మువాచ మహాతేజా రామో రాజర్షిసత్తమః,

కిం మాం భరత! కుర్వాణం తాత! ప్రత్యుపవేక్ష్యసి. ౧౬

బ్రాహ్మణో హ్యేకపార్శ్వేన నరా న్రోద్ధు మిహార్హతి,
న తు మూర్ధాభిషిక్తానాం విధిః ప్రత్యుపవేశనే. ౧౭

ఉత్తిష్ఠ నరశార్దూల! హిత్వైత ద్దారుణం వ్రతమ్,
పురవర్యా మితః క్షిప్ర మయోధ్యాం యాహి రాఘవ!. ౧౮

ఆసీన స్త్వేవ భరతః పౌరజానపదం జనమ్,
ఉవాచ సర్వతః ప్రేక్ష్య కి మార్యం నానుశాసథ. ౧౯
తే త మూచు ర్మహాత్మానం పౌరజానపదా జనాః,
కాకుత్స్థ మభిజానీమ స్సమ్యగ్వదతి రాఘవః. ౨౦

ఏషోఽపి హి మహాభాగః పితు ర్వచసి తిష్ఠతి,
అత ఏవ న శక్తాః స్మో వ్యావర్తయితు మఞ్జసా. ౨౧

ఁడు అతనివాకిలి కడ్డముగాఁ బరుండు. ఈవిధంబున నేను రాముఁడయోధ్యకు వచ్చునంతవఱకు ఆహారంబు వర్జించి ముఖంబుపై గుడ్డపెట్టుకొని రోదనంబు సేయుచుఁ బర్ణశాలవాకిటం బరుండెదను. ౧౪

అంత దుఃఖితుఁడగు నాభరతుఁడు తాను చెప్పినట్లు దర్భలం బఱపక సుమంత్రుఁడు రామాజ్ఞం గోరుటను జూచి తానేదర్భలు తెచ్చి పఱచుకొని శయనించెను. ౧౫

అంత మహాతేజుఁడును రాజర్షిముఖ్యుఁడు నగు రాముఁడు భరతుం జూచి యిట్లని చెప్పెను.

నాయనా! నేను నీ కేయపకారము సేయుటంబట్టి నీవు నావాకిలి కడ్డముగాఁ బరుండెదవు? ౧౬

బ్రాహ్మణుఁడుమాత్రమె తనయొద్దనప్పుదీసికొని యెగవేయఁ గోరువానివాకిట నడ్డముగాఁ బరుండుటకుఁ దగునుగాని క్షత్రియులకట్లు వాకిలి కడ్డముగాఁ బరుండి పీడించుట యెంతమాత్రము యుక్తముగాదు. ౧౭

పురుషశ్రేష్ఠుఁడవగు భరతుఁడా! లెమ్ము. ఈభయంకరవ్రతంబు విడిచి శీఘ్రంబున నిచ్చటనుండి పట్టణోత్తమంబగు నయోధ్యాపట్టణంబునకు బొమ్ము. అని రాముఁడు భరతునకుఁ జెప్పెను. ౧౮

భరతుఁడు పరుండియే పౌరులను జానపదులను జనులనందఱిం జూచి "మీరలందఱును రామున కేమియుఁ జెప్పరా యేమి?" అని యడిగెను. ౧౯

అంత ఆజను లందఱు మహాత్ముఁడగు భరతుంజూచి యిట్లని చెప్పిరి.

రాముని మేము చక్కఁగా నెఱుంగుదుము. రాముఁడు చెప్పునది బాగుగా నున్నది. ౨౦

మహాభాగుఁడగు నీరాముఁడును పితృవచనపరిపాలనంబను ధర్మంబు నవలంబించియున్నాఁడు. కావున నో! యితని మఱలింపుటకు మాచేతఁ గాదు. అని జనులు భరతునితోఁ జెప్పిరి. ౨౧

తేషా మాజ్ఞాయ వచనం రామో వచన మబ్రవీత్,
ఏవం నిబోధ వచనం సుహృదాం ధర్మచక్షుషామ్. ౨౨
ఏత చ్చైవో భయం శ్రుత్వా సమ్యక్ సమ్పశ్య రాఘవ!,
ఉత్తిష్ఠ త్వం మహాబాహో! మాం చ స్పృశ తథోదకమ్. ౨౩

అథోత్థాయ జలం స్పృష్ట్వా భరతో వాక్య మబ్రవీత్,
శృణ్వన్తు మే పరిషదో మన్త్రిణ శ్శ్రేణయ స్తథా. ౨౪

న యాచే పితరం రాజ్యం నానుశాసామి మాతరమ్,
ఆర్యం పరమధర్మజ్ఞం నానుజానామి రాఘవమ్. ౨౫

యది త్వవశ్యం వస్తవ్యం కర్తవ్యం చ పితు ర్వచః,
అహమేవ నివత్స్యామి చతుర్దశ సమా వనే. ౨౬

ధర్మాత్మా తస్య తథ్యేన భ్రాతు ర్వాక్యేన విస్మితః,
ఉవాచ రామ స్సమ్ప్రేక్ష్య పౌరజానపదం జనమ్. ౨౭
విక్రీత మాహితం క్రీతం య త్పిత్రా జీవతా మమ,
న తల్లోపయితుం శక్యం మయా వా భరతేన వా. ౨౮

ఉపధి ర్న మయా కార్యో వనవాసే జుగుప్సితః,
యుక్త ముక్తం చ కైకేయ్యా పిత్రా మే సుకృతం కృతమ్. ౨౯

రాముఁడును పౌరజానపదజనులు చెప్పినమాటను దెలిసికొని భరతునిం జూచి యిట్లని చెప్పెను.

ధర్మవేత్తలగు నీ స్నేహితులును ఇట్లు చెప్పుచున్నారు వినుము. ౨౨

మహాబాహుండవగు భరతుఁడా! నేను చెప్పినమాటను ఈ పౌరజానపదులమాటను రెంటిని చక్కఁగా నాలోచించుకొనుము. శీఘ్రముగ లేచి నన్నును జలంబును స్పృశింపుము. అని రాముఁడు భరతునితోఁ జెప్పెను. ౨౩

అంత భరతుఁడు లేచి జలంబును రాముని స్పృశించి యిట్లని చెప్పెను.

బ్రాహ్మణులును మంత్రులును పౌరులును అందఱును నేను చెప్పుమాటను సావధానముగా వినుదురు గాక. ౨౪

నేను నాకు రాజ్యంబు కావలెనని తండ్రిని యాచింపలేదు. నీవు నా రాజ్యంబు వచ్చునట్లు గావింపు మని నాతల్లికైకేయిని ప్రేరింపలేను. పరమ ధర్మజ్ఞుఁడగు రాముఁ డడవినుండుటకు నే నెంతమాత్రము సమ్మతింపలేను. ౨౫

ఇంక నవశ్యము పితృవచనముఁ జొప్పున వనంబున నుండవలసినదె యగునేని నేనే రామునకు బదులు వనంబునఁ బదునాలుగుసంవత్సరంబు లుండెదను. రాముఁడు నాకు బదులుగా రాజ్యంబుఁ బాలించుఁగాక. అని భరతుఁడు చెప్పెను. ౨౬

ధర్మాత్ముఁడగు రాముఁడు తమ్ముఁడగు భరతుని యథార్థవచనంబున కచ్చెరువొంది పౌరజానపదజనులం జూచి యిట్లని చెప్పెను. ౨౭

నాతండ్రి బ్రతికియుండునప్పుడు దేని విక్రయించునో దేని కుదువ యుంచునో దేనిని గొనునో దానిని మార్చుటకు నాకుఁగాని భరతునకుఁగాని యెంతమాత్ర మలవిగాదు. మనతండ్రి సత్యపాలనార్థమయి నాకు వనవాసంబు నొసంగి అందుకు బదులుగా రాజ్యంబు గ్రహించి భరతుని కిచ్చియున్నాఁడు. దీని మార్చుట కెవ్వరికి నలవిగాదు. ౨౮

నేను వనవాసమునకు బదులు ప్రతినిధిగా రాజ్యపాలనము నంగీకరింపఁ గూడదు. ఇది మిక్కిలియు నిందితము. అట్లంగీకరింతునేని నాతండ్రి

జానామి భరతం త్వాం గురుసత్కారకారిణమ్,
సర్వ మే వాత్ర కల్యాణం సత్యసన్ధే మహాత్మని. 30

అనేన ధర్మశీలేన వనాత్ప్రత్యాగతః పునః,
భ్రాత్రా సహ భవిష్యామి పృథివ్యాః పతి రుత్తమః. 31
వృతో రాజా హి కైకేయ్యా మయా తద్వచనం కృతమ్,
అనృతా న్మోచయానేన పితరం తం మహీపతిమ్. 32

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే ఏకాదశోత్తరశతతమస్సర్గః.

---

ద్వాదశోత్తరశతతమస్సర్గః

తమప్రతిమతేజోభ్యాం భ్రాతృభ్యాం రోమహర్షణమ్,
విస్మితా స్సంగమం ప్రేక్ష్య సమవేతా మహర్షయః. 1
అన్తర్హితా స్త్వృషిగణా స్సిద్ధా శ్చ పరమర్షయః,
తౌ భ్రాతరౌ మహాత్మానౌ కాకుత్స్థౌ ప్రశశంసిరే. 2
స ధన్యో యస్య పుత్రౌ ద్వౌ ధర్మజ్ఞౌ ధర్మవిక్రమౌ,

శ్రుత్వా వయంహి సమ్భాషా ముభయోస్స్పృహయామహే.

తత స్త్వృషిగణాః క్షిప్రం దశగ్రీవవధైషిణః,

మాట యసత్యమగును. సాత్త్వి కైకేయి యుక్తియుక్తముగానే చెప్పినది. నాతండ్రి మంచికార్యమునే చేసెను. ౨౯

భరతుఁడు క్షమగలవాఁడనియు గురుభక్తిగలవాఁడనియుం దెలియంగు దును. సత్యసంధుఁడును మహాత్ముఁడు నగు నాభరతునకు సమస్తమును మంగళ కరంబు గాఁగలదు. ౩౧

నేను బదునాలుగుసంవత్సరంబులు గడచినపిమ్మట నడవినుండి వచ్చి ధర్మస్వభావుఁడగు తమ్ముని భరతుం గూడి భూమిం బాలించెదను. ౩౦

కైకేయి దశరథమహారాజును యాచించినది. ఆయనచెప్పినట్లు నేను వనవాసము గావించుచున్నాను. నీవును ఆయనయాజ్ఞ చొప్పున రాజ్యపరి పాలనంబు గావించి యాయన కసత్యదోషంబు గలుగకుండునట్లు సేయుము. అని రాముఁడు భరతునకుఁ జెప్పెను. ౩౨

ఇది నూటపదునొకండవసర్గము.

---

## నూటపండ్రెండవసర్గము

అచ్చటికి వచ్చియున్న మహర్షులు కాంతిమంతులగు నారామభరతుల యద్భుతసమాగమంబుఁ జూచి మిక్కిలియు నాశ్చర్యంబు నొందిరి. ౧

అప్పు డంతర్ధానము నొందియున్న ఋషులును సిద్ధులును దేవర్షులును నన్నదమ్ముల నారామభరతులం బ్రశంసించిరి. ౨

ఎవ్వనికి ధర్మవేత్తలును ధర్మానుష్ఠానమునందు దృఢవ్రతములు గల వారలు నగు నిద్దఱుకొడుకు లున్నారో అట్టిదశరథమహారాజు మిక్కిలియుఁ బుణ్యవంతుఁడు.

మనము ఇద్దఱిసంభాషణమును వినుటచేత నీయిద్దఱియందును మక్కువ పుట్టుచున్నది. అని ఋషులు మన్నగువారలును రామభరతులం బ్రశంసించిరి. ౩

అంత నాఋషులు రావణవధంబు గోరి యందఱు నేకకంఠంబున

భరతం రాజశార్దూల మిత్యూచు స్సంగతా వచః. ౪
కులే జాత! మహాప్రాజ్ఞ! మహావృత్త! మహాయశః!,
గ్రాహ్యం రామస్య వాక్యం తే పితరం యద్యవేక్షసే. ౫

సదాఽనృణ మిమం రామం వయ మిచ్ఛామహే పితుః,
అనృణత్వా చ్చ కైకేయ్యా స్స్వర్గం దశరథో గతః. ౬

ఏతావ దుక్త్వా వచనం గన్ధర్వా స్సమహర్షయః,
రాజర్షయ శ్చైవ తదా సర్వే స్వాం స్వాం గతిం గతాః. ౭
హ్లాదిత స్తేన వాక్యేన శుభేన శుభదర్శనః,
రామ స్సంహృష్టవదన స్తా నృషీనభ్యపూజయత్. ౮

త్రస్తగాత్ర స్తు భరత స్స వాచా సజ్జమానయా,
కృతాఞ్జలి రిదం వాక్యం రాఘవం పున రబ్రవీత్. ౯

రాజధర్మ మనుప్రేక్ష్య కులధర్మానుసన్తతిమ్,
కర్తు మర్హసి కాకుత్స్థ! మమ మాతు శ్చ యాచనామ్. ౧౦

రక్షితుం సుమహ ద్రాజ్య మహ మేక స్తు నోత్సహే,
పౌరజానపదాం శ్చాపి రక్తా న్రఞ్జయితుం తథా. ౧౧
జ్ఞాతయశ్చ హి యోధా శ్చ మిత్రాణి సుహృద శ్చ నః,
త్వామేవ ప్రతికాఙ్క్షన్తే పర్జన్య మివ కర్షకాః. ౧౨

రాజశ్రేష్ఠుఁడగు భరతుం జూచి యిట్లని చెప్పిరి. ౪

భరతుఁడా! నీవు మహాపండితుఁడవు సదాచారసంపన్నుఁడవు. మహాయశుఁడవు సత్కులంబునఁ బుట్టినవాఁడవు. నీతండ్రి పరలోకసుఖంబు నొందవలయునని కోరుదువేని నీవు రాముఁడు చెప్పినట్లు గావింపుము. ౫

రాముఁడు ఎల్లప్పుడును దండ్రి ఋణంబు నొందకుండవలె నని మాకోర్కె. అట్లు దశరథుఁడు కైకేయి ఋణంబు దీర్చుకొనుటవలన స్వర్గంబునొందినాఁడు. మఱియు ఆదశరథుఁడు కైకేయి కొసంగినవరమును అబద్ధము గావించునేని దశరథుఁడు స్వర్గము నొందఁజాలఁడు. అని ఋషులు మున్నగు వారలు భరతునితోఁ జెప్పిరి. ౬

అప్పుడు మహర్షులును గంధర్వులును రాజర్షులును, భరతున కింత మట్టుకుఁ జెప్పి యంతటను దమతమనెలవులకుం బోయిరి. ౭

చూపరులకు మంగళంబు నొసంగునట్టి రాముఁడు ప్రియకరంబగు నాఋషుల మాటను విని పరమసంతోషంబు నొంది యాఋషుల నందఱం బూజించెను. ౮

అంత భరతుఁడు తనమనోరథము లేశమయినను సిద్ధింపకుండుటఁ జూచి భయవిహ్వలుఁడై చేమోడ్పు గీలించి రామునిం జూచి మాటలు తొట్రుపడ నిట్లని చెప్పెను. ౯

రాముఁడా! రాజధర్మముచొప్పున రాజ్యపరిపాలనము సేయవలసి యుండుటను కులధర్మముచొప్పున జ్యేష్ఠునకే పట్టాభిషేకము కావలసి యుండుటను ఆలోచించి నాతల్లి ప్రార్థనను గావింపుము. ౧౦

ఈమహారాజ్యంబు రక్షించుటకుఁ గాని మనయందనురాగముగల యీపౌరజానపదుల రంజిల్లఁజేయుటకుఁగాని నాయొక్కనిచేత నలవిగాదు ౧౧

మనబంధువులును సేనానాయకులును స్నేహితులును మనయందుఁ బ్రేమగలవారలును సేద్యముచే జీవించువారలు మేఘమును గోరునట్లు నిన్నే గోరుచున్నారు. ౧౨

ఇదం రాజ్యం మహాప్రాజ్ఞ! స్థాపయ ప్రతిపద్య హి,
శక్తిమా నసి కాకుత్స్థ! లోకస్య పరిపాలనే. ౧౩

ఇత్యుక్త్వా న్యపత ద్భ్రాతుః పాదయో ర్భరత స్తదా,
భృశం సమ్ప్రార్థ యామాస రామ మేవ ప్రియంవదః. ౧౪
త మఙ్కే భ్రాతరం కృత్వా రామో వచన మబ్రవీత్,
శ్యామం నళినపత్రాక్షం మత్తహంసస్వరం స్వయమ్. ౧౫

ఆగతా త్వా మియం బుద్ధి స్స్వజా వైనయికీచ యా,
భృశ ముత్సహసే తాత! రక్షితుం పృథివీ మపి. ౧౬

అమాత్యై శ్చ సుహృద్భి శ్చ బుద్ధిమద్భిశ్చ మన్త్రిభిః,
సర్వకార్యాణి సమ్మన్త్ర్య సుమహా న్త్యపి కారయ. ౧౭

లక్ష్మీ శ్చన్ద్రా దపేయా ద్వా హిమవా న్వా హిమం త్యజేత్,
అతీయా త్సాగరో వేలాం న ప్రతిజ్ఞా మహం పితుః. ౧౮

కామాద్వా తాత లోభాద్వా మాత్రా తుభ్య మిదం కృతమ్,
న త న్మనసి కర్తవ్యం వర్తితవ్యం చ మాతృవత్. ౧౯

ఏవం బ్రువాణం భరతః కౌసల్యాసుత మబ్రవీత్,
తేజసాఽఽదిత్యసఙ్కాశం ప్రతిపచ్చన్ద్రదర్శనమ్. ౨౦

అధిరోహాఽర్య! పాదాభ్యాం పాదుకే హేమభూషితే,
ఏతే హి సర్వలోకస్య యోగక్షేమం విధాస్యతః. ౨౧

మహాపండితుఁడవగు రాముఁడా! నీవీరాజ్యంబు నంగీకరించి పాలింపుము. కోసలదేశంబును మాత్రమె కాదు. ఈలోకంబు నంతయుఁ బాలింపసమర్థుఁడవు. అని భరతుఁడు రామునితోఁ జెప్పెను. ౧౩

అంత భరతుఁడు తనమాట లన్నియు వ్యర్థము లగుటం జేసి రాముని పాదంబులం బ్రియవచనంబుల నతని బలువిధంబులఁ బ్రార్థించెను. ౧౪

రాముఁడు శ్యామలదేహుఁడును కమలపత్రంబులుంబోలె విశాలసుందరంబులగు కండ్లుగలవాఁడును మదించిన హంసనుంబోలె మనోహరంబులగు పలుకులుగలవాఁడు నగు భరతు నంకంబునం జేర్చి యిట్లని చెప్పెను. ౧౫

నాయనా! నీకు సహజంబగు బుద్ధి యధికముగాఁ గలదు. గురుశిక్ష వలన గలుగుబుద్ధియుఁ గలిగియున్నది. కావున నీకు భూమండలమునంతయుం రక్షింపమిక్కిలియుం శక్తి యున్నది. ౧౬

నీవు ప్రధానమంత్రులతోను స్నేహితులతోను బుద్ధిమంతులగు నుపమంత్రులతోనుం జక్కఁగా నాలోచించి గొప్పకార్యంబు లన్నియుంగావింపుము. ౧౭

కాంతి చంద్రుని విడిచినను విడుచును; మంచు హిమవత్పర్వతమును విడిచినను విడుచును; సముద్రము చెలియలికట్ట నతిక్రమించిన నతిక్రమించును. నేనుమాత్రము తండ్రికిఁగావించిన ప్రతిజ్ఞ నతిక్రమింపను. ౧౮

నాయనా! కామమువలననో లోభమువలననో నీతల్లి నీకొఱకు యీకార్యంబు చేసినది. దాని నీవు మనసునందుంచవలదు. నీవు తల్లియందువలె నావిషయందు వర్తింపవలయును. అని రాముఁడు భరతునితోఁ జెప్పెను. ౧౯

భరతుఁ డిట్లు చెప్పుచున్న, కాంతిచే సూర్యసమానుఁడును పాడ్యమి నాఁటిచంద్రుఁడుంబోలె వర్ధిష్ణువును బూజనీయుఁడు నగు రాముం జూచి యిట్లని చెప్పెను. ౨౦

పూజ్యుఁడవగు రాముఁడా! కాంచనాలంకృతంబులగు నీ పాదుకలపైని పాదంబుల నుంచుము. ఈపాదుకలె సమస్తప్రపంచమునకును యోగక్షేమంబులు గావింపఁగలవు. ౨౧

సోఽధిరుహ్య నరవ్యాఘ్రః పాదుకే హ్యవరుహ్య చ,
ప్రాయచ్ఛత్సుమహాతేజా భరతాయ మహాత్మనే. ౨౨
స పాదుకే సమ్ప్రణమ్య రామం వచనమబ్రవీత్,

చతుర్దశ హి వర్షాణి జటాచీరధరో హ్యహమ్. ౨౩
ఫలమూలాశనో వీర! భవేయం రఘునన్దన!,
తవాఽఽగమనమాకాఙ్క్షన్వసన్వై నగరాద్బహిః. ౨౪
తవ పాదుకయోర్న్యస్తరాజ్యతన్త్రః పరన్తప!,

చతుర్దశే హి సంపూర్ణే వర్షేఽహని రఘూత్తమ!. ౨౫
న ద్రక్ష్యామి యది త్వాం తు ప్రవేక్ష్యామి హుతాశనమ్,

తథేతి చ ప్రతిజ్ఞాయ తం పరిష్వజ్య సాదరమ్. ౨౬
శత్రుఘ్నం చ పరిష్వజ్య భరతం చేదమబ్రవీత్,
మాతరం రక్ష కైకేయీం మా రోషం కురు తాం ప్రతి. ౨౭
మయా చ సీతయా చైవ శప్తోఽసి రఘునన్దన!,

ఇత్యుక్త్వాఽశ్రుపరీతాక్షో భ్రాతరం విససర్జ హ. ౨౮

స పాదుకే తే భరతస్య ప్రతాపవాన్
స్వలఙ్కృతే సమ్పరిపూజ్య ధర్మవిత్,
ప్రదక్షిణం చైవ చకార రాఘవం
చకార తే చోత్తమనాగమూర్ధని. ౨౯
అథాఽనుపూర్వ్యాత్ప్రతిసన్ద్య తం జనం
గురూంశ్చ మన్త్రిప్రకృతీస్తథాఽనుజౌ,

పురుషశ్రేష్ఠుఁడును మహాప్రభావుఁడు నగు నారాముఁడు ఆపాదుకలం దొడుగుకొని మఱల విడిచి మహాత్ముఁడగు భరతున కొసంగెను. ౨౨

అంత భరతుఁడు ఆపాదుకలకు నమస్కరించి రామునిం జూచి యిట్లని చెప్పెను. ౨౩

శత్రువులం దపింపఁజేయునట్టి మహాపరాక్రమశాలివగు రాముఁడా! నేను బదునాలుగు సంవత్సరములును జటలు దాల్చి నారచీరలం గట్టుకొని ఫలమూలముల నాహారంబుగాఁ గొనుచు నీపాదుకలకు రాజ్యతంత్రంబు లొప్పగించి పట్టణంబునకు వెలుపల వాసంబు సేయుచు నీరాక కెదురు సూచుచుండెదను. ౨౪

రాముఁడా! పదునాలుగుసంవత్సరంబులును నిండినవెనుక మఱుచటి దినమున నిన్నుఁ జూడకుందునేని తప్పక యగ్నిహోత్రముం బ్రవేశించెదను. అని భరతుఁడు రామునకుఁ జెప్పెను. ౨౫

అంత రాముఁడు భరతుఁడు చెప్పినమాట కొప్పుకొని యతని గవుఁగిలించికొని భరతుం జూచి యీమాటం జెప్పెను. ౨౬

భరతుఁడా! నీతల్లియగు కైకేయిని రక్షింపుము. ఆబిడ్డపైఁ గోపంబు సేయకుము. అట్లు నాపేరిటను సీతపేరిటను; ఆన పెట్టుచున్నాను. అనిరాముఁడు భరతునితోఁ జెప్పెను. ౨౭

రాముఁడు ఈప్రకారము భరతునితోఁ జెప్పి యంతఁ గన్నుల నీళ్లు గార భరతుం బొమ్మనెను. ౨౮

మహాపరాక్రమశాలియుం ధర్మవేత్తయు నగు నాభరతుఁడు కాంచనాలంకృతంబులగు నా పాదుకలం జక్కఁగాఁ బూజించి రామునకుఁ బ్రదక్షిణంబు గావించి యాపాదుకలను మృత్యుంజయుఁడును నుత్తమగజంబు శిరస్సున నుంచెను. ౨౯

అంత, హిమవత్పర్వతమువలె స్వధర్మంబున నిక్కిఱియు స్థైర్యము గల రాముఁడు గురువులను మంత్రులను జనులను వారివారికిం దగువిధంబులఁ

వ్యసర్జయ ద్రాఘవవంశవర్ధన
స్థిరగ స్స్వధర్మే హిమవా నివాచలః. ౩౦
తం మాతరో బాష్పగృహీతకణ్ఠ్యో
దుఃఖేన నామన్త్రయితుం హి శేకుః,
స త్వేవ మాతౄ రభివాద్య సర్వా
రుద న్కుటీం స్వాం ప్రవివేశ రామః. ౩౧

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే ద్వాదశోత్తరశతతమ స్సర్గః.

---

## త్రయోదశోత్తరశతతమస్సర్గః

తత శ్శిరసి కృత్వా తు పాదుకే భరత స్తదా,
ఆరురోహ రథం హృష్ట శ్శత్రుఘ్నేన సమన్వితః. ౧
వసిష్ఠో వామదేవ శ్చ జాబాలి శ్చ దృఢవ్రతః,
అగ్రతః ప్రయయు స్సర్వే మన్త్రిణో మన్త్రపూజితాః. ౨
మన్దాకినీం నదీం రమ్యాం ప్రాఙ్ముఖా స్తే యయు స్తదా,
ప్రదక్షిణం చ కుర్వాణా శ్చిత్రకూటం మహాగిరిమ్. ౩
పశ్య న్ధాతుసహస్రాణి రమ్యాణి వివిధాని చ,
ప్రయయౌ తస్య పార్శ్వేన ససైన్యో భరత స్తదా. ౪
అదూరా చ్చిత్రకూటస్య దదర్శ భరత స్తదా,
ఆశ్రమం యత్ర స ముని ర్భరద్వాజః కృతాలయః. ౫
స త మాశ్రమ మాగమ్య భరద్వాజస్య బుద్ధిమాన్,
అవతీర్య రథా త్పాదౌ వవన్దే భరత స్తదా. ౬
తతో హృష్టో భరద్వాజో భరతం వాక్య మబ్రవీత్,

బూజించి యందఱనుం బోమ్మనెను. ౩౧

తల్లులు కన్నీళ్లు గార్చుచుండుటచేత దుఃఖంబున రాముని వీడ్కొనం జాలరైరి. ఆరాముఁడే తల్లుల కందఱకు నమస్కరించి రోదనంబు సేయుచు దనపర్ణశాలం బ్రవేశించెను. ౩౨

ఇది నూటపండ్రెండవసర్గము.

---

## నూటపదుమూఁడవసర్గము

అంత నప్పుడు భరతుఁడు రామపాదుకలను శిరసున నుంచుకొని పరమ సంతోషంబున శత్రుఘ్నుం గూడి రథంబు నారోహించెను. ౧

వసిష్ఠుఁడును వామదేవుఁడును దృఢవ్రతుఁడగు జాబాలియు నాలో చనంబున సమర్థులగు మంత్రులు నందఱును ముందటం బోయిరి. ౨

అప్పుడు వారలు చిత్రకూటపర్వతంబునకుఁ బ్రదక్షిణముగాఁ దూర్పు దిక్కుఁబట్టి రమణీయంబగు మందాకినినదిం బొందిరి. ౩

అప్పుడు భరతుఁడు సైన్యముం గూడి రమణీయంబులగు నానావిధ ధాతువులం జూచుచు నాచిత్రకూటపర్వతపార్శ్వమార్గంబునం బోయెను. ౪

అంత భరతుఁడు చిత్రకూటపర్వతంబునకు సమీపంబున భరద్వాజ మహాముని యుండునట్టి యాశ్రమపదంబుఁ జూచెను. ౫

అంత బుద్ధిమంతుఁడగు నాభరతుఁడు ఆయాశ్రమంబునకుఁ బోయి రథంబు డిగ్గి భరద్వాజమహాముని పాదంబులకు నమస్కారంబు గావించెను. ౬

అంత భరద్వాజమహర్షి భరతాగమనంబునకు సంతోషంబు నొంది భరతుం జూచి యిట్లని చెప్పెను.

అపి కృత్యం కృతం తాత! రామేణ చ సమాగతమ్. ౭

ఏవ ముక్త స్సతు తతో భరద్వాజేన ధీమతా,
ప్రత్యువాచ భరద్వాజం భరతో భ్రాతృవత్సలః. ౮
స యాచ్యమానో గురుణా మయా చ దృఢవిక్రమః,
రాఘవః పరమప్రీతో వసిష్ఠం వాక్య మబ్రవీత్. ౯
పితుః ప్రతిజ్ఞాం తామేవ పాలయిష్యామి తత్త్వతః,
చతుర్దశ హి వర్షాణి యా ప్రతిజ్ఞా పితుర్మమ. ౧౦

ఏవ ముక్తో మహాప్రాజ్ఞో వసిష్ఠః ప్రత్యువాచ హ,
వాక్యజ్ఞో వాక్యకుశలం రాఘవం వచనం మహత్. ౧౧

ఏతే ప్రయచ్ఛ సంహృష్టః పాదుకే హేమభూషితే,
అయోధ్యాయాం మహాప్రాజ్ఞ! యోగక్షేమకరే తవ. ౧౨

ఏవ ముక్తో వసిష్ఠేన రాఘవః ప్రాఙ్ముఖః స్థితః,
పాదుకే హ్యధిరుహ్యైతే మమ రాజ్యాయ వై దదౌ. ౧౩

నివృత్తోఽహ మనుజ్ఞాతో రామేణ సుమహాత్మనా,
అయోధ్యా మేవ గచ్ఛామి గృహీత్వా పాదుకే శుభే. ౧౪

ఏత చ్ఛ్రుత్వా శుభం వాక్యం భరతస్య మహాత్మనః,
భరద్వాజ శ్శుభతరం ముని ర్వాక్య మువాచ తమ్. ౧౫

నైత చ్చిత్రం నరవ్యాఘ్ర! శీలవృత్తవతాం వర!,
యదార్యం త్వయి తిష్ఠే త్తు నిమ్నే సృష్ట మివోదకమ్. ౧౬

అమృత స్స మహాబాహుః పితా దశరథ స్తవ,
యస్య త్వ మీదృశః పుత్రో ధర్మజ్ఞో ధర్మవత్సలః. ౧౭

త మృషిం తు మహాత్మాన ముక్తవాక్యం కృతాఞ్జలిః,
ఆమన్త్రయితు మారేభే చరణా వుపగృహ్య చ. ౧౮

తతః ప్రదక్షిణం కృత్వా భరద్వాజం పునఃపునః,
భరత స్తు యయౌ శ్రీమా నయోధ్యాం సహ మన్త్రిభిః. ౧౯

యానై శ్చ శకటై శ్చైవ హయై ర్నాగై శ్చ సా చమూః,
పున ర్నివృత్తా విస్తీర్ణా భరతస్యానుయాయినీ. ౨౦
తత స్తే యమునాం దివ్యాం నదీం తీర్త్వోర్మిమాలినీమ్,
దదృశు స్తాం పున స్సర్వే గఙ్గాం శుభజలాం నదీమ్. ౨౧
తాం రమ్యజలసంపూర్ణాం సన్తీర్య సహబాన్ధవః,
శృఙ్గిబేరపురం రమ్యం ప్రవివేశ ససైనికః. ౨౨
శృఙ్గిబేరపురా ద్భూయ స్త్వయోధ్యాం సందదర్శ హ,

అయోధ్యాం చ తతో దృష్ట్వా పిత్రా భ్రాత్రా వివర్జితామ్,
భరతో దుఃఖస న్తప్త స్సారథిం చేద మబ్రవీత్,

సాంధే! పశ్య విధ్వస్తా సాఽయోధ్యా న ప్రకాశతే. ౨౮
విగాకారా నిరానన్దా దీనా ప్రతిహతస్వరా.

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే త్రయోదశోత్తరశతతమస్సర్గః.

---

## చతుర్దశోత్తరశతతమస్సర్గః

స్నిగ్ధగమ్భీరఘోషేణ స్యన్దనేనోపయాన్ప్రభుః,
అయోధ్యాం భరతః క్షిప్రం ప్రవివేశ మహాయశాః. ౧
బిడాలోలూకచరితా మాలీననరవారణామ్,
తిమిరాభ్యాహతాం కాళీ మప్రకాశాం నిశా మివ. ౨

రాహుశత్రోః ప్రియాం పత్నీం శ్రియా ప్రజ్వలితప్రభామ్,
గ్రహేణాభ్యుత్థితే నైకాం రోహిణీ మివ పీడితామ్. 3

అల్పోష్ణక్షుబ్ధసలిలాం ఘర్మోత్తప్త విహఙ్గమామ్,
లీనమీనఝషగ్రాహాం కృశాం గిరినదీ మివ. ౪

విధూమామివ హేమాభా మధ్వరాగ్నే స్సముత్థితామ్,
హవిరభ్యుక్షితాం పశ్చా చ్ఛిఖాం విప్రలయం గతామ్. ౫

విధ్వస్తకవచాం రుగ్ణగజవాజిరథధ్వజామ్,
హతప్రవీరామాపన్నాం చమూమివ మహాహవే. ౬

సఫేనా సస్వనా భూత్వా సాగరస్య సముత్థితామ్,

సారథీ! అయోధ్యాపురి మిక్కిలియు రామదుఃఖపీడితయయి వికారము నొంది నిరానంద యయి దీన యయి హీనస్వరంబు గలదై కాంతిహీన యయి యున్నది చూడుము. అని సారథితోఁ జెప్పెను. ౨౮

ఇది నూటపదుమూఁడవసర్గము.

---

## నూటపదునాల్గవసర్గము

మహాయశుఁడును ప్రభుఁడు నగు భరతుఁడు శ్రావ్యంబును గంభీరము నగు ధ్వనిగల రథంబునం బోవుచు శీఘ్రంబున నయోధ్యాపురిం బ్రవేశించెను.

అప్పు డయ్యయోధ్యాపురి పిల్లులును గుడ్లగూబలును దిరుగుటగల్గి మనుష్యసంచారముగాని గజంబులసంచారముగాని యెంతమాత్రము లేక కాంతిహీనయయి చీఁకటిక్రమ్మిన కృష్ణపక్షరాత్రివలెఁ గాపట్టుచుండినది. ౨

చంద్రుని ప్రియపత్నియును గాంతిమతియు నగు రోహిణి యంగారకగ్రహముచేఁ బీడింపఁబడి దుఃఖించునట్లు అయ్యయోధ్యాపురి రామదుఃఖంబునం బీడింపఁబడి యుండినది. 3

జలం బంతయు నెండకుఁ గాఁగి వేఁడిమి నొందఁ బక్షులు దల్లడింప మీనంబులును మొసళ్లును మొదలగు జలజంతువులు నాశంబు నొందఁ గాంతిహీనయయి యుండునట్టి యెండకాలమునందుఁ గృశించిన నదియుంబోలె నయోధ్యాపట్టణంబు కాంతిహీనయయి యుండినది. ౪

మొదట ధూమము లేక బంగారమువలె వెలుంగుచుండి పిదప దధ్యాది హవిస్సుఁ బ్రోక్షించుటచే లీనమయి యుండు యాగాగ్నియందలి జ్వాలకైవడి నయోధ్య కాంతిహీనయయి యుండినది. ౫

మహాయుద్ధంబునందు మేటివీరులు మడిసియుఁ గవచంబులు విఱిగియు నేనుంగులును గుఱ్ఱంబులును జచ్చియు రథంబులును ధ్వజంబులును భిన్నంబు లయ్యుఁ జిక్కువడియున్న సేనపగిది నయోధ్యాపురి కనుపట్టుచుండినది. ౬

నురుగుతోను మహాధ్వనితోనుఁ గూడి లేచి యంత గాలియణంగుట

ప్రశాన్తమారుతోద్ధూతాం జలోర్మి మివ నిస్వనామ్. ౭

త్యక్తాం యజ్ఞాయుధై స్సర్వై రభిరూపైశ్చ యాజకైః,
సుత్యాకాలే వినిర్వృత్తే వేదిం గతరవా మివ. ౮

గోష్ఠమధ్యే స్థితా మార్తా మచరన్తీం తృణం నవమ్,
గోవృషేణ పరిత్యక్తాం గవాం పత్నీ మివోత్సుకామ్. ౯

ప్రభాకరాద్యై స్సుస్నిగ్ధైః ప్రజ్వలద్భి రివోత్తమైః,
వియుక్తాం మణిభి ర్జాత్యైర్నవాం ముక్తావలీ మివ. ౧౦

సహసా చలితాం స్థానా న్మహీం పుణ్యక్షయాద్గతామ్,
సంవృతద్యుతివిస్తారాం తారా మివ దివశ్చ్యుతామ్. ౧౧

పుష్పనద్ధాం వసన్తాన్తే మత్తభ్రమరనాదితామ్,
ద్రుతదావాగ్నివిప్లుష్టాం క్లాన్తాం వనలతామివ. ౧౨

సమ్మూఢనిగమాం స్తబ్ధాం సంక్షిప్తవిపణాపణామ్,
ప్రచ్ఛన్నశశినక్షత్రాం ద్యా మి వామ్బుధరై ర్వృతామ్. ౧౩

క్షీణపానోత్తమై ర్భిన్నై శ్శరావై రభిసంవృతామ్,
హతశౌణ్డా మివాఽఽకాశే పానభూమి మసంస్కృతామ్. ౧౪

వృక్ణభూమితలాం నిమ్నాం వృక్ణపాత్రై స్సమావృతామ్,

వలన విగతధ్వనియయి యుండునట్టి సముద్రతరంగమువలె నయోధ్యాపురి దీనయయి యుండినది. ౭

యాగసమాప్తి యయిన పిమ్మట ఋత్విజు లందఱు యాగమునకుఁ గావలసినపనిముట్ల నన్నింటిని దీసికొని పోవుటంజేసి ధ్వనిలేకయుండు యాగవేదికవలె నయ్యయోధ్యాపురి యుండినది. ౮

ఆఁబోతుచే విడువఁబడి యావులకొట్టమునందు ఆఁబోతునె దలంచుకొనుచు మేఁతపచ్చికనైనం దినక దుఃఖాతమయి యుండు గోసమూహమువలె నయ్యయోధ్యాపురి దీనయయి యుండినది. ౯

కాంతిచే జ్వలించుచుండు సుందరమయిన పద్మరాగాదిమణులు గూర్చిన పతకము లేనినూతనముక్తాహారమువలె నయ్యయోధ్యాపురి కాంతిహీనయయి యుండినది. ౧౦

పుణ్యాంబాతయుం నశించినపిదపఁ దటాలున నాకాశంబుననుండి నేలం బడి కాంతిహీనమయి యుండు నక్షత్రముపగిది నయోధ్యాపట్టణము పాడుపడియుండినది. ౧౧

వసంతాంతంబునఁ బుష్పంబులచే నలంకారమయి మధురంబుగా ధ్వనించుచుండు భ్రమరంబులతో నొప్పుచుండి దావాగ్నిచేఁ గొంచెము దహింపఁబడి వాడుటంజేసి కాంతిహీనమయి యుండు వనలతయుం బోలె నయోధ్యాపురి కాంతిహీనయయి యుండినది. ౧౨

అయోధ్యాపురి మార్గమునందు జనసంచారము లేక యంగళ్లు మూయఁబడి యుండుటంజేసి మేఘముచేఁ గప్పఁబడిన చంద్రనక్షత్రములుగల యాకాశంబుపగిదిం జూపట్టినది. ౧౩

ఆపానప్రదేశంబున మధురమంతయుం క్షీణించి పాత్రంబులు పగిలి మత్తజనులు చంపఁబడి యుండ ననలంకృతమయిన పానభూమివలె నయ్యయోధ్య కాంతిహీనయయి యుండినది. ౧౪

పగిలిన నేలయుం బగిలిన పాత్రములును గలిగి జలమంతయుం క్షీణించి

ఉపయుక్తోదకాం భగ్నాం ప్రపాం నిపతితా మివ. ౧౫
విపులాం వితతాం చైవ యుక్తపాశాం తరస్వినామ్,
భూమౌ బాణై ర్వినిష్కృత్తాం పతితాం జ్యామివాయుధాత్,

సహసా యుద్ధశౌణ్డేన హయారోహేణ వాహితామ్,
నిక్షిప్తభాణ్డా ముత్సృష్టాం కిశోరీ మివ దుర్బలామ్. ౧౬

శుష్కతోయాం మహామత్స్యైః కూర్మైశ్చ బహుభిర్వృతామ్,
ప్రభిన్నతటవిస్తీర్ణాం వాపీ మివ హృతోత్పలామ్. ౧౮

పురుషస్యాప్రమృష్టస్య ప్రతిషిద్ధానులేపనామ్,
సన్తప్తామివ శోకేన గాత్రయష్టి మభూషణామ్. ౧౯

ప్రావృషి ప్రవిగాఢాయాం ప్రవిష్టస్యాభ్రమణ్డలమ్,
ప్రచ్ఛన్నాం నీలజీమూతై ర్భాస్కరస్య ప్రభా మివ. ౨౦

భరత స్తు రథస్థస్సన్ శ్రీమా న్దశరథాత్మజః,
వాహయ న్తం రథశ్రేష్ఠం సారథిం వాక్య మబ్రవీత్. ౨౧
కిం ను ఖ ల్వద్య గమ్భీరో మూర్ఛితో న నిశమ్యతే,
యథాపుర మయోధ్యాయాం గీతవాదిత్రనిస్వనః. ౨౨
వారుణీమదగన్ధశ్చ మాల్యగన్ధ శ్చ మూర్ఛితః,
ధూపితాగరుగన్ధ శ్చ న ప్రవాతి సమన్తతః. ౨౩
యానప్రవరఘోషశ్చ స్నిగ్ధశ్చ హయనిస్వనః,
ప్రమత్తగజనాద శ్చ మహాం శ్చ రథనిస్వనః. ౨౪

విటిని నేలంబడిన చలిపందిలివలె నయ్యయోధ్య కాంతిహీనయయి యుండినది.

వింట నారోపింపఁబడి యుద్ధకాలంబునం బ్రతివీరుల బాణంబులచే ఖండింపఁబడి వింటనుండి నేలం బడిన దృఢంబగు నల్లెత్రాటికైవడి నయ్యయోధ్య ప్రకాశహీనయయి యుండెను. ౧౬

యుద్ధసమర్థుఁడును హయారోహణకుశలుఁడు నగువానిచే నారోహింపఁబడి యలసి యతఁడు విడుచుటం జేసి భూషణంబులు దీయఁబడిన పిదప డస్సి కాంతిహీనయయియుండు దుర్బలం బయిన లేఁత గుఱ్ఱము వలె నాయయోధ్య దీనయయి యుండినది. ౧౭

ఎండిపోయిన జలముగలదియుఁ బెద్దమత్స్యకూర్మంబులతోఁ గూడి నదియుఁ బొందిన కలఁకలు గలదియుఁ గట్టుపగులుటచే విశాలమయినదియు నగు నడబావివలె నయోధ్యాపురి కాంతిహీనయయి యుండినది. ౧౮

మైపూఁతలేనిదియుఁ దుఃఖముచేఁ దపింపఁజేయఁబడినదియుఁ భూషణవర్జితంబునగు దుఃఖితుఁడయిన పురుషుని దేహమువలె నాయయోధ్యాపట్టణము నిస్తేజస్కమై యుండినది. ౧౯

మంచివర్షాకాలంబున సూర్యుఁడు మేఘంబులం జిక్కియుండునప్పుడు నల్లని మేఘంబులచేఁ గప్పఁబడినయతని కాంతియుం బోలె నయోధ్యశోభలుపటిమ యుండెను. అట్టియయోధ్యను భరతుఁడు ప్రవేశించెను. ౨౦

శ్రీమంతుఁడును దశరథమహారాజకుమారుఁడు నగు భరతుఁడు రథంబునవేయుండి రథంబుఁ దోలుచున్న సారథిం జూచి యిట్లని చెప్పెను. ౨౧

మునుపటియట్లిప్పు డయోధ్యాపట్టణంబున గీతవాద్యంబులధ్వని గంభీరముగా వినఁబడదేల ? ౨౨

మద్యగంధమును బుష్పమాలల వాసనయును అగరుధూపగంధమును మునుపటియట్లు పట్టణమంతయుం వ్యాపించి గుబాళింపకున్నది. ౨౩

రాముఁడు వనంబునకుఁ బోవుటంజేసి యిప్పు డయోధ్యాపురియందు శిబికాద్యుత్తమవాహనముల ధ్వనియును మదపుటేనుంగులగర్జితంబును రథంబుల శబ్దంబులును వినరాకున్నవి. ౨౪

నేదానీం శ్రూయతే పుర్యా మస్యాం రామే వివాసితే,
చన్దనాగరుగన్ధాం శ్చ మహార్హా శ్చ నవస్రజః. ౨౪
గతే హి రామే తరుణా స్సంతప్తా నోపభుఞ్జతే,

బహి ర్యాత్రాం న గచ్ఛన్తి చిత్రమాల్యధరా నరాః. ౨౫
నోత్సవా స్సమ్ప్రవర్తన్తే రామశోకార్దితే పురే,

సహ నూనం మమ భ్రాత్రా పురస్యాస్య ద్యుతి ర్గతా. ౨౬
న హి రాజత్యయోధ్యేయం సాసారేవార్జునీ క్షపా,

కదా ను ఖలు మే భ్రాతా మహోత్సవ ఇవాఽఽగతః. ౨౭
జనయిష్యత్యయోధ్యాయాం హర్షం గ్రీష్మ ఇవామ్బుదః,

తరుణై శ్చారువేషై శ్చ నరై రున్నతగామిభిః. ౨౮
సమ్పతద్భి రయోధ్యాయాం నాభిభాన్తి మహాపథాః,

ఏవం బహువిధం జల్పన్ వివేశ వసతిం పితుః. ౩౦
తేన హీనాం నరేన్ద్రేణ సింహహీనాం గుహా మివ,

తదా తద న్తఃపుర ముజ్ఝితప్రభం
సురై రివోత్సృష్ట మభాస్కరం దినమ్,
నిరీక్ష్య సర్వం తు వివిక్త మాత్మవా
న్ముమోచ బాష్పం భరత స్సుదుఃఖితః. ౩౧

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే చతుర్దశోత్తరశతతమస్సర్గః.

## పఞ్చదశోత్తరశతతమస్సర్గః

తతో నిక్షిప్య మాతౄస్స అయోధ్యాయాం దృఢవ్రతః,
భరత శ్శోకసన్తప్తో గురూ నిద మథాబ్రవీత్. ౧
నన్దిగ్రామం గమిష్యామి సర్వా నామన్త్రయేఽద్య వః,
తత్ర దుఃఖ మిదం సర్వం సహిష్యే రాఘవం వినా. ౨

గత శ్చ హి దివం రాజా వనస్థ శ్చ గురుర్మమ,
రామం ప్రతీక్షే రాజ్యాయ సహి రాజా మహాయశాః. 3

ఏత చ్ఛ్రుత్వా శుభం వాక్యం భరతస్య మహాత్మనః,
అబ్రువ న్మన్త్రిణ స్సర్వే వసిష్ఠ శ్చ పురోహితః. ౪
సుభృశం శ్లాఘనీయం చ య దుక్తం భరత! త్వయా,
వచనం భ్రాతృవాత్సల్యా దనురూపం తవైవ తత్. ౫
నిత్యం తే బన్ధులుబ్ధస్య తిష్ఠతో భ్రాతృసౌహృదే,
ఆర్యమార్గం ప్రపన్నస్య నానుమన్యేత కః పుమాన్. ౬

మన్త్రిణాం వచనం శ్రుత్వా యథాభిలషితం ప్రియమ్,
అబ్రవీ త్సారథిం వాక్యం రథో మే యుజ్యతా మితి. ౭
ప్రహృష్టవదన స్సర్వామాతౄ స్సమభివాద్య సః,
ఆరురోహ రథం శ్రీమాన్ శత్రుఘ్నేన సమన్వితః. ౮
ఆరుహ్య చ రథం శీఘ్రం శత్రుఘ్న భరతా వుభౌ,
యయతుః పరమప్రీతౌ వృతౌ మన్త్రిపురోహితైః. ౯

## నూటపదునైదవ సర్గము

అంత దృఢవ్రతుఁడగు నాభరతుఁడు అయోధ్యయందుఁ దల్లులను విడిచి పరమదుఃఖితుఁడై వసిష్ఠాదులఁ జూచి యీమాటం జెప్పెను. ౧

నే నిప్పుడు నందిగ్రామంబునకుఁ బోయెదను. ఇప్పుడె మిమ్ముల నందఱను వేఁడుకొనుచున్నాను. అచ్చట రామవియోగంబునం గలిగిన యీదుఃఖమునంతయుఁ సహించియుందును. అయోధ్యయం దింతమాత్రము సహింపఁజాలను. ౨

నాతండ్రి దశరథమహారాజు మృతిఁబొందినాఁడుగదా! నాయన్న రాముఁడును అడవికిఁ బోయినాఁడు. ఇంక మహాయశుఁడగు నారాముఁడె కదా రాజు గావలసినది. కావున రాజ్యంబున కాయన వచ్చువఱకును గాచియుండెదను. అని భరతుఁడు వసిష్ఠాదులతోఁ జెప్పెను. ౩

మహాత్ముఁడగు భరతుఁడు చెప్పినధర్మిష్ఠంబగు నీమాటను విని మంత్రులును బురోహితుఁడగు వసిష్ఠుఁడును భరతుం జూచి యిట్లని చెప్పిరి. ౪

భరతుఁడా! నీ విప్పుడు భ్రాతృవాత్సల్యంబునం జెప్పినమాట మిక్కిలియుం శ్లాఘనీయమయి యున్నది. ఇట్టిమాట చెప్పుటకు నీకే తగును. ౫

నీవుఁ బంధువులయందుఁ బ్రేమగలవాఁడవై అన్నదమ్ములయందు స్నేహము నుంచి సన్మార్గము నవలంబించి యుండఁగా నెవ్వఁడు సమ్మతింపఁడు? అని మంత్రులు భరతునితోఁ జెప్పిరి. ౬

అంత భరతుఁడు మంత్రులు తనయిష్టప్రకారము చెప్పుటకు సంతసించి సారథిం జూచి తనరథంబు నాయత్తంబుగావింప నియోగించెను. ౭

శ్రీమంతుఁడగు భరతుఁడు సంతోషంబు నొంది తల్లుల కందఱకు నమస్కరించి శత్రుఘ్నునితోఁ గూడ రథంబు నారోహించెను. ౮

అట్లు ఆభరతశత్రుఘ్ను లిద్దఱు పరమసంతోషంబున రథంబు నారోహించి మంత్రులును బురోహితుఁడగు వసిష్ఠుఁడును బరివేష్టించి నడవ శీఘ్రంబునఁ బోయిరి. ౯

అగ్రతో గురవ స్తత్ర వసిష్ఠప్రముఖా ద్విజాః,
ప్రయయుః ప్రాఙ్ముఖా స్సర్వే నన్దిగ్రామో యతోఽభవత్.
బలం చ తదనాహూతం గజాశ్వరథసఙ్కులమ్,
ప్రయయౌ భరతే యాతే సర్వే చ పురవాసినః. ౧౧

రథస్థ స్స హి ధర్మాత్మా భరతో భ్రాతృవత్సలః.
నన్దిగ్రామం యయౌ తూర్ణం శిరస్యాధాయ పాదుకే. ౧౨
తత స్తు భరతః క్షిప్రం నన్దిగ్రామం ప్రవిశ్య సః,
అవతీర్య రథా త్తూర్ణం గురూ నిద మువాచ హ. ౧౩
ఏత ద్రాజ్యం మమ భ్రాత్రా దత్తం సంన్యాసవ త్స్వయమ్,
యోగక్షేమవహే చేమే పాదుకే హేమభూషితే. ౧౪

భరత శ్శిరసా కృత్వా సన్న్యాసం పాదుకే తతః,
అబ్రవీ ద్దుఃఖసన్తప్త స్సర్వం ప్రకృతిమణ్డలమ్. ౧౫
ఛత్రం ధారయత క్షిప్ర మార్యపాదా విమౌ మతౌ,
ఆభ్యాం రాజ్యే స్థితో ధర్మః పాదుకాభ్యాం గురో ర్మమ. ౧౬
భ్రాత్రా హి మయి సన్న్యాసో నిక్షిప్త స్సౌహృదా దయమ్,
త మిమం పాలయిష్యామి రాఘవాగమనం ప్రతి. ౧౭
క్షిప్రం సంయోజయిత్వా తు రాఘవస్య పున స్స్వయమ్,
చరణౌ తౌ తు రామస్య ద్రక్ష్యామి సహపాదుకౌ. ౧౮
తతో నిక్షిప్తభారోఽహం రాఘవేణ సమాగతః,
నివేద్య గురవే రాజ్యం భజిష్యే గురువృత్తితామ్. ౧౯
రాఘవాయ చ సన్న్యాసం దత్త్వేమే వరపాదుకే,
రాజ్యం చేద మయోధ్యాం చ ధూతపాపో భవామి చ. ౨౦

అభిషిక్తే తు కాకుత్‍స్థే ప్రహృష్టముదితే జనే,
ప్రీతి ర్మమ యశ శ్చైవ భవే ద్రాజ్యా చ్చతుర్గుణమ్. ౨౧

ఏవం తు విలప న్దీనో భరత స్స మహాయశాః,
నన్దిగ్రామేఽకరో ద్రాజ్యం దుఃఖితో మన్త్రిభి స్సహ. ౨౨
స వల్కలజటాధారీ మునివేషధరః ప్రభుః,
నన్దిగ్రామేఽవస ద్వీర స్ససైన్యో భరత స్తదా. ౨౩

రామాగమన మాకాఙ్క్ష న్భరతో భ్రాతృవత్సలః,
భ్రాతు ర్వచనకారీ చ ప్రతిజ్ఞాపారగ స్తథా. ౨౪

పాదుకే త్వభిషిచ్యాథ నన్దిగ్రామేఽవస త్తదా,
భరత శ్శాసనం సర్వం పాదుకాభ్యాం న్యవేదయత్. ౨౫

తత స్తు భరత శ్శ్రీమా నభిషిచ్యార్యపాదుకే,
తదధీన స్తదా రాజ్యం కారయామాస సర్వదా. ౨౬

తదా హి య త్కార్య ముపైతి కించి
దుపాయనం చోపహృతం మహార్హమ్,
స పాదుకాభ్యాం ప్రథమం నివేద్య
చకార పశ్చా ద్భరతో యథావత్. ౨౭

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే పఞ్చదశోత్తరశతతమస్సర్గః.

---

## షోడశోత్తరశతతమస్సర్గః

ప్రతిప్రయాతే భరతే వస న్రామ స్తపోవనే,

రాముఁడు పట్టాభిషిక్తుఁడై జనులందఱుఁ బరమసంతుష్టు లయినపిదప నాకు రాజ్యమునకు నాలిగింతలయిన కీర్తియును సంతోషంబును గలుగును. అని భరతుఁడు జనులతోఁ జెప్పెను. ౨౧

మహాయశుఁడగు నాభరతుఁడు ఈప్రకారమున విలపించుచు దీనుఁడై దుఃఖితుఁడై మంత్రులం గూడి నందిగ్రామమున దొరతనంబుఁ గావించెను.

పరాక్రమవంతుఁడును బ్రభుఁడు నగు నాభరతుఁ డట్లు జటావల్కలంబులు దాల్చి మునివేషధరుఁడై సమస్తసేనాసమేతుఁడై నందిగ్రామంబున వాసంబు సేయుచుండెను. ౨౩

భ్రాతృవత్సలుఁడగు భరతుఁడు తనయన్న రాముని రాక కెదురు చూచుచు రాముని యాజ్ఞ చొప్పున నడచుకొనుచుఁ దన ప్రతిజ్ఞను నిర్వహించుకొనుచుండెను. ౨౪

భరతుఁడు రామపాదుకలకుఁ బట్టాభిషేకంబు గావించి నందిగ్రామంబు నను వాసంబు సేయుచు రాజకార్యంబు నంతయు రామపాదుకలకు విన్నవించుచుండెను. ౨౫

అట్లు శ్రీమంతుఁడగు భరతుఁడు రాముని పాదుకలకుఁ బట్టాభిషేకము గావించి యెల్లప్పుడు నాపాదుకలకు సేవసేయుచు రాజ్యంబుఁ జేయుచుండెను. ౨౬

రాచకార్య మేమైనఁ గలిగినప్పుడుగాని యెవ్వరైన సామంతులు గొప్ప కానుక లెచ్చినప్పుడుగాని దాని భరతుఁడు మొదలు పాదుకలకు నివేదించి యటుపిమ్మట గార్యంబు నడుపును. ౨౭

ఇది నూటపదునైదవసర్గము.

## నూటపదునాఱవసర్గము

అంత భరతుఁడు పోయినపిదప రాముఁ డాతపోవనంబునను వాసము

లక్షయామాస సోద్వేగ మథౌత్సుక్యం తపస్వినామ్. ౧

యే తత్ర చిత్రకూటస్య పురస్తా త్తాపసాశ్రమే,
రామ మాశ్రిత్య నిరతా స్తా నలక్షయ దుత్సుకాన్. ౨

నయనై ర్భృకుటీభి శ్చ రామం నిర్దిశ్య శఙ్కితాః,
అన్యోన్య ముపజల్పన్త శ్శనై శ్చక్రు ర్మిథః కథాః. ౩
తేషా మౌత్సుక్య మాలక్ష్య రామ స్త్వాత్మని శఙ్కితః,
కృతాఞ్జలి రువాచేదమృషిం కులపతిం తతః. ౪

న కచ్చి ద్భగవ! న్కిఞ్చి త్పూర్వవృత్త మిదం మయి,
దృశ్యతే వికృతం యేన విక్రియన్తే తపస్వినః. ౫
ప్రమాదా చ్చరితం కచ్చి త్కిఞ్చి న్నావరజస్య మే,
లక్ష్మణ స్యర్షిభి ర్దృష్టం నానురూప మి వాత్మనః. ౬
కచ్చి చ్ఛుశ్రూషమాణా వ శ్శుశ్రూషణపరా మయి,
ప్రమదాఽభ్యుచితాం వృత్తిం సీతా యుక్తం న వర్తతే. ౭

అథర్షి ర్జరయా వృద్ధ స్తపసా చ జరాం గతః,
వేపమాన ఇవోవాచ రామం భూతదయాపరమ్. ౮

కుతః కల్యాణసత్త్వాయాః కల్యాణాభిరతే స్తథా,
చలనం తాత! వైదేహ్యా స్తపస్విషు విశేషతః. ౯

త్వన్నిమిత్త మిదం తావ త్తాపసా న్ప్రతి వర్తతే,
రక్షోభ్య స్తేన సంవిగ్నాః కథయ న్తి మిథః కథాః. ౧౦

సేయుచు నందలిఋషులు భయంబు నొంది యాశ్రమాంతరంబునకుఁ బోఁగోరి
యుండుటను వారియింగితాదులవలన దెలిసికొనెను. ౧

మున్ను చిత్రకూటపర్వతమునందలి ఋష్యాశ్రమమునందు రామునా
శ్రయించియున్న ఋషు లందఱు నయ్యాశ్రమంబు విడువఁగోరియుండుటను
రాముఁడు వారియింగితాదులవలనఁ గనుంగొనెను. ౨

ఆఋషులు భయంబున నయనంబులను గన్నుబొమ్మలచేతను రామునిం
జూపుచు నొండొరులతో రహస్యంబున మాటలు చెప్పుకొనిరి. ౩

రాముఁడును అట్లు ఋషు లందఱు నయ్యాశ్రమంబు విడిచిపోఁ
గోరుటం జూచి తనవలన నేమైన నపరాధము సంభవించినదో యని శంకించి
కులపతియగు ఋషిం జూచి చేమోడ్పు గీలించి యిట్లని చెప్పెను. ౪

భగవంతుఁడా! ఈఋషు లందఱు మనస్సున వికారము నొంది
యున్నారే. నామునుపటి వృత్తాంతములో నేదియుం దప్పు లేదు గదా? ౫

నాతమ్ముఁడు లక్ష్మణుఁడు తన కనురూపముగానట్టి యకార్యమునుఁ
బ్రమాదవశంబునం గావింపలేదుగదా? ౬

మీకును నాకును శుశ్రూష సేయునట్టి నాభార్య సీత యేమైన మీవిష
యంబున నడచుకొనఁ దగినట్లు యుక్తముగాఁ బ్రవర్తింపకున్నదా యేమి?
అని రాముఁడు కులపతియగు ఋషితోఁ జెప్పెను. ౭

అంత మిక్కిలియుం ముసలివాఁడును మహాతపస్సంపన్నుఁడు నగు
నాకులపతి ముసలితనముచే వడంకుచు భూతదయాశాలియగు రామునిం జూచి
యిట్లని చెప్పెను. ౮

నాయనా! మంగళస్వభావురాలును మంగళానుష్ఠానపరయు నగు సీతా
దేవికి ఎప్పుడును ధర్మవ్యతిక్రమము గలుగదే; అందు ఋషులవిషయమయి
యెట్లు గలుగును. ౯

నీనిమిత్తమయి రాక్షసులవలన మునులకు మహాభయము సంభవించు
చున్నది. అందువలన భయపడి ఋషు లొకరితో నొకరు చెప్పుకొనుచున్నారు.

రావణావరజః కశ్చి త్ఖరో నామేహ రాక్షసః,
ఉత్పాట్య తాపసా న్సర్వా న్జనస్థాననికేతనాన్. ౧౧
ధృష్ట శ్చ జితకాశీ చ నృశంసః పురుషాదకః,
అవలిప్త శ్చ పాప శ్చ త్వాం చ తాత! న మృష్యతే. ౧౨

త్వం యదా ప్రభృతి హ్యస్మి న్నాశ్రమే తాత! వర్తసే,
తదా ప్రభృతి రక్షాంసి విప్రకుర్వన్తి తాపసాన్. ౧౩
దర్శయన్తి హి బీభత్సైః క్రూరై ర్భీషణకై రపి,
నానారూపై ర్విరూపై శ్చ రూపై ర్వికృతదర్శనైః. ౧౪

అప్రశస్తై రశుచిభి స్సమ్ప్రయోజ్య చ తాపసాన్,
ప్రతిఘ్న న్త్యపరా న్క్షిప్ర మనార్యాః పురతః స్థితాః. ౧౫
తేషు తేష్వాశ్రమస్థానే ష్వబుద్ధ మవలీయ చ,
రమన్తే తాపసాం స్తత్ర నాశయన్తోఽల్పచేతసః. ౧౬

అపక్షిప న్తి స్రుగ్భాణ్డా నగ్నీ న్సిఞ్చ న్తి వారిణా,
కలశాం శ్చ ప్రమృద్న న్తి హవనే సముపస్థితే. ౧౭

తై ర్దురాత్మభి రామృష్టా నాశ్రమా న్ప్రజిహాసవః,
గమనాయాన్యదేశస్య చోదయ న్త్యృషయోఽద్య మామ్.

తత్పురా రామ! శారీరా ముపహింసాం తపస్విషు,
దర్శయ న్తి హి దుష్టా స్తే త్యక్ష్యామ ఇమ మాశ్రమమ్. ౧౮

బహుమూలఫలం చిత్ర మవిదూరా దితో వనమ్

నాయనా ! ధృష్టుండును యుద్ధంబును సరకుసేయనివాఁడును క్రూరుఁడును ఋషమాంసభక్షకుఁడును గర్వితుఁడును బాపిష్ఠుఁడు నగు రావణానుజుఁడు ఖరుఁ డనురాక్షసుఁ డొక్కఁడు జనస్థానంబునం జేరి యచ్చటనుండు మునుల నందఱిం బాఱఁద్రోలినాఁడు. అతఁడు నిన్నుఁ జూచి యోర్వఁజాలక యిచ్చట మునులను బాధించుచున్నాఁడు. ౧౧-౧౨.

నాయనా ! నీ వీయాశ్రమమునకు వచ్చి చేరినది మొదలు రాక్షసులు మునుల నానావిధముల బాధించుచున్నారు. ౧౩.

ఆరాక్షసులు బీభత్సరూపములను క్రూరములును భయంకరములును వికృతములును వికృతనేత్రములు నగు నానావిధరూపములు చూపి మునులకు భయంబు గలిగించెదరు. ౧౪.

పూర్వవర్తులగు రాక్షసులు కొంద ఱీమునులకయి నిందితములును అపరిశుద్ధంబు లగు ద్రవ్యంబులఁ బడవైచి మఱికొందఱ వధింపుచున్నారు. ౧౫

క్షుద్రబుద్ధులగు నారాక్షసులు కొందఱు ఆయాయాశ్రమంబులం దెలియకుండునట్లు దాఁగియుండి యచ్చటిమునులను వధింపుచు విహరింపుచున్నారు. ౧౬.

హోమము సేయునప్పుడు వచ్చి స్రుక్స్రువంబులను హోమద్రవ్యంబులను బాఱవైచి యగ్నిహోత్రంబుల జలంబులం జల్లార్చి సమిత్కుండంబులను విఱిచి చూర్ణము గావించెదరు. ౧౭.

అట్లగుటం జేసి ఋషు లందఱు దురాత్ములగు నారాక్షసులసంచారము గల యాశ్రమంబులను విడిచి యితరప్రదేశంబునకుఁ బోవలయునని ఇప్పుడు నాతోఁ జెప్పుచున్నారు. ౧౮

రాముఁడా ! అట్లుకావున ఆదుష్టరాక్షసులు ఇంకముందు ఇయ్యాశ్రమంబున మునుల వధింప నారంభింతురు. కాఁబట్టి యీయాశ్రమంబు విడిచెదము. ౧౯

ఇక్కడికి బహుదూరంబున సమృద్ధమూలఫలంబగు నొకమహావనంబు

పురాణాశ్రమమేవాహం శ్రయిష్యే సగణః పునః. ౨౦

ఖరస్త్వయ్యపి చాయుక్తం పురా తాత! ప్రవర్తతే,
సహాస్మాభి రితో గచ్ఛ యది బుద్ధిః ప్రవర్తతే. ౨౧
సకళత్రస్య సన్దేహో నిత్యం యుక్తస్య రాఘవ!.
సమర్థస్యాపి హి సతో వాసో దుఃఖమిహాద్య తే. ౨౨

ఇత్యుక్తవన్తం రామస్తం రాజపుత్రస్తపస్వినమ్,
న శశాకోత్తరై ర్వాక్యై రవరోద్ధుం సముత్సుకమ్. ౨౩
అభినన్ద్య సమాపృచ్ఛ్య సమాధాయ చ రాఘవమ్,
స జగామాఽఽశ్రమం త్యక్త్వా కులైః కులపతి స్సహ. ౨౪

రామ స్సంసాధ్య త్వృషిగణ మనుగమనా
ద్దేశా త్తస్మా త్కులపతి మభివాద్య ఋషిమ్,
సమ్యక్ప్రీతై స్తై రనుమత ఉపదిష్టార్థః
పుణ్యం వాసాయ స్వనిలయ ముపసంపేదే. ౨౫
ఆశ్రమం త్వృషివిరహితం ప్రభుః
క్షణమపి విజహౌ స రాఘవః,
రాఘవం హి సతత మనుగతా
స్తాపసా శ్చార్షచరితధృతగుణాః. ౨౬

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే షోడశోత్తరశతతమస్సర్గః.

గలదు. నేను ఈఋషిసమూహముంగూడి యిందున్న మునుపటి యాశ్రమంబునకే మఱలం బోయెదను. ౨౦

ఇందు ముందు ఖరుఁడు నిన్నును బాధ గావించును. నీకు సమ్మతి యగు నేని నీవును మాతోఁగూడ నిచ్చటనుండి రమ్ము. ౨౧

రాముఁడా! యుద్ధసన్నద్ధుఁడగు వాఁడు భార్యాసహితుఁడై యిందు నేని యతని కెట్లును సందేహమే కావున నీవు సమర్థుఁడవయినను నీ కిప్పు డిచ్చట వాసముసేయుటచే మిక్కిలియుం గష్టము సంభవించును. అని కుల పతి రామునితోఁ జెప్పెను. ౨౨

రాజకుమారుఁడగు రాముఁడు ఈప్రకారముగ జెప్పి పయనంబు యిన యమ్మహర్షిని ఎన్నిమాటలు చెప్పియుం నిలుపఁజాలఁ డయ్యె. ౨౩

కులపతియగు నామహర్షి రాముని సంతోషపఱిచి వీడ్కొని సమాధానపుమాటలు చెప్పి యొప్పించి ఋషిసమూహసహితుం డై యయ్యాశ్రమంబు విడిచిపోయెను. ౨౪

రాముఁడు కులపతియగు మహర్షికి నమస్కరించి ఋషుల నందఱం గొంతదూరము వెంబడించిపోయి వారలవలన నుపదేశంబు గొని యనుజ్ఞ నొంది పవిత్రంబగు తనపర్ణశాలకుఁ బోయెను. ౨౫

రాముఁడు మునిజనస్వార్థంబులగు నాచారమును విడువకుండుటచే సంతోషితులై ఋషులందఱు నెల్లప్పుడు రాముని ననుసరించియే యుండిరి. కావున రాముఁడును ఋషులు పోయిన వెనుక నయ్యాశ్రమము తత్క్షణము విడువఁదగినదయ్యు వారలయందలి ప్రేమచేఁ గొంతకాలము మునులకు నివాసముగానుండిన యయ్యాశ్రమమును శీఘ్రంబున విడువఁజాలకుండెను.

ఇది నూటపదునాఱవసర్గము.

---

## సప్తదశోత్తరశతతమస్సర్గః

రాఘవ స్త్వథ యాతేషు తపస్విషు విచిన్తయన్,
న తత్రారోచయ ద్వాసం కారణై ర్బహుభి స్తదా. ౧
ఇహ మే భరతో దృష్టో మాతర శ్చ సనాగరాః,
సా చ మే స్మృతి రన్వేతి తా న్నిత్య మనుశోచతః. ౨

స్కన్ధావారనివేశేన తేన తస్య మహాత్మనః,
హయహస్తికరీషై శ్చ ఉపమర్దః కృతో భృశమ్. ౩
తస్మా దన్యత్ర గచ్ఛామ ఇతి సంచిన్త్య రాఘవః,
ప్రాతిష్ఠత స వైదేహ్యా లక్ష్మణేన చ సంగతః. ౪

సోఽత్రే రాశ్రమ మాసాద్య తం వవన్దే మహాయశాః,
తం చాపి భగవా నత్రిః పుత్రవ త్ప్రత్యపద్యత. ౫

స్వయ మాతిథ్య మాదిశ్య సర్వ మస్య సుసత్కృతమ్,
సౌమిత్రిం చ మహాభాగాం సీతాం చ సమసాన్త్వయత్. ౬

పత్నీం చ సమనుప్రాప్తాం వృద్ధా మామన్త్ర్య సత్కృతామ్,
సాన్త్వయామాస ధర్మజ్ఞ స్సర్వభూతహితే రతః. ౭

అనసూయాం మహాభాగాం తాపసీం ధర్మచారిణీమ్,
ప్రతిగృహ్ణీష్వ వైదేహీ మబ్రవీ దృషిసత్తమః. ౮

రామాయ చాఽచచక్షే తాం తాపసీం ధర్మచారిణీమ్,

## నూటపదునేడవసర్గము

ఆఋషు లందఱుఁ బోయినపిమ్మట రాముఁడు పెక్కుకారణంబుల నాలోచించి యయ్యాశ్రమంబున నుండఁగూడదని నిశ్చయించెను. ౧

నేను నీయాశ్రమమునందే భరతుని బౌరులను నాతల్లులను జూచి నాను. కావున నీయాశ్రమమును జూచినప్పు డంతయుం వారలు జ్ఞప్తికి వచ్చి నాకు మిక్కిలియుం దుఃఖము గలుగుచుండును. ౨

మహాత్ముఁడగు నాభరతునిసేన యిచ్చట విడచుటవలన అశ్వగజంబుల లద్దులచే నాశ్రమం బంతయుం జెడియున్నది. ౩

అట్లగుటం జేసి ఈస్థలంబు విడిచి మఱియొకస్థలంబునకుఁ బోవల యుఁను. ఇట్లు రాముఁడాలోచించి సీతాలక్ష్మణులం గూడి బయలుదేఱి పోయెను. ౪

మహాయశుఁడగు నారాముఁడు అత్రిమహాముని యాశ్రమంబునకుఁ బోయి యమ్మహామునికి నమస్కారంబు గావించెను. ఆయనయుం రాముని గొడుకునుంబోలె నాదరించెను. ౫

ఆయత్రిమహాముని రామునకుఁ దానే యతిథిసత్కారమంతయుఁ జక్కఁగాఁ గావించి లక్ష్మణుని మహాభాగురాలగు సీతాదేవినిం బ్రియవచనంబుల నాదరించెను. ౬

ధర్మజ్ఞుఁడును సమస్తప్రాణిహితరతుఁడునగు నత్రిమహాముని సమీపం బుననున్న వృద్ధురాలును సర్వలోకపూజితయుం నగు తనభార్యం బిలిచి భార్యయుం దానును రామాదుల నాదరించిరి. ౭

ఋషిశ్రేష్ఠుఁడగు నత్రిమహాముని సీతాదేవిం జూచి మహాభాగురాలును దపస్వినియుం ధర్మానుష్ఠానపరయుం నగునసూయాదేవికి నమస్కారంబు గావింపుమని చెప్పెను. ౮

ఆయత్రిమహాముని రామునకును మహాతపశ్శాలినియుఁ బరమధార్మికు రాలునగు ననసూయాదేవితోఁ జెప్పెను.

దశవర్షాణ్యనావృష్ట్యా దగ్ధే లోకే నిరన్తరమ్. ౯
యయా మూలఫలే సృష్టే జాహ్నవీ చ ప్రవర్తితా.
ఉగ్రేణ తపసా యుక్తా నియమైశ్చాప్యలఙ్కృతా. ౧౦
దశవర్ష సహస్రాణి తయా తప్తం మహత్తపః,
అనసూయా వ్రతైస్స్నాతా ప్రత్యూహాశ్చ నివర్తితాః.౧౧
దేవకార్యనిమిత్తం చ యయా సన్త్వరమాణయా,
దశరాత్రం కృతా రాత్రి స్సేయం మాతేవ తేఽనఘ!. ౧౨

తా మిమాం సర్వభూతానాం నమస్కార్యాం యశస్వినీమ్,
అభిగచ్ఛతు వైదేహీ వృద్ధా మక్రోధనాం సదా. ౧౩
అనసూయేతి యా లోకే కర్మభిః ఖ్యాతి మాగతా,

ఏవం బ్రువాణం త మృషిం తథే త్యుక్త్వా స రాఘవః. ౧౪
సీతా ముహాచ ధర్మజ్ఞా మిదం వచన ముత్తమమ్,

రాజపుత్రి! శ్రుత మిదం మునే రస్య సమీరితమ్. ౧౫
శ్రేయోఽర్థ మాత్మన శ్శీఘ్ర మభిగచ్ఛ తపస్వినీమ్,

సీతా త్వేత ద్వచ శ్శ్రుత్వా రాఘవస్య హితైషిణః. ౧౬
తా మత్రిపత్నీం ధర్మజ్ఞా మభిచక్రామ మైథిలీ,
శిథిలాం వలితాం వృద్ధాం జరాపాణ్డురమూర్ధజామ్. ౧౭
సతతం వేపమానాఙ్గీం ప్రవాతే కదలీ యథా,
తాం తు సీతా మహాభాగా మనసూయాం పతివ్రతామ్. ౧౮
అభ్యవాదయ దవ్యగ్రా స్వం నామ సముదాహరత్,

పాపరహితుఁడవగు రాముఁడా! ఈయనసూయాదేవి మున్ను పదిసంవత్సరములు వర్షములేక మహాక్షామముసంభవించి లోకంబు లన్నియుం దగ్ధములగుచుండునప్పుడు ఋషులకు ఫలమూలంబుల సృజించి గంగానదినిం గూడ బ్రవహించుచుండునట్లు గావించినది. పదివేలసంవత్సరంబు లత్యుగ్రతపంబు గావించినట్టి మహాప్రభావురాలును, కృచ్ఛ్రచాంద్రాయణాదివ్రతంబులు పెక్కు లాచరించినదియు, ఋషులకుం గల్గు తపోవిఘ్నంబు లన్నియుం నివారించుచుండును. మఱియును మున్నొకప్పుడు దేవకార్యనిమిత్తమయి పదిరాత్రులు ఒకటేరాత్రిగాఁ జేసి మన్ననవడసియున్నది. నీ విమ్మహాదేవిని దల్లినింబోలె బూజింపుము. శ్రేయస్సు గలుగును. ౯-౧౨

అద్భుతకర్మంబులచేత లోకంబునం దంతయుం ననసూయాదేవియని ప్రఖ్యాతి గాంచినట్టిదియుం సమస్తప్రాణులకును నమస్కార్యయును మహాయశశ్శాలినియుం వృద్ధురాలును గోపరహితయునగు నీయనసూయాదేవిని సీతాదేవి నమస్కరించుఁగాక. అని యమ్మహాముని రామునితోఁ జెప్పెను. ౧౩

అంత శ్రీరాముఁడు అత్రిమహాముని చెప్పినమాటను విని యాయన కట్టే యని చెప్పి ధర్మజ్ఞురాలగు సీతాదేవిం జూచి యుత్తమంబగు నీమాటం జెప్పెను. ౧౪

రాజపుత్రివగు సీతా! యిమ్మహాముని సెలవిచ్చినమాటను విన్నావు గదా. కావున నీశ్రేయస్సుపొంటె శీఘ్రంబున నీయనసూయాదేవిని సేవింపుము. అని రాముఁడు సీతాదేవికిం జెప్పెను. ౧౫

అంత సీతాదేవి తనమేలుఁగోరునట్టి రాముఁడు చెప్పినమాటను విని ధర్మజ్ఞురాలగు నాయనసూయాదేవికిఁ బ్రదక్షిణము గావించెను. ౧౬

సీతాదేవి శిథిలాంగియుం దేహమునందు ముడతలుగలదియుం వృద్ధురాలును ముసలితనంబునం జేసి తెల్లనైన వెండ్రుకలుగలదియుఁ బ్రవాతంబునఁ గదళీవృక్షముంబోలె గడగడవడంకుచున్నదియుం మహాభాగురాలును బతివ్రతయునగు నయ్యనసూయాదేవికి స్వనామోదాహరణపూర్వకముగా నమస్కారంబు గావించెను. ౧౭-౧౯

అభివాద్య చ వైదేహీ తాపసీం తా మనిన్దితామ్. ౧౯
బద్ధాఞ్జలిపుటా హృష్టా పర్యపృచ్ఛ దనామయమ్,

తత స్సీతాం మహాభాగాం దృష్ట్వా తాం ధర్మచారిణీమ్. ౨౦
సాన్త్వయ న్త్యబ్రవీ ద్ధృష్టా దిష్ట్యా ధర్మమవేక్షసే,

త్యక్త్వా జ్ఞాతిజనం సీతే! మాన మృద్ధిం చ భామిని!. ౨౧
అవరుద్ధం వనే రామం దిష్ట్యా త్వ మనుగచ్ఛసి,

నగరస్థో వనస్థో వా పాపో వా యది వా శుభః. ౨౨
యాసాంస్త్రీణాంప్రియో భర్తా తాసాం లోకా మహోదయాః,

దుశ్శీలః కామవృత్తో వా ధనై ర్వా పరివర్జితః. ౨౩
స్త్రీణా మార్యస్వభావానాం పరమం దైవతం పతిః,
నాతో విశిష్టం పశ్యామి బాన్ధవం విమృశ న్త్యహమ్. ౨౪
సర్వత్ర యోగ్యం వైదేహి! తపః కృతమివావ్యయమ్,
న త్వేవ మవగచ్ఛన్తి గుణదోష మసత్ స్త్రియః. ౨౫
కామవ క్తవ్యహృదయా భర్తృనాథా శ్చర న్తి యాః,
ప్రాప్నువ న్త్యయశ శ్చైవ ధర్మభ్రంశం చ మైథిలి!. ౨౬
అకార్యవశ మాపన్నాః స్త్రియో యాః ఖలు తద్విధాః,

తద్విధా స్తు గుణై ర్యుక్తా దృష్టలోకపరావరాః. ౨౭
స్త్రియ స్స్వర్గే చరిష్య న్తి యథా ధర్మకృత స్తథా,

అట్లు సీతాదేవి అనిందితయగు నాయనసూయామహాదేవికి నమస్కా-
రంబు గావించి పరమసంతోషంబున చేమోడ్పుగేలించి యారోగ్యంబు
నడిగెను. ౧౯

అంత ననసూయాదేవి మహాభాగురాలునుఁ బరమధార్మికురాలు నగు
నాసీతాదేవిం జూచి పరమసంతోషంబు నొంది మధురవాక్యంబున నిట్లని
చెప్పెను. నీభాగ్యవశంబునం జేసి నీ కిట్లు పాతివ్రత్యరూపధర్మబుద్ధి గలిగి
యున్నది. ౨౦

సీతాదేవీ! నీవు బంధుజనమును అహంకారమును ఐశ్వర్యమును అన్నిం
టిని విడిచి అడవికిఁ బంపఁబడిన రాముని వెంబడించి వచ్చి యున్నావే!
నీభాగ్య మేమని చెప్పవచ్చును. ౨౧

ఏస్త్రీలు పెనిమిటిపట్టణంబున నున్నను అడవిలో నున్నను, దరిద్రుఁ
డైనను బాపిష్ఠుఁ డైనను అతని విడువక సేవించుచుందురో అట్టిస్త్రీలకు
ఉత్తమలోకములు కలుగును. ౨౨

దుష్టస్వభావుఁ డైనను స్వేచ్ఛాచారసంపన్నుఁ డైనను దరిద్రుఁ
డైనను పెనిమిటియే ధార్మికస్త్రీలకుఁ బరమదేవత. ౨౩

సీతాదేవీ! నే నెంత యాలోచించినను పెనిమిటికన్న మహాతపస్సు
వలె సర్వావస్థలయందును రక్షించునట్టి బంధు వెవ్వఁడును నాకుఁగనుపడలేదు.

మన్మథాధీనమానసలయి పరపురుషులం గోరుచుండునట్టి దుష్టస్త్రీలకు
ఈధర్మసూక్ష్మము దెలియదు.

అట్లు కామాధీనలయి దుర్మార్గంబునం బ్రవర్తించునట్టి దుష్టస్త్రీలు
ఇహలోకంబున నపకీర్తి నొంది పరలోకంబునను భయంకర నరకంబు
నొందుదురు. ౨౬

నీయట్టిగుణవతులును మంచి చెడుగులు దెలిసినవారలు నగు నుత్తమ
స్త్రీలు ధార్మికులచాడ్పున స్వర్గంబున విహరింపుచుందురు. ౨౭

తదేవ మేనం త్వ మనువ్రతా సతీ
పతివ్రతానాం సమయానువర్తినీ,
భవ స్వభర్తు స్సహధర్మచారిణీ
యశశ్చ ధర్మం చ తత స్సమాప్స్యసి. ౨౯

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డే సప్తదశోత్తరశతతమస్సర్గః.

---

## అష్టాదశోత్తరశతతమస్సర్గః

సా త్వేవ ముక్తా వైదేహీ అనసూయాఽనసూయయా,
ప్రతిపూజ్య వచో మన్దం ప్రవక్తు ముపచక్రమే. ౧

నైత దాశ్చర్య మార్యాయా యన్మాం త్వ మభిభాషసే,
విదిత న్తు మమాప్యేత ద్యథా నార్యాః పతి ర్గురుః. ౨

యద్య ప్యేష భవే ద్భర్తా మమాఽర్యే! వృత్తవర్జితః,
అద్వైధ ముపచర్తవ్య స్తథా ప్యేష మయా భవేత్. ౩

కింపున ర్యో గుణశ్లాఘ్య స్సానుక్రోశో జితేన్ద్రియః,
స్థిరానురాగో ధర్మాత్మా మాతృవ త్పితృవ త్ప్రియః. ౪

యాం వృత్తిం వర్తతే రామః కౌసల్యాయాం మహాబలః,
తా మేవ నృపనారీణా మన్యాసా మపి వర్తతే. ౫
సకృద్దృష్టా స్వపి స్త్రీషు నృపేణ నృపవత్సలః,

అట్లగుటంజేసి నీ విప్పటివలెనే పెనిమిటిని ననువర్తింపుచుఁ బతివ్రతల యాచారము ననుసరించి పెనిమిటితోఁ గూడ ధర్మంబు నాచరింపుచుండుము. నీకుఁ గీర్తియును ధర్మంబును గలుగును. అని యనసూయ సీతకుఁ జెప్పెను. ౨౯

ఇది నూటపదునేడవసర్గము.

---

## నూటపదునెనిమిదవసర్గము

అంత ననసూయారహితయగు సీతాదేవి యనసూయాదేవి చెప్పిన మాటలు విని యమ్మాటను బూజించి వినయంబునఁ దిన్నఁగా నిట్లని చెప్పెను. ౧

నీవు నాకిట్లుపదేశించుట సకలలోకపూజ్యయగు నీ కాశ్చర్యకరము గాదు. స్త్రీకిఁ బెనిమిటియే దైవ మనునది నాకును దెలిసియున్న సంగతియే. ౨

పూజ్యురాలవగు ననసూయాదేవీ! ఒకవేళ నా పెనిమిటి యాచారహీనుఁడై యున్నను, అప్పటికిని, నే నతనికి సేవచేయవలసినదిగానే యున్నది గదా!. ౩

అట్టుండఁగా గుణవంతుఁడును దయాశాలియు జితేంద్రియుఁడును నాయందు స్థిరమయిన యనురాగము గలవాఁడును ధర్మాత్ముఁడును నాకు దల్లియుంబోలెఁ బ్రియంబుసేయువాఁడును దండ్రియుంబోలె హితం బొనఁగూర్పువాఁడును మహాకారుఁడు నగు పెనిమిటిని సేవించుటకుఁ జెప్పవలయునా యేమి?. ౪

మహాబలుఁడగు రాముఁడు కౌసల్యయం దెట్లు వర్తించునో అదే ప్రకారమున దశరథరాజస్త్రీలయందును వర్తించును. ౫

పితృవత్సలుఁడును ధర్మవేత్తయు నగుపరాక్రమవంతుఁడు రాముఁడు

మాతృవ ద్వర్తతే వీరో మాన ముత్సృజ్య ధర్మవిత్. ౬

ఆగచ్ఛన్త్యాశ్చ విజనం వన మేవం భయావహమ్,
సమాహితం మే శ్వశ్ర్వా చ హృదయే త ద్ధృతం మహత్. ౭

పాణిప్రదానకాలే చ య త్పురా త్వగ్నిసన్నిధౌ,
అనుశిష్టా జనన్యాఽస్మి వాక్యం తదపి మే ధృతమ్. ౮

నవీకృతం తు తత్సర్వం వాక్యై స్తే ధర్మచారిణి!,
పతిశుశ్రూషణా న్నార్యా స్తపో నాన్య ద్విధీయతే. ౯

సావిత్రీ పతిశుశ్రూషాం కృత్వా స్వర్గే మహీయతే,
తథావృత్తి శ్చ యాతా త్వం పతిశుశ్రూషయా దివమ్. ౧౦

వరిష్ఠా సర్వనారీణా మేషా చ దివి దేవతా,
రోహిణీ న వినా చన్ద్రం ముహూర్త మపి దృశ్యతే. ౧౧
ఏవంవిధా శ్చ ప్రవరాః స్త్రియో భర్తృదృఢవ్రతాః,
దేవలోకే మహీయన్తే పుణ్యేన స్వేన కర్మణా. ౧౨

తతోఽనసూయా సంహృష్టా శ్రుత్వోక్తం సీతయా వచః,
శిరస్యాఘ్రాయ చోవాచ మైథిలీం హర్షయ న్త్యుత. ౧౩

నియమై ర్వివిధై రాప్తం తపో హి మహ దస్తి మే,
త త్సంశ్రిత్య బలం సీతే! ఛన్దయే త్వాం శుచివ్రతే!. ౧౪

తండ్రి యొక్క మాట కంటెం జూచినట్టి స్త్రీలకుం గూడం దల్లికింబోలె మానంబు విడిచి శుశ్రూష సేయుచుందును. ౬

నేను భయంకరంబును విజనంబునగు నరణ్యంబునకు వచ్చునప్పుడు నాకుం బాతివ్రత్యమును గుఱించి నాయత్త కౌసల్య యుపదేశించినది. నేను దానిమనంబున నుంచుకొనియే యున్నాను. ౭

మున్ను నా వివాహకాలంబున నగ్నిహోత్రసన్నిధానంబున నా తల్లియుం బాతివ్రత్యధర్మంబు నుపదేశించియున్నది. దానినింగూడ మఱవక మనసులో నుంచి కొనియున్నాను. ౮

పరమధార్మికవగు ననసూయాదేవీ! నీవు చెప్పినమాటలవలన నాకిప్పుడదంతయుం జక్కగాం జ్ఞప్తికి వచ్చినట్టయినది. స్త్రీకిం బతిసేవకన్న మఱియే తపస్సును లేదు. ౯

సావిత్రీదేవి పతిశుశ్రూషం గావించి స్వర్గలోకంబున వెలుంగుచున్నది. నీవును అదేప్రకారమయిన పతిశుశ్రూష సేయుటం జేసి స్వర్గంబునొందగలవు. ౧౦

సమస్తస్త్రీలలో నుత్తమయగు రోహిణీదేవి యాకాశంబునం జంద్రుని విడిచి కొంచెముసేపైనను అగుపడదు. ౧౧

మఱియుం బెక్కుపుణ్యస్త్రీలు ఇట్టుదృఢంబగు పాతివ్రత్యంబుననుష్ఠించి తమపుణ్యబలంబున స్వర్గలోకమునందు వెలుంగుచున్నారు. అని సీతాదేవి యనసూయాదేవితోం జెప్పెను. ౧౨

అంత నయ్యనసూయాదేవి సీతాదేవి చెప్పినమాటనువిని పరమసంతుష్టయయి సీతాదేవి గగుర్పాటు నొందునట్లు శిరంబు మూర్కొని యిట్లని చెప్పెను. ౧౩

తెల్లనిచిఱునగవుగల సీతాదేవీ! నానావిధనియమంబుల సంపాదింపంబడినతపస్సు నాకు మిక్కిలియు నధికముగా నున్నది కావున నీయిష్టంబు నెఱవేర్తును. నీకేమి కావలయును? చెప్పుము. ౧౪

ఉపపన్నం మనోజ్ఞం చ వచనం తవ మైథిలి!,
ప్రీతా చాస్మ్యుచితం కిం తే కరవాణి బ్రవీహి మే. ౧౫

తస్యా స్తద్వచనం శ్రుత్వా విస్మితా మన్దవిస్మయా,
కృత మి త్యబ్రవీ త్సీతా తపోబలసమన్వితామ్. ౧౬

సా త్వేవ ముక్తా ధర్మజ్ఞా తయా ప్రీతతరాఽభవత్,

సఫలం చ ప్రహర్షం తే హన్త సీతే! కరో మ్యహమ్. ౧౭

ఇదం దివ్యం వరం మాల్యం వస్త్ర మాభరణాని చ,
అఙ్గరాగం చ వైదేహి! మహార్హం చానులేపనమ్. ౧౮
మయా దత్త మిదం సీతే! తవ గాత్రాణి శోభయేత్,
అనురూప మసంక్లిష్టం నిత్యమేవ భవిష్యతి. ౧౯

అఙ్గరాగేణ దివ్యేన లిప్తాఙ్గీ జనకాత్మజే!,
శోభయిష్యసి భర్తారం యథా శ్రీర్విష్ణు మవ్యయమ్. ౨౦

సా వస్త్ర మఙ్గరాగం చ భూషణాని స్రజ స్తథా,
మైథిలీ ప్రతిజగ్రాహ ప్రీతిదాన మనుత్తమమ్. ౨౧

ప్రతిగృహ్య చ త త్సీతా ప్రీతిదానం యశస్వినీ,
శ్లిష్టాఞ్జలిపుటా తత్ర సముపా స్త తపోధనామ్. ౨౨

సీతాదేవీ! నీమాటలు యుక్తమైనవిగాను మిక్కిలియు మనోహరముగా నున్నది. నాకు మిక్కిలియు సంతోషము గలిగినది. నీకోర్కె యేమి? నేనేమి సేయవలయును? చెప్పుము, అని యనసూయాదేవి సీతకుం జెప్పెను. ౧౫

సీతాదేవియు నయ్యనసూయాదేవిమాట విని యాశ్చర్యము నొంది చిఱునగవు మొగంబున సంచరింప నయ్యనసూయాదేవిం జూచి "ఈమాటతో చాలును నాకుం గావలసినంత చేసినట్లే" యని చెప్పెను. ౧౬

ధర్మజ్ఞురాలగు నాయనసూయాదేవి సీతాదేవి చెప్పినమాటను విన్నంతనె మఱియు నధికసంతోషంబు నొందినది.

సంతోషము! నాకు నీయం దిప్పుడు గలిగిన సంతోషంబును నీయందు సఫలము గావింపవలెను. ౧౭

సీతాదేవీ! ఈదివ్యంబగు పుష్పమాలికయును, వస్త్రమును, ఆభరణంబులను, అంగరాగమును నుత్తమంబగు పరిమళగంధమును ఉన్నది. ౧౮

సీతాదేవీ! నే నొసంగినట్టి యీదివ్యమాలికాదులు నీదేహంబునకు మిక్కిలియుం బ్రకాశంబు సేయుచుండును. ఇది యెప్పటికిని నశింపదు. నీసౌందర్యంబునకును గుణంబుగా దివ్యతేజంబున వెలుంగుచుండును. ౧౯

జనకమహారాజుకొమార్తెవగు సీతాదేవీ! నీ వీదివ్యంబగు నంగరాగమును బూసికొని లక్ష్మీదేవి యవ్యయుండగు విష్ణువునకు సంతోషంబు సేయునట్లు నీభర్తకు మిక్కిలియుం సంతోషంబు గలిగింతువు. అని యనసూయాదేవి సీతకుం జెప్పెను. ౨౦

ఆసీతాదేవి అట్లనసూయాదేవిచేఁ బ్రీతిపూర్వకంబుగా నీయఁబడిన యుత్తమంబులగు వస్త్రమును అంగరాగమును సొమ్ములను పుష్పమాలికలను బ్రతిగ్రహించెను. ౨౧

అంత మహాయశశ్శాలినియగు సీతాదేవి యనసూయాదేవిచేఁ బ్రీతిపూర్వకంబుగా నొసఁగబడినవస్త్రాదులం బ్రతిగ్రహించి యచ్చటనే చేమోడ్చి, నిలిచి యమ్మహాదేవిని సేవింపుచుండెను. ౨౨

తథా సీతా ముపాసీనా మనసూయా దృఢవ్రతా,
వచనం ప్రస్తా మారేభే కాంచి త్ప్రియకథా మను. ౨౩
స్వయంవరే కిల ప్రాప్తా త్వ మనేన యశస్వినా,
రాఘవేణేతి మే సీతే! కథా శ్రుతి ముపాగతా. ౨౪
తాం కథాం శ్రోతు మిచ్ఛామి విస్తరేణ చ మైథిలి!,
యథాఽనుభూతం కార్త్స్న్యేన తన్మే త్వం వక్తు మర్హసి. ౨౫

ఏవ ముక్తా తు సా సీతా తాం తతో ధర్మచారిణీమ్,
శ్రూయతా మితి చోక్త్వా వై కథయామాస తాం కథామ్. ౨౬
మిథిలాధిపతి ర్వీరో జనకో నామ ధర్మవిత్,
క్షత్త్రధర్మే హ్యభిరతో న్యాయత శ్శాస్తి మేదినీమ్. ౨౭

తస్య లాఙ్గలహస్తస్య కర్షతః క్షేత్రమణ్డలమ్,
అహం కిలోత్థితా భిత్త్వా జగతీం నృపతే స్సుతా. ౨౮

స మాం దృష్ట్వా నరపతి ర్ముష్టివిక్షేపతత్పరః,
పాంసుకుణ్ఠితసర్వాఙ్గీం జనకో విస్మితోఽభవత్. ౨౯

అనపత్యేన చ స్నేహా దఙ్క మారోప్య చ స్వయమ్,
మమేయం తనయే త్యుక్త్వా స్నేహో మయి నిపాతితః. ౩౦

అన్తరిక్షే చ వా గుక్తాఽప్రతిమా మానుషీ కిల,
ఏవ మేత న్నరపతే! ధర్మేణ తనయా తవ. ౩౧

దృఢవ్రతయగు ననసూయాదేవి యట్లు సేవాపరయయియున్న సీతాదేవిం జూచి యొకానొకప్రియకథం గుఱించి యడుగ నారంభించెను. ౨౩

సీతాదేవీ! మహాయశశ్శాలియగు రాముఁడు నిన్ను స్వయంవరంబునం బొందినాఁడుగదా! ఈసంగతిని నేనును వినియున్నాను. ౨౪

సీతాదేవీ! ఆకథ నంతయుం సవిస్తారంబుగా వినవలెనని కోరుచున్నాను. కాఁబట్టి జరిగినది జరిగినట్టుగా నా కాకథ నంతయుం నీవు చెప్పవలయును. అని యనసూయాదేవి సీత నడిగెను. ౨౫

అంత నాసీతాదేవి యనసూయామాటను విని పరమధార్మికయగు నమ్మహాదేవిం జూచి విను మని యాకథఁ జెప్పం దొడఁగెను. ౨౬

పరాక్రమవంతుఁడును ధర్మవేత్తయు నగు మిథిలానాథుఁడు జనకమహారా జనువాఁడు క్షత్రియధర్మంబు నవలంబించి యథాన్యాయంబుగ భూమిం బాలింపుచుండును. ౨౭

ఆజనకమహారాజు నాఁగలి చేఁబూని యాగోపయుక్తమగు మండలాకారక్షేత్రమును దున్నుచుండఁగా నేను భూమిని భేదించి యుద్భవించి యామహారాజునకుఁ గొమార్తె నైతిని. ౨౮

అప్పుడు ఓషధులను బిడికిళ్లను జల్లుచున్న యాజనకమహారాజు దేహమంతయుం దుమ్ముతోఁ బ్రాదుర్భవించిన నన్నుం జూచి పరమాశ్చర్యంబు నొందెను. ౨౯

అంత జనకమహారాజు సంతానహీనుఁ డగుటంజేసి స్నేహంబున నన్నుత్సంగంబునం జేర్చి నాకొమార్తె యిది యని చెప్పుచు నాయందు స్నేహంబుంచెను. ౩౦

అప్పుడు "జనకమహారాజా! ఇది వాస్తవము. ఈచిన్నది ధర్మమున నీకొమార్తెయే యగుచున్నది." అని యాకాశంబున నదృశ్యంబగు నమానుషవాక్కు పుట్టినది. ౩౧

తతః ప్రభృతి ధర్మాత్మా పితా మే మిథిలాధిపః,
అవాప్తో విపులా మృద్ధిం మా మవాప్య నరాధిపః. ౩౨

దత్తా చాస్మీష్టవ ద్దేవ్యై జ్యేష్ఠాయై పుణ్యకర్మణా,
తయా సమ్భావితా చాస్మి స్నిగ్ధయా మాతృసౌహృదాత్. ౩౩

పతిసంయోగసులభం వయో దృష్ట్వా తు మే పితా,
చిన్తా మభ్యగమ ద్దీనో విత్తనాశాదివాధనః. ౩౪

సదృశా చ్చాపకృష్టా చ్చ లోకే కన్యాపితా జనాత్,
ప్రధర్షణా మవాప్నోతి శక్రేణాపి సమో భువి. ౩౫
తాం ధర్షణామదూరస్థాం దృష్ట్వా చాత్మని పార్థివః,
చిన్తార్ణవగతః పారం నాససాదాప్లవో యథా. ౩౬

అయోనిజాం హి మాం జ్ఞాత్వా నాధ్యగచ్ఛ ద్విచిన్తయన్,
సదృశం చానురూపం చ మహీపాలః పతిం మమ. ౩౭
తస్య బుద్ధి రియం జాతా చిన్తయానస్య సన్తతమ్,
స్వయంవరం తనూజాయాః కరిష్యామీతి ధీమతః. ౩౮
మహాయజ్ఞే తదా తస్య వరుణేన మహాత్మనా,
దత్తం ధను ర్వరం ప్రీత్యా తూణీ చాక్షయసాయకౌ. ౩౯

అసంచాల్యం మనుష్యై శ్చ యత్నేనాపి చ గౌరవాత్,
తన్న శక్తా నమయితుం స్వప్నేష్వపి నరాధిపాః. ౪౦

తద్ధనుః ప్రాప్య మే పిత్రా వ్యాహృతం సత్యవాదినా,
సమవాయే నరేన్ద్రాణాం పూర్వ మామన్త్ర్య పార్థివాన్. ౪౧

అంత ధర్మాత్ముఁడగు నాతండ్రి, జనకమహారాజు ఆకాశవాణిని విని సంతసించి నన్నుఁ దీసికొని పరమసంతోషంబు నొందెను. ౩౨

పుణ్యకర్ముఁడగు జనకమహారాజు నన్నుఁ దీసికొనిపోయి తనమొదటి భార్యకొసంగెను. ఆవిడయుఁ దల్లివలెనే స్నేహంబున నన్నుఁ బోషించుచు వచ్చినది. ౩౩

అంత నాతండ్రి జనకమహారాజు నాకు వివాహయోగ్యవయస్సు వచ్చుటంజూచి దీనుఁడై ధననాశంబు నొందిన దరిద్రుఁడువలె దుఃఖంబు నొందెను. ౩౪

లోకంబునఁ గూఁతురు కన్నతండ్రి దేవేంద్రసదృశుఁడైనను సరివారిలోను దక్కువవారిలోను దిరస్కారము నొందును. ౩౫

జనకమహారాజు అట్టి తిరస్కారము తనకింక శీఘ్రంబుగనే గలుగుట కన్నదని దుఃఖసముద్రంబునం బడి తెప్పలేనివాఁడు సముద్రంబుగట్టుచేరం జాలనట్లు దాని నంతంబు నొందఁ డయ్యె. ౩౬

జనకమహాజు నే నయోనిజనగుటం దలపోసి యెంత యాలోచించినను నాకుఁదగిన పెనిమిటి యాయనకు దొరకఁ డయ్యెను. ౩౭

అట్లు నిరంతరము నాలోచింప నాలోచింప బుద్ధిమంతుఁడగు నాజనకునకు "కొమార్తెకు స్వయంవరంబు గావించెదను" అని బుద్ధి పుట్టినది. ౩౮

మున్ను మహాయజ్ఞంబున దేవతలు సంతసించి ప్రేరేపింపఁ మహాత్ముఁడగు వరుణుఁడు జనకమహారాజునకు ఉత్తమంబగు ధనుస్సును తఱుగని బాణంబులు గల యమ్ములపొదులును నొసంగియుండెను. ౩౯

ఆధనుస్సు మిక్కిలియు బరువగుటవలన మనుష్యమాత్రులు దాని నెంత కష్టపడినను గదలింపఁజాలరు. అట్లుండుటవలన రాజులు స్వప్నంబునం దైనను దాని వంచుటకు సమర్థులు కాఁజాలరు. ౪౦

అంత సత్యవాదియగు నాతండ్రి రాజుల నందఱిం బిలిచి రాజులనడుమ నాధనువుం జూచి యిట్లని చెప్పెను. ౪౧

ఇదం చ ధను రుద్యమ్య సజ్యం యః కురుతే నరః,
తస్య మే దుహితా భార్యా భవిష్యతి న సంశయః. ౪౨

త చ్చ దృష్ట్వా ధనుశ్శ్రేష్ఠం గౌరవా ద్గిరిసన్నిభమ్,
అభివాద్య నృపా జగ్ము రశక్తా స్తస్య తోలనే. ౪౩
సుదీర్ఘస్య తు కాలస్య రాఘవోఽయం మహాద్యుతిః,
విశ్వామిత్రేణ సహితో యజ్ఞం ద్రష్టుం సమాగతః. ౪౪
లక్ష్మణేన సహ భ్రాత్రా రామ స్సత్యపరాక్రమః,
విశ్వామిత్ర స్తు ధర్మాత్మా మమ పిత్రా సుపూజితః. ౪౫
ప్రోవాచ పితరం తత్ర భ్రాతరౌ రామలక్ష్మణౌ,
సుతౌ దశరథస్యేమౌ ధనుర్దర్శనకాఙ్క్షిణౌ. ౪౬

ధను ర్దర్శయ రామాయ రాజపుత్రాయ దైవికమ్,

ఇ త్యుక్త స్తేన విప్రేణ తద్ధను స్సముపానయత్. ౪౭

నిమేషా న్తరమాత్రేణ తదాఽనమ్య స వీర్యవాన్,
జ్యాం సమారోప్య ఝడితి పూరయామాస వీర్యవత్. ౪౮

తేన పూరయతా వేగా న్మధ్యే భగ్నం ద్విధా ధనుః,
తస్య శబ్దోఽభవ ద్భీమః పతితస్యాశనే రివ. ౪౯

తతోఽహం తత్ర రామాయ పిత్రా సత్యాభిసన్ధినా,
నిశ్చితా దాతు ముద్యమ్య జలభాజన ముత్తమమ్. ౫౦
దీయమానాం న తు తదా ప్రతిజగ్రాహ రాఘవః,

ఎవ్వఁడు ఇమ్మహాధనుస్సును ఎత్తి సజ్యంబు గావించునో నా కొమార్తె అతనిభార్య కాఁగలదు. ఇంక సందేహము లేదు. అని జనకమహారాజు చెప్పెను. ౪౨

అంత రాజు లందఱు పర్వతాకారమయిన యాధనుస్సుం జూచిదానిం గదలింపఁజాలక దానికి నమస్కారము గావించి పోయిరి. ౪౩

అంత బహుకాలమునకు కాంతిమంతుఁడును సత్యపరాక్రముఁడు నగు శ్రీరాముఁడును అతనితమ్ముఁడు లక్ష్మణునితో విశ్వామిత్రసహితుఁడై యజ్ఞముం జూడ వచ్చినాఁడు. ౪౪

ధర్మాత్ముఁడగు విశ్వామిత్రుఁడు నాతండ్రిచేఁ బూజితుఁడై నాతండ్రిం జూచి రామలక్ష్మణులు వచ్చినవృత్తాంతముం జెప్పెను. ౪౫

వీర లిర్వురు దశరథునికొడుకులు. నీయొద్దనుండు ధనుస్సుం జూడవచ్చినారు. ౪౬

రాజపుత్రుఁడగు రామునకు దేవత లొసంగిన ధనుస్సుం జూపుము. అని విశ్వామిత్రుఁడు నాతండ్రితోఁ జెప్పెను.

అంత జనకుఁడు విశ్వామిత్రవచనంబు విని యాధనుస్సుం దెచ్చి చూపెను. ౪౭

పరాక్రమవంతుఁడగు నారాముఁడు నిమేషాంతరమాత్రంబుననే సారవంతంబగు నాధనువు వంచి యల్లెత్రాటి నెక్కువెట్టి శీఘ్రంబునం బూరించెను. ౪౮

రాముఁడు పూరించునప్పుడు ఆవేగంబునకు ధనుస్సు నడుమ రెండు గావిఱిగినది. ఆశబ్దము పిడుగుపడునప్పుడు గలుగు శబ్దమువలె భయంకరంబుగా వినఁబడినది. ౪౯

అంత సత్యప్రతిజ్ఞుఁడగు నాతండ్రి నన్ను రామున కొసఁగ నిశ్చయించి జలకలశంబు నెత్తినాఁడు. ౫౦

అప్పుడు నాతండ్రి నన్ను రామునకు ఈయఁబోఁగా అయోధ్య

అవిజ్ఞాయ పితు శ్ఛన్ద మయోధ్యాధిపతేః ప్రభోః. ౫౧

తత శ్శ్వశుర మామన్త్ర్య వృద్ధం దశరథం నృపమ్,
మమ పిత్రా త్వహం దత్తా రామాయ విదితాత్మనే. ౫౨
మమ చైవానుజా సాధ్వీ ఊర్మిళా ప్రియదర్శనా,
భార్యార్థే లక్ష్మణస్యాపి దత్తా పిత్రా మమ స్వయమ్. ౫౩
ఏవం దత్తాఽస్మి రామాయ తదా తస్మి న్స్వయంవరే,
అనురక్తాఽస్మి ధర్మేణ పతిం వీర్యవతాం వరమ్. ౫౪

ఇతి శ్రీమదయోధ్యాకాణ్డేఽష్టాదశోత్తరశతతమస్సర్గః.

## ఏకోనవింశోత్తరశతతమస్సర్గః

అనసూయా తు ధర్మజ్ఞా శ్రుత్వా తాం మహతీం కథామ్,
పర్యష్వజత బాహుభ్యాం శిరస్యాఘ్రాయ మైథిలీమ్. ౧
వ్యక్తాక్షరపదం చిత్రం భాషితం మధురం త్వయా,
యథా స్వయంవరం వృత్తం త త్సర్వం హి శ్రుతం మయా. ౨
రమేఽహం కథయా తే తు దృఢం మధురభాషిణి!,

రవి రస్తఙ్గత శ్శ్రీమా నుపోహ్య రజనీం శివామ్. ౩

దివసం ప్రతికీర్ణానా మాహారార్థం పతత్రిణామ్,
సన్ధ్యాకాలే నిలీనానాం నిద్రార్థం శ్రూయతే ధ్వనిః. ౪
ఏతే చా ప్యభిషేకార్ద్రా మునయః కలశోద్యతాః,

నాథుం డగు జనకచంద్రుడు దశరథుని యభిప్రాయంబు దెలిసికొనక ప్రతిగ్రహింప నని చెప్పెను. ౫౧

అంత నాతండ్రి సామాన్యమయిన వృద్ధుండగు దశరథమహారాజును బ్రార్థించి పరమాత్మవేత్తయగు రామునకు నన్నొసంగెను. ౫౨

మఱియును, నాతండ్రి సాధ్వియుఁ జూపరులకు సంతోషంబు సేయుందదియు నగు నాచెల్లెలు నూర్మిళను లక్ష్మణునకు భార్యగా నొసంగెను. ౫౩

అప్పుడు స్వయంవరంబునందు ఈప్రకారంబున నాతండ్రి నన్ను రామున కొసంగెను. అంత నేను బరాక్రమవంతులలో నుత్తముండగు నాపెనిమిటియందు ధర్మంబుచొప్పున ననురాగంబు గలిగియున్నాను. అని సీతాదేవి యనసూయాదేవికిం జెప్పెను. ౫౪

ఇది నూటపదునెనిమిదవసర్గము.

---

## నూటపందొమ్మిదవసర్గము

ధర్మజ్ఞురాలగు ననసూయాదేవి ఆకథ నంతయుం విని సీతాదేవిని శిరంబున మూర్కొని బాహువులం గవుఁగిలించుకొనెను. ౧

అక్షరములును బదములును స్పష్టములుగా నాశ్చర్యకరంబుగా మధురంబుగాఁ జెప్పితివి. స్వయంవరము నడచినవిధము నంతయుం వింటిని. ౨

మధురముగా మాటలాడునట్టి సీతాదేవీ! నీకథను వినుటవలన నాకు మిక్కిలియుం సంతోషంబు గలిగినది. ౩

శ్రీమంతుండగు సూర్యుఁడు మంగళకరంబగురాత్రిని సమీపింపఁ జేసి యస్తమించెను. ౪

ఆహారార్థము పగలంతయుఁ దిరిగి సంధ్యాకాలంబున నిద్రించుటకొఱకు వృక్షంబులం జేరిన పక్షులు సేయుకలకలధ్వని వినంబడుచున్నది. ౫

ఇదిగో యీమునులును సాయంకాలికస్నానము గావించి జలకలశం

సహితా ఉపవర్తన్తే సలిలాప్లుతవల్కలాః. ౫

ఋషీణా మగ్నిహోత్రేషు హుతేషు విధిపూర్వకమ్,
కపోతాఙ్గారుణో ధూమో దృశ్యతే పవనోద్ధతః. ౬

అల్పపర్ణా హి తరవో ఘనీభూతా స్సమన్తతః.
విప్రకృష్టేఽపి దేశేఽస్మి న్న ప్రకాశన్తి వై దిశః, ౭

రజనీచరసత్త్వాని ప్రచర న్తి సమ న్తతః,
తపోవనమృగా హ్యేతే వేదితీర్థేషు శేరతే. ౮
సమ్ప్రవృత్తా నిశా సీతే! నక్షత్రసమలఙ్కృతా,
జ్యోత్స్నాప్రావరణ శ్చన్ద్రో దృశ్యతేఽభ్యుదితోఽమ్బరే. ౯
గమ్యతా మనుజానామి రామస్యానుచరీ భవ,
కథయన్త్యా హి మధురం త్వయాఽహం పరితోషితా. ౧౦

అలఙ్కురు చ తావ త్త్వం ప్రత్యక్షం మమ మైథిలి!,
ప్రీతిం జనయ మే వత్సే! దివ్యాలఙ్కారశోభితా. ౧౧

సా తదా సమలఙ్కృత్య సీతా సురసుతోపమా,
ప్రణమ్య శిరసా తస్యై రామం త్వభిముఖీ యయౌ. ౧౨
తథా తు భూషితాం సీతాం దదర్శ వదతాం వరః,
రాఘవః ప్రీతిదానేన తపస్విన్యా జహర్ష చ. ౧౩

న్యవేదయ త్తత స్సర్వం సీతా రామాయ మైథిలీ,
ప్రీతిదానం తపస్విన్యా వసనాభరణస్రజమ్. ౧౪

ఖులం బట్టుకొని నీటం దడిసిన వల్కలంబులతో గుంపులుగా వచ్చు చున్నారు. ౫

ఋషులు అగ్నిహోత్రంబుల యథావిధి వ్రేల్చుటం జేసి పావురము మెడవలె నవ్యక్తరాగమయిన ధూమంబు గాలికి గగనంబున కెగసి చూపట్టు చున్నది. ౬

స్వల్పముగాఁ బత్రములుగలవృక్షములుగూడఁ జీఁకటిబలంబునఁ జేసి దట్టముగా నాకులు గలిగినట్లు చూపట్టుచున్నవి. ఎచ్చుగా వృక్షంబులు లేని యీప్రదేశంబునం గూడ దిక్కులు ప్రకాశింపకున్నవి. ౭

రాక్షసులును బిశాచంబులును సంచరించుచున్నారు. తపోవనమునందలి మృగంబులు వేదిస్థానంబునందుఁ బరుండియున్నవి జూడుము. ౮

సీతా! నక్షత్రములతోఁగూడ రాత్రి వచ్చినది. చంద్రికాలంకృతుఁ డగు చంద్రుఁడు ఆకాశంబునఁ గన్నులపండువుగఁ జూపట్టుచున్నాఁడు. ౯

నీ వింకఁ బోయి రామునితోఁగూడ నుండుము. నే ననుజ్ఞ నొసంగి తిను. నీవు మధురంబుగాఁ గథం జెప్పుటం జేసి నాకు మిక్కిలియు సంతోషంబు గలిగినది. ౧౦

సీతాదేవీ! నీవు నాయెదుట నీ యలంకారంబుఁ జేసికొనుము. దివ్యా లంకారంబున నొప్పుచున్నదానవై నాకు సంతోషంబు గలిగింపుము. అని యనసూయాదేవి సీతతోఁ జెప్పెను. ౧౧

దేవకన్యకతోఁ బోల్కిగల సీతాదేవి చక్కఁగానలంకరించుకొనియ నసూయాదేవికి సాష్టాంగముగ నమస్కరించి రాముని యొద్దకుఁ బోయెను.

మాటలు చెప్పువారిలో నుత్తముఁడగు రాముఁడు అలంకృతయయి వచ్చిన సీతాదేవిం జూచి అనసూయాదేవి గావించిన ప్రీతిదానంబునకు మిక్కి లియుం సంతోషించెను. ౧౩

అంత సీతాదేవి యనసూయాదేవి తనకుఁ బ్రీతిచే వస్త్రాభరణాదులు నొసఁగుట మొదలగు వృత్తాంతము నంతయుం రామునకుఁ జెప్పెను. ౧౪

